# భారతి

సాహిత్య మాసపత్రిక

ఏప్రిల్ 1983

గమనించు మిత్రమా

నారాయణరెడ్డి

వినుతి వినోదము

నరసింహాచార్యులు

గుండెకు అండ

దాశరథి

నారాయణబాబు నవకవిత

గంగప్ప

సెర్గిజ్ కార్చెవ్‌స్కీ

బ్రహ్మానంద

చైతన్య స్రవంతి

రంగారావు

ఇంకా కాళిదాసు, రమేష్‌బాబు, శేషగిరిరావు, అంజయ్య, సోమసుందర్, సాంధ్యశ్రీ, మాణిక్యరావు, రాధాకృష్ణశర్మ, శ్రీరామమూర్తి, రామచంద్రరావు, సత్యనారాయణరెడ్డి ఇతరుల రచనలు

వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# భారతి

మాస పత్రిక

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

ఏప్రిల్ 1983

సంపుటము : 60 సంచిక : 4

విడిపత్రిక వెల నాలుగు రూపాయలు

# విషయానుక్రమణిక

## ఏప్రిల్ 1983





# ఉల్కాపాతాలు

## శ్రీ వజ్ఝల కాళిదాసు

౧

ఆకాశంనుంచి పడుతున్న పిడుగులన్నీ
దారిద్ర్యాన్నీ, ధన మదాన్నీ,
స్వార్థాలనీ, అనర్థాలనీ,
అసత్యాలనీ, అఘాయిత్యాలనీ,
భస్మం చేస్తే బాగుండును!

౨

కాకులను కుంటాయి
దేముడికి నాలుగు ముక్కులూ,
ఎనిమిది రెక్కలూ,
ఉరుములాంటి కంఠమూ,
ప్రగాఢాంధ కార వర్ణమూ,
ఉంటాయని!

3

నిజం చెప్పడం చాలా సులభం,
సహజంగా ఎవరేనా చెప్పవచ్చు;
అబద్ధం ఆడాలంటే
అపారం బుద్ధిబలం చాకచక్యం!

౪

అవసరాలు అనర్థాలు
ప్రతి జీవికీ కలుగుతాయి;
అవి లేనిది నిర్జీవ జడపదార్థం!

౫

అవకాశాలు దొరకలేదని
అవివేకు లనుకుంటారు:
అవకాశాలూ, అడుగులూ
కొనితెచ్చుకో గలవాళ్లే
ఘనులౌతారు!

౬

గొప్పలు చెప్పుకోనీ వాడికి 'నిన్న'
ఏమీ చేతకానివాడికి 'రేపు'
కార్యాచరణ దీక్షా దక్షత
కలవాడికి 'నేడు' కావాలి.

౭

అపజయం కలుగుతుందేమో
అని బెదురుకొనే వాడికి
జయం ఎన్నడూ కలగదు.

౮

అనుభవ జ్ఞానం
బాధా సహన జన్యం!
ఆనందం కేవలం క్షణికం
అనంతర ఫలం శూన్యం!

౯

అసమానత్వం 'అహం' వల్ల కలుగుతుంది
అనర్థాలకి అదే దారి తీస్తుంది.

౧౦

వెర్రి కేకలు వేస్తే విప్లవం రాదు
ప్రజల కసిపుంగా హృదయాలు
భగ్గుమనాలి!

౧౧

ప్రజాభిప్రాయం ప్రకృతి వంటిది,
ప్రభాత మంద మారుతం కురాలూ
ప్రగాఢ నీరంధ్రాంధ కారాలూ
ప్రశాంత శరత్ చంద్ర శాలలూ
ప్రళయ భయంకరాశని పాతాలూ
ప్రమోదకర వసంత సౌరభాలూ
ప్రబల జన విదారిత వస్తురీతీ
ప్రసాదిస్తుంది కనక!



# పదార్చన

## డాక్టర్ పోచిరాజు శేషగిరిరావు

౧

"నెట్టుకొని కొలుతు నన్నయ
భట్టోపాధ్యాయి సార్వభౌముని - కవితా
పట్టాభిషిక్తు - భారత
ఘట్టోల్లంఘన పటిష్ఠ గాఢ ప్రతిభున్"

౨

అనుచు నుతియించు శ్రీనాథు నమల వాణి
ఆత్మలోపల మ్రుగ్గి - మోదాబ్ధి తేలి
పొలుపు మొలయగ - భావ విస్ఫూర్తి మెరయ -
శబ్దశాసను నన్నపాచార్యుఁ గొలుతు.

౩

గౌతమీ వారి రుచులను గారవించి
భట్టు నారాయణుని స్నేహపాత్రు నెంచి
వ్యాసవాణికి భక్తిమై నంజలించి
భారతాఖ్య వాగమున నుపక్రమించె.

౪

'మద మాతంగ తురంగ కాంచన లసన్మాణిక్యగారిక్య సం
పదలం' దేలు చళుక్యవల్లభుఁడు ప్రాపైనిల్వ, వాగ్వైదుషీ
పదవిభ్రాజితుఁడైన నన్నయ కవిప్రాలేయశైలమ్ము - నె
మ్మది వేయేండ్లకు మున్ను భారతము నిర్మాణించె
నుద్దోలుఁడై.

౫

రాజితసత్కవీంద్రబుధరాజి మహాధరణీలలామ సం
పూజితమైన ఆంధ్రమును పూవులపల్లకిలోన నిల్పె వి
భ్రాజిత శోభతోడను, ధరామరవంశ విభూషణుండు - రా
రాజుల కంటెచల్వ - కవిరాజు - మహామతి - నన్నయార్యుడే!

౬

అక్షర రమ్యతం బొదివి ఆంధ్రమునందున కొప్పు వోసె, ప్ర
త్యక్షము సౌనటుల్ - సుకవితా మధుధారలు చిందునట్లు - నీ
యక్షయ కావ్యభిక్ష కెదురన్నది యున్నదె నన్నయార్య! నీ
శిక్షిత కావ్య తత్త్వ మృదు శింజిని మోత్రలె
గౌతమీ గ్భురుల్

౭

భావుకుడైన పంపకవి భారతమందలి వంపసొంపులున్
ద్రావిడ కావ్యసారణుల రమ్యరసజ్ఞ రి నాదమోదముల్
దీవిలసన్మయూఖముల తేజము చిప్పిలు దేవభాషలో
తావులు చిమ్ము కావ్యసుమదామము నిండెనో నీ
సుసీ లో!

౮

సారమతిన్ గవీంద్రులు ప్రసన్న
కథా కవితార్థయుక్తి లో
నారసినారు - ప్రాజ్ఞులు ప్రహర్ష
ముతో తలయూపినారు - క
ర్పూర పరాగ పొందు రుచిపూరము
లం దనివొందినారు - నీ
భారత భారతీ శుభగభ స్తి
చయమ్ములు నిల్పుకొంటకై

—✲—

డా॥ ఎస్. గంగప్ప

# నారాయణబాబు నవకవిత

ఒకానొక సందర్భంలో ఒక సాహితీ వేత్త తెలుగు కవులను ఉద్దేశించి "కొందరు మహాప్రతిభావంతులైనా అడుగున పడిపోతారు. కాని మరికొందరిని అదృష్టం వరించి, అనుకోనంతగా అత్యంత ప్రచారంలోకి వస్తారు" అన్నారు. నిజమే! కొందరి విషయంలో ఇది చాలా వాస్తవమనిపిస్తుంది. మొట్టమొదటి ఉదాహరణగా ఇందుకు ధర్మవరం రామకృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావు అనే ఇద్దరు స్వతంత్ర నాటక కర్తల్ని గ్రహించవచ్చు. ధర్మవరంవారి కొచ్చినంత ప్రచారప్రాముఖ్యాలు, కోలాచలం వారికి రాలేకపోయాయి. కారణం ధర్మవరం వారిని అదృష్టం వరించడమే అని నిక్కచ్చిగా చెబుతారు. ఈనాటికీ జీవించి ఉన్నవారు, బళ్లారి రాఘవ శిష్యులలో ఉత్తములూ అయిన పూజ్యులు కోదరాసి దొడ్డనగౌడగారి నడిగితే, నిజానికి బళ్ళారి రాఘవ ప్రముఖనటుడుగా పైకి వచ్చింది కోలాచలంవారి నాటకాలవల్లనే. అందులోను ప్రసిద్ధ నాటకమైన 'ది ఫాల్ ఆఫ్ విజయనగర్' అనిపిలువబడే రామరాజు చరిత్ర లేక విజయనగర పతనమనే నాటకంలో పఠాన్ రుస్తుమ్ పాత్రను పోషించి షేక్స్పియర్ విషాదాంత నాటకాల్లోని విషాద నాయక పాత్రల్లోని పలురకాల భావాల్ని మెళకువతో చూపించి మహానటుడుగా నిరూపించుకొన్నారు రాఘవ. కోలాచలంవారు కేవలనాటకాలే గాక అనేకమైన ఇతర రచనలుచేశారు. అందులో చాలా ముఖ్యమైన గ్రంథం వారుఆంగ్లంలో రచించిన "దిడ్రమెటిక్ హిస్టరీ ఆఫ్ ది వరల్డ్" అన్నది. దీని ప్రతులీనాడు లభించవు. సాహిత్య అకాడమిలాంటి సంస్థలు పునర్ముద్రించవలసిన అగత్యం ఎంతైనా వుంది. ప్రప్రథమంగా 1905 లో బళ్ళారిలో వాణీవిలాస నాటకశాలను నిర్మింపజేయడమే గాక ప్రపంచనాటక చరిత్ర రచించిన ఘనత వీరిది. వేదాలు, భగవద్గీతలపై ఉపన్యాసాలెన్నో ఉన్నాయి. అయినా వీరికి రావలసినంత ప్రచారప్రాముఖ్యాలు రాలేదంటే ఆశ్చర్యం లేదు.

అలాంటి అదృష్టం వరించని వారికోవకు చెందినవారు శ్రీరంగం నారాయణబాబు. తనకాలాన్ని అధిగమించి, భవిష్యత్తులో రాబోయే తెలుగుసాహిత్యంలోని నవ్యధోరణుల ఎన్నింటికో నాందీ పల్కిన అభ్యుదయ కవిశేఖరుడు నారాయణబాబు. సమకాలికంగా శ్రీ ఆవంత్స సోమసుందర్ లాంటి కవి విమర్శకులు ఎందరెన్ని దృక్కోణాలనుంచి రుధిరజ్యోతిర్దర్శనం గావించినా, ఇంకా రావలసింది, దర్శించవలసింది నారాయణబాబు కవితలో ఎంతో మిగిలి వుంది. ఆయనకు రావలసినంత కీర్తిగాని, ప్రఖ్యాతిగాని, లేదంటే సాహితీవేత్తలెన్నో రకాలైన కారణాలు చెబుతారు. వాటితో మనకు పనిలేదు. పై పెచ్చు పాఠకుడనే తుమ్మెద ఆస్వాదించవలసింది కవి కవితా మకరందాన్నే గదా? తద్వారా ఆ కవితలోని మనోజ్ఞత, రసార్ద్రత, భావిజీవితానికి, మనిషి మనుగడకి వలసినవి ఎంతగా చెప్పాడో, అవి ఎంత ఎంతగా ఉపకరించగలవో చూడడమే సహృదయ హృదయ లక్ష్యం! ఆ మేరకు రుధిరజ్యోతిలోని నవ్యకవితా ధోరణుల్ని పర్యాలోకించి పరవశించడమే ఈ వ్యాసోద్దేశం.

ఏ కవి అయినా - పూర్వుడుగాని, నవీనుడుగాని - అపూర్వంగా చెప్పిందే అత్యుత్తమ కవిత అనే విషయం అందరూ అంగీకరించిందే. అందుకే కవికి ప్రతిభనవనవోన్మేషమై వుండాలనడంలోని రహస్యం ఇదే. భావుకత అనే లక్షణం కవికిలేనినాడు ఆ కవి త్రికాలావధికమైన, సార్వజనీనమైన కవిత చెప్పలేదనడం అతిశయోక్తికాదు; అత్యుక్తి అంతకంటేకాదు; అది స్వభావోక్తి-అంటేనే అతుకుతుంది. వాస్తవానికి అప్పుడు ఒకడు కవికాగలడని గూడా మనకు స్పష్టమవుతుంది. నారాయణబాబులో వస్తువైవిధ్యంతోపాటు ఈ భావుకత నిస్తులంగా ఉంది. అందుకు ఆయన కవిత అంతా ఉదాహరణే అవుతుంది. మచ్చుకు 'నగ్నగీతాలు' అనే ఖండిక తీసుకొందాం. పురాణప్రసిద్ధ విషయాల్నే తీసుకొని, లోకంలోని సామాన్యసంగతుల్ని, సంఘటల్ని గ్రహిస్తూనే ఎంతో వైభవోపేతమూ, వాడిగా వేడిగా, సూటిగా హృదయంలో బాణంలా దూసుకుపోయేలా, కసుక్కున గుచ్చుకొని బయటకు వచ్చే ఈ టెల్లా చెప్పడం నారాయణబాబు కవితలోని నైపుణ్యం; అది అంటే తెలుగుజాతి చేసుకొన్న పుణ్యం.

"సరికొత్త
శరీరంలో
నెత్తురుపాడిన
పాటకు
నగ్న శోభ

నందనవనమై
పూచింది"

ఇందులో' నెత్తురుపాడిన పాట'; 'నగ్నశోభ' అన్నవి నవ్యాతినవ్యమైన ప్రయోగాలు. ఆ "సరికొత్త శరీరంతో నెత్తురు పాడిన పాటకు నగ్నశోభనందనవనమై పూచిందట" ఎంతమనోజ్ఞమైన భావన! ఎంతటి మనోహరమైన భావుకత! నందనవనం పూయటంమామూలే! పురాణప్రసిద్ధమే. లేదంటే కవి కాళిదాసు కుమార సంభవంలో అకాలవసంతర్తు ప్రాదుర్భావంతో పూయటమూ మనమెరుగుదుము. ఈ సరికొత్త శరీరంలో నెత్తురు పాడిన పాటకు నగ్నశోభనందనవనమై పూయడం మాత్రం కొత్తలో కొత్త. నవ్యంలో నవ్యమేకాదు భవ్యమూను. అలాంటి నందన వనమై పూచిన నగ్నశోభను

"అవలోకిస్తే
అవినీతని
బుద్ధుచెప్పే
బుద్ధికికాదు"

"కన్నులనిండే
అందంకోసం
కళవళపడు
డెందాలకె"

అని నిత్యమైన సత్యాన్ని చెప్పి చివరికంటాడు కవి-

"చూపులతో
అందుకోండి!" అని.

ఈ చూపులు భౌతికమైనవి కావు. అంతశ్చక్షువులు; మన శ్చక్షువులు! తద్వారా గ్రహించి 'నందన వనంలా పూచిన నగ్న శోభను' పరమానంద పరవశుల్ని కమ్మంటున్నారు నారాయణబాబు పాఠకుల్ని.

"అదేమిటి
పండ్లరుచి తెలిసికూడా
పచ్చికాయలు రాల్చుకుంటూ
పారిపోయే.
ఉడుతసరదా!"

అన్న సత్యాన్ని తెలుపుతూనే ఆశ్చర్యాన్ని వ్యక్తం చేయ డంలో ఉంది ధ్వని!ఆ వెనువెంటనే భారతప్రసిద్ధ విషయాన్ని గ్రహించి, ఆనాటినుంచి ఈనాటివరకు ఎడతెగకుండాలేదా మరింత పెచ్చుపెరిగిపోయి జరుగుతూన్న విషయాన్ని ఏనాడో వివరించా అభ్యుదయ భావిః వి—

"వారెవరు ?
ఏదో
కీచక భావం
నా సైరంధ్రీ గీతాన్నే
చెరబడితే
చూస్తూ ఊరుకొనే
నా రక్తం
ధర్మరాజు" అంటారు మెల్లగా చల్లగా. ఇందులో ఎంతో ధ్వని ఉంది. సైరంధ్రి వేషంలోని ద్రౌపదిని కామాంధుడై కళ్లుగానక కీచకుడుచెరబట్టితే కంకుభట్టయిన ధర్మరాజు ఏమాత్రమూ చలించకుండా నిబ్బరంగా ఉండగలిగాడు. కానీ వలలుడైన భీముడో చీమూ నెత్తురున్న మనిషిలా ఊగిపోయి పుష్పఫల భరితమైన వృక్షాన్ని పెకిలించబోయాడు. ఇది భారత కథ. ఆ కథనే ప్రతీకగా గ్రహించి నారాయణబాబు అలతి అలతి పదాలతో అతిశయితమైన అర్థంతో భావగర్భితంగా ఎంతోగొప్పగా చెప్పారు. కొండంత భావాన్ని చిన్న అద్దంలో బింబించారు. ఇది కవిత. ఇది భావుకత. 'వాక్యం రసాత్మకం కావ్య' మ్మన్న విశ్వనాదుని నిర్వచనం అంత కంటే "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్య' మ్మన్న జగన్నాథ పండిత రాయల నిర్వచనం ఇక్కడ ప్రత్యక్షర సత్యం. సహృదయైక వేద్యం.

తన నగ్నగీతాన్నిగూర్చి చేసిన నారాయణబాబు భావన అనన్య సామాన్యమేకాదు. అనితరసాధ్యమన్నా అసత్యంకాదు.

"జగమంతా
కన్నయితే
చీకటి కజ్జలమైతే
నాగీతం
చూపు! "- ఇంతటితో ఆగక మరణానంతరం జీవి వైతరణిని దాటాలంటే గోదానం చేయాలన్న మన హైందవమత సంప్రదాయాన్ని ఎంతో చక్కగా ఆ గోదానమే తన గీతమని నవ్యాతి నవ్యంగా విప్లవఋషిగా వ్యక్తీకరించారు-

"నీవునేను
ఈ ప్రపంచ వైతరణి
దాటేందుకు
నీ కోసం
నే చేసిన

గోదానం

నా గీతం!" అంటారు.

వైతరణి అంటే ఎక్కడో. ఈ ప్రపంచమే వైతరణి; దాన్ని దాటడానికి చేసేదే తన గీత మనే గోదానమంటారు నారాయణబాబు! ఇలా ఎవరూ చెప్పలేదు! ఇలా చెప్పడం ఎవరికీ చేతకాదు! అదే నారాయణబాబులోని ప్రత్యేకత! అదే అతనిలోని భావుకత!

సంప్రదాయ కవితపై తిరుగుబాటు చేసినవాళ్ళు, కొత్త పుంతలు తొక్కినవాళ్ళు భావ కవులు. అలాగే భావకవులతో కలిసి కవితలల్లిన కొందరు భావకవితపై ఎదురు తిరిగి అభ్యుదయ పథగాములయ్యారు. అలాంటి అభ్యుదయ భావోప సంపన్నుల్లో శ్రీ నారాయణబాబును మనం ఉట్టంకించడం అవసరం. శ్రీశ్రీ ఒకప్పటి భావ కవిత—భావకవితే మిటి— ప్రబంధ కవిత అల్లారు ఆరంభంలో; కాని ఆ వెనుక అభ్యుదయ కవులకే అధినేత అయ్యారు.

"భావకవి న్యాత్రమికా న్నే
నహంభావకవి" నని పతాభిషేదేలురాగాల దజన్'లో

తన కసి నంతటిని తీర్చుకొన్నాడు. పోతే నారాయణబాబు 'ప్రేయసితో నరకానికి' అనే ఖండికలో భావకవితోద్యమం నిరసన వ్యక్తీకరించారు

"రా!
నాతో నరకానికి
స్వాహా వల్లభు
పూజించే
సోమయాజుల మాటలు
బ్రతుకే పరచి
బంభరముల్లా తిరుగు
భావకవుల పాటలు
విని మోసపోయిన
వనిత!
వనత!
నత!
స్వర్గం అంటూఉంటే
ఎపుడైనా చూడొచ్చు
నరకం ఇక ఎన్నాళ్ళో ఉండదట!"

అని కొందరనుకొన్నట్లు "భావ కవిత"గా ఈసడించుకొంటూనే చివరిగా ఇలా అంటారు వారు —

"చిత్రగుప్తుని
చిట్టాలన్నీ చింపి
పత్రాలు పకోడీల సుబ్బయ్యకు
పొట్లాలకు యిస్తా
యముని మహిషానికి
ఏరుపూసి
బంజరుభూములు దున్నించి
పంటలు పండిస్తా
లే, పద! వేళై పోతున్నాది
వనితా వనతానతాననా!"

అని చెప్పి అల్పాక్షరాలతో అనంతార్థ స్వర్గ నరకాలకున్న తేడాని కాంట్రాస్టుగా ఎంత గొప్పగా చెప్పారో చూస్తే నారాయణబాబు నవత, సింప్లిసిటీ, ఎకనామీ ఆఫ్ వర్డ్స్ మొదలైన కవికుండవలసి లక్షణాలు స్పష్టంకాక మానవు.

"అనర్థం
స్వార్థం
నాకం!

పరార్థం
యథార్థం
నరకం!"

బహుశా తెలుగులో మరేకవి స్వర్గనరకాల్లో నరకానికుండే విశిష్టతని వివరించిన కవి లేడేమో! వాస్తవానికి భావకవులంతా అదర్శవాదులు. అప్రాప్త సుందరికై, ఊహాప్రేయసికై ఆరాటపడి ఆనందానికి బదులు శోకాన్ని, నిర్వేదాన్ని సృష్టించిన వారన్న విషయాన్ని ఈ కవి మనకు స్పష్టం చేస్తున్నారు. అందుకే నరకమే నయమంటూ రమ్మని తన ప్రేయసిని పిలుస్తున్నారు.

నారాయణబాబు తన కవితలో ఉపయోగించిన ఉపమా సామాగ్రి నవ్యమేకాదు; భవ్యమూను; అందరికీ సాధ్యమయ్యేదీ కాదు; అనన్యసాధ్యమూను. కొన్ని ఉదాహరణలు:

"ఇంద్రియుని
బుద్ధి—
జేగంటలాగు
కిటికీలో
దీపం!" అనడం. అంతకంటే

"గోదివతల
గదిలోపల
పేరుకొన్నకాంతి
గోడవతల
చీకటి!"-

అనడం అందులోను 'గదిలోపల పేరుకొన్న కాంతి' అనడంలోను మరింతకంటే గూడా

"హృదయంలో
ఒకటిరెండు
వెలుతురు గాయాలు" అనడంలో నారాయణబాబు నవ్యాతినవ్యమైన ఉపమాప్రయోగ నైపుణి ప్రకటితమవుతుంది. "వెలుతురు గాయాలు" అని ప్రయోగించిన కవు లెందరున్నారు?

"గోడవతల
చీకటినవ్వింది!"

ప్రయోగం అనంతార్థప్రయోగ స్ఫూర్తిమంతం.

ఇంకా గమనించండి కమనీయమైన ఈ ఉపమాప్రయోగాల్ని-

"రుధిరజ్యోతిర్
జ్వాలనాలలనా
ప్రియుండ!
విప్లవఋషిని
విద్రోహకవిని
ఆహవరంగం నా
హృదంతరంగం
రగిలిన ఖలేజాలె
నా
పాటల రేజాలు"

అనడంలో ఉంది ఆయన నవ్యత.

"మరఫిరంగినై
మహతిగ మీటి
కదనకుతూహలరాగం
వినిపిస్తాను
అగ్గిని కురిపిస్తాను."

అనడంలో నారాయణబాబు నవ్యత అంటే తిరుగుబాటు ధోరణితో ఎంత విస్పష్టం చేశారో తెలుస్తుంది మనకు. "గాలి పెదవులు, పావుపూవులు, వెన్నెలకత్తి" అని చెప్పడమేకాదు; చివరికి -

"మహాశక్తినై
మారణమంత్రం
పారణచేస్తూ
చివురించిన ఈ
జనాళియుద్ధం
జైత్రరథమ్మగ
కజ్జలకాళి
గజ్జలగుర్రం
కాలభుజంగం
కళ్ళెంలాగి
'ఛలో! ఛలో!' యని
సాగిపోయెదను"—

అని తమ నవ్యకవితా దృక్పథాన్ని, విప్లవ విరాట్స్వరూపాన్ని వివిధ రీతుల వివరించారు.

ఇంకా ఈ ఉపమాప్రయోగాలెన్నో రకాలు—

"ఆనందపు ప్రమిదలలో
వెలిగేదీపాలు
హృదయంలో భావాలు"

"కాలిన ప్రేయసి
దేహం
చమురుకంపు
ఈ లోకం"

"మరుక్కొన విధి
త్రాడై వేలాడగ
పటిపట్టీలాగుతుంది"

"గాలికి ఊగే
తెరచాపై కదిలింది
రెక్కలు విప్పింది
ఎవరో బంధించిన
ఎముకల పంజరమ్ములో
ఆత్మ
ఎగరాలని"

"హేమంత శర్వరీ కురులు
ఇరులు"— ఇలా చెబుతూపోతే మొత్తం పుస్తకమంతా ఉదాహరించవలసి వస్తుంది. సహృదయులు చదివి- ఆనందిస్తారని ఆశిస్తాను.

ఇకపోతే నారాయణబాబు కవితలోని నవతను చవిచూడా లంటే ఆయనలో ప్రస్ఫుటంగా కొట్టవచ్చినట్లు కనిపించే అధివాస్తవికత, నగరవర్ణన, ప్రతీక కవిత, శబ్దచిత్ర భావచిత్ర కవితాధోరణుల్ని పరిశీలిస్తే ఆయన ప్రతిభావ్యుత్పన్నతలు మరింతగా మన మనస్సులకు ఆనందం అందించి నవకవితల్లజునిగా స్వరూప స్వభావాలతో కన్పట్టకపోరు. అద్దంలో కొండను చూచినట్లు స్థూలంగా ఒకటి రెండు ఉదాహరణలతో వీటిని పరిశీలిద్దాం.

నగరవర్ణన చేసిన మొదటి అభ్యుదయ కవి నారాయణబాబు. ఒకనాటి విశాఖపట్నాన్ని గూర్చి ఆయన చెప్పిన ఈ కవితలో ఎంత వాస్తవికత-కాదు- అదివాస్తవికత? విశాఖపట్నం సుమారు మూడుపదులవెనుక చూసినవారికిది ఎంతో సహజమూ, వాస్తవమూ అనిపిస్తుంది. సందేహమేలేదు.

"విశాఖపట్నం
విశాఖపట్నం
జోడులేక
పోకూడదు
నీగ్రో స్త్రీ బుగ్గల్లాగ
నిగనిగలాడే తారురోడు."

ఇందులో 'తారురోడ్లని నీగ్రో స్త్రీ బుగ్గల్లా' పోల్చడం నారాయణబాబు కొక్కరికే చేతవుతుందనిపిస్తుంది. ఈ నగర వర్ణన 11 పుటలు సాగింది. ఉల్లేఖిస్తూపోతే మొత్తం అంతా చేయవలసి వస్తుంది. అలాకాక కొన్నింటిని చవిచూద్దాం. నా వ్యాఖ్యానం అనవసరమనే భావిస్తూ మానేస్తున్నా-

"ఇక్కడ-
స్వర్గం నరకం
సురక్షించి
కంపు కొడతాయి.

ఇక్కడ
చావుబ్రదుకు
అత్తా కోడళ్లలా
అభిమానించుకుంటూ
కాట్లాడుతాయ్.

పడిపోయిన కొంపల్లో
పాతివ్రత్యం
మురికి గుడ్డల్లో కంపుకొట్టి
వలవిసే
రంకుసెంటు వాసనతో
రైలయని
కారులో షి
కారు చేస్తుంది."
"సిరాబుడ్డిలో ఆత్మహత్య
విమానంలో భ్రూణహత్య
పెట్టెబండిలో గర్భస్రావం
సూటులో సుడిగుండం"
"మనీపర్సులో దొంగలు"
"చల్లగా మెల్లగా హాయిగా
ఆకుదాని కౌగిలిలా రాత్రిలు
లెంపకాయ కొట్టినట్టు పగళ్లు"
"దోసెడంత సందుల్లో
గోదావరంత కుళ్లు కాలవలు"
"సాయంత్రం
చందమామ
సినిమా చూశాకే
వెన్నెల కాస్తాడు"
"మేడలపై
మెడికల్ కుర్రాళ్లు
ఎముకలతో
వలపు జాబు
లిఖిస్తారు"
"తల్లులు
పాలీయని
పిల్లలె
తాండవ కృష్ణులు"
"త్రాగేందుకు నీరులేక పోయినా
డయాబిటీస్‌కు లోటులేదు.
పిలవకుండా
పలికే ముండలకు
పిలిస్తే పలికే జబ్బులు"
"సకలరోగ నివారిణి
సాని
దొరసాని
నరసమ్మ"
"పురిటిగది ఆసుపత్రి"
"భోగందానింటికెళ్లి
బాగుపడినవాడుండొచ్చు.
లాయర్ల యింటికెళ్లి
లాభం పొందినవాడు సున్న
గుమాస్తాగాళ్లంతా
గుల్లదాళ్లు.

బీదవాళ్ల నెత్తురు
బీరులాగ తాగేస్తారు"
"దొరసానిలాంటి
విశాఖపట్నానికి
వాల్తేరు వక్షోజం
ధనవంతుల ధనుష్కోటి"
"ఆంధ్రుల విశ్వవిద్యాలయం
ఓఢ్రుల సహాయం
అరవ పండితులు
మార్కులొస్తే
మహా మహోపాధ్యాయ
రాకపోతే
రాలుగాయ"
"ఆఫీసులు ఆశ్రమాలు
ఆఫీసర్లే ఋషులు
లంచం కోసం తపస్సు
అప్సర కన్నెలు
రూపాయలు"
"ప్రజల పాపం హార్బరు చేసేందుకే
హార్బరు
థర్మామీటర్లలాంటి
కొయ్యలతో
ఎనిమా డొక్కుల్లాంటి
స్టీమర్లు
నగ్నంగాస్త్రీ
స్నానం చేసేటప్పుడు
ఎదురుగుండా పరాయిమొగాడు
ఏరాడకొండ
ఆలీబాబా
అర్ధం —"

ఇది విశాఖ విస్పష్టమైన వర్ణన. ఇంతగా వర్ణించిన కవిచూపు ఎంత సూక్ష్మాతి సూక్ష్మమైందో, పరిశీలన ఎంత పరిణిష్ఠమైందో వేరుగా చెప్పనవసరంలేదు. దీన్ని వివరించబోవడం విడ్డూరం. అందుకే వదిలేస్తున్నా. ఇలాగే పఠాభిసైతం మద్రాసునగరవర్ణన చాలా చక్కగా చేశారు. తమ "ఫిడేలురాగాలడజన్" లో.

పదచిత్రాలు, భావచిత్రాలు నారాయణబాబు కవితలో కోకొల్లలు. 'విశాఖపట్నం' ఖండికలో పూర్వం ఉల్లేఖించినవన్నీ ఇందుకు ఉదాహరణలే. కొన్ని మచ్చుకు 'సామిదేవి' ఖండికలో—

"కాలంనాగు
విసుపీడులలో
వెన్నెలపడగ,
విప్పింది,
శారదరాత్రి
శంకరు ఫాలం
బూది పవిత్రత
బూరావూదింది"

ఇలాగే 'కావాలి' అనే ఖండికలో —

"ఆరిన చితిలో
బూడిదవెన్నెల
జారినచుక్కపుడక
ఒకచుక్క,
సమాధిలో
ప్రేతశిశువట్టుల
జలబాంతరశశి"

ఇందులో కవికిగల ఆర్తి అర్థమవుతుంది. ఇంకా ఇంతకంటే 'భావం' అనే ఖండికలో 'ఇమేజరీ' పరాంకోటినందింది —

"వేడిగ గీతం
నివురుగప్పిన నిప్పు
హృదయం
కుదిపిన కుంపటి
జీవితం
హేమంత నిశ
మంచు దెబ్బ
సహించుకోలేక
పుడమి
అంచులు వెలసిన
నిశానీల దుప్పటి
కప్పుకొని
మూడంకె వేసి
నిద్రిస్తే
పుండుమీద చేయిలా
బాధాకరంగా గాలి!"

ఇంకా ఇలాగే "తెలుగురాత్రి", "చల్లనిగాలి", "వెన్నెల లోతుల్లో" అనే ఖండికలో ఎంతో స్ఫూర్తిమంతమైన 'ఇమేజరీ' మనం చూడవచ్చు.

నారాయణబాబు నవ్యాతి నవ్యంగా చెప్పిన అధివాస్తవికతకు "ఛిన్నా", "గేదెపెయ్య", "నేనెవరో" ఖండికలు చక్కటి ఉదాహరణలు. ఈ నవ్యధోరణిలో ఆయనకాయనేసాటి. ఎవరూ లేరు పోటీ ఈనాటికీ. ఇలాగే వీరి ప్రతీకాత్మకతకు 'గడ్డిపరక', 'కిటికిలో దీపం' నిక్కమైన నిదర్శనాలు.

ఓ పక్క సంప్రదాయ ప్రతీకల్ని వాడుతూనే సంప్రదాయ విరుద్ధంగా నినదించడం నారాయణబాబు కవితలోని మరోనవ్యత.

కొన్ని ఉదాహరణలు —

"నల్లని త్రాచుకోరలు
తెల్లని మశూచికుండలు
గగనమ్మున
తారలు!"

"ఒళ్లు తెలియని
పుళ్ల బాధతో
వెక్కి-వెక్కి
ఏడ్చినది
చుక్కల ఆకాశం!"

"ఆహవరంగం నా
హృదంతరంగం"

"పగిలిన ఖలేజాలే
నా పాటలజలేజాలు"

"మరఫిరంగినె
మహతిగ మీటి
కదన కుతూహలరాగం
వినిపిస్తాను
అగ్గిని కురిపిస్తాను."

ఇలాగే 'జ్వలనా', 'అగ్ని వీణ', 'దులుపు బూజు', 'ప్రేయసితో నరకానికి' మొదలైన ఖండికల్లో ఎన్నోచిత్రాలు చూడవచ్చు. ఇంకా "ఎడారి పుష్పించింది", "విహాయస। విపినమటుల, విహరించె ఐరావతపు పంది। అర్ధచంద్రుడు। అందపు నా। చందమామ। మనలో మనమాట। మతచితివా। మతచితివా" "తీతుక। తుమ్మచెట్టుమీంచి। 'తీ'యని 'తీ'యని। ప్రేమగీతి। వినిపిస్తే" — ఇలా ఎన్నైనా చూపించవచ్చు. తద్వారా నారాయణబాబు 'కదన కుతూహల రాగం'లో —

"రుధిరజ్యోతిర్
జ్వలనాలలనా
ప్రియుండ!
విప్లవఋషిని
విద్రోహకవిని" —

అని చెప్పుకొన్న మాటలు అక్షరసత్యం.

చివరిగా ఒకవిషయం ముచ్చటించుకోవడం అత్యవసరం. నారాయణబాబు ప్రభావం దిగంబర కవులపై ఎక్కువగానే కనిపిస్తుంది. అంటే దిగంబర కవులు నారాయణబాబు కవితవల్ల బాగా ఇన్‌స్పైర్ అయి రాసారవడానికివెన్నైనా ఉదాహరించవచ్చు. అభ్యుదయ కవి నారాయణబాబు ఏనాడో రాసిన 'దేశమాత' కవిత చదివి చెరబండరాజు 'వందేమాతరం' దిక్ చవిచూస్తే ఈ భావం ప్రస్ఫుటమవుతుంది.

"ఉసురుసురైంది
ఉమ్మలించింది
అసువులు వీడి
చచ్చినదేశమాతయై
చాపచుట్టగ
నేలకువాలింది"

(దేశమాత - నారాయణబాబు)

"ఓ నా ప్రియమైన మాతృదేశమా
.... .... .... .... ... ... ....
అంతర్జాతీయ విపణిలో అంగాంగం
తాకట్టుపెట్టిన అందం నీది.
.... .... .... .... .... .... ....
ఒంటిమీద గుడ్డలతో జండాలు కుట్టించి
వివస్త్రవై ఊరేగుతున్న ధైర్యం నీది
.... .... .... . . ... .... ....
ఆకలికి ఎండి మాడి ఎరువుసొమ్ములతో
పీఢిసబడ్డ సింగారం నీది
అమ్మా భారతీ నీగమ్యం ఏమిటితల్లీ!"

(వందేమాతరం - చెరబండరాజు)

ఇలాగే నారాయణబాబు "కదనకుతూహలరాగం", మహాస్వప్న 'గ్లానిర్భవతి భారత' భైరవయ్య 'చెరచబడ్డ గీతాన్ని 'ఉదాహరణలుగా చెప్పవచ్చు. ఇంకా ఎన్నైనా చూపించవీలుంది.

ఇలాగా తెలుగుసాహిత్యాభ్యుదయాకాశంలో అనంతకాలమూ అత్యున్నతంగా ప్రజ్వలించే "జ్వలనాలలనా ప్రియుండు" మాత్రమే కాదు! ధృవతార నారాయణబాబు!

శివసాగరమగ్నుల జన్మబాధా ప్రశమనమునకై పరమేశ్వరుడే "ఓం నమశ్శివాయ" అను నీ మొదటి మంత్రమును వచియించెనని వాయవీయ సంహితయందు కలదు.

సప్తకోటి మహామంత్రములు చిత్తవిభ్రమము గలుగజేయును. అందఱికి నొక్క పంచాక్షరీ మంత్రము మాత్రము మనోచాంచల్యము గలుగజేయక మోక్షము నొసంగును.[26]

పంచాక్షరీ మంత్రము పంచభూతాత్మికము. నకారాదిబీజములు పంచభూత స్వరూపములు. ఎటులన నకారము భూమి యనియు, మకారము ఉదకమనియు, శికారము అగ్నియనియు, వాకారము వాయువనియు, యకార మాకాశమనియు, మంత్ర మంతయు శివస్వరూపమని చెప్పబడినది.[27]

పంచాక్షరీ శివపదేన విభూతిరుద్రా।
ధ్యాయ స్త్రయాస్ఫురతితేన చతుర్థకాండః
కాండేన సర్వయజురేవ విభాతితేన
ఋక్సాపు మధ్య మణినాచ విభాంతివేదాః వైదిగ్ప[28]

వైదికమగు నీ పంచాక్షరీ మంత్రముచేతనే వేదమున కంతయు బంగారమునకు పరిమళ మబ్బినటుల గుణాధిక్యము గలిగినదని పై శ్లోకమున జెప్పబడినది.

అన్ని విద్యలలో వేదముత్కృష్టమైనది. దానిలో నమకమును అందు బంచాక్షరియు దానియందు 'శివ' అనుమంత్రమును నుత్తమోత్తమములు.[29] పంచాక్షరీ మంత్రమునకు ముందు 'ఓం' కారము చేర్చి ఓం, న, మ, శ్శి, వా, య అని యుచ్చరించినచోనది షడక్షరీ మంత్ర మగును.

"వినాప్రణవకం మంత్రం స్త్రీశూద్రాణాంచసాధకం"

స్త్రీశూద్రాదులకు వేదాధికారమీయుగమున లేదని శాస్త్రములు నుడువుటచేతను, ఓంకారము వేదస్వరూపమగుట చేతను అధికారి భేదమునుబట్టియు ఓంకార రహితమగు పంచాక్షరియే వారికుపాస్యమని చెప్పబడినది. తారక మంత్రమేది-? " నమో వృక్షేభ్యో హరికేశేభ్యో నమస్తారాయనమః[31]

అనిశ్రుతియందు 'నమస్తారాయ' అని యీశ్వర నామమే తారకముగా సూచింపబడినది. "మంత్రాధీశాభాతి పంచాక్షరీయం" అను కాశీసారమునందలి శంకరుని వాక్యమును పంచాక్షరియే సంసార తారకమగునని యుపదేశింప బడినది.

"రామనామమస్మరణీయమా?" అని ప్రశ్నించుకొని శాస్త్రిగారిట్లు సమాధానము నిచ్చుచున్నారు. శ్లో॥ శివలింగ ప్రతిష్ఠాతావర్వావగుణ వర్జిత"[32]

శ్రీరామచంద్రుడు సేతువునందు దనపేరున లింగమును ప్రతిష్ఠించి అగస్త్య మహర్షివలన శివగీతలువిని, సదాశివ ధ్యానము సేయు మహా శివభక్తుడు. అట్టి మహా భక్తుని నామస్మరణము బసవేశ్వర నామమువలె యున్నతగతి సౌధమునకు సోపానమగుటలో సంశయములేదు. "నాకంటె నధికులు నా భక్తవరులు" అను ప్రభు లింగ లీలయందలి వచనమును, పరమేశ్వరుని కంటె భక్తులే యధికులని నిరూపించుచున్నది. వీరశైవులు 'దధీచిరామాన్' అని స్మరించుచునే యున్నారు కాన శివభక్తుడగు రాముడు బసవేశ్వరునివలె స్మరణీయుడనియే రాద్ధాంతము.

పంచాక్షరీ ప్రభావము — స్కాందమహా పురాణమున పార్వతితో పరమేశ్వరుడు పంచాక్షరీ మహాత్మ్యమును వివరింపుచు "లోకములు, వేదములు, మహర్షులు, ఈ చరాచర ప్రపంచ మంతయు పంచాక్షరీ ప్రభావముననే నిలిచియున్నవి సుమా!" అని వచించెను.

కలియుగమునందు మానవుడు పండితోత్తముడైనగాని పామరుడైనగాని, అంత్యజుడైనగాని అగ్రజుడైనగాని పంచాక్షరీ మంత్రమును జపించినగాని సమస్త శుభముల బొంది ముక్తి నొందగలడని ఈశ్వరుడు వాయు సంహితలో తెలిపెను.

అగ్ని హోత్రములుగాని, వేదత్రయముగాని, యజ్ఞముగాని పంచాక్షరి జపము యొక్క కోట్యంశము తోడను సమానములు గావు [34]

ఉపమన్యు మహర్షి పరమేశ్వరుని నుండి శైవశాస్త్ర రహస్యముల గ్రహించి బోధకుడై ప్రకాశించుటకును, వశిష్ఠ, వామదేవాది యోగీంద్రులు ముక్తకిల్బిషులై మహాతేజోవంతులగుటకును, సర్వులు విగతపాపులై మోక్షలక్ష్మిని కైవసము జేసికొనుటకు పంచాక్షరియే మూలమని, మంత్ర ప్రభావము వర్ణనాతీతమని సిద్ధాంత పంచకమున జెప్పబడినవి. సర్వకాల సర్వావస్థలయందు పరిశుద్ధుడైనను, అపరిశుద్ధుడైనను, శివనామము స్మరించు మానవుడు సిద్ధినొందగలడని 'తత్వజ్ఞ' అందు చెప్పబడినది.

మహాపాశుపతుడగు శ్రీహరిని స్మరించు చున్నానని శాస్త్రిగారు శ్రీహరిమూర్తినిట్లు కనులకు గట్టినట్లు వర్ణించుచున్నారు.

శ్లో॥ హృదంతరే శంకర తత్త్వచింతనం జిహ్వాంతరే శైవషడక్షరంచ
ఫాలప్రదేశే శివశూలచిహ్నం: ధరంహరింపాశుపతంస్మరామి[35]

## పంచాక్షరీ మంత్రార్థము :

నమఃపదము అంగమనియు, లేక జీవుడనియు, శివపదము లింగమనియు, లింగాంగ సంబంధము, అయ అను పదముచే బోధింపబడి

## ద్వైతమా? అద్వైతమా?

కాకికి పిండాన్ని పెడుతున్నాను
పితృశేషాన్ని తింటున్నాను
అస్థిత్వవాదినై అలారం మ్రోగిస్తున్నాను
అనంతవారధినై హ్యూమన్‌చైన్‌ని రొండ్లు
కొట్టిస్తున్నాను
ఎలా ఉన్నా ఏంచేసినా ఎప్పటికీ ఒకటేరకం
ఈ ప్రత్యగాత్మ అనవగతం!
ధ్యానం
నిశ్చల నిర్మాల్యం!
జస్ట్! మెడిటేషన్!!

ఆమె కావాలని
కళ్లు కాంక్షించి వాంఛించేవి
ఆమె పొందు కావాలని
గుండె తల్లడిల్లి తలమునకలయ్యేది
విరహంలో వినూత్నావేగం రూయిన్ చేసేది
సంగమంలో సాటిరాని ఉద్వేగం ఆసిడ్ రెయిన్ కురిపించేది
అయినా అదేమో
ఆత్మమాత్రం స్పదించదు!

ప్రతిధ్వనిస్తుంది!
ఇటీజ్ హెల్ప్‌లెస్‌లీ అన్‌యిమాజినబుల్!!

ఆమె నన్ను విడిచి వెళ్ళింది
నా కోసం "మిచీ"*ని వదిలి వెళ్లింది
ఆమె నన్ను రమ్మంటూ రంపుపెడుతోంది
నా "మిచీ" కోసం యీ దేహం మొరాయిస్తోంది
వియోగంలో ఎంతబాధ ఆల్‌మోస్ట్ కిల్లింగ్
కర్తవ్యపరాయణంలో ఎంత బాధ్యత
ఒహ్! థ్రిల్లింగ్

అయినా అదేమో
ఆత్మ అసలు పట్టించుకోదు!
ఏమాత్రమూ విన్పించుకోదు!
ఇట్ సీమ్స్ హైలీ యిడియాటిక్!!

ఎన్ని రాత్రులు గడిచాయి
ఎన్ని సమాధులు నడిచాయి
ఎన్ని ఉదయాలు వెలిగాయి
ఎన్ని పురిటినొప్పులు కేరింతలేసాయి
ఈ ఆత్మ చిద్విలాసంగా నవ్వుతుంది!
ఆల్ఫ్రెడ్ హిచ్‌కాక్ సస్పెన్స్‌లా ఏడుస్తుంది!
ఏదీ అర్థంకాదు
అసలు బోధపడదు!

ఎన్ని ఎక్స్‌పెరిమెంట్స్ చేశారు.
ఎన్నెన్ని కామెంట్స్ మొదలెట్టారు
ఎన్నియిజాలు నిజాలకోసం బయలు దేరాయి
యిన్ని కత్తులు నెత్తుటి మడుగుల్లో మునిగితేలాయి
అయినా ఈ ఆత్మ చూస్తూనేఉంటుంది!
అనంతంగా ఆనందిస్తూనే ఉంటుంది!
అదో విచిత్రం
అర్థంకాదు దాని వైనం!

చూడు మనూ!
ఆత్మ అనేది ఉంటే
పరమాత్మ ఎవర్ గ్రీన్!
ఆత్మ అనేది లేదనుకొంటే
ఈ జీవాత్మే నోమోర్!

---

*("మిచీ" అనేది "మైథిలీచంద్ర" పేరుకి పొట్టి రూపం)

డా॥ గుమ్మనూరు రమేష్‌బాబు

డాక్టర్ కోర్లపాటి శ్రీరామమూర్తి

# పర నన్నయభట్టు

# లక్షణసారము — శబ్దచింతామణి

(గత సంచిక తరువాయి)

ఆంధ్రశబ్ద చింతామణి ఆదికవి నన్నయభట్టు కృతము కానిచో, మధ్యకవి నన్నయభట్టు కృత మగునా? అనగా లక్షణ సారము, ఇంద్రవిజయము, రాఘవాభ్యుదయము రచించిన నన్నయ భట్టు అగునా? అని. పరిశీలనీయము.

ఆదికవి నన్నయభట్టు కాలము పదునొకండవ శతాబ్ది. మధ్య కవి నన్నయభట్టు కాలము పదునైదవ శతాబ్ది ఉత్తరార్ధము, పదు నారవ శతాబ్ది పూర్వార్ధము అని (1450-1550) పూర్వోక్తము. ఇది ప్రాతిపదిక. ఇక -

'ఆదిని శబ్దశాసన మహాకవి చెప్పిన భారతంబులో
నేది వచింపఁగాఁబడియె నెందును దానినె కాని సూత్ర సం
పాదన లేమిచేఁ దెనుఁగుపల్కు మఱొక్కటిఁగూర్చి
చెప్పఁగా
రాదని దక్షవాటి కవి రాక్షసుఁడీ నియమంబుఁ
జేసినన్' - 46 ప., 1 ఆ.

అని కాకునూరి అప్పకవి ఆంధ్రశబ్ద చింతామణి యందే కలదు. ఆంధ్రశబ్ద చింతామణి ఆదికవి నన్నయభట్టు కృతమని అంగీకరించిన కాకునూరి అప్పకవియే యీ విషయమును ప్రతిపాదించుట గమనార్హమైన విశేషము. ఈ పయి విషయము నందు తెలుగు భాషకు సూత్రసంపాదనము అనగా వ్యాకరణము లేకపోవుట వలన దక్షారామములోని కవిరాక్షసుడు పయి నియమము చేసినట్లు కలదు. అనగా కవిరాక్షసుని కాలము వఱకు తెలుగు వ్యాకరణమైన ఆంధ్రశబ్ద చింతామణి లేదని అవ గాహన మగును. కవి రాక్షసీయమను ఛందోగ్రంథమును, ఆది నారాయణ చరిత్ర మను పూర్వకావ్యమును రచించిన కవిరాక్షసుని కాలము నన్నయ, తిక్కనల నడిమి కాలము.[19] కనుక తిక్కనకు పూర్వము ఆంధ్రశబ్దచింతామణి లేదని కరతలామలకము. మఱి,

'మున్ను తెలుఁగునకు లక్షణ
మెన్నఁడు నెవ్వరును జెప్పరే? జెప్పిరి వి
ద్వన్నికరము మది మెచ్చఁగ
నన్నయభట్టాది కవి జనంబుల కరుణన్

క్రొత్తగ నాంధ్రభాషకును గొంచక లక్షణమిట్లు చెప్పునే
యుత్తమబుద్ధి యీతఁడని యోరలవోవక విన్నఁజాలు మీ
రొత్తిన మీకు మాఱునకు నుత్తరమిచ్చుట చాలయెగ్గు మీ
చిత్తమునందు నన్నెరవు సేయకుఁడీ కవులార
మ్రొక్కెదన్' 10

అని కేతన ఆంధ్రభాషా భూషణమునందు కలదు. ఇందు కేతనకు పూర్వము తెలుగునకు లక్షణము అనగా తెలుగుభాషకు లక్షణము అనగా తెలుగువ్యాకరణమును ఎప్పుడును ఎవ్వరును రచింపలేదని, కేతనయే క్రొత్తగ అనగా మొట్టమొదట తెలుగు వ్యాకరణమును రచించినట్లును కలదు. కేతన తెలుగు వ్యాకరణము ఆంధ్రభాషా భూషణమే. అది కర్ణాటకభాషా భూషణమును అనుసరించినది[20] గాని, ఆంధ్రశబ్ద చింతామణిని అనుసరించినది కాదు. అనగా కేత నకు పూర్వము ఆంధ్రశబ్దచింతామణి లేదని అవగాహన మగును. కేతన, తిక్కనలు సమకాలికులు. కనుక తిక్కనకాలము నందును ఆంధ్రశబ్ద చింతామణి లేదని కరబదరకము.

ఆంధ్రశబ్దచింతామణికి తొలి ఆలవాలము బాలసరస్వతీయము. అందు

'కవిభల్లటైఃక్రియాణాం నామ్నాంచోల్లోప ఇష్యతేహ్యేషు
ప్రథమైక వచనమాత్రే వికృతౌ నాన్తాదయోఽపి కథ్యన్తే'
- 18 శ్లో. హ. వ.

అని కలదు. ఇందు కవిభల్లటుని మతము కలదు. కవిభల్లటుడు సంస్కృతమున పదమంజరి, గణమంజరి, తెలుగున విక్రమార్క

చరిత్రము రచించెను.21 పదమంజరిని బట్టి బుద్ధనృపాలుని కాలము వాడని, గుణమంజరినిబట్టి దక్షారామము వాడని, సకలభాషా కవితా నిర్వాహకుడని తెలియును. అంతేకాదు. కాకునూరి అప్పకవి పేర్కొన్న కవిభల్లటపక్కికి (5 వచ., 1 ఆ.) కవిభల్లటుని తెలుగు వ్యాకరణ గ్రంథమే అగును. అదియాడా కేతన ఆంధ్ర భాషాభూషణము కంటె అనంతర గ్రంథమే అగును. కనుక, కవి భల్లటునికి సంబంధించిన బుద్ధనృపాలుడు కవిసార్వభౌముడు, కవి కల్పతరువు, కవిలోకభోజుడు, కవిపురందరుడు, సమనీషిపోషణో త్సుక సుఖోన్నతుడు, రంగనాథ రామాయణకర్త అయిన గోన బుద్ధభూవిభుడు కావచు ను. రంగనాథరామాయణ రచనాకాలము పదమూడవ శతాబ్ది ఉత్తరార్ధము. 22 కనుక బుద్ధనృపాలుని కాలమువాడైన కవిభల్లటుని కాలమును పదమూడవశతాబ్ది ఉత్తరార్ధమే. కనుక పదమూడవశతాబ్ది ఉత్తరార్ధములోని కవిభల్లటుని మతమును ప్రతిపాదించిన ఆంధ్రశబ్దచింతామణి పదమూడవశతాబ్ది ఉత్తరార్ధము కంటె అనంతరకాలములోని గ్రంథము కావలయును.

ఆంధ్రశబ్దచింతామణిలోని 'కవిభల్లటైః' అను పదమునకు 'కవిభల్లటైః=కవిభల్లటాచార్య లనెడి పురాతన లక్షణకర్త చేత' అని ఎలకూచి బాలసరస్వతి టీక. "కవిభల్లట సంప్రదాయమువారు" అని పారనంది రామశాస్త్రిలుగారి అర్థము. కవిభల్లటుని కాలము కంటె కవిభల్లటుని సంప్రదాయము వారి కాలము అనంతర మగును. కవిభల్లటుని కాలము పదమూడవ శతాబ్ది ఉత్తరార్ధము కావున, కవిభల్లటుని సంప్రదాయము వారి కాలము పదునాల్గవ శతాబ్ది కావలయును. అయిన కవిభల్లట సంప్రదాయము వారి మతము కలదన్న ఆంధ్రశబ్దచింతామణి పదునాల్గవశతాబ్ది కంటె అనంతరగ్రంథ మగును

ఆంధ్రశబ్దచింతామణికి తొలి ఆ వాలమైన బాలసరస్వతీ యము నందే ఇట్లుకలదు -

'దీర్ఘాణాం హ్రస్వ స్స్యన్న చదేశ్యపదే నచైకవర్ణేపి'

- 47 శ్లో. అ. ప'

ఇందు 'దీర్ఘాంత మలైన శబ్దములకు హ్రస్వము వచ్చును. దేశ్యపు దెలుగుపద మందురాదు. ఏకాక్షర తత్సమపద మందును దీర్ఘమునకు హ్రస్వమురాదు' అని బాలసరస్వతి టీక. లక్ష్మీ అను సంస్కృత శబ్దములోని, సిరీ అను ప్రాకృతశబ్దములోని అంతిమ దీర్ఘమునకు హ్రస్వమువచ్చి లక్ష్మి, సిరి అను తత్సమరూపములు సిద్ధించును. అట్లు దేశ్యశబ్దము లందు అంతిమ దీర్ఘమునకు హ్రస్వము రాదని నిషేధింపబడినది. నిజమైన దేశ్యశబ్దములు దీర్ఘాంతములు కావు. కనుక దేశ్యశబ్దములందు అంతిమ దీర్ఘము నకు హ్రస్వము రాదని నిషేధింపనక్కరలేదు. కాని దేశ్యశబ్దము లుగ వ్యవహృతమైన అన్యదేశ్య శబ్దములు దీర్ఘాంతములు కలవు. కనుక సూత్రములోని నిషేధమునకు నిమిత్తము అన్యదేశ్యశబ్ద ములు; 'నవలా, నవలాలు; జేజే, జేజేలు; తేజో, తేజీలు; నేజా, నేజాలు; లకోరీ, లకోరీలు' అని బాలసరస్వతి ఉదాహరణములు. ఇందు 'జయ జయ' అను సంస్కృత పదబంధమునకు 'జేజే' అనునది వికృతి అయినను మరి అసలు శబ్దము జయశబ్దమే. జయశబ్ద వికృతి జే. అది ఏకాక్షరశబ్దము. జేజే యనునది ఆమ్రే డిత రూపము. ఏకవర్ణమునందును అంతిమదీర్ఘమునకు హ్రస్వము రాదు అను నిషేధమునకు అది విషయము. నవలా, తేజీ, నేజా, లకోరీ, మొదలైన శబ్దములు అన్యదేశ్యములు. ఇట్టి శబ్దములందు అంతమదీర్ఘమునకు హ్రస్వము రాదని నిషేధించుటకు - వచ్చిన సందర్భముగాని, వచ్చునా ? రాదా ? అను సందేహము గాని ఉండ వలయును. కవుల అన్యదేశ్య ప్రయోగములు ప్రథమతః తిక్కన భారతమునందు కలవు. తిక్కన, మారన ప్రయోగించిన కైపు, తాసు అను శబ్దములు అన్యదేశ్యము లైనను దీర్ఘాంతములుకావు. దీర్ఘాంతమైన అన్యదేశ్యప్రయోగము ప్రథమతః శ్రీనాథుని హర విలాసము నందుకలదు. అది అన్యదేశ్య శబ్దములోని అంతిమ దీర్ఘమునకు హ్రస్వము వచ్చిన సందర్భము.

'ఖుసిమీఆన్ సురధాణి నిండుకొలువై కూర్చున్నచో'

ఇందు 'ఖుసి' అను పదమునకు మూలము 'ఖుషీ' అను పారసీక పదము. కనుక అన్యదేశ్యము. అది దీర్ఘాంతము. కాని శ్రీనాథుని ప్రయోగము హ్రస్వాంతము. ఇట్టి ప్రయోగము జక్కన విక్రమార్క చరిత్ర యందును కలదు.

'అన్నవల ముద్దుమోమును
దిన్నని నెన్నడుము వగవుదేటెడు కన్నుల్' - 73 ప. 5 ఆ.

ఇందు 'నవల' అను పదమునకు మూలము 'నవలతా' అను సంస్కృత పద బంధమునకు సంబంధించిన 'నవలఅ' అను ప్రాకృతరూప మని కొందరి అభిప్రాయము. నవలత అనగా క్రొత్తతీగ అని అర్థము. స్త్రీ క్రొత్తతీగ వలె ఉండును గాన నవ లతా = నవలఅ = నవల = అఅది అనుట వ్యుత్పత్తి కాదు, వ్యుత్పత్త్యాభాసము. నవల అను పదమునకు జక్కన విక్రమార్క చరిత్రకు పూర్వము కవి ప్రయోగము మృగ్యము. అది ప్రాకృత వికారమైనచో, అర్వాచీన ప్రయోగము కావలసిన అవశ్యకము లేదు. కవిత్రయ ప్రయోగమే కన్పట్టును. అర్వాచీన

ప్రయోగమైన 'నవల' అను పదమునకు మూలము 'నుబలా' అను పారసీక పదము. అది దీర్ఘాంతము. కాని ఇక్కడ ప్రయోగము హ్రస్వాంతము. అదే శబ్దము అల్లసాని పెద్దన మనుచరిత్రమునందు ఇట్లు కలదు.

'నతనాభిన్ నవలా నొకానొక మరున్నారీ శిరోరత్నమున్'

ఇందు 'నవలా' అను పదము దీర్ఘాంతముగ కలదు. 'నుబలా' అను పారసీక పదమునకు తెలిపైన ఆడది అను అర్థము వచ్చును. అది తెలుగున 'ఆడది' అను అర్థవ్యాకోచము నందును, కలికి శబ్దము వలె. కనుక 'నవలా' అను పదమునకు మూలము 'నుబలా' అను పారసీక పదమే. అది దీర్ఘాంతము. పెద్దన ప్రయోగమును దీర్ఘాంతము. అనగా అన్యదేశ్య శబ్దములోని అంతిమ దీర్ఘమునకు హ్రస్వమురాని సందర్భమిది. వచ్చిన సందర్భము ముందు కలదు. రాని సందర్భము తర్వాత కలదు. కనుక వచ్చునా? రాదా? అను సందేహము ఆ తర్వాత కలుగును. వచ్చుననియో రాదనియో వ్యాకరణము చెప్పవలయును. 'ప్రయోగ శరణం వ్యాకరణం'. రాదని ఆంధ్రశబ్దచింతామణియందు కలదు. కనుక ఆంధ్రశబ్దచింతామణి అల్లసాని పెద్దన మనుచరిత్రకంటె అనంతర గ్రంథము కావలయును. మనుచరిత్ర రచనాకాలము పదునారవ శతాబ్ది ప్రథమ పాదము. కనుక ఆంధ్రశబ్దచింతామణి రచనా కాలము పదునారవ శతాబ్ది ద్వితీయ పాదము కావచ్చును. ఆ కాలము 1526- 1550.

నన్నయభట్టు-లక్షణ సారము రచనా కాలము స్థూలముగ 1450- 1550 అని పూర్వోక్తము. నన్నయభట్టు ఆంధ్రశబ్దచింతామణి రచనాకాలము స్థూలముగ 1526- 1550. కనుక లక్షణసారమును రచించిన నన్నయభట్టు, ఆంధ్రశబ్దచింతామణి రచించిన నన్నయభట్టు ఒకడు కావలయును. అంతేకాదు. లక్షణ సారము ఛందోలక్షణ గ్రంథము. ఆంధ్రశబ్దచింతామణి వ్యాకరణ లక్షణ గ్రంథము. ఉపరి, ఆంధ్రశబ్దచింతామణియందు ఛందోవిషయము అలతిగ కలదు. కనుక లక్షణసారమును రచించిన నన్నయభట్టే ఆంధ్రశబ్దచింతామణి రచించిన నన్నయభట్టు అగును. అనగా ఆంధ్రశబ్దచింతామణి ఆదికవి నన్నయభట్టు కృతము కాదని, మధ్యకవి నన్నయభట్టు కృతమని అర్థము.

ఆంధ్రశబ్దచింతామణి రచనా కాలము 1526 – 1550 కావున లక్షణసారము రచనా కాలమును అదే. ఇంద్రవిజయ, రాఘవాభ్యుదయముల రచనా కాలమును అదే. ఇంద్రవిజయ, రాఘవాభ్యుదయములు అప్రౌఢములు. లక్షణసారాంధ్రశబ్దచింతామణులు ప్రౌఢాప్రౌఢములు. అధర్వణ కారికావళి అండ లేనిచో ఆంధ్రశబ్దచింతామణి అసమగ్రము. అప్రౌఢము. ఇంద్రవిజయ, రాఘవాభ్యుదయ, లక్షణసారాంధ్రశబ్దచింతామణులు పౌర్వాపర్యక్రమము కావచ్చును. కనుక ఆంధ్రశబ్దచింతామణి రచనా కాలము 1550 ప్రాంతము.

1550 ప్రాంతమునందు అపర నన్నయభట్టు రచించిన ఆంధ్రశబ్దచింతామణి ఎలకూచి బాలసరస్వతికిలభించినది. ఎప్పుడు? ఎక్కడ? - ఎట్లు? ఎలకూచి బాలసరస్వతియే చెప్పినవిషయమిది-

'-మున్నొక్కనాడు విద్యానగరిలో నచింత్యకారణోపాగమ స్నేహసాహచర్యుండగు శివయోగివర్యుచే దైవచోదనం బరిప్రాప్తమైన యాంధ్రశబ్దచింతామణి గ్రంథంబునకు లోకోపకారార్థంబుగాఁ దీకఁ గావింపఁగోరి నెమ్మనంబున-

'ఉ॥ ఏమి మహాద్భుతంబిది హరీ! హరి! యెక్కడి యాంధ్రశబ్దచింతామణి పక్కి? యెక్కడి మతంగ నగంబు? యుగాదిసంభవుండై మని చన్న నన్నయమహాకవి యెవ్వఁడు? సిద్ధుఁడెవ్వఁ? డాహా! మదగణ్యపుణ్యచయముదగ్రతఁ జేకుఱెఁగాదె యిన్నియున్

ఇలఁబ్రాజ్ఞాదికులౌ కవుల్ మునుపు లేరే! వారు వ్యాఖ్యాన కర్తలుగా నోపరె! పెక్కు వత్సరములంతర్భూతమైయున్న యీ తెలుఁగువ్యాకరణంబు నాకొనఁగెఁబ్రీతిన్ దీకఁగావింపు మం చలసిద్ధుండు మదిష్టదేవత విరూపాక్షుండు నిక్కంబుగన్'

ఇది ఎలకూచి బాలసరస్వతి తన ఇష్టదైవమైన విరూపాక్ష స్వామి సాక్ష్యముగ చెప్పిన విషయము. అనగా దేవునిమీద ప్రమాణము చేసి చెప్పిన విషయము. కనుక నిజము కావలయును.

విరూపాక్షస్వామి హంపీవిజయనగర లోని దైవము. హంపీ విజయనగరమే విద్యానగరము. విద్యానగరము నందే ఎలకూచి బాలసరస్వతికి ఆంధ్రశబ్దచింతామణి లభించినది. అది కూడ శివయోగి వలన. ఆ శివయోగి సిద్ధుడు. సిద్ధుడైన శివయోగి మతంగ నగ సమీపము నందు మఠాధిపతి కావచ్చును. మతంగ నగము విజయనగర ప్రాంతమునందే కలదు.[23] మఠము లందు తాళపత్ర గ్రంథములే కాదు; తామ్రఫలకశాసనములును చేరును. అట్లు చేరిన ఆంధ్రశబ్దచింతామణి తాళపత్రగ్రంథమును శివయోగి బాలసరస్వతికి ఈవచ్చును. టీక రచింపు మనియును చెప్పవచ్చును. అట్లు లభించిన ఆంధ్రశబ్దచింతామణి పరిచ్ఛేదముల చివఱ 'సకలభాషా వాగనుశాసన నన్నయభట్ట విరచితాంధ్రశబ్దచింతామణౌ' అని కలదు. అది చూడగానే విపుల శబ్దశాసనుడైన ఆదికవి నన్నయభట్టు బాలసరస్వతి దృష్టికి వచ్చును. కాని ఆదికవి నన్నయభట్టు ఆంధ్రశబ్దచింతామణి రచించినట్లు అప్పటికి ఎవ్వరికిని తెలియదు. బాలసరస్వతికిని తెలియదు. కనుక 'పెక్కు వత్సరము

లంతర్థానమైయున్న' దను భావము కలుగును. అంతేకాదు. ఎవ్వరికిని తెలియని, ఆదికవి నన్నయభట్టు కృతమని భావించిన, ఆంధ్రశబ్దచింతామణి తనకే లభించినందున ఎంతో ఆశ్చర్యము కలుగును. అదే 'ఏమి మహాద్భుతంబిది హరీః హరి' అను ఆశ్చర్య ప్రకటనము. ఉపరి, ఆంధ్రశబ్దచింతామణి ఆదికవి నన్నయభట్టు కృతమని అనుకొనుట వలన 'ప్రజ్ఞానిధుల్ కవుల్ మును పు లేరే! వారు వ్యాఖ్యానకర్తలు గానోపరే!' అను భావమును కలుగును. కనుక విరూపాక్షస్వామి సాక్ష్యముగ బాలసరస్వతి చెప్పినదెల్ల నిజమే. కాని భ్రాంతిమూలకము.

ఇంతకు, ఆంధ్రశబ్దచింతామణి ఆదికవి నన్నయభట్టు కృతము కాదు. అర్వాచీనకవి అపరనన్నయభట్టు కృతము. అది కూడా బాలసరస్వతికి తెలియకపోవచ్చును. అపర నన్నయభట్టు కృతమైన లక్షణసారము, ఇంద్రవిజయము, రాఘవాభ్యుదయము కూడ బాలసరస్వతికి తెలియకపోవచ్చును. అదెట్లు సంభవము ?

ఎలకూచి బాలసరస్వతి 'పాకనాటి సుకవి పండితముఖజనాచార్యుఁడైన కృష్ణయార్యవర్యుని' తనయుడని బాలసరస్వతీయము నందు కలదు. అంతేకాదు. బాలసరస్వతి పెదముత్తాత 'తిరుమలేంద్రుఁ డళియరామావనీశదత్త యెడవల్లినామ సద్గ్రామహోమచారచ్ఛత్రపల్యంతికా మణివిభూషుడై వైదుషీస్ఫూర్తిఁబొలుపు మించె' నని కూడ అందే కలదు. బాలసరస్వతి జన్మస్థలము నెల్లూరు మండలము కావచ్చును. కాని బాలసరస్వతి భర్తృహరి సుభాషిత రత్నావళి జటప్రోలు సంస్థానాధిపతికి అంకితము. చంద్రికాపరిణయము పత్తియాల సంస్థానాధిపతి ప్రేరణమున సరస్వతికి అంకితము. జటప్రోలు సంస్థానము మహబూబునగర మండలములోనిది. పత్తియాల సంస్థానము కృష్ణామండలము లోనిది. ఇప్పటి పరిటాల. విద్యానగరము బళ్ళారిమండలములోనిది అట బహుదేశాటనబంధురుడైన బాలసరస్వతికి ఆంధ్రశబ్ద చింతామణి లభించినది. కనుక ఆంధ్రశబ్దచింతామణిని రచించిన అపరనన్నయభట్టు విద్యానగర ప్రాంతీయుడు కావచ్చును.

బళ్లారిమండలము వాడగు అపరనన్నయభట్టు ఆంధ్రశబ్ద చింతామణి రచనాకాలము 1550 ప్రాంతము. అది బాలసరస్వతికి కీలకనామ సంవత్సరమున లభించినదని అప్పకవి అందిచ్చిన సమాచారము (50 ప., 1 ఆ) ఆ' కీలకనామ సంవత్సరము 1608. కనుక 1550 ప్రాంతమునందలి బళ్ళారిమండలము వాడగు అపర నన్నయభట్టు ఆంధ్రశబ్దచింతామణి, 1608 వ ప్రాంతము వరకు నెల్లూరిమండలము వాడైన ఎలకూచి బాలసరస్వతికి ఆ కాలము నందు తెలియకపోవుట సంభవమే. అంతేకాదు. ఆ పద్యకాలము నందు అనగా పదునారవశతాబ్ది ఉత్తరార్ధము నందు అపరనన్నయభట్టు ఆంధ్రశబ్దచింతామణి ప్రసిద్ధము కాకపోవుటకూడా సంగతమే.

నన్నయభట్టు లక్షణసారములోని ఒక పద్యము లింగమగుంట తిమ్మకవి సులక్షణసారము నందు కలదు గాని, నన్నయభట్టు లక్షణసారము నుండి అనిలేదు. మఱొక పద్యము ముద్దరాజు రామన కవిసంజీవని యందు కలదు గాని, అందును నన్నయభట్టు లక్షణసారము నుండి అని లేదు. అనగా పదునారవ శతాబ్ది ఉత్తరార్ధమునందు, పదునేడవశతాబ్ది పూర్వార్ధము నందును, అపర నన్నయభట్టు లక్షణసారమును అంత ప్రసిద్ధము కాదని అవగాహనమగును. గుణపవరపు వేంకటకవి ఆంధ్రప్రయోగరత్నాకరము నందు నన్నయభట్టు లక్షణసారమునుండి లక్ష్యలక్షణములు ఉండుటయేగాక, అన్ని స్థలము లందును నన్నయభట్టు లక్షణ సారము నుండి అని కలదు. కనుక అపరనన్నయభట్టు లక్షణ సారము పదునేడవశతాబ్ది ఉత్తరార్ధము నందు ప్రసిద్ధము కావచ్చును. అయినను లింగమగుంట తిమ్మకవికి, ముద్దరాజు రామనకు, గణపవరపు వేంకట కవికి నన్నయభట్టు లక్షణసారము లభించినది. ఇదెట్లు సంభవము ?

లింగమగుంట తిమ్మకవి 'వృద్ధకుండికాతీర లింగమగుంట నామ పట్టణస్థితకుండ' ని సులక్షణ సారమునందు కలదు. లింగమకుంట నెల్లూరు మండలములోనిది. లింగమగుంట తిమ్మకవి నెల్లూరి మండలమువాడైనను, తెనాలి రామకృష్ణుని అల్లుడు లింగమగుంట రామకవి తమ్ముడు. రామకవి ఆనందకానన మాహాత్మ్య, చతుర్వాటికా మాహాత్మ్య, వేంకట మాహాత్మ్య, మత్స్యపురాణ వామన పురాణాద్యనేక గ్రంథముల కర్త.24 తెనాలి రామకృష్ణుడు విద్యానగరములోని విద్వత్కవి అన్న మావగారి ఇంటికి తమ్ముడు వెళ్లవచ్చును. కనుక విద్యానగర ప్రాంతీయుడైన అపర నన్నయభట్టు లక్షణసారము, లింగమగుంట తిమ్మకవికి విద్యానగరమునందు లభించుట సంభవమే.

ముద్దరాజు రామన నివాసము తెలియదు. విలాసమును తెలియదు. కవి సంజీవనియందు కానరాదు. కాని కవిసంజీవనియందు కవిత్రయము వారి భారతముతోపాటు కృష్ణదేవరాయల ఆముక్తమాల్యద, పెద్దన మనుచరిత్ర, పింగళి సూరన రాఘవ పాండవీయము ప్రసక్తమైనవి. ఆముక్తమాల్యద నుండి అధిక ప్రయోగములు కలవు. కనుక ముద్దరాజు రామన విద్యానగర ప్రాంతీయుడు కావచ్చును. అయిన, విద్యానగర ప్రాంతీయుడైన అపర నన్నయ భట్టు లక్షణసారము ముద్దరాజు రామనకు లభించుట అవకాశమే.

గణపవరపు వేంకటకవి 'కాశ్యపకులైక గణపవర గ్రామశేఖ' రుడని ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసమునందు

కలదు. కాని కాశెపలీముఖ్య గణపవరము జాడ కానరాదు. అయి నను వేంకటకవి విద్యావతీ దండకము మధుర నాయక రాజైన ముద్దళఘరి వృత్తాంతము. వేంకటకవి 'కర్ణాటతుండీర చోళపాండ్య మండల ప్రముఖాఖిల మహీమండలాఖండలదత్త' రాజ లాంఛనములు కలవాడని అతని గ్రంథాంత గద్యలందు కలదు. బాలసరస్వతిని మించిన బహు దేశాటనశీలి. కర్ణాటరాజులన విజయనగర రాజులు. వారు ఒసగిన 'మత్తసింధుర సైంధవాందోళికాచిరత్న రత్న కాంచనాంబరాది వస్తు' వు లందు ఏది గ్రహించుటకైనను గణప వరపు వేంకటకవి విద్యానగరమునకు విచ్చేయవలయును. విద్యా నగరమునకు విచ్చేసిన గణపవరపు వేంకటకవికి విద్యానగర ప్రాంతీయుడైన అపర నన్నయభట్టు లక్షణసారము లభించుట సంభవమే.

గణపవరపు వేంకటకవి ఆంధ్రప్రయోగ రత్నాకరము నందు ఇరువదిమూడు లక్షణ గ్రంథముల నుండి లక్ష్య లక్షణములు కలవు. అవి - 1. విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణి (40); 2. అధర్వణాచార్య ఛందము (20); 3. కవిరాక్షసుని ఛందము(6); 4. భీమన ఛందము(17); 5. జయదేవ ఛందము (19); 6. ఆంధ్రశ్రీధరచ్ఛందము (18); 7. అనంతుని ఛందము (43); 8. నీలకంఠచ్ఛందము(21); 9. ముద్దరాజు రామన కవిజన సంజీవని(20); 10. గణపవరపు వేంకటకవి సర్వలక్షణ శిరోమణి (1); 11. ఉత్తమ గండ ఛందము(23); 12. నన్నయభట్టు లక్షణ సారము(25); 13. తాతంభట్లు చింతామణి(8); 14. ఆంధ్రగోకర్ణ ఛందస్సు 19; 15. కవి కంఠాభరణము(2); 16. భాస్కరదేవుని ఛందము(19); 17. సర్వదేవచ్ఛందము(5); 18. భైరవ ఛందము (9); 19. సరస్వతీ విలాసము(2); 20. కవికంఠ భూషణము(1); 21. ఛందోదర్పణము(5); 22. లక్షణదీపిక(3); 23. సాహిత్య చింతామణి(2); ఇందు ప్రసిద్ధా ప్రసిద్ధములు కలవు. భ్రమప్రమాద ములును కలవు. ప్రసిద్ధములైన లక్షణ గ్రంథములు యథార్థము, అప్రసిద్ధములైనలక్షణ గ్రంథములు కథార్థము అనుట కేవలము అవిచార మూలకము.

ఇంద్ర విజయములోని పద్యములు ఉత్తమగండచ్ఛందము నందు, శ్రీధరచ్ఛందము నందును కలవు. అవే గణపవరపు వేంకటకవి ఆంధ్రప్రయోగ రత్నాకరము నందు, కస్తూరి రంగకవి ఆనందరంగరాట్ఛందము నందును కలవు. కనుక ఇంద్రవిజయము గణపవరపు వేంకటకవికిని లభించినట్లు కాదు. లభించిన చిత్రపు భీమన ఉత్తమగండచ్ఛందము శ్రీధరుని ఛందము నేడు లభించునవి కావు. కనుక చిత్రపుభీమన, శ్రీధరుల ఉనికి తెలియునది కాదు. కాని, ఉత్తమ గండచ్ఛందము, శ్రీధరచ్ఛందము ప్రధమతః లింగమగుంట తిమ్మకవి సులక్షణ సారమునందు ప్రసక్తము లయినవి. కనుక చిత్రపు భీమన, శ్రీధరులు లింగముగుంట తిమ్మకవి జన్మ స్థలమైన నెల్లూరు మండ లము వారుగాని, తెనాలి రామకృష్ణుని వాసస్థలమైన విద్యానగరము ప్రాంతము వారు గాని కావచ్చును.కనుక విద్యానగర ప్రాంతీయు డైన అపర నన్నయభట్టు ఇంద్రవిజయము విద్యానగర ప్రాంతీ యులో, విద్యానగర సమీప ప్రాంతీయులో అగు చిత్రపు భీమన, శ్రీధరులకు లభించుట అనుకూలమే.

గణపవరపు వేంకటకవి ఉటంకించిన ఇరువదిమూడు లక్షణ గ్రంథములందు సర్వదేవచ్ఛందము ఒకటి. సర్వదేవచ్ఛందము నుండి ఆంధ్రప్రయోగరత్నాకరము నందు అయిదు ఉదాహరణము కలవు. అందు మూడు లక్ష్యములు కలవు. రెండు భాస్కరరామా యణము లోనివి. సర్వదేవచ్ఛందము అనగా సర్వదేవకవి కృతిమైన ఛందోగ్రంథ మని అర్థము. సర్వ దేవకవి ఆదిపురాణ, విరాటపర్వముల పద్యములు పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరము నందు కలవు. అవి ప్రాక్నన్నయ యుగ కావ్యములు కాక అర్వాచీనయుగ కావ్యములని ప్రతిపాది తము.25 ఇది తదుపబలకము. ఆదిపురాణ, విరాటపర్వముల కర్త అయిన సర్వదేవకవియే సర్వదేవచ్ఛందఃకర్త అగును.

సమష్టిపై ఇంద్రవిజయము, రాఘవాభ్యుదయము, లక్షణ సారము, ఆంధ్రశబ్దచింతామణి అసలు నన్నయభట్ట కృతములు కావని అవి అపర నన్నయభట్టు కృతములని, పదునారవశతాబ్ది ద్వితీయ పాదములోని (1526 - 1550) గ్రంథములని స్పష్టము

**సూ చి క లు**

1. ఆంధ్రకవుల చరిత్ర, ప్రథమభాగము, పు. 68
2. ఆంధ్రకవితరంగిణి - మొదటి సంపుటము, పుటలు 45 - 6
3. ఒకటి వలె
4. రెండువలె, పు. 47
5. ప్రబంధరత్నావళి-ద్వితీయముద్రణము, పీఠిక, పు. 10
6. తెలుగుభాషలో ఛందోరీతులు, పు. 403

7. సమగ్ర ఆంధ్రసాహిత్యం - ఏడవసంపుటం, పు. 49
8. ఒకటివలె, పుటలు 68 - 9
9. రెండువలె, పు. 47
10. ఒకటివలె, పుటలు 69 - 84
11. అదే - పుటలు 41 - 64
12. చింతామణీవిషయ పరిశోధనము
13. నవభారతి - 1979, సెప్టెంబరు, పుటలు 51- 56 అక్టోబరు, పుటలు 32 - 42
14. శాసనపద్యమంజరి, ప్రథమభాగము, పు. 1
15. అదే, పు. 3
16. ప్రాచీనాంధ్రశాసనాలు, పు. 68
17. అదే, పు. 141
18. అదే, పు. 154
19. ఒకటివలె, పు. 684
20. కేతన, పు. 101- 5
21. ఒకటివలె. పు. 683
22. ప్రత్యేకవ్యాసము ప్రకటింతును.
23. ప్రాచీనాంధ్ర చారిత్రికభూగోళము, పు. 295
24. రెండువలె, తొమ్మిదవ సంపుటము, పు. 175
25. నవభారతి, 1978, ఏప్రిల్, పుటలు 7 - 18

(అయిపోయింది)

# అపూర్వ త్యాగ ఫలం

## చల్లా రాధాకృష్ణ శర్మ

నిన మొన్నటిదాకా
మహావృక్షాలంటే
మర్రిచెట్టు మొదలైనవి.
ఈనాడు
సంపాదించింది
వటవృక్ష విఖ్యాతి
గరికపోచ సైతం.
ఒకప్పుడు
ఉన్నతసౌధాలే
ఆకట్టుకునేవి నలుగురినీ.
ఇప్పుడు
పూరిపాకకూడా
పరవశింపజేస్తున్నది
పెద్దల మనస్సుని.
ఒకనాడు
ప్రభుత సాగింది
విద్యావంతుల చేతుల్లో
ఈనాడు
నిరక్షరాస్యుడు సైతం
ప్రభుత్వ కార్యకలాపాలలో
పంచుకుంటున్నాడు పాలు.
ప్రభుస్వామ్యానికి
సమాధి కట్టింది
జనశక్తికి
నివాళి పట్టింది
సమాజంలో సమతకు
పునాది వేసింది
సామాన్య మానవుణ్ణి
గద్దెను నిలిపింది.
వర్ధిల్లాలి చిరకాలం
ప్రజాస్వామ్యం!
అపూర్వ త్యాగఫలం
మా ప్రజాస్వామ్యం!

# గమనించు మిత్రమా!

డా॥ సి. నారాయణరెడ్డి

నడిచింది ఒక్కమైలు అంతలోనె ఆత్రమా
తొలిపొద్దు వేళలోనే తలపైన ఛత్రమా?
నీ అడుగులకో తుదిగమ్యం అందాలంటే
ఎడతెగని యెదురుదెబ్బలు - గమనించు మిత్రమా!

ఎంతెంత దుమ్ము కమ్మిందో నిలిచి చూసుకో
నీ గుండెను ఒక అద్దంలా తుడిచి చూసుకో.
ఎన్నెన్ని ఎగుడు దిగుడులో ఈ జీవయా
ఎదలోని బొమ్మ చెబుతుందిక తెరిచి చూసుకో.

పసవుంటే సుడిగాడ్పులైన వీగుతాయిలే
పదముంటే గిరి పంక్తులైన సాగుతాయిలే.
నీ పలుకులోన మొక్కవోని పదునే వుంటే
ఏ పడగలైన కోకిలలై పాడుతాయిలే.

ఇది కాదు నేటి ఘర్షణ; ప్రతినిత్య సంగరం.
ఒక నువ్వుకాదు అక్రమ వంచితుల మందరం.
అనుకున్న సమత అమృతంలా దొరకాలంటే
జన జలధి మథించాలి ఘరోత్క్రాంతి మందరం.

ఏ మనిషిని హింసించవద్దు మతం పేరుతో
ఏ కొత్తను నిరసించవద్దు గతం పేరుతో.
తరగెత్తి కాలవాహిని నిను వెరపిస్తుంటే
నీ శిరసు వంచవద్దు పురాకృతం పేరుతో.

][

# తెలుగునాడు
# వెలుగుబాట

తెలుగునాట ఒకనాడు పాడిపంటలు వెల్లివిరిసాయి. పాలు, తేనెలు ప్రవహించాయి. సిరి సంపదలు విలసిల్లాయి లలితకళలు నాట్యమాడాయి. పౌరుషం ప్రజ్వరిల్లింది. శాతవాహన, ఇక్ష్వాక, కాకతీయ, విజయ నగర సామ్రాజ్యాల కాలంలో తెలుగు తేజం దిగంతాల వెలుగొందింది. అనంత కీర్తిని ఆర్జించింది. ఆనాటి సిరి సంపదలను తిరిగి సాధించి, ప్రజా జీవితాన్ని సౌభాగ్యవంతం చేసి ఆనాటి పౌరుషాన్ని, కళా ప్రాభవాన్ని పునః ప్రతిష్టించి, తెలుగుజాతికి చిరకీర్తిని చేకూర్చాలన్నదే శ్రీ ఎన్. టి. రామారావు నాయకత్వాన గల రాష్ట్ర ప్రభుత్వ ప్రగాఢ ఆకాంక్ష. ఆ లక్ష్య సాధనకోసం క్రొత్త ప్రభుత్వం మూడు నెలల స్వల్ప కాలంలోనే ఎన్నో సాహసోపేతమైన నిర్ణయాలు గైకొన్నది.

- దేశానికి అన్నంపెట్టె రైతన్నను ఆదుకోడానికి ఆత్మతతో ముందుకు వచ్చింది. ధాన్యానికి క్వింటాలుకు 20 రూపాయల చొప్పున సబ్సిడి ప్రకటించి రైతన్న వెన్ను తట్టింది.
- పేదలకు రెండు రూపాయలకే బియ్యం సరఫరా చేసే బృహత్ పథకాన్ని నేటి ఉగాది నుంచే అమలు జరుపు తున్నది.
- బలహీన వర్గాల కోసం 2 లక్షల 20 వేల యిళ్ళు నిర్మించనున్నది.
- ఆడపడచులకు తండ్రి ఆస్తిలో సమాన ఆస్తి హక్కు కల్పించాలని కేంద్రాన్ని కోరుతూ విధానమండలిలో తీర్మానాలు ఆమోదింపచేసింది.
- మహిళలకోసం తిరుపతిలో వచ్చే విద్యా సంవత్సరం నుంచి ప్రత్యేక విశ్వవిద్యాలయం ఆరంభించనున్నది.
- 62 లక్షల మంది బాలలకు మధ్యాహ్న భోజనం కోసం సమగ్ర పథకం ప్రవేశపెట్టింది.
- విధాన పరిషత్తును రద్దు చేయటానికి, పార్టీ ఫిరాయింపులను నిరోధించడానికి, మాజీ శాసనసభ్యుల ఫించను లకు స్వస్తి పలకటానికి విధాన సభలో తీర్మానాలు చేయించింది.
- ఉద్యోగావకాశాలను హెచ్చించి నిరుద్యోగ యువత నైరశ్యాన్ని పారద్రోలే సంకల్పంతో ప్రభుత్వోద్యోగుల పదవీ విరమణ వయస్సును 58 నుంచి 55 సంవత్సరాలకు తగ్గించింది.
- వివిధ కార్పోరేషన్ల సంఖ్య తగ్గింపు ద్వారా 4కోట్ల రూపాయలపైగా వ్యయాన్ని ఆదా చేయనున్నది.
- ప్రభుత్వ వ్యవస్థలో అవినీతి నిర్మూలన కోసం ధర్మమహామాత్రను ఏర్పాటు చేసింది.
- సచివాలయ స్థాయిలో తెలుగును అధికార భాష చేసే కార్యక్రమం ఈ ఉగాది నుంచే ప్రారంభమవుతున్నది.

ప్రజా సౌభాగ్యం కోసం, వివిధ రంగాలలో రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధి కోసం ప్రభుత్వం 15 అంశాల కార్యక్రమాన్ని రూపొందించింది. మంచినీటి సరఫరా, బలహీన వర్గాల సంక్షేమం, పేదలకు గృహవసతి, గ్రామీణ విద్యుదీకరణ, భూసంస్కరణలఅమలు వంటి అభ్యుదయ కార్యక్రమాల అమలుకు ఈ పదిహేను అంశాల కార్యక్రమం పునాది అవుతుంది.

తెలుగు ప్రజల ఆకాంక్షలు నెరవేర్చటానికి అంకితమైన ప్రభుత్వ కృషికి, కార్యదీక్షకు ఇది నిదర్శనం.

డైరెక్టరు,
**సమాచార, పౌర సంబంధ శాఖ**
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, హైదరాబాదు.

D I P R No. 25514 / Advt. / C3 / 83.

డా॥ హెచ్. ఎస్. బ్రహ్మానంద

# సర్గెజ కార్చెవస్కి సంకేత దృష్టి

ఆధునిక భాషాశాస్త్రానికి వైతాళికుడుగా చెప్పబడుతున్నవాడు ఫర్డినాండ్. డి. ససూర్. సెర్గెజ్ కార్‌చెవ్‌స్కీ ససూర్‌కి స్వయానా శిష్యుడు. 1884లో ఈయన రష్యాలో జన్మించాడు. 1905 నాటి విప్లవంలో రాజకీయ ఖైదీగా ఒక సంవత్సరం జైలులో గడిపాడు. తరువాత స్విట్జర్‌లాండ్‌కు తరలించబడ్డాడు. అక్కడే ఈయన ససూర్ శిష్యరికం చేసాడు. రష్యాలో 1917 – '19 ల మధ్య ససూర్ ప్రతిపాదించిన ఆధునిక భాషాశాస్త్ర దృక్పథాలతో ఆనాటి రష్యా యువతరాన్ని ఎంతో ఉత్తేజితం చేసాడు. అక్కడి కమ్యూనిస్టు పాలనతో అసంతృప్తుడై మళ్ళీ రష్యాను వదిలి ప్రాగ్‌లో నిల్చిపోయాడు. ప్రాగ్ భాషాశాస్త్రసదస్సులో ఒక ముఖ్యవ్యక్తి అయ్యాడు. 1930లో మళ్ళీ స్విట్జర్‌లాండ్‌కు వచ్చాడు. అక్కడే జెనీవా భాషాశాస్త్ర సంస్థని ప్రారంభించాడు. 1955 లో ఈయన చనిపోయాడు.

## ససూర్ సంకేతదృష్టి

ససూర్‌ని అనుసరించి భాష ప్రాథమికంగా సామాజికమైన అస్తిత్వాన్ని కలిగింది. అది అవగాహన రూపమైనది. ససూర్ పరిభాషలో ఇది లాంగ్ అని పిలవబడింది.

భాషావ్యవహారం వక్తశ్రోతల మధ్య అభిప్రాయ నివేదనకు మాధ్యమికంగా ఉంది. ఎలాగంటే భాషాసంకేతం ఒక వస్తువు సూచించే పేరుకాదు. ఒక భావాన్ని బంధించే శబ్దచిత్రం. అంచేత సంకేతంలో భావమూ, శబ్దమూ ఇవిరెండూ ఒకే నాణానికున్న బొమ్మా బొరుసుల్లాంటివి. భాషలో శబ్దానికి, భావానికీ మధ్య ఇక్కడ మాత్రమే అన్వయం ఉంది.

కాని భాష ఒక నిర్మాణాన్ని సంతరించుకుంటోంది. ఆ నిర్మాణం సంకేతగతమైన శబ్దభావ అన్వయాన్ని ఆధారంగా కాకుండా సంకేతాల సంధాన ప్రత్యామ్నాయ క్రమ విన్యాసంవల్ల ఏర్పడుతోంది. ఈ విన్యాసం ఒక సంకేతం, ఇంకో సంకేతం కంటే భిన్నంగా ఉండటంవల్లనే సాధ్యమవుతోంది. వక్తశ్రోతలమధ్య అభిప్రాయ వినిమయం సంకేతాలమధ్య ఉన్న వ్యతిరేకతను ఆధారంగా పుడుతున్న అవగాహన కారణంగా ఏర్పడుతోంది. అంచేత సంకేతాలమధ్య నున్న భిన్నతే భాషలో నిర్మాణఘటన సమర్థమైన అంశ.

ససూర్ భాషలో రెండు ప్రధాన అంశాలను గుర్తించాడు. ఒకటి– సంకేతానికున్న భావజనక శక్తి (సిగ్నిఫికేషన్). రెండు – సంకేతాల భావనివేదన వ్యాపారం (కమ్యూనికేషన్).

## భాషాశాస్త్రం – సంకేతవాదం

ససూర్ తరువాత ఆయన చేసిన పై రెండు ప్రతిపాదనల్ని ఆధారంగా రెండు భిన్నశాఖలు భాషాసంకేతాన్ని గురించి విచారించటం మొదలుపెట్టాయి. 1) భాషాశాస్త్రం 2) సంకేతవాదం (సెమియాటిక్స్). అమెరికాలో బ్లూం ఫీల్డ్ సంప్రదాయం, వాట్సన్ ప్రభృతుల మానసిక ప్రవృత్తి వాదాన్ని భౌతిక ప్రక్రియాదృష్టితో భాషను ఒక ప్రతిక్రియగా నిరూపించింది. ఇక్కడ లుప్తమైనఅంశం భాషకున్న సామాజిక అస్తిత్వం. ఛామ్స్కీ రంగంలోకి వచ్చి మొదటిసారిగా ససూర్ ప్రతిపాదించిన లాంగ్ అన్న అంశాన్ని బయటకు లాగాడు. సామాజికమైన ఆ అవగాహననే ఆయన 'ప్రతిభ' అన్నాడు. అది మానసికమని గుర్తించాడు. కాని పరిశోధన అంతా ససూర్ ప్రతిపాదించిన రెండవ అంశాన్ని ఆధారంగా జరిగిందే తప్ప మొదటిదాన్ని అనుసరించికాదు.

బ్లూం ఫీల్డుకు సమకాలికంగానే ఛార్లెస్ మోరిస్ ప్రవృత్తివాద దృష్ట్యా సంకేతాన్ని వక్త, శ్రోత, సందర్భం, ప్రయోజనం అనే అంశాల్ని ఆధారంగా వివరించడానికి ప్రయత్నిస్తూ సాహిత్య భాషను పూర్తిగా వదలి సంకేత సిద్ధాంతాన్ని చేసాడు. బ్లూంఫీల్డుకు ముందు సపీర్, మోరిస్ ముందు పేయర్స్ సంకేతాలను మానవ నిసర్గ వ్యాపారంగా, సామాజికమైన సంపదగా వ్యాఖ్యానించడానికి ప్రయత్నాలు చేసారు. ఏదిఏమైనా ససూర్ ప్రతిపాదనల్లోని మొదటి అంశం మాత్రం ఎక్కడా గణనలోనికి రాలేదు. స్థూలంగా నిర్మాణవాదం అన్న ఒక మార్గం ఏర్పడటానికి ససూర్ చేసిన రెండవ ప్రతిపాదనే కారణం. ఈ మార్గంలో దాదాపు 30 ఏళ్ళ నుంచి శ్రమిస్తున్న పరిశోధకుడు రొలాన్డ్‌బార్తెస్. బార్తెస్‌ను

అనుసరించి సంకేతానికి అర్థంలేదు. భావం మాత్రమే ఉంది. భావ గ్రహణ దశలు కొన్ని ఉన్నాయి. సంకేతం ఒక నిర్దిష్ట క్రియోజ నాన్ని ఆశించి ఒక నిర్ణీత మార్గంలో విన్యస్తమై ఆయా భావ దశల్ని వ్యక్తీకరించ గలుగుతుంది తప్ప ఈ సంకేతానికి ఇది అర్థ మన్న 'అభిజ్ఞ' ఇటు వక్తకు కాని అటు శ్రోతకు కాని ఇద్దరికీ లేనప్పుడు భాషా పరిశీలకుకు మాత్రం ఎందుకు? బార్తెస్ ఈ విధంగా ఆలోచించడానికి కారణం ఆయన సాహిత్యభాషను గురించి ఆలోచించడం.

ఫ్రాన్స్‌లో బార్తెస్ ప్రాతినిధ్యం వహిస్తున్న నిర్మాణ వాదమే కాకుండా మరొక యథాతథవాదం (ఫెనామెనలిజం) కూడా వుంది. ఈ వాదం ప్రకారం సంకేతం నిరాధారమూ నిర్హేతుకమూ కాదు. మానవుడికి భాషతో ఉన్న మానసిక భౌతిక సంబంధం నిర సించడానికి వీలులేదు. చేత, రాత, మాట ఈ మూడూ ఒకదానిని వదలి మరొకటి ఉండవు. అందుచేత శబ్దసంకేతం భావజనక సమర్థ మైనదని ఈ వాదం విశ్వసిస్తుంది. హుజర్ల్ అన్న యథాతథ చేయుడు భాషను వైయక్తిక దృష్టితో వ్యాఖ్యానించడానికి ప్రయత్నించాడు. ఈ దృష్ట్యా శబ్దసంకేతం భావానికి అభివ్యక్తీకృతి. ఇది సస్యూర్ ప్రతిపాదనలోని మొదటి అంశాన్ని తాకుతోంది. ఇక్కడ శ్రోతను గురించి కొన్ని నిర్దిష్టమైన అంచనాలు ఉన్నాయి. శ్రోతవక్తతో సమానమయిన మానసికనిర్మాణం కలవాడని భావజగత్తులోని ఈ అద్వైతం కారణంగా సంకేతం భావాన్ని సద్యస్ఫురితం చేయ కలుగుతోందని హుజర్ల్ వాద తాత్పర్యం.

## సంకేతవాద అశాస్త్రీయత - ఖండనలు

భాషాశాస్త్రం, సంకేతవాదం కుడిఎడమలుగా ఎదుగుతూ వచ్చినా సంకేతవాదంలోని అభౌతిక విషయ ప్రసక్తి వలన భాషా శాస్త్రానికి వచ్చిన శాస్త్రీయ మర్యాద దీనికి రాలేదు. జాక్స్ దెరిడా 1973 లో సస్యూర్ హుజర్ల్ ప్రతిపాదనలను పురస్కరించుకొని మొత్తం సెమియాటిక్ శాఖనే అశాస్త్రీయమని ఖండించడానికి ప్రయత్నించాడు. కల్లర్ కూడా కమ్యూనికేషన్, సిగ్నిఫికేషన్ ల మధ్యనున్న వైరుధ్యాన్ని గురించినా సెమియాటిక్స్ ఈ భావ వైరుధ్యంనుంచి ఎలాబయటపడగలుగుతుందా అన్న సంశయాన్ని వెలిబుచ్చాడు. జార్జ్ స్టెయినర్ లాంటి వాళ్ల సాహిత్యం ద్వారా అభి వ్యక్తమవుతున్న భావం సాహిత్యాన్ని మొత్తాన్ని సంకేతంగా భావిస్తూ అది పఠితలో కలిగించే భావవికల్పాల్ని, పొందే నూతన అనుభవాన్ని ఒక హెర్మెన్యూటిక్ పద్ధతిలో విశ్లేషిస్తున్నారు. ఈ రెంటిమధ్యా ఒక సమన్వయ రూపమయిన మార్గం ఒకటి కనిపెట్టా ల్సిన అవసరం ఉందని కల్లర్ అభిప్రాయపడుతున్నాడు. అంటే సెమియాటిక్స్ చెప్పాల్సింది సంకేతానికున్న అభిప్రాయసంధాన శక్తి గురించా, భావవ్యక్తీకరణను గురించా అన్నది ఇంతవరకూ తేలని సమస్య అన్నమాట.1

జాక్స్ దెరిడా సెమియాటిక్స్ లోని అభౌతికతత్వాన్ని నిర సించడం వరకూ బాగానే ఉంది. అంతమాత్రాన సెమియాటిక్స్ అశాస్త్రీయమని నిందించాల్సిన అవసరం లేదంటూ సిగ్నిఫికేషన్, కమ్యూనికేషన్ అన్న ఈ రెండు అంశాలు విరుద్ధాంశాలు కావని భాషా వ్యవహారమే ఈ రెండంశాల సమన్వయ రూపంగా ఉంటుం

1. భాషాశాస్త్ర సంప్రదాయాల్లో కూడా ఈ రెంటిమధ్య వైరుధ్యమున్నదనే అనిపిస్తుంది. ఎందుచేతనంటే బ్లూంఫీల్డు సంప్ర దాయం అర్థాన్ని గురించి అసలు పట్టించుకోవోగా అసలు భాషా శాస్త్రంలో అర్థానికిచోటే లేదనిగూడా తేల్చివేసింది. అప్పటినుంచీ ఇప్పటిదాకా ప్రసిద్ధమైన మార్గాలన్నీ భాషానిర్మాణ సూత్రీకరణకు ఇచ్చిన ప్రాధాన్యం అటు భాషకున్న అనుసంధాన గుణాన్ని గురించికానీ, ఇటు భావ వ్యక్తీకరణ గురించికానీ చూపటంలేదు. వెరసి భాషా శాస్త్రజ్ఞుడంటే మెకానిక్ లాగా కారులోని భాగా లన్నింటినీ వేటికవాటిని విప్పదీసి ఆయాభాగాల్ని వాటిలోని సమాన లక్షణాలద్వారా వర్గీకరించి ప్రదర్శిస్తాడన్న అభిప్రాయం ఒక్కటే స్థిరపడి పోయింది. ఇది సమగ్రమయిన అభిప్రాయం కాదు. భాషా శాస్త్రానికి ఒక్కో చారిత్రక దశలో భిన్నశాస్త్రాల సంపర్కంతో నేపథ్యంతో ఏర్పడ్డ స్వరూపమే తప్ప ఇదమిత్థమయిన నిర్వచనం ఏదీలేదు. ఏదీ ఉండదు. ఉండకూడదుకూడా. ఆధునికంగా భాషా శాస్త్ర సంప్రదాయాలకు పాదు సంపన్నమయిన ఒక దేశం కావటం వల్లో అక్కడకు వెళ్ళి చదువుకు రావటంవల్లో ఆ సంప్రదాయమే అత్యుత్తమమనిగాని అదే సమగ్రమనిగానిఏ భాషావిజ్ఞానీ విశ్వ సించడు. భాషకు సమగ్రమయిన వ్యాఖ్యానం చేయడమే ధ్యేయం. ఆ వ్యాఖ్యానం సాధించడంలో ఉన్న సంప్రదాయాల్ని కాదనడానికి కాని భిన్నసంప్రదాయాల్లోంచి ఎరువు తెచ్చుకోవడానికి కాని, మరో మార్గాన్నిత్రవ్వుకోడానికికాని వెనుకాడను. భాషమీదపరిశోధనఅంతా 'గుడ్డెద్దు చేల్లో పడ్డ చందమే'. అంతే తప్ప మనం ఒక మార్గాన్నీ, ధ్యేయాన్నీ ముందుగా నిర్ధారించుకొని దానికి అనుగుణంగా పట్టి నంతవరకే భాషను విశ్లేషించడం తక్కిన విషయాల్ని నాకు సంబంధించినవి కావనికాని, అవి అశాస్త్రీయాలనిగాని మడిగట్టు కోవటం శాస్త్రప్రగతికి సహకరించే పద్ధతికాదు. భాషాశాస్త్రంలో భాగంగా ఎదిగిన 'సెమాంటిక్స్' కన్నా 'సెమియాటిక్స్' వేరుపడు తున్నది 'సిగ్నిఫికేషన్' అన్న అంశంలో మాత్రమే. వివరాలకు చూ. (బ్రహ్మానంద(1981: అధ్యా. 1)

దని సంకేతానికున్న ద్విధాకృత వస్తుత(డ్యూయల్ అసెంబ్లీ) సంకేత ప్రథమ ధర్మాన్ని కార్ చెవ్‌స్కీని ఆధారంగా ప్రతిపాదించినవాడు పీటర్ స్టెయినర్ (1981). ఈ అవగాహన సంక్షిప్త వివరణం ఇది:

## కార్చెవ్‌స్కీ ప్రతిపాదనల సారాంశం

'భాషాసంకేతం' భావనివేదనకు అసంబద్ధరూపకల్పనం. దీనికి నిదర్శనం ఒకే శబ్దం అనేక వ్యాపారాల్ని కలిగివుండటం. ఒకే అర్థం భిన్నశబ్దాల ద్వారా చెప్పబడగలిగి వుండటం. ప్రతి భాషాశబ్దానికీ ఈ ద్విధాకృత స్థితి వుంది. ప్రతి పదమూ - వాక్యమూ - ఒక పర్యాయవాచకమే!' వాటి అర్థాలూ 'నానార్థా' లలో ఒకటి మాత్రమే. అంటే 'అర్థ' మనబడేది 'శబ్దం' తో సహజ నిసర్గ సంబంధం వున్నదికాదు. పర్యాయవాచకత × నానార్థకతల మధ్యగల స్పర్ధతో నిర్ధరింపబడుతున్న మానసికాంశమన్న మాట. ఒక ఉదాహరణ చూద్దాం.

తెలుగులో 'తేలు' అన్నమాట వుంది. దీనికి విశేష్యార్థం (ఇంగ్లీషులో) స్కార్పియన్, క్రియార్థం 'టు ఫ్లోట్' (తేలటం) 'తేల్చు' అన్నపుడు 'టు డిసయిడ్ (నిర్ణయించటం) అన్న నవ్యార్థ స్ఫూర్తి వుంది. [తేప్పు 'ఇరకట్' ∩ తేల్చు (రాయలసీమ) వ∩ల వ్యత్యయం].

చారిత్రిక పరిణామకారణాలవల్ల 'తేలు' - రెండు భిన్న మూల రూపాలనుంచీ ఏర్పడుతూ ఈనాడు రూపాభిన్నతను పొందింది. (తేళ్→తేళ్→తేలు. తేల్→తేలు). వ్యవహర్త అవగాహనలో ఈ రెండురూపాలు భాషాశక్తి (లింగ్విస్టిక్ పొటెన్షియల్) కి సంబంధించినవి అయిపోయాయి- 'పసలి మానులు' అని ప్రయోగించి - సాధించిన 'కవిత్వ ధర్మం' ఈ అంశంవల్లే భాషలో ఏర్పడుతోంది.

కాని భాష అంతటా ఇలాంటి వనాలే వుండవు. ఉదాహరణకి అద్దె. బాడుగ, కిరాయి అనే పర్యాయవాచకాలున్నాయి. వక్త వీటిలో మూటిని తెలిసివున్నా మూటినీ వాడడు. అంటే ఒక పర్యాయపదాన్ని వాడుతున్నాడు. వాడటం ద్వారా శ్రోతను ఒక సందిగ్ధంలో పడవేస్తున్నాడు. 'అద్దె' మాటను వాడాడు. 'బాడుగ' ఎందుకు వాడలేదు? అన్న మీమాంసకు మాత్రం సంబంధించింది కాదు ఆ సందిగ్ధత. 'అద్దె' అనే మాటద్వారా వక్త ఉద్దేశించిన భావాన్ని కనుక్కోవడానికి సంబంధించింది అది. దీన్ని 'విచికిత్స' అందాం. వక్తకు 'వివక్ష'; శ్రోతకు 'విచికిత్స' - ఈ రెండూ పర్యాయవాచకత, నానార్థకత అనే అంశాలకు సంబంధించిన మానసిక వ్యాపారాలు (మెంటల్ ట్రాన్స్‌యాక్షన్స్).

నిత్య వ్యవహారంలో వివక్షకు - విచికిత్సకు ఒకరకమైన సంబంధం ఉంది. అది శబ్ద సంకేతానికి అర్థనిర్ణయం చెయ్యడంలో బుద్ధికి సంబంధించిన మెలకువ- స్పృహాలక్షణం- పనిచేస్తూండటం వల్ల ఏర్పడేది. దీని ఫలితంగా ఏర్పడుతున్నదే 'కమ్యూనికేషన్'. ఒకఉదాహరణం చూద్దాం. వార్తాపత్రికలు చదువుతుంటాం. ఎవరైనా ఇది అర్థం కావడంలేదనికాని- ఏమిటో నానార్థాలతో చచ్చిపోతున్నామనికాని- ఎడిటర్ ఏమి చెప్పాడబ్బా! అనికాని ఆలోచిస్తూ కూర్చునే సమయం ఇవ్వకుండా జాగ్రత్త పడటమే పత్రికావిలేఖరి 'వివక్ష'. ఎంత అలంకారికంగా మాట్లాడినా-సామెతలు, జాతీయాలు వక్రోక్తులూ, ధ్వనులూ వాడినా- విషయాన్ని- వార్తను- బుద్ధికంగా అందించి పాఠకుడికి 'అభిప్రాయనివేదన' కల్గించడంకోసమే వార్తాపత్రిక ప్రయత్నిస్తుంది. ఈ లక్షణం నిత్య వ్యవహారంలో ప్రధానం కాబట్టి సాధారణంగా సంకేతం- ప్రసిద్ధమైన ఒక అర్థంలో స్థిరపడి సాక్షాత్కరించినట్టుగా ఉంటుంది.

నేను ఇంటికి వెళ్తున్నాను

సాయంత్రమయింది

మా ఆవిడ నాకోసం కాచుకూర్చునుంటుంది.

ఇవి మామూలుగా రోజూవాడేవాక్యాలే. కాని 'కవిత్వం'లో వీటిని వాడేటప్పటికి - ఇవి 'అభిప్రాయ నివేదన' కోసం కాకుండా 'భావవ్యంజకాలు' (సిగ్నిఫికేషన్)గా పనిచేస్తాయి. ఆ భావం వక్త్ర వివక్షకు సంబంధించింది. దానిఅభివ్యక్తి శ్రోతలో కల్గడానికిముందు జరిగేపని 'విచికిత్స'- నిత్య వ్యవహారంలోనూ కొన్ని సందర్భాల్లో ఈ సమస్య రావడం ఉంది. తిట్టుకోవడం (బూతు పదాలు వాడుకోవడం); స్నేహితులతో మాట్లాడే కల్లబొల్లి కబుర్లు; పెళ్ళాంతో కోసే కోతలు- ఈ సందర్భాల్లో (వివక్ష- విచికిత్స) 'కమ్యూనికేషన్' వుండదు. 'ఎక్స్‌ప్రెషన్' వుంటుంది. ఇక్కడ శబ్ద సంకేతం- తనకున్న బౌద్ధిక వ్యాపారాన్ని మాని హృదయ వ్యాపారం మొదలెడుతుంది. శబ్దం- చేష్టతో సమానత్వం పొందుతుంది. అభినయ మవుతుంది. పశు శిశు సంకేతాలతో సమానమౌతుంది. రచయిత వాడే ప్రతిమాటా ఒక పర్యాయ వాచకమే. దాన్ని మరెన్నో రీతుల్లో చెప్పడానికి వీలుందని భావం. కాని అలాగే వాడటంలో రచయిత 'దృష్టి' ఏమిటన్న విచికిత్స

మొదలై - పఠిత అర్థాల్ని తవ్వడం మొదలు పెడతాడు. పఠితకు రచనలోని ఏ వాక్యమైనా 'నిలువుటద్దం' కాదు. గాజు పట్టకం. రంగుల కళ్ళజోడు- ఇలా కావడం వల్లే రచనకు 'భావనీయక శక్తి వస్తోంది. ఆ శక్తివల్లే మాటలద్వారా రచయిత చెప్పలేని విషయం- పఠితకు 'అనుభవం' లోకి వస్తోంది. అది పదానికున్న అర్థాన్ని నిర్ధారించడంవల్ల రావడంలేదు. పదాన్ని హృదయధర్మి (సబ్లైమ్) తో భావించడంవల్ల వస్తోంది. నిత్య వ్యవహారంలో అర్థనిర్ణయం చేసుకొని మాట్లాడుతున్నామా! అనే సందేహం రావచ్చు. కాని 'వాచకాలలో' జాతి/ వ్యక్తి భేదాలున్నట్టుగానే 'వాచ్యం' లో కూడా ఉంది. రెండు మూడు వాచ్యార్థాలలో ఉన్న సామ్యాల్ని ఆధారంగా నిర్ధరిస్తున్నదే లక్ష్యార్థం- అంటే మనిషికి భేదాల మధ్య సామ్యాల్ని దర్శించే మానసికధర్మం వుందన్నమాట. సాహిత్య సృష్టి ఈ సామ్యదర్శనం వల్లనే జరుగుతోంది. పండు, అన్నం, మనిషి లాంటి జాతి వాచకాలు ఈ దర్శనంవల్లే ఏర్పడు న్నాయి. లేకపోతే మామిడి పండు కి ఒకపేరు, అరటి పండు కి మరోపేరు వచ్చివుండాలి. రాగిముద్దకో పేరు, జొన్నన్నానికి మరో పేరు వచ్చి వుండాలి. స్త్రీ పురుషులిద్దరినీ 'మనిషి' అని పిలవ డానికి అవకాశం లేకుండాలి. ('మనిషి' అంటే మనకి వెంటనే మగవాడు స్ఫురిస్తాడు. 'ఆడమనిషి' అనే వాడుకలో మాత్రమే ఆడ వాళ్ళు కూడా మనుష్యులుగా తెలిసేది. ఇలా ఒకో 'పదం' నియ మితమైన సాంఘిక చరిత్రను వ్యంజిస్తూ ఒకవైపు వ్యక్తి వాచకంగా; మరోవైపు జాతి వాచకంగా- రెండుగా ఉపయుక్త మవటంలోనే భాషా సంకేతానికున్న భావ వినిమయ; సమర్పణ శక్తులు రెండూ కలిసి వున్నాయని అర్థం చేసుకోవాలి.)

అంచేత వాచకత, వాచ్యత కార్చెవ్‌స్కీని అనుసరించి సంకేతానికున్న 'శాశ్వత విలువ' (పర్మనెంట్ వాల్యూ) కాదు. మానవుడి అంతశ్చేతనం సంకేత ఉపయోగంద్వారా ఏ దశలో భావవినిమయం/ ప్రకటన జరపాలని 'వివక్షి'స్తుందో; దానికి అనుగుణమైన 'విచికిత్స'ను రేకెత్తించే దానిగా 'సంకేతాన్ని' సృజిస్తుంది. అంచేత సంకేతాలు 'గోడలో ఇటుకల్లా' గా నిల కడగా వుండేవికావు. అవి శరీరంలో ప్రసరిస్తున్న రక్తకణాల్లాం టివి. రక్తకణాలు చలించకపోతే; ఆ చలనంలో భిన్నగతులు లేకపోతే భిన్నదైహిక మానసిక స్థితులు ఎలా వుండవో; సంకే తాలు కూడా నిశ్చలంగా వుంటే భిన్న దశల్లో వాచ్య; వాచక సంబంధాతిరిక్తంగా అవి ప్రవర్తించడానికి వీల్లేదు. కాని వాచ్య, వాచకత లేకుండా దానికి నిర్మాణం లేదు. అంచేత 'సంకేతం' స్థిరంగా ఉండునట్లు కనిపిస్తూ చలించే భూగోళంలాంటిది. సంకేతం వాచ్యతను కోల్పోకుండా మరికొన్ని పరిధుల్లో అర్థప్రసరణ శక్తిని కల్గివుంటుంది.

కార్చెవ్‌స్కీ ప్రకారం భావ/శబ్దాల మధ్య బింబ / ప్రతి బింబ భావంలేదు. శబ్దం గాజు అద్దం కాదు. అటున్నది ఇటు నీటుగా కన్పించడానికి. సంకేతసృష్టి వ్యక్తిగత చేతనలో జరగ్గా; అవగాహన సామాజిక చేతనలో జరుగుతోంది. ఈ రెంటి మధ్యా చెప్పలేనంత దూరంవుంది. ఏ వ్యవస్థలోనైనా మానవుడికి స్వయా ర్జితమైన అంతశ్చేతన సామ్రాజ్యం వుంది. అక్కడ వ్యక్తి 'సామాజిక జంతువు' మాత్రం కాడు. ఈ సామ్రాజ్యంలో సృజింపబడుతున్నది సంకేతం కాబట్టి; ఒకవైపు భావాభివ్యక్తినీ; కాని ఆ సంకేతోపయోగం సమాజంలో కాబట్టి భావ వినిమయ శక్తినీ - రెంటినీ కూడదీసుకుంటోంది.

అంచేత వక్త వాడే ఏ శబ్దరూపమైనా అది వ్యక్తివాచకంగా కాకుండా జాతివాచకంగా (అంటే ఒక పర్యాయవాచకంగా) వాడ బడుతోందన్నమాట. పదానికున్న ఈ జాతిలక్షణ స్పృహ సామా జిక చేతనా ధర్మం కాబట్టి పదాన్ని వినగానే మొదలయ్యే బౌద్ధిక విచికిత్స 'జాతి' నుంచి 'వ్యక్తి' ని నిర్ధరించు కొంటోందన్న మాట. కాని 'జాతిని' సామ్యదర్శనంతో పునస్సృష్టించు కోవడంలో మాత్రం పనిచేసేది 'హృదయ ధర్మి స్ఫురణ' తప్ప బౌద్ధిక విచికిత్స కాదంటాడు కార్చెవ్‌స్కీ. ఈ కారణంవల్లే సంకేతంలో ఈ రెండు లక్షణాలూ సహజీవనం చేస్తున్నాయి- అని ఆయన అభి ప్రాయం. గురువుగారిని ఒకవైపు అనుసరిస్తూ - మరోవైపు సవరించాడు.

కార్చెవ్‌స్కీ ప్రతిభ ఈ రెంటినీ సమన్వయించడంలో వుంది.

సంకేతానికున్న ఈ ద్విధాకృతి వ్యతిరేక విన్యాసానికి కొన్ని ఉదాహరణలు చూద్దాం.

'చెట్టు' అనే పదం వుంది. గుట్ట కానిది. పుట్ట కానిది, మొక్క కానిది, మాను కానిది అని 'నేతి' వాదానుసారంగా దీన్ని వ్యతిరేక ముఖంగా అర్థంచేసుకొంటున్నామా? లేక ఆ పదం వినగానే కలిగే అన్వయ రూపంగానా!

'చెట్టు' అనే రూపం చిత్రీకృతమై మనసులో ముద్రితమై 'వృక్షత్వ' భావరూపంగా ప్రతితెలుగువాడి అనుభవంలోనూవుంది. తెలుగు రాని వాడిగతి ఏమిటి? 'మర(ం)', పేడ్, ట్రీ, వృక్షః అనే రూపాలతోనైనా ఈ 'చిత్రం' ప్రతి వ్యవహర్త మనః ఫలకం పైనా వుంది. ఈ వృక్షత్వభావాన్నే ససూర్‌తోపాటు కార్ చెవ్‌స్కీ కూడా సంకేతానికున్న అన్వయరూప విన్యాసంగా గుర్తించింది. కాని ససూర్ ప్రకారం ఈ అన్వయం సామాజికంగా వ్యవహర్తలందరికీ ఉన్న వాజ్‌నిర్వహణ శక్తి 'లాంగ్' కి సంబంధించింది. నిత్యవ్యవహారంలో ఎన్నో సమస్యలున్నాయి. ప్రధానసమస్య ఎదుటివాడితో తన భావాన్ని వినిమయం చేసుకోవటం. ఈ వినిమయంలో సాయపడేది అన్వయరూపమైన భావాభివ్యక్తి కాదు – సంకేతగత 'విలక్షణత' – అది ఇతర సంకేతాలతో స్పర్థించుకోవటంవల్ల సిద్ధిస్తుంది.

'చెట్టు' 'పెట్టు' అనే రెండు మాటలు తెలుగులో వున్నాయి. మొదటి వర్ణాలు చకార పకారాలు. ఇవి ఒకదాని బదులు మరోటి వాడటంవల్లనే ఇద్దరు తెలుగు వ్యవహర్తలు ఇది చెట్టనీ అది పెట్టనీ గుర్తిస్తున్నారు – నిత్యవ్యవహార సహకారి సూత్రం ఈ 'విభేద' పరిగణనం మాత్రమేనని ససూర్ వాదం.

కార్‌చెవ్‌స్కీ ప్రకారం గురువుగారు సంకేతంలో నిబిడీకృతంగా ఉన్న పై రెండు ధర్మాల్ని సమన్వయించలేకపోయారు. కారణం చకార పకారాల్ని ఒకదాని బదులు మరోటి వాడటం వల్లే 'చెటు', 'పెటు'లు ఏర్పడటం లేదు. చకార పకారాలు ఈ రెంటి మధ్యా ఉన్న తేడాని చెప్పగలుగుతున్నాయి. వ్యవహర్త 'చెట్టు' అని అంటున్నప్పుడు 'పెట్టు' అనే మాటను కూడా వ్యతిరేకముఖంగానైనా ఉద్దేశించడంలేదు. 'చెట్టు' అనే మాటకు బదులు 'వృక్షత్వ' భావాన్ని చెప్పే మరోమాటను కూడా అనగలిగిన స్థితిలో వుంటూ 'చెట్టు' అనే అంటున్నాడు. ఇది వక్త్ర వివక్షకు సంబంధించింది. శ్రోత 'చెట్టు' పదం ద్వారా తనలో చిత్రితమైన వృక్షత్వభావాన్ని తోడి తెచ్చుకుంటున్నాడు – దీన్నే 'విచికిత్స' అన్నది. ఉదాహరణానికి

'చెట్టై[2] వంగనిది మానై వంగుతుందా!'

అన్నప్పుడు 'చెటు', 'మాను' లు పరిమాణద్యోతకాలైన 'భావ' రూపాలై పిల్ల పెద్ద అన్న మానవ విభాగంతో అన్వయరూపాన్ని పొంది 'సార్థకా' లవుతున్నాయి తప్ప చెట్టుకానివానితో; మాను కానిదానితో – వ్యతిరేకాన్వయం పొంది – అర్థవిభేదక శక్తివల్ల భిన్నంగా గుర్తింపబడటంచేతకాదు.

ఇంతేకాకుండా ఒక 'పదా' న్నే ఎప్పుడూ ఎవ్వరూ సృష్టించరు. రెండు పదాలు సృష్టిస్తారు. ఒకటి వ్యక్తి సంబంధి (ఇండివిడ్యువల్), రెండోది జాతి సంబంధి (క్లాస్). వక్త 'వ్యక్తి' ని ప్రయోగించినపుడు శ్రోత 'జాతి' ద్వారా 'వ్యక్తి' అర్థాన్ని నిర్ధరించుకొంటున్నాడు. ఇది 'సంకేతం' వ్యవహారాన్ని పొందేటప్పుడు కలిగే 'వ్యతిరేక విన్యాస' స్వరూపం. ఈ లక్షణం వల్లే ఒకవైపు భావ వినిమయాన్ని; మరోవైపు భావాభివ్యక్తినీ – సంకేతం ఒకేసారి సాధిస్తోంది – అని కార్చెవ్‌స్కీ ప్రతిపాదించాడు.

'సంకేతం' భాషా పదమే కానక్కరలేదు. భాషాపద ప్రయోజనంకూడా నిర్మాణ సౌష్ఠవంమాత్రంకాదు. ఈ సౌష్ఠవం చారిత్రక గతిలో మార్పును పొందకుండా స్థిరంగా వుండటమూ లేదు. సరిగ్గా ఈ సమస్యను పరిష్కరించడానికే ససూర్ 'చారిత్రక భాషా విజ్ఞానం' వేరుగా చూడదగినదని సూచించాడు. అంటే భాషలో ఎప్పటి కప్పుడు స్థిరత్వం+ మార్పు కలిసి వుంటాయని ససూర్ అంగీకరించలేదన్న మాట. ఇది చాలా అశాస్త్రీయ మార్గం. భాషలో కొత్త- పాత అన్నది లేదు. పదాన్ని ఉపయోగించడంవల్లనే భాష జీవిస్తోంది. అప్పుడే దానికి 'వ్యక్తి' త్వం వస్తోంది. రూపం సిద్ధిస్తోంది. 'సందర్భం- ప్రయోజనం- వక్త- శ్రోత' లు లేకుండా పదానికి స్వతంత్ర వ్యక్తిత్వం లేదు. ఇతర సంకేతాలు (చేష్టలు, గుర్తులు మొ॥) ఎలా 'సార్థ' కాలో అలాగే పద సంకేతం కూడా.

ఉదాహరణానికి ఈనాటి తెలుగుని చూద్దాం. ప్రయోజనాలకోసం మాత్రమే అచ్చతెలుగని; తెలుగులో దేశీయ (ద్రావిడాంశమనీ), అన్య దేశీయమని- విభాగించి ప్రదర్శిస్తున్నాం. కాని ఎలా జాతికి స్వచ్ఛత ఉండదో అలాగే. భాషకుకూడా ఎన్నో భాషాంశాలు కలిసి ఈనాటి తెలుగు 'ఇంగ్లీషు' స్థాయిలో రచనలు చేయడానికి అనుకూలమైన స్థితికి చేరుకుంది. కేవలం అచ్చతెలుగు మాట్లాడే వ్యవహర్త ఎవడూ దొరకడు. మరో భాషో, భాషా పదమో కావకుండా ప్రత్యక్ష అప్రత్యక్ష భావ ప్రభావమో- లేకుండా ఎప్పుడూ మాట్లాడడు. ఈ కారణంగానే కింది పదాలు ఒకదానికంటె మరొకటి గౌరవప్రదమని గుర్తిస్తాడు. (చూ. బ్రహ్మానంద - 1982 చి.)

| | | | | |
|---|---|---|---|---|
| 1. బువ్వ (కడి) | పెండ్లి | చూడ్డం | బాట | చాకలి గుంపు |
| 2. భోజనం | వివాహం | దర్శనం | రోడ్డు | రజక సంఘం |

2. మొక్కైక – అని మరికొన్ని ప్రాంతాల వ్యవహారం.

వ్యవహారంలో 1, 2 లు రెండూ వున్నాయి. సందర్భం బట్టి 'బువ్వ, కడి, అన్నం, బోజనం, భోజనం'అన్న పదాల్ని వ్యవహర్త వాడుతున్నాడు. ఈ పదాలన్నీ పర్యాయ పదాలే. కాని దేనికది విలక్షణ అర్థ ప్రసరణశక్తి కల్గింది. ఈ శక్తిలోనిభేదమే వ్యవహర్తల్ని వేరు చేస్తున్న అంశం. ఈ నాటి తెలుగులో 'భాగవతం' అనే వక్త అశిష్టుడని- 'భాగవతం' అనే వక్త శిష్టుడనీ పరిశోధకులు గుర్తిస్తున్నారు. కాని ఛావు, ఫెద్ద, ఢామ్మని, ఫెళ్ళని లాంటి ప్రయోగాలు శిష్టులకూ అశిష్టులకూ సమానమే. ఇక్కడ పై భేద పరిగణన సూత్రం ఎందుకు పని చెయ్యడంలేదు? తెలుగులో 'ఖర్మ' అనే మాటలో మహాప్రాణముంది. ('ఫేట్' అనే అర్థంలో) 'కర్మ' అనే మాటకూడావుంది (ఆబ్‌జెక్టివ్ అనే అర్థంలో)- ఇతరత్రా ఎక్కడా అల్పప్రాణ మహాప్రాణ భేదం అర్థ విభేదకం కాదు- ఇక్కడ అ ంది- అని ఎవరైనా అంటే అది తప్పు. మొదటి కారణం 'కర్మ' కు రూపాంతరం; అర్థాంతరం రెండూ ఏర్పడి 'ఖర్మ' అనే తెలుగువాడి ఉచ్చారణ, భావాభివ్యక్తిఏర్పడ్డాయి, క/ఖ లు ఏకస్థానవ్యాప్తివి, అర్థ భేదాన్ని సూచిస్తున్నా అవి ప్రత్యేక వర్ణాలు కావు. 'ఛావు' లోని మహాప్రాణమూ ప్రత్యేక వర్ణంకాదు. కాని 'నొక్కి' చెప్పడాన్ని సూచిస్తుంది. ఇది భావాభివ్యక్తి (సిగ్నిఫికేషన్; 'ఖర్మ' అన్నపుడేర్పడుతున్నది ప్రత్యేక పదంకాదు. 'కర్మ' కు ఒక పర్యాయపదం మాత్రమే. కాని అర్థ విశేషం వుంది. ఇది 'కర్మ' పదానికున్న జాత్యర్థం (కనొటేషన్) నుంచీ అవగతమవుతోంది. దీన్నే 'కాగ్నిషన్' అంటాం. అందుకే కర్మ - ఖర్మలు భావవినిమయ వాహికలుకూడా (కమ్యూనికేషన్).

సాహిత్య సృష్టిలో - అనుభవంలో కూడా ఈ రెండు ప్రయోజనాల్నీ సాహిత్య సంకేతం సాధిస్తోంది. కవి ఒక మాట వాడుతాడు.

'మాట్లాడని మల్లెమొగ్గ మాదిరిగా నడచిరా'

- (దాశరథి)

ఇక్కడ వాచ్యార్థం లేదంటారు విమర్శకులు. ఇంగ్లీషు విమర్శ కూడా చదువుకున్నవారు ఇందులో 'అనిర్వచనీయత' వుందంటారు. (చూ. చి. సుబ్బారావు - 1967). ఇక్కడ వున్న సంకేత వ్యాపారంలో కార్చెవ్‌స్కీ చెప్పే రెండు వ్యాపారాలూ ఎలా వుంటాయో పరిశీలిదాం.

తను మధ్యమ; శూన్యమధ్యమ అన్నపుడు ఎలా తను, శూన్య పదాలు మధ్యమ పరిమాణ వ్యంజకాలో; అలాగే 'మాట్లాడని మల్లెమొగ్గ' ఒకవైపు ఆమె మాటని గూర్చి; మరోవైపు ఆమె సౌందర్యాన్ని గూర్చి. ఒకేసారి చెబుతోంది. 'ఆమె బుంగమూతి పెట్టుకుని కూర్చుంది -' అనే భంగిమనూ తెలుపుతోంది. ఇంకా ఏమేమో! తెలపవచ్చు. ఇదంతా మనం చేసే ఊహా సర్కస్సులు.

దాశరథి దేన్నో ఉద్దేశించాడు. దాన్ని చెప్పడానికి ఒక మార్గం అలా అనటం (కమ్యూనికేషన్) ; ఆ పదాలు ఒకదానితో ఒకటి 'రాముడు అన్నం తిన్నాడు' లాగా కలిసి వుండటంలేదు. కాని ఒక భావాన్ని నిష్పన్నం చేస్తున్నాయి (సిగ్నిఫికేషన్); అది రియలిస్టు కవితయినా, సర్రియలిస్టు కవితయినా - ఈ రెండూ ఉంటాయి. ఈ రెంటిలోనూ మొదటిది లేకుంటే రచయిత చెప్ప దల్చుకున్న దానికి 'ఔట్‌లెట్' ఉండదు. రెండోది లేకపోతే మొదటిది అనుభవంలోకి రాదు. వక్త - ఎవరికి వారే - యమునాతీరంలో విహారం చెయ్యాల్సిందే.

కాబట్టి సాహిత్యమంతా ఇలా 'ఏమో' చెప్పడం, 'ఏదో' అర్థం కావడమూ - అయితే ఈ కావ్యంలో ఇదే చెప్పబడదని విశ్వనాథ లాగా ఒకడు ఎలా చెప్పగలుగుతున్నాడు? ఒక వెయ్యేళ్ళ క్రితం రాసిన పుస్తకం ఈనాడు ఎలా అర్థమవుతోంది? ఒక భాషనుంచి మరో భాషలోకి ఎలాఅనువదిస్తున్నాం?

గురజాడ శ్రీశ్రీకి మాత్రమే ఎందుకర్థమయ్యాడు? ఇద్దరికీ వస్తుతత్త్వావగాహనలో సామ్యాలు ఉండటంవల్ల - అన్నది ఒక్కటే సమాధానం. (వివరాలకు చూ. బ్రహ్మానంద 1982 ఎ.) అంటే (సాహిత్య) భాష ఒక 'అవగాహన' మన్నమాట. ఒక వాక్యంలో పదాలు ఒకదానితో ఒకటి కలసి స్పర్ధించుకొని - తాత్పర్యంగా ఒక భావాన్ని అందిస్తాయన్న మాట. ఆ భావం ఆ పదాలలో దేనిలోనూ సంపూర్ణంగా ఉండకపోవచ్చన్నమాట.

అంటే ఆ భావాన్ని సూచించడానికి ఆ వాక్యంలో వాడబడ్డ వన్నీ పర్యాయవాచకాలు కాకపోతే భావావిష్కరణకు మరో మార్గం లేదు. దీన్ని తిరగేసి చెబితే ప్రతిపదమూ స్వతంత్రంగా ఒక అర్థాన్ని (విభేదకశక్తివల్ల) ; అస్వతంత్రంగా ఒక భావాన్ని (అభివ్యక్తివల్ల) చెబుతుందని సారాంశం. ఆనందవర్ధనుడు ధ్వని సిద్ధాంతంగా ఈ అంశాన్నే ప్రతిపాదించింది. కల్లర్, బార్తెస్ మొదలైన వాళ్ళు ఈనాడు గుర్తిస్తున్నదీ ఈ అంశాన్నే.

కార్చెవ్‌స్కీ ప్రతిభ భాషాసంకేత ధర్మంగా ఈ వ్యతిరేక అన్వయ విన్యాసాన్ని గుర్తించడంలో వుంది. 'ధ్వని' వాగ్వ్యాపారమన్న ఆనందవర్ధనుడు కూడా ఒక కార్చెవ్‌స్కీ వంటివాడే.3

'సెమియాటిక్స్' అన్న విభాగాన్ని ఇంకా సమగ్రం చెయ్యడానికి; మన భాషా స్వరూపావగాహన విస్తరించుకోవడానికి కార్చెవ్‌స్కీ ప్రతిపాదనని పట్టుగొమ్మగా వాడుకోవచ్చు.

3. వివరాలకు చూ. బ్రహ్మానంద(1981. ఎ. అధ్యాయం 2) భారతీయ ఆలంకారికుల్లో కుంతకుడికి ఒక ప్రత్యేక స్థానం వుంది. ఆనందవర్ధనుడి వాచ్య /వ్యంగ్య భేదపరిగణనం అశాస్త్రీయమనీ 'స్పంద' మార్గానుగామిగా కుంతకుడు భావించాడు. ఆ దృష్టితో 'భావం', 'వాచకం', 'వాచ్యం' అన్న మూడు అంశాలు మాత్రమే వుంటాయి. 'వాచకం' అంటే 'శబ్దం', 'వాచ్యం' అంటే అర్థం. సరిగ్గా కార్చెవ్‌స్కీ లాగే 'శబ్ద' మంటే ఏమిటో కుంతకుడు ఇలా చెబుతున్నాడు :

'శబ్దో వివక్షితార్థైక వాచకోఽన్యేషు సత్స్వపి'

(వక్రోక్తిజీవితం 1-9)

ఇతర శబ్దాలు (పర్యాయవాచకాలని పీటినే మనం అన్నది) ఉన్నా వివక్షితమైన అర్థాన్ని ప్రతిపాదించే ఏకైకమైన శబ్దాన్నే 'వాచకం' అంటాం - అని అర్థం. అర్థవిషయం ఇక్కడ ప్రస్తావించడం లేదు. కాబట్టి వివక్షిత/అవివక్షిత - అనే భేదపరిగణనం అనవసరమని కుంతకుడి ఆలోచన. (కుంతకుడి మీద పరిచయానికి చూ. బ్రహ్మానంద 1981. అధ్యా. 2. పుటలు 172-177.)


## ప ఠ నీ య వా ఙ్మ య ం

1. బ్రహ్మానంద, హెచ్. ఎస్. 'వ్యంజన సూత్రము' అక్షర ప్రసార పరిచురణ (1981)
2. — 'తెలుగు సాహిత్య విమర్శః పాశ్చాత్య ప్రభావం' (అము) (1982 ఎ)
3. — 'భాషలో ప్రతిబింబన ధర్మం' స్రవంతి అక్టోబరు సంచిక (1982 బి)
4. స్టెయినర్, పీటర్ 'ఎ డిఫెన్స్ అఫ్ సెమియాటిక్స్ — ది డ్యూయల్ అసెమిట్రీ అఫ్ కల్చరల్ సైన్స్', న్యూ లిటరరీ హిస్టరీ (లో) 12 - 3 పు. 415-436 (1981) [కార్చెవ్‌స్కీ (1929) ఫ్రెంచి భాషలో రాసిన వ్యాసాన్ని ఆధారంగా పీటర్ స్టెయినర్ ప్రతిపాదించిన విషయాల్ని ఈ వ్యాసం చర్చించింది. పాఠకులు స్టెయినర్ వ్యాసంలో వివరాలు చూసుకోవచ్చు.]
5. ససూర్, ఫర్డినాండ్ డి. 'కోర్స్ ఇన్ జనరల్ లింగ్విస్టిక్స్' (ఫ్రెంచినుంచి అనువాదం) వాడ్‌బాస్కిన్) న్యూయార్క్ (1959).
6. సుబ్బారావు, చిరుమామిళ్ళ 'కవిత్వంలో అనిర్వచనీయత', తిరుపతి సాహిత్య సమితి వ్యాసావళిలో (1967).


[ఈ వ్యాస రచయిత ఆంధ్రపత్రిక ఉగాది సంచిక (1978, 79, 80, 81) ల లోనూ, భారతి ఏప్రిల్ (1982) లోనూ, 'వ్యంజన సూత్ర ఖండనం' అన్న వ్యాసం (ముద్రణలో; భారతిలో) లోనూ చర్చించిన, చర్చిస్తున్న విషయాలకి ఈ వ్యాసం కంటిన్యుయేషన్ కాబట్టి పాఠకులు ఆ వ్యాసాలతో కలిపి దీన్ని చూసుకోవాలి. ఈ వ్యాసాల్లో వాడబడుతున్న పరిభాషకు ఒక కొత్త నిఘంటువును తయారు చేసుకోవాల్సిన అవసరమూ కనిపిస్తోంది. ఆ ప్రయత్నమూ జరుగుతోంది.]

# చె

## శ్రీ సోమసుంద

పూవులు పెళ్ళి చేసుకొంటున్నాయి -
వస్తారా చూసొద్దాం!

ఆరామ వాటికల ఆనందనిలయాలలో
తపోవనాల కళ్యాణ వేదికలలో
పూవులు పెళ్ళిచేసుకొంటున్నాయని
ఎంత సరదా ? ఎంతసంబరం ? !

గుచ్ఛాలేతప్ప కులాలులేని పూవులు-
స్తబకాలేతప్ప మతాలెరుగని పూవులు-
మాధుర్యమేతప్ప మదమత్సరాలెరుగని పూవులు-
మంచితనాలకు మారుపేర్లు!

ఈ ఉగాది వేకువనే-
ఈ సుహాస సదస్సునే-
సందడిగా పెళ్ళిచేసుకుంటున్నాయి పూవులు
వసారా చూసొద్దాం!

ఆమని కోమలగాంధర్వం పూరించింది
అవని శ్యామలవసనం ధరించింది
మలలూ పొలాలూ ప్రతిరుతించాయి....
కాననాలూ కాసారాలూ ప్రతిచలించాయి!

ప్రతికొత్త కెరటమూ
ఒక కొత్త పేరుతో-
ప్రతి కొత్త ప్రసవమూ
ఒక కొత్త శోభతో,

ఈ ప్రభాతానిల శ్రవణాల నూదింది-
నవ జీవనానంద మంత్రాక్షరాలు....

సెలయేటి తటాలు
నిలువుకాళ్ళ నిలచాయి....
పంటకాలువ గట్లు
ఊటికాడల పూలబూరా లూదాయి...

చెరువు నడిబొడ్డులో నిలచి
జలక్రీడలాడుతున్న కలువలూ తామరలూ
మోమెత్తి పరకాయించిచూసి
గట్టునున్న మావికొమ్మ కొంమెచూపులకు
సిగ్గుపడి మొగం చాటుచేసుకుంటున్నాయి!

నిరంతరశ్రమ జీవనులు మధుపాలు
కషనిషుర జీవితం గడచిపోయిందనీ-
ఇకపై శ్రమఫలితంగా పుష్కలంగా మధువు
లభిస్తుందనీ ఒక్కటే రొదగా ఝుంకరిస్తున్నాయి !

తలిరాకు జొంపాల పరదాలు తొలగించుకొని
అప్పుడేవచ్చింది అసూర్యంపశ్య కోకిలభామ!

తానుమంగళగీతం వినిపించనిదే
పూవులపెళ్ళి ఎలా జరుగుతుందని-
ఆమె కెంత గర్వం ? ఎంత స్వాతిశయం ?

ఇంకేముంది ? మిత్తినెత్తి మొత్తింది
అనుకున్న పలాశం ఎర్రని చీరలతో
ముస్తాబై పచ్చల పళ్ళెరంలో
పసుపూకుంకుమా రవికలగుడ్డా తగవుతెస్తోంది!

పలాశం ఠీవిగా నడిచివస్తూంటే
చుప్పనాతి ఈత తుప్పలు సైతం
దారితప్పుకొని ప్రక్కల కొత్తిగిలుతున్నాయి!

చైత్రరథాన్ని లాగిలాగి
ఎత్తు కొండ లెక్కలేక ఎక్కలేక
ఆయాసంతో రొప్పుతున్నాయి చిలుకతేజీలు!

నల్లగా దర్జాగా నిలచిన తాళవృక్షాలు
తలలవంటి గెలలు భుజాలకెత్తుకొని
కోరచూపులు చూస్తున్న యమకింకరులు!
తోటనంతా ధిక్కరించి చేస్తున్నాయి ఎగతాళి....

అదేమిటీ....ఆ కొండవార - తుప్పల్లో ?!
ముళ్ళే ఎర్రగా పూసినట్లు -
ఏమిటా నెత్తుటి మడుగులు ?
ఏ త్యాగధనుల ఆత్మార్పణ లొలికించిన సుడులు ?
కుసుమోద్వాహ శుభవేళ ఎందుకా రక్తకళ్యాణం ?

ఎక్కడపెళ్ళిపందిరి ? అసలెక్కడ ఎక్కడ ?
అనుకుంటూ తొందరగా దిక్కులు వెదుకుతూన్న
దారి తెలియని వెర్రినాగమ్మలకు
తన పొడుగాటి బారుచేతులు చాపి -
కొబ్బరిచెట్టు
పక్కనేఉన్న వేపగుబురు చూపుతోంది!

అప్పుడు ప్రారంభమైంది
వివాహ వైభోగం!
విందులూ పసందులూ అంతటా కోలాహలం!
పూవులపెళ్ళి! జరుగుతోంది—
వస్తారా చూసివద్దాం.....!



# గుండెకు అండ

## డాక్టర్ దాశరథి

నా గుండెకు
　　నేనే అండను;
నా ఆత్మకు
　　నేనే కైదండను

వర్షా నదిలా పొంగను
　　ఇసుక మేటులా క్రుంగను
ఎలాటి నియంతకైనా
　　ఎలాటి హంతకైనా లొంగను

అదృష్టమే ఆగ్రహించినా
ఆ ప్రళయమే ఆవరించినా
　　రవ్వంత చలించను
　　నవ్వుతూ యెదుర్కొంటాను

కష్టాలను ఇష్టపడతాను
నమ్మిన సిద్ధాంతం కోసం నష్టపడతాను
　　కాలమహాప్రవాహంలో కేళీ విలాసంగా
　　లీలా విహారం చేస్తుంటాను

కలంలో బలం వున్నన్నాళ్ళు
　　కవితలు వ్రాస్తూవుంటాను
గళంలో బలం వున్నన్నాళ్ళు
　　కవితలు వినిపిస్తుంటాను.

డా॥ సి. వి. రామచంద్రరావు

# రాయవాచక రచనా కాలము దాని చారిత్రత

I

**ముందు మాటలు**

విజయనగర సామ్రాజ్య చరిత్రకు సంబంధించి అతి ముఖ్యమైన సారస్వతాధారము రాయవాచకము. ఇది ప్రత్యేకించి సాహితీ సమరాంగణ సార్వభౌముడు, అప్రతిహత చక్రుడు అయిన శ్రీకృష్ణదేవరాయల జీవిత విశేషాలను, పరిపాలనా విశేషాలను, అన్నిటికన్న మించి అతని దిగ్విజయాలను గూర్చి అమూల్యమైన,

రాయ వాచకం తెలుగు భాషలో, అందునా వ్యావహారిక భాషలో, వెలువడిన మొదటి వచన కావ్యాలలో ఒకటి. అందుచే దానికి చారిత్రకాధారంగానే కాక, ఆంధ్ర వచన వాఙ్మయంలో ఒక విశిష్టస్థానం ఉంది. ఒక సాహిత్య వేత్తనుడివినట్లు, 'దేశ చరిత్రకు వలెనె తెలుగు వచన చరిత్రకున్ను అది ముఖ్యమయిన గ్రంథము.'[2]

రాయ వాచకానికి రెండు తాటాకు ప్రతులు పుదుక్కోటలో లభించాయి. కీ. శే. జయంతి రామయ్య పంతులుగారు వీనిని

విజయనగర రాయలను గూర్చి అనేక విలువైన విషయాలు తెలుపునది కాబట్టి 'రాయవాచక' మని దీనికి సార్థక నామధేయము. ఈ విషయాన్ని రాయవాచక రచయిత, గ్రంథం మొదట్లో రెండు పద్యాల్లో క్లుప్తంగా ఇలా చెప్పాడు:[1]

విజయనగర వృత్తాంతము
సుజనులచే విన్నయట్టి సూనృతవాక్కుల్
ప్రజలకుఁ దేటపడంగా
సృజియించితిఁ గృష్ణరాయశేఖరు చరితల్.

విజయనగర జనపాలుడు
విజయపురి గోలకొండ వీరుల తోడన్
గజపతి నాజిగెలిచిన
విజయుండౌ కృష్ణరాయ వీరుని చరితల్.

నిర్ణయించుటమైనది. భాష తఱుచుగా విరుద్ధమయినను చరిత్రాంశముతే ప్రధానముచేసియు దక్షిణదేశము నందానాడు వ్యాపించియున్న వ్యావహారికాంధ్రభాషా స్వరూపము లోకమునకుం దెలియుట మంచిదనియు వాక్యరచన మున్నది ఉన్నట్లే ప్రకటించుచున్నాము. శీఘ్రముగానే యీ గ్రంథము టిప్పణముతో పుస్తకరూపముగ ప్రకటించదలచినారము." [3] రామయ్య పంతులుగారు రాయవాచకాన్ని ప్రకటించిన నాటినుండి అది విజయనగర సామ్రాజ్య చరిత్రకారుల దృష్టి నాకర్షించి, అందులోని చారిత్రక విషయాలు చర్చలోనికి తెచ్చుట జరిగింది. ఈ వ్యాసం ఉద్దేశం రాయవాచకంలో విజయనగర చరిత్రకు సంబంధించిన అనేక విషయాలను ముఖ్యంగా శ్రీకృష్ణదేవరాయల దిగ్విజయాలకు సంబంధించిన విషయాలను చర్చకు తేవడంకాదు; అది పెద్ద గ్రంథమవుతుంది. ఈ వ్యాసం రాయవాచక రచనాకాల నిర్ణయానికి, చారిత్రకాధారంగా దానికి గల విలువను నిగ్గుదేల్చుటకు పరిమితమయింది.

## II

### రచయిత - రచనాకాలము

రాయవాచక రచయిత తనను 'శ్రీ మన్మహామండలేశ్వర కాశీవిశ్వనాథ నాయనయ్య వారి స్థానాపతి' నని పదవిచే తెల్పు కొన్నాడుగాని తన పేరును తెల్పలేదు.[4] విజయనగర సామ్రాజ్య కాలంలో విజయనగర రాయల సామంతులు, అమర నాయకులు రాజధానీ నగరమైన విజయనగర మందలి రాజకీయ వృత్తాంతాలను ఎప్పటికప్పుడు తమకు చేరవేయడానికి, తమకు చక్రవర్తులకు మధ్య రాజకీయ లావాదేవీలు కొనసాగించడానికి తమ స్థానాపతులను విజయనగర మందుంచెడివారు. ఇట్లే ఒక రాజ్యమువారు తమ ఇరుగు పొరుగు రాజ్యాలలో ఇట్టి స్థానాపతులను నియమించెడి రాజకీయ ఆచారముండెడిది. గజపతిరాజ్యంలో కర్నాటకంవారి స్థానాపతి కమలనాథయ్యను,[5] పరస్పరంగా ఉన్న తదితర రాజ్యాల రాజ్యాధిపతుల, అమర నాయకుల స్థానాపతులను రాయవాచకం పేర్కొంటుంది.[6] కాశీవిశ్వనాథ నాయనయ్యవారి తరపున విజయ నగరంలోఉన్న స్థానాపతి ('పొలిటికల్ ఏజంట్') పంపిన విన్నపం లేక 'రిపోర్ట్' యీ రాయవాచకం.

రాయవాచకంలో 'కాశీ విశ్వనాథ నాయనయ్యవారి స్థానా పతి భక్తి పరాధీనుండు సద్వినయ భయ భక్తులనున్ను శాయంగల విన్నపం' అని చెప్పి ఉండడం[7] చేత 'భక్తి పరాధీను' డనేది యీ స్థానాపతిపేరా అని ప్రశ్నించుకోవచ్చు ; షష్టీతత్పురుషంలో ఉన్న ఇట్టి పేరు అరుదైనది; వింతైనది. ఒకవేళ ఉండినదనుకొన్నా సమకాలిక సారస్వతంలో, శాసనాలలో తటస్థపడదు. అందుచే మనం ప్రస్తుతానికి రాయ వాచక రచయితను విశ్వనాథ నాయకుని స్థానాపతి అని పదవీపరంగానే చెప్పుకోవలసి ఉంటుంది. దీనినిబట్టి ఈ విశ్వనాథ నాయకుడెవడో అతని కాలమేదో నిర్ణయించ గలిగితే రాయవాచక రచనాకాలం నిర్ణయించడం సాధ్యమవుతుంది.

విజయనగర చరిత్రలో సుప్రసిద్ధుడైన విశ్వనాథనాయకు డొకడున్నాడు. ఇతడు కొటికం నాగమనాయని పుత్రుడు. శ్రీకృష్ణ దేవరాయల (క్రీ. శ. 1509 - 1530) చివరి ఏండ్లలో తంజావూరు పాలకుడైన వీరశేఖరచోళుడు మధురరాజ్యంపై దండెత్తి అచట రాయల సామంతుడుగ మధురను పాలిస్తున్న చంద్రశేఖర పాండ్యుని పారదోలగా, పాండ్యుడు తన రాజ్యాన్ని తనకు దక్కించవలసిం దని రాయలతో మొరపెట్టుకొన్నాడు. వీరశేఖరచోళుని దండించి పాండ్యునికి రాజ్యమిప్పించవలసినదని రాయలు నాగమనాయకుని ఆదేశించి సైన్యాలతో పంపాడు. నాగమనాయకుడు చోళుని తరిమి మధురరాజ్యాన్ని ఆక్రమించి ఆ రాజ్యాన్ని రాయల ఆదేశం ప్రకారం పాండ్యున కప్పగించక, అధికారాన్ని హస్తగతం చేసు కొని రాయల కెదురు తిరిగాడు. రాయలు నిండు సభలో ఈ తిరుగుబాటు దారును శిక్షించగల సమర్థుడు లేడా అని ప్రశ్నించగా, విశ్వనాథనాయకుడు తానున్నానని ప్రకటించుకొని రాయల అనుమతితో తన తండ్రిపై దండెత్తి అతనిని బంధించి తెచ్చి రాయల సమక్షంలో ఉంచాడు. రాయలు విశ్వనాథనాయకుని అనన్య సామాన్య స్వామిభక్తికి మెచ్చి, నాగమనాయకుని క్షమించి, విశ్వ నాథనాయకుని, మధురరాజధానిగా, పాండ్యచోళ రాజ్యాలకు అధి పతిని చేసినాడు. ఈ వృత్తాంతం మనకు 'తంజావూరు ఆంధ్ర రాజుల చరిత్ర' లో కనబడుతుంది.[8] 'కర్ణాట కొటికం రాజుల కైఫీయతు' ప్రకారం అచ్యుతరాయలకాలంలో విశ్వనాథనాయకుడు మధుర రాజ్యానికి పట్టాభిషిక్తుడైనట్లు తెలుస్తుంది.[9]

పై వృత్తాంతాల ప్రకారం విశ్వనాథనాయకుడు శ్రీకృష్ణ దేవరాయల చివరికాలంలోనో లేక అచ్యుతదేవరాయల కాలం (1530 - 1542) లోనో మధుర రాజ్యానికి పట్టభద్రుడై, మధుర నాయక రాజ్యస్థాపకుడును, మధుర నాయక రాజులకు మూలపురుష డును అయినాడు. విశ్వనాథనాయకుడు క్రీ. శ. 1563 వరకు జీవించి వుంటినట్లు తెలుస్తుంది; శాసనాలను బట్టి అతడు క్రీ. శ. 1560 వరకు పదవిలో ఉన్నట్లు తెలుస్తుంది. పై వృత్తాంతాలలోని విశ్వ నాథనాయకుడిని, రాయవాచకం పేర్కొన్న కాశీవిశ్వనాథనాయ నయ్యను ఒకరుగానే ఊహించి, గుర్తించి, ఆసూరి రంగస్వామి సరస్వతి[10], యస్. కృష్ణస్వామి అయ్యంగార్ [11], జయంతి రామయ్యపంతులు[12], అరుణకుమారి[13] మొదలుగా కొందరు చరిత్ర కారులు, రాయవాచకాన్ని విశ్వనాథనాయకుని స్థానాపతి పదునారవ శతాబ్ది పూర్వార్ధంలో, కృష్ణదేవరాయల చివరి ఏండ్లలోనూ, అచ్యుతరాయలకాలం (క్రీ. శ. 1530 - 1542) లోనో వ్రాసి ఉండ వచ్చునని అభిప్రాయపడ్డారు. కొందరు రాయవాచకం 16 వ శతాబ్ది ఉత్తరార్ధంలో, విశ్వనాథనాయకుని కాలం (క్రీ. శ. 1529- 1564) లో వ్రాసిందని భావించారు.[14]

విజయనగరచరిత్ర చతురాననులైన వెంకటరమణయ్యగారు మొదట్లో పై అభిప్రాయాన్నే కలిగి ఉండినారు.[15] కాని తరువాత

ఈ విషయంలో విశేష పరిశోధనగావించి, పై అభిప్రాయంతో విభేదించారు. సమకాలిక రచనలు, శాసనాలు, సారస్వతము, కైఫియతులు ఆధారంగా, విశ్వనాథనాయకుడు కృష్ణదేవరాయల కాలంలో అడపం (తాంబూలకరండ వాహకుడు)గా మాత్రమే ఉండినవాడని, అచ్యుతరాయల కాలంలో అతడు కొంతకాలం (క్రీ. శ. 1530-42) అతడు సామంత రాజోచితమైన మహామండలేశ్వరాది బిరుదములు లేక తనను అచ్యుతరాయల 'ఊడిగము' (సేవకుడు) గ మాత్రమే చెప్పుకొన్నవాడని, అటుతర్వాత అమర నాయకుడుగ మాత్రమే ఉండినాడని, మధుర నాయక రాజ్యము కృష్ణదేవరాయల కాలమున గాని, అచ్యుతదేవరాయల కాలమునగాని, విశ్వనాథ నాయకుడు స్థాపించలేదని, అది రాక్షస-తంగడి లేక తళ్లికోట యుద్ధము (క్రీ.శ. 1565) తర్వాత, సదాశివరాయల కాలం (క్రీ. శ. 1542-1576) లో అప్పటి అల్లకల్లోల పరిస్థితులు అదునుగా తీసుకొని అప్పటివరకు అమరనాయకుడుగా ఉన్న విశ్వనాథనాయకుని కుమారుడు కృష్ణప్ప (క్రీ. శ. 1561-1570) స్థాపించినాడని వెంకట రమణయ్యగారు నిర్ధారించారు[16]. అంతేకాక, రాయవాచకంలో పేర్కొన్న 'కాశీ విశ్వనాథనాయనయ్య' మధురనాయక రాజ్యస్థాపకుడుగా తలచబడే నాగమనాయకుని పుత్రుడు విశ్వనాథనాయకుడు కాదని నిరూపించి, రాయవాచక గ్రంథకర్త "మదుర రాజ్యస్థాపకుడైన విశ్వనాథనాయకుని యొక్క స్థానాపతియుగాడు, పదునారవ శతాబ్దము నందీ గ్రంథము వ్రాయబడనులేదని తీర్మానించారు.[17]

వెంకటరమణయ్యగారు చెప్పినట్లు, నాగమనాయకుని కుమారుడు విశ్వనాథనాయకుడు మధుర నాయక రాజ్యస్థాపకుడు కాకపోగా, రాయవాచక మందలి అంతఃస్సాక్ష్యం కూడా అది విశ్వనాథనాయకుని కాలంలో, అనగా క్రీ.శ. 1560 లకు ముందు వ్రాయబడినట్లు తెలుపదు. రాయవాచకంలో క్రీ. శ. 1560 కి తర్వాత ఉండి ప్రసిద్ధికెక్కిన చారిత్రక వ్యక్తుల, సంఘటనల ప్రసక్తి అధికంగానే ఉంది. రాయవాచక రచనాకాలానికి సంబంధించి ఈ అంతః స్సాక్ష్యంవల్ల తెలియవచ్చే చారిత్రక వ్యక్తులను, సంఘటనలను కొన్నిటిని వెంకటరమణయ్యగారు తెలిపిఉన్నారు; వారు తెలిపినవిగాక నేనుగా గమనించిన విషయాలు కొన్ని కలవు. ఈ గ్రంథరచనాకాలానికి సంబంధించి వెంకటరమణయ్యగారు తెలిపిన విషయాలను కొంత విపులీకరించిన్నీ, నేనుగా గమనించినవానిని ఈ క్రింద పొందుపరుస్తున్నాను. కాని ఈ అంతఃస్సాక్ష్యమంతా రాయవాచకం ఫలానిసంవత్సరాల మధ్య వ్రాసి ఉండవచ్చునని చెప్పడానికి తోడ్పడుతుందే కాని, ఖచ్చితంగా రచనాకాలాన్ని గుర్తించడానికి వీలుగాలేదు. శ్రీకృష్ణదేవరాయల (క్రీ. శ. 1509-1530) తర్వాతి కాలానికి సంబంధించి రాయవాచకం పేర్కొన్న సన్నివేశాలను, వ్యక్తులను, ఈ క్రింద, వీలైనంతవరకు వాని కాల క్రమంలో పొందు పరుస్తున్నాను.

(1) మొదటగా రాయవాచకం ఫలానాకాలానికి ముందుగా రచించినదని చెప్పడానికి గట్టి అధారముంది. ఈ రాయవాచకం ఆధారంగా కుమార ధూర్జటి 'కృష్ణరాయవిజయ' మనే పద్య కావ్యాన్ని, ఆర్వీటి చిన వెంకటపతి కోరికపై రచించి, శ్రీరాముని కంకితమిచ్చాడు. ఈ చిన వెంకటపతిని క్రీ. శ. 1630-1642 లో కర్ణాటసామ్రాజ్యాన్ని పాలించిన ముమ్మడి వెంకటపతిదేవరాయల తమ్ముడు చిన వెంకటపతిగా గుర్తించి, వెంకట రమణయ్యగారు, ఈ కాలం (క్రీ. శ. 1630 - 1642) నాటికి "రాయవాచకము రచియింప బడియుండెనని నిశ్చయముగ జెప్పవచ్చును" అని అన్నారు[18]. కాని ఈ చిన వెంకటపతిని గుర్తించుటలో వెంకట రమణయ్యగారు పొరపాటు పడ్డారు. ఈ చిన వెంకటపతి, ముమ్మడి వెంకటపతి దేవరాయల తమ్ముడయిన చిన వెంకటపతికి పసుమనైన ఆర్వీటి కోదండరామరాజు రెండవకుమారుడు. అనగా క్రీ. శ. 1630 - 42 తర్వాత రెండు తరాలుదాటి ఉన్నవాడు. అందుచే 'కృష్ణరాయ విజయం' క్రీ. శ. 1675 తర్వాత వ్రాసినదై ఉండాలి [19]. ఇది రాయవాచానికి పద్యానుకృతి కాబట్టి, రాయవాచకం క్రీ. శ. 1675 లకు ముందు వ్రాయబడి ప్రాచుర్యాన్ని పొందినట్లు చెప్పవచ్చును.

(2) రాయవాచక కర్త అందలి విషయాలు తాను నేరుగా చూచి వ్రాసినవిగాక, ఇతరులనుండి విని వ్రాసినట్లు, అవతారికా పద్యాలలో మొదటిదానిలో 'విజయనగరవృత్తాంతము సుజనులచే విన్నయట్టు సూనృతవాక్కుల్' అని సూచించి ఉన్నాడు. రాయవాచకం శ్రీకృష్ణదేవరాయల అన్న వీరనరసింహరాయల (1504-1509) దినచర్యను గూర్చి, శ్రీకృష్ణదేవరాయల దిగ్విజయ విశేషాలను గూర్చి తెలుపుతుంది. రాయవాచకకర్త వారి కాలంలో విజయనగరంలో ఉన్నవాడుకాకపోవుటచే అటుతర్వాతి కాలంలో తాను ఇతరులవల్ల విన్న విషయాలను వ్రాయడం జరిగింది. అందుచేతనే కాలవ్యతిరిక్తమయిన సన్నివేశాలను, వ్యక్తులను, విషయాలను రాయవాచకంలో చేర్చడం జరిగింది.

(3) రాయవాచకకర్త, రాయవాచకంలో సంకుసాలనృసింహకవి విరచిత 'కవికర్ణ రసాయనం' నుండి రెండుపద్యాలను ఉద్ధరించాడు[20]. సాహిత్యచరిత్రకారులు 'కవికర్ణ రసాయనము'

శ్రీకృష్ణదేవరాయల అనంతరము (క్రీ. శ. 1540) జరిగిన రచనగా అభిప్రాయపడ్డారు.

(4) శ్రీకృష్ణదేవరాయల ప్రత్యర్థి అయి అతని కాలంలో ఉన్న గజపతి వంశపాలకుడు ప్రతాపరుద్రగజపతి (క్రీ. శ. 1497 - 1538). కాని రాయవాచకం శ్రీకృష్ణదేవరాయల సమకాలికుండుగా బాహుబలేంద్ర ముకుందగజపతిని పేర్కొంటుంది. తెలుగువాడయిన ఈ బాహుబలేంద్ర ముకుంద గజపతి క్రీ. శ. 1560 నుండి క్రీ. శ. 1568 వరకు కళింగోత్కలాలను పరిపాలించాడు.21 అందుచే రాయవాచకం క్రీ. శ. 1568 తర్వాతనే వ్రాసి ఉండాలి.

(5) విద్యారణ్యులు విజయనగరస్థాపనకు "శాలివాహన శకాబ్దములు లెక్క ౧౧౨౭ యేండ్లు వెయ్యింనూట యిరువై ఏడేండ్ల మీద చెల్లే ప్రభవ నామసంవత్సరం చైత్ర శుద్ధ పౌర్ణమి స్థిరవారం శుభయోగ శుభకరణములు గూడిన శుభముహూర్తమందు ముహూర్తం జేసి, కృష్ణపక్షం అమావాస్యనాటి రాత్రి, ఓశిసమయమందు శంకుస్థాపనం" చేసినట్లు రాయవాచకం తెలుపుతుంది.22 అంతేగాక, వీరనరసింహరాయల కాలంనాటికి ఇరవైతొమ్మిది మంది రాజులు మున్నూరేండ్లు పాలించారని జరిగిపోయిన కాలాన్ని చెప్పి, భవిష్యత్తులో "ఇంక అరువై యేండ్లు పట్టణమున్ను సింహాసనమున్ను నిలిచియుంటును" అని కూడా చెప్తుంది.23 ఇక్కడ చెప్పిన ప్రభవనామసంవత్సర చైత్ర శుద్ధ పౌర్ణమి స్థిరవారానికి సరిఅయిన శాలివాహన శకసంవత్సరం 1129; 1127 అని చెప్పటం పొరపాటు. దీనికి సరిఅయిన క్రీస్తుశకకాలము 1207 మార్చి 15 గురువారం.24 చైత్రకృష్ణ అమావాస్యకు సరిఅయిన క్రీస్తుశకకాలం 1207 మార్చి 30 శుక్రవారం.25

కాని ఇచట కాలనిర్ణయానికి రాయవాచక కర్త చెప్పిన శాలివాహన శకం 1127 నే లెక్కలోనికి తీసుకోవటం సరిఅయినదిగా కనబడుతుంది. ఈ శకసంవత్సరానికి సరిఅయిన క్రీస్తువత్సరం 1127+78=1205. అదారభ్యం వీరనరసింహరాయల కాలంనాటికి మూన్నూరేండ్లు అయినట్లు రాయవాచకం చెప్తుంది. అనగా క్రీ. శ. 1205+300=క్రీ. శ. 1505. ఇది సరిగా కృష్ణదేవరాయల ముందు పాలించిన అతని అన్న వీరనరసింహరాయలు పట్టాభిషిక్తుడైన కాలానికి సరిపోతున్నది. అటుతర్వాత అరవై ఏండ్లు అనగా క్రీస్తుశకం 1505+60=క్రీ. శ. 1565 వరకు పట్టణమున్ను, సింహాసనమున్ను నిలిచిఉంటాయని రాయవాచకం భవిష్యత్తును చెప్పింది. ఇది రక్షస - తంగడి యుద్ధం జరిగి విజయనగరం విధ్వంసమయిన సంవత్సరం. రాయవాచకంలో ఈ విషయం భవిష్యత్తును గూర్చి చెప్పినట్లు ఉండినా, యథార్థానికి ఈ రాక్షస - తంగడి యుద్ధం (క్రీ. శ. 1565) తర్వాతనే రాయవాచకం వ్రాయడం జరిగిందని మనం అనుకోవాలి. చరిత్రలో జరిగిపోయిన విషయాలను ఇట్టి భవిష్యపురాణాలుగా చెప్పడం మనకు సంప్రదాయమే.

విజయనగరస్థాపన జరిగింది. క్రీ. శ. 1336 లో అని చరిత్రకారులు ఏకగ్రీవంగా అంగీకరించిన విషయం. రాయవాచకం 130 ఏండ్ల తేడాతో విజయనగరకాలాన్ని తప్పుగా చెప్పినా, అప్పటినుండి వీరనరసింహరాయల కాలానికి (క్రీ. శ. 1505-1509), అటు తరువాత విజయనగర విధ్వంసకాలానికి (క్రీ. శ. 1565), రాయవాచక కర్త చెప్పిన కాలం లెక్కింపు సరిపోతున్నది.

(6) రాయవాచక కర్త క్రీస్తుశకం పదహారవ శతాబ్దపు పూర్వార్ధంలో రచించిన ఏకామ్రనాధుని 'ప్రతాపచరిత్ర'26 చూచినట్లు, రాయవాచకంలో చెప్పిన "ఢిల్లీలోనున్న ప్రతాపరుద్రుని వృత్తాంతము"27 సూచిస్తుంది. అల్లే, పదహారవ శతాబ్దపు మధ్యకాలంలో రచించినట్లు భావింపబడిన 'సభాపతివచనము'28 నుండి రాయవాచక కర్త చాలా విషయము ఉద్ధృత మొనర్చెను.29

(7) రాయవాచకంలో రాయలవారు వేగర్లను పంపించిన పట్టణాల జాబితాలో మైసూరు, చెన్నపట్లం చెప్పబడినాయి.30 అల్లే బాగానగరం లేక భాగ్యనగరాన్ని కూడా రాయవాచకం పేర్కొంటుంది.31 ఈ పట్టణాల నిర్మాణకాలాలు రాయవాచక రచనాకాలాన్ని నిర్ణయించడానికి ఉపకరిస్తాయి.

క్రీ. శ. 1571 లో కాని మైసూరు పట్టణం ఏర్పడలేదని చరిత్రకారుల అభిప్రాయం.32

ఇచట పేర్కొన్న చెన్నపట్టం కర్ణాటకంలోని చెన్నపట్టణం. విజయనగర దళపతి, సామంతుడు అయిన రాజా ఇమ్మడి జగదేవరాయడు దీనికి క్రీ. శ. 1580 లో కోట ఏర్పరచి, తనకు రాజధానిగా చేసుకొని పాలించినాడని చరిత్రకారుల అభిప్రాయం.33

బాగానగరం లేక భాగ్యనగరం నేది హైదరాబాదుకు మరొక పేరు. దీనిని గోల్కొండ సుల్తానైన మహమ్మద్ కులీకుతుబ్‌షా (క్రీ. శ. 1580 - 1612) క్రీ. శ. 1591 లో నిర్మించాడని చరిత్రకారుల నిర్ణయం.34

(8) రాయవాచకం శ్రీకృష్ణదేవరాయలవారి సామంతుల, అమరనాయకుల, దళపతుల పేర్లను మనకు తెలిపింది. వీరందరు చారిత్రిక వ్యక్తులే. వీరిలో రాజాజగదేవుడు, పట్ల అనంతరాజు, వెలిగోటి యాచమనాయకు, సాళువ మేకరాజు, చెవ్వప్పనాయడు

కృష్ణప్పనాయడు, అయ్యనమలక పేర్కొనబడినారు.35 కాని వీరు కృష్ణదేవరాయలకాలంలో చారిత్రిక ప్రసిద్ధివహించినవారుకారు; కృష్ణదేవరాయలనాటి శాసనాలలోకాని, సమకాలిక సారస్వతంలో కాని వీరిపేరు వినపడదు. అచ్యుతరాయల కాలం (1530-1542)లో కూడా వీరు చారిత్రిక ప్రసిద్ధి వహించలేదు. సదాశివరాయలకాలం క్రీ. శ. 1542 - 1576) లో, రక్షస - తంగడి యుద్ధానంతరం, క్రీ. శ. 1570 మొదలు విజయనగరసామ్రాజ్యాన్ని పాలించిన అరవీటి వంశపాలకుల కాలంలో, వీరు రాజకీయ ప్రాముఖ్యం వహించడం, వీరి పేర్లు సమకాలిక శాసనాలలో, సారస్వతంలో కనపడడం జరిగాయి.

పైన పేర్కొన్న వారి చరిత్రను కొంత ఇచట క్లుప్తంగా చెప్పడం అవసరం.

రాజాజగదేవుడు కర్ణాటకరాష్ట్రి సందలి చెన్నపట్టణపాలకు డయిన ఇమ్మడి జగదేవుడు. ఇతడు ఈ చెన్నపట్టణానికి క్రీ. శ. 1580 లో కోట కట్టించి, దానిని రాజధానిగా పాలించాడని పైన చెప్పిఉన్నాము. ఇతడు అళియరామరాయల కాలమాదిగా విజయ నగరరాజులను పట్టభద్రులను చేయుటలో ప్రముఖపాత్ర వహించి నట్లు పొన్నతోట ఓబళకవి ఇతని కంకితమిచ్చిన వామనపురాణం పీఠికలోని ఈ క్రింది పద్యం తెలుపుతుంది.

> అళియరామాఖనీశుఁ దిమ్మలనృపాల
> వరుల శ్రీరంగరాయల సరసుఁడైన
> వీరవెంకటరాయని వెలయరాయ
> పట్టభద్రులఁజేసె నప్పార్థివుండు.

ఇతడు రెండవ వెంకటపతి దేవరాయల కాలం (క్రీ. శ. 1586-1614) లో, అధికారానికై అప్పుడు ఉన్న అంతఃకలహాలలో, తిరుగుబాట్లలో, వెంకటపతిదేవరాయల పక్షం వహించి అతనిని సింహాసనంపై నిలబెట్టినవాడు.36

మల్ల అనంతరాజు సాహిత్యవేత్తలకు 'కకుత్స్థ విజయ' కార్యకర్తగా తెలుసు. ఇతడు పై చెప్పిన జగదేవరాయనితోపాటు, రెండవవెంకటపతి దేవరాయల కాలంలో ఏర్పడిన తిరుగుబాట్లనణచి, యవనదాడుల నెదిరించి ఆ రాయలకు సింహాసనమున నెలకడ గలి గించినవాడు. 'కళాపూర్ణోదయ' కృతిపతి నందేల కృష్ణమరాజు తిరుగుబాటు నణచి రాయలకు మిన్నమిక్కిలి సహాయపడినవాడు.37 క్రీ. శ. 1606 (శా. శ. 1527 గత విశ్వావసు సంవత్సరం) నాటిది, సీసమాలికలో, అనంత భూపాలుని సిద్ధవట శాసనం ఒకటి లభించింది.38 ఈ శాసనం "వీర వెంకటరాయ విభుండు ఇంద్ర గిరీంద్ర సీమ సామ్రాజ్యంబు సేయుచుండ" అని రెండవ వెంకటపతిదేవరాయలను పేర్కొని, అనంత భూపాలుని, "విబుధ కకుత్స్థలి విజయ ప్రబంధాది కావ్య నిబంధన గ్రంథకర్త" "అఖిలకర్ణాట సింహాసనాధీశ్వర దక్షిణ బాహాభిధానధారి" అని వర్ణించింది అతని ఇతర ఘనకార్యాలను పేర్కొన్నది.

వెలుగోటి యాచమనాయడు కస్తూరి రంగప్పనాయని పుత్రుడు. ఇతనికే పెద్ద యాచమనాయడని, యాచ భూపుడని పేర్లు. ఇతడు క్రీ. శ. 1601 - 1602 ప్రాంతంలో తమిళ దేశంలోని తిరుగుబాట్ల నణచి రెండవ వెంకటపతి దేవరాయల నుండి పెరుంబేడు (చెంగల్పట్టు, మదురాంతకం తాలుకాలు) ను అమరంగా పొందినవాడు. రెండవ వెంకటపతి తర్వాత నాలుగు సంవత్సరాలు మాత్రమే పాలించిన శ్రీ రంగరాయల (క్రీ. శ. 1614 - 1619) ప్రత్యర్థుల నెదిరించి, అతనిని సింహాసనముపై కుదురుపరచవలెనని తీవ్ర ప్రయత్నము చేసినవాడు. శ్రీ రంగ రాయల తర్వాత రామదేవరాయల (క్రీ. శ. 1619 - 1639) ను విజయనగర సింహాసనమున నిలుపు ప్రయత్నంలో సుప్రసిద్ధ మయిన తోపూరు యుద్ధం (క్రీ. శ. 1617)లో గొబ్బూరు జగ్గ

రాయాది ప్రత్యర్థుల నెదిర్చి జయించినవాడు. ఈ యాచమనాయని వీరోచిత కృత్యాలు వెలుగోటివారి వంశావళిలోను, అనేక కైఫియత్తులలోను, చాటువులలోను వర్ణింపబడినాయి.39

సాళువ మాకరాజు రెండవ వెంకటపతి కాలంలో, రెండవ శ్రీ రంగరాయల కాలం (1614 - 1619)లో ఉండి వారి ప్రత్యర్థి వర్గంలో చేరినవాడు. ఈ సాళువ మాకరాజు తండ్రి అయిన సాళువ తిమ్మరాజుకే చదలువాడ మల్లన కవి తన 'విప్రనారాయణ చరిత్ర' నంకితమిచ్చాడు. పై చెప్పిన తోపూరు యుద్ధంలో మాకరాజు గొబ్బూరి జగ్గరాయని పైపు పోరాడాడు.40

చెవ్వప్పనాయడు తంజావూరు నాయక రాజుల మూల పురుషుడయిన చెవ్వప్ప నాయకుడు (క్రీ. శ. 1535-1580) అయి ఉండవచ్చు. ఇతడు అచ్యుత దేవరాయల దేవియైన తిరుమలాంబ (?) చెల్లెలు మూర్తాంబ భర్త. కొటికం విశ్వనాథ నాయకుని సమకాలికుడు. ఇతడు క్రీ. శ. 1580 వరకు జీవించి ఉండినా, ఇతని పరిపాలన క్రీ. శ. 1572 కు పరిమితమయింది.41

కృష్ణప్పనాయడు విశ్వనాథనాయకుని పుత్రుడై ఉండవచ్చు. ఇతడే మధుర నాయకరాజ్య స్థాపకుడని వెంకట రమణయ్యగారి అభిప్రాయమును పైన చెప్పిఉంటిమి విశ్వనాథుని పుత్రుడైన ఈ కృష్ణప్పనాయకుడు గాక, సదాశివ రాయల కాలంలో అడపం బయ్యప్పనాయకుని పుత్రుడు మరొక కృష్ణప్ప నాయకుడు కానవస్తాడు. ఇతడు హసన దేశాన్ని అమరనాయకంగా పాలించాడు. క్రీ. శ. 1562, 1563 నాటివి కర్ణాటక శాసనాలు మూడు ఇతనిని పేర్కొంటాయి.42

అయ్యన మలుక సదాశివరాయల కాలంలో దుమ్మె సీమను అమరంగా పాలిస్తున్నట్టు క్రీ. శ. 1562 నాటి ఒక కర్ణాటక శాసనం చెప్తుంది. ఈ శాసనంలో ఇతడు అయ్యన మలుక వొడెయరు అని పిలువబడ్డాడు.43

పైన కనుపరచిన వ్యక్తులు, సన్నివేశములు రాయవాచకము ఖచ్చితముగా క్రీ. శ. 1575 కు పూర్వము వ్రాసినది కాదని సూచించును. రాయ వాచకమందలి బాగా నగర లేక భాగ్య నగర ప్రసక్తి అది ఆ నగర నిర్మాణము (క్రీ. శ. 1591) తర్వాతనే వ్రాసి ఉండవలెనని సూచిస్తుంది. పోగా,

9) రాయ వాచకము పైన కనపరచిన చారిత్రిక వ్యక్తులతో పాటు కొటికం విశ్వనాథ నాయకుని కూడా కృష్ణరాయల దళ నాయకులలో ఒకడిగా పేర్కొనింది.44 ఇతనిని మహామండలేశ్వరుడనిగాని, మధుర రాజ్య పాలకుడనిగాని రాయ వాచకము ఎక్కడా చెప్పలేదు. రాయ వాచకమును రచించిన 'మహా మండలేశ్వర కాశీ విశ్వనాథనాయని స్థానాపతి' ఈ 'దళనాయకు' డయిన విశ్వనాథనాయని స్థానాపతి. కాడనుటకు, ఈ విశ్వనాథ నాయకులు వేర్వేరు వ్యక్తులనుటకు ఇది బలవత్తరమైన సాక్ష్యము. ఇక

10) రాయ వాచకము పేర్కొనిన ఈ మహామండలేశ్వర విశ్వనాథ నాయనయ్య ఎవ్వరనునది విచారణీయము. మధుర నాయక రాజులలో వారి మూలపురుషుడుగా ఎంచబడే నాగమ నాయని పుత్రుడు విశ్వనాథ నాయకుడు గాక మరి ఒక విశ్వనాథ నాకుయడు ఉన్నాడు. ఇతడు క్రీ. శ. 1595 మొదలు 1602 వరకు మధురను పాలించిన రెండవ కృష్ణప్ప తమ్ముడు. ఇతడు తన అన్నతో కలిసి రాజ్యము పాలించినాడని చరిత్రకారుల అభిప్రాయము. రాయవాచక రచయిత అయిన స్థానాపతి, 'విస్సప్ప' అనబడే ఈ విశ్వనాథ నాయకుని స్థానాపతి అయి ఉండవలె.

పై ఉపపత్తులన్నీ రాయవాచక కర్త రెండవ వెంకటపతి దేవ మహా యయల కాలం (క్రీ. శ. 1586-1614) లోనో, అటు తర్వాతనో ఉన్నవాడని సూచిస్తాయి. కాని ఇతడు మహా మండలేశ్వర విశ్వనాథ నాయనయ్యవారి స్థానపతి అగుటచే, ఈ విశ్వనాథ నాయనయ్యను రెండవ వెంకటపతి దేవరాయల కాలం (క్రీ.శ. 1586-1614)లోనే ఉండి, క్రీ.శ 1595 మొదలు 1602 వరకు మధురను తన అన్నతోపాటు కలసి పాలించిన రెండవ కృష్ణప్ప తమ్ముడు విశ్వనాథ నాయకునిగా గుర్తించవలసి వస్తుంది. అందుచే రాయ వాచకాన్ని క్రీశ. 1592, 1602ల మధ్య ఎప్పుడో వ్రాసి ఉండవలె. ఇది తరువాత జన బహుళ్యంలో బాగా ప్రచారంలోకి వచ్చి ఉంటుంది. అందుచేతనే, సుమారు యాభై ఏండ్ల తర్వాత ఉండిన కుమార ధూర్జటి, అర్వీటి కోదండరామ రాజు రెండవ కొడుకైన చిన వెంకటపతి ఆదేశంమీద రాయ వాచకాన్ని 'కృష్ణరాయ విజయ'మనే పేర పద్యకృతిగా మలచడం జరిగింది. ప్రస్తుతానికి రాయ వాచకం క్రీ. శ. 1592, 1602ల మధ్య వ్రాసినట్లే నిర్ణయింపవలసి ఉన్నది. ఇంతకన్నా సూక్ష్మంగా రచనా కాలాన్ని నిర్ణయించడానికి ఆధారాలు లేవు.

కాలనిర్ణయానికి సంబంధించిన ఈ చర్చను ముగించేముందు ఒక అనుమానాన్ని పాఠకులముందు ఉంచాలి. రాయవాచక కర్త రెండవ వెంకటపతి (1586 - 1614) కాలంలోనే ఉన్నవాడయితే, రాయవాచకంలో, రెండవ వెంకటపతి కాలంలోనే రాజకీయ ప్రాముఖ్యాన్ని వహించిఉన్న మట్ల అనంతరాజు, రాణా జగదేవు

మొదలైన ప్రసిద్ధ వ్యక్తులు కృష్ణదేవరాయల ఆస్థానంలో ఉన్నవారుగా ఏలచెప్పవలసివచ్చింది? దీనికి ప్రస్తుతంలో సరియైన సమాధానంలేదు. బహుశా తనకాలంలో రాజకీయ ప్రాముఖ్యం వహించిన ఈ వ్యక్తులు, కృష్ణదేవరాయల కాలంనాటికి రాజకీయ ప్రాముఖ్యం వహించకపోయినా ఆ నాటికి వయసు తక్కువవారై ఉన్నవారే కాబట్టి, వారిని రాయలవారి ఒడ్డోలగంలో సభ్యులుగా పేర్కొనుట వారికి గౌరవప్రదముగా రాయవాచక కర్త భావించి ఉండవచ్చును. రాయవాచక కర్త, పై అనుమానంమీద, రెండవ వెంకటపతి కాలం తర్వాత ఉండిన వాడని చెప్పడానికి, అతడు విశ్వనాథ నాయనయ్యవారి స్థానాపతి అనే విషయం అడ్డుతగులు తుంది.

## III

## రాయవాచకము - చారిత్రకాధారము

రాయవాచకం చరిత్ర కారులకు బంగారు గని. విజయనగర చరిత్రకారులకు, అందును ప్రత్యేకముగ సాహితీ సమరాంగణ సార్వభౌముడయిన శ్రీ కృష్ణదేవరాయల చరిత్రపై కృషిచేయు వారికి ఇది అమూల్యమైన మౌలికాధారము. చారిత్రకాధారంగా దీని విలువను చరిత్రకారులనేకులు గుర్తించారు. కాని త్రవ్వి విజయనగర చరిత్రలో బంగారు పంట పండించినవారు, విజయనగర చరిత్రలో అర్ధశతాబ్దమునకు మించి అవిరళ కృషి గావించిన డాక్టర్ నేలటూరు వెంకట రమణయ్యగారు. విజయ నగర చరిత్రకు సంబంధించి, కృష్ణ రాయల పరిపాలనా కాలానికి ప్రత్యేకించి, రాయ వాచకంలోని అనేకానేక విషయాలను, ముఖ్యంగా ఆనాటి పరిపాలనా యంత్రాంగానికి, కృష్ణరాయల దిగ్విజయాలకు సంబంధించిన విశేషాలను, సమకాలిక సార స్వతంలో, శాసనాలలో చెప్పిన విషయాలతో, విదేశీయుల రచనలతో సమన్వయించి, తైపారులేసి, దానిలోని గుణ, దోష నిరూపణచేసి, దానినిగ్గు తేల్చిన మనీషి వెంకట రమణయ్యగారు.45 వెంకట రమణయ్యగారు విశేష కృషి సలిపి ఉన్నప్పటికి, రాయ వాచకంలోని చారిత్రక విషయాలకు ఆంగ్ల, ఆంధ్ర భాషలలో సమగ్ర వ్యాఖ్యానాన్ని సంతరించి ప్రకటించ వలసిన అవసరం ఎంతైనా ఉంది; కాని అది ప్రత్యేకమయిన విపుల గ్రంథం అవుతుంది; దానికిది చోటు కాదు.

చారిత్రకాధారంగా రాయ వాచకానికి గల ప్రాముఖ్యాన్ని గూర్చి పండితులు వెలిబుచ్చిన అభిప్రాయాలను కొన్నింటిని ఇచ్చట చెప్పడం అవసరం. విజయనగర చరిత్రకు గల మౌలిక సారస్వతాధారాల సంకలనమయిన 'సోర్సెస్ ఆఫ్ విజయనగర్ హిస్టరీ' 1919 లో ప్రచురింపబడింది. దాని ఆంగ్ల ఉపోద్ఘాతంలో, సంకలనకర్త రంగస్వామి సరస్వతి ఇట్లా వ్రాశాడు: "ది హిదర్ టు నాట్ వెల్ ఎక్స్‌ప్లాయిటెడ్ 'కృష్ణరాయ విజయమ్' అండ్ ది 'రాయవాచకమ్' త్రో మచ్ లైట్ అపాన్ ది యాక్చ్యువల్ కోర్స్ ఆఫ్ కృష్ణరాయాస్ క్యాంపైన్ ఎగెన్స్ట్ ఒరిస్సా."46 1933 లో ఆంధ్ర సాహిత్య పరిషత్తు (కాకినాడ) వారు తమ 33వ ప్రచురణగా రాయ వాచకాన్ని పుస్తక రూపంలో ప్రచురించారు. దాని 'ఫోర్‌వర్డ్' లో యస్. కృష్ణస్వామి అయ్యంగార్: "ఇట్ సెర్టెన్లీ ఈస్ వర్త్ పబ్లికేషన్ యాస్ ఎ వర్క్ ఆఫ్ హిస్టారికల్ క్యారెక్టర్ బేరింగ్ అపాన్ ది రెయిన్ ఆఫ్ ది గ్రేట్ విజయ నగర్ ఎంపరర్ కృష్ణరాయ .."47 దాని 'ఇంట్రడక్షన్' లో జయంతి రామయ్య పంతులుగారు: "దిస్ క్రానికల్ .. ఈస్ నౌ రిపబ్లిష్ ఇన్ బుక్ ఫామ్ ఫర్ ది యూస్ ఆఫ్ దోస్ యెంగేజ్‌డ్ ఇన్ హిస్టారికల్ రిసెర్చ్ ఇన్ సమ్ పార్ట్స్, ఇట్ రిసీవ్స్ రిమార్కబల్ కన్ఫర్మేషన్ ఫ్రం ది అకౌంట్స్ ఆఫ్ ది పోర్చుగీస్ రైటర్స్ పెయస్ అండ్ న్యూనిజ్ .. గివ్స్ యాన్ ఇన్ సైట్ ఇన్టు ది డైలీ రొటీన్ ఆఫ్ లైఫ్ విచ్ ది కింగ్స్ ఇన్ దోస్ డేస్ వెర్ ఎక్స్పెక్టెడ్ టు లివ్ అండ్ విచ్ దె ప్రాబబ్లీ లివ్‌డ్"48 అని దాని ప్రాముఖ్యాన్ని వివరించినారు. "రాయ వాచకము, చారిత్రక విషయముల పట్టిక (క్రానికల్) అగుటచే వర్ణనలేమియులేవు. కవి కేవలము చారిత్రకాంశములను వరుస క్రమమున చెప్పెను .... పెక్కు చారిత్రక విషయములను క్రమముగ తెల్పుటచే విజయనగర చరిత్ర తెలిసికొనగోరు చరిత్ర కారులకిది మిక్కిలి తోడ్పడును .... వచన చారిత్రక గ్రంథమగు 'రాయవాచకము', ఛందోబద్ధమగు చారిత్రక కావ్యమగు 'కృష్ణరాయ విజయము' కృష్ణదేవరాయల చరిత్రను ఆంధ్రులకు అందచేయు అపూర్వ గ్రంథములు" అని అరుణకుమారిగారు చెప్పినారు.49 'ఆంధ్ర వచన వాఙ్మయ' సిద్ధాంత వ్యాసకర్తలైన కులశేఖరరావు గారు ఇట్లు చెప్పినారు: "చారిత్ర వచనైక గ్రంథములందు రాయ వాచకమొకటి. ఇదివరకు వెలువడిన చారిత్రక గ్రంథములగు ప్రతాప చరిత్ర, సిద్ధేశ్వర చరిత్రములకన్న నిది విశిష్టమైనది ఇందలి చారిత్రక విశేషములు, మరికొంత యథార్థములుగ నుండు

టయే దీనికి కారణము.... ఇట్లే గ్రంథకర్త వ్రాసిన విశేషములు ప్రతాప చరిత్ర కన్నను, చరిత్రకు సన్నిహితముగానున్న వనుట సమంజసము ...జరిగిన సన్నివేశముల పైన, చారిత్రికాంశములమీద నీతని దృష్టి యుండుటచే, భాష, శైలి మున్నగువాని నీతడంత శ్రద్ధగా పాటించి యుండలేదు. అందుచేత వ్యావహారిక ప్రయోగము లిందున్నవి. సాహిత్యకమైన ప్రాధాన్యము నాతడు పాటించియుండక పోవుటకూడ నీ కర్తకు చరిత్ర పైగల యభినివేశమును స్పష్టపరచుచున్నది"50

రాయవాచక మందలి విషయాలను, విజయనగర చరిత్రకు సంబంధించి తాను వ్రాసిన గ్రంథాలలో అతి విస్తారముగా ఉపయోగించుకొన్న నేలటూరు వెంకటరమణయ్యగారు, "వాటెవర్ బి ది డేట్ ఆఫ్ ఇట్స్ కంపోజిషన్, ఇట్ స్టాండ్స్ ది టెస్ట్ ఆఫ్ ఫ్యాక్ట్స్ రిమార్కబ్లీ వెల్. ది జెన్యైన్‌నెస్ ఆఫ్ ది వేరియస్ ఐటమ్స్ ఆఫ్ ఇన్‌ఫార్మేషన్ విచ్ ఇట్ సప్లైస్ క్యాన్ బి ప్రూవ్డ్ బై ఎ కంప్యారిజన్ విత్ ది ఇన్‌స్క్రిప్షన్స్ అండ్ ది పోర్చుగీస్ రికార్డ్స్" అన్నారు.51 కాని వేరొకచోట వెంకట రమణయ్యగారు ఈ క్రింది అభిప్రాయమును వెలిబుచ్చినారు." రాయవాచక మంతటి విశ్వాసపాత్రమైన యాధార గ్రంథము గాదు. రాక్షస తంగడి యుద్ధానంతరము కావేరికి దక్షిణ మందుండు రాయ రాజ్యము నాక్రమించుకొనిన మధుర నాయకులు కృష్ణరాయలచే దక్షిణ రాజ్యమున బ్రతిష్ఠింపబడిరను నసత్యకల్పిత గాథను బ్రచారములోనికి దెచుట ఈ గ్రంథముయొక్క ముఖ్యోద్దేశము. కాని యందు వర్ణింబడియుండు కృష్ణరాయల జైత్రయాత్రా కథన మన్య చరిత్రాధారముల మూలమున వాస్తవమని తేలుచుండుటవలన దానిని మన మంగీకరించవచ్చును."52 వెంకట రమణయ్యగారి ఈ అభిప్రాయమందలి మొదటి రెండు వాక్యములు, ఆంగ్లములో వారొసగిన పై అభిప్రాయానికి కొంత వ్యతిరిక్తంగా ఉన్నాయి. వారు రాయవాచకంలో కొట్టవచ్చినట్టు కనబడే ఒకటి రెండు చారిత్రక విరుద్ధ విషయాలు జ్ఞప్తి యందుంచుకొని ఇట్టి అభిప్రాయాన్ని వెలుబుచ్చారనుకొంటాను. వారు రచించిన 'విజయనగర చరిత్ర' (2 భాగములు), 'కృష్ణదేవరాయలు' అను ప్రామాణిక చారిత్రక గ్రంథాలలో, 'స్టడీస్ ఇన్ ది థర్డ్ డైనాస్టీ ఆఫ్ విజయనగర్' మొదలుగా ఆంగ్లంలో రచించిన చారిత్రక గ్రంథాలలో, రాయవాచకము నుండి విశేషముగా, విస్తారముగా విషయాల నుద్ధరించి వాని చారిత్రక ప్రామాణ్యతను నిరూపించి ఉన్నారు. అట్లే పై అభిప్రాయంలో, రాయవాచక ముఖ్యోద్దేశ్యము మధుర నాయక రాజ్యస్థాపన- గూర్చిన అసత్యపు గాథను ప్రచారములోనికి తెచ్చుట అని ఏల వెంకటరమణయ్యగారు చెప్పిరో అర్థమగుటలేదు. రాయవాచక ప్రారంభంలో దాని రచయిత తనను విశ్వనాథ నాయనయ్య స్థానాపతిగా పేర్కొనుటతప్ప, ఇక ఆ గ్రంథంలో ఎచ్చటా మధుర నాయక రాజుల ప్రసక్తి మాట వరసకైనను లేదు. పైన కనుపరచినట్లు మధుర నాయక రాజ్య స్థాపకుడని తలచబడే కొటికం విశ్వనాథ నాయకుని కూడా రాయవాచక కర్త, ఆ రాజ్య స్థాపకుడనిగాని, మధుర నాయకరాజుల మూలపురుషుడని కాని చెప్పలేదు; అతనిని కృష్ణదేవరాయల దళనాయకులలో ఒకడుగా మాత్రమే పేర్కొనినాడు. బహుశా, రాయవాచక కర్త, మధురనాయక రాజ్య కాలంలోఉన్న ప్రసిద్ధులయిన కొందరు చారిత్రక వ్యక్తులను కృష్ణరాయని కాలములో ఉన్నట్లు చెప్పుట వెంకట రమణయ్యగారి ఈ అభిప్రాయానికి కారణమై ఉండవచ్చు; కాని ఈ వ్యక్తులకు మధుర రాజ్యంతో ప్రసక్తి ఉన్నట్లు రాయవాచకం ఎక్కడా చెప్పలేదు. అందుచే, చారిత్రకాధారగ్రంథంగా రాయవాచకమును గూర్చి వెంకట రమణయ్యగారు ఆంగ్లములో తెలిపిన అభిప్రాయమే సరిఅయినది.

రాయవాచకంలో కొట్టవచ్చినట్లు కనబడే ఒకటి రెండు చారిత్రక విరుద్ధ విషయాలున్నాయని చెప్పితిమి. వాని నిచట కొంత ప్రస్తావిస్తాము. మొదటిది విద్యానగర్ లేక విజయనగర నిర్మాణము. విద్యానగర నిర్మాణము శ్రీ విద్యారణ్య మునీంద్రుల ప్రోత్సాహముతో (క్రీ. శ. 1335/6 - 1353) ప్రారంభించినాడన్న నది పరిశోధనాఫలితంగా చరిత్రకారులంగీకరించిన సత్యము. కాని రాయవాచకము విద్యానగర నిర్మాణ ముహూర్త, శంకుస్థాపనలను గూర్చి, "శాలివాహన శకాబ్దములులెక్క ౧౧౨౭ యేండ్లు వెయ్యిం న్నూటయిరువై యేడేండ్లమీద చెల్లే ప్రభావనామ సంవత్సరం చైత్రశుద్ధ పౌర్ణమి స్థిరవారం శుభయోగ శుభకరణములు గూడిన శుభముహూర్తమునందు ముహూర్తముజేసి, కృష్ణపక్షం అమావాస్యనాటి రాత్రి నిశి సమయమందు శంఖుస్థాపనం"53 జరిగినట్లు తెలుపుతుంది. అనగా క్రీ. శ. 1205 లో విద్యానగర నిర్మాణం ప్రారంభమయినట్లు తెలుపుతుంది.

ఇట్లాంటిదే కొంత చారిత్రిక కాల విపర్యయంతోకూడి ఉన్నా, ఆసక్తికరమైన విషయము. శ్రీ తిరుమల తిరుపతి వెంకటేశ్వర దేవస్థాన ప్రాంగణంలో శ్రీకృష్ణదేవరాయల, అతని దేవేరులైన తిరుమలదేవి, చిన్నాదేవుల తామ్ర ప్రతిబింబాలను అందరూ చూచే ఉంటారు. శ్రీకృష్ణదేవరాయలు తన కళింగ దిగ్విజయానంతరము, రాయచూరు, కలుబరిగెలను జయించిన తర్వాత, తిరుపతి, కాళహస్తి దర్శించి, ఈ తామ్ర ప్రతిబింబాలను "శ్రీముఖ సంవత్సర ఆశ్వీజ శుద్ధ 12ది"కి, ఏ ఒకటో, రెండో రోజుల ముందుగా నిలిపినట్లు చెప్పుతుంది.[54] ఈ తేదీ క్రీ. శ. 1513, అక్టోబరు 12, మంగళ వారానికి సరిపోతుంది. కాని కృష్ణరాయల పూర్వ దిగ్విజయయాత్ర క్రీ. శ. 1517 నాటికిగాని పూర్తికాలేదు. రాయచూరు, కలుబరిగె దండయాత్రలు క్రీ. శ. 1520 నాటికిగాని ముగియలేదు.[55] అందుచే రాయవాచకం, ఈ సంఘటనల తర్వాత క్రీ. శ. 1513లో ఈ తామ్ర ప్రతిబింబాలను నిలపినారని చెప్పడం కాల వ్యతిరిక్తమయిన విషయము. కాని దీనిని బట్టి, రాయవాచకము చెప్పిన ఈ విషయమును ఉపేక్షింప తగదు. ఏలనన, క్రీ. శ. 1513లో శ్రీకృష్ణదేవరాయలు పూర్వ దిగ్విజయాత్రను ప్రారంభించి ఉదయగిరిని ముట్టడిస్తున్న కాలంలో శక 1435 శ్రీముఖ వైశాఖ బ. 12 సోమవారం (క్రీ. శ. 1513 మే 2) నాడు, మరలా శక 1435 శ్రీముఖ ఆషాఢ శు. 11 సోమవారం (క్రీ.శ. 1513 జూన్ 13) నాడు వెంకటేశ్వరస్వామిని దర్శించినట్లు తిరుపతి - తిరుమల దేవస్థాన శాసనాలవలన తెలుస్తుంది.[56] ఈ సందర్భాలలో ఒక దానిలో శ్రీకృష్ణదేవరాయలు తనయొక్క, తన దేవేరుల తామ్ర ప్రతిబింబాలను అచట నిలపడం జరిగి ఉండవచ్చు; కాని ఈ విషయం ఎక్కడా శాసనస్థం కాలేదు: రాయవాచకాన్ని బట్టి శ్రీముఖ సంవత్సరంలోనే మరలా, మూడవ సారి, రాయలు వెంకటేశ్వరస్వామిని దర్శించి, ఈ తామ్ర ప్రతిబింబాలను నిలిపినట్లు తెలుస్తుంది. రాయవాచక కర్త చెప్పిన చారిత్రిక సంఘటనల (పూర్వ దిగ్విజయము, రాయచూరు, కలుబరిగె విజయాలు) కు, శ్రీముఖ (క్రీ. శ. 1513) సంవత్సరానికి, అయిదారు సంవత్సరాల తేడాతో కాలం కుదరకపోయినా, కృష్ణరాయలు తామ్ర ప్రతిబింబాలను శ్రీముఖ (1513) సంవత్సరంలో నిలిపినాడని రాయవాచకం చెప్పిన విషయం యదార్థమని తోస్తోంది. రాయలు ఈ తామ్ర ప్రతిబింబాలు నిలిపిన విషయాన్ని, ఎప్పుడు నిలిపాడనే విషయాన్ని ఒక్క రాయవాచకం మాత్రమే చెపుతుంది. నాకు తెలియవచ్చినంత వరకు సమకాలిక సారస్వతంలోకాని, శాసనాలలోకాని ఈ ప్రస్తావన కానరాదు.

చరిత్రలోని అతి ప్రసిద్ధ విషయాలను గూర్చి చెప్పడంలో కొంతపొరపాటును కనుపరచిన రాయవాచకము చరిత్రకారుల స్థూలదృష్టికి అందని అతిసూక్ష్మ విషయాలు ఎట్టి పొరపాటులేక చక్కగా తెలియజేస్తున్నది. అట్టి విషయం ఒకటి ఇచట ప్రస్తావిస్తాము. కళింగోత్కలపాలకుడైన గజపతి వారి స్థానాపతిగా, చారుడుగా సుబుద్ధి అనే నియ్యోగి విజయనగరంలో రాయలవారి సభలో ఉన్నట్లు రాయవాచకం చెప్తుంది. 'మంచ బుద్ధిగలవాడు' అని అర్థమిచ్చే ఈ పేరు యథార్థమైన వ్యక్తినామంగాక, రాయవాచక కర్త ఎదో సందర్భోచితంగా సృష్టించిన పేరు అనుకోవడం సహజం. ఇట్లు అనుకొని చరిత్రకారులు ఈ సుబుద్ధిని చారిత్రక వ్యక్తిగా పరిగణించలేదు; కల్పిత వ్యక్తిగా భావించారు. కాని గజపతి వారిని య్యోగి అయిన ఈ సుబుద్ధిని, ప్రతాపరుద్ర గజపతిని ఓడించిన తర్వాత, కృష్ణరాయలవారు తన ఆశ్రయం లోనికి తీసుకొని, ఆదరించి, అతని జీవనానికై రెండూళ్లు ఇచ్చినట్లు ఒక తిరుమల - తిరుపతి దేవస్థాన శాసనం తెలియజేస్తుంది.[57]

రాయవాచక కథనంలో ఆయువుపట్టనదగినది, అత్యంత ప్రధానమయినది కృష్ణరాయ దిగ్విజయ వృత్తాంతము. రాయవాచకంలో ఇచ్చిన ఈ దిగ్విజయ వివరాలు, కాలక్రమం, సమకాలిక శాసనాలనుండి, సారస్వతం నుండి తెలియవచ్చు విషయాలతో చాల వరకు సరిపడి, విజయనగర చరిత్రకారులకు మిక్కిలి ఉపయుక్తంగా ఉన్నాయి. ఇంతేగాక రాయవాచకం, విజయనగర సామ్రాజ్య పరిపాలనాయంత్రాంగం, మంత్రాంగం, కోశాదివివరణము, రాజోద్యోగులు, పదవులు, సేనావివరాలు, సాంఘిక మర్యాదలు, రాజసభామర్యాదలు, రాజుల దినచర్య మొదలయిన అనేక విషయాలను గూర్చి తెలియజేస్తుంది; వేషభాషలు మొదలగు విషయాలను గూర్చి కొంత తెలియజేస్తుంది. ఆనాటి రాజ్యాల, రాజుల బలాబలాల తారతమ్యం, వారి అంగబలం, అర్థబలం, వారి రాజకీయపు పెత్తుగడలు, రాజ్య విస్తీర్ణాలు, దండన విధానాలు వేగు, మొదలగు ఆసక్తికరమగు ఎన్నో విషయాలను మనకు ఎరుక పరుస్తుంది.

చరిత్రకారులనే గాక, వాఙ్మయ చరిత్రకారులకు, సాహిత్య పరిశోధకులకు కూడా రాయవాచకం అత్యంతోపయోగమయినది. కృష్ణరాయలవారు తమ దిగ్విజయాలనన్నిటిని ముగించుకొన్న తర్వాత "కీర్తి శాశ్వతముగా నిలిచేటందులకు" తన మంత్రుల సలహాపై "కృతు లందుకోవలెనని" నిశ్చయించి, అల్లసాని పెద్దనను 'మనుచరిత్ర'ను చెప్పవలసిందనిన్ని, ముక్కు తిమ్మనను 'పారిజాతాపహరణము' వ్రాయమనిన్ని ఆనతిచ్చినట్లు రాయ వాచకం చెప్పుతుంది.[58] రాయవాచక మందించిన ఈ సమాచార మాధారంగా సాహిత్య పరిశోధకులు మనుచరిత్ర, పారిజాతాప హరణ కావ్యాల రచనాకాలాన్ని నిర్ణయించడానికి ప్రయత్నిం చారు.[59] అష్టదిగ్గజ కవీశ్వరులలో రాయవాచకం ముక్కు తిమ్మయ్యను, అల్లసాని పెద్దన్నను, మాదనగారి మల్లయ్యను మాత్రమే పేర్కొంటుంది.[60] అష్టదిగ్గజ కవులందరూ ఆంధ్ర కవులు కారని, వారిలో తమిళ, కన్నడ భాషా కవులు కూడా ఉండినారని ఒక వాదముంది; బహుశా రాయలకు సమకాలికులయిన "అష్టదిగ్గజ" ఆంధ్రభాషా కవులు వీరు ముగ్గురే అయిఉండవచ్చు. అట్లే, తురకల మీద రాయల విజయాన్ని గూర్చి ముక్కు తిమ్మన చెప్పిన చాటువొకటి రాయవాచకంలోని కెక్కింది.

చరిత్రకారులు త్రవ్వకొద్దీ అమూల్యమైన చారిత్రిక సంపద నందియ్యగల స్వర్ణఖని రాయవాచకము.

సూచికలు

1. రాయవాచకము. (సం. డా॥సి. వి. రామచంద్రరావు), ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్, 1982, పు. 1 ఇందుమీదట రా. వా. అని సూచించడమైనది.
2. తెలికచర్ల వెంకటరత్నం 'వచన రచనా పరిణామము', విజ్ఞాన సర్వస్వము, III (1959) పు. 632
3. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, (1914), పు. 11.
4. రా. వా, పు, 2
5. రా. వా. 68: 24; 69: 26; (ఇట్లు ఇచ్చిన సంఖ్యలలో, మొదటి సంఖ్య రాయవాచకంలోని పుటను తరువాతి, సంఖ్య లేక సంఖ్యలు, ఆ పుటలోని పంక్తులను తెలుపుతాయి.
6. 35 : 18-19; 43 : 15; 45 : 4; 49 : 14; 50 : 25-26; 79 : 16.
7. 2 : 3-5.
8. చూడు యస్. కృష్ణస్వామి అయ్యంగార్, "సోర్సెస్ ఆఫ్ విజయనగర్ హిస్టరీ" (1919), పు. 327 మొ॥
9. ప్రభాకరశాస్త్రి. వేటూరు, తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర పు. ౧-౧౫; వెంకట రమణయ్య నేలటూరు, "ఫర్దర్ సోర్సెస్ ఆఫ్ విజయనగర్ హిస్టరి" (1946), II, పు. 32 మొ॥
10. "సోర్సెస్ ఆఫ్ విజయనగర్ హిస్టరీ" (1919), పు. iii
11. రాయవాచకము (1933), "ఫోర్‌వర్డ్", పు. 12
12. అదే, "ఇంట్రడక్షన్", పు. 2
13. అరుణకుమారి, ఆంధ్ర చారిత్రక కావ్యములు (1978), పు. 165
14. కులశేఖరరావు, ఆంధ్రవచన వాఙ్మయము (1974), పు. 509 510
15. "వీనినేకాక కొటికము విశ్వనాథనాయని స్థానాపతి రచించిన 'రాయవాచకము' ను కూడా ఇచట స్మరింపవలసియున్నది." -వెంకట రమణయ్య "తెలుగుదేశ చరిత్ర - ఆధారములు"- విజ్ఞానసర్వస్వము, III, పు. 62
16. వెంకట రమణయ్య, "స్టడీస్ ఇన్ ది థర్డ్ డైనాస్టీ ఆఫ్ విజయనగర్" (1935), పు. 239-241 లు.
17. వెంకట రమణయ్య, 'మధుర తంజావూరు నాయకరాజుల నాటి ఆంధ్ర వాఙ్మయము' భారతి, 1954, ఫిబ్రవరి, పు. 148.
18. అదే, పు. 148
19. కొన్ని ఉపపత్తులను బట్టి 'కృష్ణరాయ విజయము' యదార్థానికి 18వ శతాబ్దం మొదటి దశకంలో వ్రాసినట్టు చెప్పవలసి వస్తుంది. 'కృష్ణరాయ విజయ' రచనాకాలాన్ని, నేను పరిష్కర్తగా ఆం. ప్ర. సాహిత్య అకాడమీవారు ప్రచురించిన 'కృష్ణరాయ విజయము'లో విపులంగా చర్చించాను. చూడు కృష్ణరాయ విజయము (సం. డా॥ సి. వి. రామచంద్రరావు), ఆం. ప్ర సాహిత్య అకాడమీ, హైదరాబాదు, (1891), పు XIV-XXIII.
20. 63 : 21-26; 63 : 1-4; కవికర్ణ రసాయనము (సం. మోచర్ల రామకృష్ణకవి), II. 64, 65.

21. ముకుంద బాహుబలేంద్ర గజపతి 3వ అంకవత్సరం, రౌద్రి చైత్రి శు 1, బుధ (క్రీ. శ. 1560 ఏప్రిల్ 10) నాటి తెలుగు శాసనము ఉంది. దీనిని బట్టి ఇతడు క్రీ. శ. 1558-59 లో రాజ్యానికి వచ్చినట్లు తెలుస్తుంది.

22. 10 : 7-12

23. 11 : 3-6

24. స్వామికన్ను పిళ్ళై : "ఎఫిమెరిస్"

25. అదే

26. "ప్రతాపరుద్ర చరిత్రము" (తణుకు, 1969). దీని రచనాకాల నిర్ణయానికై చూడు ఖండవల్లి లక్ష్మీరంజనం గారి ఉపోద్ఘాతము పు 1-8 లు; ఏకామ్రనాథుడు క్రీ. శ. 1623 ప్రాంతంవాడను ఆరుద్రగారి గణింపు (సమగ్ర ఆంధ్ర సాహిత్యం, సం 9, పు.77)ను లక్ష్మీరంజనంగారు సరికాదన్నారు లక్ష్మీరంజనం గారివాదం సమంజసంగా ఉంది.

27. 45 : 21-24; 46 : 1-13; 46 : 13-18; ప్రతాపరుద్ర చరిత్రము, పు. 84-85 లు.

28. "ఎ డిస్క్రిప్టివ్ కేటాలాగ్ ఆఫ్ తెలుగు మ్యానుస్క్రిప్ట్ ఇన్ ది మహారాజ సర్ఫోజీ'స్" సరస్వతీమహల్ లైబ్రరి, నం. 815; "సభాపతి లక్షణము", ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, సం. 13 (1925), సంచిక 1, పు. 69-71.

29. రాయవాచకంలో, "కృష్ణరాయనికి మంత్రులు రాజనీతి నుపదేశించుట" అనే శీర్షికక్రింద, "తరుణుండై .....అని ప్రారంభమయిన కందపద్యం మొదలు, "దుష్టజన నిగ్రహంబును శిష్టజన పరిపాలనంబును జేయవలయు" అనునంతవరకు గ్రాంధికభాషలోఉండే 'ఆరుపుటల గ్రంథమంతా' 'సభాపతి వచనము' నుండి రాయవాచక కర్త యధాతథంగా గ్రహించాడు. చూడు రా. వా,పు 13-18

30. 21 : 9; 21 : 17

31. 49 : 20

32. చూడు, సెవెల్, "ఎ స్కెచ్ ఆఫ్ ది డైనాస్టీస్ ఆఫ్ సౌత్ ఇండియా" (ఢిల్లీ, పునర్ముద్రణ 1975) పు. 54, సూచిక. 3

33. లెవిస్ రైస్, "ఎపిగ్రాఫియా కర్ణాటకా", వాల్యూం. 2. బెంగుళూరు. నిడుదవోలు వెంకటరావు, "మైసూరు చెన్నపట్టణ నిర్మాత ఇమ్మడి జగదేవరాయుడు "భారతి, 1953, జనవరి, పు. 76-79 లు.

34. చూడు, షేర్వాని. హెచ్. కె, "మహమ్మద్ కులీకుతుబ్‌షా" (బొంబే, 1967), పు. 14, 135 లు, సిద్దికి. ఎ. ఎమ్, "హిస్టరీ ఆఫ్ గోల్కొండ" (హైదరాబాద్, 1956), పు. 91, 389; విజ్ఞాన సర్వస్వము, III పు. 429.

నేలటూరు వెంకట రమణయ్యగారు ఈ భాగానగరం క్రీ. శ. 1580 తర్వాత నిర్మించారని ఒకచోట (స్టడీస్ ఇన్ ది థర్డ్ డైనాస్టీ, పు. XXV), "భాగ్యనగరము క్రీ. శ. 1589 వ సంవత్సరమున నిర్మింపబడెను" అని మరియొకచోట (భారతి, 1954, పు. 143) చెప్పినారు.

35. 44 : 15-25

36. చూడు, నిడుదవోలు వెంకటరావు, "మైసూరు చెన్న పట్టణ నిర్మాత ఇమ్మడి జగదేవరాయుడు", భారతి, 1953, జనవరి, పు. 76-79లు; దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము. (1960), పు. 483 మొ॥; జగదేవరాయని వంశవృక్షానికై చూడు. తిరుమల తిరుపతి దేవస్థానములు, వాల్యూం. 2, టేబిల్ నం. 170.

37. వెంకట రమణయ్య. యన్, "ఫర్దర్ సోర్సెస్ ఆఫ్ విజయనగర్ హిస్టరీ", I, పు. 314, 316, 319, 323-324 లు; చాగంటి శేషయ్య, 'ఆంధ్ర కవి తరంగిణి, II వ సంపుటం, పు. 67 మొ॥

38. "సోర్సెస్ ఆఫ్ విజయనగర్ హిస్టరి" (1919), పు. 238; చాగంటి శేషయ్య, "ఆంధ్ర కవి తరంగిణి", సంపుటం II, పు. 73-75; మట్ల వంశవృక్షానికై చూడు, "తిరుమల-తిరుపతి దేవస్థాన శాసనములు, వాల్యూం 2, టేబిల్ నం. 34.

39. "ఫర్దర్ సోర్సెస్ ఆఫ్ విజయనగర్ హిస్టరీ" (1946), I, పు. 321 మొ॥, 327, 332, 334. లు.

40. చాగంటి శేషయ్య, 'ఆంధ్ర కవితరంగిణి', సంపుటం. 10, పు. 67; "ఫర్దర్ సోర్సెస్ ఆఫ్ విజయనగర్ హిస్టరీ, I."

41. కురుగంటి సీతారామయ్య, 'తంజావూరు నాయక చరిత్రము, (1932), పు. 76 మొ॥.

42. "ఎపిగ్రాఫియా కర్నాటక", V, హెచ్‌యన్ 15 (క్రీ. శ. 1562); అదే హెచ్. యన్. 6 (క్రీ.శ. 1563); అదే హెచ్. యన్. 2 (క్రీ. శ. 1563)

43. "ఎపిగ్రాఫియా కర్నాటికా" VII సిఐ. 69 (క్రీ. శ. 1562; మరియొక కర్నాటక శాసనం "ఎపిగ్రాఫియా కర్నాటికా" IV, యన్‌జి, 26 (క్రీ. శ. 1563) లో "అలకమలక", జగదేకరాయని కార్యకర్తగా చెప్పబడినాడు.

44. 44 : 20.

45. రాయవాచకంలోని చారిత్రక విషయాలకు సంబంధించిన చర్చ వెంకటరమణయ్యగారి ఈ క్రింది గ్రంథాలలో సందర్భాను సారంగా చూడవచ్చు.

i) స్టడీస్ ఇన్ ది థర్డ్ డైనాస్టీ ఆఫ్ విజయనగర్, మద్రాస్, 1935

ii) ఫర్దర్ సోర్సెస్ ఆఫ్ విజయనగర్ హిస్టరీ, మద్రాస్, 1946

iii) 'కృష్ణదేవరాయలు', హైదరాబాదు, 1972

iv) విజయనగర చరిత్ర, భాగములు 1, 2, హైదరాబాదు 1976

46. సోర్సెస్ ఆఫ్ విజయనగర్ హిస్టరీ, పు. 11

47. రాయవాచకము, ఆంధ్రసాహిత్య పరిషత్ప్రచురణ. 33(1933)

48. అదే

49. అరుణకుమారి, ఆంధ్రచారిత్రక కావ్యములు, పు. 198

50. కులశేఖరరావు, ఆంధ్రవాచక వాఙ్మయము, పు. 507-508 లు.

51. స్టడీస్ ఇన్ ది థర్డ్ డైనాస్టీ, పు. xxvi

52. కృష్ణదేవరాయలు (1972), పు. 3.

53. 10 : 7-12

54. 76 : 25 నుండి 77 : 17; రాయలు శ్రీముఖ సంవత్సర ఆశ్వీజ శుద్ధ 12 న కాళహస్తిలో ఉన్నట్లు రాయవాచకం చెపుతుంది. అందుచే ఒకటి రెండు రోజులముందు తిరుపతిలో ఉన్నట్లు ఎంచడమైనది.

55. వెంకటరమణయ్య, విజయనగర చరిత్ర, భా. 2, పు. 10 మొ॥

56. రిపోర్ట్ ఆన్ తిరుమల తిరుపతి దేవస్థానం ఇన్‌స్క్రిప్షన్స్. (సాదు సుబ్రహ్మణ్యశాస్త్రి, 1930), పు. 151 మొ॥

57. అదే, పు. 206

58. 79 : 19 నుండి 80 : 5 వరకు

59. ఉదాహరణకు, కుందూరి ఈశ్వరదత్తు, "పారిజాతాపహరణ మనుచరిత్ర రచనా కాలములు", ఆంధ్రపత్రిక, 1930 ప్రమోదూత, పు. 103 మొ॥

60. 61 : 18, 19, 25 ; 80 : 3.

# రణ స్పృహ

## శ్రీ కె. అంజయ్య

చూపు కింది నీరులా రెప్పపాటు అజాగ్రత్తలో
నిన్ను కబంధ హస్తాల్లో బంధీ చేస్తుంది చీకటి
కన్ను కుట్టటంలో మొలకేస్తుంది చీకటి
మనిషి అత్యాశలో పరుచుకు పోతుంది చీకటి
మూర్ఖుని ఆయుధం వెదజల్లేది చీకటి
శ్మశాన వైరాగ్యాన్ని నూరిపోసే సైనేడ్ చీకటి
గద్దెపై కెక్కిన చీకటి
పొరలు పొరలుగా ప్రపంచాన్నాక్రమించాలని
ప్రయత్నిస్తుంది
బాబాల, కాజీల, ప్రవక్తల స్పీకర్ డబ్బాల్లోంచి
డైరెక్ట్‌గా మెదడు నరాల్లోకి ఎక్కించబడుతుంది.

చీకట్లో తచ్చాడుతూ కాలాన్ని తినేవాడు బానిస
చీకటి మేస్తూ చీకటి చిమ్మే బ్రోకర్ బురాక్రాట్
గొర్రెల్లా అనుసరించే కాళ్ళ ప్రవాహం
శూన్యలక్షణ చర్యలకు చప్పట్లు చరిచే చేతులు
అన్నింటికీ తలాడించే ట్యూబులైట్లు
అడ్డగాడిదల్లా ఎదిగి నన్నాళ్ళూ
చీకటి సూర్యున్ని మింగగలనని గంతులేస్తుంది.
నడిబడ్డున పిండ ప్రవచనాలు
గుడి నుదుట మొక్కుబడుల నమ్మకాలు
మన జుట్టుకు కట్టి ఆడించాలని చూస్తుంది చీకటి
అడివి నంటించి చీకటిని పారదోలాలని
కిరణం మెడల్లు కంకణం ధరిస్తాయి
చుక్కల్ని చూపి మురిపించే నక్క చీకటి
కిరణాల అడుగుజాడలు నాటుకోకుండా
బహిరంగ మైక్ మాయా వాగ్దానాలై
నమ్మించే కాగితం మీద ముద్దరేసి
నిముషంలో బుర్ర ఖాళీ చేసి ఊపిస్తుంది.

కళ్ళు తెరిస్తేచాలు
కళ్ళల్లో దుమ్ము కొట్టాలని చూస్తుంది చీకటిగాలి
చీకటి నియంతరాజ్యాన్ని కూలదోస్తారని
గుడ్డి వెల్తురు అర్ధనెన్నుల చంద్రునిగద్దె కెక్కించి
మురిపంగా మరిపించి ముచ్చటగా దోస్తుంది
చీకటి తాగేవాడు కార్చే అక్షరాలు
ఆస్థానకవి పొగడ్తల్లా నవ్వుల పాలౌతాయి
చందుర్నిలో సమస్త కవిత్వం చవిచూసే సుఖజీవి
వెలుతురు గోదాలో దిగి ప్రజాసమస్యల్ని ఎదుర్కోలేడు
చీకటి గాలి సోకిన ప్రబుద్ధుడు
తాడును పాముగా భ్రమసి బెదురుతాడు
రేడియో వసంత తుంపరల్ని నిజమనుకొని
అనుభూతి పైత్యంలో వడ్ల పిట్టయై
ప్రకృతి ప్రవృత్తి మరిచి
ఊహాకలల్ని ప్రతీకల్తో ఊస్తూ ఆనందిస్తాడు
ఆయుధాలున్నా చీకటిగూట్లో పాదం మోపలేని పిరికిపంద
అయోమయ అధివాస్తవికతలో కొట్టుకుపోతాడు
చీకటికి గుండు కొట్టించి పారదోలేవాడు
ఏ ఆయుధం ఆసరా రాకున్నా
రెండు రాతి మెదళ్ళను రాపిడి చేసి
వెలుగు పంట ప్రపంచంపై కుమ్మరిస్తాడు.



# కాదు ముఖ్యము - ఉనికి తీరు

శ్రీ వెల్దుర్తి మాణిక్యరావు

నీవు లింగము అయితెమానె
నేను జంగము కాను కాను.

ఎవరు లింగమో
ఎవరు జంగమో

ఏది కదలికో
ఏది నిలకడో

ఏది ఘనమో
ఏది ద్రవమో

ఏది జడమో
ఏది జీవమో

ఎందుకీ మీమాంస ఇప్పుడు
ఏల తర్జన భర్జనమ్ము

చరము పురుషుడు అయిననేమి
స్థిరము ప్రకృతి అయిననేమి

కలయికే మన లక్ష్య
కాదు ముఖ్యము ఉనికితీరు.

నీవు నేనను మాట మరచి
ఒకటిగానే ఉండిపోదము.

అందుకే రావోయి సఖుడా
అందుకొన అధరామృతమ్ము

లింగమై ఒకచోటునుండకు
భ్రమరమై నాచుట్టు తిరుగుము

మల్లెతీగకు మొగ్గనై
నేనుండి పోదును ప్రియతమా

కొలనులోనే కమలమై
తేనెలను ఒలికింతును

భ్రమరమై నా పొందు గూడుము
భ్రమలు తీరునులే!



శ్రీ మాదిరాజు రంగారావు

# చైతన్య స్రవంతి విధానం

చైతన్య స్రవంతి సంవిధానం మనస్తత్వ శాస్త్ర ప్రభావం వల్ల సృజనాత్మక సాహిత్యంలో ప్రవేశించింది. కొత్త ప్రపంచాన్ని దర్శించే అవకాశమూ కలిగింది. పాశ్చాత్య సాహిత్యంతో పరిచయం వల్ల కొత్తదనాన్ని అన్వేషించే లక్షణంతో సుప్రసిద్ధ రచయితలు శ్రీశ్రీ, బుచ్చిబాబు, గోపీచంద్, రాచకొండ తమరచనల్లో దీన్ని సమర్థవంతంగా నిర్వహించారు. ఇటీవల నవీన్, నాగరాజు మొదలైన ఆధునిక రచయితలు ఈ సంవిధానం అవలంబించి ఉత్తమ నవలలు వ్రాసారు. దీన్ని నిర్వహించడానికి మనస్తత్వ పరిజ్ఞానం అవసరం. దీనితో ఎంత క్షుణ్ణంగా పరిచయం ఉంటే, అంత చక్కగా తమ లక్ష్యమూ, పరిమితులూ అర్థమవుతాయి. పాత్ర చిత్రణలో లోతునూ, వేగాన్నీ కలిగిస్తూ కొత్తదనాన్ని భావింపజేసే స్థితి చేకూరుతుంది. ఫ్రాయిడ్, అడ్లర్ యుంగ్ మనస్తత్వ శాస్త్రవేత్తల గొప్ప పరిశోధనల కృషి ఫలంగా మనః ప్రపంచానికి సంబంధించిన చైతన్యరూపం గురించీ ఎన్నో రహస్యాలు బయటికి వచ్చాయి. ఎంతో ఆలోచనకూ అవకాశం కలిగింది. జీవితాన్ని వెనుకనుండి నడిపే అదృశ్యమాన చైతన్య శక్తుల పాత్ర గురించి, అవగాహనలో సంపూర్ణమైన మార్పు వచ్చింది. ఇది ఆధునిక యుగానికి పరిహరింపరాని లక్షణంగానూ నిలచింది.

'చైతన్యం' అనేమాట ఇక్కడ కాంషస్‌నెస్‌కు అనువాదం. దీనికి అనేకమైన అర్థాలున్నాయి. ఇందులో కొన్ని- అనుభవ పూర్వకమైన జ్ఞానరూపం. మెలకువ. వ్యక్తి కోరికల ఆలోచనల అనుభూతుల సమాహారరూపం. ఒక విషయాన్ని గురించి మనస్సుకు గల జ్ఞానం, ఆలోచన అనుభూతులకు సంబంధించిన స్ఫూర్తి, మనస్సుయొక్క క్రియాత్మకమైన స్థితి. ఇలా ఎంతైనా వివరిస్తూ పోవచ్చు. ఎంతచెప్పిన ఎంతో కొంత మిగిలేఉన్నట్లు అనిపిస్తుంది. ఏమైనా సంగ్రహంగా ప్రస్తుత విషయాన్నిబట్టి మనోవ్యాపారం యొక్క శక్తిరూపంగా భావించవచ్చు. కాంషస్‌నెస్ అంటే చైతన్యం అనీ ఈ సంవిధానంలోని పరమమైన ఉద్దేశాన్ని దృష్టిలో పెట్టుకొని, తెలుగులో శ్రీశ్రీ, బుచ్చిబాబు వంటి ప్రముఖులు స్ట్రీమ్ ఆఫ్ కాంషస్‌నెస్ అంటే 'చైతన్య స్రవంతి' అనీ ప్రయోగించడం జరిగింది. ఒకవ్యక్తి చైతన్యంగా ఉన్నాడంటే అతనిలో మానసికమైన క్రమగతి (మెంటల్ ప్రాసెస్) జరుగుతూందని అర్థం. ఒకరు అచేతనంగా (అన్- కాంషస్) గా ఉన్నారంటే ఈ క్రమగతి విరామాన్ని పొందడమో లేదా నిరోధింపబడడమో జరుగుతుంది. మిక్కిలిగాఢమైన నిద్రలోనూ, స్పృహతప్పినపుడూ ఇది సంభవిస్తుంది. వ్యక్తి చైతన్యంగా ఉన్నాడంటే అతనికి తన మానసికమైన స్థితి గురించిన జ్ఞానం లేదా ఎరుక (ఎవేర్‌నెస్) కూడా వర్తిస్తుంది. తాను ఆలోచిస్తున్న, అనుభవిస్తున్న జ్ఞానమూ కొంతవరకు ఉంటుంది. బాగా తెలివిలో ఉన్నదానికీ, అసలే తెలివిలో లేనిదానికీ మధ్య ఎన్నో దశలున్నాయి. నిద్ర చెందిన వ్యక్తి కేవలం అచేతనంగా ఉండాలనేంలేదు. ఎందుకంటే అతడు కనే కలలు, వాటిని గురించిన అనుభవ ముద్ర- నిద్రపోయేప్పుడు కలిగిన స్పర్శ, ధ్వని మొదలుగా విపరీతమైన లేదా విశిష్టమైన అనుభవజ్ఞానం ఉంటుంది. అందువల్ల చైతన్యం అంటే వ్యక్తిలో ఎక్కడో స్థిరంగా నిలచి ఉండేదికాదు. అతనిలో మానసికంగా జరుగుతూన్నది; సరిస్తూన్నది అని భావం.

ఫ్రాయిడ్ సిద్ధాంతాన్ని బట్టి చైతన్యస్వరూపం మూడు విధాలు. 1. కాంషస్ - మొదటి చైతన్య స్థాయి 2. ప్రి-కాంషస్ చైతన్యం క్రిందిస్థాయి. చైతన్యం వెనకనే (అడుగున) ఉండేది. వ్యక్తికి ఆ సమయంలో ఒక విషయం జ్ఞప్తికి ఉండకపోవచ్చు. కాని వెంటనే దాన్ని స్మృతి పథానికి తెచ్చుకోగల ఆలోచనకు స్థానమైంది. 3. అన్-కాంషస్. ఇది చైతన్యం అట్టడుగునకు చెందింది. ఎంతో లోతైంది. సాధారణ పరిస్థితుల్లో బయటికి రాని విషయాలు, ఎప్పటివో ఇందులో పడి ఉంటాయి. ఈ స్థాయి చాలా ముఖ్యమైంది. సాహిత్యంలో ఇది సముద్రంగానూ, సరస్సుగానూ లోతైనలోయ, లోయలో సరస్సుగానూ అక్కడి సందర్భాన్ని బట్టి రచయిత ఆశించే ప్రయోజనాన్ని బట్టి ఎంతో ప్రతీకాత్మకంగా చిత్రితమవడం గమనించవచ్చు. నీరు సాధారణంగా అవ్యక్త చేతనకు ప్రతీకగా కన్పిస్తుంది. లోయలో సరస్సు, చేతనలో లోతైన పొరలో దాగిన పురాభావ (ఆర్కిటయిప్) రూప సంచయాన్ని సూచిస్తుంది. ఇది సామూహిక అవ్యక్త చేతనస్థాయి (లెవెల్) కి చెందింది. ఇది నిస్సందేహంగా పైకి కన్పించని

గంభీరతతో లోలోన పడిఉన్న అనేకమైన పురా భావ జాలం నమూనాల (పాట్టర్న్స్, మాడెల్స్) తో నిండి ఉందీ, ఎంతో మహనీయమైందనీ మన స్తత్వశాస్త్రవేత్తల అభిప్రాయం. ఆధునిక కాలంలో సృజనాత్మక రచయితలను ఫ్రాయిడ్-మనస్తత్వ విశ్లేష ణం, అడ్లర్- న్యూనతాభావం, యుంగ్ - సామూహిక అవ్యక్త చేతనం సిద్ధాంతాలు ఎంతగానో ప్రభావితం చేసాయి. జీవిత ప్రపంచంలో ఇంతకుముందు కన్పించని, చూడని ప్రదేశాలపై దృష్టి ప్రసరించి ఎన్నో రహస్యాలు కనుగొనడమూ జరిగింది. ఇంకా మనస్తత్వ పరమైన సాహిత్య విమర్శలో ఇటీవల ప్రత్యే కంగా పురాభావరూపాలకు సంబంధించిన వివేచన కూడా చెప్ప దగిన స్థానాన్ని పొందింది.

ప్రస్తుత విషయానికి వస్తే - ఫ్రాయిడ్ దృష్టిలో అవ్యక్త చేతన విస్మృతమైన, అణచబడిన, అనేక విషయాల సంచయ స్థానం. ఈతని సిద్ధాంతం ప్రకారం అవ్యక్తచేతన ప్రత్యేకంగా వైయక్తిక (పర్సనల్) గుణోపేతమైంది. యుంగ్ తన పరిశోధన లతో దీనిపై మరికొంత అభివృద్ధిని సాధించాడు. ఈతని సిద్ధాంతం ప్రకారం అవ్యక్త చేతనయొక్క పైపొర నిస్సందేహంగా వైయక్తికమైంది. దీన్ని ఇతడు వైయక్తిక చైతన్యం (పర్సనల్ కాంషస్) అంటాడు. ఇది లోతైనపొరపై నిలిచి ఉంది. ఈ లోతైన పొరగలస్థాయిని సామూహిక అవ్యక్త చేతనగా కనుగొని స్థాపించ డంలో ఇతని సిద్ధాంతంయొక్క అయువుపట్టు నిక్షిప్తమైంది. ఇది వ్యక్తిగతం కాదు. అందరిలోనూ, ఉండేదీ. సర్వసాధారణ మైందీ. ఇందులో ఉండేవన్నీ పురాభావ రూపాలు.[1] ఇవి బహు పురాతనమైనవీ. ఎన్నో యుగాల నాటివీ. అసంఖ్యాకమైనవీ ప్రతి రూపాలు స్వతంత్రమైనవీ. ఇవి కలలో సాక్షాత్కరిస్తాయి. దైనందిన జీవితంలో మన ప్రవర్తనల్లోనూ జీవనపద్ధతుల్లోనూ ఏదోఒక రూపంలో ప్రతిఫలిస్తాయి.

చైతన్యంయొక్క వివిధమైన పొరలలో, నిహితమైన దృశ్యాదృశ్య జీవిత ప్రపంచం అంతా- 'చైతన్య స్రవంతి' రచనలో నియతమైన కాలప్రవాహంగా రూపొందిన అనేక స్థితులు, ఆలోచనాతరంగాలుగా భావలయతో మనకు విశిష్టమైన గతితో దర్శనమిస్తుంది.

స్ట్రీమ్ అఫ్ కాంషస్‌నెస్ (తెలుగులో చైతన్యస్రవంతి) అనే పదబంధం మనస్తత్వశాస్త్ర పరమైంది. దీన్ని విలియమ్ జేమ్స్ తన ప్రిన్సిపల్స్ అఫ్ సయికాలజీ అనే గ్రంథంలో మొదట రూపొందించాడు.[2] ఇది డోరోతీరిఛార్డ్‌సన్ చేత సాహిత్యంలో ప్రయుక్తమైంది. ఈ సంవిధానానికి మార్గదర్శకురాలుగా ప్రశస్తి వహించింది[3] హెన్రీ జేమ్స్‌ద్వారా ప్రవేశ సౌగమ్యాన్ని పొందింది.[4] వర్జీనియా వూల్ఫ్ రచనలతో ఒక స్థిరమైన స్థితిని పొందింది.[5] ఈమెలో సుకుమార ప్రవృత్తితో అన్వేషణంతో చైతన్యసీమల్ని దర్శించే శక్తి కన్పిస్తుంది. "సామాన్యమైన రోజున సాధారణమైన మనస్సును పరిశీలిస్తే- మనకు ప్రకాశవంతమైన పరివేషం కన్పిస్తుంది. చైతన్యం ఆరంభం మొదలు చివరిదాకా కొంత స్వచ్ఛమైన కాంతి సంప్రసారమైన పొర మనచుట్టూ వ్యాపించి ఉంటుంది."[6] అన్న మాటల్లో పై భావం చక్కగా ఉన్మీ లితమైంది. 'వేవ్స్' లో వాస్తవికతయొక్క వైయక్తిక దర్శనం బాగా కన్పిస్తుంది. జేమ్స్ జాయ్స్ కృతుల్లో[7] ముఖ్యంగా యులిసెస్ మహాగ్రంథంతో ఇది ఒక శక్తివంతమైన సంవిధానంగా కళాత్మకమైన విలువలు కలిగే తన వైశిష్ట్యాన్ని నిలుపుకుంది. నవలలను చైతన్యంతో ఉజ్జీవింపజేసాడు. యులిసెస్ మానవ జీవితం యొక్క వ్యంగ్య చిత్రం. ఇందులో భౌతికమూ, ఇంకా అధికంగా మానసికమైన భూమికల్లో జీవితంయొక్క స్థూల సూక్ష్మమైన రూపాలు ఎంతో వివరంగా విశ్లేషితమైనాయి. జీవితంలో ఎదు రయ్యే సమస్యలు- మానసికమైన భ్రాంతి, సంఘర్షణ, ఆదర్శాలు వాస్తవానికీ కల్పనకూ మధ్య అంతరం రెండూ కలసే ప్రదేశాలు, ఎంతో నిశితంగా చైతన్యంయొక్క వివిధస్థాయిల్లో దర్శితమైనాయి. మానవ మనస్తత్వ పరిశీలనలో విస్తృతీ వైవిధ్యమూ వైచిత్రి గలగొప్ప రచన. ఆ తరువాత విలియమ్ ఫాల్క్‌నర్ మొదలైన రచయితలు దీనికి కొత్త కొత్త పార్శ్వాలతో చిరమైన కీర్తిని ఆర్జించి పెట్టారు. ఫాల్క్‌నర్ లో వర్జీనియా వూల్ఫ్, ఇంకా జేమ్స్ జాయిస్ యొక్క చక్కని జీవితాదర్శ సమ్మేళనం గోచ రిస్తుంది. ఇతని రచనల్లో[8] పాత్రయొక్క అంతర్దర్శనం ముఖ్యం. లిబిడో యొక్క అవ్యక్త చైతన్యావిష్కారం, స్వప్న విధాన రూపం మొదలుగా మనస్తత్వ ప్రకాశనం అధికం. సాహిత్య విమర్శలో మే స్లింక్లియర్, దీన్ని మొదట డోరోతీ రిఛార్డ్‌సన్ వ్యాసంలో వివేచన చేసింది.[10] ఈనాడు సాహిత్య రంగంలో ఈ సంవిధానం గురించి తెలియక పోవడం అంటే, ఆధునిక లక్షణానికి కొంత లోపం కలిగినట్లే!

## 2

చైతన్య ప్రవంతి సంవిధానం నవల్లో పాత్ర, మానసిక మైన క్రమగతి (మెంటల్ ప్రాసెస్) సంబంధించిన అనేకమైన

మన స్తత్వ పరమైన అంశాలపై నిర్మితమౌతుంది. దీనివల్ల పాత్ర అంతరంగ దర్శనం సిద్ధిస్తుంది. ఇంతకుముందు తెలిని బయట పడని స్పష్టంకాని ఎన్నో సూక్ష్మమైన విషయపరిశీలనకూ అవకాశం కలిగింది. పాత్రల మనస్తత్వ పరమైన అనేక పార్శ్వాలు ఒక టొకటీ ప్రకాశమానం కావడంతో దీని ప్రాముఖ్యం ఇటీవల బాగా గుర్తింపుకు వచ్చింది. ఇందులో స్మృతి (మెమరీ) అంతరం, ప్రవహించే చైతన్యంగా రూపొందుతుంది. స్మృతి కీలకమైన పాత్రను నిర్వహిస్తుందని చెప్పవచ్చు. పాత్రల మానసికమైన క్రమగతి స్మృతి నియమించడంచేత పాత్రనిర్మాణంలో సంప్రదాయనవల్లోకన్నా ప్రత్యేకమైన రూపాన్ని పొందుతూంది. ఈ విధమైన రచనచేసే రచయిత, పాత్రస్మృతి పరంపరా సమయంలో కాలంతో ప్రవహించే వ్యక్తిత్వాన్ని సృష్టించే ఉద్దేశం కలవాడవడంచేత, ఇందులో చైతన్యం యొక్క పైపొరలను ఛేదించుకొని వివిధ స్థాయిలలో అనేక దశల్లోని రహస్యాలను అవిష్కరించే ప్రయత్నం జరుగుతుంది. ఇవి అనంతమైనవి. మనం సాధారణంగా ఊహించలేనివి. ఇవి ధరించే ఆకృతులు ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి, ఉత్సుకతను పెంపొందిస్తాయి. ఈ జీవితంలో ఉంటూ దీని వెనుకనున్న కొత్తప్రపంచంలో తిరుగుతూన్న మానసిక స్ఫూర్తి కలుగుతుంది. కాబట్టి మనస్సుయొక్క బాహ్యమైన అవరణలు క్రమిస్తూ, లోలోపల అడుగున నిహితమైన రూపాలపై నే పాత్ర వ్యక్తిత్వం ఆధారపడి ఉంటుందని చెప్పవచ్చు. చైతన్య రూపం వస్తు విన్యాసానికి స్థానమవుతూంది. చైతన్యం క్రింది స్థాయి నుండి పై స్థాయి వరకూ పాత్ర మనస్తత్వ సమర్పంగా చిత్రించడంలో రచయిత సందర్భానికి తగిన విధంగా వివిధాంశాలు ఎన్నుకొనే ప్రజ్ఞ ఎంతో అవసరం.

చైతన్యరూపాన్ని రెండు భాగాలు చేస్తే, ఒకటి కింది స్థాయిలో, రెండోది పై (ఉన్నత) స్థాయిలో ఉండేది. కిందిది మసక మసకగా అస్పష్టంగా ఉంటుంది. పైది ప్రకాశవంతంగా ఉంటుంది. మొదటిది వాక్కుకు పూర్వమైన దశ (ప్రీస్పీచ్ లెవెల్) ఇది సాధారణంగా మన కందదు. రెండోది వాక్ దశ (స్పీచ్ లెవెల్) కు చెందింది. మన కందుబాటులో ఉండేది. చైతన్య స్రవంతి రచనలో ఆ అందని స్థాయిలో అస్పష్టంగా మసక మసకగా, ఇంకా కిందికిపోతే విస్మృతమై ఎప్పుడో, లోతుగా చీకటిలో ఉన్న మనస్తత్వపరమైన, జాతి సామూహిక లక్షణయుతమైన ఎన్నో అంశాలు అనేక రీతుల్లో విచిత్ర సామరస్య రూపంలో అవిష్కృతమౌతాయి.

ఇవి ఉద్గమనంలో, ఏ కత్తిరింపులకూ లోను కాకుండా నియమితమూ కాకుండా, యథాతథంగా అవలీలగా మనస్సునుండి ప్రసరిస్తాయి. రచనలో కళాత్మకమైన విలువల దృష్ట్యా క్రమబద్ధం చేయబడతాయి. ఇది శిల్పం క్రిందికి వస్తుంది. లేకపోతే సాహిత్య పరంగా క్షతి ఏర్పడుతుంది. వివిధస్థాయిలలో ప్రసరించే చైతన్యంతో పాత్ర క్రియాత్మకమైన మనోరూపాన్ని పొందుతుంది. మనస్సు బాహ్యమైన అనేకావరణలు దాటి చైతన్యంలోపల ఉన్న పొరల్లోకి ప్రవేశించి అందులో దాగిన వ్యక్తిత్వ రూపాలను బయటికి లాగడం జరుగుతుంది. మొదటి నుండి చివరివరకూ రచయిత ఈ పనిలో కేవలం నిర్వాహకుడు (స్టేజి మేనేజరు) గా మాత్రమే ఉంటాడు. ఏ విధంగానూ పాత్రలను నిర్దేశించడు, ప్రవర్తనను నియమించడానికీ పూనుకోడు. ఎంతో తటస్థంగా ఉంటాడు. ఈ కారణంగా పాత్రలు స్వేచ్ఛగా ప్రవర్తించే అవకాశం ఎక్కువ. ఏ నీతి నియమాలకూ కట్టుబడవు. ఎంతో నిర్భయంగా అభిప్రాయ ప్రకటం గావిస్తాయి. రచయిత ప్రభావం ఏ మాత్రమూ లేని స్వతంత్రమైన వ్యక్తిత్వాలతో ప్రవర్తించడం దీనిలోని విశేషం. భాష కూడ సాధారణ సూత్రాలకూ నియమాలకూ కట్టువడదు సహజమైన ప్రసంగధోరణి కలిగి ఉంటుంది. పదబంధాలు, పదరూపాలు కొత్తగానూ వాక్య విన్యాసం ఖండ ఖండాలుగానూ, ఒక్కొక్కప్పుడు దీర్ఘదీర్ఘంగానూ, ఆకర్షణీయంగా సహజత్వంతోపాటు శిల్పగుణమూ కలిగి ఉంటాయి. రచన ప్రవాహంగా ఆలోచనా తరంగాలతో భావలయతో పరిక్రమిస్తుంది. గతంనుండి వర్తమానంలోకీ, వర్తమానంనుండి గతంలోకీ పాత్రలు వస్తూపోతూ ఉంటాయి. కాలం ఒక క్రమంలోనూ ఉండదు. అయినప్పటికీ రచన మొత్తంమీద, పాత్ర స్వరూపాన్ని బట్టి ఒక ఏర్పాటు, ఒక పద్ధతి పర్యాప్తమై ఉంటుంది.

కాలానికి సంబంధించినంత వరకు రెండు రకాలైన రచనలు కన్పిస్తాయి. 1) కొన్ని రచనల్లో కథ ఒకరోజులో లేదా కొన్ని గంటల్లోనో సమాప్తమౌతుంది. ఒకరోజులో లేదా కొన్నిగంటల్లో ఎంతో కాలాన్ని వివిధ స్మృతి విశేషాలతో, అనుభవ పరంపరలతో అనేక సంఘటనల మయమైన ఇతివృత్తం, అన్నిటినీ తనలో ఇముడు కొని అవయవ పూర్ణమైన ఆకృతిని శిల్పగుణం చేత పొందుతుంది. మరికొన్ని రచనల్లో ఇతివృత్తంలో అనేకమైన సంఘటనలు పురస్కరించుకొని సాధారణమైన సంప్రదాయ ధోరణిలో కథ నడుస్తూ మధ్యమధ్య ఈ సంవిధానం అవిష్కృతమౌతుంది. ఈ పద్ధతిలో అటు సంప్రదాయగతమైన నవలా పద్ధతిలో, ఈ నవ్యమైన సంవిధానం అనుసంధితం కావడం ఇందులో విశేషం. తెలుగులో అసమర్థుని జీవయాత్ర, అల్పజీవి పేర్కొదగినవి. ఇది మొదటిదానికన్న సులభమైంది. చైతన్య స్రవంతి సంవిధానానికి మొదటిపద్ధతిలో అంచే కొన్ని గంటల్లో

లేదా ఒక రోజులో జరిగి కాలంలో అనేక కోణాలనుండి రూపొం దిన ఇతివృత్తంగల కథారూపమే సంపూర్ణమైన ప్రాతినిధ్యం వహిస్తుంది.

పాత్రల సజీవమైన దర్శన శక్తి (లైవ్ ఇన్‌ట్యూషన్) తో వివిధ చైతన్య దశలను ప్రతిఫలింపజేసే స్వభావంతో, ఆకర్ష ణీయమైన సృజన రూపాన్ని ఉన్నత ప్రమాణాల్లో కలిగి ఉండడ మనేది, రచయిత పరిణతమైన సృజన శక్తికీ, కళాపరమైన శిల్ప దృష్టిపై ఆధారపడి ఉంటుంది.

చైతన్య స్రవంతి - రచన రచయిత చేసే ఏ వ్యాఖ్యానమూ, విశ్లేషణమూ లేకుండా పాత్ర మనస్సునుండి నేరుగా ఉద్గమించే కళాత్మకమైన విధాన రూపం.11

### 3

ఒకవేళ రచయిత స్వయంగా వివరించడానికీ, విశ్లేషించ డానికీ లేదా వ్యాఖ్యానించడానికీ ఉపక్రమిస్తే అది అంతర్విశ్లేషణం (ఇంటర్నల్ ఎనాలిసిస్) అనే పద్ధతికి చెందుతుంది.12 ఎందుకంటే రచయిత ప్రమేయ స్పర్శతో పాత్ర రూపొందే వ్యక్తిత్వమే వేరవుతుంది. ఇందులో పాత్ర అంతరమైన జీవితరూపం నేరుగా ఆవిష్కృతం కావడానికి బదులు పాత్రకూ పాఠకునికీ మధ్య రచ యిత చోటు చేసుకుంటాడు. దీనితో పాత్ర నిర్మాణంలోనే కాక పాఠకుని మనస్సుపైనా ఏదో ఒక విధమైన ప్రభావాన్ని నెరపుతాడు. ఇది పాత్రలపై మనకొక అభిప్రాయాన్ని కలిగించేదిగా ఉండవచ్చు లేదా పాత్రలను తన అభిప్రాయానికనుగుణంగా ప్రవర్తింపజేసేదిగా ఉండవచ్చు. ఇంకా అనేకవిధాలుగా ఉంటుంది. అభిప్రాయాలకూ సిద్ధాంతానికీ చెందినవి కావచ్చు. ఏమైనా ఇది సూచనగా ఉండ వచ్చు, తప్పదు. కాని ప్రమేయంగామారి చివరకు పాత్రలపై అది పత్యం వహించి వాటి "కీలుబొమ్మలు చేయడం ఈనాటి నవలా ప్రపంచంలో ఎక్కువమంది అంగీకరించడం లేదు. అయితే అభి ప్రాయ భేదం ఎప్పుడూ ఉంటుంది. తెలుగులో అల్పజీవి నవల, రచయిత ఎంతో తటస్థంగానూ, ఏ విధమైన ప్రమేయస్పర్శ లేకుండా నిర్వహించే ప్రయత్నం జరిగింది. దీనివల్ల రచనకు ఎంతో సహజత్వం, సజీవమైన వాస్తవ గుణంతో నిండి వెరిసి మిలిట్యూడ్ లక్షణం చేకూరింది.13 అందువల్ల ఈ నవల తక్కిన వాటికన్నా ఏదో విలక్షణంగా మనల్ని ఆకర్షిస్తుంది. ఈ ఆకర్షణకు వేరే గుణాలూ లేకపోలేదు.

చైతన్యస్రవంతి రచనలో పాత్రల మనస్సునుండి నేరుగా ఉద్గమన రూపం (డయిరెక్ట్ కొటేషన్) పొందిన రచన అంతా నాటకీయత కలిగి ఉంటుంది. సంభాషణకు ప్రాధాన్యం హెచ్చుగా ఉండడమూ ఒక కారణం కావచ్చు. వాచికంతో పాటు ఆంగికమైన వర్ణనం, హేతుక్రమంలో సంఘటనల ఏర్పాటు శ్రవ్యంతోపాటు దృశ్యానుగుణమైన ప్రత్యక్షీకరణ పద్ధతి మొదలైనవి వేరే కార ణాలూ ఉండకపోవు. ఒక్కొక్క రచయిత ఒక్కొక్క విధంగా సాధిస్తాడు కాబట్టి ఇలా అనడం జరిగింది. ఈ సంవిధానంలో మూర్త (కాన్‌క్రీట్) లక్షణం ప్రముఖంగా ఉండడమూ పేర్కొనదగినఅంశం.

ఇంతకుముందు చెప్పినట్లు గ్రంథమంతా ఈ విధానమే అవ లంబితం కావచ్చు. కొంతభాగం లేదా మధ్య మధ్య ఖండఖండాలు గానూ ఉండవచ్చు. అంతర్విశ్లేషణంలో రచయిత ప్రమేయం ఉంటుంది. ఇందులో అమూర్త (అబ్‌స్ట్రాక్ట్) లక్షణాని కవకాశం ఎక్కువ.

ఈ సందర్భంలో పేర్కొనదగిన మరొకటి—అంతర్భాష ణం (ఇంటర్నల్ మానోలాగ్). ఇది స్వగతం కాదు, ఏకాంతభాష ణమూ కాదు. దీన్ని చైతన్య స్రవంతిగా భావించే ప్రమాదమూ సంభవిస్తూ ఉంటుంది. ఇందులో మనస్సులో కదలికనుబట్టి ఒక భావం తరువాత మరొకటి క్రమిస్తుంది. మనస్సులో అది వచ్చినది వచ్చినట్లుగా పాత్ర సాధారణ సంభాషణలో రూపొందుతుంది. ఈ సమయం బుద్ధి చాలా వేగంగా పనిచేస్తూఉంటుంది. మూర్తమైన ఇంద్రియానుభవ ముద్ర నుండి అమూర్తమైన ఆలోచనలు, భావరూపాలు (ఇమేజెస్) ప్రసరిస్తూ ఉంటాయి. ఇది చాలా పరి మితమైన పరిధి కలిగింది. పాత్ర తీవ్రమైన, అనిర్దిష్టమైన (అన్ డయిరెక్టెడ్) ఆలోచనా గతికి గురైనపుడూ, ఇంకా స్వప్నస్థితి లోనూ, కాల్పనిక ధోరణిలో ఇంద్రియానుభవాన్ని వ్యక్తం చేసే ప్పుడూ ఈ విధానం ఉపయుక్తమౌతూంటుంది. పాత్ర మనస్సు ఒక లక్ష్యంతో విశ్లథనా (లూజ్‌గా) ధోరణిలో పనిచేస్తూ ఉంటుంది. అంతర్భాషణమూ, చైతన్యస్రవంతి ఒకటికాదు. దీనిలో దశాక్ర మం (పిరియాడిక్ మానర్) లేకపోవడంవల్ల, అస్పష్టస్థితిని బట్టి రచయిత ఎంతో మెలకువతో ఉపయోగించవలసి ఉంటుంది. లేక పోతే 'అయోమయం' గా రూపొందే ప్రమాదం ఉంది. దీన్ని దుజార్డన్ (లె మోనోలోగ్ అంతెరుర్) కనుగొన్నట్లు చెబుతారు. డోస్టొవిస్కీనవల్లో పాత్ర మనస్సునుండి ఖండ ఖండాలుగా వెలువడిన ఆలోచనా పరంపర ఈ పద్ధతిలో ఎంతో కళాత్మకంగా ఆవిష్కృతమైనాయి.

### 4

చైతన్య ప్రవంతి రచనా నిర్మాణం అనేక సంఘటనల పరంపరారూపం. దీనికి "ఫ్లక్స్" లేదా ప్రవహించేవస్తువం లేదా క్రియాత్మకత అవశ్యమైన లక్షణం. పాత్రపై దృష్టితో, దాని నిర్మి

తినిబట్టి- అంతరంగ చిత్రణంవల్ల, ఆలోచనలో అవిచ్ఛిన్న స్థితిచేత ఈభావం వ్యక్తమైంది, అంతరంగ ప్రసారం- ఒక క్రమపద్ధతిలో అర్థవంతంగా రూపొందాలి. ఇక్కడ అంతరంగ రూపం, జీవిత ప్రపంచం రెండూ అవినాభావ సంబంధం కలిగి ఉంటాయి. ప్రాథమిక (ప్రియమరీ కాంషస్‌నెస్) ఆవల ఉన్న స్మృతులూ ఆలోచనలూ అనుభూతులూ అన్నీ కలిసి ఏ అదుపూ, అణచివేత లేకుండా ఒక క్రమంలో అంటే గొలుసుగా కాక ప్రవాహం వలె సరిస్తూ ఉంటాయి. దీన్నే బెర్గ్‌సన్ అభిప్రాయానుసారం కాల ప్రవాహకత్వాన్ని బట్టి ఫ్లక్స్ అనడం జరిగింది. గొలుసు కూడా అవిచ్ఛిన్నంగా ఉండవచ్చు. ఒక కొక్కానికి మరొకటి చేర్చబడే నిర్మితం కావచ్చు. ఇందులో సహజమైన ఉద్గమనం ఎక్కడుంది? లేదు. శ్రమచేత సాధించిన ప్రయత్నరూపం ఇది. ఇందులో సృజనశక్తి లేదు. సహజమైన ఆవిర్భావం. లేదు. ఇంకా ఈ పదార్థంలో ఘనత్వం ఉంది. నిలకడ ఉంది. అయితే ప్రవాహంలో గతి వర్తనంఉంది. పదార్థంలో ద్రవత్వంఉంది. అందువల్ల "స్ట్రీమ్" అన్నమాట ఎంతో అర్థవంతంగా ప్రయుక్తమైనట్లు విదితమౌతుంది. పైగా అంతో ఇంతో ప్రవాహం లోతూ ఉంటుంది. నీటి లోతు అవ్యక్త చేతన (అన్ కాంషస్‌నెస్) కూ, నీటి ఉపతలం క్రింది భాగం ఉపచేతన (సబ్ కాంషస్ నెస్)కూ ప్రతీకలు. ఇది చాల ప్రసిద్ధమైందే. రెండు తీరాల మధ్య ప్రవహించే ప్రవాహం, మానసికమైన క్రమ గతిని సూచిస్తుంది. ఈ ప్రవాహ క్రియ కాలాను బంధమై ఉండడం విశేషం. అవిచ్ఛిన్నత్వమూ మరీ ముఖ్యం.

ఇందులో భౌతికమైన వస్తు విన్యాసం, అంతరంగ కథనానికి కేవలం ఆశ్రయ భూమిగానే ఉంటుంది. ఈ అంతరంగ కథనం, మనస్తత్వ ప్రధానమైంది. ఒకటి లేదా అంతకన్నా ఎక్కువ పాత్రల చైతన్యం విషయ రూపం కలదికాబట్టి- చైతన్య స్రవంతి సంవిధానం (టెక్నిక్)గా గుర్తించనివారూ లేకపోలేదు.[14] ఈ అభిప్రాయాన్ని గురించి ఆలోచిస్తే పాత్ర సమస్య కేంద్ర స్థానం వహించడమే హేతువనిపిస్తుంది. ఇది అన్ని నవలల్లోనూఉంటుంది ఇక్కడ దీని ఆవిష్కారంలో ఎంతోవిశిష్టత ఉంది. అదే చైతన్య స్రవంతి ధోరణి, కాబట్టి సంవిధానమనీ సమాధానం.

సృజన సాహిత్యంలో స్థూలమైన స్వరూపం దీన్ని గురించి నిర్దిష్టమైనా ఒక్కొక్క రచయితను బట్టి ఒక్కొక్క విధంగా రూపొందడం సహజం. రచయితనుంచి రచయితకూ, రచయిత రచనకూ రచనకూ ఈ భేదం గుర్తించవచ్చు. పాత్రస్వేచ్ఛ, సంఘర్షణతో ఆరంభమై అన్వేషణలో కొనసాగుతూ సజీవ దర్శనంగా రూపొందుతుంది. ఇక్కడ పాత్ర సహజత్వానికి భంగం రాకూడదు. అయితే దీని వెనుకనుండీ పనిచేసేవీ వాస్తవికాలే, కాని మనకు తెలీనివి, అందనివి కావడంవల్ల ఆశ్చర్యానికి ఆస్కారకాలవుతాయి.

ఈనాటి రచయితకు మనస్తత్వ శాస్త్రంతో అంతో ఇంతో స్థూలమైన పరిచయమైనా అవసరం. ఈ సంవిధానం మనః ప్రపంచాన్ని దర్శించే, పరిశోధించే సాధనం. జీవితం అంతః పార్శ్వాలను గురించిన విశ్లేషణమూ, వివేచనమూ దీనిసహాయంతో చేయబడుతుంది. ప్రత్యక్షమైన జీవితం నుండి అప్రత్యక్షమైన చైతన్యం వరకూ అంతా అనుభవ లోకమే. "అనుభవం ఎప్పుడు మితం కాదు. అది ఎన్నటికీ సంపూర్ణం కాదు"[15] మనిషిలో కోర్కెలు, ఆలోచనలు, ప్రవర్తనలతో సంబంధం గల చర్యలు, ప్రతి చర్యలు కలసి ఏర్పడిన సంఘటనల క్రమం జీవితం. దీని అనుభవం చైతన్యం ఉపరితలపైని సామాన్యమైన పొరనుండీ, అట్టడుగున ఉన్న మహనీయమైన లోపొవరకూ వాస్తవమైంది. ఈ కారణంగా చైతన్యపుటర (ఛాంబర్ ఆఫ్ కాంషస్‌లెస్) నకు అనుభవపుటర (ఛాంబర్ ఆఫ్ ఎక్స్‌పీరియెన్స్) గా పేర్కొనడం జరిగింది. ఇది ఒక ముఖం కాదు. సామాన్య వ్యక్తిగా సంఘ సభ్యుడుగా, కుటుంబ సభ్యుడుగా, మానవుడుగా, ఇలా ఇందులో ఇంకెన్నో! స్నేహితుడు పరిచయస్థుడు। వైయక్తికమైన జాతి, సంస్కృతీ పరంగా మానవతా లక్షణంతో ఎంతో వైవిధ్య విలసితమైంది. దేన్ని కదిలించినా ఒక తరంగంవలె ఉద్గమిస్తుంది. దీన్ని ఒక క్రమంలో కదపడంలో ఒక రీతిగా సంయోజించడంలో రచయిత శిల్పం ఎంతో అవసరమౌతుంది. దీని అతిశయమైన ప్రాముఖ్యాన్ని బట్టీ చైతన్యస్రవంతిని సంవిధానంగా గుర్తించడా కి అవకాశం లభిస్తోంది.

స్మృతులు, ఆలోచనలు అనుభవాల వెనుకనున్న మానవ మనోజీవితాన్ని యథార్థ జీవితతలంపై చైతన్యాత్మకంగా ప్రవహింపజేయడంలో ఇతర ప్రక్రియలకన్నా నవల్లో ఈ సంవిధానం బాగా విజయవంతమైంది. ఈ విధమైన నవలలకు సాహిత్యంలో ప్రత్యేకమైన స్థానమూ ఉంది. పాఠకునికీ దీన్ని గురించిన పరిచయం వల్ల ఇంకా బాగా అనుభవంలోకి తెచ్చుకొని, ఆనందించగలడు. ఆ పైన ఆలోచనకూ అవకాశం ఉంది. దీనివల్ల అతడు రచన చదివి పొందే అనుభవానికీ, చేసే ఆలోచనకూ ఎంతో ప్రయోజనకరమైన విస్తృతి కలుగుతుంది. ఇంకా వ్యక్తుల సమాహారమైన సమాజపరంగానూ, ఎన్నో మానసికమైన అవలక్షణాల తొలగింపుకూ, విషమస్థితుల్ని సరిచేయడానికీ ఉపకరిస్తుంది. వ్యక్తుల్లో దాగిన ఎన్నో రహస్యరూపాలనూ దర్శింపజేస్తుంది. మొత్తం మీద గుప్తమైన స్వస్వరూపం అవగతికి రావడంవల్ల

మానసికంగా ఆరోగ్యకరమైన వాతావరణానికి దారి తీస్తుంది. అయితే చివర ఒక మాట, సృజనాత్మక సాహిత్యంలో కళాత్మక వివేచనలో, మనస్తత్వ పరమైన పరిశీలనకూ కొన్ని పరిమితులు లేకపోలేదు. సాహిత్య దర్శనంలో ఇదీ ఒక పరిహరింపరాని భాగంగా గుర్తింపజేయడమే ప్రస్తుతాశయం.

## వ్యాస సూచికలు

1. ఆర్కి (i) : "ఛీఫ్ టయిప్ ఆర్ మాడెల్; ఒరిజినల్ టయిప్ ఆర్ పాటర్న్ ప్రియిమార్డియల్ ఇమేజ్" అనీ అంటారు. దీన్ని పురా (భావ) రూపం అనడం జరిగింది.

2. విలియమ్ జేమ్స్ : (1842-1910) అమెరికన్ తత్వవేత్త. తత్త్వశాస్త్రం, మనస్తత్వశాస్త్రం వ్యాసంగంలో జీవితమంతా గడిపాడు. ఇతని రచనలు: 1. ప్రిన్సిపల్స్ ఆఫ్ సయికాలజి 2. వెరయిటీస్ ఆఫ్ రెలిజియస్ ఎక్స్‌పీరియన్స్. 3. ది మీనింగ్ ఆఫ్ ట్రూత్.

3. 1) దోరోతీ రిఛార్డ్‌సన్ :నావెల్; పిల్

: "ఇన్‌వెంటెడ్ ది ఫిక్షనల్ డెపిక్షన్ ఆఫ్ ది ఫ్లో ఆఫ్ కాంషస్‌నెస్" - బౌలింగ్.

2) "ఇట్ ఈస్ సయికలాజికల్ ఆటోబయోగ్రఫీ" - బౌలింగ్.

4. హెన్రీ జేమ్స్. : (1843-1916) ఆంగ్లో అమెరికన్ నవలా రచయిత. ఇతని నవలలు: 1. పెడ్రిక్ హడ్సన్ 2. పోర్‌ట్రెయిట్ ఆఫ్ లేడీ 3. ది గోలెన్ బౌల్.

5. వర్జీనియా వూల్ఫ్ : నవలలు 1. మిసెస్ 2. ది వెట్ హవుస్ 3. వేవ్స్

6. "ఎక్సామిన్ యాన్ ఆర్డినరీ మయిండ్ ఆన్ యాన్ ఆర్డినరీ డే .... లయిఫ్ ఈస్ ఎ లూమినస్ హేలో, ఎ సెమీ ట్రాన్స్‌పేరెంట్ ఎన్‌వలప్ సరవుండింగ్ అస్ ఫ్రమ్ ది బిగినింగ్ ఆఫ్ కాంషస్‌నెస్ టు ది ఎండ్" — వేవ్స్

7. జేమ్స్ జాయస్ : నవలలు 1. యులిసెస్ 2. ఎ పోర్ట్రయిట్ ఆఫ్ ది ఆర్టిస్ట్ యాస్ ఎ యంగ్ మాన్. రెండవ రచనలో పాత్ర స్టీఫెన్ ముసుగులో రచయిత కళా రూపంయొక్క పరిణామ సిద్ధాంతాన్ని వ్యక్తం చేశాడు - హెరాల్డ్ ఇ టాలివర్.

8. విలియమ్ ఫాల్క్‌నర్ : 1. ది సౌండ్ ఆఫ్ ఫ్యూరీ 2. యాస్ ఐ లే డయింగ్

9. లిబిడో : లైంగిక వాంఛారూపం (ఫ్రాయిడ్)

10. మేసింక్లేర్ : దోరోతీ రిఛార్డ్‌సన్ మీద వ్యాసంలో "దేర్ ఈస్ నో డ్రామా, నో సిట్యుయేషన్, నాట్ సెట్ సెన్స్, నథింగ్ హాపెన్స్ ఇట్ ఈస్ జస్ట్ లయిఫ్ గోయింగ్ ఆన్ ఎండ్ ఆన్. ఇట్ ఈస్ మిరియమ్స్ స్ట్రీమ్ ఆఫ్ కాంషస్‌నెస్ గోయింగ్ ఆన్ ఎండ్ ఆన్." ఇగాయిస్ట్ - ఏప్రిల్, 1918.

11. "స్ట్రీమ్ ఆఫ్ కాంషస్‌నెస్ ఈస్ ఎ మెతడ్ విచ్ గివ్స్ అజ్ ఎ డయిరెక్ట్ కొటేషన్, ఫ్రమ్ ది మయిండ్, వితవుట్ ది ఆథర్స్ కామెంట్ ఆర్ ఎనాలిసిస్" - లారెన్స్ ఎడ్వార్డ్ బౌలింగ్ - స్ట్రీమ్ ఆఫ్ కాంషస్‌నెస్.

12. "ఇఫ్ ది ఆథర్ హిమ్‌సెల్ఫ్ యింటర్‌వెన్స్ టు యింటర్‌ప్రెట్, ఎనాలిసిస్ ఆర్ కామెంట్, హవెవర్ హి ఎంప్లాయిస్ ఎ డిఫరెంట్ మెతడ్, విచ్ షల్ బి లేబిల్డ్ యాస్ ఇంటర్నల్ ఎనాలిసిస్."

13. వెర్‌సిమిలిట్యూడ్ : (జీవిత) సత్యాన్ని పోలిన రూపం; నవలలో వాస్తవి కతకూ, రూపకల్పనకూ గల స్థానాన్ని గురించిన చర్చకు ఆధారమైన ప్రధానాంశం. ఈ సత్యం జీవితంలోని యథార్థ స్థితికి సంబంధించింది. ఇది భౌతికం కావచ్చు. మానసికమూ కావచ్చు.

14. వాలస్ ఏమ్. బాకన్.

15. ఎక్స్‌పీరియన్స్ ఈస్ నెవర్ లిమిటెడ్ ఎండ్ ఇట్ ఈస్ నెవర్ కంప్లీట్‌- హెన్రీజేమ్స్.



# వి ను తి వి నో ద ము

## శ్రీ వేముగంటి నరసింహాచార్యులు

సీ॥ శిరముపై గాంగ నిర్ఝరిణి సంధానించి
నుదుట చిచ్చరకన్ను పొదిగినావు
జడముడి నమృతాంశుబుడుతను సవరించి
గళమున విషమును నిలపినావు
సర్వమంగళను మైసగమున ధరియించి
కాటికాపురమును గాంచినావు
పులితోలు చలువదువ్వలుగా దాలిచి
ఎద్దు వాహనముగా నెసగినావు

గీ॥ చిత్ర చిత్రముల్ నీచేయుచేష్టలెల్ల
నీ ప్రభావము నెన్నగా నేర్చునెవడు ?
పరమ భుజగాధిపాకల్ప! భక్తకల్ప!
కామదాహక! చండీశ! వ్యోమకేశ!

సీ॥ స్థాణువై నీవు నిర్వాణము నొసగ
అపర్ణయై తా సుఖపాత్రమూను
గిరిశుడవై నీవు సరసత చూప తా
గిరిజయె నీలోన కరగిపోవు
రుద్రుడవై నీవు భద్రములీయ తా
చండికయై సౌమ్యసరణి నెరపు
ధవళా కృతిని నీవు నవరక్తి వెలయింప
గౌరియై తాను రాగంబు నిలుపు

గీ॥ ఈశ్వరుండవై నీవు వహిమ వహింప
ఆర్యయై తాను పూజలనందుకొనును
నీవు పార్వతి దంపతిభావమొంది
వెలయు టెంతయు ఉచితము విశ్వనాథ!

గీ॥ అంతరాయ సంతప్తలోకాళికి తత
విఘ్నసంహారకుండు ప్రాప్తించుటయును
దనుజబాధితులై కడు వనటనొందు
వేలుపులకు సేనాని లభించుటయును
భవ్యమైన మీ దాంపత్యఫలముగాదె ?
విశ్వహితులార! జగదేకపితరులార!

పత్రి భావము

# పుప్పొడి చినుకులు

## "సౌంధ్యశ్రీ"

ఎవడన్నాడో కానీ
దేశమంటేకాదని.... ?
కాదన్నవాడికేం తెలుసు ఈ క్రమాన్వాతకవ్రతం.

ఒక్కబిడ్డను కని స్త్రీ మాతృశబ్దానికి నిఘంటువైతే
ఇందర్ని కన్న మట్టి
ఏ నైఘంటికార్థానికి లోబడుతుంది.... ?

ఋతానికి
సత్యానికి
మధ్య
మండిగంమీద పెట్టిన మహాదీపం నేల....

సత్య ఋత శౌర్యాల్ని ఆవహించుకొని
దీక్షాతపస్సుల్ని సమీకరించుకొని
జ్ఞానయజ్ఞాల్ని
కత్తితో - సుత్తితో
నాగలితో - దాగలితో
సమారాధనకు సమర్పిస్తే
సప్తర్షిత్వాన్ని సంతరించుకుంటాడు మనిషి

బిడ్డల్ని కన్నతల్లికి
ఈ పృథివికి
ఇంతకన్నా మహాపర్వం మరొకటుందా.... ?

పులకించి ఒడిని పూలబుట్ట చేసుకొని
పుప్పొడిని చల్లుతున్న పృథివిని
అమానుషుడెవ్వడో___
అట్టహాసంగా చాపచుట్ట చుడితే
దేశంకాదు లెమ్మని - ఊర్కొన్న

నిద్రారోగికాదు మిత్రమా - ! మన దైవం....
మేల్కొన్న - నువ్వు నేను....

విశ్వాసపాత్రమైన
నిప్పుల్తొమండించే ఉద్రేకంలో
ఉనికిని పోగొట్టుకుంటాడని
ఎంత ఓర్పును నేర్పుతోందో నేల మనిషికి....

మనిషి మర్త్యుడేకానీ -
చచ్చిపోయి బ్రతుకుతారు శాశ్వతంగా - కొందరు
వాళ్ళకోసం....

భీకరాకారంతో ఒళ్లు విరుచుకుంటున్నతుఫాను
కెరటాలతో విరుచుకుపడుతున్న మహార్ణవం

యుద్ధాగ్ని జ్వాలల్తో మదించిన చలినికాచుకుంటున్నపదవి
నేలమీద - ఉద్రేకంతో ఉన్మాద చర్యలకొడిగడితే
మౌనసమాధిలో ఔదార్యాన్నావహించిన
మహాక్షమావ్రత క్షితి....

చూశావా - తూట్లుపడ్డ హృదయంలోంచి
మూలికాబీజాలు తలెత్తి నమస్కరించటం
గాయపడ్డ శరీరంమీద కూడా
ఓర్పుగా ఆకుపచ్చను పులుముకొనటం... ?

మిత్రమా...
మానవతకన్న ఒక మెట్టు ముందున్న మాతృశక్తి
శక్తినిలయ శబ్దస్పందనాజాత విశ్వానికి
అక్షరాభ్యాసం చేసే తొలిదినాల్లో
మనిషికన్నముందు మనసును పరివ్యాప్తం చేసింది.... !

శ్రీ ముదిగంటి సత్యనారాయణ రెడ్డి

# భూ సంస్కరణలు

# దాని అమలుపై ఒక పరిశీలన

(గత సంచిక తరువాయి)

## గ్రామీణ ఆరోగ్య పూర్వ రంగము

ఈ గ్రామములో పరిస్థితులు సరిగా లేవని సర్వే వలన వెల్లడి అయినది. వీరి ఆరోగ్యము బాగుగా లేనందులకు కొన్ని దురలవాట్లకు పాలుపడుటవలన మరియు కొన్ని పరిసర ప్రాంతాలు శుభ్రంగా లేకుండా అని తెలియుచున్నది. ఆ దురలవాట్లలో ముఖ్యమైనవి మద్యపానము, పొగత్రాగుట (చుట్ట త్రాగుట) మరియు మురికి నీటి పారుదల సరిగా లేకుండుట. వారిలో అనేకులు మద్యపానము చేయుటకు ఈ క్రింద నుదహరించిన కారణములు తెల్పినారు.

1. ఋణ బాధను మరచుటకై.
2. కుటుంబ భారము వలన.
3. ఆరోగ్యము బాగుగా లేక వారికిగల ఛాతి నొప్పిని మరియు తదితర బాధలను మరచుటకై.
4. కష్టము ఎక్కువ చేయుటవలన.

ఈ కారణాల వలన మద్యపానము చేయుటకు అలవాటైనామని. తత్ఫలితంగా గ్రామ ప్రజలలో కొందరు అనారోగ్యాన్ని వరించుచున్నట్లుగా ద్యోతకము అవుచున్నది. ఈ అనారోగ్యాన్ని దూరంజేసి, ప్రజలను ఆదుకొనే ఆరోగ్య వసతులు మరియు ఆరోగ్య సిబ్బంది లేరు. దవాఖానాలు కూడా లేవు. ఈ గ్రామము నుండి సుమారు 8 కి. మీ. దూరములో నున్న మల్యాల తాలూకా కేంద్రమునకు వైద్య సహాయానికి పోవలసి ఉన్నది. వీరు ఎక్కువగా ప్రైవేటు ఆసుపత్రులకు పోవుదురు.

వీరిలో అనేకుల అభిప్రాయాలను పరిశీలించగా తెలిసినది ఏమనగా వారు ప్రభుత్వ ఆసుపత్రులకు వైద్య సహాయానికి పోరనియు వానికి ఈ క్రింద నుదహరించినవి కొన్ని ముఖ్య కారణములు అని తెలియుచున్నది.

1. ప్రభుత్వ ఆసుపత్రుల వారు బాగుగా చూడరని.
2. అది వారి పరిసర ప్రాంతములకు దూరముగా ఉన్నదని.
3. ప్రభుత్వ ఆసుపత్రిలలో ఎక్కువ కాలయాపన చేయవలసి వచ్చునని.
4. ప్రభుత్వ ఆసుపత్రిలలో వెచ్చించే కాలములో సంపాదన దెబ్బతినునని (ప్రైవేట్లు ఆసుపత్రిలకు పోవుచున్నామని).
5. ప్రభుత్వ ఆసుపత్రిలలో కూడా డబ్బులు అడుగు

మొదలగు కారణాల వలన ప్రభుత్వ ఆసుపత్రిలకు కాకుండా ప్రైవేటు దవాఖానాలకు వెళ్లుచున్నట్లు ఈ సర్వేలో తెలిపినారు.

## గ్రామీణ రాజకీయ పూర్వ రంగము

ఈ గ్రామములో రాజకీయంగా ఆలోచించినచో ఎక్కువ మంది కాంగ్రెస్, జనతా పార్టీలలో అగ్రకులాలవారు ఎక్కువగా ఉన్నారు. వానికి వ్యతిరేక పార్టీగా కమ్యూనిస్టు భావాలు కల్గి అగ్రకులాలలోని బీదవారు; వెనుకబడిన తరగతులవారు మరియు షెడ్యూల్డు కులాలకు చెందిన యువకులు కాంగ్రెస్, జనతా పార్టీలోని ధనిక వర్గాలకు వ్యతిరేకంగా కలిసినారు. ఈ కమ్యూనిస్టు భావాలు కల్గిన యువకులను సంఘటిత శక్తి కాకుండా, వీరిలో వీరికి కలతలు ద్వేషాలు లేపటం, ఏవో నేరాలను పెట్టి పోలీసులకు పట్టి ఇవ్వడముద్వారా అగ్రకులాలకు చెందిన ధనిక వర్గాలవారు వీరిని అణగద్రొక్కుచున్నారు. కాని వీటిని కొందరు ఎదుర్కొని

ముందడుగు వేస్తున్నారని చెప్పుట నిస్సందేహమైనదే. వీరు (యువకులు) ఒక సంఘటిత సంఘంగా ఏర్పడకపోవుటకు కారణాలను ఈ సర్వేలో వెలిబుచ్చినారు. వాటిలో ఇవి కొన్ని —

1. ఆర్థిక స్తోమత లేకపోవుట.
2. నిరక్షరాస్యత.
3. తమకు మిగులు సమయము లేనందున.
4. వారు ఐక్యతను పొందకుండా వారి ప్రయత్నాలను అగ్రకులాలకు చెందిన ధనిక వర్గమువారు విఫలము చేయుటవలన.

మొదలగు కారణాల వలన వారు గ్రామీణ రాజకీయాల్లో చురుకుగా పాల్గొనలేక పోవుచున్నారని, ఈ సర్వేలో తెలిసికొననైనది.

## గ్రామీణ ప్రాంతాలలో భూసంస్కరణల అమలుపై ఒక గ్రామ ప్రాంత పరిశీలన - గ్రామ ప్రజలు వెలిబుచ్చిన అభిప్రాయాలు

కరీంనగరం జిల్లాలోని జగిత్యాల తాలుకా ప్రస్తుతము మల్యాల తాలుకాలోని మేడంపల్లి గ్రామములో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వముచే 1975 సంవత్సరములో భూసంస్కరణల అమలు చేయుటకై సన్నాహాలు జరిగినవి. ఈ సంస్కరణలు "ఆంధ్ర ప్రదేశ్ భూసంస్కరణలు [సీలింగ్‌లో అగ్రికల్చరల్ హోల్డింగ్స్] చట్టము 1973" మూలముగా చేయుటకై సంకల్పించబడినది. ఈ చట్టము ఆంధ్రప్రదేశ్ 1-1-1975 నుండి అమలులోనికి వచ్చునట్లుగా తీర్చిదిద్దడము జరిగినది. ఈ చట్టానికి ఆంధ్ర ప్రదేశ్ భూసంస్కరణల అమలుకై రూల్సు, 1974ను కూడా రచించి ఆయా రెవెన్యూ ఆఫీసర్లను భూసంస్కరణల ట్రిబ్యునల్స్ గా నియమించి భూసంస్కరణలను అమలు చేయుటకు కృతనిశ్చయులైనారు. అయితే కరీంనగర్ జిల్లాలో మూడు భూసంస్కరణల ట్రిబ్యునల్స్‌కు సంబంధించి స్పెషల్ తహశీలుదారు [భూసంస్కరణలు] ఎ. ఓ. ప్రభుత్వ తరపున మరియు ఇతర సిబ్బందితో నెలకొల్పినారు. ఇది కరీంనగరం జిల్లాలోని జగిత్యాల, కరీంనగరం, పెద్దపల్లి రెవెన్యూ డివిజనులలో స్థాపించి వారిని పర్యవేక్షించుటకై జిల్లా భూసంస్కరణల అధికారి [డి.ఎల్. ఆర్. ఓ.] కరీంనగరం జిల్లా కేంద్రములో స్థాపించబడినవి. ఈ విధముగా స్థాపించిన భూసంస్కరణల కార్యాలయములు 1-1-1975 నుండి పని చేయుట ప్రారంభించి సుమారుగా 1977 సంవత్సరము వరకు ముమ్మరంగా పనులు కొనసాగించబడి, రెండు ట్రిబ్యునల్స్ [జగిత్యాల మరియు పెద్దపల్లి] రద్దుచేయబడి వాటి రికార్డులను కరీంనగర్ ట్రిబ్యూనల్‌కు అప్పగించబడినవి. ప్రస్తుతము కరీంనగర్ ట్రిబ్యునల్ మరియు దాన్ని పర్యవేక్షించుటకై డి. ఎల్. ఆర్. ఓ. [జిల్లా భూసంస్కరణల కార్యాలయము] జిల్లా కేంద్రములో పనిచేయుచున్నవి.

ఈ చట్టము ప్రకారము భూ పరిమితిని ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ ప్రాంతాలలో వివిధ రకాలుగా నిర్ణయించబడినది. భూమిని ముఖ్యంగా తరిలో 6 రకాలుగా [ఎ, బి, సి, డి, ఇ, యఫ్.] మరియు ఖుష్కీని 5 రకాలుగా [జి, హెచ్, ఐ, జె, కె,] విభజించి ఆయా రకానికి కొంత భూపరిమితిని నిర్ణయించినారు. వీటి వివరాలు ఈ క్రింద నుదహరించి బడినవి.

| | | రెండు పంటల తరి భూమి | రెండు పంటల పరిధిని తరి భూమి |
|---|---|---|---|
| ఎ | తరగతి భూమి | 10 ఎకరాలు | 15 ఎకరాలు |
| బి | ,, | 12 ,, | 18 ,, |
| సి | ,, | 13.20 ,, | 20 ,, |
| డి | ,, | 15 ,, | 22.20 ,, |
| ఇ | ,, | 16.20 ,, | 25 ,, |
| యఫ్ | ,, | 18 ,, | 27 ,, |
| | | | ఖుష్కీ |
| జి | ,, | — | 35 ,, |
| హెచ్ | ,, | — | 40 ,, |
| ఐ | ,, | — | 45 ,, |
| జె | ,, | — | 50 ,, |
| కె | ,, | — | 54 ,, |

ముఖ్యంగా కరీంనగర్ జిల్లాలో తరికి సంబంధించిన భూములలో ఇ. యఫ్ తరగతులకు మరియు ఖుష్కీ సంబంధించిన భూముల్లో హెచ్, ఐ, జె, కె, తరగతులకు చెందిన భూములు ఉన్నట్లు విజ్ఞులద్వారా తెలిసికొనడమైనది. అదే ప్రకారముగా ఒక వ్యక్తి లేక ఒక కుటుంబ యూనిటు (ఐదుగురు కుటుంబ సభ్యులుగా మించకుండ ఉండునట్లుగా) కు ఒక్కొక్కింటికి ఒక స్టాండర్డ్ హోల్డింగ్ భూ పరిమితి అని నిర్ణయించ బడినట్లుగా ఆ యస్. హెచ్. ను వివిధ భూములు వివిధ రకాలుగా ఉండునట్లుగా తెలుసుకొన్నాను. భూమిలో మార్పు వచ్చిన భూమి పరిమితిలో మార్పు వచ్చే అవకాశము ఉన్నదని తెలుసుకున్నాను. అయితే ఈ ప్రస్తుత సర్వే ఆ గ్రామా

నికి నీటి పారుదల కల్పించకముందే చేయనైనది. ప్రస్తుతము కొంత భూమి నీటి పారుదల క్రిందకు తీసుకొని వచ్చినారు.

ఈ విధముగా చేసిన భూ సంస్కరణాల అమలుపై నేను పరిశీలించ దలచి ఒక సమగ్ర ప్రశ్నావళిని సమకూర్చుకొని మ్యాదంపల్లి గ్రామ నివాసులైన 100 మంది రైతులను కలుసుకొని వారి వారి అభిప్రాయాలను సేకరించనైనది.

వారి అభిప్రాయాల నివేదికను ఈ క్రింద నుదహరించనైనది. దీనితో ఆ గ్రామములో భూ సంస్కరణల అమలుపై ఒక చక్కని అవగాహన ఏర్పడవచ్చుననే ఆశాభావముతో చేయనైనది.

భూ సంస్కరణలపై ప్రశ్నావళి మరియు 100 మంది ఇచ్చిన అభిప్రాయాలు :

| | |
|---|---|
| 1. భూకమతాలపై ప్రభుత్వం పరిమితులను విధించినట్లు వినియుంటిరా ? | అందరు విన్నామని చెప్పినారు. |
| 2. విన్నచో ఎటువంటి పరిమితులను విధించడం జరిగింది ? | 1. కొందరు 25 ఎకరాలు<br>2. మరికొందరు 20 ఎకరాలు<br>3. ఇంకొందరు 15 ఎకరాలు<br>4. మిగిలినవారు 5 ఎకరాలు<br>ఇందులో ఎక్కువమంది 5 ఎకరాలు చెప్పినారు. |
| 3. ఎవరిద్వారా వింటిరి ? | 1. పత్రికల ద్వారా<br>2. ప్రజలద్వారా<br>3. రేడియో ద్వారా<br>4. చదువుకున్నవారి ద్వారా |
| 4. మీ ఊళ్ళో ఎంతమంది ఈ పరిమితిలోకి వస్తారు. | 8 మంది |
| 5. భూమి ఎక్కువ ఉన్నవారు ఏదోవిధంగా భూమి పోకుండ చేసుకుంటున్నారని తెలిసినది. | మంది చెప్పినది ఏమనగా భూస్వాములు తమ భూములు పోకుండా చేసికొంటున్నారని. |
| 6. వారు పరిమితిలోనికి రాకుండా ఏవిధంగా తప్పించుకొనుచున్నారు. | ఈ ప్రశ్నకు సర్వేలో అనేకులు ఒక్కొక్క రకాన్ని వెలిబుచ్చినారు. వారి వారి అభిప్రాయాలను ఈ క్రింది పటికలో క్రోడీకరించనైనది. |

పట్టిక - 14

వారు పరిమితిలోనికి రాకుండ తప్పించుకొనే మార్గాల వివరాలు :

| క్ర. సం. | వారు అవలంబించే మార్గాలు | అభిప్రాయాలు ఇచ్చిన వారి సంఖ్య |
|---|---|---|
| 1. | కొడుకులు, బిడ్డల తరపున | 47 |
| 2. | వారి జీతగాండ్ల తరపున | 10 |
| 3. | వంట మనుషుల తరపున | 9 |
| 4. | బంధువుల తరపున | 20 |
| 5. | అమ్ముకొనుట వలన | 66 |
| 6. | మిగులు భూముల మీద అప్పులు తీసికొనుట వలన | 4 |
| 7. | గుమాస్తాల తరపున | 1 |
| 8. | దాసీల తరపున | 2 |

వీరి అభిప్రాయాల ప్రకారము భూమికలవారు ఎక్కువ శాతము భూములను అమ్ముకొనుట వలన ప్రథమము మరియు ద్వితీయ మార్గము కొడుకుల, బిడ్డల తరపున భూములను మార్పించి భూపరిమితి నుండి తప్పించుకొనుచున్నారని ఈ సర్వేలో తెలియవచ్చింది.

7. భూమి పరిమితిలో నుండి తప్పించుకొనేందులకు ఎవరు సహాయ పడుచున్నారనే ప్రశ్నకు ఈ సర్వేలో అనేకులు ఒక్కొక్కరు ఒక్కొక్క తీరుగా తమ అభిప్రాయములను వెలిబుచ్చినారు. వారి అభిప్రాయాలను ఈ క్రింది పట్టికలో చూడవచ్చు.

పట్టిక - 15

భూమి పోకుండా తప్పించుకోవడంలో సహాయపడు వారి వివరాలు

| క్ర. సం. | సహాయ పడువారు | అభిప్రాయాలు ఇచ్చిన వారి సంఖ్య | శాతం |
|---|---|---|---|
| 1. | పట్వారీ | | 69 % |
| 2. | తహశీలుదారు | 16 | |
| 3. | కలెక్టరు | 8 | 8 % |
| 4. | న్యాయవాదులు | 4 | 4 % |
| 5. | గిర్దావరు | 1 | 1 % |
| 6. | సర్పంచ్ | 1 | 1 % |
| 7. | పోలీసు పటేలు | 1 | 1 % |
| | | 100 | 100 % |

దీనిని బట్టి చూడగా పట్వారీలు 69%, తహశీలుదార్లు 16% ఈ భూమిని కోల్పోకుండా భూకామందులకు సహాయకారులుగా ఉన్నట్లుగా వారిది ప్రథమ ద్వితీయ స్థానాలని తెలియుచున్నది.

8. దున్నేవారికి భూమి ఇవ్వడం అవసరమా? అనే ప్రశ్నకు ఈ సర్వేలో అధిక శాతం మంది అవసరమే అని తమ అభిప్రాయాలను వెలిబుచ్చారు. ఎందుకనగా మంచిగా బ్రతకవచ్చుని మరియు భూమి అందరికి లభించుననీ, మరియు భూమి కలవారిలోని అసమానతలు తొలిగిపోవునని.

9. భూమి కొంత మంది చేతులలో ఉండటానికి కారణ మేమి అని ప్రశ్నించగా ఈ సర్వేలో ఒక్కొక్కరు ఒక్కొక్క రకంగా తమ అభిప్రాయాలను వెలిబుచ్చినారు. వారి అభిప్రాయాలను పట్టిక-16 లో క్రోడీకరించనైనది.

పట్టిక - 16

భూమి కొంత మంది చేతులలోనే ఉండుటకు కారణాలు :

| క్ర. సం. | కరణకు కారణాలు | అభిప్రాయాలు ఇచ్చిన వారి సంఖ్య |
|---|---|---|
| 1. | అప్పులు పెట్టి | 29 |
| 2. | నిరక్షరాస్యత వలన (తెలివిలేక) | 61 |
| 3. | బెదిరించి | 19 |
| 4. | తహశీలు చెల్లించలేక | 10 |
| 5. | పట్వారీలు, అధికారులు అగ్రకులాల వారగుటవలన | 10 |
| 6. | శారీరక, కామ సుఖాలకై కొందరు భూమిని అప్పగించుటవలన (కొందరు ఉంచుకోనుట వలన) | 7 |
| 7. | ఇద్దరి మధ్యలో తగ్గవులు సృష్టించి | 4 |

వీరి అభిప్రాయాల ప్రకారము తమ తమ భూములను కొందరి చేతులలో కేంద్రీకృత మగుటకు కార్ణములు వారు నిరక్షరాస్యులగుట మరియు తెలివి లేకపోవుట వలన, వారి దగ్గర అప్పులు తెచ్చుకొనుటవలన, అగ్రకులాల వారి బెదిరింపుల వలన, భూమి శిస్తును చెల్లించే అవకాశము లేదని మొదలగు కారణాలను ఈ సర్వేలో వెల్లడించారు.

10. మీ కెంత భూమి ఇస్తే బాగుంటుందనే ప్రశ్నకు జవాబుగా ఈ సర్వేలో ఒక్కొక్కరు ఒక్కొక్క రకంగా తమ తమ అభిప్రాయాలను వెలిబుచ్చినారు. వారి అభిప్రాయాలను ఈ క్రింది పట్టికలో గమనించవచ్చు.

పట్టిక - 17

ఎంత భూమి ఇస్తే బాగుంటుంది అనే వివరాలు

| క్ర. సం. | భూమి ఏకరాలు | అభిప్రాయాలు ఇచ్చినవారి సంఖ్య | శాతం |
|---|---|---|---|
| 1. | 0-1 | | |
| 2. | 1-2 | 22 | 22% |
| 3. | 3-5 | 66 | |
| 4. | 6-8 | 7 | 7% |
| 5. | 9-10 | 5 | 5% |
| | | 100 | 100% |

దానినిబట్టి చూడగా 66% మంది 3-5 ఎకరాల భూమిని, 22% మంది 1-2 ఎకరాల భూమిని పంపిణీ చేస్తే బాగుంటుంది అనే అభిప్రాయాలను ఇస్తే 7% మంది 6-8 ఎకరాల భూమిని, 5% మంది 9-10 ఎకరాల భూమిని ఇస్తే బాగుంటుందని అభిప్రాయాలను వెలిబుచ్చినారు. అయితే ఏ ఒక్కరుకూడా 0-1 ఎకరాల భూమిని తీసికొనుటకు సుముఖత తెలియ చేయలేదు. అధికశాతం 3-5 ఎకరాల కొరకై చెప్పినారు [66%].

11. ఈ సర్వేలో 3-5 ఎకరాల భూమిని కావాలన్న 66% మందిని అంతే భూమి ఎందుకు కావాలని అనుకొంటున్న వారిని పరిశీలించగా వారు ఈ క్రింద నుదహరించిన అభిప్రాయాలను వెలిబుచ్చినారు.

1. ఎక్కువ భూమి అయినచో సక్రమంగా సాగుచేయలేరని
2. ఎక్కువ పెట్టుబడి పెట్టలేమని.
3. అందరికి పంపిణీ అందాలని.

12. మీ గ్రామములో భూమి పంపిణీ చేసినట్లయితే ఎవరైనా వ్యతిరేకిస్తారా అని ప్రశ్నించగా ఈ సర్వేలో అందరు భూమి ఉన్నవారు వ్యతిరేకిస్తారని చెప్పినారు. అటువంటి వారు ఎంతమంది ఉంటారని అడుగగా వారిలో కొందరు 4 గురు అనియు మరి కొందరు 8 మంది అనియు ఇంకొందరు 20 మంది అని చెప్పినారు. 20 మంది ఉన్నారని చెప్పిన వ్యక్తులను తిరిగి ప్రశ్నించగా 20 మందిలో ఎవరిది పోతున్నను వారికి సంబంధించిన బంధువులకు పోతుందని వ్యతిరేకిస్తారు. వ్యతిరేకించే 4 గురు

నుండి 8 మంది భూస్వాముల గురించి ప్రస్తుత సర్వేలో పాల్గొన్న వారిని ప్రశ్నించగా వారు ఈ క్రింద నుదహరించిన కారణాలు వెలిబుచ్చినారు.

1. భూమి పోతుందని.
2. తెల్లబట్టలు వేసుకొని తిరుగలేమని
3. ఇతరులు చెప్పినట్లుగా వినరని
4. వారి పెత్తనము పోతుందని
5. జీతగాండ్లు ఉండరని
6. క్లబ్బులకు తిరుగలేమని

మొదలగు కారణాలను వారు తెలియజేసినారు.

13. మీ గ్రామములో భూమి పంపిణీ ఎంతమంది సమర్థించుతారని ప్రశ్నిస్తే ఈ సర్వేలో పాల్గొన్న వారిలో 95% మంది సమర్థిస్తారనే చెప్పినారు. అయితే వారందరు కలిసికట్టుగా సమర్థించరు. సమర్థించలేక పోవుటకు సమగ్రపరిశీలన చేస్తే వారిలో ఐకమత్యం, కలిసికట్టు తనం లేకపోవుట అని తెలియ వచ్చింది. ప్రజలు ఐక్యంగా లేకుండుటకు కారణాలను, వారి అభిప్రాయాలను సేకరించి ఈ క్రింద నుదహరించిన పట్టికలో పొందుపర్చ బడినది.

పటిక - 18

ప్రజలు ఐక్యంగా ఉండకపోవుటకు కారణాల వివరాలు:

| క్ర. సం. | కారణాలు | అభిప్రాయాలు ఇచ్చినవారి సంఖ్య | శాతం |
|---|---|---|---|
| 1. | దొర భయానికి | 67 | 67% |
| 2. | చట్టము తెలియక | 6 | 6% |
| 3. | ఆర్థిక స్థోమత లేక పోవుట | 4 | 4% |
| 4. | పోలీసుల భయానికి | 4 | 4% |
| 5. | దొర భయానికి, చట్టములు తెలియక | 14 | 14% |
| 6. | నిరక్షరాస్యత వలన | 2 | 2% |
| 7. | దొరల అప్పుల భయానికి | 3 | 3% |
| | | 100 | 100% |

దీనిని బట్టి చూడగా 67% మంది వెలిబుచ్చిన వారి అభిప్రాయాల ప్రకారము ప్రజలు ఐక్యంగా ఉండకపోవుటకు కారణము "దొర భయము" అనియు, 14 మంది అభిప్రాయాల ప్రకారము దీనికి కారణములను "దొర భయానికి, చట్టములు తెలియక" అని తెలియుచున్నది.

14. ప్రభుత్వము భూమి పంపిణీ చేస్తున్నదని మీకు నమ్మకముందా అని ప్రశ్నిస్తే, ఈ సర్వేలో పాల్గొన్న వారు రెండు విధములుగా వెలిబుచ్చినారు. అవి ఒకటి నమ్మకమున్నవారు మరియు నమ్మకము లేనివారు. ఈ విషయాలను పట్టిక 19 లో చూడవచ్చు.

పట్టిక - 19

| క్ర. సం. | అభిప్రాయాలు | అభిప్రాయాలిచ్చిన వారి సంఖ్య | శాతం |
|---|---|---|---|
| 1. | నమ్మకం ఉన్నవారు | 70 | 70% |
| 2. | నమ్మకం లేనివారు | 30 | 30% |
| | | 100 | 100% |

వీరిలో ప్రభుత్వం భూపంపిణీ చేస్తుందా అనే నమ్మకం ఉన్నవారు 70% మరియు 30% నమ్మకంలేనివారని తెలియుచున్నది.

ఆ పంపిణీ గురించి నమ్మకం లేనివారు వెలిబుచ్చిన కారణాలను పట్టిక 20లో చూడవచ్చు.

పట్టిక -

| క్ర. సం. | కారణాలు | అభిప్రాయాలిచ్చిన వారి సంఖ్య | శాతం |
|---|---|---|---|
| 1. | భూసంపద ఉన్నవారే అధికారులలో (కాంగ్రెస్) భాగమై యుండుటవలన వారు పంపిణీకి తోడ్పడరని అభిప్రాయాన్ని చెప్పినవారు. | | 6% |
| 2. | ఇంతవరకు గ్రామములో పంపిణీ జరగలేదని చెప్పినవారు. | | 86% |
| 3 | భూమి కల్గినవారే ఉద్యోగ బృందంలో ఉన్నారు కాబట్టి వారు పంపిణీ సమర్థించరు అనే అభిప్రాయాన్ని ఇచ్చినవారు | | |
| | | 100 | 100% |

దీనిని బట్టి చూడగా 86% మందికి ఇంతవరకు తమ గ్రామములో భూపంపిణీ జరగలేదనే కారణమువలన భూసంస్కరణలు అమలుపై నమ్మకం లేనివారు అని తెలియుచున్నది. ఈ నమ్మకం లేని 30 మందిలో 86% మంది ఈ ఒక్క కారణమును చూపించినవారే. వీరిలో మిగిలిన 14% మంది వేరే కారణాలను తెలిపినారు.

15. భూమి పంపిణీ ఏ విధముగా అమలు చేస్తే బాగుంటుందని ప్రశ్నించగా ఈ సర్వేలో ప్రజలు మూడు పద్ధతులను సూచించినారు. వారి అభిప్రాయాల ప్రకారము వారి పద్ధతులను పట్టిక - 21 లో పొందుపర్చబడినవి.

పట్టిక - 21

| క్రి. సం. | వారు సూచించిన పద్ధతులు | అభిప్రాయాలు ఇచ్చినవారి సంఖ్య | శాతం |
|---|---|---|---|
| 1. | సంఘముల ద్వారా | 61 | 61% |
| 2. | ప్రభుత్వ మనుషులద్వారా | 36 | 36% |
| 3. | కలెక్టర్ల ద్వారా | 3 | 3% |
| | | 100 | 100% |



దీనినిబట్టి తెలియునది ఏమనగా 61% మంది భూపంపిణీని సంఘములద్వారా, 36% మంది ప్రభుత్వ మనుషులద్వారా అనియు మరియు 3% మంది కలెక్టర్ల ద్వారా అనియు తమ అభిప్రాయాలను వెలిబుచ్చినారు. అయితే ఎక్కువశాతము ప్రజలు సమర్థించిన పద్ధతి సంఘాలు. వారు మౌలికంగా వెలిబుచ్చిన అభిప్రాయము ఏమనగా సంఘాలలో షెడ్యూల్డు కులాలకు చెందిన అభ్యర్థులకు సరి అయిన ప్రాతినిధ్యము ఉండాలని.

## ము గిం పు

ఈ చివరి అధ్యాయములో గ్రామీణ రైతుల యొక్క విద్య, నివాసము, ఆర్థిక వసతుల గురించి మరియు వారికున్న భూవసతి గురించి, భూములులేని వారి బాధలగురించి, వారియొక్క చెడ్డ రోజులు దొర్లిపోవుటకు, భూమి కలిగిన వారి మధ్యలోనున్న అహంభావాలను తగ్గించుటకై భూసంస్కరణల అమలు చేయుట ఎంతైనా అవసరమైన విషయాలను గురించి, రైతులందరిలో సమ సమానత్వం భూపంపిణీ గురించి, వీని అమలుకై ప్రభుత్వము తీసికొనవలసిన చర్యలలో కొన్నింటిని పొందుపర్చబడినవి. భూసంస్కరణల వంటి సాంఘిక మరియు ఆర్థిక విషయాలతో ముడివేయబడిన సంస్కరణలను తూ. చ. తప్పకుండ ఫలవంతంగా అమలు జరుపుటకు ప్రభుత్వము మరియు ప్రజల సహకారము ఎంతో అవసరమై యున్నది.

ఈ గ్రామీణ ప్రజలలో అధికశాతము వెనుకబడి మరియు బీదతనముతో కృంగదీయబడిన వారని తెలియుచున్నది. ప్రస్తుత పరిశోధనలో క్రోడీకరించిన విషయపరిశీలన చేసిన గ్రామీణ ప్రజలు పొందుచున్న విద్యా అవకాశములు చాల తక్కువగా యున్నవి. వారిలో అనేకులు నిరక్షరాస్యులు అయినప్పటికిని వారికి ఉన్న పిల్లలకు కూడా విద్యాభ్యాసము గడుపుటకు ఉత్సాహముతో ఉన్న అవి చాలినంత అనుకూలముగా లేనందున వారికి కూడా విద్యాభ్యాసము చేయు భాగ్యము దూరమైపోతున్నదని గ్రామీణ ప్రజలు వాపోవుచున్నారు. ఈ గ్రామీణ ప్రజలు మాధ్యమిక స్థాయి పాఠశాల వసతికై సుమారు 5-10 కి॥మీ॥దూరము పోవలసి యున్నది. ఈ గ్రామములో నున్న ధనిక వర్గపు పిల్లలందరు పట్టణములలో విద్యాభ్యాసము చేయుట పరిపాటి. గ్రామీణ వయోజనులకు విద్యాభ్యాసము చేయించుటకై రాత్రి పాఠశాలలు కూడా ఈ గ్రామములో లేవు. ఈ గ్రామీణ పేద ప్రజల బిడ్డలకు ఈ గ్రామములోనున్న విద్యావకాశాలు చాల తక్కువే అని చెప్పుట నిస్సందేహము. కావున ఈ విద్యావిషయాలలో ప్రభుత్వము తగిన చొరవ తీసికొని గ్రామీణ ప్రజలకు వయోజన విద్య

మరియు వారి పిల్లలకు సరైన విద్యా అవకాశాలను కల్పించే ఏర్పాట్లు చేయాలి. మరియు వారి పిల్లలకు నిర్బంధ ఉచిత విద్యను, భోజన వసతి సౌకర్యములను కల్పించి తగిన ప్రోత్సాహము ఇప్పించాలి. ప్రస్తుతము ప్రభుత్వము కల్పించుచున్న రిజర్వేషన్లు మరియు హాస్టలు వసతులను ఈ గ్రామీణ ప్రజలకు తెలియజేయు ఏర్పాట్లు చేయుచు వారు వాటిని వినియోగించే విధంగా ఏర్పాట్లు చేసిన వారి విద్యా విషయాలు మెరుగు పడవచ్చు. ఎందుకనగా ప్రభుత్వము చేయుచున్న సాంఘిక సంక్షేమ కార్యక్రమములు చాల మందికి తెలియక పోవుట వలన వానిని వారు సక్రమముగా వినియోగించుకొన లేకపోవుచున్నారని తెలియుచున్నది.

## భూసంస్కరణల అమలు విఫలము కావటానికి కొన్ని ముఖ్య కారణాలు

1. ప్రభుత్వం గరిష్ట పరిమితులు నిర్ణయించిన కాలానికి, వాటిని ఆచరణలో పెట్టిన కాలానికి మధ్య ఎక్కువ తేడా ఉండటం వల్ల చాల మంది భూస్వాములు ఈ క్రింద నుదహరించిన మార్గాలను అవలంబించి తాము చట్టాల పరిధిలోనికి రాకుండా చూసుకొనుచున్నారని ప్రస్తుత సర్వేలో వెల్లడి అయింది.

1. కొడుకుల, బిడ్డల తరపున భూమి మార్పిడి.
2. జీతగాండ్ల తరుపున భూమి మార్పిడి.
3. వంట మనుషుల తరుపున భూమి మార్పిడి.
4. బంధువుల తరుపున భూమి మార్పిడి.
5. అమ్ముకొనుటవలన.
6. మిగులు భూములపై అప్పులు తీసికొనుట వలన.
7. గుమాస్తాల తరుపున భూమి మార్పిడి.
8. దాసీల తరపున భూమి మార్పిడి.

ఈ విధముగా కాలయాపన వలన వివిధ మార్గాలను అవలంబించి తాము మిగులు భూమిని భూమి మిగులకుండా చేయుచున్నారు.

2. ప్రభుత్వ విధానం మొదటినుంచి భూమి యాజమాన్యానికి సహకరిస్తు సొంత వ్యవసాయదారుని గురించి శ్రద్ధ చేయడం లేదు. భూమి కౌలుదార్ల క్రిందనున్న భూస్వాములు వారి నుంచి తిరిగి భూమిని స్వంత సేద్యము గురించి తీసికొనగల్గినారు. అంతే గాక భూములకు గల మినహాయింపులను తమ భూములకు వర్తింపజేయగా శాసనాలను సవరించడం జరుగుచున్నది. పెద్ద భూస్వాముల ఒత్తిడిలకు ప్రభుత్వాలు చట్టాలకు కొన్ని మినహాయింపులు తేవలసి యుంటుంది.

3. సరైన రికార్డులు లేకపోవుట వలన ఈ భూ సంస్కరణల అమలులో జాప్యము జరుగుచున్నది.

4. రాజకీయ వేత్తలు కూడా భూసంస్కరణ అమలుకు సహకారాన్ని అందించక పోవటము.

5. ప్రభుత్వోద్యోగులు కూడా భూసంస్కరణల అమలుకు పూర్తి సహకారము చేయడంలేదు.

6. చట్టాలు, కోర్టు తీర్పులు, పరిపాలనా సంప్రదాయాలు, ఆచారాలు ఎంత కాలమైతే ప్రైవేటు ఆస్తుల రక్షణ కోసం మొగ్గు చూపుతాయో, భూసంస్కరణలు ప్రత్యేకంగా గ్రామ ప్రాంతాలకు వర్తింపజేసేవి, అమలు చేయటం అంత కష్టసాధ్యమైన పని అని విశదమవుచున్నది.

భూసంస్కరణల అమలు కోసం ఈ సలహాలను ఆచరించటం అవసరమని ఈ సర్వేలో తోచుచున్నది.

1. జిల్లాలో మరియు గ్రామీణ ప్రాంతాలలో కమిటీలు (సంఘాలను) ఏర్పరచి ఆ సంఘాలలో భూస్వాములు కాకుండా భూమిలేని ఉత్సాహవంతులను మరియు షె. కు. లకు తగిన ప్రాతినిధ్యము ఏర్పరచుటకు సభ్యులుగా నియమించవలెను.

2. భూసంస్కరణ చట్టానికి మరియు వాని అమలుకు మధ్యనున్న కాలయాపనను అరికట్టి ఆ జాప్యము జరగకుండా సత్వర చర్యలు తీసికొన్న భూసంస్కరణల అమలులో మెరుగు ఏర్పడవచ్చు.

3. భూమికి సంబంధించిన రికార్డులు ఎప్పటికప్పుడు సక్రమముగా తయారు చేయవలెను.

4. భూసంస్కరణల అమలుకై రాజకీయ నాయకులుగాని లేదా ఆయా ప్రభుత్వ ఉద్యోగులుకాని సుముఖత చూపనిచో

వారిని సత్వరమే పదవీ భ్రష్టులను చేయవలెను. అదే విధముగా చేసినచో భూసంస్కరణలు ఫలవంతంగా అమలు చేయవచ్చు.

5. కోర్టులు, చట్టాలు అవలంబించే ప్రైవేటు ఆస్తుల రక్షణ మార్గాలలో కొన్నింటిని భూమికి సంబంధించిన వాటిలో పరిమేయాలను సడలించినచో కొంత మేరకు సులభముగా ఈ భూసంస్కరణల అమలు సక్రమంగా కొనసాగుతుందని చెప్పవచ్చు.

భూసంస్కరణలు అమలు పరిచినప్పటికి పూర్తి ఆర్థిక సమానత్వము సాధించలేము. వీనికి తోడు గ్రామీణ ప్రాంతాలలో నున్న వారికి వ్యవసాయ మార్కెట్ల సౌకర్యము, పరపతి సౌకర్యాలను కల్పించి వ్యవసాయ సాంకేతిక నైపుణ్యాన్ని సమకూర్చవలసిన అవసరము ఎంతైనా కలదని చెప్పవచ్చు.

వ్యవసాయ వ్యవస్థ పునర్నిర్మాణంలో భూసంస్కరణల అమలు వల్ల ఎన్నో ప్రయోజనాలు సమకూర్చబడుతాయి. నవ సమాజం సృష్టించవలయునన్న, శ్రేయోరాజ్య స్థాపన చేయాలన్న, గ్రామీణ ఆర్థిక వ్యవస్థను సుస్థిర ప్రాతిపదికపైన పునర్నిర్మాణము చేయవలయునన్న లెనిన్, మార్క్స్, గాంధీ మొదలగు సామ్యవాద సిద్ధాంతుల కలలు ఫలించాలన్న భూకమతాల గరిష్ట పరిమితి [సి. ఓ. హెచ్.] ఎంతైనా అవసరము. ఈ విషయములో ప్రభుత్వము ఎంతో శ్రద్ధాశక్తులతో కృషిచేయవలసిన అవసరము ఎంతైనా కలదు. దానికి ప్రజలు ఎంతయో సహకరించినపుడే భూసంస్కరణ చట్టాల వలన ప్రయోజనము చేకూరుతుందని చెప్పవచ్చు.

## కృతజ్ఞతలు

ఈ పరిశోధన వ్యాసమును వ్రాయుటకు అనుమతించిన మరియు తగినంత సమయాన్ని కల్పించిన ఆచార్య పి. ఏ. జేమ్స్ గారికి కృతజ్ఞతలు.

ఈ వ్యాసమును వ్రాయుటలో తమ అమూల్యమైన సలహాలను అందించి, ఉత్సాహాన్ని కల్పించిన డా॥మురళి మనోహర్‌గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ వ్యాసము వ్రాయుటలో తగిన సహాయ సహకారాలను అందించిన లెక్చరర్స్ బృందము వారికి నా యొక్క హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ వ్యాసము వ్రాయుటలో సహకరించిన మ్యాడంపల్లి గ్రామప్రజలకు నా యొక్క కృతజ్ఞతలు.

ఈ వ్యాస రచనలో తోడ్పడిన మిత్రులందరికి నా యొక్క కృతజ్ఞతలు.

— ముదిగంటి సత్యనారాయణ రెడ్డి



# కలగూరగంప

## ఆల్బర్స్ పేరడాక్స్

యావజ్జీవ జాలానికి ఆధారభూతమైన సూర్య గోళానికి సంబంధించిన కొన్ని వివరాలనైనా తెలిసిన వారికి ఒక సందేహం కలుగుతుంది. దానిని ఈ విధంగా అనుకోవచ్చు :

"ఇది యేమి విపరీత
మెట్టి విపరీత మిది ?

కోటి తారల వెలుగు కొల్లగొట్టుచునున్న
ఏటికో నిశ చిమ్మ చీకటులు వేధించి ?
ఒక్కొక్క నక్షత్ర మొక్కొక్క సూర్యుడై
చిమ్ము శక్తిని ఆకసమ్మేమి చేసింది ?
చీకటికి మితిలేని ఆకలో ? కాంతితో
నింపుగా తన పొట్ట నింపుకొంటున్నాది !
తన కాంతి నపహసించెడు కాంతిని వెలార్చు
ఘన తారలను పగల్ భానుడెటు కప్పునో ?
ఒక్క తారక పట్ట పగలు కావించుటా ?
ముక్కోటి తమసమున బిక్కుమని మునుగుటా ?
ఇదియేమి విపరీత మెట్టి విపరీత మిది!"

సూర్యుడొక సామాన్య నక్షత్రమని తెలుసు. కోట్లాది నక్షత్రాలు ఆకాశంలో నున్నాయి. సూర్యుకంటె దీప్తిమంతమైనవి చాలా ఉన్నాయి. కాని సూర్యాస్తమయం కాగానే చీకటి పడుతుంది, చీకటిలో వెలుగు చుక్కల్లాగ రక రకాల నక్షత్రాలు కనిపిస్తాయే కాని, చీకటిని పోగొట్టలేవు.

పగటి పూట కూడా నక్షత్రాలు ఆకాశంలో ఉంటాయి. సూర్యుని మ్రింగగల నక్షత్రాలూ ఉన్నాయి. అయినప్పటికీ పగటి పూట సూర్యుని కాంతిలో అవి మునిగి పోవడమే కాని వాటి కాంతిని ప్రదర్శించలేవు.

వీటికి కారణం ఏమై ఉంటుందన్న ప్రశ్న హైన్‌రిక్ ఆల్బర్స్ అనే విజ్ఞానికి 1826 లో కలిగింది. అప్పటికి అమలులో నున్న ఖగోళ శాస్త్ర జ్ఞానం ఆధారంగా సమాధానం చెప్పడానికి ప్రయత్నించాడు.

ఆ సందర్భంలో కొన్ని ఊహనలు చేసేడు. అవి: 1. ఆకాశం అనంతం; 2. అది యూక్లిడ్ క్షేత్ర గణితాన్ని అనుసరిస్తుంది; 3. విశ్వం అనాది; 4. కాంతి విరజిమ్మే నక్షత్రాల వంటి గోళాలు ఆకాశంలో సర్వ సమానంగా పంపకమై ఉన్నాయి; 5. ప్రతి నక్షత్రం ఒకే దీప్తితో శక్తిని వెలువరిస్తుంది; 6. నక్షత్రాలనుండి భూమికి వచ్చే కాంతిని అడ్డడానికి కాని, హరించడానికి కాని, వాటికీ భూమికీ మధ్య పదార్థం ఏమీలేదు.

ఈ పరికల్పనలతో నక్షత్రాలనుండి భూమికి చేరే కాంతి పరిమాణం గణించేడు. ఆకాశాన్ని ఆవరించే కాంతి పరిమాణం అనంతం అన్న ఆశ్చర్యకరమైన ఫలితం వచ్చింది. రాత్రి చీకటి ఏమిటి ? మరోలాగ అనుకోవచ్చు. ప్రతికాంతి జనకము సూర్యునిలాంటి నక్షత్రమై, వెనుకనున్న కాంతి జనకాలను వాటి ముందున్నవి కప్పి వాటి కాంతిని నిరోధించేయి అనుకొంటే, ఆకాశం యొక్క దీప్తి సూర్యుని ఉపరితలం యొక్క దీప్తితో సమానంగా ఉండాలి. కాని, రాత్రిళ్ల చీకటి ఎందుకు వ్యాపించాలో తెలియలేదు. అందుకే ఈ సమస్య "ఆల్బర్స్‌పేరడాక్స్" అనే విరోధాభాసంగా మిగిలిపోయింది.

పోనీ, నక్షత్రాలకు నక్షత్రాలకు మధ్య పదార్థం ఉంది అనుకొంటే అది కొంత కాంతిని అడ్డుతుంది. కాగా ఆకాశం దీప్తి తగ్గుతుంది. దీనికో ప్రతి బంధకం ఏర్పడింది. పదార్థాల కాంతిని హరించిన పక్షంలో అది క్రమంగా వేడెక్కి కాంతిని వెలువరించే స్థితిని చేరుకొంటుంది. అంటే హరించిన శక్తిని మరోవిధంగా వెలువరిస్తుంది. కాగా నక్షత్రాంతరాళంలో నున్న పదార్థంవల్ల ఆకాశం యొక్క దీప్తి తగ్గదు.

లేదా, విశ్వం సాంతము, దాని వయసు పరిమితము అనుకొంటే ఏమౌతుందో చూద్దాము. విశ్వం సాంతం అనడానికి ఆధారాలు లేవు. యంత్రాల చూపుశక్తి ఎక్కువ అవుతూన్న కొద్దీ దూరదూరాన నక్షత్రాలు గేలక్సీలు కనిపిస్తూనే ఉన్నాయి. కాబట్టి విశ్వం సాంతం కాదు అనడమే సహజం. విశ్వం వయస్సు పరిమితం అనుకొంటే పరిష్కార మార్గం కనిపించేటట్లుంది. విశ్వం పుట్టి X సెకనులు గడిచిఉంటే ఈ కాలంలో ప్రయాణం చేసే కాంతి మాత్రమే భూమిని చేరుకొంటుంది. కాంతి వేగం C. కాబట్టి CX దూరంలో నున్న నక్షత్రాల నుండి వెలువడే కాంతి

మాత్రమే భూమిని చేరుకోగలదు. కాని ఈ భావం అంత సహజంగా కాక కృతకంగా కనిపించినా, సమస్యను పరిష్కరించడంలో అదే కొంత సహాయ పడుతూన్నట్లుంది.

సుమారు 60 ఏండ్ల క్రిందట ప్రారంభమై బలం పుంజు కొంటూన్న "విశ్వం వ్యాకోచిస్తూంది" అన్న సత్యం, చాలా వరకు చిక్కువిడతీసింది.

గేలక్సీల కాంతియొక్క వర్ణపటం తీసి, దానిలోని రేఖల స్థానాలను ఇతరవర్ణ పటాలతో పోల్చినప్పుడు, ఆ రేఖలు ఎక్కువ అలపొడవువైపు జరుగుతున్నాయని - అదే "రెడ్‌షిఫ్ట్"-కను గొన్నారు. ఈ పరిశీలన గేలక్సీలు చెదిరిపోతున్నాయనీ, విశ్వం వ్యాకోచిస్తూందనీ సూచిస్తుంది. గేలక్సీలన్నీ ఒకదానినుండి ఒకటి దూరంగా పారిపోతున్నాయి. మన చుట్టూఉన్న గేలక్సీలు అన్ని వైపులా చెదిరిపోతున్నాయి. అట్లు పారిపోయే వేగం దూరతో బాటు ఎక్కువ అవుతుంది. అంటే దూరంగా ఉన్నవి దగ్గరగా ఉన్న వాటికంటే ఎక్కువ వేగంతో చెదిరిపోతున్నాయి. ఒక గేలక్సీ విషయం యోచిస్తే దాని దూరం ఎక్కువ అవుతూంది కాబట్టి విలోమ వర్గ నియమం ప్రకారం దానినుండి భూమికి చేరే కాంతి తీవ్రత ఎలాగా తగ్గాలి. అదికాక మరో రెండు విధాలుగా తీవ్రత తగ్గుతూంది.

ఒక గేలక్సీ వర్ణపటరేఖలు ఎక్కువ అల పొడవువైపు జరగడమంటే దానినుండి వచ్చేకాంతి యొక్క పౌనఃపున్యం తగ్గడం. $v$ పౌనఃపున్యం గల కాంతి ఫోటాను శక్తి $E$ అయితే వాటి సంబంధము $E = hv$. ఇందులో $h$ ప్లాంక్ స్థిరాంకం. దీని ప్రకారం $v$ తగ్గినప్పుడు $E$ విధిగా తగ్గుతుంది. కాంతి జనకం నుండి భూమిని చేరే ప్రతి ఫోటాను యొక్కశక్తి తగ్గుతుంది. అంటే, ఫోటాన్లు కొంత శక్తి కోల్పోతాయి.

ఇక రెండవది. ఇది కాల భావానికి సంబంధించినది. అన్ని లోకాలలోని గడియారాలు ఒకే విధంగా పని చేయవు. కాలాకాశ వక్రత్వం బట్టి మార్పు కలుగుతుంది. మాటకు ఒక గేలక్సీలో గడియారం ప్రకారం ఒక సెకనులో బయలుదేరి వచ్చిన కాంతి భూమిని చేరుకొన్నప్పుడు దానిని భూమి గ్రహించడానికి భూగడియారం ప్రకారం ఒక సెకనుకంటె ఎక్కువ సమయం తీసు కొంటుంది. దాని మూలంగా కూడా కాంతి తీవ్రత తగ్గుతుంది.

విశ్వం పుట్టి 1000 కోట్ల ఏండ్లో, 1500 కోట్ల ఏండ్లో అయిందని అంచనా. పెద్ద పేలుడుతో విశ్వం పుట్టగా అందులోని పదార్థం తునాతునకలై పేలుడు బలానికి అన్ని దిక్కులా చెదిరి పోతూంది. ఆ ముక్కలు గేలక్సీలు. వాటికాంతి తీవ్రత దూరంలో తగ్గడమే కాకుండా గేలక్సీలు చెదిరి పోవడంచేతకూడా తగ్గుతూంది. కాగా దూరంగా ఉన్న కాంతి జనకాలవల్ల భూమినిచేరే కాంతికాని, కాంతి లేకపోవడంకాని అంతగా లెక్కించ తగినవికాదు. ఆకాశంలోని వెలుగు చీకటుల విషయంలో గేలక్సీల కాంతికి స్థానం లేనప్పుడు సూర్యగోళం ఒక్కటే రాత్రింపగళ్ళను నిర్ణయిస్తుంది. సూర్యుని వెలుగులో గేలక్సీలుకూడా మునిగిపోయి పగటిపూట ఆకాశంలో ఉండీ కూడా కనిపించవు. సూర్యుడు కనిపించని రాత్రి వేళ చీకటి అలముకొంటుంది. ఈ విధంగా ఆల్బర్స్ పేరడాక్స్ కు సమాధానం లభించింది.

శ్రీ వసంతరావు వేంకటరావు

# బ్రతకవలసిన క్షణాలు!

"బ్రతికిన క్షణాలు" పేరిట శ్రీ వేగుంట మోహన ప్రసాద్‌గారి రచనల్ని చదివాక నాలో కన్పించిన మను భావాల్ని అక్షర రూపంలో పెట్టేందుకు ప్రయత్నిస్తానో అదీ ఒక లక్ష్యంతోనే! ఎంతటి మేధావినైనా కదిలించ గలిగే శక్తి, ఆ "క్షణాల"కున్నాయి. వాటికి స్పందింప జేసే రసస్ఫూర్తి కూడ ఉంది. అయితే అర్థంకాని అస్పష్టత, అయోమయత్వం, పూర్తిగా బౌతిక దృక్పథం నిండు కొన్న జడవాదం, ఏదో విషాదంతో అలముటించే శూన్య వాదం అందులో కనిపిస్తాయి. పోనీ నాకు కనిపించాయి. భౌమిక పరిధిలో, దైహిక చింతనతో ఆ క్షణాలు పరితపిస్తాయి. వెర్రి ఆనందంతో తడిసి ముద్దవుతాయి! భ్రమలో కొట్టుమిట్టాడుతూ ఉంటాయి.

ప్రతిభ రాణించడం లేదని నే నను కాని సామాన్యునివరకు వెళ్ళలేకపోతోందని అంటాను ఎవడి అవగాహనా స్థాయి వాడిది అని అనుకుంటే అది వేరే విషయం. మహా ప్రస్థానాన్ని రాసి, మరో ప్రస్థానాన్ని చూపి - అది రాసింది, ఇది చూపింది రిక్షావాడికోసమని, కూలివాడికోసమని - చెప్పుకోవడం, మహాకవి అయి పోవడం - ఇక్కడ గుర్తు చేస్తున్నాను. చెమటలంటే అర్థమయ్యే వానికి ఘర్మజలం అని చెప్పి సంప్రదాయ కవిత్వాన్ని తిట్టిపోయడం అర్థరహితం! అన్యాయంకూడా!!

నవ్యత అంతా ఆదరించదగ్గదికాదు. దేనికైతే స్పష్టత, విశిష్టత ఉండి, మనిషిని లోకశ్రేయోభిలాషిగా తీర్చిదిద్దగల శక్తి ఉంటుందో దానిని - అది క్రొత్తదైనాసరే - ఎటువంటిదైనాసరే - ఆదరించవలసిందే. అది పద్యంకావచ్చును, గద్యంకావచ్చును, కావ్యంకావచ్చును, కవిత కావచ్చును, పాట కావచ్చును, మాట కూడా కావచ్చును! భావప్రాధాన్యానికే పట్టాభిషేకం కాని, శిల్ప సౌందర్యానికి కాదు. అయితే అందమైన భాషలో యిమడ్చబడ్డ అద్భుతమైన భావానికి లోకోత్తరమైన శక్తి ఉంటుంది రసవంతమైన పరిపుష్టి ఉంటుంది. అది పద్య కవిత కావచ్చును, గేయకవిత కావచ్చును, మినీకవిత కావచ్చును, అకవితకూడా కావచ్చును - ఇంకేమైననూ కావచ్చును. రూపంతో నిమిత్తంలేదు. భావాన్ని విశిష్టంగా ప్రకటించగలిగే శబ్ద సౌందర్యమే అతిముఖ్యం. అలాగని శబ్దమే కవిత్వమని అనుకొంటే కనిపించే ప్రతి "అడ్వర్ టైజ్ మెంటూ" ఒక కవిత్వమౌతుంది. శిల్పం, భావం - రెండూ సమపాళ్ళలో ఉండి, స్పష్టంగా అర్థమయ్యేలా ఉండి, ఏదైతే లోకానికి హితమయ్యే కార్యాన్ని నిర్వర్తించే వానిలా మానవుని కార్యోన్ముఖుని చేస్తుందో అదే ఉత్తమమైన సాహిత్యం! ఇది అందరికీ తెలిసిందే. మరి "బ్రతికిన క్షణాలు" పేరిట చేస్తున్న ఈ రచనల సంగతేమిటి? ఇలాంటివింకెన్నో ఉన్నాయి. వాటికి అసలు ఏ పరమార్థమంటూ ఉన్నదా? ఏమి సాధించడానికని రచయిత ఆరాటపడుతున్నాడు? అందులో ఏంకనిపించిందని "భారతి" దాన్ని పాఠకులపై రుద్దుతోంది? - అన్నది నా మటుకు నాకు అర్థం కాలేదు. ఎవరైనా హితైషులు సెలవిస్తే ఆలకిస్తాను.

ఒకటి మాత్రం మళ్ళీ మళ్ళీ చెబుతున్నాను. నవ్యత పేరుతో అస్పష్టతను సృష్టించి సాహిత్యాన్ని భ్రష్టు పట్టిస్తే, కాలగర్భంలో కలిసి నశించి పోయేది, ఆ క్షుద్ర సాహిత్యమే! విప్లవమంటూ కొనసాగిస్తున్న రచనలు కానివ్వండి, భావబంధురశైలిలో తళుక్కు మంటున్న మినీ కవితా జ్యోతులు కానివ్వండి కాలప్రవాహంలో కొట్టుకుపోయేవే! ఎప్పటికైనా నిలిచేది, మనిషిని లోకశ్రేయోపరునిగా తీర్చిదిద్దడానికి ప్రయత్నించిన ఉత్తమ సాహిత్య గ్రంథాలు మాత్రమే! తోకచుక్కల మెరుపు లెక్కువైనా వాటి ప్రయోజనం శూన్యం! అయినా ఇవి తారసపడుతూనే ఉంటాయి ఎన్ని నక్షత్రాలు రాలినా సూర్యచంద్రులు ఎక్కడికిపోరు. ఇదే నిజమైతే ఒక శతాబ్దం గడవనివ్వండి (నిజానికి దశాబ్దం చాలు!) మహాప్రస్థానం అన్న మాట వినిపించదు. మినీ కవితల ఛాయలుండవు. అయినా భగవద్గీత అద్భుతంగా, ఆశ్చర్యం గొలిపే విధంగా కొనసాగుతూనే ఉంటుంది. ఇది తిరుగులేని మాట! అయితే దానిలో లేనిదేమిటి? మరి దీనిలో ఉన్నదేమిటి? - అన్నది ఎవరికివారే చర్చించుకొని తర్కించుకోవలసిన అంశాలు.

బ్రతికిన క్షణాలను ఎలాగూ వదలిపెట్టేద్దాం. గతం కనుక. ఇకమీదనైనా బతకవలసిన క్షణాలను జాగ్రత్తగా గడుపుకొందాము. నా అభిప్రాయంతో ఏకీభవించని వారెందరో ఉండవచ్చును. ఎవరెవరో ఏదేదో చెప్తుంటారు లెమ్మని త్రోసిపారేసేవారూ ఉండవచ్చును. అయినప్పటికీ నా మాటలను శ్రద్ధగా ఆలకించవలసిందిగా మరీ మరీ మనవి చేస్తున్నాను. నా దృష్టి చిన్నది. పైగా దోషం కూడా ఉండవచ్చును. అయినా అది నడుస్తున్న గమ్యం మాత్రం నూటికి నూరుపాళ్ళూ సరిఅయినదేనని నా నమ్మకం. నేను ఎంతో ఆ రీతో రాసినాను. పాఠకమహాశయులు నన్నర్థం చేసుకోగలరని విశ్వసిస్తున్నాను. "భారతి" సమాదరిస్తుందని ప్రగాఢమైన నమ్మకం!

డా॥ గుమ్మనూరు రమేష్‌బాబు

# శాండ్రకొట్టసు మౌర్య చంద్రగుప్తుడా?

పాశ్చాత్య చరిత్రకారులు కల్పించిన భారతదేశ చరిత్ర, శాండ్రకొట్టసు మౌర్య చంద్రగుప్తుడన్న ఒంటి కంబముపై నిలబెట్టిన మేడ. ఆ పాతిన ఒంటి కంబము, పాశ్చాత్య చరిత్ర కారుల అంధ విశ్వాసము, కుటిల రాజనీతి అను ముడిపదార్థములతో నిర్మించినది. అట్లు కానిచో పురాణములలోని రాజ వంశావళులు, ఆయా రాజుల పరిపాలన కాలములు శాసనాద్యాధారములతో సరిపోవుచున్నవని అంగీకరించుచునే, ఆయా రాజుల ప్రాచీనత నంగీకరించకపోవుటకు వేరే కారణము లేదు.

"ది పురాణాస్ ఆర్, యూజువల్లీ ఫైర్లీ ఇన్ అగ్రిమెంట్ విత్ ది యెవిడెన్స్ ఆఫ్ ఇన్‌స్క్రిప్షన్స్ యండ్ కోయన్స్

సో ఫార్ యాజ్ ది నేమ్స్ ఆఫ్ ది కింగ్స్ యండ్ ది లెంగ్త్ ఆఫ్ దైర్ రెయిన్స్ అర్ కన్సెర్న్డ్." (యేన్షెంట్ ఇండియా బై రాప్సన్.)

రాజుల పేళ్ళు, వారి పరిపాలన కాలములు శాసనాదులతో సరిపోయినట్లు చెప్పుచు, వారి ప్రాచీనత మాత్రము సరికాదని తిరస్కరించుటకు హేతువులు రెండు- (i) సృష్టి పుట్టి సుమారుగ ఆరువేల సంవత్సరములు మాత్రమే అయినదని అర్చి బిషప్ మైనర్ సొంత ఊహ. పాశ్చాత్య చరిత్రకారులు దీనినే పరమ ప్రమాణముగా నమ్మినారు. (ఇది వారిపట్ల వింత కాదు. అమెరికా విద్యాలయములలో ఇప్పటి గూడ ఆరు రోజులలో సృష్టి యావత్తు ముగిసినదన్న "క్రియేషన్" పాఠమును బోధించు చున్నారు. సైన్సు దారి సైన్సుదే మత మౌఢ్యము దారి మత మౌఢ్యమదే.)

(ii) వలస ప్రజల ఆధిక్యమను వీలయినంత తగ్గించి చూపుట పాలకులకు అవసరమన్న కుటిల రాజనీతి తంత్రము రెండవ కారణము. ఆర్యులు విదేశీయులనుట మొదలయినవి యీ కుటిల రాజనీతిలోని భాగములే.

పై రెండు కారణములచే, భారతదేశ చరిత్ర ప్రాచీనతను తగ్గించుటకు పూనుకొన్న పాశ్చాత్య చరిత్రకారులకు, దొరకిన పాచిక, శాంద్రకొట్టను.

అలగ్జాండరు దండయాత్రా కాలము, క్రీ.పూ. 327. చరిత్ర కారులకు లభించిన సరియైన కాలమిది ఒక్కటే. ఇంతకు మించి ఇంకేమియు దొరకలేదు. అలగ్జాండరు దండయాత్రాకాలమున మగధలో జాంద్రేమ్స్, శాంద్రకొట్టను, శాంద్రసిప్టను అను వారుండిరని గ్రీకుల వ్రాతల వల్ల తెలియుచున్నది. వీరిలో శాంద్రకొట్టను, మౌర్య చంద్రగుప్తుడని పాశ్చాత్య చరిత్రకారుల నిర్ణయము. చంద్ర=శాండ్ర- కావచ్చును గాని, శాండ్రకొట్టను మౌర్య చంద్రగుప్తుడయినచో జాండ్రేమ్సు, శాండ్రసిప్టను-అన్న వారెవరు? మౌర్య చంద్రగుప్తుని తండ్రి మహాపద్మనందుడు. కుమారుడు బిందుసారుడు. మహాపద్మనంద శబ్దము జాండ్రేమ్సు గాను, బిందుసార శబ్దము శాండ్రసిప్టసు గాను మారుట అసంభవము. ఈ పేళ్ళకు బొత్తిగా పోలిక లేదనుట నిర్వివాదము. కనుక శాండ్రకొట్టను మౌర్యచంద్రగుప్తుడు కాడు. కానిచో మరెవడయి యుండును? ఎవడయి యుండునో తెలియదని చెప్పుట ఋజు పద్ధతి. ఎవరితోనో ఒకరితో ముడిపెట్టుట చరిత్ర కారుల పద్ధతి.

ఇంతకు, శాండ్రకొట్టను గుప్త చంద్రగుప్తుడని 'ట్రాయర్' అను పాశ్చాత్య చరిత్రకారుడును, కుప్పయ్య అను పేరు గల భారతీయ చరిత్రకారుడును, సహేతుకముగా నిర్ణయించినారు. 'ట్రాయర్' మహనీయుడు తన నిర్ణయమును మాక్సుముల్లరు దృష్టికి కూడ తెచ్చినాడు. కాని ఆయన మౌనము వహించినాడు. విలియం జోన్స్ ప్రభృతులు కూడ తమ తప్పుడు చరిత్రను దిద్దు కొనక దాటవేసినారు. ఆంగ్లేయ ప్రభుత్వమునకు కావలసినది జోన్స్ ప్రభృతుల తప్పుడు చరిత్రయే గాన, వారు దానినే భారతీయ విద్యాలయములలో ప్రవేశపెట్టినారు. భావ దాస్యమునకు లోనయిన భారతీయులకు నాటి నుండి నేటి వరకు కనువిప్పు కలుగనే లేదు.

శాంద్రకొట్టను గుప్త చంద్రగుప్తుడయినచో 'జాంద్రేమ్సు' శాంద్రసిప్టను - అన్నవారెవరు? జాంద్రేమ్సు చంద్రశ్రీ అను ఆంధ్రరాజు. చంద్రగుప్తుని కుమారుడగు సముద్రగుప్తుడు శాంద్రసిప్టను. అలగ్జాండరు దండయాత్ర నాటికి గుప్త చంద్ర గుప్తుడు సముద్రగుప్తుడు ఆంధ్ర (సాతవాహన) రాజగు చంద్రశ్రీ కొలువులో నుండిరి. చంద్ర శబ్దము జాండ్ర, శాండ్ర శబ్దములు గాను, సముద్ర శబ్దము శాంద్రశబ్దముగాను మారు అవకాశము కన బడును. కనుక, శాంద్రకొట్టను గుప్త చంద్రగుప్తుడే గాని, మౌర్య చంద్రగుప్తుడు కాడు. అనగా అలగ్జాండరు దండయాత్రా కాల మగు క్రీ.పూ. 327- అన్నది పాశ్చాత్య చరిత్రకారులన్నట్లు మౌర్య చంద్రగుప్తుని కాలము కాదు; గుప్త చంద్రగుప్తుని కాలమన్న మాట. ఇది గుప్త చంద్రగుప్తుని కాలమే అనుటకు రాజుల పరిపాలన కాలములే, తార్కాణము. భారత యుద్ధానంతరము కలి పూర్వము 36 వ సంవత్సరము నుండి ఆయా రాజ వంశముల పరిపాలన కాలములు :

| రాజ వంశము | సంవత్సరములు | కలి శకము | హూణ శకము |
|---|---|---|---|
| బార్హద్రథ వంశము | 1006 | కలి పూ 36-కలి 970 | క్రీ.పూ 3138-2132 |
| ప్రద్యోత వంశము | 138 | కలి 970-1108 | 2132-1994 |
| శిశునాగ వంశము | 360 | 1108-1468 | 1994-1634 |
| నంద వంశము | 100 | 1468-1568 | 1634-1534 |
| మౌర్య వంశము | 316 | 1568-1884 | 1534-1218 |
| శుంగ వంశము | 300 | 1884-2184 | 1219-918 |
| కాణ్వ వంశము | 85 | 2184-2269 | 918-833 |
| ఆంధ్ర వంశము | 506 | 2269-2775 | 833-327 |

ఆంధ్రవంశాంతమగు క్రీ. పూ. 317- అన్నదే అలగ్జాండరు దండయాత్రా కాలము. అప్పుడు మగధలోనున్న ఆంధ్ర (సాతవాహన) రాజు, చంద్రశ్రీ= జాండ్రేమ్స్. అతని కొలువులోనున్న గుప్త చంద్రగుప్తుడు= శాండ్రకొట్టసు. సముద్రగుప్తుడు= శాండ్రసిప్టసు.

పురాణ శ్లోకములలోని పాఠ భేదములు మున్నగు వాని నుపయోగించుకొని పాశ్చాత్య చరిత్ర కారులు భారతదేశ చరిత్ర ప్రాచీనతకు భంగము కలిగించుటకు పాటు పడిరేగాని,సాధుపాఠ నిర్ణయమునకు సిద్ధపడలేదు. ఈ విషయమే ఆంధ్ర మత్స్యపురాణపు టధోజ్ఞాపికలో ఇట్లు తెలిపి యున్నారు.

"ఈ ముద్రిత పురాణములలో భారతదేశ ప్రాచీన చరిత్ర కాలమునుదగ్గించుట కుద్దేశించిన వ్యక్తులవే నీ పురాణ శ్లోకములు తారుమారు చేసియు, కొన్ని తీసివేసియు, కొన్ని యప పాఠములు కలిపియు భ్రష్టము చేయబడినట్లు స్పష్టముగా కనిపించుచున్నది. 'శతం పూర్ణం శతేద్వేచ- అని 300 సం॥ అని స్పష్టముగానుండగా 'శతం పూర్ణం దశద్వేచ' (112 సం॥) అని దిద్ది శుంగ కాలము తగ్గించబడినది".

రాజవంశావళుల కాలములు సరిచూచుకొనుటకు పురాణములలో సప్తర్షి మండల చలనమాధారముగా నిరూపించబడినది. సప్తర్షి మండలము క్రాంతివృత్త (ఎక్లిప్స్) మార్గముననున్న అశ్విన్యాది నక్షత్రముల యొద్ద నూరేసి సంవత్సరములుండునని భగోళ వేత్తల సిద్ధాంతము. ఇది వైజ్ఞానిక సత్యముగాని, పాశ్చాత్య చరిత్ర కారుల యూహాపోహలవంటివికాదు. సప్తర్షి మండలము మఘా నక్షత్రమున ప్రవేశించిన 76 వ సంవత్సరములో కలియుగము ప్రవేశించినది. అప్పుడు సప్తగ్రహములు మేష రాశిలోనున్నవి. అది క్రీ. పూ. 3102 వ సంవత్సరము ఫిబ్రవరి నెల 20 వ తేదీ రాత్రి 2 గంటల 27 నిముషముల30 సెకెండ్ల కాలము.

"ఎకార్డింగ్ టు ది యెష్ట్రనోమికల్ కాల్క్యులేషన్ ఆఫ్ ది హిందూస్, ది ప్రెజెంట్ పీరియడ్ ఆఫ్ ది వర్ల్‌డ్, 'కలియుగ' కమెన్స్‌డ్ 3102 యియర్స్ బి. సి. ఆన్ ది ట్వంటీయత్ ఫిబ్రవరీ యెట్ 2 అవర్స్ 27 మినిట్స్ 30 సెకెండ్స్, ది టైం బీయింగ్ దజ్ కాల్క్యులేటెడ్ టు మినిట్స్ అండ్ సెకెండ్స్ .... ది కాల్క్యులేషన్ ఆఫ్ ది బ్రాహ్మిన్స్ ఈజ్ సో యగ్జాక్ట్లీ కన్‌ఫర్మ్‌డ్ బై అవర్ ఓన్ ఎష్ట్రనోమికల్ టేబిల్స్ దట్ నథింగ్ బట్ యాన్ యాక్చువల్ అబ్జర్వేషన్ కుడ్ హేవ్ గివెన్ సో కరస్పాండెంట్ ఎ రిజల్ట్" (కౌంట్ జారస్ జర్నా)

అల్బరూని, క్రీ.శ. 1031 వ సంవత్సరము, కలిశకము 4132 సంవత్సరమునకు సమానమని వ్రాసినాడు. 4132 – 1030 = క్రీ. పూ 3102.

సప్తర్షి మండలము మహాపద్మనందుని పట్టాభిషేకమునాటికి శ్రవణ నక్షత్రము నొద్దనుండునని, 24 వ నక్షత్రముననుండగా ఆంధ్ర (సాతవాహన) సామ్రాజ్య స్థాపన జరుగునని పురాణ కథనము.

"శ్రవణేతే భవిష్యంతి, కాలే నందస్యభూపతేః
చతుర్వింశేధ నక్షత్రే, భవిష్యంతి శతం సమాః
ఆంధ్ర రాజ్యారంభకాలా, దారభ్యైతే సురర్షయః"
(... పురాణము)

| నక్షత్రము | కడపిన కాలము | కలి శకము | హూణ శకము |
|---|---|---|---|
| 1 మఘ | 61 సం॥ | కలి పూర్వము 36 - కలి 25 | క్రీ.పూ 3137 - 3076 |
| 2 ఆశ్లేష | 100 | కలి 26 - 125 | 3077 - 2977 |
| 3 పుష్యమి | 100 | 126 - 225 | 2978 - 2877 |
| 4 పునర్వసు | 100 | 226 - 325 | 2878 - 2777 |
| 5 ఆర్ద్ర | 100 | 326 - 425 | 2778 - 2677 |
| 6 మృగశీర్ష | 100 | 426 - 525 | 2678 - 2577 |
| 7 రోహిణి | 100 | 526 - 625 | 2578 - 2477 |
| 8 కృత్తిక | 100 | 626 - 725 | 2478 - 2377 |
| 9 భరణి | 100 | 726 – 825 | 2378 – 2277 |
| 10 అశ్విని | 100 | 826 – 925 | 2278 – 2177 |
| 11 రేవతి | 100 | 926 – 1025 | 2178 – 2077 |
| 12 ఉత్తరాభాద్ర | 100 | 1026 – 1125 | 2078 – 1977 |

| నక్షత్రము | కడపిన కాలము | కలి శకము | హూణ శకము |
|---|---|---|---|
| 13 పూర్వాభాద్ర | 100 | 1126 - 1225 | 1978 - 1877 |
| 14 శతభిషము | 100 | 1226 - 1325 | 1878 - 1777 |
| 15 ధనిష్ఠ | 100 | 1326 - 1425 | 1778 - 1677 |
| 16 శ్రవణము | 100 | 1426 - 1525 | 1678 - 1577 |
| 17 ఉత్తరాషాఢ | 100 | 1526 - 1625 | 1578 - 1477 |
| 18 పూర్వాషాఢ | 100 | 1626 - 1725 | 1478 - 1377 |
| 19 మూల | 100 | 1726 - 1825 | 1378 - 1277 |
| 20 జ్యేష్ఠ | 100 | 1826 - 1925 | 1278 - 1177 |
| 21 అనూరాధ | 100 | 1926 - 2025 | 1178 - 1077 |
| 22 విశాఖ | 100 | 2026 - 2125 | 1078 - 977 |
| 23 స్వాతి | 100 | 2126 - 2225 | 978 - 877 |
| 24 చిత్ర | 100 | 2226 - 2325 | 878 - 777 |

సప్తర్షి మండలము మఘలోనుండగా భారత యుద్ధము జరిగినది. ధర్మరాజు పరిపాలన కాలము 36 సంవత్సరములు సప్తర్షి మండలము మఘలో, కలియుగమున కడపిన కాలము 25 సంవత్సరములు. వెరసి 36 + 25 = 61 సంవత్సరములు. (సప్తర్షి మండలము మఘలో ప్రవేశించిన 39 వ సంవత్సరమున భారత యుద్ధము జరిగెనన్నమాట.) అటనుండి అపసవ్య గమనమున శ్రవణములో ప్రవేశించి యుండగా మహాపద్మనందుని పట్టాభిషేకము జరిగినది. మహాపద్మ నందుని పట్టాభిషేకము కలిశకము 1468 = క్రీ. పూ. 1634. సప్తర్షి మండలము శ్రవణములో నున్న కాలము, కలి శకము 1426 – 1525 = క్రీ. పూ. 1678 – 1577. అనగా సప్తర్షి మండలము శ్రవణములో ప్రవేశించిన 43 వ సంవత్సరమున మహాపద్మనందుని పట్టాభిషేకము జరిగెనన్న మాట. మహాపద్మనందుని పట్టాభిషేకము నాటికి సప్తర్షి మండలము శ్రవణములో నున్నదన్న పురాణోక్తి సరిగా సరిపోవుచున్నది. ఇట్లే సప్తర్షి మండలము 24వ నక్షత్రములోనుండగా ఆంధ్ర సామ్రాజ్య స్థాపన జరిగెనన్న విషయముకూడ సరిగా సరిపోవుచున్నదని పై పట్టికవల్ల స్పష్టపడుచున్నది.

శాండ్రకొట్టసు మౌర్య చంద్రగుప్తుడను తమ నిర్మూలపు టూహను సమర్థించుకొనుటకు ఖారవేలుని హాతిగుంఫ శాసనములో కాలము నూహించిన తీరు, పాశ్చాత్య చరిత్రకారుల ధోరణికి, వారి అనుయాయుల, వరప్రత్యయనేయ బుద్ధికి నిదర్శనము. ఈ శాసనములో తేదీని తెలుపు వాక్యము వేయబడి యుండవచ్చునని, అది శిథిలమయి యుండవచ్చునని కొంతమంది యూహించినారు. తేదీ వేయబడి యుండదని మరికొంతమంది యూహించినారు. తేదీ వేసి యున్న పక్షమున 16 వ పంక్తిలో వేయబడి యుండవచ్చునని కొంతమంది యూహించినారు. ఆ 16 వ పంక్తిలో తేదీ వేయబడిన పక్షమున, ఆ వేయబడిన తేదీని తెలుపు వాక్యము 'రాజా మురియా' అయి యుండవచ్చునని మరికొంతమంది యూహించినారు. ఈ 'రాజామురియా = 165' మౌర్యరాజుల పరిపాలన కాలమునుగాని, ఎవడో ఒక మౌర్యరాజు పరిపాలన కాలమునుగాని తెలుపునని యూహించినారు. అలెగ్జాండరు కాలమగు క్రీ. పూ. 323 సంవత్సరమునుండి 165 తీసివేసి ఖారవేలుని శాసనకాలము క్రీ. పూ. 158 అని తేల్చినారు. ఇట్లు నిర్మూలపుటూహలతో కల్పించిన ఖారవేలుని శాసన కాలము.. క్రీ. పూ. 158, అలెగ్జాండరు దండయాత్ర కాలమగు క్రీ. పూ. 327, మౌర్య చంద్రగుప్తుని కాలమను ఊహకు, ప్రమాణమన్నమాట. ఈ శాసనమునుగూర్చి 'రాప్సన్' వ్రాసిన వాక్యము లిట్లున్నవి.

"అఫ్ ఇట్స్ సెవెన్టీన్ లైన్స్ ఓన్లీ ది ఫస్ట్‌ఫోర్ రిమైన్ ఇన్ దైర్ ఎంటైరిటీ .... అల్ ది అదర్‌లైన్స్ ఆర్ మోర్ ఆర్ లెస్ ఫ్రాగ్మెంటరీ .... ఈవెన్ ది ఫండమెంటల్ క్వశ్చన్ వెదర్ ది ఇన్‌స్క్రిప్షన్ ఈజ్ డేటెడ్ అర్ నాట్ ఈజ్ స్టిల్ ఇన్ డిస్ప్యూట్. సమ్ స్కాలర్స్ కంటెండ్ దట్ ఏ పాసెజ్ ఇన్ ది సిక్స్‌టీన్త్ లైన్ కెన్ ఓన్లీ బి ఇంటర్ప్రెటెడ్ టు మీన్ దట్ ది ఇన్‌స్క్రిప్షన్ వజ్ ఎన్‌గ్రేవ్డ్ ఇన్ ది 165త్, ఇయర్ అఫ్ ది మౌర్యకింగ్స్ అర్ అఫ్ ది మౌర్యకింగ్స్, లైక్ అదర్స్ డినై ది ఎగ్జిస్టెన్స్ ఆఫ్ యెనీ సచ్ డేట్. (ఏన్‌షెంట్ ఇండియా బై రాప్సన్)

పై వాక్యములను బట్టి శిథిల భాగములో మౌర్యరాజు (ల) 165 వ సంవత్సరమును తెలుపు 'రాజామురియా' అను అక్షరములు కొందరు ప్రక్షిప్తము చేసినారనుట స్పష్టము. ఈ ప్రక్షిప్త వాక్యమే తరువాత తిరుగులేని సిద్ధాంతమయినది. శాండ్రకొట్టను మౌర్య చంద్రగుప్తుడనుట శకార భాషితము వంటిదేగాని సప్రమాణము కాదు. గుప్తచంద్రగుప్తుడన్నదే సహేతుకము, సప్రమాణము.

(ఆధారము : కీ. శే. కోట వెంకటాచలముగారి గ్రంథములు.)

శ్రీ వంతరాం రామకృష్ణరావు

# "బొబ్బిలి" కథ

సెప్టెంబరు 1982 భారతిలో విజయ దత్తాత్రేయ శర్మగారి "విజయనగరం గ్రామ నామములు" - ఒక పరిశీలన చదివితిని. చక్కని వ్యాసము.

అందు "బొబ్బిలి" కాపేరు ఎట్లు వచ్చినదో వారిచ్చిన వివరణ ఇపుడు చర్చింతును.

"బొబ్బిలి"కి ఆ పేరు వచ్చుట కీ పద్యము నిచ్చిరి :

"షేరనఁ దురుష్క-భాషనుఁ జెలఁగను బులి
పెద్దపులియను పదమయ్యె బెబ్బులియన
బెబ్బులియె నాఁడు నాటికి బొబ్బిలియన
బొలిచె నక్షరములు మార్పుఁ బొంద నిపుడు."

- ప్రవచన పారిజాతము - అవతారిక, పు. 8

దీనికి శర్మగారి వివరణ ఇట్లున్నది :

"సంస్థాన ప్రదాత చికాకోలు నవాబు షేరు మహమ్మదుఖాన్ పేర నిర్మితమైన బెబ్బులి (షేర్ అనగా పెద్దపులి) జనులనాడుకలో "బొబ్బిలి" అయినదనే వివరణ ధ్వని పరిణామ సూత్రము మేరకు కూడా విరుద్ధముగా లేదని విజ్ఞుల అభిప్రాయము."

నా మట్టుకు పద్యముకానీ, శర్మగారి వివరణ కానీ సరిగా ఉన్నట్లు అనిపించదు. కారణములు ఇవి :

1. సంస్థాన దస్తావేజు లేమనుచున్నవి ?
2. షేర్ ఖాన్ స్మృతిచిహ్నమైన ఊరిపేరు "షేరుఖాన్ పేట్" అనియో "షేర్ మహమ్మద్ నగరం" అనియో ఉండవలెగాని ఉత్తుత్త "బెబ్బులి" ఏమిటి ?
3. మొదట ఊరిపేరు "బెబ్బులి"గా పలుకబడుచు, రాను రాను "బొబ్బిలి" అని పూర్తిగా మారిపోవుటకు స్థానికముగా సాక్ష్యాధారములు కలవా ?
4. అన్యదేశీయ పదము తద్భవీకరణం కావచ్చును. (తేజ్‌సింగ్→ దేసింగు, ఇబ్రహీం→ ఇభరాం అయినట్లు).

కాని అన్ని తెలుగీకరణం అగుట కానిపని. ఇది మద్రాసులోని "బార్బర్స్ బ్రిడ్జి" వ్యవహారము లాంటిది కాదని నా భావం.

శర్మగారి ప్రణాళికను ఇట్లు సమీకరణించవచ్చును.

షేర్ మహమ్మద్ ఖాన్ = పెద్దపులి→ బెబ్బులి→ బొబ్బిలి.

ఇందు ఒక భాషాంతరీకరణం, ఒక సంధికార్యం, ఒక ధ్వని పరిణామం అనే మూడు భిన్న భాషాశాస్త్రప్రక్రియ లున్నవి. ఇదియంతయు కొంత అసంభవముగ కన్పించుచున్నది. "బెబ్బులి" అనే పదము ప్రసిద్ధమైనది. చెక్కు చెదరక జనులనోట నానుచు ఉంది. అట్టి సుప్రసిద్ధ పదము మారిపోయినది యనుటలో సామంజస్యము లేదు. "బొబ్బిలి" అని పలుకుట "బెబ్బులి" అని పలుకుట కంటే కష్టము. కావున "బెబ్బులి" ఉచ్చారణ రానురాను బొబ్బిలిగా మారుటకు వీలు కనబడుటలేదు.

తాండ్ర పాపారాయుని "బొబ్బిలి బెబ్బులి" అనుచునే ఉన్నారు. దీన్నిబట్టి "బెబ్బులి" పదము "బొబ్బిలి" గా ధ్వని పరిణామము చెందలేదనియు, "బొబ్బిలి" అవతరించుట వేరు విధమనియు స్పష్టము. దానిని వివరించెదను.

విజయనగర ప్రాంతములో "బిల్లి" అని ముగింపుకల గ్రామములు చాలా యున్నవి. ఉదాహరణములు:—

తంగుడుబిల్లి (కొత్తవలస)
రేగుబిల్లి (పెదమజ్జిపాలెం)
గరుగుబిల్లి (గజపతి నగరం)
అలుగుబిల్లి (ధర్మవరం)

ఇచట "బిల్లి" అనే నామాంతమును గమనింపుడు. అటులనే ఇపుడు చర్చనీయాంశమైన "బొబ్బిలి" మొట్టమొదట "బొబ్బ బిల్లి"గా ఉండెడిదని మన మనుకొనవచ్చును. "బొబ్బ బిల్లి" "బొబ్బిలి"గా ఎట్లు మారినదో వివరింతును.

సింకోపేషన్ అని పిలువబడే స్వరలోప లక్షణము ప్రకారము "బొబ్బ బిల్లి" లోని "బ్బ" ఎగిరిపోయి "బొబిల్లి" అయినది. ఉచ్చారణ సౌలభ్యము కొరకు "బొబిల్లి" పదము "బొబ్బిల్లి" అయినది. అచ్చతెనుగులో "ల" కు ఉండు "ల" ఒత్తు ఉండిన ఉండును, లేకున్న లేదు. ఒకసారి యుండును. మరియొకసారి యుండదు. ఉదా: జాబిల్లి, జాబిలి. కావున "బొబ్బిల్లి" తుదకు "బొబ్బిలి"గా అవతరించినది.

ఈ మార్పును ఒక ప్రణాళిక ద్వారా చూపించవచ్చును.

(బొబ్బ+బిల్లి) →బొబిల్లి →బొబ్బిల్లి →బొబ్బిలి.

"బొబ్బ బిల్లి" నుండి "బొబ్బిలి" వరకు గల పరిణామములన్నియు ఉచ్చారణ ఫలితములే. ఇట్టి శాస్త్రము "ఫోనాలజీ" అందురు. తక్కిన "బిల్లి" లు మారకుండ, "బొబ్బబిల్లి" మాత్రము పిల్లి మొగ్గలు వేయుటకు కారణమేమందురా ? చెప్పెదను. ఆ పేర్లు

పలుకుటకు సులభమైన అక్షరములు కలిగియున్నవి. "బొబ్బ బిల్లి" విషయములో అట్లుకాదు. ఒక అక్షరము ఒకసారికంటె ఎక్కువగా ప్రక్క ప్రక్క ఉండిన, ఉచ్చారణా సమస్యలుద్భవించును. అటువంటప్పుడు "సింకోపేషను", కుదింపు, ద్విత్వములు మున్నగు మార్పులు వచ్చును.

ఉదా: "హోలలగుంది" → "హోలగుంది"
"ఆకుకూరలు" → "ఆక్కూరలు"
"సింబలలాజి" → "సింబలాజి"

ఇంకొక మచ్చు కన్నడభాష నుండి ఇచ్చెదను. "హుబ్లి" అను ప్రసిద్ధ పట్టణమునకా రూపము వచ్చిన వైనము.

(హువ్వు+బళ్ళి) = హువ్వు బళ్ళి → హుబళ్ళి → హుబ్బళ్ళి →
(1) (2) (3) (4)
హుబ్బళి → హుబ్లి
(5) (6)

ఈ పరిణామాలు "బొబ్బ బిల్లి"కి వచ్చినట్టివే. ఇప్పుడు, బ్రతుకు వేగములో ఓపికలేని తెనుంగువారు "బొబ్బిలి"ని "బొబ్లి" అని కూడా అనుచున్నారు, "బీమ్లి"ని వలె.

ఇదీ "బొబ్బిలి" కథ.

# లేఖ

## "కూరాకు" పద వివరణ

డిసెంబరు 1982 భారతిలో మిత్రుడు శ్రీ గంగప్ప వ్యాసం "అన్నమాచార్యుల సంకీర్తనములు రాయలసీమ మాండలిక ప్రయోగం" చదివితిని. చక్కని రచన.

అందులో "కూరాకు" కు ఇచ్చిన అర్థం పొసగదు. "ఆకుకూర" అని ఉంది. అది సరికాదని నా అభిప్రాయం.

"కూరాకు" రాయలసీమ మాండలికమైతే, "ఆకుకూర" ఏ ప్రాంతపు మాండలికం? "ఆకుకూర" కూడా మాండలికమా, వ్యాకరణయుక్త సమాసమా? ఇతర మండలాలలో ఈ పదార్థాన్ని ఏమని పిలుస్తారు? ఇవేవీ వివరించకుండా "కూరాకు" ను మాత్రం రాయలసీమ మాండలికమంటూ దానికి అర్థం "ఆకుకూర" ఇచ్చుట సరికాదు. ఆకుకూర" అనే పదం తప్పు. "కూర" అంటే ఆకు ఉదా : తోటకూర, దంటుకూర. ఆకుతో చేసిన వ్యంజనం అనే పరిమితార్థంలో "ఆకుకూర" వాడవచ్చును. వంకాయకూర, ఉల్లగడ్డ కూరల వలె. "కూరాకు"ను కూర+ఆకు గా విడగొట్టి పిలుపడదు. ఎందుకంటారా? అది మిశ్రమ దుష్ట సమాసం. (మొదట సంస్కృతం, తర్వాత తెలుగు పదములుండుట వల్ల). ఇది పండితులకే చెల్లుకాని అచ్చపు తెలుగు మాటలు దొర్లించగల గ్రామీణులిట్టి పదజాలాన్ని వాడరు.

దీన్ని బట్టి "కూరాకు", "ఆకుకూర" కాదని తెలిసింది. "కూరాకు" కోసం మనం వేరే అంగట్లో వెదుకవలసి వస్తుంది.

"కూరాకు" అనే పదం రాయలసీమ పల్లెలలో "మాంసము"నకు పర్యాయపదంగా వాడబడుతూ ఉంది.

"కూరాకు" పదం "ఖురాక్" నుండి నిష్పన్నమైంది. "ఖురాక్" అంటే, ఉర్దూ (అరబ్బీ లేక పారశీక)లో ఆహారం అని అర్థం. పై రెండు భాషలు మాట్లాడే దేశాల్లోని వారికి మాంసమే, ఖురాక్ కదా! జీవాలను హలాల్ చేసి ఖురాక్ ను తయారుచేస్తారు. ఆ మాంసాన్ని కొనుక్కునే పల్లీయులకూ ఆ పరిభాష అబ్బింది. ఆహారం అనే సామాన్యార్థంకల "ఖురాక్" పదం, పై పరిస్థితులలో మాంసం అనే విశేషార్థం కలదైంది. ఆ "ఖురాక్" ఏ, మన "కూరాకు". "కూరాకు" "ఖురాక్" శబ్ద తద్భవం కానీ, ఆకుకూరకు మాండలికం కాదని తాత్పర్యం.

# గ్రంథ విమర్శలు

## పింగళి సూరన కవితా వైభవం

[రచన : శ్రీ రంగాచార్య. డెమ్మీ 40 పుటలు. వెల 3 రూ. ప్రకాశకులు : యువ భారతి, 5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 3. ప్రతులు లభించు చోటు 1. యువభారతి, 5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3 లేదా 2. యువ భారతి కార్యాలయము, ఆంధ్ర సారస్వత భవనములు, తిలక్ రోడ్డు, హైదరాబాదు - 500001.]

సుప్రసిద్ధులైన తెలుగు కవుల కవితా వైభవాన్ని అందరికీ సంగ్రహంగా అందించడం 'యువ భారతి' లక్ష్యాలలో ఒకటి. ఆ సంస్థవారు, ఆయా కవులను గురించి ప్రత్యేక కృషిచేసిన విద్వద్విమర్శకులచేత ఉపన్యాసాలిప్పించి. వాటిని గ్రంథ రూపంగా ప్రకటిస్తున్నారు. ఇట్టి చిన్న పుస్తకాలలో ఈ "పింగళి సూరన కవితా వైభవం" ఒకటి.

ప్రబంధ యుగం నాటి ప్రధాన కవులలో పింగళి సూరన ఒకడు. ఆ కాలపు కవులందరూ గతాను గతికంగా ప్రసిద్ధ ప్రబంధాల ధోరణినే అనుసరిస్తే సూరనమాత్రం కొత్త పద్ధతిని అనుసరించాడు. అద్భుత సన్నివేశాలతో ఒక కల్పిత కథను ఇతివృత్తంగా తీసుకుని కళాపూర్ణోదయమనే ప్రబంధంగా రచించాడు. ఇది పద్య రూపంలోఉన్న నవల అనే చెప్పవచ్చును. ఇతని ప్రభావాలే ప్రద్యుమ్నంలో ప్రఖ్యాతకథకు కొంతకల్పితకథచేర బడింది. అందులోని సంభాషణములు ఎంతో హృదయంగమంగా కానవస్తాయి. రెండర్థాలుగల పద్యాలతో రాఘవపాండవీయమనే ద్వ్యర్థికావ్యాన్ని రచించడం ఇతనిలోని ప్రత్యేకత. ఇందులో రామాయణ, భారత కథలు జోడించబడినవి.

సూరన రచనలను గురించీ, ప్రతిభా పాండిత్యాలను గురించీ వివరించే కవిత్వ తత్త్వ విచారం వంటి విమర్శ గ్రంథాలిదివరకే ఉన్నాయి. అందువల్ల రచయిత అతన్నిగురించి విపులంగా చెప్ప దలచలేదు. అతని గ్రంథములలోని కొన్ని రసవంతాలయిన పద్యాలను తీసికొని వాటి వైశిష్ట్యాన్ని వివరించడమే ఆయన లక్ష్యం. ఈ విషయంలో రచయిత కృతార్థులైనారని చెప్పవచ్చును.

ఇందులో మూడు ప్రకరణాలున్నవి. మొదటిదానిలో కళాపూర్ణోదయంలోని వైశిష్ట్యం, రెండోదానిలో ప్రభావతీప్రద్యుమ్నంలోని చమత్కృతి, మూడవదానిలో రాఘవ పాండవీయంలోని ప్రత్యేకత వివరించ బడినవి.

ఇట్టి సంగ్రహగ్రంథాల ప్రకటనవల్ల, సాహిత్యాభిమానులు సులభంగా, ఆ యా కవుల కవితావైభవం గ్రహించడానికి వీలవుతుంది. ఇట్టి రచనలకు ప్రోత్సహిస్తున్న యువభారతి సాహితీ సాంస్కృతిక సంస్థవారు అభినందనీయులు.

శ్రీ బులుసు వేంకట రమణయ్య

## కనువిప్పు (నవల)

[రచన: ఆకెళ్ళ వెంకట సూర్యనారాయణ. ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, చంద్రం బిల్డింగ్స్. విజయవాడ-4 వెల: తొమ్మిది రూపాయలు. పేజీలు: 168.]

1982 లో విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్‌వారు నిర్వహించిన నవలల పోటీలో తృతీయబహుమతి పొందిన నవల ఇది. దీనిలోని విషయం గ్రామ రాజకీయాలకు చెందినది.

అదొక గ్రామం. అందులో ఇద్దరు పెద్దమనుషులు. ఒకరు పెదరెడ్డి, పెద్ద భూస్వామి. మరొకరు పంచాయితీ ప్రెసిడెంట్ చౌదరి. ఇద్దరికీ పడదు. ఇక రాజకీయాలకేం కొదవ? వారి ఆటకు పావులు ఆ వూళ్లో హరిజనులు, ఆశ్రితులు.

ప్రసాద్ అనే యువకుడు, ఆ వూరి పంచాయతీ స్కూలు మాష్టారు కృష్ణమూర్తి తమ్ముడు. అన్నదమ్ములిద్దరూ ఆ గ్రామ ప్రజల్లో, హరిజనవాడలో వారి మధ్య వైషమ్యాలు పోగొట్టి కనువిప్పు కలిగిస్తారు.

నవలంతా ఇరుపక్షాల రాజకీయపుటెత్తులతో నిండి పాఠకుడు చదవటానికి ఆసక్తికరంగా వుంది. కాలక్షేపం కోసం రాయని మంచి నవల అని చెప్పవచ్చు.

## వాసుదేవమూర్తి (నవల)

[రచన: బి. ఎల్. సత్యనారాయణశాస్త్రి. పబ్లిషర్స్, శ్రీదేవి పబ్లికేషన్స్, రామలింగేశ్వరఅగ్రహారం, కాకినాడ-533004; పేజీలు: 237, వెల: పన్నాలుగు రూపాయలు.]

ఇదొక ప్రత్యేకమయిన నవల. ఈ నవల రాయటానికిగల ప్రేరణ గురించి రచయిత ఇలా చెప్పారు:

శ్రీ మదునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు వారి ద్వితీయ పుత్రుడ్ని కోల్పోయారు. "ఆ కుర్రాడు పోయేముందు తండ్రికి ఒక లేఖ వ్రాసాడట. పూర్వజన్మలో రామకృష్ణపరమహంసతో కలిసిఉండినట్లు తనకు తన పూర్వజన్మ వృత్తాంతం జ్ఞప్తికిఉన్నట్లు, తనకు గాయత్రీసాక్షాత్కారం కలిగినట్లు వ్రాసిపెట్టి వెళ్ళాడట."

తర్వాత అతని డైరీ కూడా రచయిత చదవటం, ఈ నవల రాయాలన్న కోరిక కలగటం జరిగాయని చెప్పారు.

నవలలో వాసుదేవమూర్తి పాత్ర చాలా ప్రత్యేకమయినది. అతను గాయత్రీ ఉపాసకుడు. "మనకు సప్తకోటి మహామంత్రా లున్నాయని, వాటిల్లో గాయత్రీ మంత్రం పరమోత్కృష్టమైనదని ప్రతీతి. గాయత్రీ వేదమంత్రం. 'గాయతిచ త్రాయతేచ గాయత్రీ' అని వేదమే చెబుతోంది. అంటే దీనిని ఎవరు గానం చేస్తారో వారిని రక్షించునది అని అర్థం....ఏ మంత్రసిద్ధికైనా శుచీభూత మైన అనుష్ఠానం ముఖ్యం ...సర్వేంద్రియాల సంయమనం బ్రహ్మ చర్యం ద్వారా మాత్రమే వీలవుతుంది ." ఇదీఅతని మనస్తత్వం.

వాసుదేవమూర్తి ఎన్నో వేదాంతవిషయాలు చర్చిస్తాడు. ఎక్కువ భాగం ఇలాంటి చర్చలతో, తర్కాలతో నిండివుంది.

ఈ నవల ఒక వ్యక్తిని ఆధారం చేసుకొని రాసింది గాబట్టి పూర్తిగా కల్పితం అని చెప్పలేం. ఈ రోజుల్లో వాసుదేవమూర్తి లాంటి వాళ్ళు వుంటారా అని కొంతమందికి అనిపించటం సహజం. నవలలోని 'విషయం' మీద నమ్మకం గలవారికి మంచి అనుభూతి నివ్వవచ్చు. నమ్మకం లేనివారికి వాసుదేవమూర్తి మనస్తత్వం అంతుపట్టదు సరికదా, అంతమూర్ఖంగా తన దేహాన్ని శుష్కింప జేసుకోటాన్ని హర్షించలేరు. దైవభక్తి అంటే ఇలా బ్రహ్మాండ మైన మాయలోపడి కొట్టుకుపోవటమేనా అనిపిస్తుంది.

## బతుకుపోరు (నవల)

[రచన : బి. ఎస్. రాములు. ప్రచురణ: కరీంనగర్ బుక్ ట్రస్టు ప్రచురణలు. ప్రతులకు: సృజన, హనుమకొండ, వరంగల్-506 001 లేక పీస్ బుక్‌సెంటర్, 4-5-421, సుల్తాన్‌బజార్, హైదరాబాద్-500001. పేజీలు: 111. వెల: అయిదురూపాయలు.]

ఈ నవలలో ప్రధానవిషయం శ్రమజీవుల జీవనపరిస్థితులు. కొత్తదనమేమిటంటే అందులోని వాతావరణం. నవల ముందు మాటలో చెప్పినట్టు బీడీ కార్మికుల గురించి రాయబడ్డ నవల ఇదే మొదటిది కావచ్చు.

కథాంశం ఒక్కటే - బీడీ ఫ్యాక్టరీ యజమానులచేత వారి దగ్గర పనిచేసే కూలీలు ఎట్లు దోపిడీకి గురిఅవుతున్నారు, అన్నది.

రచయిత చెప్పేది మామూలు భాషలో వున్నా, పాత్రలచేత మాత్రం తెలంగాణా భాషలో పలికిస్తారు. ఇది ఇతర ప్రాంతాల పాఠకులకు అర్థం కాకపోవచ్చు, కానీ నవలకి అదే ప్రాణం అయి కూర్చుంది.

పుస్తకం చాలా నిరాడంబరంగా వుంది. ధరకూడా తక్కువని చెప్పవచ్చు. రచయితను, ప్రకాశకులను అభినందించదగ పుస్తకం.

బాబు

## గణపతి రామాయణ సుధ

[పద్య కావ్యము. గ్రంథకర్త : శ్రీ చర్ల గణపతి శాస్త్రి. డెమ్మీసైజు 74 + 233 పుటలు. వె. 15 రూ. ప్రతులకు గ్రంథ కర్తకు వ్రాయవలెను. చిరునామా : శ్రీ చర్ల గణపతిశాస్త్రి, కిర్లం పూడి కాలనీ, ఆంధ్ర యూనివర్సిటీ, వాల్తేరు - 3.]

ఆదికావ్యమైన వాల్మీకి రామాయణానికి తెలుగులో వచ్చిన పద్య రచనలు ఎన్నో ఉన్నాయి. వాటిలో ప్రసిద్ధమైనవి ప్రాచీనాలైన భాస్కర, రంగనాథ రామాయణాలు, నవీనాలైన గోపీనాథ రామాయణం, వావిలికొలనువారి రామాయణం, రామాయణ కల్పవృక్షం మున్నగునవి. రామభక్తులైన చాలామంది కవులు తమ రామాయణ రచనలను సాగిస్తూనే వున్నారు. అలాంటి రచనల్లో ఈ "గణపతి రామాయణ సుధ" ఒకటి. 233 పుటలు గల కథా భాగం బాలకాండంమాత్రమే: దీనిని బట్టి మొత్తం గ్రంథం ఒక బృహద్గ్రంథంగా తయారు కావచ్చునని తోస్తున్నది.

చర్ల గణపతిశాస్త్రి గారిది పండిత వంశం. వీరి తండ్రిగారు నారాయణశాస్త్రి గారు గొప్ప విద్వాంసులు. తండ్రివలెనే కుమారుడుకూడా సంస్కృతాంధ్రాలలో గట్టి పండితులు. వ్యాకరణాలంకారాది శాస్త్రాలలో సమర్థులు. వ్యాకరణాలంకార శాస్త్రాలు తెలిసినవారు న్యాయ, వైశేషిక, వేదాంతాదులలో సమర్థులై ఉండడం అరుదు. గణపతి శాస్త్రిగారు ఆ శాస్త్రాలకు సంబంధించిన గ్రంథాలను కూడా రచించి, ప్రకటించడం వల్ల వీరి బహుముఖ ప్రజ్ఞ వెల్లడి అవుతున్నది.

దీనిని రచించడానికి ముందు రచయిత వాల్మీకి మహర్షి మూలాన్నీ, భాస్కర రామాయణాన్నీ, రంగనాథ రామాయణాన్నీ, వావిలికొలను సుబ్బారావుగారి ఆంధ్ర వాల్మీకి రామాయణాన్నీ, జనమంచి శేషాద్రి శర్మగారి రామాయణాన్నీ, తాడేపల్లి వెంకటప్పయ్య శాస్త్రిగారి రామకథామృతాన్నీ, గోపీనాథ రామాయణాన్నీ, బులుసు వేంకటేశ్వర్లుగారి శ్రీమద్రామాయణాన్నీ బాగా పరిశీలించినట్లు వీరి పీఠికవల్ల తెలుస్తున్నది. అంతేకాక రామాయణ కథ వున్న పద్మ పురాణం మొదలైన వాటినికూడా పరిశోధించారు. చర్చనీయాంశాలైన 'మానిషాద' శ్లోకార్థం, శాంత వృత్తాంతం, పాయస ప్రదానం, సీతా, రాముల వయోనిర్ణయం, రాముని మానవత్వం, సేతుబంధం, ఇంద్రజిత్తు కథ, సీత పూర్వజన్మ వృత్తాంతం, శంబూక వధ మున్నగు విషయాల వివరణ కలదు.

గణపతిశాస్త్రిగారు ఇతర కవుల రామాయణాలకూ, తమ రచనకూ గలవ్యత్యాసాన్ని పెక్కు ఉదాహరణలతో వివరించారు కథాప్రారంభశ్లోకమైన "తపఃస్వాధ్యాయ నిరతం" అనే శ్లోకంతోనే తులనాత్మక విమర్శ ప్రారంభమైంది. దీనినిబట్టి వీరి నిశిత దృష్టి స్పష్టంగా తెలుస్తున్నది.

ఇందులో అయోధ్యనుండి లంకవరకూ గల మార్గాన్ని తెలిపే దేశపటం చేర్చబడింది. ఇది పాఠకులను ఎంతో ఆకర్షిస్తుంది. దీని విషయసూచికలో 97 శీర్షికలు ఉన్నవి. వాటినిబట్టి ఇందులో గ్రహించబడిన కథాంశం స్పష్టంగా తెలుస్తుంది

పద్యకావ్యాలలో అక్కడక్కడ సుదీర్ఘాలైన గద్యలు ఉండటం పరిపాటి. ఆ గద్యలు పద్యాలకంటే కఠినతర శైలిలో ఉండి పాఠకులకూ, శ్రోతలకూ విసుగు కలిగిస్తాయి. ఈ పద్యకృతిలో కూడా అక్కడక్కడ నాతిదీర్ఘాలైన వచనాలూ ఉన్నవి. కాని ప్రబంధాల్లోని గద్యలవలె కఠినంగాకాక చాల సులభశైలిలో ఉండడం ఇందులోని ప్రత్యేకత.

రచయిత గట్టిపండితులయినా, ఇందలి పద్యాలు చాలా సులభ శైలిలో ఉండి పాఠకులు సులభంగా అర్థం చేసుకునే రీతినే ఉంటున్నవి. మచ్చునకు రెండు ఉదాహరణాలు-

సీ. క్ష్మామండలంబునఁ గలనైనదొరకక
  దొరకిన యమృతంపు దొన్నెవోలె,
నీశ్శైన లేనట్టి నిండుఎడారిలోఁ
  బూర్తిగ గురియు వానపోతవోలె,
సంతానమేలేని జనునికిఁ దనభార్య
  లకుఁ గల్గిన సుపుత్ర లబ్ధివోలె
ధనముపోయి మిగుల వనటలఁగుందెడి
  నరునికిఁ బెన్నిధి దరియు పగిది,

గొప్పయుదయము హర్షముఁగూరినటుల
నీదురాక నాకు ముదంబు నింపివైచె,
అనఘ! యోముని! నీ కిదే స్వాగతంబు
హృష్టుఁడనగు నేనిడుదు నీకేమికోర్కె ? [పుట 92]

శ్రమపోగొట్టెకి యాశ్రమంబిదియ పూర్వం బందు నిందే త్రివిక్రముఁ డుండెంజుమి; మేము వామనునికై రాజిల్లు భక్తిన్ వసింతుమిటన్, రాక్షసు లిష్టి విఘ్నముల నెందున్వచ్చి గావింతు రాశ్రమమందే యిట రాక్షసాళిని వడిన్ జంపందగున్ రాఘవా !
[పుట 118]

తిరుమల తిరుపతి దేవస్థానంవారి ఆర్థికసహాయం కొంత దీని ముద్రణకు లభించింది.

## అక్క మహాదేవి వచనములు

[అనువాదము : శ్రీ రేకళిగెమఠం వీరయ్య. క్రౌను 40+70+179 పుటలు. ప్రకాశకులు - శివానుభవ సమితి, 4-7-247, ఇసామియా బజారు - 500 027. వెల : సభ్యులకు - రు. 7 లు. ఇతరులకు - రు. 10.]

శివ శరణులని ప్రఖ్యాతి చెందిన శివభక్తాగ్రగణ్యులలో అక్క మహాదేవి యొకరు. ఆమె పుట్టినది కర్ణాటక ప్రాంతము. మానవ మాత్రుని వివాహమాడ నొల్లక శ్రీశైల ప్రాంతమున కదళీవనము నందలి చెన్న బసవేశ్వరునే తన భర్తగా భావించి, ఐహికసుఖములను చేరనొల్లక అచటనే శివైక్యము పొందినట్లు ప్రసిద్ధి. ఉత్తర దేశమునందలి మీరాబాయితో తులతూగగల మహాభక్తురాలీమె. కన్నడ, సంస్కృత భాషల యందు గొప్ప పాండిత్యము ఈమెకు సహజసిద్ధంగా లభించినది.

కన్నడ భాషలో భక్తి భావమును, తత్త్వమును బోధించు ప్రవచనములు వచనములుగా ప్రసిద్ధమై ఉన్నవి. అక్క మహాదేవి ప్రవచనములే ఇందు ఉన్నవి. కన్నడ భాషలోని ఆ వచనములను అనువాదకులు వీరయ్యగారు తెలిగించి ఈ గ్రంథిరూపంగా ఇస్తున్నారు.

ఇందులో ఆమె రచించిన భక్తి, మాహేశ్వర, ప్రసాద, ప్రాణలింగ, శరణ, ఐక్య స్థలాల వచనాలున్నవి. తర్వాత సృష్టి వచనం ఉన్నది. అధికపాఠాలైన వచనాలు కూడా అందులో చేర్చబడినవి. చివర వచనాల అనుక్రమణిక ఉన్నది.

అనువాదకులు దీనికి సంబంధించిన పెక్కు గ్రంథాలను పరిశీలించి అక్క మహాదేవిని గురించిన విషయాలను జీవిత చరిత్రను సమగ్రంగా వివరించారు. ఆయన పరిశీలించిన గ్రంథాల పట్టికనూ ఇచ్చారు. ఆయన తమ విజ్ఞాపనలో తమ పరిశీలనను గురించి వివరించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆంధ్ర శాఖాధ్యక్షులు డాక్టర్ బి. రామరాజుగారు దీనిపై సదభిప్రాయాన్ని ఇచ్చారు.

వీరయ్యగారు సులభమైన శైలిలో అక్క మహాదేవిని గురించి చక్కగా చెప్పారు. వారి అనువాదంకూడా అందరికీ అర్థమయే రీతిని చాలా సులభమైన భాషలో సాగింది. మచ్చునకు ఒక ఉదాహరణ —

"పంచేంద్రియ గుణములందు ఒక్కదానికి
  ప్రియుడైన చాలదా?
సప్త వ్యసనములందు ఒక్కదానికి
  ప్రియుడైన చాలదా?
రత్నపు సంకెలైన నేమి?
  బంధనము వదలునా చెన్న మల్లికార్జునా?"

[151- వ వచనం]

వచనాలు సూత్రప్రాయంగా ఉన్నా వాటివల్ల గ్రహించవలసిన విషయం ఎంతో విలువైనది. దానిని గ్రహించడం అంత కష్టం కాదు.

దీని ముద్రణకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు, కొందరు వదాన్యులు సహాయపడ్డారు.

అక్క మహాదేవికీ, శ్రీశైల కదళీ వనానికీ సంబంధించిన చిత్రాలు కూడా ఇందులో ఉన్నవి. శైవుల భక్తి మార్గాన్ని సులభంగా తెలుసుకొనుటకు ఈ గ్రంథం బాగా ఉపయోగపడుతుంది.

# మాండూక్య సార సంగ్రహము

[రచన: శ్రీ నండూరు సుబ్రహ్మణ్య శర్మ. క్రౌను 10+252 పుటలు. వెల 12రూ. ప్రకాశకులు - ఆర్ష విజ్ఞాన గ్రంథమాల, శివాలయం వీధి, సత్యనారాయణపురం, విజయవాడ-520 011.]

వేదాంతవిషయాలను బోధించే ప్రాచీన సంస్కృత గ్రంథాలుకొన్ని ఉపనిషత్తులుగా వ్యవహరింపబడుతూ ఉన్నా, వైదిక వాఙ్మయానికి సంబంధించిన దశోపనిషత్తులు మాత్రం అసలైన ఉపనిషత్తులు. అవి ఈశ-కేన-కఠ-ప్రశ్న-ముండక-మాండూక్యాదులు. వీటిలో అద్వైతమతవిషయాన్ని ప్రతిపాదించే మాండూక్యోపనిషత్తునకు తక్కిన వాటికంటె ప్రచారం ఎక్కువ. ఆధ్యాత్మిక ప్రబోధం చేస్తూ వేదాంతోపన్యాసాలిచ్చే విద్వాంసులూ, పీఠాధిపతులూ ఈ ఉపనిషత్తునే ఆధారంగా చేసుకుని ఉపన్యసిస్తూ ఉంటారు.

రచయిత సుబ్రహ్మణ్యశర్మగారు సంస్కృతాంధ్రాలలో లబ్ధప్రతిష్ఠులైన విద్వాంసులు. 1944 నుండి భగవద్గీతోపన్యాసాలను, భారతోపన్యాసాలను ఇస్తూ తత్త్వజిజ్ఞాసువుల ఆదరాభిమానాలు చూరగొన్నవారు. కుర్తాళ శ్రీసిద్ధేశ్వరీ పీఠాధిపతులు శ్రీ విమలానంద భారతీయతీంద్రుల అనుగ్రహంవల్లనూ, గౌడపాద కారికలు మున్నగువాని పరిశీలనవల్లనూ, అద్వైత తత్త్వాన్ని సమగ్రంగా అవగాహనచేసుకొని, దురవగాహమైన మాండూక్యోపనిషత్సారాన్ని జిజ్ఞాసువుల ఉపయోగార్థం గ్రంథంగా రచింప సంకల్పించారు. "నేను ఎవరను? సత్యమని దేనిని అనాలి? భగవంతుడు ఉన్నాడా? ఉంటే ఎక్కడ ఉంటాడు? చావుఅంటే ఏమిటి?" మున్నగు ప్రశ్నలకు సమాధానాల రూపంగా తొలుత రచన సాగింది. కాని, ఆ వ్రాతప్రతి అపహృతంకాగా, ఆయన తిరిగీ-ప్రశ్నోత్తర రూపాలలో కాకుండా ఉపన్యాసాల రూపంలో సులభశైలిలో దీనిని రచించారు. "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" మున్నగువానికి వీరు ఇచ్చిన వివరణం శర్మగారి ప్రతిభాపాండిత్యాలకు చక్కని నిదర్శనం. దుర్గ్రాహ్యమైన విషయాలను సులభంగా అందరికీ బోధపడేవిధంగా చెప్పేనేర్పుకల వీరివంటి తత్త్వవేత్తలు ఇప్పుడు చాలా కొద్ది సంఖ్యలోనే కానవస్తారు. మాండూక్యోపనిషత్తులోని సారాన్ని సప్రమాణంగా తెలిసికొనగోరే వారికి ఇది అవశ్యపఠనీయం. సుప్రసిద్ధ విద్వాంసులు, తర్క-వేదాంత సమ్రాట్టు శ్రీ ముద్దులపల్లి మాణిక్యశాస్త్రిగారు, శ్రీమాన్ కో. వెంకటకృష్ణమాచార్యులుగారు దీని ప్రాశస్త్యాన్ని వివరిస్తూ చక్కని అభిప్రాయాలిచ్చారు. ఆకర్షణీయమైన ముఖచిత్రంతో గ్రంథం అందంగా ముద్రించబడింది. అద్వైతతత్త్వజిజ్ఞాసువులు దీనికి తగిన ప్రచారం అందించగలరని భావిస్తున్నాను.

# భాగవత ప్రభ

[కర్త : శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి. డెమ్మీ 32 పుటలు. వెల : శ్రద్ధ, భక్తి, వైరాగ్యాలు. ప్రాప్తిస్థానం : శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి, జయశ్రీటాకీస్ రోడ్డు, రాజమండ్రి - 4.]

పురాణపండ వారిది పండితవంశం. రాధాకృష్ణమూర్తి గారి తండ్రిగారు, సోదరులు, బంధువులు ఆధ్యాత్మిక విషయ ప్రచారానికి ప్రయత్నిస్తూ, అందుకు ముఖ్య సాధనంగా పెక్కు గ్రంథాలను ప్రచురించారు. ప్రచురిస్తున్నారు. "పురాణ తిలకమై భక్తి జ్ఞాన వైరాగ్య ప్రబోధాలతో సనతన హిందూధర్మ ప్రచారానికి సంపూర్ణంగా సహకరించే భాగవత మహా పురాణాన్ని" అరు సంపుటాలుగా అందరికీ అర్థమయ్యే శిష్ట వ్యావహారిక భాషలో రెండువేల పుటలలో ప్రకటించడానికి ఏతత్కర్త నిశ్చయించి, దానికి అనుబంధంగా ముందు బహుళ ప్రచారానికి ఈ "భాగవత ప్రభ" ను ప్రచురించి, ఉచితంగా పంచిపెడుతున్నారు. దీనిని చదివిన వారికి భాగవత ప్రాశస్త్యం అవగతమై, వారు ప్రచురించే భాగవతం పఠించడానికి ఆసక్తి కలుగుతుందని వారి అభిప్రాయం.

ఈ 'భాగవత ప్రభ' లో మొదట, భాగవతంలోని పన్నెండు స్కంధాలలోను గల విషయాలన్నీ చెప్పబడినవి. తర్వాత హరినామ స్మరణాదుల ప్రయోజనం, భాగవత మాహాత్మ్యం వివరించబడినవి. దీని తర్వాత గోరఖ్‌పూరు గీతాప్రెస్ వారు ప్రచురించిన "శ్రీకృష్ణోపనిషత్తు" నకు తెలుగులో వచనానువాదం ఇయ్యబడినది.

వైదిక వాఙ్మయంలోని ఉపనిషత్తులు పది మాత్రమే : అవి "ఈశ - కేన - కఠ - ప్రశ్నాదులు" అయినా ఇతరాలైన ఉపనిషత్తులు రమారమి నూరు తర్వాతి కాలాలలో తయారై ఉపనిషత్తులనే పేరుతో వ్యవహరింప బడుతున్నాయి. ఉపనిషత్తుల వలెనే ఇవి వేదాంత విషయాలను వివరించడం వల్ల వాటి వలెనే పవిత్రములూ, ఉపాదేయములూ, అయి ఉండడంవల్ల ఈ పేరు వచ్చి ఉండునని తోస్తున్నది. ఈ శ్రీకృష్ణోపనిషత్తు కూడా అటువంటిదే : ఇందులో శ్రీకృష్ణావతారం, విష్ణుమాయా ప్రభావం వివరించబడినవి. ఆ తర్వాత ఆత్మ విశ్వాసాన్ని గురించిన కథలు సంగ్రహంగా ఉన్నవి.

పుస్తకం చివర నిత్య పారాయణకు అనుకూలంగా ఉండే 'కృష్ణం వందే జగద్గురుం' అనే మకుటం గల కృష్ణాష్టకం, అచ్యుత కథా శ్రవణఫలం (తెలుగువచనం), 'జగన్నాథస్వామీ నయన పథగామీ భవతు మే' అనే చతుర్థ పాదం గల 'జగన్నాథాష్టకం' ఇయ్యబడినవి. భాగవతంలో ఉన్న విషయాలన్నింటినీ సంగ్రహంగా తెలుసుకొనుటకూ, శ్రీకృష్ణ తత్త్వాన్ని గ్రహించుటకూ, కృష్ణాష్టక, జగన్నాథాష్టకాలను నిత్యపారాయణ చేయుటకూ ఈ పుస్తకం బాగా ఉపయోగిస్తుంది. రచయితకు వ్రాసి, యీ పుస్తకాన్ని ఉచితంగా పొందవచ్చును.

"ఆంగీరస"

# విశ్వనా

[రచయిత: శ్రీ జోశ్యుల సూర్యనారాయణమూర్తి. క్రౌను సైజు. పుటలు 72. మూల్యం అయిదు రూపాయలు. ప్రకాశకులు: దివిసీమ సాహితీసమితి, గాంధీ క్షేత్రం, అవనిగడ్డ - 521 121, కృష్ణా జిల్లా]

ఈ గ్రంథానికి, ప్రకాశకులు తొలిపలుకువ్రాస్తూ విశ్వనాథ సత్యనారాయణగారి పూర్వులది దివిసీమలోని విశ్వనాథపల్లి గ్రామమనీ, బాల్యం తండ్రిగారి మేనమామల యూరైన విశ్వనాథపల్లిలో గడిపారనీ, శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో "ఒగిని మేమందరము కృష్ణఒడ్డుజాతి" "ఆయన ప్రకృతియు నా యది మాయురెయొకజాతి ద్రవ్యమా యనిపించున్" అని మండలి కృష్ణారావు గారిని గూర్చి పేర్కొన్నారనీ వ్రాశారు. రచయిత ఈ గ్రంథాన్ని మండలి వేంకటకృష్ణారావుగారికి అంకితం ఇచ్చారు.

ఈ గ్రంథంలో, జోశ్యులవారు, వారి తొలిపరిచయం దగ్గరనుండీ, విశ్వనాథవారు స్వర్గస్థులయ్యేవరకూ, వారిరువురి మధ్య జరిగిన సన్నివేశాలనూ, కొన్ని సంఘటనలను ఏర్చి కూర్చారు. విశ్వనాథవారికి రచయితపైకల ఆదరాన్ని గూర్చిన విషయాలు చెప్పారు.

విశ్వనాథవారి షష్టిపూర్తి సభలలో జరిగిన విషయాలు చెప్పారు. విశ్వనాథవారి వనబడే సరసమైన చమత్కారాలతో పాటు, విరసమైన భాషణాలు కూడా యీ గ్రంథంలో చోటుచేసికొన్నవి. చిత్తశుద్ధితో, వారినిగూర్చి తాను విన్న, కన్న, విషయాలను ఒకచోట రచయిత సంకలనంచేశారు.

రచయిత సమర్థులు. చదివింపదగిన రీతిలో, వచన గ్రంథాన్ని రూపొందించారు. విశ్వనాథవారిని గూర్చి అనేక గ్రంథాలు వస్తున్నవి. అందులో ఇది ఒకటి.

శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి

# ఆంజనేయ చరిత్ర

[రచన - "దిట్టకవి" ఎం. ఏ. మూల్యము: రు. 4-00లు. ప్రతులకు: "దిట్టకవి" ఎం. ఏ. వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవాలయం, పిడుగురాళ్ళ-522 413.]

రామకథ కంటే విశిష్టమయినది ఆంజనేయ చరిత్ర. సాధకుడు ఆంజనేయుడు. భక్తుడు ఆంజనేయుడు. త్రిమూర్తుల స్వరూపుడు ఆంజనేయుడు. ఈ చిన్న పుస్తకంలో హనుమ జననము, హనుమత్తత్త్వము విశిష్టత, బాల్య సంఘటన, విద్యాభ్యాసము, శివుడే ఆంజనేయుడై రామునికి దాస్యము చేసినా, హనుమంతుని పూజించిన సర్వ దేవతలనుపూజించినట్లే, హనుమంతునికి వివాహం అయిందా? ఆంజనేయుడు - జీవితాదర్శములు, ప్రాపంచిక వస్తు వ్యామోహము లేకుండుట తదితర భాగాలున్నాయి.

రచయిత చెప్పినట్టు పిల్లల కోసం సులభశైలిలో వ్రాసిన పుస్తకం ఇది. ఒక్కొక్క భాగం ఒక్కొక్క కదగా వున్నది. అయితే ఈ కథలన్నీ విజ్ఞులకేకాక కొందరు వయోజనులకు కూడా తెలిసినట్టివే. హనుమంతుని వివాహం గురించి ద్వివిధాభిప్రాయాలున్నాయి. వివాహం కాలేదు కనుకనే సదా బ్రహ్మచారి యను బిరుదు కలదని కొందరి మతం. వివాహమయినా ఆంజనేయుడు బ్రహ్మచర్య వ్రతం విడనాడలేదని మరి కొందరి మతము. ఇదే విధంగా శనివారంనాడే ఆంజనేయుని పూజింపవలసిన ఆవశ్యకత గురించికూడా భిన్నాభిప్రాయాలున్నాయి.

ఇంతకూ ఈ పుస్తకం ఉద్దేశం పిల్లలకు సత్ప్రవర్తన నలవరచుట. అది అంత సులభమా? పెద్దలే ఫ్యాషన్ల, ఆధునికత పేరిట విపరీత బుద్ధుల నలవరచుకొనుచుండగా ఇక పిల్లల సంగతి వేరే చెప్పవలెనా? నిజమే! ఆంజనేయుడు సులభాతి సులభమైన దైవమే. అసలు దైవంలేడు-దైవభావం ఉన్నదనే వాదనొకటి ఉన్నది గదా? దైవభావానికీ, దైవానికీ, సంబంధాన్ని గురించిన పుస్తకాలు అంతఎక్కువగా తెలుగులో లేవేమో! "ఉన్నాడనుకుంటే ఉన్నాడు. లేడనుకుంటే లేడు" అనేరకం భావాలు గల వారితో వాదించుటకు ప్రాతిపదిక యేమిటి? దైవం అనే మాటకు బదులు పదార్థము అనేమాటను వాడడం ఆధునిక, తాత్విక సంతృప్తికాక మరేమిటి?

శ్రీ వి. ఎస్. అవధాని

# గద్దర్ పాటలు

[వెల: రు. 3-50 లు. జన నాట్యమండలి ప్రచురణలు. ప్రతులకు:- 1) పీస్ బుక్ సెంటర్, హైదరాబాద్; 2) సృజన, వరంగల్.]

1970 తరువాత తెలుగు కవిత్వం విప్లవమార్గంలోకి మలుపు తిరిగింది. శివసాగర్ నపుడో భాస్కరుడా పాట రూప పరంగా విప్లవకవుల దృష్టిని మార్చింది. వచనకవిత్వ స్థానాన్ని పాట ఆక్రమించింది. జనం కోసం కవిత్వం రాసేటప్పుడు ఆ జనం భాషలోనే, ఆ జనానికి అలవాటైన రూపంలోనే రాస్తే దాని ప్రభావం అమితంగా ఉంటుందని విప్లవకవులు చాలామంది గ్రహించారు. అట్లా పాటని పాటక జనాల్లోకితీసుకుపోయి లక్ష్యసిద్ధికోసం పాటుపడుతున్న కవులలో గద్దర్ ఒకడు. జనంతోనూ, వారి జీవితంతోనూ ఎంతమాత్రం పరిచయం లేకుండా వారి భాషలో పాటలు రాయడం సాధ్యంకాదు. గద్దర్ నిరంతరం జనంతో జీవించేవాడు; వాళ్ళనుంచి నేర్చుకుని వాళ్ళకళారూపాన్ని వాళ్ళకే సుబోధకంగా ప్రదర్శించే నేర్పరి. "ముఖ్యంగా చాలామంది రచయితలు, కళాకారులు, తమకు ఎంతో జీవితఅనుభవం ఉంది అని ఇక జీవితంలో నేర్చుకోవడం మానేసారు. కాని ఈ కవి అలా కాదు. నిరంతరం జీవితాన్ని, సమాజాన్ని పెద్దబాలశిక్ష చదివినట్టు చదువుతాడు" అంటాడు వరీన్, గద్దర్‌ను గురించి.

శ్రామిక జనంయొక్క "శ్రమనిష్ఫలమై జని నిష్ఠురమై"న దశలో వారి హక్కుకోసం, స్వేచ్ఛకోసం, స్వాతంత్ర్యం కోసం పోరాటం సాగిస్తారు. మేధావులూ, కళాకారులూ, సాహిత్యకారులూ సర్వజనసంక్షేమం కోసం, న్యాయంవైపు మొగ్గుతారు. "ప్రయోగ వాదమనో అనుభూతివాదమనో ఏటోపేర్లు మెడల్లో వేసుకుని మధ్య తరగతిక్రింద ఛాయా పాఠకుల్ని ప్రలోభపెడ్తూ కీర్తి, ప్రతిష్టా సంపాదించుకోవచ్చు. ఆకర్షణా కలిగించవచ్చు- ఇవి మిణుగురులు, కాకపోతే మెరుపులు - వంపులూ, విరుపులూ ఎన్నో ఉండి యీ మెరుపులు సాహిత్యంలో శిలాశాశ్వతంగా నిలిచిపోయినా ఆశ్చర్యంలేదు. అసూయా పన్లేదు-కావల్సింది నిలిపి వెలిగే దీపాలు - గుడిసెలో గుండెలో - చిమ్మ చీకట్లో ఘోర నిరాశలో, పోరాటసమర్థంలో ఉద్యమ సంరంభంలో - కరదీపాలు వెలిగి వెలిగించేవి. కాలుతూ వెలుతురునిచ్చేవి. ముందు దారి చూపేవి. వీటితైలం రక్తం" అంటారు కె. వి. రమణారెడ్డిగారు ఈ పాటల్ని గురించి.

"మన బతుకులు మారనీకి
మన ఎతలు తీరనీకి
అన్నలార సెల్లెలార
ఎత్తండి కొడవండ్లు
ఎఱ్ఱరాజ్య మొచ్చెదనుక
దించకండి కొడవండ్లు."

ఇది గద్దర్ దృక్పథం. ఈ పాటలు ప్రధానంగా ఏదో ప్రాంతపు మాండలీకమై ఉంటాయి. అన్ని ప్రాంతాల వారికీ ఆ భావం సమగ్రంగా అర్థంకాకపోవచ్చు. అలాంటప్పుడు మాండలీక పదానికి అన్ని ప్రాంతాల్లోనూ ప్రసిద్ధమైన అర్థాన్ని ఇస్తే ఇతర ప్రాంతపు పాఠకులకు బాగుంటుంది.

# వర్గీస్ పాటలు

[వెల: రు. 3-00లు. ప్రతులకు : 1) పీస్ బుక్ సెంటర్, హైదరాబాద్; 2) సృజన, వరంగల్.]

కష్టజీవులకు పోరాటమార్గాన్ని ప్రబోధించేసే జనం పాటలు ఇవి. ఈ పాటలకు ముందు వర్గీస్ పాటల పుట్టుక, స్వరూప స్వభావాలను గురించి వివరించారు. జానపదుల్లో పుట్టిన పాటల స్వభావం భూస్వామ్య భావజాలమేనని అయితే ఆరూపంలోనే మారుతున్న సమాజస్వరూపాన్ని, రాగల ప్రజాస్వామిక విప్లవ భావాలను కొత్తదనంతో చెప్పవలసిన అవసరాన్ని వర్గీస్‌లాంటి పాటల కవులు గ్రహించారు. "నూతన ప్రజాస్వామిక విప్లవం కోసం, నూతన ప్రజాస్వామిక సంస్కృతికోసం తమ తమ కలాలను, గళాలను మలుస్తున్న కవులు జానపద సాహిత్యపోకడల్ని ఆకళింపు చేసుకొని కొత్తపద్ధతిలో, కొత్తనిర్వచనాలతో ప్రజా ఉద్యమాల పోరాటాల ఊపుతో ప్రజా సాహిత్య సృష్టికి మూలకారకులవుతున్నారు" అని వర్గీస్‌గారు చెబుతున్నారు. జానపదుల ...నే కొత్తదనంతో కొత్తభావాన్ని చెప్పాలనేది విప్లవపాటల రచనయొక్క ఉద్దేశం. ఆనాటి జానపదుల పాటల్లో భూస్వామ్య భావజాల ముంటే ఈనాటి జనాల పాటల్లో ప్రజాస్వామిక విప్లవ భావజాలం ఉంటుంది. నక్సల్‌బరీ మార్గమే తమ మార్గంగా సకలమైన శ్రామిక వర్గం తీర్మానించుకుంటే ఈ వ్యవస్థ ఉన్న ఫళంగా మారేతీరుతుంది. ఆ మార్పుకోసం ప్రజలను సమాయత్తం చేయటానికే ఈ పాటలు.

"ఎండిన నీ యెదనే
మండుతున్న పేనమయ్యి
మండుతున్న నీ నెత్తే
సర్రుమనే బండయ్యి
ఏగి ఏగిన కండ్లు
చింత నిప్పులయి
కాలిన నీ కాళ్ళేమో
కరిగిన సీసామయ్యి
పానం బిగబట్టరా-ఓ నాగులూ
పగవారిని గూల్చరా - ఓ నాగులూ."

లాంటి పాటలు, గుతపలందుకొని, మోసపోకోయి రైతన్న, ఆడ సీకాకులంల, ఎఱ్ఱెఱ్ఱ దండాలు ఒకటేమిటి సమస్తమైన పాటలు పీడితజన విముక్తికోసం పీడకులకు ఎక్కుపెట్టిన బాణాలే.

# తిరుగుబాటు

[మలయశ్రీ. వెల: రు. 8-00 లు. ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, చంద్రం బిల్డింగ్స్, విజయవాడ - 520 004.]

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారు ఏటా నవలల పోటీ పెట్టి బహుమతులిచ్చి సామాజిక చైతన్యానికి ప్రోత్సాహం గావించే నవలలను ప్రచురిస్తున్నారు. సాహితీలోకం, సామాజిక అభ్యుదయవాదులూ సంతోషించవలసిన విషయమే ఇది.

1982 వ సంవత్సరం నిర్వహించిన పోటీలలో రెండవ బహుమతి పొందిన నవల ఇది. మాధవరావు దొర అతని సంతానం శ్రీకాంత్, సునంద, దొర పాలేరు వెంకన్న అతని సంతానం రాజు, రాములు, మల్లి, ఆచార్యులు అతని కొడుకు రంగనాధ్. వీరి మధ్య ఈ నవల ఇతివృత్తం సాగింది. సునంద, రాజును అకస్మాత్తుగా ప్రేమించడంలో ఔచిత్యంలేదు. ఆచార్యులు - అతని కుమారుడు రంగనాధ్‌కి మధ్య ఒక తరంలో వచ్చిన భావ పరిణామం కనబడుతుంది. రాజు చదువుకున్న హరిజన యువకుడు. సంస్కరణవాదంతో సమాజం మారుతుందని విశ్వసించినవాడు. సునంద రాజును ప్రేమిస్తుంది; రాజు తిరస్కరిస్తాడు. తండ్రి తెచ్చిన సంబంధం చేసుకుంటుంది. నవల అంతంలో దీర్ఘ వ్యాధితో భర్త మరణిస్తాడు. శ్రీకాంత్ పోలీస్ ఆఫీసర్ అయి విప్లవ భాగస్వాములైన వారిని కాల్చి తను కాల్చబడతాడు. రంగనాధ్ మల్లిని వివాహం చేసుకుంటాడు. నవల చివరలో ఎలక్షన్లు, మినిస్టర్లు, ఉపన్యాసాలు, డిన్నర్లు యధావిధిగా జరుగుతాయి.

రచన సిద్ధాంత చట్రంలోంచి రాదు; జీవితంలోంచి వస్తుందని చాలామంది రచయితలకు తెలియక పోవటం శోచనీయం. కనీసం గోర్కీ జీవితం, సాహిత్యం అన్నా చదివితే రచన - జీవితం - అనుభవం వీటికి గల సంబంధం అన్నీ తెలుస్తుంది. ఈనాటి నవల కానీ మజిలీ కథల్లాగా ఉండటం ఆశ్చర్యం కదా!

# స్వేచ్ఛాగానం

[కాణిపాకం లింగన్న. వెల : రు. 10-00 లు. ప్రతులకు : 1) కాణిపాకం లింగన్న, 15-7-17/3, డాన్ గార్డెన్స్, చిత్తూరు-2; 2) విశ్వప్రభ పబ్లిషింగ్ హౌస్, నేండ్రగుంట, చిత్తూరు జిల్లా]

ఇది కవితా సంకలనం. దీనికి డా॥ బి. భాస్కర చౌదరి గారు చిన్న పీఠిక లాంటి ముందుమాట రాశారు. దాంట్లో కవిగారి తత్వాన్ని వివరించటం జరిగింది. వివిధ సందర్భాలలో లింగన్న గారు రాసిన ఖండికలతో పాటు బంగ్లాదేశపు స్వాతంత్ర్య సమరాన్ని ధ్యేయంగా పెట్టుకుని రాసిన 'స్వేచ్ఛాగానం' ఖండికను చేర్చి ఈ సంకలనం వేశారు. 'విరసం, విప్లవం - ఇవి వినటానికి ప్రగతి సాధకాలని కొందరనుకుంటారు. కాని అది నేల వదలి సాముచేయడమని వీరి అభిప్రాయం' అని లింగన్నగారి దృక్పథాన్ని చౌదరి గారు విశదీకరించారు.

"ఈ ప్రగతి ఎక్కడిది ? ఈ ప్రాభవమెక్కడిది ?
అంధ్రావని నేమి అన్నపూర్ణ యైనది
ఈ నవత ఎప్పటిది ? ఈ నవత ఎక్కడిది ?
పల్లె పల్లెకు అభివృద్ధి పథకాలు వెలశాయి
నవ చైతన్య శక్తి నర్తించె నర్తించె
ఆంధ్రమాతకు అలంకారాలు హెచ్చాయి."

అని కవి గారి అభిప్రాయం. అభివృద్ధి ఎవరిపాల బడుతోంది ? సంపదను సృష్టించేదెవరు ? దాని ఫలితాన్ని అనుభవిస్తున్న దెవరు? ఇత్యాదులైన ప్రశ్నలు లింగన్న గారికి కలిగినట్లు లేదు.

కవితా శైలీ, 'కవిత్వపు నడక నేర్చిన కవిత ఉన్నత పథాలపైపు ప్రయాణం చెయ్యాలి. ఇవ్వాళ కనబడుతున్నదే అభ్యుదయం, ప్రగతి అనుకుంటే మనం చూడలేని సమాజ జీవితం ఒకటున్నది. దాని భయంకరమైన స్థితిని కవినేత్రం దర్శించక పోతే ఎవరు చూడగలుగుతారు. లింగన్న గారు జీవితం పట్ల, సంఘం పట్లా పరిపూర్ణమైన అవగాహనతో మరింత మంచి కవిత్వం రాయాలి.

"జీవితమొక నదీ ప్రవాహం
తీరని కోర్కెల ఆరని దాహం
ఒక గట్టు సుఖ సోపానం
మరో గట్టు దుఃఖానికి స్థానం
సుఖ దుఃఖాలను ఒరుసుకుంటూ
ఆగక సాగడమే జీవిత పరమార్థం."

అనుకున్న లింగన్నగారు జీవితంలో కష్ట సుఖాలకు కీలకమైన కారణాలను అన్వేషిస్తూ కవితం రాస్తారని ఆశ.

# జాషువా కృతులు సమాలోచన

[డా॥ బి. భాస్కరచౌదరి. వెల: రు. 40/- లు, ప్రతులకు: 1) సమతా పబ్లికేషన్సు, 20-11-36/1, జైల్ ఖానా వీధి, చిత్తూరు; 2) నవోదయా పబ్లిషర్సు, ఏలూరు రోడ్డు, విజయవాడ - ; 3) విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ - 520 004 ; 4) విశ్వప్రభ పబ్లిషింగ్ హౌస్, నేండ్రగుంట, చిత్తూరు జిల్లా]

బి. భాస్కర చౌదరి గారు గతంలో జాషువా జీవిత కవితా ప్రస్థానం అనే ఒక లఘు విమర్శనా గ్రంథాన్ని అచ్చువేశారు. చెన్నయ్య గారితో కలిసి కృష్ణశాస్త్రి జీవితం - సాహిత్యం అనే పుస్తకాన్ని అచ్చు వేశారు. రామలింగారెడ్డి గారిపై వారి కాలేజి తెలుగుశాఖ చేసిన కృషిలో భాగస్వాములైనారు. ఈ పుస్తకం జాషువాపై వారు రాసిన సిద్ధాంత వ్యాసం.

విశ్వ విద్యాలయాల్లో తెలుగుభాషా సాహిత్యాలను గురించి పరిశోధన (పిహెచ్.డి. పట్టంకోసం) ఎంత ముందుకు పోయిందో ఫలితం అంత వెనక్కు వస్తున్నది. కొన్ని కొన్ని సిద్ధాంత వ్యాసాలు ఎంత అధ్వాన్నంగా ఉన్నాయో ఇటీవలి కాలంలో తెలుగు సాహిత్య పాఠకులకు విదితమైన విషయమే. చౌదరి గారి సిద్ధాంతవ్యాసం అందుకు అపవాదమై నిలుస్తున్నది. సిద్ధాంతవ్యాసం రాయడంలో చౌదరిగారికి గల చిత్తశుద్ధి, నిజాయితీ, కవిపట్ల ఆయనకు గల అపారమైన ఆర్ద్రతలను ప్రతి అక్షరం ఋజువు చేస్తున్నది.

కాల్పనిక కవిత్వం కాలంలోనే అందుకు భిన్నంగా వారి వారి విశ్వాసాలతో తెలుగులో కవిత్వం చెప్పిన వారిలో విశ్వనాథ, తుమ్మల, జాషువా ముఖ్యులు. ముగ్గురిదీ భిన్నమైన మార్గాలే. కవిత్వ రూపం మాత్రం ప్రాచీనమైనదే. అభివ్యక్తీకరణలో ఎవరి పద్ధతి వారికున్నది. జాషువా రచనలను తన పరిశోధనకు విషయంగా ఎన్నుకొని దానిని చౌదరిగారు నిర్వహించిన తీరు శ్లాఘాపాత్ర

మొత్తం సిద్ధాంత వ్యాసాన్ని ఏడు ప్రకరణాలుగా విభజించడం జరిగింది. మొదటి ప్రకరణంలో జాషువ జీవిత ప్రస్థానం, రెండవ ప్రకరణంలో జాషువ కృతుల వర్గీకరణం, మూడవ ప్రకరణంలో పద్య కృతులు-కావ్యఖండికలు, నాల్గవ ప్రకరణంలో గద్య కృతులు, ఐదవ ప్రకరణంలో దృశ్యకావ్యాలు, ఆరవ ప్రకరణంలో రచనా విశేషాలు, ఏడవ ప్రకరణంలో జాషువకవిత్వ తత్వాలను గూర్చి వివరించడం జరిగింది. 'నాదు కన్నీటి కథ సమన్వయము సేయ-నార్ద్రహృదయంబుఁగూడ కొంతవసరంబు' అని జాషువ ఆశించినట్లే చౌదరిగారు జాషువ కృతులను సమీక్షించడం జరిగింది.

భాస్కర చౌదరిగారి సిద్ధాంత వ్యాసంలో మరొక ఉత్తమ లక్షణం - కవి దృక్పథంతో భేదించేటప్పుడు కూడా స్పష్టంగా, నిర్ద్వంద్వంగా భేదించటం. అక్కడ ఎటువంటి మలినఛాయా ఉండకపోవటం ఇట్లాంటి లక్షణం ఎక్కువ మంది పరిశోధకులలో ఉండదు.

జాషువ పదప్రయోగంలో ఉన్న వైచిత్రిని, అతను ఉపయోగించిన అన్యదేశ్యపదజాలాన్ని, ఆంగ్ల పదజాలాన్ని, ఛందోవిశేషాల్ని, అలంకార విశేషాల్ని సోదాహరణంగా వివరించారు. అయనపై వచ్చిన శాస్త్రసంబంధమైన విమర్శను, ప్రతి విమర్శను కూడా పాఠకుల ముందుంచారు.

జాషువ సమకాలీనులైన కవుల్లో ఆయన పద్యానికున్న నడక మరొకరికి సాధ్యపడక పోవటం పద్యనిర్మాణ శిల్పమర్మజ్ఞులైన వారందరికీ తెలుసు. జాషువ అభ్యుదయ వర్గానికి చెందినవాడా ? భావకవితావర్గానికి చెందినవాడా ? అనేవి పనికిరాని చర్చలు. జాషువ రచనలన్నింటిలోనూ, వర్ణవ్యవస్థా ప్రస్తావన ఉండటం సర్వసాధారణమైన విషయం. ఆయన జీవితాంతమూ బాధపడినది దానిని గురించే కనుక. సాటి కవులు కూడా ఒకే వేదిక మీద ఆయనను అవమానించినట్లు ఇప్పటివారు చెప్పుకుంటారు.

భవభూతి 'ఏకోరసః కరుణఏవ' అన్నట్లుగానే జాషువ 'కరుణరస మొకండె కఠిన రాక్షస ముకొ/హృదయములను గరిగి ముదముగూర్పు / వేడికంటి నీటి విలువ సహజమైన/చలువలీను అశ్రువులకు లేదు/అంటాడు. సందర్భం వేరైనా కరుణ రసానికి గల స్థానాన్ని ఏ కవైనా అంగీకరించి తీరవలసిందే గదా!

"ఒక ఉద్యమాన్ని ఆలంబనంగా చేసుకొని, తల్లక్షణాలను కవితద్వారా అభివ్యక్తం చేసిన కవి ఆ ఉద్యమపు వేడి చల్లారిపోవటంతో తెరమఱుగై పోవటం సాహిత్యలోకంలో సాధారణంగా కన్పించే విషయమే. ఈ కారణం వల్లనే భావ కవిత్వపు రోజుల్లో వెలుగులోనికి వచ్చిన కొందరు కవులు నేడు పాఠకలోకానికి దూరం కావటం జరిగింది" అని అంటున్నారు భాస్కర చౌదరి గారు జాషువా కవిత్వ తత్త్వంలో. ఇది కొంచెం తొందరపాటు నిర్వచనమేమో. ఏనాడైనా ఏ ఉద్యమ కాలంలోనైనా మిగిలేది కొంతమంది కవులే. ఉద్యమం వేడికి కవులు మిగలడానికి ఏం సంబంధంలేదు.

జాషువ ప్రధానంగా సంస్కరణవాదకవి. వర్ణ వ్యవస్థను మొత్తంగా అతను కాదనలేడు. వర్ణ వ్యవస్థలో ఉన్న లోపాలను అతను దుయ్యబట్టాడు. అన్ని వర్ణాలు సమానం అనటంలేదు, వర్ణ సాహిత్యాన్నికోరటం వేరు. అట్లాగే ఆర్థిక వ్యవస్థకూడా. ముష్టి పడేయటంవల్ల, దానం చెయ్యటంవల్ల శ్రమజీవి దారిద్ర్యం తీరదు. తీరదని జాషువాకు తెలుసు. అయితే అతను కాలం కంటె ముందు చూడలేదు. కనుకనే —

"వాని రెక్కల కష్టంబు లేనివాడు
సస్య రమ పండి పులకింప సంశయించు
వాఁడు చెమ్మటలోడ్చి ప్రపంచమునకు
భోజనముఁ బెట్టు వానికి భుక్తిలేదు"

అనిచెప్పి పరిష్కారాన్ని వదిలేశాడు. అయితే గాంధేయ వాదం ఒకటి అతనికి కవచం. దారిద్ర్యానికి గాంధేయవాదం పరిష్కారమా ? ఇవన్నీ శేష ప్రశ్నలు.

ఈ సిద్ధాంత గ్రంథంలో చౌదరిగారు దర్శించిన జాషువా స్వరూపం సమగ్రమైనది. ఆయన కవిత్వతత్వానికి చాలా దగ్గరగా ప్రస్థానించి ఆయన జీవలక్షణాన్ని, బలాన్ని, బలహీనతని అనితర సాధ్యంగా చూపించారు భాస్కర చౌదరిగారు. వారి పరిశోధనా పాటవానికి, వారు పడిన శ్రమకు అభినందనీయులు.

## నవోదయం (కవితా సంకలనం)

[డా॥ ఎస్. గంగప్ప. వెల: రు. 6-00 లు. ప్రతులకు : శశీప్రచురణలు, C-73, శ్రీనివాసనగర్, గుంటూరు - 522006; నవోదయ పబ్లిషర్సు, ఏలూరురోడ్, విజయవాడ - 2; అరండల్ పేట, గుంటూరు-2]

ఇది గంగప్పగారి పద్య, గేయ, వచనగేయ కవితాసంకలనం. సాహిత్యపరిశోధకులు, పరిశీలకులు అయిన గంగప్పగారు బాలగేయాలతోపాటు కవితాసంకలనాలను కూడా వెలువరిస్తున్నారు. ఈ సంకలనానికి ఆచార్య తూమాటి దోణప్పగారు, ఆచార్య జి. ఎన్.

రెడ్డిగారు, ఆచార్య సి. నారాయణరెడ్డిగారు, శ్రీ శ్రీగారు, చిట్ట చివరకు పొన్నెకంటి హనుమంతరావుగారు అవసరమైనంతగాను, కానంతగాను కూడా ముందు మాటలు రాసి అభినందనలను, అభిప్రాయాలను, అనుశీలనలను అందించారు. ఈ కవితాసంకలనంలో 'గురజాడ, శ్రీశ్రీ, లాల్‌బహదూర్‌శాస్త్రి, రవీంద్రుడు మొదలైన వారిపై అభినందన ఖండికలు, ఉగాదిపై, బిచ్చగానిపై, బాంగ్లాదేశ్ విజయంపై, రాష్ట్రావతరణంపై ఇంకా అనేక అంశాలపై కవితలున్నాయి. 'గాంధీని కృష్ణదేవరాయలను గంగప్పగారుకూడా మరోసారి జ్ఞప్తిచేశారు పాఠకులకు. సుబ్బన్నగారిపై కవితలు రెండుచోట్ల కనబడతాయి. ఏదిరాసినా ఈ సమాజంలో అందరూ సుఖపడాలని, హెచ్చుతగ్గులుండకూడదనే తపన గంగప్పగారిది. రాసిన ప్రతి ఖండికా కవిత్వం కావాలని మనం ఆశించగూడదు. కవిత్వాంశగల కవితాసంకలనం ఇది. వారి ఆశయానికి ఈ ఉదాహరణ చాలు.

'నల్లటి మచ్చ అమవస నిశియై
అల్లుకుంది సందింతలేక
బ్రతుకు చీకటి
బరువు బాధ్యత
కరువు కాటకాలు
చీలి హృదంతరాలు'

ఈ వర్తమాన స్థితిలోంచి—

'బ్రతుకు బాటలో వెలుతురు ప్రసరించే
ఆశాభానూదయం కావాలి
బాధల గాథల చీకటులు
పంచబంగాళం కావాలి'

అనే ఆశావాదంతో ఈయన కవిత మడిపడి ఉంది.

## స్యమంతక మణి (గేయ కావ్యం)

[రచన: పెంటమరాజు నరశింగరావు, బి. ఎ. వెల: లేదు. ప్రతులకు: పెంటమరాజు నరశింగరావు, జాతీయోన్నత పాఠశాల, నాగర కర్నూలు - 509 209.]

ఇది స్యమంతక మణి కథ. వినాయకచవితి పండగ చేసుకునే పిల్లలకూ, పెద్దలకూ చదువు వచ్చినా రాకపోయినా తెలిసిన కథ ఇది. ఈ కథను బడిపిల్లలకు పనికివచ్చే శైలిలో గేయాలుగా రూపు నిచ్చారు రచయిత. వారి రచనకు ఈ గేయం ఉదాహరణ.

"ఘనుడైన భగవంతుని
కథను చదువ విన్నగాని
పరమాత్ముని కృప కలిగి
శ్యమంత తొలిగిపోవు"

## శ్రీ సాయినాథ కరావలంబ స్తోత్రము

[రచన: బాపట్ల వేంకట పార్థసారథి. వెల: రు. 1.00 లు ప్రతులకు: బాపట్ల వేంకట పార్థసారథి, శ్రీ సాయినిలయమ్, చెరువు-523 113.]

షిరిడీ సాయిబాబాను స్తుతిస్తూ రాసిన చిన్న పుస్తకమిది. ఈ పుస్తకంలో 27 పద్యాలున్నాయి. అన్నీ భగవంతుని భక్తుడు ఏమి కోరతాడో కోరవలెనో చెప్పేవే. మచ్చునకు-

"శాంతి కరువయ్యె సంసారసాగరమున
సుఖము మరుగయ్యె: ఆశయే చుట్టుకొనియె
యమభటుని పాశమట్టుల; ఆర్తిదొలగ
చేయి నందింపుమా నాకు సాయినాథ!"

సాయిభక్తులు పారాయణచేసి తరించటానికి బాగుంటుంది.

శ్రీ టి. ఎల్. కాంతారావు

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 61247.

# భారతి

సాహిత్య మాసపత్రిక
జూన్ 1983

అహాన్ని చూపించే అద్దం

శ్రీ ని వా సు లు

సమ సమాజం

తి రు మ ల రా వు

చూపు నిలిపి క్షణం
స్వేచ్ఛ – దీక్ష

సాం ధ్య శ్రీ

జంతు ప్రకృతిలో
రసానుభూతి

ర మే ష్ బా బు

మళ్లీ తెల్లవారుతుంది

కో టే శ్వ ర రా వు

కేశవనామ సంకీర్తనలు

గో పా ల కృ ష్ణ అ బ్బూ రి

ఇంకా ఆచార్య తిరుమల, శివశంకరశర్మ, విద్యాసాగర్, కిశోరుబాబు – అశోకుబాబు, తిరునగరి, మార్కండేయశర్మ, యస్. యస్. రెడ్డి, భవానీశాస్త్రి, మిరా, దినకర్, సుబ్బరామశాస్త్రి, విజయ దత్తాత్రేయశర్మ, చంద్రశేఖరరెడ్డి, వేంకటబాలాజి ఇతరుల రచనలు

వ్య వ స్థా ప కు లు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# భారతి

మాసపత్రిక

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

జూన్ 1983

సంపుటము: 60 సంచిక: 6

విడిపత్రిక వెల నాలుగు రూపాయలు

# విషయానుక్రమణిక

## జూన్ 1983

# సముద్ర పుష్పం!

## ఆచార్య తిరుమల

ప్రశ్నించే కళ్ళల్లో ప్రగతికాంతి పోస్తాను
శిశిరంలో రాలిన ఆకుల్ని శిలా శాసనాలుగా వేస్తాను!

నేను- భవిష్యత్తుకు దూసుకుపోతున్న బాణాన్ని
వికసించే పువ్వులో పరిమళించే ప్రాణాన్ని
ఎగిరే జెండాకు ఎనలేని గీర్వాణాన్ని
నిజానికి- అక్షరాల చుక్కల దివాణాన్ని!

నేను- హిమాలయ హిమవేదిక నుండి పిలిస్తే
హిందూ సముద్ర ఘోషతో కన్యాకుమారి
పలుకుతుంది!
తూర్పు వాకిలి తెరచి తీవ్రంగా చూస్తే-
కొండపైనుండి దూకిన సూర్యుడు
పడమటి కడలిలో ఈత కొట్టుకుంటూ
నా వైపే వస్తూ వుండటం కనిపిస్తుంది!

నేను- వానరత్వానికి వారసుణ్ణి కాను;
మానవత్వానికి వారసుణ్ణి!
నాది మంది-రం కాదు; మమతా మందిరం!
నా ఆలోచనలు నదీ నదాల్లా ప్రవహిస్తాయి,
నా నమ్మకాలు పంటల్లా పచ్చ తివాసీలు పరుస్తాయి
నా ప్రేమాభిమానాలు కోకిల గీతాలై పల్లవిస్తాయి
నా భాషలు, నా రాష్ట్రాలు కాంతిహారాలై
నా గళాన్ని అలంకరిస్తాయి

నా పండితుల పాండిత్యాన్ని
గంధపు చెట్లు వహిస్తాయి
నా కవుల పాదాలు కన్నీటి కెరటాలమీద
నడచివచ్చి, మల్లెతోటల్లో విహరిస్తాయి!
జీవనదుల్లో కల్మషం చూసే వారికి
పువ్వుల్లో పురుగుల్ని వెదుక్కొనే వారికి
వెలుగు వాకిళ్ళలో చీకటి ముగ్గులు వేసేవారికి
నేను పాదాభివందనం చేస్తాను;

వెనక్కి తీసుకోని అడుగు ముందుకు వేయమనీ,
చేతులు కడుక్కొని శస్త్రచికిత్సలు చేయమనీ,
పాదాభివందనం చేస్తాను!

దయా ధర్మ సత్య సౌఖ్యాల కోసం
నా గుండెను తీసి సముద్రం మీద పరిచాను
అది సముద్ర పుష్పమై శాంతి బాష్పమై
నా దేశమై నవ్వింది!

ఆ నవ్వుని ఖడ్గంగా మార్చి
నీకు అర్పిస్తున్నాను
మెలకువలోనే కాదు నిద్రలో కూడా
ఆ ఖడ్గాన్ని వీడకు!
మండుటెండలో నీ చూపు కరిగిపోతున్నా
స్వాభిమానాన్ని విడిచి వాడకు!
దండను తెంపకు! పూలు ఏరుకోకు!!

# నవత

ఒక కలం కొత్తదనాలు పూసింది- శిశిరంలో
వసంతంలా సముద్రంలో అనలంలా అర్ధ
రాత్రి చంద్రబింబంలా

నలుగురూ చూసి ఇదేమిటన్నారు - కలం కొత్త
పూలు పూయ కూడదన్నారు; సమాజం దాని
కలవాటు పడలేదన్నారు; ప్రజలు చెడిపోతారన్నారు;
కొత్తదంతా చెత్త అన్నారు!

నాలుగ్గోడల మధ్య నల్లమంటలు లేచాయి! రంగ
వల్లికల మధ్య నాగుబాములు పాకాయి! శాస
నాల సభల్లో నాటుబాంబులు పేలాయి!

కొత్తదనం కళల్లోనా హవ్వ! రాకూడదన్నారు
లాయర్లు! గతానుగతికంగా పోవాలన్నారు జడ్జీలు!
తమ అభిరుచిని బట్టే రచనలుండాలన్నారు విమ
ర్శకులు! కళ తప్పుదారి పడుతోందన్నారు సమీ
క్షకులు! కొత్తదనం ప్రపంచాన్ని తలకిందులు
చేస్తుందన్నారు సంపాదకులు! తందానా అన్నారు
తటస్థులు! మనకెందుకన్నారు వాన ప్రస్థులు!!
ఇంత అలజడి జరుగుతూంటే నోరెత్తలేదు
కళాకారులు! మరింత కొత్త ఉత్పత్తయింది!
కొత్తదనానికి బలం పెరిగింది!

ఇదే మాకు కావాలన్నారు ఎక్కడినుంచో వి
ద్యార్థులు! పాతను గోబాక్ అన్నారు ఎదుటి
నుంచే యువకులు!

ఈ సంక్షోభానికి నగంలో ప్రజలు మేలుకున్నారు
అప్పుడర్థమయింది కొత్తదనం అంటే !

ఎం రా

శ్రీ నాగాభట్ల మార్కండేయ శర్మ

# నీలకంఠేశ్వరాలయ శాసనములు ఒక చారిత్రక పరిశీలన

విజయనగర జిల్లా బొబ్బిలి తాలూకాలోని బలిజిపేట గ్రామానికి 4 కి.మీ. దూరంలో నారాయణపురం గ్రామం వున్నది. ఆ గ్రామం సువర్ణముఖి నది ఒడ్డున గలదు. అచ్చట అత్యంత సుందరమైన, చరిత్రాత్మకమైన ఆలయమొకటి కలదు. ఈ ఆలయమున గల శాసనములలో ప్రస్తుత నారాయణపురము 'నిడుంజెఱు' అనియు, 'నావపల్లి'[2] అనియు పేర్కొనబడినది. నిడుంజెఱువు లేక నావపల్లే క్రమేణ నారాయణపురముగా మారినది. ప్రస్తుతము నీలకంఠేశ్వరుడని పిలువబడుచున్న దైవము శాసనములందు నీలేశ్వరుడని[3], నీలీశ్వరుడని[4] పేర్కొనబడినాడు. కళింగ గాంగ రాజైన నాల్గవ నరసింహదేవుని కాలము (క్రీ.శ.1378-1424) నుండి గ్రామము నారాయణపుర మని పిలువబడినట్లు తెలియుచున్నది.[5]

దేవాలయములు ప్రజల భక్తిభావ ప్రదర్శనలకు కేంద్రస్థానములుగానే కాక చరిత్ర రచనకుపయుక్తమయిన శాసన సంపదకు కూడా నిలయమైయుండుట విశేషము. దక్షిణమధ్య కళింగములలో ముఖలింగము, శ్రీకూర్మము, సింహాచలము మొదలగు దేవాలయములు శతాధిక శాసనములను కలిగియుండి చరిత్ర రచనకు మహాదారములుగా నిలిచియున్నవి నారాయణపుర ఆలయము ఈ కోవకు చెందిన ప్రసిద్ధాలయము. నీలీశ్వరాలయ శాసనముల పరిశీలన క్రీ. శ. 12వ, 13వ శతాబ్దములనాటి సామాజిక జీవితమును, ఆర్థిక స్థితిగతులను తెలుసుకొనుటకు దోహదకారి యగును.

క్రీ. శ. 6వ శతాబ్దములో తూర్పు గాంగ వంశరాజులు ముఖలింగమును రాజధానిగా చేసుకొని అవిచ్ఛిన్నంగా 12వ శతాబ్దము వరకు పరిపాలించిరి. త్రికళింగాధిపతులైన గాంగరాజులు రాజ్య పరిపాలనతోపాటు చక్కని ఆలయములను నిర్మించి వారి కళాపోషణను నిరూపించుకొన్నారు. 'ఒరిస్సా శిల్ప పద్ధతి' ప్రకారం నిర్మించిన నారాయణపుర నీలీశ్వరాలయము భువనేశ్వరములో నున్న పరశురామేశ్వరాలయమును పోలియున్నది. నీలీశ్వరాలయములోని శిలాశాసనములను పరిశీలించేముందు ఆలయ నిర్మాణమును, శిల్ప సౌందర్యమును తెలుసుకుందాం.

## శ్వరాలయ నిర్మాణ పద్ధతి

ఈ ఆలయము నాలుగు ఆలయముల సముదాయము. వీటిలో ప్రధానమైనది నీలీశ్వరాలయము. ప్రక్కన మరి మూడు ఆలయములు శిథిలావస్థలో వున్నవి. వాటిలో నొకటి ప్రధానాలయమైన నీలీశ్వరాలయమునకు ప్రతిరూపమై యుండగా రెండు ఆలయముల నిర్మాణాకృతి గోపురముల వరకే నిలిచియున్నది. తూర్పు ముఖముగానున్న నీలీశ్వరాలయమునకు ముందు ఒక నందీశ్వర విగ్రహము కలదు. ఆలయమునకు తూర్పు, దక్షిణ దిశలయందు ద్వారములు గలవు. ఉత్తరదిశయందు ద్వారస్థానమందు ఒక చట్రము వలెనున్న కిటికీ కలదు. ద్వారమున కిరువైపుల నున్న గూడులలో శైవ సంబంధమైన శిల్పములు గలవు. గర్భాలయమును ఆనుకొని మండపము గలదు. ప్రధాన గోపురమునకు నాల్గువైపుల గోపురాకృతులు వుండి, వానిపై ఒక్కొక్క యోగి విగ్రహము మలచ బడినది. చతురస్రాకారములో నున్న ముఖమండపములో ఎత్తయిన రాతి స్తంభములు వరుసకు నాలుగేసి చొప్పున రెండు వరుసలలో రెండువైపుల అమర్చబడినవి. స్తంభములకు నాలుగు అడుగుల దూరములో ఇరుప్రక్కల పొట్టి గోడలు కలవు. స్తంభముల నుండి యీ గోడలపైకి పలకరాళ్ళచే కప్పు ఏర్పరచ బడినది. ఇది చదునుగా, చుట్టూవున్న ఏటవాలు వసారా కప్పు కన్న రెండడుగుల ఎత్తున వున్నది. ఈ కప్పు చూరులయందు పురాణేతిహాస గాథలైన సముద్ర మథనము, శ్రీరామ కథా చిత్రములు అతి సహజముగా జీవకళ ఉట్టిపడుతూ చిత్రించబడినవి.

తూర్పుగానున్న ముఖద్వారమున కిరువైపుల కలశలు ధరించి మకరముపై గంగ విగ్రహము, తాబేలుపై యమున విగ్రహము మరియు సూర్య, చంద్ర విగ్రహములు కలవు. ఆలయమునకు

వెలుపలియున్న దక్షిణ, పశ్చిమోత్తరపు గోడలయందున్న గూడులలో గల అర్ధ నారీశ్వర శిల్పము యొక్క అలంకారాయుధములలోనూ, ముఖలావణ్యములోనూ, దృష్టులలోనూ, ఏకముఖమున స్త్రీ పురుష స్వరూపముల సమ్మేళనమును చూపుటలోనూ శిల్పి తన చాతుర్యమును అత్యంత రమణీయముగా వ్యక్త పరిచెను. మరియు మహేశ్వరుని అవతారములైన బిక్షాటనమూర్తి, హరిహరమూర్తి, కుమారస్వామి, గణపతి, నటరాజు, ఆలింగనమూర్తి, మహిషాసురమర్దిని, శిఖరంపైనున్న యోగుల విగ్రహములు - నీలీశ్వరాలయ శిల్ప సంపదయొక్క విశిష్టతను తెలియజేయుచున్నవి. ఇచ్చట ప్రధాన దైవము లింగాకారముతో పూజింపబడి నీలకంఠేశ్వరుడని పిలువబడుచున్నాడు.

## శాసనములు

నీలీశ్వరాలయ మండప స్తంభములపై సుమారు 53 శిలా శాసనములు చెక్కబడి యున్నవి. ఇవి తెలుగు లిపిలో వ్రాయబడినవి. ఈ శాసన పాఠములన్నియు దక్షిణ హిందూ దేశ శాసన సంపుటి (10)లో ప్రచురించబడినవి. శాసనము లన్నియు దాన శాసనములే. ఈ దానములు ఎక్కువ సంఖ్యలో ప్రజలచే, రాజులచే, రాణులచే, రాజోద్యోగులచే ఆలయ అఖండ దీపము నడుపుటకై యివ్వబడినవి. అఖండ దీపము నిలుపుట ఒక పుణ్యముగా భావించి అందు నిమిత్తమై భక్తులు భూమిని, పశువులను, ధనమును సమర్పించు చుండెడివారు. ఈ ఆలయములో మొట్టమొదటి శకవరుషంబులు 1024 (క్రీ. శ. 1102)లో నీలీశ్వర దేవరకు అఖండ దీపనిమిత్తమై 3 మోదవులను తన అన్నపేరు చెప్పి బేతరాజు సమర్పించెను.[6] చివరి శాసనము శకవరుషంబులు 1173 (క్రీ. శ. 1251) లో యివ్వడమయినది.[7] ఇందుమూలముగా మొదటి చివర శాసనముల మధ్యకాలమైన సుమారు రెండు శతాబ్దములనాటి నారాయణపుర నీలీశ్వరాలయ చరిత్రను యీ 53 శిలా శాసనముల పరిశీలన తెలియజేయుచున్నది.

ఆలయ నిర్మాణం ఎప్పుడు జరిగినదో తెలుసుకొనుటకు ప్రత్యక్ష ఆధారం లేకపోయినను, శ. 1066 లో (క్రీ. శ. 1144) బచ్చనచే చంద్రగ్రహణ కాలమందు యివ్వబడిన శాసనమున, శ. 869 (క్రీ. శ. 947) న బచ్చన వంశీకుడైన మంత్రి పోతన యిచ్చిన దానమును తాను తిరిగి నెలకొల్పినట్లు తెలియబడినది.[8] అందువలన క్రీ. శ. 947 నాటికే యీ నీలీశ్వరాలయము వైభవోపేతముగా వెలుగొందియున్నట్లు ఊహింపవచ్చును. పదియవ శతాబ్ద మధ్యకాలం



నారాయణపురం ఆలయం

వరకు దానధర్మాలను, ప్రజల పూజాపునస్కారములను అందుకుంటూ వుండెడిదని చెప్పవచ్చును. నమోదైన యీ శాసనముల వలన మొత్తము 58 అఖండవత్తి దీపముల నిమిత్తమై 222 మాడలు, 3 పశువులు, ముప్పందుముల భూమిని అర్పించినట్లు తెలియుచున్నది.

## రాజులు, రాణులు, రాజకుమారులు యిచ్చిన శాసనములు

శ. 1039 (క్రీ. శ. 1117) న పెర్మాడిరాజు భార్య (అయిన కుమార్తె) చంద్ర గ్రహణ కాలమందు,[9] మరియొక భార్య అయిన సూరమ విషువసంక్రాంతి కాలమందు అఖండవత్తి దీపము నడుపుటకు 5 మాడలు దానము చేసిరి.[10] ఈ పెర్మాడి రాజు తూర్పు గాంగ వంశీయుడైన అనంతవర్మ చోడ గంగదేవుని తమ్ముడు. శ. 1051 (క్రీ. శ. 1129) న పెర్మాడిరాజు యొక్క కుమారుడైన రాజేంద్ర చోడదేవుడు 15 మాడలు, మరల శ. 1061 (క్రీ. శ. 1139) లో అఖండవత్తి దీపమునకు 5 మాడలు దానమిచ్చెను.[11] శ. 1054 (క్రీ. శ. 1132) న ఉత్తరాయణ సంక్రాంతి నిమిత్తము చోడగంగదేవుని తమ్ముడైన ఉలయవంద ... అఖండ దీపమునకు 5 మాడలు నావపల్లి ముప్పదిళ్ళవారి ఆధీనమున వుంచెను.[12]

ఈ పై శాసనముల పరిశీలన వలన మనకు చోడగంగుని తమ్ముడు పెర్మాడి రాజనియు, అతనికి మరియొక నామధేయము ఉలయవంద పెర్మాడి అనియు, అతని భార్య పేరు సూరమ అనియు, వారియొక్క కుమారుడు రాజేంద్ర చోడదేవుడనియు తెలియుచున్నది.

## రాజోద్యోగులు యిచ్చిన శాసనములు

తూర్పు గాంగులకు సామంతుడైన రాష్ట్రి ప్రధానులలో నొకడైన సూరపరాజు తన తల్లి తండ్రులైన మేడపరాజు, గుండి దేవుల జ్ఞాపకార్థము రెండు పుట్లు ఫలసాయము లభించే భూమిని దానము చేసెను.[13] రాష్ట్రి ప్రధానులలో మొదటి వ్యక్తి మేడప రాజు. సూరపరాజు తన అన్న బేతరాజు పేరిట అఖండ దీప నిమిత్తమై 3 మోదవులు దానమిచ్చెను.[14] చోడగంగదేవుని యొక్క మహాసంధి విగ్రహి, కాశ్యప గోత్రుడైన సబ్బసేనాపతి శ. 1070 (క్రీ. శ. 1148) లో అప్పములు, నెయ్యి మొదలగు సామగ్రితో భోగములు జరుపుటకు ముప్పదిమూల నేల కొని స్వామికి అర్పితము చేసెను.[15] శ. 1033 (క్రీ. శ. 1154) లో రావ పురవరి గుండయ ఉత్తరాయణ సంక్రాంతి కాలమున 5 మాడలు దానము చేసెను.[16] శ. 1050 (క్రీ. శ. 1129) న కామరాజు కొడుకు పురవరి సోమనాథుడు 5 మాడలు సమర్పించెను.[17] వీరచోడదేవర లెంక మాంకన్న శ. 1041 న నీలీశ్వరునకు 5 మాడలు సమర్పించెను.[18] లెంక అనగా సేవకుడు లేక వార్తాహరుడు.

ఈ విధముగా రాజులతోబాటు అలనాటి రాజోద్యోగులుకూడా ఆలయ పోషణకు విరివిగా దానములు చేసెడివారు. వీరి శాసనముల వలన రాజోద్యోగుల పదవులు తెలియవచ్చుచున్నవి. సేనాపతి, మహా సంధి విగ్రహి (శాంతి, యుద్ధములను తీర్మానించువాడు),[19] శ్రీకరణ (కార్యాధికుడు)[20] పురవరి (పన్నులు వసూలు చేయు అధికారి),[21] లెంక (వార్తాహరుడు),[22] మండలీక దండనాయక మొదలైన రాజోద్యోగులు మత సంబంధమైన కార్యక్రమములలో పాల్గొనడం హర్షింపదగిన విషయం. తూర్పు గాంగ రాజైన అనంతవర్మ చోడ గంగ దేవుడు శైవమతము నుండి వైష్ణవ మతమునకు మారినను, శైవమత పోషణకు, ఆదరణకు అంతరాయము కలుగజేయలేదు. శ. 1058 (క్రీ. శ. 1132) న అనంతవర్మ చోడగంగుడు తన 59వ విజయరాజ్య వర్షమందు ఉత్తరాయణ సంక్రాంతి నిమిత్తము యిచ్చిన దాన శాసనములో 'పరమ మహేశ్వర' అనియే సంబోధించుకొనడం అతనికి శైవ మతము పట్ల యున్న ఆదరాభిమానాన్ని సూచించుచున్నది.[23]

## ఆర్థిక సామాజిక పరిస్థితులు

ఆనాడు సాంఘిక వ్యవస్థ చాలా పటిష్టంగా వుండెది. దానములు సక్రమంగా, నిరాటంకముగా నడుపు బాధ్యతను స్థానికులకు దాతలు అప్పజెప్పుచుండెడివారు. ఆ స్థానికులు ఒక సంస్థగా రూపొంది ఆ దానము నిమిత్తమై యిచ్చిన ధనమునుగాని, భూమినిగాని తమ ఆధీనములో వుంచుకొని, అఖండ దీపమునకు కావలసిన నెయ్యిని సరఫరా చేయుచుండెడివారు. శ. 1058 (క్రీ. శ. 1136) లో పెర్మాడిరాజు దానముగా యిచ్చిన 5 మాడలు నావపల్లి 'ముప్పదిళ్ళ' వారి ఆధీనములో వుంచడమైనది.[24] "ముప్పదిళ్ళవారు" అనగా 30 యిండ్లవారు. ఈ సంఖ్య సాధారణముగా మొట్టమొదటిగా ఒక ఊరు ఏర్పడి నపుడు వున్న యిళ్ళ/ కుటుంబముల సంఖ్యను తెలుపుచున్నది.[25] అందువల్ల నావపల్లి అనగా నారాయణపురం ఏర్పడినప్పుడు 30 యిళ్ళవారు వుండిరని వూహింపవచ్చును.

శాసన విషయములను బట్టి ముప్పది యిళ్ళ సముదాయముతో ఒక ఊరు లేక గ్రామ మేర్పడినట్లే, కొన్ని గ్రామముల సముదాయముతో ఏర్పడిన 'విషయము' 'నాడు' మొదలగు పరిపాలనా విభాగములు ఉన్నట్లు తెలియుచున్నది. పరిపాలనా సౌలభ్యం కొరకు రాజ్యమును 'విషయములు' గా విభజించిరి. 12 నుంచి 100 గ్రామములు కలిసి ఒక 'విషయము' (డిస్ట్రిక్ట్స్) గా వ్యవహరించుచుండిరి.

విషయ పలను నాడులుగా తిరిగి విభజించి, ఒక్కొక్కనాడులో 12 నుండి 30 గ్రామముల వరకు ఉండునట్లు ఏర్పర్చిరి.[26] శ. 1074 (క్రీ. శ. 1102) న యిచ్చిన శాసనములో గొరవ - 30 అను ప్రస్తావన ఉన్నది.[27] అనగా గొరవ ముప్పది గ్రామములు గల ఒక పాలనా విభాగముగా ఉన్నట్లు తెలియుచున్నది. గొరవను నాడుగా పరిగణించినట్లు ఏ యితర ప్రస్తావన లేకపోయినప్పటికి యీ విభాగము యొక్క పరిధి 30 గ్రామము లుండుటచేత దీనిని 'నాడు' గా వ్యవహరించుటకు వీలున్నది. తూర్పు గాంగుల తదుపరి శాసనములను బట్టి విషయమునకు, నాడుకు భేదమున్నట్లు కన్పించదు.అటులనే కొన్ని దానములు కాంపుల ఆధీనములో ఉంచబడు చుండెడివి. శ. 1050 (క్రీ. శ. 1129) న యిచ్చిన దానము. నావపల్లి కాంపుల ఆధీనములో వుంచబడినది.[28] 'కాంపులు' అనగా వ్యవసాయదారులు. ఊరిలోని వ్యవసాయదారులంతా కలిసి, ఒక సంస్థగా వ్యవహరించి యీ దానమును కాపాడు చుండెడివారు. ఈ విధమైన ఏర్పాట్లు దానములు సక్రమమైన రీతిని నడపబడుతూ, గ్రామ ఐక్యతను, ప్రజల విధి నిర్వహణాశక్తిని వృద్ధిపొందించుచుండెను.

ఈ దానశాసనముల వల్ల అప్పటి ఆర్థిక వ్యవస్థ స్థిరముగా ఉన్నదని ఊహింపవచ్చును. క్రమ పద్ధతిగల తూనికలు, కొలతలు, నాణెముల చలామణి, పటిష్టమైన ఆర్థిక వ్యవస్థను సూచించును. ఆర్థిక వ్యత్యాసము లేకుండా దానమిచ్చిన వారందరూ సమానముగా ఏ మాడలు నీలీశ్వరునకు అర్పించిరి. నావపల్లి సువర్ణముఖినదీ తీరము నందున్నందు వలన వర్తకవాణిజ్యములకు నిలయమై వుండెడిది. అందుచే వివిధ వర్గములకు చెందిన ప్రజలు ధనమునే (మాడలనే) అర్పించిరి. వివిధరకములైన నాణెములు వాడుకలో ఉండెడివి. అవి నంది మాడ, బిరుదమాడ, టంకమాడ మొదలైనవి. రాజులు, సామంతులు వారిపేర్లతో నాణెములు ముద్రించి చలామణి చేసెడివారు. అట్టివి రాజరాజమాడ, కులోత్తుంగమాడ మొదలైనవి.మొదవులను (పశువులను) అతి తక్కువగా యిచ్చు ఆచారము వుండుటకు కారణము లేకపోలేదు. ఇప్పటికిని యీ ప్రాంతమందు పశు సంపద సమృద్ధిగా లేదు. అందువల్ల పశుదానము, ధనదానమంత విరివిగా సాగలేదు. భూదానములు కూడా చుండెడివారు. భూమిని సాధారణముగా గడలతో కొలుచుచుండెడివారు. 20 జేనల పొడవుగల గడను "జేనకోల" అనెడివారు.[29] శ. 1070 (క్రీ. శ. 1148) న యిచ్చిన శాసనములో దానము 'జేనకోల' పద్ధతి ప్రకారమే భూమిని కొలచి దైవభోగము నిమిత్తము అర్పించినట్లు ఉన్నది.[30]

ప్రజలు పుణ్యకాలములైన సంక్రాంతి, సూర్య, చంద్ర గ్రహణ సమయములలో దానము విరివిగా చేయుచుండిరి. ఉదయ దీపము, సంధ్యాదీపము అని ప్రత్యేకించి యిచ్చిన దాన శాసనములు కూడ గలవు శ. 1040 (క్రీ. శ. 1119) లో శనివార భోగము జరుపుటకు శనివార మండపమును బనాపతి కట్టించెను.[31] ప్రజలు తమ పుణ్యమునకే కాక రాజుయొక్క శ్రేయస్సు కోరుతూ దానములుచేసి, వారి యొక్క రాజ భక్తిని, దేశ క్షేమాభిలాషని వ్యక్త పరచుచుండిరి.

దక్షిణ భారతదేశ దేవాలయములలో విశ్వకర్మ కులజులలో 'ఆచార్యులు' శాసనములను చెక్కెడివారు. నీలీశ్వరాలయ శాసనాంతమున శిల్పుల పేర్లుగలవు. వారు ప్రోలాచారి, కాపాచారి, పిన్నోజు, భూమాచారిగా పేర్కొనబడ్డారు.

12వ శతాబ్దమునకు చెందిన నీలీశ్వరాలయము వైభవోపేతంగా ఒకటిన్నర శతాబ్దములు ఉచ్ఛస్థితిలో వెలుగొందినది. 13వ శతాబ్దము తరువాత శాసనములులేకపోయిననూ ఆలయ నిర్వహణ బాగుగా సాగినది కనుకనే ఎనిమిది శతాబ్దములుదాటిననూ ఆలయ శిల్ప సంపద పటిష్టముగా నున్నది. తూర్పుగాంగులు 12వ శతాబ్దిమధ్య కాలమందు వారి రాజధానిని ముఖలింగము నుండి కటకమునకు మార్పు చేయుట వలన కొంతవరకు శ్రద్ధాభక్తులు లోపించెను. 13వ శతాబ్దము తరువాత శాసనములు లేక పోవుటకు యిదియే కారణమై ఉండవచ్చును.

మధ్య యుగంలో వైభవోపేతంగా వెలుగొందిన నీలీశ్వరాలయము ప్రస్తుతము ఆలనా పాలనా లేక నామ మాత్రంగా నిలిచి యున్నది. కొద్దికాలం క్రితం రాష్ట్ర పురావస్తు పరిశోధన శాఖవారు యీ ఆలయాన్ని పరిరక్షణ చేయుటకు ప్రయత్నించడం ముదావహం. వినోద పర్యటన మరియు పౌరసంబంధ శాఖ వారు యీ నీలకంఠేశ్వరాలయాన్ని చూడవగ్గ స్థలముగా గుర్తించుట ఎంతైనా అవసరము.

సూచి

1. దక్షిణ హిందూ శాసన సంపుటి. 10, సంఖ్య 652,6 6,665,677
2. ద. శా. సం. 10, సంఖ్య 653, 676, 693.
3. ద. శా. సం. 10, సంఖ్య 653, 656, 694
4. ద. శా. సం. 10, సంఖ్య 652, 665, 676
5. కళింగ దేశ చరిత్ర, పేజీ. 348
6. ద. శా. సం. 10, సంఖ్య 653
7. ద. శా. సం. 10, సంఖ్య 715
8. ,, ,, ,, ,, ,, 695
9. ,, ,, ,, ,, ,, 658
10. ,, ,, ,, ,, ,, 659
11. ,, ,, ,, ,, ,, 672. 692
12. ,, ,, ,, ,, ,, 679
13. ,, ,, ,, ,, ,, 715
14. ,, ,, ,, ,, ,, 653
15. ,, ,, ,, ,, ,, 716, 704
16 ,, ,, ,, ,, ,, 703
17. ,, ,, ,, ,, ,, 671
18. ,, ,, ,, ,, ,, 667
19. ,, ,, ,, ,, ,, 716
20. ద. శా. సం. 10, సంఖ్య. 703 శాసన పదకోశము పేజీ292
21. ,, ,, ,, ,, ,, 671 శా. ప. కో. పేజి
22. ,, ,, ,, ,, ,, 667 శా. ప. కో. పేజి. 259
23. ,, ,, ,, ,, ,, 679
24. ,, ,, ,, ,, ,, 679, 654
25. ఎడ్మినిస్ట్రేషన్ అండ్ సొసయిటి ఇన్ మెడీవల్ ఆంధ్ర – డాక్టరు సి.వి. రామచంద్రరావు, పు. 228
26. -అదే- పు. 125
27. ద. శా. సం. 10, సంఖ్య. 654
28. ,, ,, ,, ,, ,, 671
29. ఆంధ్రుల సాంఘిక ఆర్థిక చరిత్ర, పేజి. 137
30. ద. శా. సం. 10, సంఖ్య 716
31. అదే 661

పుస్తకాలు:- 1. కళింగదేశ చరిత్ర
2. జర్నల్ ఆఫ్ ఆంధ్ర హిస్టారికల్ రిసెర్చి సొసయిటీ వాల్యూమ్‌లు
3. ఎడ్మినిస్ట్రేషన్ అండ్ సొసయిటి (డా॥ సి. వి. రామచంద్రరావు)



# సృష్టి

## శ్రీ తిరునగరి

చీకట్లను పారద్రోలి ఎర్రగానవ్వే ఉదయమై
ఉదయంలో సరోవరంలో విరిసే కమలమై
కమలం నుంచి కమ్మగా వీచే పవనమై
పవనం సోకి పరవశించే హృదయమై
హృదయంలోంచి ఉబికే రసఝరమై
నాగీతం!

# మి నీ క వి త లు!

పెద్ద చేపలు
చిన్న చేపల్ని మింగుతుంటాయి
కాని
ఈనాడు
చిన్న చేపలే
పెద్ద చేపల్ని
మింగు తున్నాయి
అందుకు ప్రబలసాక్ష్యం. .....!!

# నీ లి రా గం!

ఉచ్చారణ దక్షుచేత
అభిహితంబయిన
శబ్దంలా
వృద్ధి పొందుతుండేది !
వర్థిల్లుతుండేది !
నిర్యాణమే లేనిది!

# ని ర్దో షా క రం!

సుధాకరునిలోనూ
కళంకం ఉంటుంది
ఆ మసక
కన్పించంది
ఒక్క — మాతృ ప్రేమలోనే!!

శ్రీ కె. కిశోరుబాబు
శ్రీ కె. అశోకుబాబు

శ్రీ ధూర్జటి వేంకట బాలాజి

# దీపాల వారి కవి

పాల పిచ్చయ్యశాస్త్రిగారి పేరు వినగానే వెంటనే జ్ఞాపకం వచ్చేది ఆయన విమర్శ. ఈ తరం వారికి ఆయనగొప్ప పరిశోధకునిగా, చురుకైన విమర్శకునిగా, నిశిత వ్యాఖ్యాతగా మాత్రమే పరిచితులు. కాని ఆయన రెండవమూర్తిని ఆయనలోని భావుకుని చాలామంది ఎఱుగరు.

విపులమైన ఆయన సాహిత్య సమీక్షలు పదులమీది పరిశోధకవ్యాసాలు, సారంగధర వ్యాఖ్యానం, ఆయనలోని భావుకుణ్ణి కప్పివేసి, ఆయన్ను ఒక పట్టువిడవని విమర్శకునిగా ప్రతిష్ఠించాయి.

నిజమాలోచిస్తే ఆయన సారస్వత జీవితం కవిత్వం తో ప్రారంభమైంది. ఆయన సాహిత్యకృషికి అంకురార్పణం 1913లో "భక్తకల్పద్రుమం" అనే శతకంతో జరిగింది. తర్వాత ఒకటి వెంట ఒకటిగా ఆయనిచేతినుండి పలు ఖండకావ్యాలు వచ్చాయి. "కాలం, నెల్లూరు గాలివాన" వంటివి ఒకజాతికిచెందగా, 'భారతి, సువర్ణమేఖల, ప్రణయకుసుమం' వంటివి ఇంకోజాతికి చెందినవి.

ఆయన సంప్రదాయబద్ధమైన సంస్కృతాంధ్ర సాహిత్యాలలో నిష్ణాతులైనా, ఆయనచూపు ఆ సంప్రదాయపు పరిధిలోనే నిలిచిపోకుండా అధునిక యుగంమీదికి ప్రసరించడం ఒకవిశేషం: అయితే సంప్రదాయబద్ధులూ, కాకపోతే ఆధునిక సాహిత్య జీవులు అవడం ఆనాటి సమకాలీన పండితుల లక్షణం. కాని ఈయన సంప్రదాయ భూమిక మీద పాదాలు గట్టిగా నిలద్రొక్కుకొని ఆధునిక భావప్రకటనంమీద ఆసక్తి చూపించారు. ఆయన అధునిక భావదర్శనం 'కాలం' అనే ఖండకావ్యంలో స్పుటంగా కనబడుతుంది. ఆనాటి సమస్యలను పట్టించుకొని ఈయన 'కాలం' అనే కావ్యంలో వ్రాసిన పద్యాలుకూడ దగ్గవి. భారతీయుల పరాధీనత, కన్యాశుల్క దురాచారం, వరశుల్కపు అనాచారం, ఈయన మనస్సును ఎంతగా నొప్పించాయో ఈ పద్యాలవల్ల తెలుస్తుంది. ముందుగా భారతవీరుల శక్తిసామర్థ్యాలను వ్యక్తంచేస్తూ-

"భారతభూమి నిప్పటికి భారతవీరుల వింటి మ్రోతలున్
వారల సింహనాదములవారిగవారక మాఱుమ్రోగెడిన్
వైరులగుండియల్-వగులు; వాని ప్రయోజన మేమి యింతకున్
నీరసులైరి హైందవులు, నీదయలేమిని జేసి కాలమా!"

-అనే పద్యంలో కాలంయొక్క నిర్దయను గురించి తమ ఆవేదనను వ్యక్తంచేస్తారు. మరొకచోట కన్యాశుల్కపు అనాచారాన్ని గురించి—

"కన్యాదాన శుభక్రమాచరణ విఖ్యాతాంధ్రులన్ మాయురే
కన్యావిక్రయ పాపకార్య కరణాఖండ ప్రభావాదికుల్
అన్యాయార్జిత విత్తవంతులు ననహ్యాచార విస్తార దౌ
ర్జన్యుల్ చేసితివేమి నేర్పిది పిశాచప్రాయ దుష్కాలమా!"

-అని విచారిస్తారు. మరొకచోట వరశుల్కపు అనాచారానికి జీవితాన్ని పణంగాపెట్టిన స్నేహలతాదేవిని స్మరిస్తూ—

"ఈ వరశుల్కబాధకయి, యీవలకెందఱు పూవుఁబోఁడులో
హా, విమలాంగవల్లుల, హుతాశన కీలల పాలుజేసిరి
స్సీ! వివరింపనేమిటికి స్నేహలతాదుల నీవెఱుంగవే
ఈ విలయంపు దుర్గతి యిఁకెన్నటికంతమునందుఁ గాలమా!

అని ఉద్వేగంతో ప్రశ్నిస్తారు.

నెల్లూరుకు కనివినియెరుగని గాలివాన వచ్చినపుడు యావత్ప్రజానీకం ప్రకృతి గావించిన విలయతాండవానికి భీతావహులై తమ ఇలవేల్పైన రంగనాథుని మిగిలిన దేవతలను తలచుకొని ఎలా వాపోయినారో ఇట్లాచెప్పారు.

"లాతి పోలికను మూలస్థానమును వీడి
శంకరా! కదలవు స్థాణువువలె :
నిద్దుర చాలించి నేడైన సాయమ్ము
రవ్వంత రావయ్య రంగనాథ!
నీ తండ్రితోఁ జెప్పియీతటి మమ్మెట్లో
బ్రతికింపరా! ప్రకంపన కుమార!
ఉండ్రాళ్ళు బండితో బండె దర్పించెద
గణపతీ కరుణించి కావవయ్య!

వెదలి రణధయ్య! యో యిలువేల్పులార!
చచ్చిపోవుచునుంటి మాసార్థ సహిత
చండవాత మహాహతి నిండ్లుగూలి
యనుచు, బ్రార్థించి రొకకొంద అధికభక్తి!"

ఇట్లాంటి రచనలు ఆత్మాశ్రయమైన ఖండ కావ్యజాతికి చెందితే- భారతి, సువర్ణమేఖల. ప్రణయకుసుమం కథావస్తుకము లైనవి 'భారతి' కావ్యంలో ప్రహతంగా పేర్కొనబడే—

"భూపతిఁజంపితిన్ మగఁడు భూరి భుజంగము చేతఁజచ్చె"

-అనే చాటుపద్యంద్వారా యావత్కావ్య కథావృత్తాంతం నివేదింపబడుతుంది. కాని ఈ పద్యానికి లోకంలో "కులట" అని అర్థం చెప్పడముంది. కాని దానిని ఒకసాధ్వీమతల్లి పరంగా వ్యాఖ్యానించి పద్యంలోని ఒక్కొక్కదళాన్ని ఒక్కొక్క ప్రకరణంగాచేసి, ఆమె తనశీలాన్ని ఎలానిలుపుకుందో వివరించి పాఠకుల్ని ఆశ్చర్య చకితులను చేస్తారు.

'సువర్ణమేఖల' 'ఎరుపుసొమ్ముబరువుచేటు' అన్న దానికి చక్కని రూపకల్పన 'గైడిమొపసా' 'నెక్లెసు' అనేకథతో పోలికలు ఉన్నా, లోకంలో ప్రచారంలోఉన్న అట్టిదే ఇంకోకథను తీసుకొని ఒక భార్యాభర్తల జంట ఎరుపుసొమ్మతో ఎన్నిబాధలు పడ్డారో చక్కగా వ్యాఖ్యానించారు.

ఇవన్నీ ఒకఎత్తు ప్రణయకుసుమకావ్యం ఒక్కటీ ఒకఎత్తు. ప్రణయకుసుమం పేరెత్తితేనే ఒక భావకావ్యంలా వినిపిస్తుంది. ప్రణయం-ప్రేమ ప్రధానవస్తువులుగా తీసుకొని భావకవులు చాలా కావ్యాలు వ్రాశారు. సరిగ్గా ఆకోవకేచెందకపోయినా,ఆవాసన ప్రణయకుసుమంలోఉంది. శాస్త్రిగారి పాండిత్యప్రకర్ష క్రొత్త నాజూనుకు సంతరించుకొని ప్రణయకుసుమంలో ఒదిగి ఇంపు పుట్టిస్తుంది. ఇది కేవలం శాస్త్రిగారి స్వకపోల కల్పితకథకాదు. భర్తృహరి వ్రాసిన 'నిర్వేద' నాటకాన్ని ఆధారంగా తీసుకొని మక్కికి మక్కిగా కాక తుదినఉన్న నిర్వేదంమార్చి సుఖాంతంచేసారు.ఇందులో నాయికానాయకులు మల్లికా వసంతులు-వారుదంపతులు. వారిగాఢప్రేమ-అన్యోన్య ప్రీతి-సుకుమారమైన గీతపద్యాలలో ప్రసంగశైలిలో వినిపిస్తారు.

ప్రణయకుసుమ కావ్యంలో నాలుగు అంశాలు ప్రస్ఫుటంగా గోచరిస్తాయి. అవి ప్రకృతివర్ణన, మనస్తత్త్వ పరిశీలనము, అగ్నిపరీక్ష ప్రేమౌన్నత్యం-అనేవి. కావ్యంలోని మొదటిదళంలో సతీపతులు మల్లికావసంతులు ఉపవన విహారానికి వెడతారు. వారు అనురాగబద్ధ జీవనులు, ప్రేమైకమూర్తులు. అందమైన తోటలో వసంతునికొరకు వేచియున్నమల్లిక-పురుషునికొరకు వేచియున్నప్రకృతివలె ఉందట, ఆ సందర్భంలో ప్రకృతిశోభకు పరవశించిన వసంతుడు—

"శుకపికశారికాళికుల సుస్వర భాస్వరతానమొప్ప, వా
రకముహరాచల త్పృథుతరంగ మృదంగరవంబె సంగగా
ప్రకృతి రహస్యముందలచి పాడుచునున్నది భావగీతముల్
సకియరొ! యాసరిద్రమణి సారతరుల్ తలలూచి మెచ్చగన్"

అంటాడు. రమణీయమైన ప్రకృతి శోభకు వసంతుడేకాదు. ప్రతి రసహృదయం స్పందిస్తుంది.

ద్వితీయ దళంలో ప్రేమికులైనటువంటి మల్లికా వసంతుల ప్రేమకు ఒకసార్థకత ఏర్పడుతుంది. వారిరువురిమనసులు గాఢప్రణయంతో పెనవేసుకున్నాయి. ఒకనాడు వారిరువురికి సతీసహగమన దృశ్యం కనబడింది. చనిపోయిన పతికొరకు జీవితం అర్పించేసతి గొప్పదని వసంతుడు అంటే, పతిచనిపోయిన వెంటనే, ఆవార్తవిన్న సతిప్రాణాలు వదలడంలోనే నిజమైన ప్రేమఉంది. కానీ ఈ సహగమనం వట్టి ఆడంబరం, అని అంటుంది మల్లిక. ఇక్కడవారిరువురి మనస్తత్వాలను విశ్లేషిస్తూ కవివసంతుని మాటగా—

"కాంత మనంబునందుఁ గసుఁగందగనీక మృదూక్తి యుక్తులన్
గాంతుడు పుల్కిపుచ్చెలలనా! యిపుడీవు వచించినట్టి వృత్తాం
తము ప్రేమతత్త్వము, నితాంతము స్వాంతము దన్పెమేలు మే
లింతటి తత్త్వవేత్త్రివనియే నెరుగంజాలి యంచు పంచనన్"

అంటారు. వసంతుడు తుదకు గంభీరంగా తలఊచి మల్లిక ప్రేమ ఎంతటిదో పరీక్షించాలని నిర్ణయించుకున్నాడు.

తృతీయదళం మల్లికకు ఒకఅగ్నిపరీక్షలా భాసిల్లుతుంది. శుక్రవారపునోమునోచి గౌరీపంచాక్షరీవ్రతాన్ని పట్టినమల్లిక ముత్తైదువులను యధోచితంగా పూజించి వారివల్ల తగు ఆశీర్వాదాలను పొందుతుంది. ఇంతలో ఒకవార్తాహరుడు వచ్చిహఠాత్తుగా వసంతుని మరణవార్త తెల్పగా 'హా! వసంతా!' అంటూమల్లిక మరణిస్తుంది. మరికొంతసేపటికి వసంతుడు తనపరీక్ష ఏమయిందో చూడటానికి ఇంటికివచ్చాడు. తన అగ్నిపరీక్షకు ఆహుతియైన మల్లిక మరణానికి మిక్కిలి విలపిస్తాడు.

"పతిమృతివార్తవిన్న బయిప్రాణముతోడను నిల్చునే? పతి
వ్రత యని నీవునాడనిన వాక్యము నమ్మకనే భవన్మనో
గతినిఁ బరీక్ష సేయఁగఁగు కల్పనజేసితి నిన్నుఁ గోలుపో
యితినయొ మందభాగ్యుడనిసీ! కడుపాపిని సుమ్ము ప్రేయసీ!"

మల్లికను తాను పరీక్షిస్తే తన్ను ఓదార్ప వచ్చిన మునీంద్రుడు తన్ను పరీక్షించాడు. యోగి తన చేతి కమండలాన్ని పగులగొట్టి దానికొఱకు విలపిస్తాడు. వసంతుడు ఆశ్చర్యపడగా ముని -

"మృణ్మయంబని నిరసించె దేటికోయి
ప్రేమ తత్త్వంబు నెఱుగని పిన్నవాడ!
మృణ్మయంబైన కాక హిరణ్మయంబె
యైన వెలసమమే ప్రణయాపణమున"

– అంటాడు. దీనినిబట్టి ప్రేమతత్త్వమేమిటో మనకు విదిత మౌతుంది. తుదకు మునీంద్రునిచేత బ్రతికింపబడిన మల్లిక వసంతునితో సుఖదాంపత్యం నెరపుతుంది.

ప్రణయకుసుమ కావ్యానికి మూలమైన 'నిర్వేద' నాటకంలో శాంత రసం ప్రధానపాత్ర వహిస్తే, ప్రణయకుసుమ కావ్యంలో ప్రణయం గెలిచింది. ఇట్లాగే గీతగోవిందకర్తయైన జయదేవుని భార్య పద్మావతీదేవి మరణించగా – తుదకు లక్ష్మణసేన మహారాజు దంపతులు జగన్నాథుని ప్రార్థించగా – ఆమె బ్రతుకుతుంది. ఇక్కడ మల్లిక మునీంద్రునిచే పునర్జన్మను పొందుతుంది. ఇక్కడ భర్తే ఆమె ప్రేమను పరీక్షించ నెంచితే అక్కడ లక్ష్మణసేనుని భార్య పద్మావతీదేవిని పరీక్షిస్తుంది. తుదకు ఈ రెండింటిలో ప్రేమే గెలుస్తుంది. ఉత్తమ ప్రేమకు విజయం కలగడమే ప్రణయకుసుమ కావ్య పరమార్థం.

కథా వస్తువులను తీసుకొని స్వతంత్రకావ్యాలు వ్రాయడమే కాకుండా సంస్కృతం నుంచి ఎన్నో ఇంపైన అనువాదాలు చేసారు. ఈయన తక్కిన పద్యరచనలన్నీ ఒక ఎత్తు. మేఘసందేశపు తెనిగింపు ఒక్కటీ ఒక ఎత్తు. కాళిదాసు మేఘసందేశంమీద మోజుపడి ఇప్పటికి కొన్ని పదులమీద ఆంధ్రీకరణలు వచ్చాయి. కాళిదాసు మాట ఏదీ పొల్లుపోకుండా తెలుగులోకి దించడమే సరియైన ఆంధ్రీకరణం అని అంతా అనుకొంటే, శాస్త్రిగారు ఒక్కరే విశిష్టంగా ఆలోచించి మేఘదూతను తెనిగించారు. అసలు మేఘదూత రెండు సర్గలూ నూట ఇరవైనాలుగు శ్లోకాలైతే, ఈయన నూటఎనభై ఎనిమిది పద్యాలుగా తెనిగించారు. అయితే ఇంత గ్రంథం ఎందుకు పెరిగింది? ఈయన ఒక్కరే కాళిదాసు మాటల్ని కాకుండా ఆమాటల వెనుక ఉండే రమ్య భావనను తెలుగులోకి తెచ్చారు. ఈ దృష్టి సంస్కృతంనుంచి తెనుగుచేసిన పూర్వమహాకవులందరికీ ఉండేది. తరువాత లోపించింది. ఏనాడో లోపించిన గొప్పరసదృష్టిని, ఈయన మేఘదూతలో పునరుద్ధరించారు. కనుకనే తెలుగు మేఘదూత అంటే విధిగా దీపాలవారిదే జ్ఞాపకం వస్తుంది. ఉత్తరమేఘంలోని యక్షుని విరహావస్థను ముందుకు తెచ్చి వివరించడం చాలారసస్ఫోరకమైంది.

"లలితంబగు ప్రియంగులతఁజూచి తలయూఁచుఁ
గనులారఁ జిరుతరంగముల నరయుఁ
బుష్పగుచ్ఛముల సొంపుల నెంచి పులకించు
బర్హిబర్హమ్ము సారెఁబారచూచుఁ
బరిపక్వ బింబంబుఁ బలుమరుఁ బరికించు
నలికిన లేటి చూడ్కులను వలచుఁ
దలిరుటాకుల మెత్తఁదనమిచ్చఁగడు మెచ్చుఁ
జిలుకు పలుకులకుఁ జెవియొసంగుఁ
బ్రకృతి సౌందర్య తత్త్వార్థ పాఠపఠన
రీతియో; కాక పూర్వానుభూతరమ్య
వస్తు సంస్మరణ క్షణపరవశతయొ;
కవికుమారుడో, యాతండు కాముకుండొ!"

అంటాడు మేఘదూత' కావ్యంలో పేర్కొనదగిన మరొక గొప్ప ఘట్టం 'ఉజ్జయినీవర్ణన' మేఘుడు యక్షుడు చెప్పిన అలకాపురిని చేరడానికి తగు మార్గాన్ని చూపుతూ మధ్యేమార్గంలో వచ్చే ఉజ్జయినీ నగరాన్ని, దాని శోభను వివరిస్తాడు.

"కిటికీల వెడలెడు కేశసంస్కార ధూ
పమ్ములచే నింత బలుపుగనుచు
భవనమయూరముల్ బాంధవప్రీతిచే
నలుపు నృత్యములఁ గాన్కలుగఁ గొనుచు
మేడలఁ గామినీ మృదుపదరాగాంకి
తములను నేత్రోత్సవముగఁ గనుచు
మొగి గృహాలంకారమునకయి చల్లిన
పూవుల సౌరభంబులను గొనుచు
నుజ్జయిని సౌధవీథుల నొయ్య నొయ్య
విహరణము సల్పుచును బురీవిభవమందుఁ
గొంతకొంతైనఁ గనుచు విశ్రాంతిఁ గొనుచుఁ
బొపుకొనుమయ్య, సఖుడ, అధ్వశ్రమంబు."

– ఉజ్జయినీ నగరవర్ణన తరువాత పేర్కొనదగినది యక్షుని కాపురం : అలకాపురం.

"అళిబృంద సంగీతములతోడ నొప్పు వృ
క్షమ్ములు నిత్యపుష్పమ్ములగుచు
గొలకుపు లంచబారులు మొలనూళ్లగా
దనరారు నిత్య పద్మములగుచు
నలరుఁ గేకోత్కంఠములయి బర్హులు నిత్య
భాస్వదుచ్ఛైః కలాపమ్ములగుచు
హవణిల్లు నిశలు నిత్యజ్యోత్స్నలయి ప్రతి
హతతమో వృత్త రమ్యమ్ములగుచు

నప్పురంబున; నదియుఁగా కంబువాహ
నిత్యయౌవనకలితులు : నిత్యసఖులు
నిత్యసంపత్సమృద్ధులు నిత్యభోగు
లచటఁ గాపురమున్నట్టి యక్షులెల్ల"

– తర్వాత దీపాలవారు చూపే క్రొత్త వెలుగులో విరహిణి యక్షకాంత ఇట్లాకనబడుతుంది.

"తలయంటులేని క్రుంకుల బిరుసెక్కి చె
క్కుల నంటివ్రేలు ముంగురుల దాని
చెక్కుల జీరాడు చికురమ్ములను సారె
కోరగావించు నిట్టూర్పు దాని
నిట్టలమగు వేడి నిట్టూర్పు సెకలచే
బొలిపోవు చిగురు కెమ్మోవి దాని
కలనైన నా పొందు కల్గునేమోయన్న
పేరాస నిద్దురఁ గోరుదాని
కోరినను నిద్రరామిని సారె సారె;
గడలుకొను దుఃఖబరమునఁ గన్గొలకుల
నిండి కాల్వలగట్టు కన్నీటి దాని
గాంతువు సఖుండ ! హృదయంబు కరిగిపోవ"

తరువాత కురుక్షేత్ర దర్శనం. ఇందు ఆనాటి తెలుగుకవి మీద స్వాతంత్ర్య జాతీయోద్యమ ప్రభావం ముఖ్యంగా గమనించ దగ్గది.

"ప్రీతి రణభూమి కసువులర్పించినట్టి
భరతపుత్త్రుల రక్త ప్రవాహతతులు
పాటిపాయలు గట్టినపట్టులచటఁ
గన్పడును, నేఁటికిని మేను గగురుపొడవ
వరుసనచ్చటఁ బొడకట్టు భారతీయ
కదనవీర కపాల కంకాళసమితిఁ
గన్నులారఁగ నొకపరికన్నఁ జాలుఁ
బందకైన మగంటిమి పరిఢవిల్లు"

పరిసమాప్తిలో అందరిలాగే మేఘుడు వెళ్ళి సందేశం చెప్పి నట్టుగాకాక, అతడు తనదారిన తాను ఎగిరి పోయినట్టుగా చెప్పడం కవి హృదయం–అది ఈయన చేసిన పరిష్కారం ప్రశంసించదగ్గది!

ఈయన మేఘ దూతనే కాకుండా కొన్ని భాసనాటకాలను కూడ బొనన్నట్టు తెనిగించారు. అందులో కూడా ఈయన సన్ని వేశాన్ని బట్టి, సందర్భాన్ని బట్టి కవి హృదయాన్ని సముచితంగా స్వతంత్రించి వ్యాఖ్యానించారు.

ఆయన కవిగా బయలుదేరి, విమర్శకునిగా రాటుదేలి, పరి శోధకునిగా స్థిరపడినప్పటికీ ఆయన వ్రాసిన ప్రణయకుసుమం, మేఘ దూత వంటికావ్యరచనలు ఆయన్ను రసవత్కవిగా నిరూపిస్తాయి.

స్వయంగా గ్రాంధికవాది అయినా వ్యావహారిక భాషావాదపు ఔచిత్యం గ్రహించి, అవసరమైనచోట తానుకూడా వ్యావహారిక భాషనువ్రాసి తన సమతాదృష్టిని వెల్లడించారు. ఏనాడూ బిరుదాలకు, ప్రశంసలకు తలఒగ్గని వినమ్రమూర్తి ఆయన.

పలనాటి మండలములో జన్మించి, సింహపురిసీమలో స్థిరపడి, ఆధునికాంధ్ర సాహిత్యంలో తనదైన ముద్ర నిలుపుకొని కవిగా, గొప్ప భావుకునిగా–సాహితీప్రియులహృదయాలలో చెరగిపోని స్థానం సంపాదించుకొన్నవారు శ్రీ దీపాలవారు.

బ్రతుకుతెరువు కోసం తెలుగుపండితుడై, ఆంధ్ర సాహిత్యానికే బ్రతుకుతెరువు చూపిన ధన్యులు శాస్త్రిగారు.

సాహిత్యమే ఆయన జీవితం, సాహిత్యమే ఆయన సంపద, సాహిత్యంకొఅకు పుట్టి, సాహిత్యంతో ఎదిగి, సాహిత్యమే జీవనో పాధిగా జీవిస్తున్న సహస్ర మాసాధిక జీవి శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి గారు.

# * చరంశ్చరైవేతి

డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

యుగయుగముల సుప్రభాతములు
దివ్య పారిజాతమ్ములు చేసి
తరతరముల నవ వసంతములు
ప్రభారవింద గీతమ్ములు చేసి
విశ్వమానవ భావకిరణాల కైంకర్యము గావించి
కైవరించెద కైమోడ్చెద అవధరింపుమో ముకుంద!
మాన్యహృదయ సంస్కార కల్హారాల నైవేద్యముగ ఉంచి
కేరించెద కేళించెద అలరింపుమో గోవింద!

సంవత్సరాదుల చైతన్యము
సుసంపన్న భాగ్యోదయాంతరంగము
ఉగాదుల నవనవోన్మేషము
నవి స్వర సతతహరిత సచ్ఛీల సంభావము
మంత్ర పుష్పమ్ముగా
గాయత్రీ జపమ్ముగా
బహూకరించు భాగ్యమిమ్మని వినతి!
భాగ్యాతి భాగ్యుడనై భవహరింప ఆనతిమ్మని మనవి!
తారంగమో ఎదమడుగుల!
తాండవమో గుండె కొండెల!

అనురాగామృత జీవతత్త్వము
అనంతానంత జవసత్వము
విద్యుద్విచలిత విచిత్రరూపము
విద్వద్వికసిత విప[illegible] దీపము
సామవేదమ్ముగా
గురువాదమ్ముగా
సమర్పింప సమ్మతించమని వేడికోలు!
సమర్పణలో ఆత్మార్పణము గావింప వెన్నెలకోలు!
మృదంగనాదమో మమతా పొదరిండ్ల!
మృదుగంగా నాదమో మానవతా పాలిండ్ల!

సుశాస్త్రవికాసము
సమగ్ర చరిత్ర సారము
అమిత గణిత ప్రాభవము
విచిత్ర గణాంక విన్యాసము
భక్తి గీతమ్ముగా
భక్తజన నాట్యమ్ముగా
అందించ అనుమతించవని అభ్యర్థన!
అందించుటలో నన్నానందింప జేయుమని విజ్ఞాపన!
ఖగోళ భూగోళ ఆబాలగోపాలము నా కండ్ల!
సాగరాకాశ సమస్త విజ్ఞానతీరము నా పిడికిళ్ళ!

ఈ మహత్తర క్షణంలో
లోకోత్తర రసస్పందనలో
అజ్ఞతని నీవనుకొన్నను సరే నీకోసంగతి చెప్పవలె!
మరి ప్రాకుచ్చ నాకు దయతో శక్తి నొసంగవలె!

సాహిత్య కవిత్వములు రసతప్త నృత్యములు
సాంకేతిక సమీకరణములు రసాయన వైనములు
భౌతిక పరిశీలనలు భౌమిక పరిశోధనలు
మానవ సునిశిత మేధో శిల్పసంపదలు మధుర మానస
మనోహరాగ్రహారములు
దారితప్పుతున్నవి లక్ష్యశుద్ధిలేక!
అడ్డుదారి త్రొక్కుతున్నవి ఆత్మశుద్ధి కనరాక!

ఆర్థిక ధోరణులు సాహార్ద్రిక పరమార్థిక యోచనలు
ఆకలిదప్పికల సమస్యలు కామవిదగ్ధికల కార్చిచ్చులు
వయోజరాభారాలు నిత్యశాంతి రాయబారాలు
ప్రపంచయుద్ధభయాలు మారణాయుధాల బెదరింపులు
ప్రజ్వరిల్లుతున్నవి ప్రళయాన్ని తెస్తూ!
ప్రవహిస్తున్నవి ఉత్పాత జలపాతములు ఉరకలేస్తూ!

రక్తసిక్తారక రణరంగాలు రాటుదేలిన చండశాసనాలు
ప్రాథమిక హక్కుల పోరాటాలు స్వజాతి విజాతి
సంఘర్షణలు
సంగటిముద్దల సంకటాలు ధన ప్రాణ మాన రక్షణల
పెనుగులాటలు
రాజకీయాల అరాచక తగవులాటలు అధికారంకోసం
ప్రాకులాటలు

ఎన్నో!
ఎన్నెన్నో!
క్రోధానికి ఆజ్యం పోస్తున్నవి!
ప్రేమను అగ్నికి ఆహుతి చేస్తున్నవి!

పేరుచెప్పి బ్రతుగ్గడిపే గడుగ్గాయిల దొమ్మరాటలు
నిన్నే మ్రింగేసి శుభ్రంగా భోంచేసే పెద్దమనుషుల
మైకం మాటలు
ముసుగులో గ్రుద్దులాటలు
పొదుగు క్రింద కాలనాగులు
ఇలా ఎన్నో!
ఇంకా ఎన్నెన్నో!

నీకు తెలియదని కాదుకాని
నావంతు చెల్లించుకోవాలని నీకు తెలియ జేస్తున్నాను!
నీవు చర్య తీసుకోవని కాదుకాని
త్వరితంగా తీసుకోవాలని నిన్ను వేడుకొంటున్నాను!
నామొరాలకించి విశృంఖలించవా!
నా ఆర్తినందుకొని దేదీప్తించవా!

ఏమిటిదీ పరమాత్మా!
నీ గర్భగుడిలో దీపమారిపోయింది!
ఈ గుండెగదిలో చీకటి నిండుకొంది!
ఒక్కక్షణం తండ్రీ! పరాత్పరా!
ఇదిగో వెలిగించాను దీపం!
చూడెంత వెలుతురో ఇంకెందుకు భయం!

ఎవరిదా నవ్వు?
పులకరింపజేసే ఆ నవ్వు?
తన్మయం!
చిన్మయం!

"పిచ్చివాడా!
ఇప్పుడు దీపమెలిగించింది ఆ భగవంతుడా?
భలేవాడివే!
ఆ దేవుడెప్పుడో నీలో దీపమెలిగించాడని నీకు తెలియదా?
ఆ వెలుతురులో
మంచి దారొకటి నీవే చూచుకోవాలి!
ఆ దారిలో
నీవారిని నీవే రప్పించుకోవాలి!
ఎవరికి వారే మేలు కొనాలి!
మేలుకొని ముందుకు నడవాలి!"

ఎవరన్నట్లు!?
అయినా నే విన్నట్లే?
అర్థమయింది ప్రభూ!
పరమార్థం గోచరించింది!
ఇదిగో సూర్యుణ్ణి లేపుతున్నా....
నా ఆత్మారాముణ్ణి మేలుకొలుపుతున్నా....
కార్యదీక్షను అందించిన
నీ ధర్మబిక్ష చాలు!
జాతిశక్తికి నీవిచ్చిన
ఈ రామరక్ష చాలు!

[* ఇది ఐతరేయ బ్రాహ్మణ మంత్రము. నడు,
ముందుకునడు! అని అరం

శ్రీ టి. చంద్రశేఖర రెడ్డి

# మినీకవిత - మరొక పరిశీలన

ఈమధ్యన మినీకవిత మీద చర్చలు అనేకం జరుగుతున్నయ్. పత్రికల్లో రగడలు రగిలినయ్. మినీకవిత స్వరూప స్వభావాలను గురించీ, అది పాఠకలోకానికి అందిస్తున్న ప్రయోజనం గురించి విభిన్న భావాలు వ్యక్తమవుతున్నయ్.

పూర్తిగా వివిధ కవుల మినీకవితల్తో నొక సంకలనం వెలువడింది (మినీకవితా విప్లవం- సంకలన కర్త శ్రీ కొల్లూరి). మినీకవిత గుణగణాలని సమగ్రంగా సంశ్లేషిస్తూ వో వ్యాస సంపుటి వెలుగులోకి వచ్చింది (మినీకవిత- రచయిత శ్రీ అద్దేపల్లి రామమోహనరావు).

సాహితీలోకంలో ఇంత సంచలనం, పాఠక సమూహాల్లో ఇంత కలకలం సృష్టించిన, సృష్టిస్తున్న మినీకవిత పూర్వాపరాల మీద వో చిరు అవగాహనా కోరకం వికసింప చేసేందుకు చేసిన స్వల్ప యత్నం ఈ వ్యాసాంగం.

## మినీకవిత అంటే

మినీకవిత అంటే హ్రస్వకవితగా అర్థం చెప్పుకోవచ్చు. హ్రస్వత పదరాశిదే కాని భావవాసిది కాదు. స్వల్ప పద పరిధిలో ప్రతిభావంతంగా— అర్థం పాఠకుని మేధకు సూటిగా ఘాటిగా తాకేలా చేసేందుకు వో నూత్న వాహిక మినీకవిత. శ్రీ అద్దేపల్లి రామమోహనరావుగారు చెప్పినట్లు మినీకవితకి ఉచ్ఛ్వాసం "క్లుప్తత", నిశ్వాసం "ధ్వని".

కొందరి దృష్టిలో మినీకవిత వచన కవిత్వపు సంక్షిప్తరూపం. మరికొందరి దృక్పథంలో అది వచన కవితా యౌవనరూపం.

## గతంలో మినీకవిత ప్రవాదులు :-

వొక సంపూర్ణ భావానికి మినీకవితలాంటి రూపదానం చెయ్యటం నూతనం కాదు. ప్రాచీన కాలంలో సైతం ఉన్నదే. మినీకవితకి ప్రస్తుతం వున్న వస్తు భాషాస్వరూపాల్ని వొక ప్రక్కన వుంచి, మినీకవితకు ప్రాణాధారమయిన మూలశక్తిని అవగాహనకు ఆధారంగా ఎంచుకుంటే; శాలివాహన సప్తశతి, సంస్కృతాంధ్రాల్లోని చాటువులు, శతకాదులు మినీకవితాధోరణికి సమీపంగా వుండటం గమనించవచ్చు. కొన్ని నాటకాల్లో కావ్యాల్లో కొన్ని భావ వ్యక్తీకరణలని మినీ కవితలుగా దర్శించవచ్చు. ఉదాహరణకి మృచ్ఛకటికంలోని వొక పద్యంలోని ఈ భావం—

"చావులో, దరిద్రంలో
చావేనయం దరిద్రం కంటే
ఆ సమయంలో మాత్రమే దుఃఖమిస్తుంది చావు
చచ్చేదాకా దుఃఖమిస్తుంది దరిద్రం"

కాక – ఉమర్ ఖయ్యాం రుబాయీలనీ గాలిబ్ గీతాల్లాంటి ఉర్దూకవితల్ని కూడా మినీకవితలుగా భావించవచ్చు. గురజాడ కలం నుంచి వెలువడిన కవిత్వంలో కూడా మినీకవిత లక్షణాలని అక్కడక్కడ చూడవచ్చు. ఉదాహరణకి ఈ నాలుగు పంక్తులూ–

"మనిషి చేసిన రాయి రప్పకి
మహిమ కలదని సాగి మొక్కుతూ–
మనుషులంటే రాయి రప్పలకన్నా
కనిష్టంగా చూస్తావేల బేలా !"

## ఏది మొదటి మినీ కవిత

"ఇప్పుడు బాగా ప్రాచుర్యం పొందిన మినీకవితా లక్షణాలని దృష్టిలో వుంచుకుని, వోసారి దృష్టిని నిశితంగా గతంలోకి సారిస్తే మొదటి మినీ కవితగా చెప్పుకోదగిన కవిత నొకటి – శ్రీ శ్రీ "మహాప్రస్థానం"లో "ఆః"

నిప్పులు చిమ్ముకుంటే
నింగికి నేనెగిరి పోతే
నిబిడాశ్చర్యంతో వీరు–

నెత్తురు కక్కుకుంటూ
నేలకు నే రాలిపోతే
నిర్దాక్షిణ్యంగా వీరే–

"మహాప్రస్థానం" లోని ఈ రెండు కవితలని కూడా మినీ కవితలుగా నిర్ధారించవచ్చు.

పరాజితులు :_ అలసిన కన్నులు కాంచేదేమిటి ?
తొణికిన స్వప్నం
తొలగిన స్వర్గం!
చెదరిన గుండెల నదిమేదేటి ?
అవతల, ఇవతల
అరులై ఇరులే!
విలసిన ప్రాణుల పిలిచే దెవ్వరు ?
దుర్గతి, దుర్గతి
దుర్మతి, దుర్మృతి.

సాహసి :_ ఎగిరించకు లోహ విహంగాలను
కదిలించకు సుప్త భుజంగాలను!
ఉండనీ _
మస్తిష్క కులాయంలో
మనో వల్మీకంలో
అంతరాళ భయంకర
ప్రాంతరాలనా నీ విహారం?
ముళ్ళదారినా నీ సంచారం?

"సంధ్యా సమస్యలు" సైతం మినీకవిత లక్షణాలని మిక్కుటంగా ప్రతిఫలించే కవితే.

## మినీకవిత పరిమాణం

ఏ వచనకవితకయినా ఇది నిర్దిష్టమయిన పరిమాణమని నిర్దేశిత ఎక్కడా వుండదు. చెప్పదల్చుకున్న భావాన్ని బట్టీ, కవి వ్యక్తీకరణ శక్తిని బట్టీ కవిత పరిమాణం.

పరిమాణం రీత్యా ఇంతవరకూ వొచ్చిన మినీకవితల్లో దిగువన ఉటంకించిన నాలుగు కవితలూ అతి చిన్నవి.

పన్నెండక్షరాల్లో శ్రీ టి. చంద్రశేఖరరెడ్డి "జీవితంలో"
నవ్వు
గులాబీ పువ్వు
ముళ్లు
కన్నీళ్లు.

పద్నాలుగక్షరాల్లో శ్రీ బెల్లంకొండ రామదాసు.
బ్రతుకే వొక క్రాస్
మనిషే వొక క్రైస్టు.

పదిహేనక్షరాల్లో శ్రీ సన్నంగి శ్రీనివాస ప్రసాద్ "నూదిమందు"
వృత్తిరీత్యా దేముడు
ప్రవృత్తిరీత్యా యముడు.

పదిహేడక్షరాల్లో శ్రీ కాళోజీ "జే. పి."
పుటక నీది
చావు నీది
బ్రతుకంతా దేశానిది.

## మినీకవిత జననం

కాలమాన పరిస్థితుల కనుగుణంగా సామాజిక ప్రయోజనాల కారణంగా కవిత్వం భిన్నరకాలుగా రూపపరిణామం పొందింది. కవనం భావకవిత్వంగా, అభ్యుదయ కవిత్వంగా, విప్లవకవిత్వంగా, దిగంబరకవిత్వంగా రకరకాలుగా దర్శన మిచ్చింది. ప్రతిరూపం తన సమకాలీన సమాజచేతనాన్ని సంపూర్తిగా ప్రతిబింబించింది. ఆ దృష్టితోనే నేటి కాలపు ప్రధాన ప్రక్రియగా మినీకవిత ఆవిర్భవించింది.

కొందరు విమర్శకుల దృష్టిలో మినీకవిత వ్యాపార నాగరికతా ప్రతిఫలం. మిగిలిన సాహితీ ప్రక్రియల నేరానికి స్థలం కేటాయించటంతో స్థలాభావం వల్ల పెద్దకవితలని విస్తృతంగా ప్రచురించేందుకు అవకాశంలేక పత్రికలు మినీకవిత ప్రచురణని ప్రోత్సహించాయని వీరివాదం. మినీకవిత జననానికి కారణం ఇదొకటే కాదు.

వొస్తున్న దీర్ఘకవితల్లో అనేకం పరస్పర ప్రతిధ్వనులుగా మేధకి వినిపించటం పాఠకుడికి విసుగు కలిగిస్తున్న సమయంలో ఆవిర్భవించిన మినీకవిత తన స్పష్టతతో, నిస్పష్టధ్వనితో జనాన్ని ఆకర్షించింది. పరిమిత పరిధిలో నొక పరిపూర్ణ భావనని సమగ్రంగా సంక్షిప్తంగా తీవ్రధ్వనితో ధ్వనించింది. కవి హృదంతరాల్లోంచి ఆలోచన కలంలోంచి బలంగా వ్యక్తం చేయడానికి వీలయిన వాహికగా అవతరించింది. భావ పునరుక్తి దోషాన్నీ, భాషాభేషజాన్నీ, అస్పష్టతనీ వో ప్రక్కకు తోసేసి క్లుప్తత ఉచ్ఛ్వాసంగా ధ్వని నిశ్వాసంగా దినదిన ప్రవర్ధనమయింది. సాహితీజీవులని తనవైపు ఆకృష్టం చేసుకుంది.

## మినీ కవిత లక్షణం

మినీ కవితకి ధ్వని వెన్నెముక. గోరంత వ్యక్తంచేసి వ్యక్తిత విషయం మీద కొండంత అవగాహన తృటిలో కలిగించడం ధ్వని. అత్యల్ప సంఖ్యలో పదాల్ని, స్వల్ప వాక్యాన్ని వినియోగించి వొక మినీకవితని వెలుగులోకి తే దలుచుకున్న కవికి ఈ ధ్వని రహస్యం తెలియడం అత్యవసరం. ఈ సందాలో రాయబడ్డ విజయవంతంగా భావం చెప్పబడ్డ కవిత శ్రీ కాళోజీ "జే. పి.]
పుటక నీది
చావు నీది
బ్రతుకంతా దేశానిది.

స్వరోదనతో పరవేదనలో ఈ లోకంలోకి పూడిపడి, స్వవేదనతో పరరోదనలో రాలిపోయిన జీవి - జనన మరణాల్ని రెండింటినే తన విగా భావించాడనీ, రెండింటి మధ్యా విరామమయిన జీవితాన్ని దేశం కోసం ధారపోసాడని భావన. కవిత చిన్నదయినా జే. పి. త్యాగనిరతీ, జీవనప్రయోజనం విపులంగా ధ్వనించింది.

ధ్వనినే పునాదిగా చేసుకుని జింబో ధ్వనించిన మరో కవిత— బ్రతుకు.

నేను
చచ్చిపోతాననే కదూ_
నీ బాధ
పిచ్చివాడా_
ఈ వ్యవస్థలో
మనం బతికింది
తొమ్మిది మాసాలే.

శవాలకి కోరికలుండవు. కొంతమంది జీవులకి కోరికలుండీ తీరవు. తీరని కోరికల తీరాల్లో జీవిస్తున్న జీవి జీవం ఉండీ శవం_ జీవచ్ఛవం.పరిసరాల్లో జీవిస్తున్న ప్రతిజీవీ జీవచ్ఛవమే అయితే_ ఏ చీకూ చింతా లేకుండా మాతృగర్భంలో నివసించిన తొమ్మిదిమాసాలే నిజానికి మనిషి జీవించిన క్షణాలని భావం. కవితకంతటికీ ప్రాణమయిన చివరి మూడుచరణాల్లో కవి విసరిన కొనమెరుపు కొరడా కొసఝళిపు గమనీయమయినవి.

మినీ కవిత చదవగానే పాఠకుడి మీద పడిన ముద్ర- శిల తగిలిన జలంలో అల్లా ప్రకంపిత మయి ప్రచలితమయి మెదడంతా అలముకుంటుంది. ఆ అనుభూతి సాంద్రత శాశ్వతంగా మెదడుపొరల్లో చోటు చేసుకుంటుంది.

మినీకవితకి చివరి పంక్తి చివరిదాకా దూకిన భావజలపాతం యొక్క_ ముగింపు శక్తి బలవత్తరమైనవి. చరణంనుంచి చరణానికి పాగిపోతున్నపుడు అందుతున్న అవగాహన తుదిచరణందాకా వొచ్చేసరికి వొక అనూహ్యమయిన మలుపు విచిత్రంగా తిరిగి ఆ మెలిక మలుపులో మెరుపువిరుపుల్లో జిగేల్మ మనిపిస్తుంది. ఈ కవిత "పీక్లు" చూడండి. కవి శ్రీ వెంపలి వెంకట్ల శివప్రసాద్.

అమృతం తాగితే
చావే రాదంటారు.
విషం మింగితే
బ్రతుకే లేదంటారు.
మరి ప్రీక్షేం తాగారని
అనుక్షణం చస్తూ బ్రతుకుతున్నారు.

గతజీవన విషాదం విషం లాంటిది. స్మరణకొస్తే మనిషి నీరసిస్తాడు-మరణిస్తాడు. భావి జీవితస్వప్నం అమృతం లాంటిది.తలపుకొస్తే మనిషి కొత్త జీవం పుంజుకుంటాడు. కలలు కల్లలయిన మనిషికి వర్తమానం శూన్యం. వర్తమానమేగా గతంగా మారేది. అనుభూతమౌతున్న వర్తమానమంతా నైరాశ్యమే ఐనపుడు తలచుకుందుకు గతంలో ఏమీ మిగలనపుడు మనిషి ప్రస్తుతంలో ప్రతిక్షణం ఛస్తాడు. నడుమనడుమ వాంఛాతీరాల్లో వూహావిహంగమై విహారంచేసి జీవిస్తాడు. వ్యవస్థలో జీవచ్ఛవాల జీవన వైచిత్రిని అంతర్లీనంగా ధ్వనించడం కవితలో వినపడుతుంది.

అంత్యచరణంలో వో చేదునిజాన్ని చాచికొట్టినట్లు చెప్పడం శ్రీ అలిశెట్టి ప్రభాకర్ కవిత "నా దృష్టిలో" కూడా ద్యోతకమవుతుంది.

అంతస్తూ ఐశ్వర్యం
శ్రామికుడి భిక్షం
నాదృష్టిలో ధనమదాంధుడే
అడుక్కు_ తినేవాడు.

పగలంతా సెగలు కక్కే ఎండలో మాంసాన్ని చెమటగామార్చి శ్రమించే జీవి శ్రమఫలాన్ని మరొకడు దోచుకుపోతున్న వ్యవస్థమనది. వెలుగులో కష్టపడిన రక్తం రాత్రి కన్నీరు కాగా దోచుకుపోతున్నవాడి జీవితం రేయింబవళ్ళూ సుఖమయం అవుతున్నది. అంతస్థుల్లో ఐశ్వర్య మిచ్చిన విలాసాల్లో కులుకుతున్నది. ధనికుడి జీవనసౌధానికి పునాదిని దానం చేసింది శ్రామికుడి శ్రమేననీ - ఆ శ్రమని ఆధారం చేసుకుని జీవిస్తున్న ధనికుడే నిజానికి భిక్షకుడనీ ఈ నాలుగు చరణాల్లో ప్రతిభావంతంగా చెపుతాడు కవి.

అసంఖ్యాకంగా వొస్తున్న మినీకవితల్లో ప్రముఖంగా కనబడే మరోలక్షణం కొన్ని జీవనసత్యాలను అనూహ్య ధోరణిలో అత్యంత ప్రతిభావంతంగా చెప్పడం - మనం నిత్యం చూసే వస్తువులనో-అప్రధానంగా కనపడే విషయాన్నో ఆధారం చేసుకుని వో భయంకర సత్యాన్ని బయటికి లాగడం. నిదర్శనం శ్రీ కె. బాలరాజు కవిత "హ్యూమనిజం" దర్శించండి.

క్షౌరశాలలోని
మంగలి
త్రిప్పినట్లు తిరిగ
తలవెంట్రుకలు
తీయించుకున్నట్లు
నేటి ప్రజలు

ప్రజానాయకుల
వెంబడి తిరిగి
మానవత్వాన్ని
గొరిగించుకుంటున్నారు.

క్షౌరశాలతో సమాజాన్ని పోల్చి మంగలి త్రిప్పినట్లు మనిషి తిరగడాన్ని ప్రజానాయకుల వెంట ప్రజలు తిరగడంతో ఉపమించ డంలో వ్యక్తమయిన దాస్యధోరణి ; తల వెంట్రుకలు తీయించుకోవ డంతో మనిషి మానవత్వాన్ని గొరిగించుకోవడంతో పోల్చటంలో ప్రసరించిన దోపిడీ విధానం కవిత స్పష్టంగా తెలియజేస్తోంది. ఈ కవితలో భావం వ్యక్తీకరణమయిన విధానం వినూతనం.

ఇలాంటిదే మరోకవిత శ్రీ నందిని సిధారెడ్డి "అల".

ఎంత సిగ్గులేనిది
ఆడుకుని, వాడుకుని
నేలకి కసిరి కొట్టినా ఈ కౌగిలితం
మళ్ళా, గాలి పిలవగానే
గాల్లో లేచిపోతుంది.
ఊహల్లో ఎగిరే మనసూ
అంతే ?
ఎంత
సి
గ్గు
లేనిది ?

గాలి పిలిస్తే లేచిపోయే కౌగితంతో వూహ పిలిస్తే వెళిపోయే మనసుని పోల్చడం ఈ కవితలో రమ్యత. ఈ భావనలో వూహని మనసుని లేపుకుపోయే గాలిగా దర్శించడంలో కవి వూహాశక్తి అభివ్యక్తమవుతోంది. మనసుని కౌగితంగా, వూహని గాలిగా కవి తాత్మతో దర్శించిన కవి అక్కడితో ఆగకుండా లేచిపోవడం పైన తనకున్న అసహ్యాన్నీ, అయిష్టాన్నీ చివరి నాలుగు పాదాల్లో మధ్య పదాన్ని విరిచి పేర్చి కసిగా నొక్కి వ్యక్తం చేస్తాడు.

కొన్ని మినీకవితలు రెండు భాగాలుగా భావాను సారంగా విడిగా వ్యక్తం చెయ్యబడి రెండిటి కలయికలోంచి శీర్షికని పూతం చేసుకుని విషయాన్ని బలంగా ధ్వనిస్తాయి. ఇది శ్రీ అలిశెట్టి ప్రభాకర్ కవిత "చెమట వ్యాపారం".

నీ శ్రమఫలం
నీ సమక్షంలోనే పాతిపెట్టబడ్డ
విత్తనం –
దాన్నే డబ్బుచెట్టుగా పెంచి
దక్కించుకున్న వాడిదే
పెత్తనం.

శ్రామికుడి శ్రమని విత్తనంతో పోల్చి అందులోంచి అంకు రించిన ధనవృక్షాన్ని పెంచి ఎవరో దక్కించుకోవడాన్ని ధ్వనించ డంలో – కవితలో – వ్యవస్థలో దోచబడుతున్నదీ, దోచుకుంటున్నదీ ఎవరో స్పష్టంగా తెలుస్తున్నది.

కొన్ని మినీకవితలు సాధారణ వాక్యాలుగా పదాలుగా దర్శన మిచ్చినా చిరుచిరు విరుపుల్తో చివరిదాకా వో శక్తిని ప్రోదిచేసుకుంటూ వచ్చి తుదిపాదంతో వో తటిల్లతలా మెరిసి అనుభూతి వర్షాన్ని కురిసి పోతాయి. నిదర్శనానికి శ్రీ పురిపండా అప్పలస్వామి కవిత "అడవి వూరు".

అడవిలో
ఒక్క ప్రాణానికే ముప్పు
ఊళ్లో
ధనానికీ మానానికీ ప్రాణానికీ
అన్నిటికీ ముప్పే.
అడవిలో జంతువులు
ఊళ్ళో మనుషులు.

జనం నివసించని అరణ్యంలో జంతువులు చేసే అపకారంతో పోల్చుకుంటే సంఘంలో మనిషి సాటి జీవులకి చేస్తున్న అపకారం చాలా ఎక్కువ అన్న భావాన్ని ప్రతిపాదిస్తూ మనిషికన్నా జంతువులు నయం అన్న అర్థాన్ని పరోక్షంగా ప్రసరిస్తుందీ కవిత. చివరి రెండు చరణాల్లో అభివ్యక్తి మొత్తం కవితకి ప్రాణశక్తి.

ఒకే రకం పదాన్నో, పదబంధాన్నో ఒకే కవితలో భిన్నా

కవిత "తలలు" చూడండి.

చెదరిన పుట్టనుండి
బెదరిన చీమలు పరుగులెత్తినట్లు
లేమి కొలిమి నుండి
ఆకలి పొగ తెగబడినప్పుడు
ఆకలి తీర్చలేని జంతిపీక్కు కూడా
అసహాయతలో
మెదబడతారు
పొలమారిందని మీ తలంమీద జీరే

బాదవలసిన తలలు
వేరే వున్నాయని
తెలుసుకునే దెప్పుడు?

పొల మారినపుడు తలలు బాదుకోవటాన్నీ, బాదవలసిన తలల గురించీ, వొకే పదబంధ ప్రయోగంతో పాఠకుడికి స్పృహ కలిగింప చెయ్యటంలో విశిష్టత హృదయాన్ని కదిలింప చేస్తుంది. అన్నార్తుల్ని చెదరిన పుట్టనుండి బెదరిన చీమల్తో ఉపమించటం- లేమిని కొలిమితో ఆకలిని ఆ కొలిమినుంచి తెగబడిన సెగతో పోల్చటం - కవితలో విలక్షణత.

వొక వస్తువునో విషయాన్నో కవిత పొడుగూతా వైవిధ్యంతో వర్ణించి వొక సామాజిక సత్యాన్ని చివరకు బలవత్తరంగా చెప్పడం మినీ కవిత మరోలక్షణం. ఈ కవిత "చరిత్ర చెప్పని గణితం" శ్రీ అలిశెట్టి ప్రభాకర్ రచన.

సామాన్యుడి జీవిత వృత్తాంతం
ఎపుడూ కష్టాలు ఇమిడి వుండే
ఒక బిందువే.
అతన్నాధారం చేసుకుని గీసుకునే
వృత్త వైశాల్యాలే
సంపదలు సౌఖ్యాలు సౌధాలు
ఇది చరిత్ర చెప్పిన గణితంకాదు.
ప్రతి పెట్టుబడిదారీ వ్యవస్థ
బాహాటంగా ఏర్పరచుకున్న
స్వార్థపు వలయం.

నిత్యజీవితంలో జరిగే సంఘటనలని, సంభాషణల కుపయోగించబడ్డ వాక్యాలని యథాతథంగా ప్రయోగించి వో దిగంబర సత్యాన్ని కవిత కల్గించిన అవగాహనలోంచి వెలిగించడం మినీ కవిత మరో వైచిత్రి. ఈ కవిత శ్రీ బి. జంగయ్యది.

"అమ్మా! కింటోన్ని"
"పోయిరా!"
"తల్లీ! గుడ్డోన్ని"
"వెళ్ళిరా!"
"మా తల్లీ! ముసిలోన్ని"
"పోపో!"
"ఏడు కొండలవాడా
వెంకట రమణా"
"వస్తున్నా ఉండు!"

అంగ వైకల్యం పొంది, ముదిమి మీద పడి జీవికలేని దౌర్భాగ్యుల మీద కన్నా; శ్రమించగలిగిన శక్తి, అవకాశం వుండీ దేవుడి పేరు వాడుకుని భుక్తి సంపాదించాలనుకునే వాళ్ళపైనే; సంఘంలో కొందరు జీవుల దయాగుణం ప్రసరిస్తున్నదనీ; మనిషికి మానవత్వం కన్నా దైవభీతే అధికమనీ పరోక్షంగా నిరూపిస్తుందీ కవిత. నిరాడంబర వ్యక్తీకరణ ఈ కవిత విలక్షణత.

కొన్ని మినీ కవితలు కవితాభాగం వొక్కటే చదివి వూరుకుంటే అర్థరహితంగా, అస్పష్టంగా అనిపిస్తాయి. శీర్షికతో అన్వయించుకుని చదివితే వో సంపూర్ణ భావాన్ని సమగ్రంగా ప్రతిఫలిస్తాయి. ఈ మూడు కవితలనీ అవలోకించండి.

శ్రీ అలిశెట్టి ప్రభాకర్ "హృదయం"

రాత్రి మాత్రమే
కాసేపు ఈ రోడ్డు
నిశ్శబ్దంగా....
నిర్మానుష్యంగా....
తెల్లారితే మళ్ళీ
ఒకటే రద్దీ....

శ్రీ ఆసు రాజేంద్ర "మృత్యువు"

నా ముంగిలి ముందు నుంచుని
ఓరగా చూస్తుంది
నేనెపుడు తలుపు తీస్తానా అని.
నేను తలుపు తీసానో
అది లోపలికి
నేను బయటికి.

శ్రీ టి. చంద్రశేఖరరెడ్డి "జీవితంలో...."

నవ్వు
గులాబీ పువ్వు
ముళ్ళు
కన్నీళ్ళు.

మినీకవితల్లో కవితామయమయిన ఆలోచనలని వ్యక్తం చెయ్యడానికి గణితాన్నో, వ్యాకరణ చిహ్నాలనో వాడుకోవడం కూడా కద్దు. ఉదాహరణలు ఈ మూడు మినీకవితలు.

శ్రీ అంకిత కేశవులు "డబ్బు"

నువ్వు + డబ్బు = హీరో
నువ్వు — డబ్బు = జీరో
పరమాత్ముడి కన్నా
పైసాయే మిన్న.
దేర్ఫోర్ మేరే యారో
దేవుడికి గోలీ మారో.

శ్రీ సారధి "కాదు ?"

జీవితమనే వాక్యంలో
ప్రేమ
ఫుల్‌స్టాప్ కాదు కామా ?

శ్రీ కె. వాసుదేవరావు "!?"

జరాభారంతో
కుంగిపోయిన
ఆశ్చర్యార్థకమే
ప్రశ్నార్థకం
అవుతుంది.

అనంతమయిన వేదాంతాన్ని అత్యల్ప పరిమాణంలో ధ్వనించింది మినీకవిత అడపాదడపా అక్కడక్కడా. ఈరెండు కవితల్నీ చూడండి.

కవి శ్రీ వసీరా

కాళ్ల తడవకుండా
సముద్రాన్ని దాటగల మేధావియైనా
కాళ్ల తడవకుండా
జీవితాన్ని దాటలేడు.

శ్రీ చంద్రసేన్ "ముక్కంటి తెలివి"

"కన్ను తెరిస్తే జననం
కన్ను మూస్తే మరణం
రెప్పపాటే కదా ఈ ప్రయాణం.

## మినీకవిత - సామాజిక ప్రయోజనం

ఏ కవనం సామాజిక ప్రయోజనం అయినా పాఠకుడిలో మానసిక చేతనాన్ని అంకురింపచేసి, విస్తరింపచేయడం.

పాఠకుడి మనోచేతనం మీద ఏ సాహితీ ప్రక్రియ ప్రభావం అయినా దాని పరిమాణాన్ని బట్టి వుండదు. దాని ప్రమాణాన్ని బట్టి వుంటుంది. ఈ సత్యాన్ని దృష్టిలో వుంచుకుని పరికిస్తే అనేక భావవీచికలని విస్తృతపరిధిలో వీచగల దీర్ఘకవితకి వున్న ప్రాధాన్యం మినీకవితకి సైతం వుంది. స్వల్పపరిధిలో వొకేవొక్క భావాన్ని విస్పష్టంగా పాఠకుడి మీద ముద్రితం చేయడంతో కవి ఆశించే సామాజిక ప్రయోజనాన్ని మినీకవితే బలవత్తరంగా నెరవేర్చగలదు.

వొక్కోసారి దీర్ఘకవితలోంచి వీచిన ప్రతి భావవీచిక తాకిడీ పాఠకుడికి శాశ్వతంగా జ్ఞప్తికుండకపోవచ్చును గాని - మినీకవిత తనలో వొక్కుమ్మడిగా రగిలించిన అలజడిని పాఠకుడు విస్మరించలేడు.

అందుకే మినీకవితకి నేడింత ఆదరణ - సాహితీ లోకంలో పోషణ.

[ ఈ వ్యాసరచనలో "మినీకవిత" వ్యాస సంకలనం - మరింకెన్నో వ్యాసాలూ - కవితా సంకలనాలూ ఎంతగానో సహకరించాయి. శ్రీ అద్దేపల్లి రామమోహనరావు గారికీ, తదితర వ్యాసకర్తలకూ, కవులందరికీ నా కృతజ్ఞతలు. ]

# రక్షించండి కవిత్వాన్ని

అణగారిన అకాడమీల నుండి
మూసలో పోసిన యునివర్సిటీల నుండి
కుహనా సాహిత్య సంస్థల నుండి
స్టంటు స్లోగన్ సోడాబుడ్ల నుండి
సెక్సు సేమియా సినీ పాటలనుండి
విదేశీ విచ్చలవిడి విష వాయువుల నుండి
నా దేశాన్ని రక్షించండి
కవిత్వాన్ని విడుదల చేయండి!

# చలం!

స్వేచ్ఛా వాయువు
పీల్చడం తప్పా?
భౌతికంగా రొచ్చుగుంటలో
ఉన్నామని తేల్చి చెప్పడం దోషమా?
గోనెసంచి గుండెల్లోని
కుష్ఠు కుబుసాన్ని
బట్టబయలు చేయడం
పిట్టకథల్ని పిసికి వేయడం
చలం చార్వాకమా?
దేశీయం దేబెగా
ఒప్పుకోలేదు
పాశ్చాత్యం పాడిగా
పిండుకోలేదు
'మ్యూజింగ్స్' 'భగవద్గీత వ్యాఖ్యానం'
"బిడ్డల పెంపకం, "స్త్రీ"
వ్యాసాలు, నాటకాలు
సానుభూతి కోసం వ్రాయలేదు
స్వతహాగా పుట్టుకొచ్చాయి
నిమ్మగడ్డ 'శ్మశాన సాహిత్యం'గా
ముద్రవేసినా
యువతకు దారి బత్తెం!

శ్రీ యస్. యస్. రెడ్డి

శ్రీమతి శివలెంక భవానీ శాస్త్రి

# శైవ సిద్ధాంతదర్శిని

శివభక్తి బోధకములగు గ్రంథము లెన్నియున్నను, ఒక్కొక్క విషయమునే బోధించునవి విశేషముగా గలవు. కాని యన్నివిషయముల నొక్కచో నేర్చికూర్చిన గ్రంథములతి స్వల్పములు అందుచేత పామరులు తమ భక్తిని పెంపొందింప జేసికొనుటకు, పండితులు శ్రుత్యాగమ పురాణేతి హాసంబులతో గ్రంథాంత రాభిలాష లేకయె యుపన్యసించి శివభక్తిని దేశమందంతట వ్యాపింపజేయ ముందంజ వేయుటకు నుపయుక్తములగునటులీ గ్రంథము ముదిగొండ వీరేశలింగ శాస్త్రిగారిచే రచింపబడి బ్ర॥ శ్రీ॥ లో॥ కొడిమేల రాజ లింగారాధ్యుల వారిచే శైవ ప్రచారిణీ ముద్రాక్షర శాలలో వరంగల్‌లో ౧౯౪౯లో ముద్రింపబడినది. హనుమకొండ సిద్దేశ్వర స్వామి కంకిత మీయబడినది. ఈ విషయ మీ క్రింది సీసపద్యమువలన దెలియు చున్నది.

సీ॥ శ్రీ భారతీపతి సేవిత చరణాబ్జ
గంగా జటాజూట కామదమన
శశికలితోత్తంస శాశ్వతా నందద
శర్వ పరాత్పర శాంకరీశ
భక్తపాలన దక్ష పద్మాక్షిహృత్కంజ
భాస్కర శంకర పరమపురుష
సిద్ధసన్నుత కార్యసిద్ధి ప్రదాహను
మద్గిరి మందిర మాన్యచరిత

గీ॥ సాంబసిద్ధేశ్వరా పరశ్శతము వినతి
తతుల నర్పించి శైవ సిద్ధాంత దర్శి
ని యను గ్రంథకుసుమంబునే నీపదముల
నర్పణము సేతు గైకొనుమయ్య ప్రేమ.

ఈ గ్రంథారంభమున గురువరేణ్యులగు ముదిగొండ నాగలింగ శాస్త్రిగారి ప్రోత్సాహ ప్రోద్బలముల వలన తామీ గ్రంథరచన నారంభించితిమనియు, శ్రీ కొడిమేల రాజలింగారాధ్యులవారు తమపై అపార ప్రేమానురాగములతో నీ గ్రంథమును ముద్రించినారనియు, శాస్త్రిగారు సవినయముగా విన్నవించుకొనిరి.

అగాధమును, దురవగాహమును, భయంకరమును, అనంత దుఃఖముం కాలయమును, అత్యంత ఘోరదురిత క్రియాపుంజము లకు గాణాచియును అగు భీకర సంసార పారావారమును దాటి యపవర్గమును (మోక్షము) బొందుటకు ప్రతి మానవ మాత్రుడును తప్పక యత్నింపవలెను.

అత్యున్నతమగు మోక్షశైలాధి రోషణమునకు సోపానము లనేకములున్నను, వానిలో భస్మరుద్రాక్షలింగధారణాది శైవ సోపానము లుత్తమోత్తములు.

అష్టావరణములు "గురుర్లింగం జంగమశ్చ తీర్థంచైవ ప్రసాదకః భస్మరుద్రాక్షమంత్రాశ్చేత్యష్టావరణ సంజ్ఞికాః" గురువు, శివలింగము, మాహేశ్వరుడు, తీర్థము, ప్రసాదము, భస్మము, రుద్రాక్ష, మంత్రము" అని యెనిమిది విధములుగా ప్రఖ్యాతములైనవి.

"ఇమాని శివభక్తానాంభవదోషతతేస్సదా
నివారణైక కార్యాణి ఖ్యాతా న్యావరణాఖ్యయా"

సంసార సంబంధమగు దోషజాతము భక్తుల యొద్దకు రాకుండగ పారదోలునవిగాన నీయవి యావరణ సంజ్ఞచేత ప్రసిద్ధములైనవి.

పైజెప్పబడిన అష్టావరణములోనివగు విభూతి, రుద్రాక్ష, పంచాక్షరీ మంత్రము, గురువు అను ప్రధానములగు నాలుగు విషయముల గూర్చి శ్రుతిస్మృతి పురాణేతిహాస ప్రమాణ పురస్సరముగా రచించి, శైవశిద్ధాంతముల ప్రజాహృదయములకు హత్తుకొనునట్లు, శివభక్తి పారమ్యము పెంపొందునట్లు శాస్త్రిగారు వివిధ రమణీయ గాథావళిద్వారా వ్యాఖ్యాన పురస్సరముగా నీగంథ్రమును రచించిరి. శైవ సిద్ధాంతదర్శిని ద్వితీయ భాగము నైతము కొలది కాలములో ప్రచురింతుమని ప్రథమభాగమున శాస్త్రిగారు నుడివినను, అది తదుపరి ప్రచురింపబడలేదు.

భస్మవిధి— 'త్రయాయుషజమదగ్నేః' అని ప్రత్యక్షముగా వేదములే భస్మను ధరించుచున్నవి. 'భూత్యైన ప్రమదితవ్యం' భస్మముచేత అప్రమత్తుడవు కాకుండుమని శ్రుతి విధించినది. మనో

రథసిద్ధికై మహర్షిపుంగవు లనేకు లీభస్మను ధరించి వ్రతానుష్ఠాన పరతంత్రులై 'వ్రతమే తద్వాంభవం' 'వ్రతమే తత్పాశుపతమ్మ'ని పాశుపత, శాంభవ వ్రతములుగా నీ భస్మధారణను గూర్చి వచించిరి.

శ్రు॥ "వ్రతమే తత్పాశుపతం పశుపాశ విమోక్షయేతి" భస్మో ద్ధూలన, త్రిపుండ్రధారణములు పాశుపత వ్రతమనియు, పశుపాశ విమోక్షము కొరకు దీని నాచరింపవలయుననియు నథర్వశిరస్సున నుడువబడినది.

భస్మమహిమ యవాఙ్మానసగోచరము. భస్మధారణము శిష్టజన సంప్రదాయము. ముక్తిసాధకము. పాపనాశనము. కావున యిట్టి భస్మ నశ్రద్ధ చేయక నత్యంత ప్రేమతో భక్తితో ధరించి యైహిక భోగ ముల ననుభవించి దేహాంతమున ముక్తినిఁబొందుమని శాస్త్రిగారు తమ గ్రంథమున భక్తుల నుద్బోధించిరి.

సత్యం శౌచం జపోహోమ స్తీర్థం దేవాది పూజనం
తస్యత్యర్థమిదం సర్వం యత్త్రిపుండ్రం నధారయేత్ శా.[2]
శ్రాద్ధే యజ్ఞే జపే హోమేవైశ్వ దేవే సురార్చనే
ధృత త్రిపుండ్రః పూతాత్మా మృత్యుంజయతి మానవః
త్రిపుండ్రం యద్యధృత్వాతు కుర్యాద్యత్కర్మ తద్వృథా(కా)

త్రిపుండ్రమును ధరింపక నొనర్చిన జపము, హోమము, తీర్థము, దేవాది పూజనము మొదలగున వన్నియు నిష్ఫలములని శాతాతపులును, శ్రాద్ధము, యజ్ఞము, జపము, హోమము, వైశ్వ దేవార్చనము, సురార్చనమును త్రిపుండ్రధారియై మానవుడాచరించిన మృత్యువును సైతము జయించుచున్నాడు. అటుల కానిచో సర్వకర్మ ములు నిష్ప్రయోజనములని కాత్యాయనులును తమతమ స్మృతుల యందు విధించి యున్నారు. మనువు బ్రహ్మహత్యాది మహాపాతక నివ ర్తక ప్రాయశ్చిత్తముగా భస్మధారణను విధించి యున్నాడు.

శ్లో॥ ఆయుష్కామోనరో రాజన్ భూతికామోథవానర :
నిత్యం వైధారయేద్భస్మ మోక్షకామశ్చవై ద్విజః (భార)

పంచమ వేదమనబరగు శ్రీ మహాభారతము నందు, ఎవరు సర్వధర్మాచరణ కారణంబగు నాయువును,ఐశ్వర్యమును, మోక్షమును గోరుచున్నారో వారందరు నిత్యము నేమముగ భస్మను ధరింప వలె నని పలుకబడినది.

శ్రు॥ అగ్నిరితి భస్మవాయురితి భస్మ జలమితి భస్మ స్థలమితి భస్మ వ్యోమేతి భస్మ సర్వగ్ంహవా ఇదగ్ంభస్మ వాఙ్మన ఏతాని చక్షుగ్ంసి భస్మాని[5] (అథర్వ)

పంచభూతములు భస్మ స్వరూపులని అధర్వణవేదమందును, "మహాదేవో మహాభస్మ" జగత్కారణుడగు మహాదేవుడే భస్మ స్వరూపుడని సూత సంహిత యందును, పవిత్రమును, అగ్నిహోత్ర జమగు భస్మను ప్రణవమున గ్రహించి సర్వాంగములందును నభిషే చన మాచరించినచో భస్మస్నాన మాత్రముననే జనుడు తానొనరించిన పాపారణ్యము భస్మీపటలమవ పునీతుడై శివసాయుజ్యమందునన్నా డని లింగపురాణమునందు చెప్పబడినది.

మానస్తోకేతి మంత్రేణ మంత్రితం భస్మధారయేత్
ఊర్ధ్వ పుండ్రం భవేత్సామ మధ్య పుండ్రం యజూషించ
అధః పుండ్రంఋచస్సాక్షత్తస్మాత్పుండ్రం త్రియా
యుషం త్రియాయుషంజమదగ్నేః కశ్యప
స్య త్రియాయుషం అగస్త్యస్య త్రియాయుషం
యద్దేవానాం త్రియాయుషం తన్మేఅస్తు త్రియాయుషం[6]
(శ్వేతాశ్వతరోపనిషత్)

"మానస్తోకేతనయె" అను మంత్రమున భస్మను ధరింప వలయును. పైరేఖ సామవేదమనియు, మధ్యరేఖ యజుర్వేదమనియు క్రిందిరేఖ ఋగ్వేదమనియు నర్థము కావుననే త్రిపుండ్ర (రేఖ) ము త్రియాయుషమని వచింప బడుచున్నది. కశ్యపాది మునీంద్రులు, విష్ణ్వాది దేవతలు, ధరించిన యా త్రియాయుషము నాకు మనగుగాక యని యర్థము.

భస్మోద్ధూళిత సర్వాంగం సుప్రసన్న మనుస్మరన్
రామరహస్యోపనిషత్

భావ త్త్రిపుండ్రో భసితై స్సితస్సన్మౌని జటావల్కల వాన్మ్క
కుందవ[7] (హరివంశే)[8]

అనువచనములచే రామకృష్ణులు భస్మధారులేయని తెలియు చున్నది. శివపురాణమునందు, బృహజ్జాబాలమునందు కాలాగ్ని రుద్రో పనిషత్తునందు, అద్వైతమత స్థాపన నిదానమగు సూతసంహిత యందు విశేషముగా భస్మమహిమ వచింపబడినది. సర్వమతముల వారును నిత్యోపాసనానంతరము భస్మను ధరించుచున్నారు.

## భస్మ నామాంతరములు

సమస్తైశ్వర్య ప్రదాయకమగుటచే విభూతియనియు, తత్వభావ నము వలన భసితమనియు 'సర్వపాపనాశకమగుటచే భస్మమనియు' నిఖిలాపన్నివారకమగుటచే క్షారమనియు, భూతప్రేత పిశాచాది భయ ముల నుండి రక్షించునది యగుటచే రక్షయనియు, భస్మమునకు నామములు వచ్చినవి [9] అని శాస్త్రిగారిచే చెప్పబడినది.

**భస్మోత్పత్తి** పరమేశ్వరుని యొక్క సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములను పంచముఖములనుండి కపిల, కృష్ణ, ధవళ, ధూమ్రరక్త, వర్ణ విశిష్టములగు నందాభద్రా సురభి, సుశీల సుమనసులను పంచగోవులు జన్మించగా వానినుండి విభూత్యాదులుత్పత్తి జెందినవని చెప్పబడినది[10].

బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య శూద్రజాతులెల్లరు భస్మధరించుట కర్హులే.

ఫాలభాగమున ధరింపబడిన భస్మత్రిపుండ్ర విధిచే లలాటమున వ్రాయబడిన దురక్షరములను, అనగా దుష్టవ్రాతను నాశనముచేయు చున్నదని చెప్పబడినది.[11]

'ప్రణవేన సర్వాంగముద్ధూళ్య' ఇత్యాద్యుపనిషదాదివచన నిచయముచే శరీర మందంతట భస్మమూసికొనవలయునని శాస్త్రము లుద్ఘోషించుచున్నవి గాన స్థాననియమము వదిలి శరీరమందంతటను త్రిపుండ్రోద్ధూళనాత్మికముగా భక్తులు భస్మధరింపవచ్చును. వర్ణాశ్రమ వివక్షలేక సమంత్రకముగాగాని, అమంత్రకముగాగాని భస్మధారణ గావింపవచ్చును.

"బ్రహ్మణానామయంధర్మః" త్రిపుండ్రధారణము బ్రాహ్మణ ధర్మమని విధిగా ద్విజులకు విధింపబడి యున్నది. శివునకు ప్రియమైనదై మోక్షము నొసంగు జాలు నీ భస్మము భక్తజనములకు కొంగు బంగారమేకదా।

ఇట్లీవిధముగా భస్మవిధి, భస్మోత్పత్తి, భస్మనామాంతరములు, భస్మమహిమ గూర్చి శాస్త్రిగారు స్మృతి శ్రుతి ప్రమాణపూర్వకముగా నిరూపించుటయేగాక దృష్టాంత పూర్వకముగా మనోహరములగు రమణీయ గాథావళిద్వారా భక్తుల హృదయముల భక్తిరసతరంగిణులలో నోలలాడించిరి.

పరమేశ్వరుడు సముద్ర మధ్యమున వటపత్రశాయియై మోహాక్రాంతుడగు విష్ణునకు భస్మ నొసటంబెట్టి యాతని యజ్ఞానము నశింపజేసెననియు, తొల్లి వీరభద్రుడు క్రూరకర్ములగు సర్పాసుర పంచమాస్యాసురాదులచే హతులైన యమరులను భస్మచే బ్రతికించెననియు, వామదేవమహాముని శరీర భస్మ స్పర్శచే, అనేకజన్మసంలబ్ధ మహాపాతక సంయుతుడగు యవనాధీశ్వరుని బ్రహ్మరాక్షస స్వభావమును పటాపంచలుగా జేసెననియు, ఋషభ యోగీశ్వరుడు, భద్రాయువును భస్మప్రభావముచే బ్రతికించెననియు, ధనమదాంధతచే కన్ను మిన్ను గానక భస్మను ధరింపక దానమీయరాదను మహాపండితుడగు సుశీలుని యవమానించిన భుజంగ రాజుయు, యౌవనమదంబున పండితుని హేళన గావించిన రాజుభార్యయు శత్రువులచే రాజ్యభ్రష్టులై, క్రుశ్శిన దేహములతో నికృష్ట పరిస్థితిలో భిక్షాటనము చేసిరనియు, చివరకు సుశీలుని గాంచి తమను క్షమించి రక్షింపుమని వేడికొన నాతని భస్మప్రభావంబున తేజోవంతులై, రాక్షసాక్రాంతమైన రాజ్యమును జయించుటయేగాక తన దర్శనమాత్రముననే భుజంగాధిపుడు రాక్షస స్వరూపుడైన గంధర్వుని శాప విమోచన మొనరించెననియు, వివిధ గాథావళి సహృదయ రంజకముగా చెప్పబడినది. రుద్రాక్ష– రుద్రాక్ష మహిమగూర్చి, రుద్రాక్షోత్పత్తినిగూర్చి,రుద్రాక్షవిధినిగూర్చి, రుద్రాక్ష ధారణముగూర్చి శాస్త్రిగారు ప్రమాణ పూర్వకముగా నిరూపించినారు.

రుద్రాక్షధారణము నిగమాగమ పురాణేతిహాస బోధితము. శిష్టసంప్రదాయాగతము. రుద్రాక్షధారి సాక్షాత్ రుద్రుడే[12] నిత్యము మితిలేని పాతకముల జేయించు యీ సంసార పిశాచము నుండి తొలగించి మానవుని సన్మార్గమున ప్రవేశపెట్టునది రుద్రాక్షమాలికయే.

**రుద్రాక్షవిధి** సచ్చిదానంద స్వరూపుడగు పరమేశ్వరుని సాయుజ్య సౌధాధిరోహమునకుగల నెనిమిది సోపానములలోరుద్రాక్ష రెండవ సోపానము భస్మవిరహిత దేహాలమై యున్నతభూతప్రేత పిశాచాది గ్రహములావేశింపకుండుటకును, శరీరరక్షణ కొఱకును, రుద్రాక్షధారణమేర్పడినది. అట్టిపరమ పవిత్రమగు రుద్రాక్షధారణము వలనను,పూజనము వలనను, సమస్తదురితములు తొలగి ముక్తి కలుగునుగాన రుద్రాక్షధారణమక్షయ ఫలదాయకమని చెప్పబడినది.

'భవసాగర తారాయ భగదృగ్గబ్ధ జన్మనే।
విద్రావితాప, భదాయ రుద్రాక్షాయ నమోనమః
భూతిరుద్రాక్షమంత్రాశ్చ గురుర్లింగంచ జంగమః
పాదతీర్థ ప్రసాదౌ చేత్యష్టావరణ సంజ్ఞికాః'[13]

అని రుద్రాక్షగొప్పతనమును గూర్చి, అష్టావరణముల గూర్చియు తెలిపిరి.

**రుద్రాక్షోత్పత్తి** పూర్వమున సనత్కుమారుడు, ఋభు నిదాఘకాత్యాయన, భారద్వాజ వశిష్ఠాది మహర్షుల ప్రార్థనపై కాలాగ్నిరుద్రుడు సంహారకాలమున సంహారము జేసి సంహారాక్షిని మూసికొనిన సదాశివుని నేత్రమువలన నుద్భవించినవి గనుక, రుద్రాక్షములని వ్యవహరింపబడుచున్నవని[14] రుద్రాక్షోత్పత్తినిగూర్చి శాస్త్రిగారు వివరించిరి.

త్రిపురాసుర సంహార సమయమున పరమేశ్వరు నేత్రత్రయము వ్యాకులత నొంద దానినుండి బాష్పబిందువులు పుడమియందుబడి సర్వజగద్ధితమునకై శివాజ్ఞచే రుద్రాక్ష వృక్షములై జనించినవని చెప్పబడినది.[15]

**రుద్రాక్ష భేదములు** కపిలవర్ణ విశిష్టములు, సూర్యనేత్ర సముత్పన్నములునగు రుద్రాక్షములు ౧౨, శ్వేతములు చంద్ర నేత్రోదితములునగు రుద్రాక్షములు ౧౬, వహ్నినేత్రాగతములు, కృష్ణవర్ణములు నగునవి౧౦ మొత్తము రుద్రాక్షవృక్ష సంఖ్య ౩౮.[16]

తెల్లని రుద్రాక్షల బ్రాహ్మణులును, ఎఱ్ఱని రుద్రాక్షల రాజులును, పచ్చని రుద్రాక్షల వైశ్యులును, నల్లని రుద్రాక్షల చతుర్థ కులజులును ధరింపయోగ్యులని బ్రహ్మవైవర్తమునందు చెప్పబడినను 'గుణోలోపేన ముఖ్యస్య పరిత్యాగః' అను న్యాయమునననుసరించి గుణలోపమైనను ప్రధానమగు రుద్రాక్షను[17] పరిత్యజించక ధరింప వలయునని క్రియాసారముద్ఘోషించుచున్నది కాన వర్ణవివక్షను వదలి యే రుద్రాక్షమునైనను ధరించుట శ్రేయస్కరమని తెలియుచున్నది.

రుద్రాక్షప్రమాణము — ఉసిరికాయంత ప్రమాణముగల రుద్రాక్షములుత్తమములని, రేగుపండంత ప్రమాణముగలవి మధ్యమములని, శనగగింజంత ప్రమాణము గలవి క్రియాసారమునందు చెప్పబడినది.

అన్ని జపమాలికలలో రుద్రాక్షమాలిక మిగుల ప్రశస్తమైనదని గౌతమీస్మృతియందు చెప్పబడినది.[18]

మహర్షులందఱు రుద్రాక్షమాలికాధారులైనటుల సూతసంహిత యందు గలదు.[19]

రుద్రాక్షభేదములు — ఏకముఖి, ద్విముఖి, పంచముఖి మున్నగు విధముగా ౧౪ భేదము లిందుగలవు.

రుద్రాక్షను శిరస్సునందుంచుకొని స్నానమాచరించిన గంగా స్నానఫలమును, రుద్రాక్షకు జలాభిషేకము చేసిన లింగపూజన ఫలమును లభించునని క్రియాసారము ౧౦ ఉ నందు చెప్పబడినది.

రుద్రాక్షధారణఫలము — రుద్రాక్ష నామోచ్చారణమాత్రమున వేయి గోదానఫలము,[20] స్పర్శనదర్శనములచే నరుడు పశుత్వము వీడి ముక్తినందునని[21] చెప్పబడినది.

రుద్రాక్షముఖము రుద్రుడని, తద్బిందువులు సర్వదేవతలని కావుననే రుద్రాక్షధారణ మాత్రముననే సర్వపాపములు నశించునని క్రియాసారమునగలదు[22]. సమస్తవైదికకర్మలు భస్మ రుద్రాక్షధారులై యాచరించినచో నక్షయఫలము చేకూరును. లేనిచో ఘోరపాపము సంభవించుటయేగాక కర్మఫల రహితమగును. సర్వకాల సర్వావస్థల యందును రుద్రాక్షమును ధరింపవలసినదని స్కాందమునగలదు.[23] రుద్రాక్షపూజనఫలము లింగపూజన ఫలముతో సదృశమైనది.

శ్లో॥ అథరామ గిరౌరామః పుణ్యేగోదావరీ తటే
భూతి భూషిత సర్వాంగో రుద్రాక్షాభరణైర్యుతః[24]

అను శ్లోకము వలన శ్రీరాముడు భస్మరుద్రాక్షధారియైనటుల పద్మపురాణమునందును, విష్ణుమూర్తి భస్మరుద్రాక్షధారియై శివానుగ్రహము బడసినటుల వై. ప నందును "రుద్రాక్షమాలాభరణో జటావల్కల సంయుతః తపసాతస్య దేవస్య కేశవస్య మహాత్మనః ప్రాదురాసీన్మహాదేవశ్శంకరః కరుణానిధిః"[25] అనిగలదు. వై. ప. 4.

వసుమతి రుద్రాక్ష ధరించి వారకాంతాలోలుడగు భర్తయగు సౌమ్యవంతుని బుద్ధి మరల్పగలుగుటకు, సౌమ్యవంతుడు శత్రు సంహారుడై జయలక్ష్మిని చేకొనుటకు, వారి కుమార్తెయైన సర్వకల సభయందు చిత్ర పటాంతర్గతుడైన విష్ణుమూర్తి నంతటివానిచే 'రుద్రాక్షధారణము సర్వశ్రుతిసిద్ధము, సర్వపాపహరము' అని చెప్పించి భర్తమనసు మార్చి రుద్రాక్ష భక్తిప్రపూరితుని గావించుటకు, సుప్రతీపుడు పిల్లికూనకు రుద్రాక్షధారణ గావించి స్వర్గమునకుఁ బంపి కల్పవృక్షముఁ దెప్పించుటకు, ఒక్క రుద్రాక్ష శిరస్సున బడుటచే మహాపాపియగు జామిత్రునికి కైలాస పదవి లభించుటకును, రుద్రాక్షధారణమే మూలమని వివిధ రమణీయ కథాంశముచే సుమధుర మంజుల పదపుంజరాజిచే శాస్త్రిగారిచే సోదాహరణముగఁ జెప్పబడినది.

**మంత్రము** అవాఙ్మానసగోచరము, ముక్తిప్రదమునగునట్టి తత్త్వపరిజ్ఞానమునకు మంత్రము మూలము. మంత్రోపాసనమువలనగాని మనశ్శుద్ధి గలుగదు. మనశ్శుద్ధి గలిగినగాని పరమేశ్వర సందర్శనము సంభవింపనేరదు. కావున మంత్రోపాసన మత్యావసరము.

మంత్రమనగానేమి ?— "మననాత్త్రాయత ఇతి మంత్రమ్" అనగా మననము చేయుటవలన రక్షించునది గాన మంత్రమయ్యెను. మొత్తము మంత్రముల సంఖ్య 7 కోట్లు, కొన్ని మంత్రములు శైవములు, కొన్ని వైష్ణవములు, కొన్ని శాక్తేయములు. మంత్ర సిద్ధిచే సకలము సిద్ధించుననుటకు అథర్వణవేదము ప్రమాణము.

మంత్రము దేవతారూపమనియు, మంత్రార్థము శివుడనియు శైవసిద్ధాంత శిఖామణియందు కలదు.

"సర్వేషామేవతత్త్వానాంమూలం శివ ఇతి స్మృతంతస్మాన్మూలమితిజ్ఞేయమ్" సర్వతత్త్వములకును శివతత్త్వము మూలమైనదగుటచే శివమంత్రమునకు మూలమంత్రమను వ్యవహారము కలిగెను.

భవసాగర మగ్నానాం దేహినాం హితకామ్యయా
ప్రాహోన్నమశ్శివాయేతి మంత్రమాద్యం హరస్స్వయం

శివసాగరమగ్నుల జన్మబాధా ప్రశమనమునకై పరమేశ్వరుడే "ఓం నమశ్శివాయ" అను నీ మొదటి మంత్రమును వచియించెనని వాయవీయ సంహితయందు కలదు.

సప్తకోటి మహామంత్రములు చిత్త విభ్రమము గలుగజేయును. అందఱికి నొక్క పంచాక్షరీ మంత్రము మాత్రము మనోచాంచల్యము గలుగజేయక మోక్షము నొసంగును.[26]

పంచాక్షరీ మంత్రము పంచభూతాత్మికము. నకారాదిబీజములు పంచభూత స్వరూపములు. ఎటులన నకారము భూమి యనియు, మకారము ఉదకమనియు, శికారము అగ్నియనియు, వాకారము వాయువనియు, యకార మాకాశమనియు, మంత్ర మంతయు శివస్వరూపమని చెప్పబడినది.[27]

పంచాక్షరీ శివపదేన విభూతిరుద్రా।
ధ్యాయ స్త్రయాస్ఫురతితేన చతుర్థకాండః
కాండేన సర్వయజురేవ విభాతితేన
ఋక్సాప మధ్య మణి కాచ విభాంతివేదా! వైదిః-ప[2]

వైదికమగు నీ పంచాక్షరీ మంత్రముచేతనే వేదమున కంతయు బంగారమునకు పరిమళ మబ్బినటుల గుణాధిక్యము గలిగినదని పై శ్లోకమున జెప్పబడినది.

అన్ని విద్యలలో వేదముత్కృష్టమైనది. దానిలో నమకమును అందు పంచాక్షరియు దానియందు 'శివ' అనుమంత్రమును నుత్తమోత్తమములు.[29] పంచాక్షరీ మంత్రమునకు ముందు 'ఓం' కారము చేర్చి ఓం, న, మ, శ్శి, వా, య అని యుచ్చరించినచోనది షడక్షరీ మంత్ర మగును.

"వినాప్రణవకం మంత్రం స్త్రీశూద్రాణాంచసాధకం"

స్త్రీశూద్రాదులకు వేదాధికారమీయుగమున లేదని శాస్త్రములు నుడువుటచేతను, ఓంకారము వేదస్వరూపమగుట చేతను అధికారి భేదమునుబట్టియు ఓంకార రహితమగు పంచాక్షరియే వారికుపాస్యమని చెప్పబడినది. తారక మంత్రమేది-? "నమో వృక్షేభ్యో హరికేశేభ్యో నమస్తారాయనమః[31]

అనిశ్రుతియందు 'నమస్తారాయ' అని యీశ్వర నామమే తారకముగా సూచింపబడినది. "మంత్రాధీశాభాతి పంచాక్షరీయం" అను కాశీసారమునందలి శంకరుని వాక్యమును పంచాక్షరియే సంసార తారకమగునని యుపదేశింప బడినది.

"రామనామమస్మరణీయమా?" అని ప్రశ్నించుకొని శాస్త్రి గారిట్లు సమాధానము నిచ్చుచున్నారు. శ్లో॥ శివలింగ ప్రతిష్ఠాతావర్వా వగుణ వర్జిత"[32]

శ్రీరామచంద్రుడు సేతువునందు తనపేరున లింగమును ప్రతిష్ఠించి అగస్త్య మహర్షివలన శివగీతలువిని, సదాశివ ధ్యానము సేయు మహా శివభక్తుడు. అట్టి మహా భక్తుని నామస్మరణము బసవేశ్వర నామమువలె యున్నతగతి సౌధమునకు సోపానమగుటలో సంశయములేదు. "నాకంటె నధికులు నా భక్తవరులు" అను ప్రభులింగ లీలయందలి వచనమును, పరమేశ్వరుని కంటె భక్తులే యధికులని నిరూపించుచున్నది· వీరశైవులు 'దధీచిరామాన్' అని స్మరించుచునే యున్నారు కాన శివభక్తుడగు రాముడు బసవేశ్వరునివలె స్మరణీయుడనియే రాద్ధాంతము.

పంచాక్షరీ ప్రభావము — స్కాందమహా పురాణమున పార్వతితో పరమేశ్వరుడు పంచాక్షరీ మహాత్మ్యమును వివరింపుచు "లోకములు, వేదములు, మహర్షులు, ఈ చరాచర ప్రపంచ మంతయు పంచాక్షరీ ప్రభావముననే నిలిచియున్నవి సుమా!" అని వచించెను.

కలియుగమునందు మానవుడు పండితోత్తముడైనగాని పామరుడైనగాని, అంత్యజుడైనగాని అగ్రజుడైనగాని పంచాక్షరీ మంత్రమును జపించినగాని సమస్త శుభముల బొంది ముక్తి నొందగలడని ఈశ్వరుడు వాయు సంహితలో తెలిపెను.

అగ్ని హోత్రములుగాని, వేదత్రయముగాని, యజ్ఞముగాని పంచాక్షరి జపము యొక్క కోట్యంశము తోడను సమానములు గావు [34]

ఉపమన్యు మహర్షి పరమేశ్వరుని నుండి శైవశాస్త్ర రహస్యముల గ్రహించి బోధకుడై ప్రకాశించుటకును, వశిష్ఠ, వామదేవాది యోగీంద్రులు ముక్తకిల్బిషులై మహాతేజోవంతులగుటకును, సర్వులు విగతపాపులై మోక్షలక్ష్మిని కైవసము జేసికొనుటకు పంచాక్షరియే మూలమని, మంత్ర ప్రభావము వర్ణనాతీతమని సిద్ధాంత పంచకమున జెప్పబడినవి. సర్వకాల సర్వావస్థలయందు పరిశుద్ధుడైనను, అపరిశుద్ధుడైనను, శివనామము స్మరించు మానవుడు సిద్ధినొందగలడని 'తత్వజ్ఞ' అందు చెప్పబడినది.

మహాపాశుపతుడగు శ్రీహరిని స్మరించు చున్నానని శాస్త్రిగారు శ్రీహరిమూర్తినిట్లు కనులకు గట్టినట్లు వర్ణించుచున్నారు.

శ్లో॥ హృదంతరే శంకర తత్త్వచింతనం జిహ్వాంతరే శైవషడక్షరంచ
ఫాలప్రదేశే శివశూలచిహ్నం॥ ధరంహరింపాశుపతంస్మరామి[35]

## పంచాక్షరీ మంత్రార్థము :

**నమఃపదము అంగమనియు, లేక జీవుడనియు, శివపదము లింగమనియు, లింగాంగ సంబంధము, అయ అను పదముచే బోధింపబడి**

నది. కావున పంచాక్షరీ మంత్రము శివజీవైక్య బోధకమని తెలియుచున్నది. శివశబ్దతమగు నా పరబ్రహ్మను నమస్కార పూర్వకముగా నుపాసింపవలెనని తన్నమఇత్యుపాసీత" అని శ్రుతి బోధించుచున్నది.

దూర్వాసమహర్షిచేపంచాక్షరీ మంత్రోపదేశమంది, ఆమంత్రానుష్ఠాన బలముచే దివ్యతేజస్సునొందుటయేగాక, వారకాంతాలోలుడై అపవిత్ర దేహుడగు దాశార్హపతికి భర్గమహర్షిచే పంచాక్షరీ మంత్రోపదేశము గావించి పాపరహితుని గావించుటకును, సూర్యశర్మ వంచకుడగు మానవునిహ స్తము కనబడదు, అచేతన వృషభంబులను సైతము చేతన స్వరూపమున రప్పించి, స్నుషాసుతులను ధేనువును బ్రదికించి, ఐహిక సౌఖ్యంబు లనుభవించి యంతమునకై వల్యమందుటకును పంచాక్షరీ మంత్రానుష్ఠానమే మూలమని శాస్త్రిగారు భ క్తగాథా పురస్సరముగా నభివర్ణించిరి.

## గురులక్షణము :

శ్లో॥ గుకార స్త్వంధకారస్యా (దుకార స్తన్నిరోధకృత్
అంధకార వినాశత్వాద్గురు రిత్యభిధీయతే స్కా. ఉ. సం.37

గుకారమునకు అంధకారమని, రుకారమునకు నిరోధమని యర్థములు. అంధకార సదృశమగు అజ్ఞానమును బోగొట్టి జ్ఞానమొసగువాడగుటచే గురువని వచింపబడు చున్నాడు. షట్త్రింశత్ తత్వాతీతుడగు పరశివుడే గురురూపమున వచ్చి చెప్పకుండిన మానవులకిక తరింపులేదని సదానంద శతకమున నుడువబడినది.

"ఆచార్యదేవోభవ" అని శ్రుతి గురుగౌరవమును ప్రకటించినది శైవసిద్ధాంత శిఖామణిలో గురుపూజయే శివపూజయని వ్యవహరింపబడినది. కావున గురుదే శివుడని భావింపవలయును.

గురుయాత్ర, దేవయాత్ర, తీర్థయాత్రలను త్రివిధములగు యాత్రలలో గురుయాత్రయే యధికమైనవని శైవసిద్ధాంత శిఖామణిలో కలదు.

"గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ" అనెడి గురుస్తోత్రము సైతము గురువు త్రిమూర్త్యాత్మకుడని తెలియజెప్పుచున్నది.

## గురులక్షణము :

శ్లో॥ గురవో నిర్మలాశ్శాంతా స్సాధకో మితభాషిణః
కామక్రోధవినిర్ముక్తాస్సదాచారా జితేంద్రియాః39.

గురువు నిర్మలుడును, కపటములేనివాడును శాంతస్వభావము గలవాడును, మితభాషియు, కామక్రోధరహితుడును, సదాచారము గలవాడును, జితేంద్రియుడునై యుండవలెను. శాస్త్రజ్ఞుడు, ధీమంతుడు, తపశ్శాలి, జనవత్సలుడు, తత్త్వవేత్త, లోకాచారరతుడు, మోక్షప్రదుడునగు మహానుభావుడే గురుశబ్ద వాచ్యుడగును.

## గురుశిష్య సంబంధము :

గురుశిష్యసంప్రదాయ మనాదిసిద్ధము. గురువులేకుండ నభ్యసించినవిద్యలు, అనుష్టించిన మంత్రములు నిరర్థకములు, నిష్ఫలములు. సత్పాత్ర దానమువలె సచ్ఛిష్యుని విద్యాదానము ముక్తిప్రదమగును.

## శిష్యశబ్దార్థము :

'శాసనీయశ్శిష్యః" అనగా శిక్షింప దగినవాడు శిష్యుడని యర్థము. సత్యవాదియు, గురుభ క్తియుతుడును, దంభాహంకార రహితుడు, రాగద్వేషశూన్యుడు, శాంతుడు, సర్వజనప్రియుడు గుర్వాజ్ఞ పరిపాలకుడునగు వాడే శిష్యుడు.

గురువు శిష్యునిజ్ఞానమును, ప్రవర్తనను పరీక్షించి విద్యనొసంగుటగాని, మంత్రోపదేశము సేయుటగాని చేయ వలయును. అటులేశిష్యుడును గురులక్షణమును గురుసామర్థ్యమును విచారించుకొనియే విద్యనేర్చుకొన ప్రారంభింపవలెను.

శుభకార్యములందు, వివాహాదులయందు, మాస శివరాత్రులయందు, దక్షిణాయన ఉత్తరాయన పుణ్యకాలములయందు గ్రహణ కాలమందు, పర్వములయందు శిష్యుడు శక్తికొలది గురువు నర్చించిన చాలును. గురు కటాక్షమునకు పాత్రుడైన శిష్యుడు పాపపంకిలము నుండి ప్రక్షాళితుడగును "శరీరమర్థం ప్రాణంచ సద్గురూభ్యో నివేదయేత్" శరీరార్థ ప్రాణముల శిష్యుడుగురువునకు సమర్పింపవలెను.

పరశువేది స్పర్శవలన లోహము బంగారమగునటుల గురు కటాక్షప్రసారమున మానవుడు శివుడగుచున్నాడు.

గురువులు సద్గురులక్షణ సంపన్నులై, ద్రవ్యార్జనమే ప్రధానముగా నెంచక శిష్యహృత్తాపమును హరించువారలై యుండ వలయును

గురుశిష్యుల విషయమై మూడు న్యాయములు గలవు. 1) మార్జాల కిశోర న్యాయము. 2. మర్కట కిశోర న్యాయము. 3) భ్రమరకీట న్యాయము.

1. మార్జాల కిశోరన్యాయము– శిష్యుడు సదాచార సంపత్తిలేక దుర్వ్యసనుడై తనవద్దకు రాకయున్నచో గురువే సన్మార్గమున లాగికొనివచ్చి సముపదేశ మొసంగి జ్ఞానోపదేశము చేయవలయును.

2. మర్కట కిశోరన్యాయము ; గురువు తప్పుద్రోవలనడచిన శిష్యు దేయాతని వెంటబడి గురువుకు విజ్ఞానశక్తిని కలిగించి తాను జ్ఞానమాతనివలన నేర్చుకొనవలెను.

3. భ్రమరకీటన్యాయము : తుమ్మెద తన ఝుంకారముచే పురుగుకు తన స్వరూపము కలిగించునటుల గురువు శిష్యుని జ్ఞాన శక్తిచే తనతో సమానునిగా జేసికొని జ్ఞానముపదేశింపవలెను.

శైవసిద్ధాంత దర్శినినవలోకించి అకళింపుజేసికొనిన పాఠకున కాయాసము గలుగకుండ ఉపమన్యాది భక్తులగాథల రచించి శాస్త్రి గారు వారినుత్సాహపఱచిరి.

ఉపమన్యుడు గురువాజ్ఞ జవదాటక మెలంగి నేత్రముల బొంది దేవతాసాక్షాత్కారము నొందు, సకలశాస్త్రపారంగతుడగుటకును, దుర్వర్తన శిష్యులగు చంద్రశేఖరుని, వీరయ్యను మనస్సున శ్రమకలుగకుండ సన్మార్గమునకు లాగికొనివచ్చి కైవల్యమొందునట్లుచేయుటకును, గురువే గురూపదేశమే కారణమని రమ్యముగా నీ గ్రంథమున నిరూపింపబడినది.

ఈ గ్రంథసారాంశ మంతయు నాలుగు మాటలలో చెప్పబడినవి.

1. నిరంతరము భస్మరుద్రాక్షల ధరించి పంచాక్షరిని గాని షడక్షరిని గాని నిత్యము జపించుచు గురుబోధల విని గురువును

దైవముగా తలచి స్మరింపుము. గురు ప్రాశస్త్యమీ క్రింది సీసమున నిట్లు చెప్పబడినది.

సీ॥ కామాది విషయోరు గహనపాతికి మార్గ। సందర్శకుడు వసే
చరుడు గురుడు
అజ్ఞాన తిమిరావృతాంధ కోటికి జ్ఞాన। కాంతి ప్రదుండు
భాస్కరుడు గురుడు
ఘోర సంసృత్యకూపార మజ్జత్ప్రజా। పాణిపద్మ
ప్రోత్పప్లవము గురుడు
దారిద్ర్యదుస్సహ క్రూరమహాకుండ। లీ దుష్టులకు జాంగలికుడు
గురుడు
గీ॥ శిష్యమానసకానన సీమజాత। మోహశుష్కతృణాగ్ని
సముండు గురుడు
లోకబంధుడు మోక్షైక లోలుడఖిల। కల్మష వినాశకుండు
శంకరుడె గురుడు

ఉపదేశకాండ[42]

## పికలు

1. 4వ పేజి
2. 4వ పేజి
3. 4వ పేజి
4. 5వ పేజి
5. 5వ పేజి
6. 10వ పేజి శై. సి. ద.
7. 11వ పేజి శై. సి. ద.
8. 11వ పేజి
9. 12 వ పేజి.
10. నందా భద్రా సురభిస్సుశీలా సుమనాస్తదా ః
పంచగావశ్చివాజ్ఞాతాస్సద్యోజాతాదివక్త్రత ః
కపిలః కృష్ణధవలధూమ్ర రక్తాస్తథైవచ।
నందాదీనాంగవాంవర్ణాః క్రమేణ పరికీర్తితా :
సద్యోజాతాద్విభూతిశ్చ వామాద్భసితమేవచ।
అఘోరాద్భస్మసంజాతం పురుషాత్తారమేవచ
రక్షాచేశాన వక్త్రాచ్చ నందాది ద్వారతో భవేత్
(సి. శి. భూ) 13 వ పేజి.
11. త్రైపుండ్రితాని రచితాని లలాటపట్టే।
లుంపంతి దైవ లిఖితాని దురక్షరాణి సోమ. విభూ.
19 వ పేజి.
12. కంఠేరుద్రాక్ష మాలాంయద్ధృత్వాతు క్రియతేయది, సో రుద్రత్వమాప్నోతి (స్కాందము.)
13. 37 వ పేజి
14. అధకాలాగ్నిరుద్ర ః ప్రోవాచ రుద్రస్య నయనాదుత్పన్నోరుద్రాక్ష ఇతిలోకే ఖ్యాయతే। అధవా సదాశివస్సంహార కాలే సంహారం కృత్వా సంహారాక్షి ముకులీకరోతి। తన్నయనాజ్జాతా రుద్రాక్ష ఇతిఖ్యాయతే (రుద్రాక్షజాబాలోపనిషత్) శైవసిద్ధాంత దర్శిని 38 పేజి.
15. శ్లో॥ తదాకులం తస్యబభూవ చాక్షిం
త్రయంతతో ప్రాణ్యపతంశ్చతేభ్యః
రుద్రాక్ష వృక్షా ఇటపైర్చ భూవుశ్శివాజ్ఞయా
సర్వజగద్ధితాయ (కి. ఉ. శై. సి. ద, 39 పేజి)

16. రుద్రాక్షవృక్షాస్తపనాక్షి జాతాస్తే ద్వాదశస్యుః
కపిలాది భేదైః
చంద్రాక్షిజాష్షోడశ శుభ్రవర్ణాః కృష్ణాదశస్యుర్జ్వల
నాక్షిజాతాః
(బ్రహ్మవైవర్తపురాణం – శై. సి. ద. 39వ పేజీ)

17. శై. సి. ద. 41 వ పేజీ.

18. 'రుద్రాక్షై రనంత ఫలముచ్యతే' (గౌతమీస్మృతి, శై. సి. ద. 43వ పేజీ

19. ఋషయోమృదవస్స్వస్థాస్సర్వద్వంద్వ వివర్జితాః
రుద్రాక్షమాలాభిరణస్సిత భస్మావకుంఠనాః
సూతసంహిత. శై. సి. ద. 43వ పేజీ.

20. గవాంకోటి ప్రదానస్యయత్ఫలంభువి లభ్యతే తత్ఫలం లభతే మర్త్యోనిత్యం రుద్రాక్షధారణాత్ (కాలాగ్నిరుద్రము)

21. "దర్శనాత్స్పర్శనాచ్చైవ స్మరణాదపి పూజనాత్
రుద్రాక్షధారణా దేవ పశుత్వం వినివార్యతే" (కాలాగ్ని రుద్రము.)

22. రుద్రాక్షధారణాత్సద్యస్సర్వైపాపైః ప్రముచ్యతే
తన్ముఖం రుద్రమిత్యాహుస్తద్బిందు స్సర్వదేవతాః
(క్రియాసారము – శై. సి. ద. 49వ పేజీ)

23. గచ్ఛన్, తిష్ఠన్, స్వపన్, జాగ్రదున్మిషన్ని మిషన్నపి, శుచిర్వాప్యశుచిర్వాపి (స్కాందము.)

24. పాద్మపురాణము, శై. సి. ద. 50

25. వై. ప. 4, శై. సి. ద. 50.

26. సప్తకోటి మహామంత్రాశ్చిత్త విభ్రమకారికాః
ఏకః పంచాక్షరీ మంత్రస్సర్వేషాం మోక్షదాయకః
శై. సి. ద. 63వ పేజీ

27. నకారాదీని బీజాని పంచభూతాత్మికానిచ। నకారః పృధివీ జ్ఞేయామకారస్తోయ శికారోగ్నిరితి ప్రోక్తోవాకారోవాయు రుచ్యతే। యకారోనభ ఇత్యుక్తం మంత్రో బ్రహ్మమయ శ్శివముచ్యతే (శై. సి. ద. 63వ పేజీ)

28. వై. ది. ౧౫. శై. సి. ద. 63వ పేజీ

29. శ్లో॥ విద్యాసుశ్రుతి రుత్కృష్టా రుద్రైకాదశినీస్మృతా
తత్రపంచాక్షరీ తస్యాం శివఇత్యక్షరద్వయం. (వై.ది. ౧౫, 63వ పేజీ శై. సి. ద.)

30. శివజ్ఞానవిద్య, అధ్యా౧, శై. సి. ద. 68వ పేజీ

31. యజుస్సంహిత, శై. సి. ద. 74వ పేజీ.

32. రామాష్టోత్తరశత నామావళి, శై. సి. ద. 80వ పేజీ.

33. పంచాక్షరీ ప్రభావేన లోకావేదా మహర్షయః
తిష్ఠంతి శాశ్వతాధర్మాః జగదేతచ్చరాచరం (స్కాంద శై. సి. ద. 81వ

34. అగ్నిహోత్రాస్త్రయో వేదా, యజ్ఞాశ్చబహుదక్షిణాః
పంచాక్షర జపస్యైతే కోట్యంశేనాపినో సమాః (సిద్ధాంత పంచకం, శై. సి. ద. 83వ పేజీ)

35. స్కాంద మహాపురాణము శై.సి.ద. 84వ పేజీ

36. నమః పదం తత్తులు జీవవాచిశివః పదంతత్పరమాత్మవాచి అయేతి తాదాత్మ్యపదం తదేతన్నమశ్శివాయేతి జగాద మంత్రః శై. సి. ద. 85వ పేజీ

37. స్కా. ఉ. సం. 98వ పేజీ శై. సి. ద.

38. "గురుపూజైవ పూజాస్యాచ్ఛివస్య పరమాత్మనః"
(శైవసిద్ధాంత శిఖామణి)

గురుగీతలోకలదు. శై. సి. ద. 98వ పేజీ

40. శై. సి. ద. 120వ పేజీ

41. గురోః కటాక్షవేధేన శివోభవతి మానవః। రసవేధా ద్యథాలోహో హేమతాం ప్రతిపద్యతే ౧౭ సి ప
(శై. సి. ద. 122వ పేజీ)

42. ఉపదేశకాండ కోడూరి వేంకటాచలకవి, శై. సి. ద. 143వ పేజీ

# వి పి న వి హా రి

## శ్రీ పట్లూరి ఈశ్వరచంద్ర విద్యాసాగర్

అలసా నిలమా! అలా అలలు అలలుగా తేలిరాకు
పిచ్చిగా నీ పద పథాల వెంటబడి అర్ణవాలు దాటుతాను.
ఈ పచ్చిక మైదానం మీద తొలి ఉషస్సు పరుచుకుంది.
చెల్లా చెదురైన శీతల రస బిందువుల్ని కూర్చి
అజంతా ఎలోరాల్ని పేర్చుకోని
తరతరాల చరిత్రకు చెదరని ప్రతీకలు!
ఆ పర్వతాల నంటురితనంతో స్నేహం కట్టి
నదీజల నినాదాల్లో స్నానం చేస్తాను
చెదల చెక్కిలి మీద సిగ్గుల సింధూరం!
ఝుమ్మని పూసిన పూపొదలు
పువ్వులకై రెక్కలు దించిన తుమ్మెదలు,
ఎగిరే విహంగాలు, కదిలే మేఘాలు,
చెదిరే తరంగాలు;
ఈ ప్రకృతి రమ్యకుడ్యాల మీద
హాయ్! ఎన్ని మోనాలిసాలు!
ఏయ్! ఆమని అందాల రాణి! కోయిలా
తలిరుల సందుల్లోంచి
అలవోకగా అమృత భాండాన్ని వొంచి
అనంతమైన శూన్యంలోకి అంతర్ధానంకాకు.
ఇక యిక్కడ యీ ప్రకృతిలో లీనంకాక
వంటరిగా మరోక్షణాన్ని భరించలేని నేను
ఈ అడవిలో వెదురులా పుట్టి
వేణువునై పోతాను.



# అహాన్ని చూపించే అద్దం

## శ్రీ మద్దూరు శ్రీనివాసులు

అద్దం
ఆడపిల్ల జీవితంలా సున్నితమైందీ
క్రిందపడ్తే ముక్కలౌతుందీ....అని
చెప్పినా వినకుండా
కావాలనే పగులగొట్టేసి
గర్వంగా నవ్వేవాణ్ణి.
ఓరోజు
ఆ అద్దం ముక్కే
నా అరికాలి గుండెల్లో గుచ్చుకునేసరికి
తెలిసొచ్చింది
జీవితమంటే ఏంటో.
అప్పట్నుంచీ
అద్దం
నా ముఖాన్ని చూపించే ముందు
నా అహాన్ని అసహ్యంగా చూపిస్తూంటుంది.

శ్రీ ఎ. విజయదత్తాత్రేయశర్మ

# శ్రీకాకుళం జిల్లా గ్రామనామములు ఒక పరిశీలన

(గతసంచిక తరువాయి)

## సంస్థానములు - జమిందారీలు

### జయపురం

నేడు ఒరిస్సా రాష్ట్రాంతర్భాగమైన జయపుర సంస్థానం 15–18 శ॥ కాలంలో ఈ ప్రాంతముపై ఆధిపత్యం కలిగిఉండేది. నాటి కేంద్రపట్టణ నామమునుబట్టి జయపురం (పాల&టె) గ్రామ నామములేర్పడినవి. జయపురపాలకులలో భైరవదేవ(1510–1527); హరిదేవ (1669–1672), ముచ్వురుబలరామదేవులు (I-1571–97, II 1684–86, III-1711–13), వీరవిక్రమదేవ (1637–1669), ముగ్గురు విక్రమదేవులు (I-1758–81, II-1825–60, III-1875–1920), విశ్వనాథదేవులుగా వ్యవహృతులైన ఇరువురు విశ్వంభర దేవులు (I-1527–71, II-1672–76), నల్గురు రామచంద్రదేవులు (I-1708–11, II-1781–1825, III-1860–1889, IV-1893–1931)ఉన్నారు. వారిపరంగా భైరిపుర (సొం & ఇ), బలరామపురం (పా), విక్రమపురం (సొం&టె&పాల), విశ్వనాథపురం(న), ప్రతాప విశ్వనాథపురం (టె) రామచంద్రపురం (శ్రీ) గ్రామనామములేర్పడినవి.[73]

### టెక్కలి

"పదకొండవ శతాబ్దములో శైలోద్భవ వంశీయపురాజు, తన కుమార్తెయగు కస్తూరికామోదిని, దక్షిణ కళింగాధిపతియగు గంగవంశపు యనంతవర్మ చోడగంగతో వివాహముచేసెను. కన్యాదాన సమయమున విజిత దక్షిణదేశమును 'టికిలి' స్వరూపముగా దానము చేసెను. అది లగాయతు యీ రాజ్యమునకు టికిలియని పేరుగలిగినది."[74] కాలక్రమమున 'టికిలి' 'టెక్కలి' అయినదన్నమాట.

టెక్కలిరాజులకు గోపాలస్వామి యిష్టదైవతము. వారిలో గోపాలదేవుడు (16శ॥ ఉత్తరార్ధం) ప్రముఖుడు. దండుగోపాలపురం, గోపాలదొరవూరు, గోపాలపురం, మజ్జిగోపాలపురం (అన్నిటి) గ్రామములు ఆదేవునిపేరునగాని, ఆ రాజుపేరునగాని ఏర్పడినట్టివి. టెక్కలి పాలకుల వైష్ణవమతాభిమాన సూచికములా అన్నట్లు గోపవల్లభపురం, హరిదాసపురం, బృందావనం(టె) గ్రామనామములై ఉన్నవి. పర్లా పాలకుడు నరసింహదేవుని వలన వీరు 'జగద్దేవ' బిరుదాన్ని పొందారు. కొత్తజగద్దేవపురం, పాతజగద్దేవపురం (టె) ఆ బిరుద సూచికంగా ఉన్నవి. టెక్కలి పాలకులలోగల నరసింహనామధేయులను బట్టి నరసీపురం, నరసింగపల్లి, నరసాపురం (టె) ఏర్పడినవిగా తోచును. టెక్కలి పాలకులైన జయకృష్ణ, శివరామ, నీలకంఠ, పురుషోత్తమ, పద్మనాభ, వీరభద్ర, లక్ష్మీనారాయణ, నారాయణ, మధుసూదన, రఘునాథ, జగన్నాథ, రామకృష్ణ, రాజగోపాలుర పేర్ల ననుసరించియే టెక్కలి తాలూకాలో కృష్ణరాయపురం, కృష్ణాపురం, శివరాంపురం, నవరనీలాపురం, తోటనీలాపురం, పురుషోత్తపురం, పద్మనాభపురం, పద్మాపురం, వీరభద్రాపురం, పెద్ద లక్ష్మీపురం, పెద్ద నారాయణపురం, నారాయణపురం, రఘునాధపురం, వీరరఘునాధపురం, ఆకులరఘునాధపురం, రఘునాథపురం, (టెక్కలి) సుంకర జగన్నాధపురం, పూడి జగన్నాథపురం, రామకృష్ణాపురం, ఉద్దానం రామకృష్ణాపురం, వీర రామకృష్ణాపురం, రాజగోపాలపురం గ్రామనామము లేర్పడినవిగా తోచును.

లక్ష్మీనారాయణపురం, నారాయణపురం, నరసింగపురం, పద్మనాభపురం, పురుషోత్తమపురం, రఘునాథపురం, రామకృష్ణాపురం, (అన్నీసొం) గోపాలపురం, పురుషోత్తమపురం, రామకృష్ణాపురం శేఖరపురం, శివరాంపురం, (అన్నీపా) గోపాలపెంట, నరసింగుపల్లి (న) గ్రామనామములుకూడ పైనచెప్పబడిన టెక్కలిరాజుల పేర్ల పరంగా ఏర్పడినట్లున్నవి.

మదనాపురము (టెక్కలి)లకా నామము టెక్కలి రాజులలో 'మంగరాజు' బిరుదము బడసిన మీనకేతనునివలనగాని అతని మను మడు అనంగుని వలన గాని వచ్చియుండ వచ్చును.

11వ శ॥నందు టెక్కలి ప్రాంతమును పాలించిన పద్మ చంద్రుని రాజధాని బిజయపూల్ నేటి బెజ్జిపల్లి (టె)తో పోల్చబ మైనది.[75]

## కోటబొమ్మాళి (స)

టెక్కలి రాజులలో నొకడగు వనమాలి దన పేరిట గ్రామ మును నిర్మించెను. "అది 'వనమాలికోట' యనబడి కాలక్రమ మున 'గోట వనమాలి' యయ్యెను. వకారముత్కళ భాషలో బకారమగును గాన, వనమాలి బనమాలియయి, యుచ్చారణ సౌలభ్యార్థము 'బొమ్మాళి' యయ్యెను."[76] ఇది కోటబొమ్మాళి గ్రామ నామ చరిత్ర.

## సంతబొమ్మాళి (టె)

ఈ బొమ్మాళి నిర్మాతకూడ వనమాలియే. ఈ గ్రామం వర్తక వ్యాపారాలకు కేంద్రమైన 'సంత' జరిగేదిగా ఉండేది కావడంచేత 'సంత' బొమ్మాళి అని పేరు తెచ్చుకున్నది.[77]

## తిర్లంగి (టె)

"చంద్రశేఖరుడు (వనమాలి దాయాది, ప్రత్యర్థి) వనమాలి తన జోలికి రాకుండ బొమ్మాళి రాజ్యమునకు దన రాజ్యమునకు సరి హద్దులలో నొక గ్రామమున త్రిలింగ దేశపు సర్దారుని గాపు పెట్టెను. ఆగ్రామమిప్పుడు తిర్లంగియని వ్యవహరింపబడుచున్నది"[78] కాని, వనమాలి – చంద్రశేఖరుల కాలమునకు చాలమునుపే తిర్లింగి గ్రామనామము శాసనములలో కానవచ్చుచున్నది.[79]

## రఘునాథపురం (టెక్కలి)

18వ శ॥ ఉత్తరార్థమున టెక్కలి పాలకుడు రఘునాథుడు "అతడు తన పేరిట నొక గ్రామమును చిరస్మరణీయార్థము నిర్మిం చెను. అదియే 'రఘునాథపుర' మని ప్రకీర్తిత మగుచున్నది. క్రీ. శ. 1747న రఘునాథపుర ప్రతిష్ఠ మహావైభవముతో జరిగెనని రఘునాథజగద్దేవుని స్వీయచరిత్ర వక్కాణించు చున్నందున నిప్పటి టెక్కలి రఘునాథపుర జన్మదినములవియై యుండవచ్చునని చరిత్రా న్వేషకుల దృష్టి కొక నివ్యపథము స్ఫురించుచున్నది."[80]

# సంస్థానములు - జమిందారీలు

## జయపురం

నేడు ఒరిస్సారాష్ట్రాంతర్భాగమైఉన్న జయపుర సంస్థానం 15-18 శతాబ్దాల మధ్యకాలంలో ఈ ప్రాంతముపై ఆధిపత్యంకలిగి ఉండేది పాలకొండ, సాలూరు, మేరంగి ఇత్యాది చిన్న సంస్థానము లన్నియు జయపురం వారివలన రూపుదాల్చినవే. 'జయపురం' ఆకాల మున కేంద్రపట్టణము కాబట్టి ఆపేరున గ్రామములు టెక్కలి, పాల కొండ తాలూకాలలో కూడవెలసినవి.

ఇచ్ఛాపురం, సోంపేటతాలూకాలలోని హరిపురములు జయపుర పాలకుడు హరిదేవు (1669-1672) పేరవెలసినవి. అతని పూర్వీకుడు భైరవదేవు[104] (1510 - 1527) పేరున సోంపేట, ఇచ్ఛాపురం తాలూకాలలో భైరిపురములు గలవు. పాతపట్నం తాలూకాలోని బలరాంపురం జయపురాధీశులైన ముగ్గురు బలరామ దేవులలో (బలరామ I-1571-1597, రెండవబలరామదేవు 1684 - 1686, మూడవ బలరామదేవు 1711-1713) నెవరిపేరున ఏర్పడినదో ? జయపుర పాలకులలో వీర విక్రమదేవు (1637-1669) మొదటి విక్రమదేవు (1758-1781), రెండవ విక్రమదేవు (1825-1860), మూడవ విక్రమదేవు (1875 - 1920) గలరు. విక్రమపురములు సోంపేట, టెక్కలి, పాలకొండ తాలూకాలలోనున్నవి. జయపుర విశ్వంభరదేవు (1527-1571), రెండవ విశ్వంభరదేవు (1672-1676) ప్రఖ్యాతులు. వీరు విశ్వనాథదేవులనికూడ వ్యవహృతులు. ప్రతాపవిశ్వనాథపురం టెక్కలితాలూకాలోను, విశ్వనాథపురం నర సన్నపేట తాలూకాలో వున్నవి. జయపురేశ్వరులలో నలుగురు రామ చంద్ర నామధేయులున్నారు. (I-1708-11, II-1781-1825, III 1860-1889, IV-1893-1931), శ్రీకాకుళం తాలూకాలో రెండు రామచంద్రపురములున్నవి. వీరరామచంద్రపురం(సోం), సామంత రామచంద్రపురం(సోం), బేరిరామచంద్రపురం (సోం), జయరామ చంద్రపురం(టె) దొడ్లరామచంద్రపురం(టె), బురదరామచంద్రపురం (పాత) తూముకొండరామచంద్రపురం (పాత) మొ॥ ఈ జిల్లాలో రామ చంద్రపురములు పుష్కలముగా నున్నవి.వీటిలో అన్నీ జయపురరాజుల పేరుననేగాక కొన్ని శ్రీరామచంద్రుని పరంగా నేర్పడినవి కావచ్చును. అది యటుగాక, ఈ ప్రాంతంలోని చిన్నసంస్థానములు జయపురం వారిచే నేర్పరుచబడినవికావున పాలకులపేరును ఆయాసంస్థానాధీశులు తమవంశాలలో నిలుపుకొనడము జరిగినది. ఉ॥ దా॥ పార్వతీపుర పాల కులలో విశ్వంభరదాట్రాజు, సాలూరు పాలకులలో రామచంద్రరాజు మొ॥ పైనపేర్కొనిన వాటిలో సామంత రామచంద్రపురం(సోం), గ్రామ నామం ఈ విషయాన్ని మరింతగా ధృవీకరించుచున్నది.

## పార్వతీపురం

"శ్రీ బెలగాం పురీక్షితి నాథునకు జమీ దెచ్చియిచ్చిన మంత్రి ధీరు(" నిగా తాడూరి కృష్ణశాస్త్రి విరచిత గౌతమీ మహాత్మ్యమున ఎన్నబడిన పాత్రేరు అప్పల పట్నాయకు పార్వతీపుర పాలకుడు విశ్వంభరధాత్రాజు (19శ॥) మంత్రి.[81] ఈతని పేరున కొబోలు అప్పల పట్నాయకునిపేట (పాల) గ్రామము రూపెత్తినది.

## పోరాము

ఈ సంస్థానం జయపుర మొదటి విశ్వంభరు (1672-76)నిచే పాయకరావు అనే బిరుదముతో 'దీనబంధు' అను వానికీయబడినది. దీనబంధుపురములు (టె&పా) అతని పేరు మీదగ వచ్చినవై యుండును.

## పాలకొండ

"జయపురరాజుగారగు విశ్వంభర దేవుగారీయనను "నరేంద్ర నాయుడను" బిరుదముతో పాలకొండకు జమిందారుగ జేసిరి. పిమ్మట ఈ బిరుదు 'నరేంద్రరావు' అని మార్చబడినది."[82] పాలకొండ పాలకుల బిరుదును స్ఫురింపజేసే నరేంద్రపురములు (శ్రీ&టె&పాలశ్రీ) గలవు. మొండెముకొల్లాం అడవులలో పాలకొండ పితూరీదారుల నెదిరించిన తెల్లదుమ్మ మొఖాసాదారు సంతోషరాయని[83] పేర 'సంతోష పురము' (పా&టె) నేర్పడినట్లుతోచును.

పాలకొండ సాహిత్య పరిభాషలో 'క్షీరగిరి' యైనది. "క్షామం బన్నది లేదు క్షీరగిరి దేశబందు నెందేనియున్" అని పొగిడిన అడిదము సూరకవి (1720-1785)యే "దాజీమీయరు పాలకొండపురిలో దాక్షిణ్యశూన్యత్వమీ ఫాజీ పట్టణమేల వచ్చితిని" అని వాపోవడమూ జరిగినది.[84] 'పాలకొండ ధరణీ సామ్రాజ్యధౌరేయులై' ప్రవర్తిల్లిన 'బంచముల్' అని సూరకవిచేత తెగనాడబడిన వారిలోని వారైన వెంకుపాత్ర, క్రిష్ణాపాత్రులు, వెంకంపేట, క్రిష్ణంవలస (పాల) గ్రామనామ కామకులై యుందురాయనిపించును.

18వ శ॥లో పాలకొండ పాలకుడైన రామభద్రరాజు పేరున తూర్పు రామభద్రరాజుపేట, తోటకొరదరి రామభద్రరాజుపేట అను అయ్యవారిపేట (పాల) గ్రామనామము లేర్పడినవి. 18వ శ॥ చివరిలో తూర్పు ఇండియా వర్తక సంఘ ప్రభుత్వముపై పితూరీ జరిపిన పాలకొండ పాలకుడు విజయరామరాజు. అతని కుమారుడు వారసుడు సీతారామరాజు. వారిపేర్లమీదుగా విజయారాంపురం, పాలమెట్ట విజయరాంపురం, సీతారామరాజుపేట, రామరాజుపేట (అన్నిపాల) గ్రామములు రూపెత్తి యుండును.[85] సీతారామరాజు సోదరుడు వారసుడు వెంకటపతిరాజు (1791-1828) పేర వెంకటపతిరాజుపేట, ఉసిరికావలస వెంకటపతిరాజుపేట, అతని దివాను ఎల్లు మహంతి పరుశురామ పాత్రునిపేర పరశురాంపురం, మరియొక దివాను జగన్నాధ పాత్రుని పేర జగన్నాధపురము, జగన్నాధవలస, మొఖాసాదారుడు వెంకటరాయుని పేర వెంకట రాయుని అగ్రహారం, వెంకటరాయుడుపేట (అన్నిపాల) గ్రామములు రూపెత్తినవిగా తోచును.

## బొబ్బిలి

బొబ్బిలి పాలకులు 'రంగరాయ' బిరుదాంకితులు. గోపాలక్రిష్ణ రంగరాయలు చరిత్ర ప్రసిద్ధిపొందిన బొబ్బిలియుద్ధ (క్రీ.శ. 1857) వీరుడు. అతని కుమారుడు వారసుడు గోపాలవెంకటరంగారావు. రంగరాయపురం, గోపాలక్రిష్ణ రంగరాయపురం, వెంకటరంగరాయపురం (పాల) వీరి మూలమున వెలసినవై యున్నవి. రాజారాయ(డప్ప రంగారాయల (1790-1830) అల్లుడు రామరాయలు పాలకొండ తాలూకాలోని ఉంగరాడ, మంతెన ఎస్టేటుదారు(డు. అతని పేర రామరాయపురం. అతని భార్య సీతయమ్మ పేర సీతాదేవిపురం (పాల) గ్రామములున్నవి.

## మందసా

'రాజమణి' అనునది మందసారాజుల నామాంత్య పదము. గుడారాజమణిపురం, మందసా సంస్థానము విస్తరించుకొని యుండిన సోంపేట తాలూకాలో కలదు. సోంపేట తాలూకాలోనిదే అయిన వాసుదేవపురం మందసారాజు వాసుదేవ రాజమణి రాజదేవు వలన ఏర్పడినది కవచ్చును.

## విజయనగరం

కళింగాంధ్రములోని సంస్థానములన్నింటిలో తలమానిక మైనట. బొబ్బిలియుద్ధ వీరుడు పెద్ద విజయరామరాజు (1708-1757), పద్మనాభ యుద్ధవీరుడు చిన్న విజయరామరాజు (1748-1794) ప్రఖ్యాతులు. విజయరామ నామధేయులు పాలకొండ జమిందారులలోనూ ఉండుటనుబట్టి ఆ తాలూకాలోని విజయరామపురములు వారి పేరనే వెలసినవని భావించినప్పటికీ, శ్రీకాకుళం తాలూకాలోని విజయరాంపురం విజయనగర విజయరామరాజుల నామ(పేరకముగా ఏర్పడినదని భావించవచ్చును. మొదటి ఆనందరాజు (1671-1717), ఆనందరాజు (1732-1760) లలో నెవరిపేరుననైన ఆనందపురములు (శ్రీ&న&టె&చీ) నేర్పడి ఉండవచ్చును. పూసపాటి వారి 'గజపతి' బిరుద పరంగా గజపతి నగరములు (న&పా) ఉన్నవి. నారాయణ గజపతి రాజపురములు (2చీ) పూసపాటి నారాయణగజపతి (1786-1845)

పేరున నేర్పడినవి. కళింగ విజయనగర రాజుల సేనాధిపతులుగా నుండిన కమ్మదొరలలో నొకడైన వెలిసేటి మల్లికార్జునదొర బాటు పల్లి (చీ) గ్రామాన్ని నిర్మించినట్లు కాళ్ళకూరి గోపీకాంతకవి రచించిన 'ధర్మనందన విలాసం' వలన తెలియవస్తోంది.[86] తిరుపతిపాలెం (చీ) నాటి కమ్మదొరలలో నొకడైన తిరుపతి దొరపేరున వెలసినట్లు తోచును.

## ముస్లిం పాలనా ప్రభావము

16-18శ॥ మధ్యకాలంలో ఈ ప్రాంతంపై ముస్లిం అధికారం సాగినది. గోలకొండ సుల్తాన్ కులీకుతుబ్‌షా (1512-1543) పట్టు కొనిన కోటలలో శ్రీకాకుళమొకటి. 1652-87 సం॥ల కాలములో కుతుబ్‌షాహీం ప్రతినిధులైన ఫౌజ్‌దారుల పాలనలో 'చికాకోల్' ఒక 'సర్కార్' నకు కేంద్రస్థానం. "శిస్తులు వసూలుచేసి ధనవు మూటలశిఖలు ఇక్కడ కోయుచుండుటచే 'శిఖాఖోల్' గను తరువాత చికాకోల్‌గా భ్రష్టంఅయిందని చెప్తారు. దక్కను సుబేదారులు ఇచట వారి ప్రతినిధులనే పేరుతో సామంత ప్రభువులకు పంపే ఫర్మానాలపై వేయబడిన శిఖ (లక్కసీలులను)ఖోల్ తెరిచి బటువాడా చేయుటచే శిఖాఖోల్ నామము ముసల్మాను పాలకులు కల్పించినట్లు పెద్దలు చెప్తుతారు. సిక్కా (నాణెము) ఖోల్ (తెరిచే) ప్రదేశం అని కూడా చెప్తుతారు. శిఖాఖోల్ క్రమంగా శికాకోళము, శికాకుళము, శ్రీకా కుళంగా మారినట్లు అంటారు."[87] 'శిఖాఖోల్' క్రమంగా శ్రీకా కుళము అను శిష్టరూపం సంతరించు కొనినదని ఎంచుటకన్న 'శ్రీకళింగ' పదము శ్రీకాకుళముగా మారినదనుట సమంజసమనిపించును. ఆంధ్ర మహావిష్ణువు స్థానమైన 'శ్రీకాకుళం' పేరుకూడ నా కళింగములోని గ్రామమునకు వచ్చియుండవచ్చును. కోటీశ్వరాలయ ముండుటచే పూర్వము నీ గ్రామమునకు కోటీశ్వరాగ్రహారమని వాడుకకూడ యుండినది. ఏదిఏమైనా, ముస్లిం పాలనా ప్రభావమువలన ఆంగ్లేయుల కాలంలోనే కాక నేటికీ శ్రీకాకుళమును 'చికాకోల్'గా వ్యవహరించడం (వాడుకలో) జరుగుచుండుట గమనించదగిన విషయం.

1687 - 1724 సం॥లలో మొఘల్‌ఫౌజుదారుల పాలనలో 'చికాకోల్ సర్కార్' ఉండినది. 1724 సం॥ నుంచి ఈ ప్రాంతం ఫ్రెంచివారికి దఖలు పడేంతవరకు ఆసఫ్‌జాహి (నిజామ్) ప్రతినిధు లుగా ఫౌజుదారులు ఏలిరి. ఫౌజ్‌దారులలో ప్రముఖుడైన షేర్ మహమ్మద్‌ఖాన్ (1652 సం॥) పేర షర్ మహమ్మద్‌పురం (చీ) గ్రామం ఉన్నది. అట్లే జఫర్‌అలీ (1749 సం॥), ఇబ్రహీంఖాన్ (1754 సం॥)ల పేరిట జఫర్‌బాదా (ద్) (శ్రీ), ఇబ్రహీంబాదా (చీ) ఏర్పడినవి. ఫకీర్‌టేకియా, ఫాజుల్‌బేగ్ పేట, కాశింవలస, కాశిం వలస పేట, రసూల్‌పేట, నిజామాబాదా, తురకపేట (అన్నీశ్రీ), అమీన్‌సాహెబ్ పేట (ఇ), మహమ్మద్‌పురం, మొహిసుద్దీన్‌పురం, రహిమాన్‌పురం (న), మొఘలాయ్‌పేట, మహల్‌పాడా, తురక శాసనం[88] (సొం), హుకుంపేట, తురకలకోట (బె), రసూల్‌పేట, బేగంపేట, హుస్సేన్‌పురం (పా), ఆలీఖాయుడుపేట, మసీదు అగ్ర హారం, షాపురం (చీ) గ్రామనామములు ఈ ప్రాంతంపై రెండు శతాబ్దులకాలంపాటు సాగిన ముస్లింపాలనా ప్రభావమును తెలియ జేసేవిగా ఉన్నవి.

"మహమ్మదీయులు పాత టెక్కలిని స్వాధీనపఱచుకొని, యచట దురకలకోటను గట్టి (ప్రస్తుతపు తురకలకోట) యందు నివ సించిరి. కోట బొమ్మాళికి సమీపమున అగ్బర్‌పూరను (ప్రస్తుతపు అక్కవరం) గ్రామమును సృష్టించి యందును కొందఱు నివసించిరి."[89]

అన్నితావులా అగ్బర్ పూర్ లు అక్కవరములుకాలేదు. కొన్నితావుల పాతపేరు వదలక నిలుచుటయో, లేక క్రొత్తపేరుతో జతకలిసి సహజీవనము చేయుటయో జరిగినది. అందులకుదాహరణ ముగ తురకపేట మూల సౌలాపురం (శ్రీ), సీతారాంపురం అను తురకపేట (శ్రీ) గ్రామనామములను పేర్కొనవచ్చును.

పాశ్చాత్యుల పాలనకూడ నీ ప్రాంతమున బహుకాలము సాగినను, ఫాక్స్‌దొర పేట, స్కాట్‌పేట (శ్రీ) అను రెండు గ్రామ నామములే ఆ ప్రభావసూచికముగా కానవచ్చుచున్నవి. ఎల్విన్‌పేట ఇప్పుడు పితాని (సొం) అని వ్యవహరింపబడుచున్నది.[90]

## అను

కొందరు వ్యక్తులకు వలెనే ఈ జిల్లాలోని కొన్ని గ్రామాలకు బహునామధేయములుండుట ప్రత్యేకముగా గమనించదగిన విషయ విశేషం. ఇందుకు కారణములుకూడా బహు విధములు. ఇచ్ఛాపుర మునకు బెల్లుపాడ అని మరియొక పేరు ఉన్నను[91] నేడది పూర్తిగ మరుగునపడిపోయినది. కొన్ని సందర్భములలో అట్లుగాక క్రొత్త పేరువచ్చిననూ పాతపేరు వదలకుండా ఉంటుంది. అప్పుడే ఈ 'అను' (alias) అవసరమవుతుంది. ఈ సందర్భంలో సాధార ణంగా 'అను' తరువాతవచ్చు నామమునే పూర్వనామముగా భావించ దానికి వీలుంది. ఉ॥దా॥ టెక్కలి తాలూకాలోని చింతామణి అను నువ్వుగుడ్డి. చింతామణి నిర్మాత టెక్కలి ప్రభువు చంద్రశేఖర జగద్దేవు 17వ శతాబ్దికి చెందినవాడు. 'నువ్వుగుడ్డి' అనుచోటనతడు 'చింతామణి' యను కోటను గట్టుటచే నువ్వుగుడ్డికి ముందు చింతా మణి యను పేరు వచ్చిచేరినది. ఒకే ఊరుకు నాలుగుపేర్లుండిన సందర్భములుకూడ లేకపోలేదు. శ్రీనివాసాచార్యులనే వారు తమ కుమార్తె వేణమ్మకు అరణముగా నిచ్చిన గ్రామము సబ్‌రిజిష్ట్రార్ వారి లెక్కలలో 'పాండ్రంగి శ్రీనివాసాచార్యులుపేట ఉరఫ్ వేణమ్మ

పేట' అని ఉండగా పంచాయితీ రికార్డులలో శ్రీనివాసాచార్యులపేట అని ఉందిట. ఈ వేణమ్మపేట ప్రజలనోళ్ళలోబడి 'యానాంపేట'గా మారిందనికూడా వ్రాస్తున్నారు[92] గాని ఈ పరిశీలనను ప్రమాణంగా తీసుకొన్న గణాంక జాబితాలో శ్రీనివాసాచార్యులపేట (శ్రీ) అనే ఉన్నది ఈ జిల్లాలో రెండు పేర్లుగల ఒకే ఊర్లు లెక్కకు ఇరవైకి పైగానే ఉన్నవి. అవి : భైరవానిపేట అను జగన్నాథపురం, బుడితిపేట అను గొడికొర, హరిశ్చంద్రపురం అను సుబ్రహ్మణ్యపురం, జగన్నాధపురం అను సోమిడివలస, లక్ష్మీపురం అను ముష్టిఅగ్రహారం, మునగన్నఅగ్రహారం అను మునగెన్నపాడు, సీతారామపురం అను తురకపేట. సుమంతపురం అను పొడుగుపాడు (అన్నీ శ్రీ ); చిల్లిదాసపురం అను శాపనం, లక్ష్మీదేవిపేట అను నువ్వులరేవు, మాకవరం అను మాకయ్యవలస, పల్లిఊరు అను సంగరువానిపేట, పిట్టసరాయి అను వాసుదేవపురం, వేణుగోపాలపురం అను జాడుపూడి, వీరరఘునాధపురం అను గంగధారపేట(అన్నీ టె) లక్ష్మీపేట అను లచ్చంపేట, లచ్చయ్యపేట అను సీతాదేవిపురం, కోటవాడదరి రామభద్రరాజుపేట అను అయ్యవారిపేట (అన్నీపా) ఫాసి అను గంగుపేట(పా), దల్లిపేట అను దొంకపల్లి (చీ), మాకివలస అను శ్రీరామక్షేత్రం (న).

## కోటలు-పాకలు

'కోట' అను నామ్యాంతమున గల గ్రామాలన్నింటా కోట లుండినవనిగాని, 'పాక' పేరు చివరనగల ఊర్లలో పాకలుమాత్రమే ఉంటవనిగాని నిర్ణయించలేము. ఈ జిల్లాలో కోటలు ఎక్కువే: కొత్తకోట (శ్రీ & పాల & చీ), పెద్దకోట, కొర్లకోట (శ్రీ), జలాంతరకోట, కుంతికోట, నవగడ (సొం), నౌగడ, మీనాకోట, జంపరకోట(పాల), భరణికోట, మరాడి(రి)కోట, సారవకోట(పా), రెంటికోట, తార్లకోట(టె). "పాక తాటాకుపాకగాదు. పాక, పాక్, పాక్కం స్థలవాచకము కేల్పాక్ అనగా అర్థం సముద్రతీరము. మన ప్రాంతాల పాకప్రాచుర్యం తమిళ చోళులనుండి వచ్చెననుట సరిగాదు. రేనాడు తెలుగు చోళులనాటికే పాకస్థలవాచకము."[93] ఈ జిల్లాలో పాకట ఉ॥దా॥ దొంపాక (శ్రీ), మురపాక (చీ).

## వలసలు

పొరుగుననున్న విశాఖ, విజయనగరం జిల్లాలలోవలెనే ఈ జిల్లాలోకూడా 'వలసలు' విశేషముగా శతసంఖ్యకు దాపున ఉన్నవి. అవి ప్రధానముగా వ్యక్తుల పేర్లనుబట్టి, స్థానికంగా లభించే పాడి పంటలనుబట్టి ఏర్పడినట్టివిగా వర్గీకరించవచ్చును. ఉ॥దా॥ పాత్రునివలస, వెదుళ్ళవలస (శ్రీ), చిన్నయ్యవలస, చేనులవలస (న), దాలెంరాజువలస, రావివలస(చీ), పాత్రునివలస, పాకివలస(టె), దాసరి రామినాయుడువలస, మద్దివలస, నాయిలోళ్ళవలస (పా).

## జాతి, కుల, వృత్తి, సంబంధములు

ఏదోఒక జాతి, కుల, వృత్తులకు చెందినవారు తొలుత నివసించుటను బట్టియో, లేక వారిసంఖ్య గణనీయమైనవిగానుండుటను బట్టియో కొన్ని గ్రామములకు తత్సూచనాపూర్వక నామములేర్పడినట్లు తోచును. ఉ॥దా॥ గుజరాతిపేట, జంగాలవలస, సాలివాడ, సింధువాడ(శ్రీ); గొల్లగంది(ఇ); గొల్లవలస, రావులవలస, రెల్లివలస, తెలగవలస(న); గొల్లలపాలెం, గొల్లూరు(సొం): బంటుకొత్తూరు, భట్టపాడు, బ్రాహ్మణ తెరాల, చాకిపల్లి, కంబరిగాం, కాపుగోదవలస, కోమటూరు, రౌతుపురం, వడ్డితాండ్ర(టె), కోదులవీరఘట్టం, సవర గొంది. గొల్లవలస, జంగాలపాడు, జాత్రికోదులగుమడ, కుమ్మరి గుంట, రాజులగుమడ, మహాజనంవారిపేట[94](పాల), శాలిపేట, కుమ్మరిగుంట, మజ్జిగూడెం, మాలపేట, రెల్లివలస, సానిపాలెం, రౌతుపురం, ఉప్పరజుమ్మి(పా), బోయిపాలెం, గొండుపాలెం (చీ). ఈ జిల్లాలోగల ఏజెన్సీ (మన్యం) ప్రాంతం ఉన్నది. సవరలువంటి గిరిజనులు గణనీయమైన సంఖ్యలో వున్నారు. వారి గ్రామనామములకు ముందు 'సవర' విశేషణం సహజంగా ఏర్పడినది. ఉ॥దా॥ సవర కొత్తూరు, సవరలింగాపురం, సవరనీలాపురం, సవరపేట, సవరరామక్రిష్ణాపురం, సవరసోమనాధపురం (టె), సవరగొంది (పాల), సవర బొంతు, సవర చీపురుపల్లి, సవర వలస,[95] సవరగుడ, సవరశేఖర పురం, సవరసిద్ధి మడుగు (పా)

## వృక్ష, జంతు సంబంధములు

శ్రీకాకుళంలో నివ (కదంబ) గాం (పా) గార (శ్రీ), పలాశ ( ) వంటివి చెట్ల పేర్లుగా గుర్తించబడినవి.[96] మరికొన్ని ఉ॥దా॥ ఆముదాలవలస, కానుగులవలస, మట్టివలస, మట్టిపాడు, మునగ వలస, రావివలస, మోదుగవలస (శ్రీ); తులసిగాం (ఇ) కంబకాయ, జిల్లేడువలస, కాకరపల్లి, మామిడివలస (న); మామిడిమెట్టు, నువ్వు గాం (సొం), బొప్పాయిపాడు, చీపుర్లపాడు, చింతలగార, జొన్నలపాడు, కందులగూడెం (టె); జిల్లేడుపూడి, భూర్జ, బూరుగ, గరిక పాడు, మొదుగులపేట, వెలగవాడ (పాల); నేరడిగుడ, నిమ్మలపాడు, పువ్వులకొండ, రేగులపాడు (పా) గోరింట, వెలగాడ, తోట పాలెం (చీ).

దోమలపల్లి (శ్రీ), దుప్పలపాడు (న) బొతుపురం (టె), పోతులూరు (టె), ఏనుగుపేట (పాల), గేదెలపేట (పాల). పులిబండ, పులిపుట్టి (పా), ఆబోతులపేట, చిలకలపాలెం, దుప్పలవలస (చీ)

## ఇంటిపేర్లు

గ్రామనామములకు ఇంటిపేర్లకు అవినాభావ సంబంధంగలదు. గ్రామనామములు ఇంటిపేర్లయిన, లేక ఇంటి పేరు గ్రామనైనామమైన వాటికి ఈజిల్లాలో ఉ॥దా॥ దూసి, ఇప్పిలి, కళ్లేపల్లి(శ్రీ) మరువాడ (న&పాల), కొల్లూరు (సొం), శ్రీరంగం (టె), తుమరాడ (పాల), గరిమెళ్ళ కొత్తవలస (పాల), కొత్తగడ్డ (పా).

## పెద్ద-చిన్న; క్రొత్త-పాత వగైరా

ఒకే పేరుగల గ్రామాలను వేరువేరుగా గుర్తించడానికి ఆయా పేర్లముందు చిన్న-పెద్ద అనే విశేషణం చేర్చడం ఒక ఆనవాయితీ.[97] ఉ॥దా॥ చిన్నకాకితపల్లి-పెద్ద కాకితపల్లి, చిన్న వెంకటాపురం-పెద్ద వెంకటాపురం (శ్రీ). పాలకొండతాలూకాలో 'పెద్ద' పేరు ముందుగలిగిన గ్రామాలు 11, 'చిన్న' విశేషణంగా గలిగినవి 9 ఉండగా, పాతపట్నంతాలూకాలో 'పెద్ద' విశేషణంగా గలట్టివి 16, 'చిన్న' విశేషణంగా గలట్టివి 20 గ్రామములున్నవి. క్రొత్తగా ఏర్పడిన గ్రామాలను అదే పేరుగల పాత గ్రామాలనుంచి వేరుగా గుర్తించడానికి ఆయా గ్రామనామముల ముందు పాత క్రొత్త అని విశేషణములను చేర్చడం సులభమైన పద్ధతి. ఉ॥ దా॥ పాత కమలాపురం, కొత్త కమలాపురం (సొం), పాతజగ్గదేవపురం, కొత్త జగ్గదేవపురం (టె) కొత్త శ్రీకాకుళం అంటూ లేదుగాని పాత శ్రీకాకుళం (శ్రీ) వున్నది. పాత నౌపడా, పాత టెక్కలి (టె) వున్నవి. భౌగోళిక విశేషములను పేరుముందు చేర్చటం చేతకూడా ఒకే పేరుగల గ్రామాలను వేర్పరచి చెప్పుట కలదు ఉ॥దా॥ రాగోలు (శ్రీ), కొండ రాగోలు (పా), కొత్త పోలవలస-కొండపోలవలస (న), పొప్పంగి-శ్రీకొండపొప్పంగి (పా), రామచంద్రపురం, బురదరామచంద్రపురం-తూముకొండరామచంద్రపురం(పా)ముకుందపురం-ఘాటీ ముకుందపురం (సొం), లక్కవరం (సొం) ఆకాశ లక్కవరం (టె).

వేర్పాటుగా గుర్తించడానికి వీలు కల్పించని గ్రామములు కూడ లేకపోలేదు. ఉ॥దా॥ కొత్తూరు (శపా), గురాండి (శిపా), బొమ్మిక (శిపా), అనంతగిరి (శిపా), రాజపురం, సారిపల్లి (టె), కొత్తవలస, పాలవలస, క్రిష్ణాపురం (శ్రీ), అంపాలెం, చిట్టివలస, ఈదులవలస (న) ఇటువంటి ఊరిపేర్లే పూర్తి విలాసంలేని ఉత్తరాల బట్వాడా విషయంలో తంతితపాలా శాఖవారిని తిప్పలు పెడుతూ ఉంటవి.

## ఊరిపేరుపై మక్కువ

ఒక ప్రాంతపు ప్రజలు వేరొక ప్రాంతమునకు కారణాంతరములవలన పోయి అచ్చోట స్థిరపడినప్పుడు పూర్వనివాస గ్రామంపై మమకారానికి గుర్తుగా క్రొత్తనివాస గ్రామానికి కూడా అదే పేరు పెట్టుకోవడం గలదు. ఉ॥దా॥ బొబ్బిలిపేట, పార్వతీపురం (శ్రీ) ఈ రెండూ పొరుగునున్న విజయనగరం జిల్లాలో ప్రముఖపట్టణములు. విశాఖ జిల్లాలోనిదైన ఎలమంచిలి గ్రామ నామముగా ఈ జిల్లాలో రెండు తాలూకాలలో (శ్రీ&న) వున్నది. వనజంగి ఉన్న శ్రీకాకుళం తాలూకాలోనే వనజంగిపేట, బారువా వున్న సోంపేట తాలూకాలోనే బారువాపేట ఉన్నవి. చీపురుపల్లి గ్రామ నామంగా సోంపేట, టెక్కలి పాతపట్నం తాలూకాలలో ఉన్నది. నేడు ఒరిస్సా రాష్ట్రాంతర్భాగములుగ నున్న బరంపురం, భద్రపురం వరుసగా ఇచ్ఛాపురం, సోంపేట తా॥ ఉన్నవి. చోడవరం, (న) గజపతినగరం (న & పాల), అన్నవరం (పాల), దౌలేశ్వరం (పా), భద్రాచలం (పా) మొ॥ సమీప జిల్లాలలోని గ్రామనామములేకాక హరిద్వారం, (పాల) రామేశ్వరం (పా) వంటి ఉత్తర, దక్షిణ భారత దేశాలలోని ప్రముఖ పుణ్యక్షేత్రముల పేర్లుకూడా గ్రామనామములుగా నీ ప్రాంతమున స్వీకరించబడినవి.

## రమణీయములు

టెక్కలి తాలూకాలోని 'ఉద్యాన వనం' అపభ్రంశం చెంది 'ఉద్దాన'మైనట్లు[98] కాకుండా చెవికింపైన (చూడటానికి, ఉండటానికి ఎలాఉంటవోగాని) గ్రామనామములు కొన్ని పేర్కొనదగినవి కలవు. ఉ॥దా॥ దీపావళి(శ్రీ), నెలవంక(ఇ), ప్రియ(న), రాగపురం(సొం) కిన్నెరవాడ, హంస, భామిని (పా), సారంగి(పాల), కామధేనువు, బృందావనం ఉన్న టెక్కలి తాలూకాలోనే గోకులపాడుకూడా ఉన్నది. 'లక్ష్మీపురం' అను ముష్టి అగ్రహారం(శ్రీ) అనునది ఈ విషయంలో తుదిమాట.

## ముగింపు

పై వివరణలవలన ఈ జిల్లాలోని గ్రామనామములు గతించిన చరిత్రకు సాక్షీభూతములుగ నుండినట్లు తెలియుచున్నది. రాజవంశముల ప్రభావము గ్రామనామములపై నెంతగలదో నంతకు దీటుగా సామాన్య జన జీవనానికి అవసరమైన వృక్ష, జంతు సంబంధిపేర్లు కూడ గ్రామనామములుగ నిలిచినట్లు తెలియవచ్చుచున్నది. చరిత్ర దృష్ట్యా ఈ జిల్లాలోని గ్రామనామముల ప్రాధాన్యత కలిగియుండి మరింత విస్తృత శాస్త్రీయ పరిశోధనకు తగియున్నవి. జిల్లాలోగల ఏజన్సీ ప్రాంతప్రభావము, ఒకవైపు సరిహద్దుగానున్న ఒరిస్సా రాష్ట్ర (భాష) ప్రభావము గ్రామనామములపై యుండుటబట్టి అట్టి ప్రభావమునకు లోనైన గ్రామనామములు ప్రత్యేకముగా పరిశీలించదగియున్నవి. స్థలభావమును దృష్టిలో నుంచుకొని తలస్పర్శగా సాగిన ఈ పరిశీలన ఇంకను ఈ విషయమై శాసనములు, సాహిత్యము మొ॥ సాధనము లాధారముగా పరిశోధన జరుగవలసిన అవసరమును గుర్తించుచున్నది.

# అధోజ్ఞాపికలు


1. సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశము, ఎనిమిదవ సంపుటము (హైదరాబాదు, 1971), పు 629–30.

2. వై. వి. కృష్ణారావు & ఏటుకూరి బలరామమూర్తి, ఆంధ్రప్రదేశ్ దర్శిని, (విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1976), పు. 1009.

సౌలభ్యము కొరకు తాలూకాల పేర్లు కుండలీకరణములలో సంక్షిప్తముగా పేర్కొనబడినవి. ఆ సంజ్ఞావివరణ :పా = పాతపట్నం, పాల = పాలకొండ, టె= టెక్కలి, శ్రీ= శ్రీకాకుళం, సోం=సోంపేట, న = నరసన్నపేట, ఇ = ఇచ్ఛాపురం, చీ=చీపురుపల్లి.

3. చూ॥ భారతి, సెప్టెంబర్, 1982, పు. 37–44 'విజయదత్' విజయనగరం జిల్లా చరిత్ర–సంస్కృతి (మాన్సాస్, విజయనగరం, 1983), పు. 15–19

4. డా॥ ఎన్. రమేశన్ (సం) ఆంధ్రప్రదేశ్ డిస్ట్రిక్ట్ గజిటర్స్: శ్రీకాకుళం (హైదరాబాదు, 1979) పు. 16.

5. కుందూరి ఈశ్వరదత్తు, ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, (ఆం॥ ప్ర॥ సాహిత్య అకాడమీ, హైద్రాబాదు, ద్వితీయ ముద్రణ, 1979), ప్రథమభాగము, పు. 34–35.

6. భావరాజు వెంకటకృష్ణారావు, ఎర్లీ డైనాస్టీస్ ఆఫ్ ఆంధ్రదేశ, (మద్రాస్, 1942), పు. 385–86.

7. డా॥ ఎన్. రమేశన్, కాపర్ ప్లేట్ ఇన్‌స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ మ్యూజియం, వాల్యూం 1 (హైదరాబాద్, 1962) పు 140.

8. జర్నల్ ఆఫ్ ఆంధ్రా హిస్టారికల్ రీసెర్చి సొసైటి, (రాజమండ్రి). పార్ట్ 1, జూలై 1926, పు. 40

9. ప్రాచీనాంధ్ర చారిత్రకభూగోళము, ద్వితీయ భాగము, పు. 122, 293.

10. పైది పు 122–123.

11. రాళ్ళబండి సుబ్బారావు (సం) కళింగదేశ చరిత్ర (రాజమహేంద్రవరము, 1930), అనుబంధము, పు. 85

12. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు. 38, 311–12

13. డా॥ ఎన్. రమేశన్, కాపర్‌ప్లేట్ ఇన్‌స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ మ్యూజియం, వాల్యూం 1, (హైదరాబాద్, 1962), పు. 144.

14. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము. పు. 313

15. పైది. పు 283.

16. యస్. ఐ. ఐ. VI నెం. 1116.

17. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు. 40.

18. జె. హెచ్. ఆర్. ఎస్. సం III. పు. 49–53

19. పైది. వాల్యూం X పు, 143–144.

20. యస్. ఐ. ఐ. నెం. 1247, 1248.

21. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు. 93

22. డా॥ నేలటూరి వేంకటరమణయ్య, విష్ణుకుండినులు, (హైదరాబాద్, 1973), పే. 56

23. ఆంధ్రదేశ చరిత్ర – భూగోళ సర్వస్వము, రెండవ సంపుటము (హైదరాబాద్, 1974), పు. 485

24. కళింగదేశ చరిత్ర, పు. 505.

25. ఆర్. సుబ్రహ్మణ్యం, ది సూర్యవంశ గజపతీస్ ఆఫ్ ఒరిస్సా, (వాల్తేరు, 1957), పే. 138, 140.

26. యస్. ఐ. ఐ. IV. నెం. 695.

27. చూ. డా॥ సి. వి. రామచంద్రరావు, ఎడ్మినిస్ట్రేషన్ అండ్ సొసైటీ ఇన్ మిడీవల్ ఆంధ్ర (ఎ. డి. 1038–1538) అండర్ ది లేటర్ ఈస్టరన్ గాంగాస్ అండ్ ది సూర్యవంశ గజపతీస్ (నెల్లూరు, 1976) పు. 124

28. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు. 311–312.

29. ఆదిభట్ల వేంకట రమణ, శ్రీకాకుళంజిల్లా చరిత్ర (ప్రపంచ తెలుగు మహాసభల జిల్లాస్థాయి ప్రచురణ. 1975), పు. 49.

30. ఎస్. ఐ. ఐ. V నెం. 1342, 43, 44

31. జె ఎ. హెచ్. ఆర్. ఎస్. సం: XXI (జూలై 1950–ఏప్రియల్ 1952) పు. 166

32. ఆంధ్రభూమి (తెలుగు వారపత్రిక, సికింద్రాబాద్, 28–10–82) పే. 42

భూగోళ సర్వస్వము. ప్రథమ సంపుటము, పు. 499

34. జి. ఆర్. వర్మ, కళింగదేవ (తాడేపల్లిగూడెం 1977) పు, 12,179

35. ఆంధ్రభూమి, 21–10–1982, పు, 54

36. ఎస్. ఐ. ఐ V, నెం. 1136, 1232

37. భూగోళ సర్వస్వము, మొదటి సంపుటము, పు. 172

38. జె. ఎ. హెచ్. ఆర్. ఎస్. IV, పే. 163

39. సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము, ఏడవ సంపుటము, (హైదరాబాదు, 1970) పు. 288

40. శ్రీకాకుళంజిల్లా చరిత్ర, పు. 88

41. డా॥ బి. మిస్త్రానయ్య, ది టెంపుల్స్ ఆఫ్ ముఖలింగం (కాన్సో పబ్లికేషన్స్, న్యూ ఢిల్లీ, 1978,) పే. 2

42. జి. ఆర్. వర్మ, కళింగదేవ, పు. 136

43. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము, ఏడవసంపుటము, పుట 291

44 విజ్ఞాపురపు వెంకట కోదండరావు (అను) విశాఖపట్టణముజిల్లా వృత్తాంత సంగ్రహము (శ్రీ వేణుగోపాల ప్రెస్, విశాఖపట్నం, ). పు. 120

45. భూగోళ సర్వస్వము, మొదటి సంపుటము, పు. 171

46. డా॥ తూమాటి దొణప్ప, ఆంధ్రసంస్థానములు-సాహిత్య పోషణము (ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, వాల్తేరు, 1969), పు. 579.

47. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము, ఎనిమిదవ సంపుటము, పు. 485

48. జె. ఎ. హెచ్.ఆర్.ఎస్.XXIX పే 24 & బి. యస్. ఎల్. హనుమంతరావు. రెలిజియన్ ఇన్ ఆంధ్ర(గుంటూరు, 1973), పే. 59

49. డా॥ ఆర్. సుబ్రహ్మణ్యం, శాలిహుండాం (ఆంగ్లం) (హైదరాబాద్, 1964) పే 3-4

50. జి. ఆర్. వర్మ, గుడిగుంపా, (తాడేపల్లిగూడెం, 1974) పు. 103

51. భావరాజు వెంకట కృష్ణారావు, ఎర్లీ డైనాస్టీస్ ఆఫ్ ఆంధ్రదేశ, పు. 612

52. ఎర్లీ డైనాస్టీస్ ఆఫ్ ఆంధ్రదేశ, పు. 368

53. ప్రాచీనాంధ్ర చారిత్రిక భూగోళము, పు 290

54. జె. ఎ హెచ్ .ఆర్ .ఎస్ XXII, పే. 184

55. కళింగదేవ, పు. 13

56. కళింగదేశ చరిత్ర, 461

57. కళింగదేవ, పు 53

58. భూగోళ సర్వస్వము, రెండవ సంపుటము, పు. 51

59. డా॥ ఎన్. రమేశన్ (సం) ఆం॥ ప్ర॥ డిస్ట్రిక్ట్ గజిటీర్స్ శ్రీకాకుళం, పు. 20.

60 భీమనామధేయులు ఈ ప్రాంతముపై ప్రభావము నెరపిన తూర్పు చాళుక్య, తెలుగు చోడులలో ఉన్నారు. అట్లే అనంతవర్మలు వాశిష్ఠ, మాఠర వంశీకులలో గలరు.

61. కళింగదేశ చరిత్ర, పు. 479.

62. ఎర్లీడైనాస్టీస్ ఆఫ్ ఆంధ్రదేశ, పే. 578

63. కళింగదేవ, పు. 53, 54 & 134.

64. డా॥ ఎన్. వెంకటరమణయ్య, ది ఈస్టర్న్ చాళుక్యాస్ ఆఫ్ వేంగి, (మద్రాసు, 1950) పే. 128

65. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు. 152-153.

66. ఎస్. ఐ. ఐ, వాల్యూం VI, నెం. 1119

67. భూగోళ సర్వస్వము, మొదటి సంపుటము, పు. 594.

68. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు. 237

69. జంతర్నాడు. వీరకూటం, శ్రీకూర్మచాళుక్య ప్రభువులలోను పురుషోత్తమ నామధేయులున్నారు.

70. భూగోళ సర్వస్వము, మొదటి సంపుటము, పు. 45-46

71. పైది. పు. 30

72. భూగోళ సర్వస్వము. రెండవ సంపుటము, పు. 55

73. జయపురాధీశ్వరులకు పూర్వపాలకులైన నందాపురాధి పతులలో ఒక భైరవరాజు (1370 ప్రాంతం) గలడు. 1776 ప్రాంతంలో గోలుకొండ జమిందారు భైరవ భూపతి రాజుగలడు. పార్వతీపురం, పాలకొండ, సాలూరు మొ॥ చిన్న జమిందారీలన్నియు జయపురం వారి అనుగ్రహమువలన రూపెత్తినవి కావటంచేత ఆ సంస్థాన పాలకులలోను జయపుర రాజుల పేర్లుదాల్చిన వారు కాన వస్తారు. ఉ॥దా॥ పార్వతీపురం పాలకులలో విశ్వంభర ఛత్రరాజు, సాలూరు పాలకులలో రామచంద్రరాజు మొ॥ ఈ జిల్లాలో పుష్కలముగానున్న రామచంద్రపురములలో నొకటి సామంత రామచంద్రపురం (సొం) ఈ విషయాన్ని మరింతగా దృవీకరిస్తున్నది. రామచంద్రపురములలో కొన్ని శ్రీరామచంద్రుని పరంగా నేర్పడినవికూడా అయివుండవచ్చును.

74. కళింగదేశ చరిత్ర, పు. 282. టెక్కలికి సంబంధించిన గ్రామ నామముల చరిత్రకు ప్రధానాధారము : కళింగదేశ చరిత్ర (పుటలు 389-392)లోని లక్ష్మీనారాయణ హరిచందన జగద్దేవు విరచిత 'టెక్కలి కాదంబరాజ వంశేతిహాసము' అనువ్యాసము.

75. జె. ఎ. హెచ్. ఆర్. ఎస్., వాల్యూం VII, పే. 32

76. కళింగదేశ చరిత్ర, పు. 390.

77. జె. ఎ. హెచ్. ఆర్. ఎస్., వాల్యూం, V, పార్ట్ 2 (అక్టోబరు 1930) పే. 117.

78. కళింగదేశ చరిత్ర, పు. 390
79. ఇంద్రవర్మపుర్లిశాసనమున 'తిరిలింగవాస్తవ్యాయ' అనుపదము వాడబడియున్నది.
సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము, నాలుగవ సంపుటము, పే 602, 603.
80. కళింగదేశచరిత్ర, పు 391.
81. డా॥ తూమాటి దొణప్ప, ఆంధ్రసంస్థానములు – సాహిత్య పోషణము పు. 561
82 విశాఖపట్నంజిల్లా వృత్తాంత సంగ్రహము
83. పైది. పు 547 అధోజ్ఞాపిక
84. చాటుపద్య మణిమంజరి, పు 39-40.
5. పాలకొండ విజయనగరానికి కప్పముకట్టినది కావడంచేత ఆ కాలంలో విజయనగరపాలకులైన పెద్ద,చిన్న విజయరామరాజులు, చిన్నవిజయరామరాజు సోదరుడు దివాన్ సీతారామరాజు ప్రముఖులు కావడంచేత పాలకొండ తాలూకాలోని ఈ గ్రామములు విజయనగర పాలకవర్గ నామసంబంధములా యనిపించకపోదు.
86. ఆదిభట్ల వెంకటరమణ, శ్రీకాకుళం జిల్లా చరిత్ర, 181_182

చ॥ అతఁడు కళింగరాజ్యమున కర్ధిగమించి తదీయమేదినీ
పతి బహుమాన మందుకొని పౌరుషమారంగ బంటుపల్లి సు
స్థితి రచియించి భోగపురి సీమ రణస్థలి చెంత నందు సు
స్థితిముగ నిల్చి యచ్చట ప్రతిష్ఠ యొనర్చెను మల్లికార్జునన్॥

బంటుపల్లి వైభవాన్ని కవి ఈ విధంగా వర్ణించాడు

తే॥గీ॥ మేలునకుఁదల్లి కీర్తికి పాలవెల్లి
తల్లితల్లికి క్రొత్త ముత్యాల ఝల్లి
వెండి బంగారములకెల్ల నిండు ఘల్లి
ప్రాభవపుధిల్లి అతడేలు బంటుపల్లి॥

87. పైది. పు. 168
88. తురక శాసనమను గ్రామమున్నట్లే పండశాసనం(పె), 'శాసనం' (ఇ&సోం&పె) అను గ్రామములున్నవి. కనుక నిచ్చటశాసన మనగా 'భూమ్యాది నానార్థలేఖ్యము'అనియేగాక 'సరిహద్దురాయి' అను అర్థమునుకూడ స్వీకరింపవచ్చును. కుందూరి ఈశ్వరదత్తు ఇన్ స్క్రిప్షనల్ గ్లోసరీ ఆఫ్ ఆంధ్రప్రదేశ్. (హైదరాబాద్, 1967) పే. 287-88
కళింగదేశచరిత్ర, పు. 391
90 డా॥ రమేశన్ (సం) ఆం॥ ప్ర॥ డిస్ట్రిక్ట్ గజిటీర్స్ 'శ్రీకాకుళం' పే. 134
91. భూగోళ సర్వస్వము, మూడవ సంపుటము, పు. 411
92. ఆంధ్రభూమి, (వారపత్రిక, 24-2-1983), పే. 94
. జి. ఆర్. వర్మ, గుడీ-గుంపా, పు. 35.
94. "మహాజనము : బ్రాహ్మణవర్గము, గ్రామములోని పెద్దలు" కుందూరి ఈశ్వరదత్తు, శాసనశబ్దకోశము, పు. 229
95. 'పనస = పన్ను చెల్లించనక్కరలేని భూమి' డా॥ బూదరాజు రాధాకృష్ణ, ప్రాచీనాంధ్ర శాసనాలు,(హైదరాబాద్,1971),పు.377
96. జి. ఆర్. వర్మ, కళింగదేవ, పు. 53, 124
97. జె. ఎ. హెచ్. ఆర్. ఎస్. XXII, పు. 184
98. భూగోళసర్వస్వము, మూడవ సంపుటము, పు. 414

[ గ్రామ నామముల జాబితా వ్రాయుటలో చేదోడుగా నుండిన చి॥ యస్. కామేశ్వరి, టి. కామేశ్వరులకు రచయిత కృతజ్ఞుడు. ]

# మళ్ళీ తెల్లవారుతుంది

## శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు

నడిచేది
నలుగురులోనే
నలుగురిలానే

ఆలోచనలకాళ్ళు
ఆకాశంలో
కళ్ళు అంతరిక్షంలో_

ఈ చుక్కలు చేతికి
చిక్కినట్టే నటించి
వేళ్ళ సందుల్లోంచి
జారిపోతుంటాయి

ఈ పిట్ట
రెక్కలూపుతూ, సాగుతూ
కనుచూపు మేరలో
బిందువై

నిలువునా గుడ్డివాణ్ణి చేస్తుంది
ఈ కథ రోజూ జరిగేదే!

అయినా
మళ్ళీ తెల్లవారుతుంది!
కాళ్ళు ఆకాశంలో....
కళ్ళు అంతరిక్షంలో.... !

# జీవన సంగీత

కనులలోని కలలు అశ్రు
కణమ్ములై తొణకినపుడు
గుండెలోని తలపు లగ్ని
గుండములై మండినపుడు

ఒక చల్లని మాట చాలు
ఊర్పు సెగలు చల్లారును
ఒక కమ్మని పాట చాలు
కలత బరువు కడ తేరును

మన బ్రతుకుల బాటలలో
పెనుచీకటి మూగినపుడు
మన మనసుల తోటలలో
చితి మంటలు రేగినపుడు

ఆశామణి దీపద్యుతి
అరుణోదయమై విరియును
ఆత్మీయుల అనురాగమె
అమృత వర్షమై కురియును

పలురకాల అనుభూతుల
వర్ణాలను మేళవించి
అందమైన గతకాలపు
టను భవాల కుంచెలతో

వర్తమాన యవనికపై
భవితవ్యం చిత్రిస్తూ
మౌనముగా సాగిపోవు
మానవాళి జీవితాలు

సాగిపోవు ఆ జీవన
సమీరాలు తాకినంత
ప్రపంచ విపంచి పలుకును
చైతన్యోత్సవ గీతం
మానవతా సంగీతం

మనసే ఒక అరవిందం
మమతే మధుర మరందం
తనివి తీర గ్రోలినపుడె
మన మనుగడ కానందం.

# అంతరంగ విహంగం

ఒక మధుర మనోజ్ఞ స్వప్నాన్ని
ఒక విధుర విషాద సత్యాన్ని
రెండు రెక్కలుగా ధరించి
అంతరంగ విహంగం
వింతగా ఎగిరి పోతుంది
ఊహా విహాయస వీధిలోకి
అతివేగంగా ప్రతి ఉదయం

ఏ అనంత దిగంతాలకో పయనించి
ఏ సుదూర తీరాలలోనో విహరించి
రకరకాల అనుభూతుల గింజల్నేరుకొని
జీవనకాసారంలోని వేదనా నీరాన్ని గ్రోలి
తిరిగి తిరిగి అలసి సొలసి
నిశ్శబ్దంగా చేరుకుంటుంది
నిద్ర గూటిలోకి ప్రతి రాత్రి.

శ్రీ కె. దినకర్

డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

# జంతు ప్రకృతిలో రసానుభూతి ఉన్నదా? మానవానుభూతికి అది భిన్నమైనదా?

విశ్వంలో జీవి ఆవిర్భావం - అది వృక్షమైనా కావచ్చును, జంతువైనా కావచ్చును, రెండింటికీ మధ్యస్థంగా ఉన్నదైనా కావచ్చును, రెండు వర్గాలకు చెందనిదైనా కావచ్చును - ఏది ఏమైనా అది బహు విచిత్రమైనది. మిగుల విశిష్టమైనది. తెలిసి వస్తుందో రాదో కూడ తెలియనంతటి అద్భుతాన్ని కలిగించేది. జిజ్ఞాసను పెంచి ఆలోచనను రేకెత్తింప జేసేది. కాల క్రమగతిని జీవ పరిణతిని అర్థంచేసుకోవడానికి విస్తృతంగా వెలువడ్డ మానవ ప్రయత్నమే పరిణామవాద సిద్ధాంతము. మౌలికంగా స్పష్టంగా ఒకే ఒక్క మూలకందం నుంచి (ఇది ఏదీ అంటే ఈనాటికీ ప్రశ్నార్థకమై నిలబడి ఉంది!) సకల జీవరాశులూ ఉద్భవించాయని, కాల ప్రవాహంలో ప్రకృతిలో కలిగే ఎన్నో మార్పుల కనుగుణంగా తమ తమ జీవిత క్రమాలను సుస్థిర పరచుకొనేందుకు అనుక్షణం ప్రయత్నిస్తూ ఉంటాయని - ఈ ప్రయత్నాల పరంగా (యాదృచ్ఛికం కావచ్చును, ప్రమాదవశాత్తు కావచ్చును, ఇంకేవిధంగానైనా కావచ్చును) నూతన జాతులు ఏర్పడేందుకు అవకాశం ఉంటుందని పరిణామవాదం ప్రబోధిస్తుంది. జీవులలో వైవిధ్యం, జీవజాతుల ప్రత్యేకీకరణం - ఇలాంటివన్నీకూడా ప్రకృతి ప్రభావ ఫలితంగానే ఏర్పడుతాయంటే చాలా ఆశ్చర్యంగా ఉంటుంది. అందుకే శాస్త్రంలో ప్రకృతి సర్వశక్తివంతమైనది. నేడు అమీబా అనబడే ఏకకణ జీవి అత్యల్పస్థాయికి చెందిన జంతువుగాను మానవుడు అత్యుత్తమ స్థాయికి చెందిన జంతువుగాను పరిగణించబడడం జరుగుతున్నది. అమీబా నుంచి హైడ్రా, హైడ్రా నుంచి ఆర్థ్రోపోడా, అందునుంచి ఎఖైనో డెర్మేటా.... అలా అలా చేపలు, కప్పలు, సరీసృపాలు - అక్కడి నుంచి పక్షులోక వైపు మనుష్యులోక వైపు రూపొందాయని భావించడం జరుగుతున్నది. ఒక విధంగా చెప్పాలంటే మనిషికూడా జంతువే నన్న విషయం స్పష్టంగా తెలియవస్తుంది. అయితే మనిషి జంతువుకాదని జంతువు నుంచి వేరుపడినాడని మనిషికి జంతువుకు మధ్యన ఎంతైనా వ్యత్యాసమున్నదని ఎక్కువమంది అభిప్రాయ పడుతున్నారు. జంతు ప్రవృత్తి వేరని మనిషి ప్రవృత్తి వేరని - మహోన్నతమైన మానవతా గుణంతో జాతి సంస్కృతిని భాగ్యోదయ ప్రగతి వైపుకు నడిపించే లోకశ్రేయోక్రియా పరుడైన మనిషి యొక్క తత్త్వం జంతు తత్త్వానికి భిన్నమైనదని, జంతువులో కానరాని విశిష్టత, నిర్దుష్టత, విజ్ఞత, విచక్షణ మొదలైన లక్షణాలన్నీ మనిషికే పరిమితమని - ప్రపంచ జనాభాలో ఎక్కువ శాతం మనుష్యుల బలీయమైన అభిప్రాయం. సనాతన ధర్మం కానివ్వండి, బౌద్ధం కానివ్వండి, ఇస్లామ్ కానివ్వండి, క్రిస్టియానిటీ కానివ్వండి- మనిషి జంతువు నుంచి వేరుపడాలనే ప్రవచిస్తున్నాయి. అంత మాత్రాన జంతువు మనిషికన్నా నీచమైనదన్న అభిప్రాయానికి రారాదు. తర్కబద్ధమైన శాస్త్రజ్ఞానంలో చర్చిస్తే జంతువుకు మనిషికి ఏవిధమైన తేడా కనిపించకపోవచ్చును. అయితే అది భౌతిక దృక్పథం. ఏదిఏమైనా జంతువుకు, మనిషికి ఉన్న ఏకోదర సంబంధాన్ని గుర్తించి, కొనియాడి అనంతమైన ఆ సంబంధ బాంధవ్యాన్ని అర్థంచేసుకొని సంస్కారంతో నడుచుకోవడమే గొప్పతనం! దానికి ఉపక్రమిద్దాము.

జీవజాలాన్ని సునిశితంగా పరిశీలిస్తే ఒక విషయం స్పష్టంగా బోధపడుతుంది. అత్యంత సూక్ష్మజీవి అయిన అమీబా మొదలుకొని అద్భుతమైన విషయావగాహన, ఆలోచన, వివేచన ఉన్న మనిషి వరకు జన్యుపరమైన ఒక అనుబంధము కనిపిస్తుంది. ఈ బాంధవ్యము ఎక్కడినుంచి మొదలైందని అడిగితే చెప్పడం కష్టమేమోకాని, ఒక్కసారి మొదలైన అనుబంధం మాత్రం నిరంత

రంగా నిరభ్యంతరంగా కొనసాగుతునే ఉంటుంది. ఇది శాశ్వత సత్యం. ప్రకృతి ప్రబోధించే దివ్య సూత్రం. భారతీయ ధర్మసారమైన వేదాలు ప్రవచించే భగవంతుని తత్త్వం. ఇందులో మార్పు రాదు. అన్వేషణకు, గవేషణకు అందని జీవ పరమార్థమిది. అంతుబట్టని రహస్యమిది. అర్థంకాని విచిత్రమిది. దీనిని గుర్తించి ప్రకృతి గొప్పతనాన్ని కొనియాడడం ఒక్కటే జిజ్ఞాసువు చేయదగ్గ పని.

జంతుజాలా లన్నింటిలోనూ ఏకోదర సంబంధాన్ని నిర్దుష్టంగా తెలియజెప్పే అలవాట్ల నెన్నింటినో గుర్తించవచ్చును. ప్రతి జంతువు విధిగా కొన్ని లక్షణాలను కలిగిఉంటుంది. ప్రపంచంలోని ప్రతి జీవికి ఆకలి అనునది ఉన్నది. దప్పికఅనునది ఉన్నది. నిద్ర అనునది ఉన్నది. అంతేకాదు. మైథునంపై ప్రీతి అనునది తప్పని సరిగా ప్రతి జంతువు కలిగి ఉండును. ఈ నాలుగు లక్షణాలు విశ్వజనీనంగా సర్వకాలీనంగా ఎప్పుడూ ఉంటాయి. ఆహార సముపార్జన ప్రతిజీవికి అవసరమే. కూటి కొరకు కోటి విద్యలన్నది అతిశయోక్తి కాదు. అమీబా బ్యాక్టీరియమ్‌లను, డయాటమ్‌లను, ఇంకా చిన్న చిన్న సూక్ష్మజీవులను తింటుంది. గాజు ముక్కలను అందిస్తే తిరస్కరిస్తుంది. ఏది ఆహారమో, ఏది ఆహారము కాదో, ఏది శత్రువో, ఏది సహజీవో కూడ తెలుసుకొనే స్థితిలో ఈ సూక్ష్మజీవి ఉండడం విశేషమనే చెప్పవలె. ఎక్కువ వేడి ఉన్న ప్రాంతాలనుంచి చల్లని ప్రాంతాలకు, ఎక్కువ కాంతి ఉన్న ప్రదేశాలనుంచి తగు మాత్రం వెలుతురు ఉన్న స్థలాలకు అమీబా సంచరించడం దాని సూక్ష్మ బుద్ధికి స్పష్టమైన దృష్టాంతం. పరిణామరీత్యా ప్రాథమిక స్థాయిలో ఉన్న ఈ విచిత్రమైన జీవశక్తి పరిణామం జరిగేకొద్దీ చిత్రాతి చిత్రంగా పెరుగుతూ వచ్చి మనిషి స్థాయి కొచ్చేసరికి అనూహ్యమైన స్థితికి చేరుకొని భళీ అనిపిస్తుంది. అయితే నిమ్న జంతువుకు అనుభూతి ఉంటుందా? అనుభవం తెలుస్తుందా? మంచిచెడ్డలు తరచి చూచే శక్తిని కలిగి ఉంటుందా? ఒక్కసారి చూచిన దానిని మళ్ళీమళ్ళీ గుర్తు పెట్టుకొనే శక్తి ఆ ప్రాణికి ఉంటుందా? అన్నది ఉత్సాహాన్ని రేకెత్తింప జేసే ప్రశ్నలు. వీటికి సమాధానాలివ్వవలసిన అవసరం ఉన్నది. అమీబా చిరంజీవి (నీరు ఉన్నంత వరకే!). మనిషికి నిర్దుష్టమైన జీవితకాలం ఉన్నది. వానపామును తుండ తుండాలుగా (అడ్డంగా మాత్రమే!) చేస్తే ప్రతి తుండమూ ఒక వానపామౌతుంది. ఒక చెయ్యి పోగొట్టుకొంటే మళ్ళీ మనిషికా చెయ్యి రాదు. శత్రువుల బారినుంచి తప్పించుకొనేందుకు బల్లి తోకను పోగొట్టుకొంటుంది. అయినా మళ్ళీ ఆ తోక పెరుగుతుంది. ఈ రకంగా విశ్లేషిస్తే మనిషి కన్నా అమీబాదే పైచేయి అవుతుంది. అలా అనిపిస్తుంది. అయితే సంక్లిష్టంగా ఎదిగి ఉన్న నాడీ వ్యవస్థ మనిషికొక హోదాను, స్థాయిని తెచ్చిపెట్టింది. ఈ వ్యవస్థవల్లే మనిషి నాడు జగద్విదితుడౌతున్నా డన్నది నిర్వివాదాంశం.

మనిషి వలె జంతువు కూడ ఆహారాన్ని తీసుకొంటుంది. అంటే ఆకలిని గుర్తిస్తుంది. నీరు త్రాగి దప్పిక తీర్చుకొంటుంది. శత్రువుల నుంచి తనను తాను రక్షించుకొంటుంది. ఎండ, వాన, చలి-మొదలైన ప్రకృతి పరమైన బాధలనుంచి తప్పించుకోవడానికి వీలుగా గూళ్ళను కట్టుకొంటుంది. పొదరిళ్ళను ఏర్పరచుకొంటుంది. బొరియలను తయారు చేసుకొంటుంది. గుహలలో నివసిస్తుంది. కొన్ని జంతువులు చెట్లకొమ్మల సహాయంతో ఇళ్ళ వంటి వాటిని కూడ ఏర్పరచుకొంటాయి. కొన్ని జంతువులు మనుష్యులవలె సంఘజీవులు కూడ! కలిసి మెలిసి ఉంటాయి. మందను చూచుకొనేందుకు ఒక జంతువు ముందు ఉండి నాయకత్వం వహిస్తుంది. అరుపులు చరుపులు లాంటి శబ్దాలతో సహ జంతువులతో సంభాషణను జరుపుతాయి. కష్టసుఖాలను తెలుపుకొంటాయి. ప్రమాదాలను హెచ్చరించుకొంటాయి. సంతోషాలను వెలిబుచ్చుకొంటాయి. విషాదాలను వెళ్ళబోసుకొంటాయి. మానవ భావాలకు సరిపోలిన ప్రేమ, వాత్సల్యం, ద్వేషం, ప్రతీకారం, ఘర్షణ, ఆవేశం, ఉక్రోషం, ఆవేగం, అలసట, కోపం - ఇత్యాది లక్షణాలన్నీ జంతువులకు కూడ ఉన్నాయని చెప్పటానికి సందేహపడవలసిన అవసరం లేదు. స్త్రీపురుష జంతువులు కలుసుకొంటాయి. మనుష్యులలో మాదిరే! సంభోగ ప్రక్రియ కూడ ఇంచు మించు ఒకే విధంగా ఉంటుంది. ఈ స్త్రీ పురుష పరస్పరాకర్షణకు మూలమేదో ఇంతవరకు తెలియరానిదై ఉన్నది. ఈ ఆకర్షణా భావము జంతువులకును మనుష్యులకును సమముగనే ఉన్నదని తెలుస్తున్నది. అయితే జంతువులలో కామకేళి విచ్చలవిడిగా ఉంటుందని వావి వరుసలు పాటించబడవని - మనిషి ఇక్కడే వేరుపడతాడని కొందరు తాత్త్వికులు అభిప్రాయపడతారు. కానీ ఈ వావి వరుసలు, సమాజ నిబంధనలు మనుష్యులలో ఐకమత్యము, క్రమశిక్షణ, సంఘీభావము పాటించటానికి - నైతికంగా, ధార్మికంగా ఉన్నత స్థితిని చేరుకోవడానికి - మనుష్యుల చేతనే మనుష్యుల కొరకు రూపొందించబడ్డాయన్న సంగతి మానవ వికాసాన్ని ఆది నుంచీ తరచి చూస్తే ప్రస్ఫుటంగా తెలిసి వస్తుంది. అంటే ఆలోచించి మనిషి నిర్ణయం తీసుకోగలడు, జంతువు ఆ పని చేయలేదని తెలుస్తుంది. ఒక్కమాటలో చెప్పాలంటే మనిషికి ముందు చూపు ఉన్నది, జంతువుకు అది లేదు అని చెప్పుకోవచ్చును. ఈ ముందు చూపుకు కారణమేమై ఉంటుం

దనేది ఒక ప్రశ్న. మనిషికి ఈ విచక్షణ ఏర్పడటానికి ఏ శక్తి దోహద పడి ఉంటుందనేది ఎంతో ఆలోచనను రేకెత్తింప జేస్తుంది.

మానవులలో మమతానురాగాలు ఉన్నట్లే జంతువులలో కూడ ఉన్నాయి. పసిపిల్లలను అవి చూచుకోవడం ఎంతో రసవత్తరంగా ఉంటుంది. ఒక కోడిపెట్ట చిన్న చిన్న కోడిపిల్లలను ఎంతో జాగరూకతతో గమనిస్తూ ఉంటుంది. ఒక కుక్క దాని పిల్లల దగ్గరకి వెళితే విసుచుకుపడుతుంది. కోతి పిల్లను కాని, పిల్లి పిల్లను కాని వాటి వాటి తల్లులు ఎంత జాగ్రత్తగా చూచుకుంటాయో మనం నిత్యం చూస్తూ ఉంటాము. తల్లి ఆవును చూచి అంబా అని పలికే లేగదూడను చూచినప్పుడు ఎవరికైనా సరే తన్మయత్వంతో ఒడలు పులకరిస్తుంది. ధాన్యపు గింజలను తీసుకొని వచ్చి తల్లి పిచ్చుక వాలీ వాలగనే గూటిలోనుంచి గొంతులు చించుకొనే పిచ్చుక పిల్లలు కిచకిచ లాడుతూ సంబర పడడం చూస్తే ఎవరికైనా ఎంతో ఆనందం కలుగుతుంది. అంటే తల్లీ పిల్లల అనుబంధాలు ప్రకృతిలో మనుష్యులకు మాత్రమే కాదు జంతువులలో కూడ ఉన్నాయని తెలుస్తుంది. జంతువులలో మరొక విచిత్రమైన లక్షణం కూడ ఉన్నది. ఎక్కువ ఎండను భరించలేక కొన్ని జంతువులు వేసవి నిద్ర పోతాయి. అంటే వేసవి పూర్తి అయ్యే వరకు ఏ విధమైన క్రియా శీలక జీవన వ్యాపారాలలో పాల్గొన కుండా స్తబ్దంగా ఉండిపోతాయన్న మాట. దీనినే ఈస్టివేషన్ అని పిలుస్తారు. మనుష్యులు కూడ వేసవి బాధనుండి తప్పించుకోవాలని రకరకాల ప్రత్యామ్నాయాలను అనుసరిస్తూ ఉండడం వేసవి విడుదలకు వెళుతూ ఉండడం గమనించవలసి ఉన్నది. అలాగే మరికొన్ని జంతువులు చలికాలంలో చలి బాధ తట్టుకోలేక శీతాకాలపు నిద్ర పోతాయి. అంటే మంచు బారినుండి తప్పించుకునేందుకు జంతువులు ఒక విలక్షణమైన పథకాన్ని రూపొందించు కొంటాయన్నమాట. ఇక్కడ ఇవి మనుష్యుల కేమాత్రమూ తీసిపోవడంలేదు. ఈ శీతాకాలపు నిద్రను హైబర్నేషన్ అంటారు. వేసవి నిద్రపోయే జంతువులలో కొన్నిరకాల నత్తలను చలికాలంలో నిద్రపోయే జంతువులలో ధ్రువప్రాంతాల ఎలుగులను ఉదాహరణాలుగా చెప్పుకోవచ్చును. కొన్ని రకాల పక్షులు చలిబాధను తట్టుకోలేక ఒకప్రాంతంనుంచి మరో ప్రాంతానికి వలసపోతాయి. ఈ వలస పోవడాన్ని మైగ్రేషన్ అని అంటారు. వానకోయిల (స్వాలో) మైగ్రేషన్ జరిపే ఒక పక్షి (మేధావుల వలస ఇటీవల ఎక్కువగా మన దేశంలో ఉండడాన్ని మనమిక్కడ గుర్తు చేసుకోవచ్చును). ఈ విధంగా జంతువుల ప్రవర్తనా సరళి మానవ జీవితాలను ప్రతిబింబింప జేసే విధంగా ఉండడం సనాతన జన్యు సంబంధ బాంధవ్య ఫలితమేనని అనుకోవడంలో పొరపాటు ఉండదు.

జంతువుల భావ వినిమయంలో కూడ మనుష్యులనే పోలి ఉన్నదనడంలో అత్యుక్తిలేదు. అయితే మానవులలో ఉన్నంత సంక్లిష్టంగా స్ఫూర్తివంతంగా పరిపూర్ణంగా విశిష్టంగా అమోఘంగా అద్భుతమనిపించే తీరులోమాత్రం లేదు, అలా ఉండడానికి అవకాశం కూడ లేదు. శారీరక ప్రవర్తనా సరళిలో 90% వరకు మనుష్యులతో ఏకీభవించే జంతులక్షణాలు మానసిక ప్రవర్తనా సరళిలో అంత ఎక్కువశాతం వరకు ఏకీభవించలేవు. మనుష్యులలో మెదడు, వెన్నుపాము - ఇవి రెండే కేంద్రనాడీ వ్యవస్థకు సంబంధించిన ప్రధాన అంగాలైనా, ఈ రెండింటికీ అందని మరొక విచిత్ర భావన ఉన్నది. ఈ భావన శాస్త్రరీత్యా మనస్సు కావచ్చును, జాగృతి కావచ్చును, అంతరాత్మ ప్రబోధం కావచ్చును, లక్ష్యాన్ని నిర్దేశించే అంతరాళము కావచ్చును. ఈ నాలుగూ ఒకటే ఒకటే కావచ్చును లేదా భిన్న భిన్నములు కావచ్చును. ఈ లక్షణములను ఆధారముగా చేసుకొని రూపొందిన శాస్త్ర భాగమే సైకాలజీ అని తెలియనగును. సైకోట్రానిక్స్, టెలిపతీ, క్లైయిర్ వోయెన్స్, సైకియాట్రిక్స్ మొదలైనవి ఆ సైకాలజీలోని అంశాలు కావచ్చును లేదా అనుబంధాలు కావచ్చును. జంతువులకు మనుష్యులకు ప్రధానమైన భేదమున్నది ఈ మనస్సుకు సంబంధించిన విషయంలోనే: అయితే జంతువులలో మనస్సు అనేదే లేదా అంటేచెప్పడం కష్టమౌతుంది. జంతువులు కూడ స్పందిస్తాయి. ఆర్తిని వెళ్ళబోసుకొంటాయి. సంభ్రమాశ్చర్యాలను ప్రకటిస్తాయి. కళ్ల నీళ్లు పెట్టుకొంటాయి. అయినప్పటికీ మానసికంగా మనిషి ఎదిగినంత ఎత్తుకు జంతువులు ఎదగలేక పోయినాయి (అయితే మనిషి మనిషికి మధ్యనున్న వ్యత్యాసం మరింత విచిత్రమైనది!) ఈ విషయం వల్లనే మనిషి మహోన్నతమైనస్థాయిని చేరుకో గలిగాడు. జంతువులలో కూడ చెప్పుకోదగిన స్థాయిలోనే మానసిక పరమైన మార్పు ఉన్నదని చెప్పడానికి భయపడవలసిన అవసరం లేదు.

తెల్లవారుతునే తెల్లవారుతున్నదని తెలిసి కోడికూత వేస్తుంది. సంకేత స్థలానికి ఒక పావురం ఉత్తరాన్ని చేరవేయగలుగుతుంది. తన యజమానిని ఒక గుర్రం గుర్తుపట్టగలుగుతుంది. మేతనుంచి ఒక గేదె తన స్థావరానికి తను తిరిగి వెళ్ళగలుగుతుంది. అంటే జంతువులలో కూడ తెలివి, జ్ఞాపకశక్తి ఉన్నాయని అవి ఉండడం వలనే అవి ఆలోచిస్తాయని తెలుస్తుంది. జంతువులు ఆలోచిస్తాయని చెప్పడానికి స్పష్టమైనదృష్టాంతాలెన్నో ఉన్నాయి. ఒకసారి కర్రదెబ్బ తిన్న కోతి ఆ కర్ర చేతిలో ఉన్నట్లయితే మనిషిని చూచి భయపడు

తుంది. హారన్ శబ్దాలు వినిపిస్తే వెనక్కి తిరిగి చూచి ఎంతో జాగ్రత్తగా ఒక కుక్క పిల్ల నడి రోడ్డుమీద పరుగులు తీస్తుంది. ఒకసారి గేటు దాటబోయి ఆ గేటు దగ్గర పశువులు రాకుండా కిటికీలాగ ఉన్న ఇనుప కమ్మీలలో చిక్కుకొన్న దూడపిల్ల రెండవ సారి ఆ కమ్మీలలో కాళ్లు పడకుండా జాగ్రత్త పడుతుంది. ఒక్క ఎగురు ఎగిరి అటువైపుకి చేరుకొంటుంది. పాలు త్రాగడానికొచ్చే ఒక పిల్లి పిల్లను చాటునుంచి దెబ్బ తీస్తే అది ఎంతో మెలకువతో మరుసటి రోజు పాలు త్రాగడానికి ప్రయత్నిస్తుంది. ఒక్కసారి ఇంజక్షన్ ఇచ్చిన ఎలుక పిల్లకు రెండవదఫా సూది వెయ్యడానికి ప్రయత్నిస్తే ఎంతో కష్టసాధ్య మవుతుంది. సూది బాధను అది ముందుగానే తెలుసుకోవడం వల్ల ఇబ్బంది ఏర్పడుతుంది. బోనులో ఉన్న కోతికి బలవంతంగా ఇంజక్షన్ ఇచ్చి మరుసటి రోజు దా దగరికెళితే గుర్తుపట్టి చూస్తుంది. సిరంజిని లాగి కొరికి పడేస్తుంది అంటే దానికి నొప్పి అనే విషయం బాగా తెలియ వచ్చిందని అర్థమవుతుంది. ఒక మగ దుప్పి ఆడదుప్పి వదిలే కొన్ని రకాల స్రావ్యాలను వాసన ద్వారా గుర్తుపట్టి ఆడదాని ఉనికిని తెలుసుకోవడం దాని జ్ఞాపక శక్తికి, సూక్ష్మ బుద్ధికి నిదర్శనం. ఇలాంటి ఉదాహరణాలు ఎన్నైనా ఇవ్వవచ్చును. జంతు శాస్త్రాన్ని అధ్యయనం చేసేవారికి జంతు ప్రకృతి ఎంత హృద్యంగా ఆహ్లాదంగా ఉంటుందో అందరి కంటే ఎక్కువగా తెలుస్తుంది. కాబట్టి జంతువులు మనుష్యుల మాదిరే ఆలోచించ గలవని జ్ఞప్తి పెట్టుకోగలవని తెలుస్తున్నది 3 సంవత్సరాల చింపాంజీలకు పరీక్షలు పెడితే డెబ్బై రకాల సైగలను, సంకేతాలను ఎంతో విచక్షణతో వెల్లడి చేయడం వాటికున్న జ్ఞాపక శక్తికి ప్రబలమైన తార్కాణము. మరి మనిషికి, జంతువుకు అసలు భేద మెక్కడ ఉన్నదన్న అనుమానం వస్తుంది. మాటలాడే ఏకైక జంతువు మనిషి అని అనడం వల్ల భాషా విషయంలో మాత్రమే మనిషికీ జంతువుకూ భేదమున్నదేమోనని అనిపిస్తుంది. నిజానిజాలను పరిశీలిద్దాము.

భావ ప్రకటనను ప్రస్ఫుటించడానికి మనిషికి భాష అవసర మైనది. విశ్వంలో ప్రకృతి భాష ఒక్కటే. యోచనాశక్తి ఉన్న మనిషి తనకంటూ ఒక ప్రత్యేక భాషను ఏర్పరచుకొన్నాడు. ప్రపంచంలోని మానవ భావ మొక్కటే కాని మానవ భాష మాత్రం ఒక్కటి కాదని మనకు తెలుసు. వాస్తవానికి అలా ఉండే అవకాశం కూడ లేదు. భాషాశక్తి వల్లనే మానవుడు జంతువుపై ఆధిక్యాన్ని కనబరుస్తున్నాడేమోనని అనిపిస్తుంది. అయితే జంతువులకు కూడ భాషాశక్తి ఉన్నదని, వేటిభాష వాటికున్నదని, వేటి తాహతు వాటిదని స్పష్టంగా నిర్ణయించుకోవలసిన అవసరం ఉంది.

గబ్బిలాలు మనం వినలేని శబ్ద తరంగాలను సృష్టించుకొంటూ రక్షణ, పోషణ, ప్రత్యుత్పత్తి - ఇత్యాది ప్రక్రియలను నిరాటంకంగా నిర్వర్తించుకొంటూ ఉంటాయి. మనం వినలేనంత మాత్రాన ఆ జంతువులో భాష లేదని భావ వినిమయం లేదని అనుకో కూడదు. చేపలలో ప్రత్యేకమైన విద్యుత్తును జనింపజేసే ఉపాంగాలు ఉండి మెరుపుల రూపంలో సముద్ర మధ్యంలో భావ వినిమయం జరుగుతుంది. ఇది ప్రకృతిలో అపూర్వమైన విషయం. తేనె టీగలలో మానవ సంగీతాన్ని మరిపించే మధురమైన శబ్దం ద్వారా భావ వినిమయం జరుగుతుంది. ఆహార సముపార్జనకు ముందు, ఆహారాన్ని సేకరించుకొన్న తరువాత - రెండు సమయాలలోనూ తేనె టీగలు ప్రత్యేకమైన శబ్దాలను, కదలికలను ప్రదర్శిస్తాయి. పీతలు భావ వినిమయం కోసం నిర్దుష్టమైన కంపనాలను చూపుతుంది. అగ్ని కీటకాలు నిప్పురవ్వలను ప్రదర్శిస్తూ ఎంతో ఫలవంతంగా తమ జీవితాన్ని గడుపుకొంటాయి. వృశ్చిక జాతిలో ప్రత్యేకమైన శోభనరాత్రి నృత్యం ఒకటి ఉన్నది. ఈ నృత్యాన్ని మృత్యు నృత్యమని పిలుస్తారు. ఎందుకంటే స్త్రీ వృశ్చికము పురుష వృశ్చికం చేసే శబ్దాన్ని బట్టి, ప్రదర్శించే అను కంపనాలను బట్టి తన జాతికి చెందిన వృశ్చికమా? కాదా? అన్నది నిర్ణయించుకొని తన జాతికి చెందని మగ వృశ్చికమైతే నిర్దాక్షిణ్యంగా చంపివేస్తుందని ఒక ప్రతీతి. అది వాస్తవం కూడ! (జాతిలో ఎన్నో ఉపజాతు లుండవచ్చు కదా!) పక్షులలో కిల కిలలు, రవ రవలు ఉన్న మాట మనకు తెలిసినదే. మృగాలలో సందర్భాను సారంగా వెలువడే అరుపులు, చరుపులు మనం రోజూ చూస్తున్నవే. మనుష్యుల మలే బాధ పడడం, సంతోష పడటం, ఆశ పడటం, కోరిక పెంచుకోవడం, భయ పడటం, భయ పెట్టటం వంటి అన్ని లక్షణాలను జంతువులు ప్రదర్శిస్తాయి. అలాగే ఆకలి, అభిమానం, ప్రేమ పగ, ద్వేషం, ప్రతీకారం, ఘర్షణ, నొప్పి - వంటి లక్షణాలను సయితం జంతువులు మానవుల మాదిరే ప్రదర్శిస్తాయి. జంతువులు మాటలాడలేవు. మనుష్యులు మాటలాడ గలరు. జంతువులకు అక్షరజ్ఞానం లేదు. రాదు. మనుష్యులకొక్కరికే ఉంది ఉంటుంది అనే అభిప్రాయానికి రావడం జరుగుతుంది. అయితే మనుష్యుల మాదిరే జంతువులు కూడ మాటలాడగలవని చిలుక పలుకులు విన్నప్పుడు తెలిసొస్తుంది. చింపాంజీలు ఏ బీ సీ డీ లు రాయడాన్ని చూస్తే జంతువులకు కూడ అక్షర జ్ఞానం ఉండే అవకాశం ఉందని బోధపడుతుంది. ఇదీ పరిస్థితి. ఇటువంటప్పుడు మనుష్యులకు, జంతువులకు ఏవిధమైన భేదమూ లేదనే నిర్ణయానికి రావలసి ఉంటుంది. అది నిజం కూడ! అమీబానుంచి మనిషి వరకు ఒకే విధమైన జన్యు సంభావన ఉండడం - ఉన్నదనడం శాస్త్ర సత్యం

అస్సాం, మేఘాలయ ప్రాంతాలలో డి. డి. టి. వంటి రసాయని కాలను ఇండ్ల లోపలి గోడలపై చల్లుతుంటే దోమలు లోపల వాలడం మాని బయట వాలడం నేర్చుకొన్నాయి. కీటక స్థాయిలోనే ఇంత తెలివి తేటలు ఉన్నప్పుడు పరిణామ పరంగా అనూహ్యమైన స్థాయికి చేరుకొన్న మనిషి ఎంతో తెలివిగలవాడై ఉండటంలో ఆశ్చర్యమేమీ లేదు. మనిషి ఆ విధంగా తెలివి పరంగా జంతువు నుంచి వేరుపడు తున్నాడని భావించవచ్చును.

కాబట్టి శాస్త్రాధారాలతో సమీక్షిస్తే మనిషి కూడ ఒక జంతువేనని సందేహం లేకుండా తెలుస్తుంది. అయితే మనిషికి ఉన్న బుద్ధి కుశలత జంతువుకు లేదు. ఆలోచనా శక్తి కూడ లేదు. ఒకవేళ ఉన్నా వాటి శాతం అత్యల్పంగా ఉంటుంది. మనిషి ప్రకృతిని పరిశీలించగలడు. అర్థం చేసుకోగలడు. విశ్లేషించుకోగలడు. ప్రమాదాలను గుర్తించగలడు. భవిష్యత్తును ఊహించి తన ఉనికికి భంగకరం కాని దిశలో తన జాతిని సుస్థిరం చేసుకొనే ప్రయత్నంలో తనదంటూ ఒక ప్రత్యేకమైన పథకాన్ని రూపొందించుకొంటాడు. అతనికి ఆత్మ విమర్శనా శక్తి ఉన్నది. ఆ శక్తి జంతువుకు లేదు. అనుభవాలు మనిషికి, జంతువుకు ఒకటే అయినా అనుభూతం చెందే విషయంలో ఎంతో భిన్నత్వం ఉంది. మనిషి అనుభూతి స్థాయి సంతృప్తం చెంది ఆత్మ వివేచనతో అలరారుతుంది. జంతు స్థితి అలాకాదు. దాని అనుభూతికి మానవానుభూతి కున్నంత రసస్ఫూర్తి ఉండదు. అయితే కొందరు మనుష్యులు జంతువులలాగా ఉండడమనేది వేరే సంగతి. దీన్ని వివరించడానికే సంస్కారపద ప్రయోగం జరిగింది. పరిపూర్ణమైన మానసిక వికాసంతో విరాజిల్లే ఆత్మ వివేచనా సంపత్తిని సంస్కారమని అనుకోవచ్చు. సంస్కార వంతుడు మాన్య రస భావుకతతో జీవితం పట్ల అర్థవంతమైన అవగాహనను కలిగి ఉంటాడు. అలా కాని వాడు స్వరూపరీత్యా మానవుడు కావచ్చును కాని, భావ ప్రకటన రీత్యా మానవుడు కాలేడు. జంతువుకు సంస్కారం ఉండే అవకాశం చాల తక్కువ (సంస్కారానికి విశ్వాసానికి ఎంతో వ్యత్యాసముంది. ఈ విషయాన్ని విజ్ఞులు గుర్తించాలి). కాబట్టి మనిషికి జంతువుకు ఉన్న భేదమల్లా ఒక్క సంస్కారమనే తెలుస్తుంది. ఈ సంస్కారంలో ఉండే వ్యత్యాసం వల్లే మానవానుభూతి జంతు అనుభూతికి భిన్నంగా ఎంతో విశిష్టంగా ఉంటుంది. ఈ విషయంలో సందేహం లేదు. దీనిని అంగీకరించడానికి శాస్త్ర పరిజ్ఞానం అక్కరలేదు. మాననీయమైన మానవ ప్రకృతిలో లీనమై ఆ రసార్ద్రతలో తల మునకలై స్పందించి ధ్వనించగలిగితే మానవానుభూతి కున్న ప్రాముఖ్య మేపాటిదో తెలిసొస్తుంది. భారతీయ సనాతన ధర్మం ఈ విషయాన్ని ఎంతో చక్కగా విపులీకరించి ఉండడం మన అదృష్టం. దానిని నిలుపుకొందాము.

[ డోనాల్డ్. ఆర్. గ్రిఫిన్ రాసిన "ది క్వొశ్చెన్ ఆఫ్ అనిమల్ అవేర్‌నెస్" చదివాక ఇది రాయాలనిపించింది. ]



# బాష్పవర్షం

## శ్రీ రా. శివశంకర శర్మ

ప్రపంచంలోని అనంతమైన దుఃఖాన్ని చూసి
గ్రీష్మంలా మండి మండి
నీటిలోనికి మింగి, మింగి, బిగపెట్టి
ఇక దుఃఖాన్ని ఆపుకోలేక
తనలో మూగిన నల్లని మబ్బులతో ఊపిరాడక,
భోరుమని యేడ్చివేసింది, గుండె చెరువైపోయి
చెరువులే నిండిపోయేలా ఆకాశం.

వానలో తడిసిన చెట్లు ఆకుల కొనల నుంచి
నీటి బొట్లను జారవిడుస్తుంటే
గుండెలు విచ్చిపోయే ఆకాశ దుఃఖాన్ని చూసి
కనుగొనల నుంచి కన్నీరుగా కరిగిపోతున్నట్లనిపిస్తుంది.
జడమైన చెట్లు చేమలు, ఇంటికప్పులు కూడ
చుక్కలు చుక్కలుగా నీటిబొట్లను జారవిడుస్తుంటే
ప్రపంచంలోని దుఃఖానికి, ప్రపంచ హృదయమే,
కన్నీటిగావిచ్చి, మున్నీటిగా మారిపోతోందనిపిస్తుంది.
నిజానికి స్వపర భేదాలు లేని సర్వసమాన దృష్టితో
ప్రపంచాన్ని పరికించగలిగితే,
ఈ జీవరాసుల దుఃఖానికి, కన్నీళ్ళు కనుకొనల నుంచి
మొదటి రోదనలోనే పూర్తిగా జారిపోయి,
కన్నీళ్ళు చాలకంనెత్తురెరువు తెచ్చుకొని
అంతిమ రక్తబిందువు వరకు ప్రవహించిపోయి,
"వార్షుక మేఘంలా కరిగిపోయి
ఒక్కొక్క మనిషి ఒక్కొక్క చెరువైపోతాడు.
ఆ కన్నీళ్ళ ప్రవాహం మీద కరుణలేని దేవుడు
వటపత్రం పరచుకొని నిద్రపోతాడు మామూలుగా.

శ్రీ సర్దేశాయి తిరుమలరావు

# మానవాత్మలో సమసమాజం

అరణ్య పర్వంలో హనుమంతుడు, భీముడు కలుస్తారు. "అంత పెద్ద ఘటానివి కదా, ఏమి ఇట్లయిపోయినావు? నీవు సముద్రాన్ని ఎగిరేటప్పటి ఆకారాన్ని చూడవలెనని ఉంది చూపించవూ" అని భీముడు మారాము చేస్తాడు. దానికి హనుమంతుడు "కాలం మారింది నాయనా, అప్పటి నా ఆకారాన్ని చూడలేవు. పంచ భూతాలే మారుతాయి. మేము చిరంజీవులమైనా కాలం బట్టి నడుచు కుంటాం. కాలం దురతిక్రమం సుమా" అంటూ మందలిస్తాడు.

కాలం అనంతం అయినా, మన అనుకూలం కోసం భూత, వర్తమాన, భవిష్యత్తు అని విభజించుకొన్నాము.

కాలం అనేదేలేదనీ, అది ఆత్మాశ్రియభావమే కాని వస్త్వాశ్రియ ధర్మం కాదనీ ఒక వాదం. లవణరాజు కలలో (యోగ వాసిష్టం) జీవితకాలమంతా కొద్ది నిమిషాలలో అనుభవంలోకి వస్తుంది. అది ఇంద్రజాలం క్రింద, మనోభావం క్రింద జమ లోనికి వస్తుంది. ఐన్‌స్టిన్ రిలెటివిటీ సిద్ధాంతానుసారం, కాలం ఆకాశంలో భాగం.

సాంఘిక శాస్త్రజ్ఞులు కాలంను "సమస్యల ప్రవాహం" గా పరిగణిస్తారు. కాలగమనాన్ని రెండు విధాలుగా రూపించుకోవచ్చు. ఒకటి – కాలం బాణం వలె ముందుకు దూసుకొని పోతూ వుంటుంది. పునరావృతం అయ్యే రాత్రింబవళ్ళు, ఋతువులు చూస్తే, కాలం చక్రంవలె దొర్లుతూ, తిరుగుతూ పోతూవుందనడం. రెండు – కాలం వెనుకకు పోవడం వుండదు. ఉంటే ముసలివాడు పిల్లవాడై, కూనై, పిండమై, శుక్లశోణితాలై, రక్తమై, అన్నసారమై, అన్నమై, గింజలై పోవలసిఉంటుంది. "ఎచ్చట బుట్టెనచ్చటికి నేగుట సైజము ప్రాణకోటికిన్" అనే భాగవత పద్యంలో ఇట్టి అర్థమిచ్చే పంచాగ్ని విద్య చెప్పబడిందంటారు.[1] దేహంనుండి వెలువడిన జీవుడు ఆకాశం చేరుకొని, మేఘాల ద్వారా వర్షింపబడి, ఆహారమై, శుక్ల శోణితాలై పిండమై పుట్టుతాడట. ఇది అనంత వలయంగా సాగిపోతుంది. కాంతికిరణం కంటే ఎక్కువ వేగంతో ఏదైనా వస్తువు పయనించే పక్షంలో, సూర్యుని నుంచి ఆ వస్తువు "నేడు" బయలుదేరి "నిన్న" రావచ్చునని పదార్థ జ్ఞానికు లను కున్నారు.

గతాన్ని మెచ్చుకొనేవారు, వర్తమానాన్ని మెచ్చుకొనేవారు, భవిష్యత్తును మెచ్చుకొనేవారు అని మూడు రకాలవాళ్ళుంటారు. వాళ్ళ కాలాన్ని నెమరువేసుకొంటూ ఉండేవారు, భూతకాల ప్రియులు. వీరి నినాదం "గత కాలము మేలు వచ్చు కాలము కంటెన్". ఇది వ్యాసుడు తన ముసలి తల్లి సత్యవతితో చెప్పిన వాక్యం. నీ మునిమనుమలు కొట్లాడుకొని చస్తారు. దాన్ని మీరు చూడలేరు. వానప్రస్థానికి పొండి అని అమెకూ, అమె కోడం డ్రకూ హితం చెబుతాడు.

చిన్ననాటి నేస్తాన్ని గురించి స్కాట్‌లాండ్ కవి రాబర్ట బర్న్సు వ్రాసిన ఈ విశిష్టమైన పద్యం చూడండి.

### బహుకాల దర్శనం

చిరకాల నేస్తాన్ని మరచిపోవలెనా
మతికి తెచ్చుకోకూడదా?

**పంతపాట**

ఎన్నాళ్ళకెన్నాళ్ళకు ప్రియతమా
ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు
బహుకాల దర్శనం.

పాతకాలపు నెనపులకు
దయారసం ఆస్వాదించుదాం మనం
ఇద్దరం కొండ కోనల్లో పచిగెత్తినాం
మంచి బంతిపూలను తెంచినాం
కాళ్ళ రిగేటట్లు తిరిగినాం
ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు
బహుకాల దర్శనం.

మనిద్దరం వాగుల్లో ఆడినాం
పొద్దుపొడుపు నుంచీ అంబటిపూటదాక
మనమధ్య సంద్రాలు గర్జించినాయి
ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు
బహుకాల దర్శనం.

ఇదుగో నా చేయి అనుంగుసోదరా
ఏదీ నీ చేయి ఇయ్యి
మంచి పానీయాన్ని తాగుదాం
ఎన్నాళ్ల కెన్నాళ్ళకు
బహుకాల దర్శనం.

నీవు నీగిండివి కమ్ము
నేను నాదవుతాను
మనం సౌహార్దరసాన్ని ఆస్వాదించుదాం
ఎన్నాళ్ల కెన్నాళ్ళకు
బహుకాల దర్శనం.

బర్న్సు ఒక జానపద గీతం ఆధారంగా స్కాటిష్ భాషతో వ్రాసినాడు. ఇందులోని అనిర్వచనీయమైన కరుణార్ద్రత చూపించ డానికే తెలుగు చేసినాను.

యుద్ధం ముగిసిన తర్వాత లక్ష్మణుడు "ఈ లంక బంగారం లా గుంది. ఇక్కడే ఉండిపోదా" మంటాడు. అప్పుడు శ్రీరాముడు బంగారంలాగేమో ఉందికాని, ఒరే లక్ష్మణా ఇదినాకు నచ్చలేదు. "అమ్మా, పుట్టిన వూరూ స్వర్గం కంటె గొప్ప నాయనా, పద అయో ధ్యకు" అంటాడు. జనని సరే. జన్మభూమి ఎందుకు? ఇందుకు. పట్టి, బాల్యం ఎక్కడ గడిపి ఉంటారో ఆ స్థలం ప్రీతికరం. "ఉత్తర రామచరితం"లో శ్రీరాము డిట్లానే అంటాడు. తండ్రి బ్రతికి ఉండగా, తమకు కొత్తగా పెళ్ళయివుండగా, తల్లులు తమ గురించే మాట్లాడుకొంటున్న ఆ రోజులు పోయినాయి. కేవలం జన్మస్థలం ముఖ్యంకాదు. ఒకడు విమానంలో పుట్టుతాడు. ఒకడు ఆర్.టీ సీ. బస్సులో పుట్టుతాడు. వారికి విమానం మీదనూ, బస్సు మీదనూ మమకారం ఉండదు. శ్రీకృష్ణుడు మధురలో, జైలులో పుట్టుతాడు. ఆయనకి మధుర అన్నా, జైలు అన్నా అంత ఇష్టం వున్నట్లు దాఖలాలేదు. బాల్యాన్ని గడిపిన గోకులమంటేనే ఆయన కిష్టం. వసుదైవకుటుంబీకుడైన నెహ్రూకు ఆయన బాల్యం గడిపిన అలహాబాదు, అచటి త్రివేణీ సంగమం అంటే ప్రత్యేకాభిమానం. నా పిడికెడు చితాభస్మాన్ని అలహాబాదు గంగాతీరాన కూడా చల్లండి అని తన వీలునామాలో వ్రాసుకొన్నాడు.

"మాతాచ పార్వతీదేవి, పితాదేవో మహేశ్వర బాంధవా శ్శివ భక్తాశ్చ స్వదేశో భువనత్రయం" అనే స్థాయిలో వుండే యోగి, "కందిమల్లయపల్లి మావూరు" అంటాడు. ఇదీ కీలకం. "దాని సిగ్గోసిన గోపురం, గోపురమున్నదే కావలసివుంటే మావూరు రండి" అని పుల్లంభట్టు అంటే, నారాయణభట్టు "మీవూరి గోపురం యెవరి క్కావాలిరా! నీకు బోధపడదు. చిన్నతనంలో ఎప్పుడూ ఆ గోపురం మీదనే" అంటాడు.2 ప్రపంచాన్నంతా పర్యటించి విదేశ స్త్రీని పెండ్లాడి, మంచి ఉద్యోగం చేసి, రిటయిరయి, టంచనుగా ఫించను పుచ్చుకుంటూ హాయిగా జీవించే డాక్టరు దేవ బంధుకు, అతడు అంజిగా వుండి చింతలపల్లెలో చెలమనీరు త్రవ్వి త్రాగే పిన్ననాటి రోజులే హఠాత్తుగా కలలో వస్తుంటాయి.3 మన అందరి లోనూ "అంజి" దాగి వుంటాడు. మనం స్మృతి జీవులం.

గురజాడ "మీ పేరేమిటి" కి పోదాము. కథా భాగం - "మనస్సులు గత కాలమునాటి స్థితి గతులను గూర్చిన ఊహలతో నిండి యుండెను. తలపోసి తలపోసి 'ఆనాడు యీ స్థలం ఎలా వుండెనో బౌద్ధులు యేమేం చేసినారో' అని నేనంటిని".

"ఆ పీనుగులూ మనలాగే యేడుస్తూ వుండేవారు. మన కంటే అధ్వానంగా ఉండేవారు" అని సున్నితమైన తలంపులు బెదరి చెదిరే పెళుసు గొంతుకతో వెంకయ్య అరిచాడు. ఖాయిదా లావు చేసి తిట్లు తిట్టే మాష్టారు వెంకయ్య.

గతం నశోచామి, కృతం స్మరామి. గతంలో ఏముంది? ఉండేదే ఇంక మీదట అనేది రెండవ వర్గం. వీరి ప్రకారం, "గత కాలము కంటె మేలు కాలము వచ్చున్".4

సర్ థామస్ మోర్, నీష్టే, బెర్నార్డ్‌షా, అరవిందుడు, టీల్ హర్డ్ డిచార్డిన్, బ్రౌనోస్కి మున్నగువారు, పురుషుడు పురు షోత్తముడు (సూపర్‌మన్) కానున్నాడనీ, మానవుడు అత్యున్నత స్థానానికెదుగు తాడనీ వీరి తపన, తపస్సు. "మానవాళికి నిజంగానే మంచికాలం రహిస్తుందా?" అని శ్రీశ్రీ తపిస్తాడు. "వెనుక చూచిన కార్యమేమోయ్, మంచి గతమున కొంచమేనోయ్, మందగించక ముందు కడుగేయ్, వెనుకబడితే వెనుకెనోయ్" అని గురజాడ అంటే "పదండి ముందుకు పైపైకి" అని శ్రీశ్రీ పురమా యిస్తాడు.

గత కాలాన్ని స్మరిస్తూ వుండేవానిని ఛాదస్తుడనో, వేదాంతి అనో నవ్వుకొని వూరకుంటాము. భవిష్యత్తు గురించి మాట్లాడే వానిని క్రాంతదర్శిఅనో, విప్లవవాదిఅనో, ఆదర్శవాది అనో, దివా స్వాప్నికుడనో మంచి పదజాలాన్నే వాడుతాము. గతం పోయింది. భవిష్యం రాలేదు. వాటిజోలి మనకెందుకు. ఉన్నది ఈనాడు. ఇప్పుడే మనం ఆనందం అనుభవించవలె అనే వానిని నాస్తికు డనీ, హిడొనిస్టు అనీ శాపనార్థాలు పెట్టుతాము. ఏమి న్యాయం?

కనపడేవాని కన్నా కనపడనిది బాగున్న ట్లనిపిస్తుంది. అందుకే ఆదర్శపరిస్థితులు భూతకాలంలోనైనా వున్నట్లు చెప్పు తారు. భవిష్యత్తులోనైనా వుంటాయని చెప్పుతారు. రామరాజ్యం

భూతకాలంలో సుండిన ఆదర్శ రాజ్యమని కొందరంటారు. తమ గృహచ్ఛిద్రాలతో ప్రజల ప్రాణాలు తోడే నేటి మంత్రుల వలెనే, శ్రీరాముని రాజ్యమూనూ, అనేది మఱచిపోతారు.

పదునాఱవ శతాబ్దంలో సర్ థామస్ మోర్ ఒక ఆదర్శ సాంఘిక వ్యవస్థను భావించుకొని ఉటోపియా అనే పేరుతో ఒక గ్రంథంలో ఆ వ్యవస్థను విశదంగా వర్ణించినాడు. గ్రీకు భాషలో 'ఉ' అంటే కాదు. 'టోపియా' అంటే స్థలం. ఉటోపియా అంటే నోవేర్ అని అర్థం. ఆదర్శంగా ఏదీ ఎక్కడా వుండదు అటు వంటి ఆదర్శ స్థలమే ఉటోపియా. ఎక్కడా లేని స్థలం. ఈ పదాన్ని నేను "అతలం" అంటాను. ఇది ఉటోపియాకు సమానం. నా "అతలం" మన అధోలోకాల్లో ఒకటికాదు. "అతలం" ఎక్కడా లేని స్థలమన్నాను. అది అస్థలం - మోర్ యొక్క ఉటోపియా.

మేధావులు ఎన్నో ఆదర్శ వ్యవస్థల గురించి కలలు కన్నారు. వర్ణించినారు. ప్రణాళికలు తయారు చేసినారు. "బ్లూప్రింటు" లు రచించినారు. కొన్ని అతలాలు భూతకాలమం దుండగా, కొన్ని అతలాలు భవిష్యత్తులో ఉంచబడ్డాయి. మొదటివి విస్మృతి పథంలోనివి కాగా రెండవవి క్రాంత దృష్టిపథంలోని విగా కన్పిస్తాయి. మొదటివి రాత్రి కలలు. రెండవవి పగటి కలలు. బేకను నవ్య అట్లాంటిస్, గాంధి "రామరాజ్యం" భూత కాలంలో వుండినాయనుకొని, భవిష్యత్తులో స్థాపించవలెనని అను కొనే అతలాలు ఎక్కడా లేని, ఉండని, ఆదర్శ వ్యవస్థలని వర్ణించిన అతలాలు ప్లేటో రిపబ్లిక్, థామస్‌మోర్ ఉటోపియా, విలియం మారిస్ "అతలం నుంచి వార్తలు", గురజాడ "దేశభక్తి" గేయం. శాస్త్ర, సాంకేతిక విజ్ఞాన విడంబనం వల్లనూ, ఏకపక్ష నియంతృత్వరాజ్యాల విజృంభణవల్లనూ పరిణమించే ఘోరపరిస్థితు లను వర్ణించే అతలాలు ఉన్నాయి. వీటిని దుస్థలాలు (డిస్టోపియా) అనవచ్చు. ఆల్డస్ హక్సులే బ్రేవ్ న్యూ వర్ల్డు, జార్జిఆర్వెల్ "1984", వెల్స్ నేటి ఉటోపియా, సోల్జనిత్సిన్ వ్రాసిన సోవియట్ రష్యా వ్యతిరేక ప్రహసనాలు దుస్థలాలకు కొన్ని నిదర్శనాలు.

"ఇవాన్ మూర్ఖుడు" అనే చిన్నకథలో టాల్స్టాయ్ ఆదర్శ వ్యవస్థను ఎంతో హాస్య సరళంగా చిత్రించినాడు. ఆ కథలో మనుష్యుని పతనం చేసే "స్వంత ఆస్తి"ని బలపఱచే సైతాను "తలకాయ పని" చేస్తూ చేస్తూ బుర్ర పగిలి చచ్చిపోతాడు.

జోనాథన్ స్విఫ్టు మానవుణ్ణి ఎంతవరకు తిట్టవచ్చునో అంతవరకూ నోరారా తిట్టిపోసినాడు. "గలివరు యాత్రలు" అనే గ్రంథంలో మానవజాతినే ఖండించివేస్తాడు. గలివరు, యాత్రికు పోయిన దేశాల్లో "హ్యూహెనెం" అనే అశ్వద్వీపం ఒకటి. ఈ దేశంలో గుర్రాలదే పారుపత్యం. వీనికి చాకిరీ చేసేందుకు "యాహూ"లు అనే పరమ నికృష్ట మృగా లుంటాయి. ఈ యాహూ లెవరనుకొన్నారు? మనమే! హ్యూహెనంల గుణ గణాలని మన గలివరు (ఇతడు వాని దృష్టిలో యాహూయే) ఇట్లా ఉగ్గడిస్తాడు.

స్నేహ దయా దాక్షిణ్యాలు హ్యూహెనెంలలో సర్వత్రా కనిపించే సుగుణాలు. "అసత్యము" అనేమాట వాళ్ళ భాషలో లేదు. ఆ దేశంలో పదరబోతులు, పరనిందకులు, చాడీకోరులు, జేబు దొంగలు, దారిదోపిడీగాండ్రు, కన్నపుదొంగలు, వకీళ్ళు, కుంటెన కత్తెలు, హాస్యగాండ్లు, వేటగాండ్రు, రాజకీయవాదులు, చిర్రుబుర్రు లాడేవాళ్లు, అధికప్రసంగులు, రాద్ధాంతులు, స్త్రీనిమానభంగంచేసే వాళ్లు, హంతకులు, గజదొంగలు, కళాకారులూ లేరు. రాజకీయ పక్షాల ముఠాల నాయకులుకానీ, అనుయాయులుకానీ లేరు. ఆశ చూపెట్టికానీ, ఆచరణద్వారాకానీ, వ్యసనాలకు ప్రోద్బలం లేదు. భూగృహకారాగారాలు, గొండ్లు, ఉరికంబాలు, కొరడాదెబ్బలు వేసేముందు కట్టేకంబాలు, నేరంచేసినవాణ్ణి జనులు హేళన మొద లగువానికి గురిచేసేందుకు అనువుగా వాని చేతులను, తలను, రంధ్రంలో బిగించి బహిరంగంగా ప్రదర్శించే కొయ్యచట్రాలు లేవు. దగాచేసే అంగడివాళ్లు, యంత్రకారులూ ఉండరు. గర్వం, దంభం లేవు. డాబుసరాయళ్లు, పేచీకోరులు, త్రాగుబోతులు, సంచార వేశ్యలు లేరు. గయ్యాళిగంపలైన భార్యలు, బుద్ధిహీనులు, పండితమ్మన్యులు, ఎప్పుడూ అరుస్తూ, కాట్లాడుకొనే స్నేహితులు, పుండాకోర్లు లేరు. భూస్వామ్య ప్రభువులు, ఫిడేలు వాయించే వాళ్లు, న్యాయమూర్తులు, నట్టువకాండ్రూ లేరు.

మన సంఘంలో ఏయే చెడుగులు వున్నాయో వాటిని ఏక రువు పెట్టుచున్నాడు స్విఫ్టు. ఆదర్శవ్యవస్థలో అవివుండరాదని చెబుతున్నాడు. ఇక "యాహూ"లనే మృగాల (అంటే మనుష్యులే) ప్రవర్తనను "హ్యూహెనెం" లలో శ్రేష్ఠుడొకడు గలివరు కిట్లు చెప్పుచున్నాడు.

"యాహూలు ఇతర మృగములకంటె తమను తాము ఎక్కు వగా ద్వేషించుకొంటాయి. ఐదు యాహూలకు, యాభై కి సరి పోయే మేతవేస్తే శాంతంగా మెక్కక, ప్రతియొక్కటీ అంతా తనకే కావలెనని చెవుల బట్టిపొని గుంజులాడుతాయి. రంగురంగుల మెరసే రాళ్లంటే (అవి నవరత్నాలు) యాహూలకు పిచ్చిప్రేమ. యాహూల విషయమై ఇంకొక ఆశ్చర్యకర సత్యమేమంటే, వాటికి అశుచిపైనా, గబ్బుపైనా ఉండే ఆకర్షణ. ఇతర జంతువులకు శుభ్రత నైజగుణం.

యాహూలను ఏహ్యజంతువులుగా చేసే గుణం ఏదంటే, చేతికి చిక్కిందాన్నెల్లా మింగివేసే తీరని భక్ష్యాభక్ష్య క్షుత్తు. ఇంటిలో గాడి పట్లలో వేసిన నాణ్యమైన మేతకంటే, దూరంనుంచి కొల్లగొట్టిన లేదా దొంగిలించిన తిండి అంటేనే ఇష్టపడుట యాహూల ఇంకొక చిత్రగుణం. అన్ని విధాలైన రోగాలు వచ్చేది ఒక్క యాహూలకే. దీనికి ఔషధమేమంటే వాటి పీయ, ఉచ్చ కలిపి కషాయం చేసి వాటి గొంతులో పోయుటే.

గలివరు యాత్రకు పోయిన "మహాకాయుల" ద్వీపం (Brobdingnag) రాజు గలివరు దేశపు మనుషులు భూమ్మీద ప్రాకే అసహ్యక్రిములలో నికృష్టతములు అని తన తీర్పును ఇస్తాడు.

స్విఫ్టు మానవుని ఆశాపాతకత్వాన్ని, దౌష్ట్యాన్ని, అసమతల దర్పణాలతోనూ, సూక్ష్మదర్శినితోనూ, దూరదర్శినితోనూ అనేక కోణాలలో నిశితంగా పరీక్షించినాడు. మైలము భీముని ఖడ్గసృష్టికి ఏమేమికావలెనో అవి స్విఫ్టు రచనకూ కావలెను. స్విఫ్టు తన కాలము నాటికే ప్రబలిన ధన స్వామ్య వ్యవస్థను చిత్రిస్తున్నాడు.

ఆస్తి, ధనశక్తి, దోపిడీ అనే పెట్టుబడిదారీ విధాన లక్షణాల ఖండనే స్విఫ్టు మహాశయుడు చేస్తూన్నది. ఆస్తులు కలిగిన విరామ వర్గంవారి రాకాసితనాన్ని వెబ్లెను, ది థియరీ ఆఫ్ లీషర్డ్ క్లాస్ లో మెత్త మెత్తగా మొత్తినాడు.

సైంటు అగస్టీను "దేవరాజ్యం" అనే ఆదర్శక్రైస్తవ అతలం వ్రాసినాడు. అటువంటిదే యాగంటి లక్ష్మప్ప "మావూరు". యాగంటి లక్ష్మప్ప తత్వం పూర్తి పాఠం ఇస్తున్నాను:

"ఏ వూరయ్యా మీదేవూరు - పరబ్రహ్మ నిర్మాణమే మావూరు - కందిపల్లియ పల్లె మావూరు - కాలకర్మలబాపును మావూరు - కనుల యెదుట నుండును మావూరు - అట్లు కనవచ్చు కనరాదు మావూరు - ఇంటిలోపలి పుట్ట మావూరు - పాములంటితే ఫలమిచ్చు మావూరు - కర్మ జీవులకెల్ల మావూరు - అంధకారమై యుండును మావూరు - కర్మలు తెగితేను మావూరు - పండువెన్నెలై యుండును మావూరు - రోగాలు లేవయ్యె మావూరు - నిత్యభోగాలు కలిగుండు మావూరు - కనికానకున్నది మావూరు - ముక్తికారణమై యుండు మావూరు - పాపల నడుమను మావూరు - బట్టబయలై యుండును మావూరు - శృంగారమై యుండు మావూరు - శ్రీరంగమై యుండు మావూరు - తల్లి గోవిందమ్మ మావూరు - తండ్రి వీరబ్రహ్మ మావూరు".

ఇందు ఆధ్యాత్మికతతోపాటు ఆ గ్రామం లౌకికాదర్శాలు కలిగినట్లు సూచింపబడుట విశేషం.

సంఘం ఎట్లా నిర్మింపబడవలెననేందుకు రెండు నమూనాలను ఎంపిక చేయవచ్చును. మార్క్సీయ దృక్పథంలోని ఆదర్శ కమ్యూను, పోపరీయ దృక్పథంలోని "క్రమ క్రమ సాంఘిక ఇంజనీరింగు". దిగువ పట్టికలో పైని రెండు విధానాలు పొందు పరుపబడ్డాయి.

| అంశం | సమస్యా పరిష్కార పద్ధతి (పోపరు) | ధ్యేయనిర్ణయ పద్ధతి (మార్క్సు) |
|---|---|---|
| కాలం | భూతం, వర్తమానం | వర్తమానం, భవిష్యత్తు |
| తక్షణధ్యేయం | సమస్యానిర్వచనం | లక్ష్యనిర్ణయం |
| అంతర్గతతత్వం | వర్తమానవ్యవస్థలోని లోపాలను కనిపెట్టుట | ప్రపంచం ఎలావుండవలెనో అనిఅనుకొనుట |
| రాజకీయ పర్యవసానాలు | స్వేచ్ఛావాదం, విషయాల అందుబాటు, పబ్లిక్ డిబేటు, ప్రభుత్వ విమర్శ | "ప్రణాళిక"నుఅమలులో పెట్టుట. చర్చాబహిష్కారం, వైవిధ్యాన్ని అణచివేయుట |
| సాగింపు | ప్రస్తుత చెడుగుల నివారణ | భవిష్యత్తులో మంచిది కలుగుట |

పైని పట్టిక చూస్తే మొదటి పంథా సంస్కారమనీ, అందు మార్పు క్రమాగతమనీ; రెండవ పంథా విప్లవమనీ, అందు మార్పు హఠాత్సంభవమనీ తెలుస్తుంది.

గురజాడ "దేశభక్తి" గేయంలో మొదటి మార్గం సూచించబడింది. ఉన్నవ "మాలపల్లి" నవలలో తక్కెళ్లపల్లి జగ్గని ద్వారా రెండవమార్గం సూచించబడింది. వాటిని పఠనా సౌకర్యార్థం పూర్తిగా ఇస్తున్నాను.

## దేశభక్తి (గురజాడ)

దేశమును ప్రేమించుమన్నా
మంచిఅన్నది పెంచుమన్నా
వట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్

పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటుపడవోయ్

తిండికలిగితే కండకలదోయ్
కండకలవాడేను మనిషోయ్

యీసురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయ్
జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశి సరుకులు నించవోయ్

అన్నిదేశాల్ క్రమ్మవలెనోయ్
దేశిసరుకుల నమ్మవలెనోయ్
డబ్బు తేలేనట్టి నరులకు
కీర్తిసంపద లబ్బవోయ్

వెనుక చూచిన కార్యమేమోయ్
మంచి గతమున కొంచమేనోయ్
మందగించక ముందు అడుగేయ్
వెనుక బడితే వెనుకెనోయ్

పూను స్పర్ధను విద్యలందే
వైరములు వాణిజ్యమందే
వ్యర్థ కలహం పెంచబోకోయ్
కత్తివైరం కాల్చవోయ్

దేశాభిమానం నాకుకద్దని
వొట్టిగొప్పలు చెప్పుకోకోయ్
పూని యేదైనాను వొక మేల్
కూర్చి జనులకు చూపవోయ్

ఓర్వలేని పిశాచం దేశం
మూల్గులు పీల్చేసెనోయ్
ఒరులమేలుకు సంతసిస్తూ
ఐకమత్యం నేర్చవోయ్

పరులకలిమికి పొర్లి యేడ్చే
పాపికెక్కడ సుఖం కద్దోయ్
ఒకరిమేల్ తనమేలనెంచే
నేర్పరికి మేల్ కొల్లలోయ్

స్వంతలాభం కొంతమానుకు
పొరుగువాడికి తోడుపడవోయ్
దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్

చెట్టపట్టాల్ పట్టుకొని
దేశస్థులంతా నడవవలెనోయ్
అన్నదమ్ములవలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయ్

మతం వేరైతేను యేమోయ్
మనసు వొకటై మనుషులుంటే
జాతమన్నది లేచి పెరిగి
లోకమున రాణించునోయ్

దేశ మనియెడి దొడ్డవృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయ్
నరుల చమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయ్

ఆకులందున అణగి మణగి
కవిత కోయిల పలుకవలెనోయ్
పలుకులను విని దేశమందభి
మానములు మొలకెత్తవలెనోయ్

పైని గీతంలో థామస్ పెయిన్, బెంథాము, గాంధీ భావాలు ఇమిడి ఉన్నాయి. అహింస, సామరస్యం, విపృత సంఘం దీని లక్షణాలు. ఇక తక్కెళ్ళపల్లి జగ్గని ప్రణాళికను చూస్తాము.

### బుర్రకథ (మాలపల్లి)

రామరామ శ్రీరామా రామా – రామా రఘురామా
తక్కెళ్ల జగ్గని ధర్మబోధలు తలపున నిలుపండి
ఆదికాలమున అందరు జనులు అన్నదమ్ములండి
నదులు వనంబులు నానామృగములు నాల్గు సంద్రములు
కొండలు తండలు జలములు పొలములు కుంటలు సెలయేళ్లు
కాయలు పండ్లు పాడిపంటలు ఘనమయినా నా యిండ్లు
అంతరువులా భేదములేక అందరి సొమ్మండి
కుడవాగట్టా వొకరికి బెట్టా కొదవాలేదండి
నానీ భేదములేక లోకము నడుస్తూ వుండేది
మనసు లోపలా చీకు చింతలు మందుకైన లేవు
తొత్తుల దొరల భేదములేని తోడుబంటులండి
అందల మెక్కి మోసే భేదము లసలేలేవండి
ధనికుల పేదల తారతమ్యముల్ తలలు జూపలేదు
అరకువ ఆకలి బాధలప్పుడు అంకురించలేదు
ధనమును గొల్చే దుష్టరోజులు దాపరించలేదు
తిరిపెము కొరకె ధనికుల బీదలు దేవిరించలేదు.

కూటికి గుడ్డకు గుడ్డికుంటలు గోడుచెందలేదు
మాపులు రేపులు మలమల మాడుచు మాలలెండలేదు
భోగ్యము లొక్కట వస్తులొక్కట బొందియుండలేదు
దొరలు మత్తులై నీచభోగములు దొర్లుతుండలేదు
పాటు పడడమె పరువు తక్కువను భ్రాంతిలో పడలేదు
రామరామ .... .... .... రఘురామా
తక్కెళ్ల జగ్గని . . .... . . నిలపండి.
కృతయుగ మందలి ధర్మములెల్ల క్రిందుమీదు గాక
పాపముతోటి కలియుగమంత పండిపోయెనండి
పాప ధర్మములు లోకమంతట పరిసిపోయెనండి
యెక్కడ జూచిన ఆర్భాటములె యెక్కడ ఘోషములె
యెక్కడ చూచిన పోటీలండి యెక్కడ కలవరమె
సన్మార్గంబున జీవయాత్రలు సలుపుట దుర్ఘటము
లోకమందున చక్రవర్తియై లోభుడేలుచుండు
లోకమునందలి ద్రవ్యమంతయు లోభుల పరమయ్యె
అంతా నాదే అంతా నాదే అందురు జనులండి
అంతా మనదే యనెడి రోజులు అంతరించెనండి
పరువిడు కాకులు యిండ్ల మీదుగా పారవెరచుచుండు
యెంగిలి చేయీ కాకులవైపు విసరదు యిల్లాలు
నారాయణమ్మలు యిల్లేయంటు నడుతురు యింటింట
యెవరో కొందరు అరువు కొందురు యెల్లద్రవ్యములను
కోటికొక్కరై వున్నారండి కోటీశ్వరుడంటు
కుచేలులందరు అయినారండి కోట్లకొలదిగాను
కోటీశ్వరులకు నిష్టిబిడ్డలు కోట్లకు కర్తలట
మనుమలె గాదూ మనంతరాలు మారుహక్కులంట
అరువు జెప్పితె అడ్డగాలి పనికి పాతికెంట
రామరామ .... . . .. రఘురామా
తక్కెడ జగ్గని ధర్మసన్యాసిల్ తలచి బ్రతుకరండి
ధనికులు బొర్రలు నింపుకొందురు తలప రొకరిబాగు
చేతుల వేళ్ళ పనులు ముట్టక చెవి సోమరులైరి
కాలిమీదనె కాలువేసుకొని కాలం బుచ్చేరు
భాగ్యవంతులకు బీదలెల్లరు బానిసలైనారు
పొద్దుగూకులు చాకిరిచేస్తుపు బొక్కెడికూటికిగా
యెంతచేసినా తృప్తిలేదయా యజమానులకెల్ల
రోగంరానీ నొప్పిరానీ నాగా దప్పదయా
కూలికి విలువగలదని మీరు గుట్టుదెలుసుకొండి
కూలికి దగిన విలువ బుచ్చుకొనే కూలికి మరిపోండి
నీళ్ళ కూలికి వొప్పుకుంటిరా నెవరు జెరుపుకొందుర్రి
ప వాండ్లంవరు యేకమైతిరా ప్రపంచమె మీది
ఐకమత్యమె అన్ని పనులకు ఆధారము సుండి
శ్రేణులు గట్టినమ్మెగట్టితే చెల్లును మీ మాట
కొట్టావద్దు తిట్టావద్దు కోర్కెలు నిడివేరున్
అసహాయ యోగము తరుణము జూచి అవలంబించండి
దానికి మిగిలిన మంత్రితంత్రిముల్ ధరలో లేవండి
శంకలు దక్కి మీరెల్లరు శపథము జేయండి
సమతాధర్మం ప్రపంచమందున స్థాపింతురుగాని
కృతయుగధర్మం లోకమంతటా కుదుటదెట్టగలరు
రామరామ ... ... ... రఘురామా

ఇందులో మహాభారతంలోని భావాలు, చారిత్రక భౌతిక వాదం, మార్క్స్ శ్రమాధిక మూల్యము, కమ్యూనిస్టు మేనిఫెస్టో లోని "ప్రపంచంలోని పనివారలారా ఏకం కండి" మొదలైన అంశాలున్నాయి.

ఇంతకన్నా స్పష్టంగా వెంకటదాసు, వురవు జగ్గని విచారణలో ఉన్నవ, ప్రణాళికను విశదీకరిస్తాడు. ఇప్పుడు "మాలపల్లి" నుండి పూర్తిపాఠం ఇస్తున్నాను. కోర్టువారికి, జగ్గనికి జరిగిన సంవాదమిది. ఇందులో జగ్గని వాఙ్మూలం సోక్రటీసు న్యాయమూర్తులను ఎద్దేవా చేస్తూ చేసిన "అపాలజీ" వలెనూ, గోర్కీ "అమ్మ" 1907 అనే నవలలో పావెల్ కోర్టువారి ఎదుట ఇచ్చిన స్టేట్‌మెంట్ వలెనూ, 1970 లలో శ్రీలంకలో, విచారణ సంఘం ఎదుట విప్లవవాది రోహణ విజయవీర ఇచ్చిన వాఙ్మూలం వలెనూ అన్ని కాలాల్లోనూ ప్రతిధ్వనించేదిగా ఉంది. ఇకమూలం అనుసరిస్తాను.

"వెం: వెంకట దాసే నాపేరు. మధ్యవచ్చిన పేరు మధ్యనే పోనియ్యండి - ఆలోచించుకుంటే నా చరిత్ర యావత్తూ లోకానికి రజ్జుసర్ప భ్రాంతిగా ఉండకపోదు.

కో: వేదాంతివి కూడానా?

వెం: వేదాలను అంతమొందించేవాడని ఆమాట అర్థమిచ్చేటట్టయితే వేదాంతినే

కో: వేదాలనే అంతం చేస్తావా?

వెం: లోక కంటకములయిన ధర్మాలందులో ఉండేవాటిని.

కో: సాక్ష్యమంతా విన్నావుకదా, ఏమి చెపుతావు?

వెం: సాక్ష్యమంతా నిజమే. కొన్ని కొత్త సంగతులు చెప్పుకోవలసి ఉన్నవి. ఉత్తరువు దయ చేయిస్తే చెబుతాను.

కో: దేనిని గురించి?

వెం: పిర్యాదీ, ఇండియా చక్రవర్తి, నే జేసినవి దొంగతనా లంటాడు. నే కాదంటాను. ఆ సందర్భంలో నే జెప్పేది సాకల్యంగా వ్రాసుకోవలసిందని నా కోరిక.

కో: చెప్పుకోవచ్చు. యావత్తూ వ్రాస్తాను.

వెం: సృష్ట్యాదిన హక్కు-స్వత్వాలు లేవు. జనులు సోదర భావంతో భూదేవి యిచ్చిన పంటను అశ్వ స్తనిక భావంతో అందరూ అనుభవిస్తూ ఉండేవారు. గ్రామంలో నిలువ చేసిన ధాన్యాల పాతళ్ళు, గాదెలు, కొట్లు, గ్రామ సంఘాలు గ్రామ సమూహ మునకై ఉపయోగిస్తూ వుండే వాండ్లు. జనులందరికీ సంఘ సేవ దప్ప రెండవ సేవ లేదు. ఆహార పదార్థాలే ద్రవ్యం. ధనకాంక్ష పుట్టలేదు. వెండి, బంగారు పెంకుల కింకా విలువ లేదు. అహో రాత్రాలు వాటిని కాపాడే కాలం కాదు. అంతా పని చేసుకుండే వాండ్లు. ఆరోగ్యవంతులై అనుభవించే వాండ్లు. ఆ రోజులలో సంపాదన అనుభవించడంకోసం గాని దాచుకొని కాపాడడం కోసం గాదు. మనసుకు తృప్తి వుండేది. వ్యాకులమూ, తొందరా, పోటీలు లేవు. సర్మ్వ మనస్కులై ఆనందమనుభవిస్తూ వుండే వాండ్లు. అందరూ భాగ్యవంతులే. దారిద్ర్యమే లేదు. స్వర్గం భూమి మీదనే ఉండేది. ఇట్లా వుండగా ఈశ్వరుడు వచ్చి ప్రపంచ మంతా నాదన్నాడు. నేను గొప్ప వాడిని గనుక నాకు మీరంతా సేవ చెయ్యండన్నాడు. తనకు మేడలు కట్టమన్నాడు. తనను రథ మెక్కించి మొయ్యమన్నాడు. ఈశ్వరుడి ఐశ్వర్యం చూచి చిన్న దేవుళ్లు బయలుదేరారు. త్రిమూర్తులన్నారు. దిక్పాలకులన్నారు. చివరకు మా గణితం ముప్పైమూడు కోట్లన్నారు. ఇంకా పెరి గింది. గ్రామ దేవతలూ, గృహదేవతలు కూడా పుట్టారు. జనుల సంఖ్య కంటే దేవతల సంఖ్య ఎక్కువైంది. కొలువులు సాగినవి. వీండ్లను జూచి కొందరు జనులకు కూడా నోళ్లూరినవి. గురువులు భూ దేవతలమని బయలు దేరారు. పుడమి దయ్యాలై ఐశ్వర్య వంతులు పుట్టారు. యథాశక్తిగా దేశాలు, గ్రామాలూ, క్షేత్రాలు ధన ధాన్యాలు ఆక్రమించుకొన్నారు. మనుష్యులను బానిసలు చేసి, పశుత్వమిచ్చి వారిమీద సైతం స్వామ్యం సంపాదించారు. పోటీ దారు లెక్కువ గావడంచేత గావాలె, ఈశ్వరుడు స్వర్గాన్ని హరించి భూమి మీద నుంచి యెత్తుకొనిపోయి యెక్కడనో పెట్టుకున్నాడు. స్వర్గం భూదేవతలకూ, ధనికులకు కూడా దూరమే అయ్యింది. ఎవరైనా అక్కడి కడుగు పెట్టగలరుగాని వీండ్లకు సాధ్యం కాదు. అది తెలిసి ఐశ్వర్య వంతులు తక్కినవన్నీ అపవుకున్నారు. స్వర్గం భూలోకం విడువంగనే నరకమూ, దుఃఖమూ, అత్యాశా, అతృప్తి, లోభమూ, దారిద్ర్యమూ నస్తులూ అతిశయించినవి. ఇసుక మేట వేసినట్టు ధనం యేకొద్దిమంది దగ్గరనో చేరింది. ఒక చోట పల్లం చేస్తేనే గాని వేరొక చోట మెట్ట యేర్పడదు. భూమి కుంగి చెరువయితే ప్రక్కన కొండ ఒకటి పై కుబుకుతుంది. ఒక ద్వీపం మణిగి వేరొక ద్వీప మేర్పడుతుంది. అశేష జనులూ దరిద్రులై యెవరో కొందరు భాగ్యవంతులయినారు. భాగ్యవంతు లకే భాగ్యం. దరిద్రులకే దారిద్ర్యం నిలకడయింది. రెండూ పెంపు గూడా అవుతున్నవి. సమర్థులయి ఇతరుల ధన మపహ రించిన వారికే గాక, అప్రయోజకులయిన వారి సంతానానికే వార సత్వ ప్రకారం రావలసిందని చట్టాలు చేసుకొన్నారు. కష్టపడి, పంటలు పండించి, చేతిపనులు చేసి అమర్చిన పదార్థమంతా ధన వంతులపహరించి, తిని, తొక్కి, తొందాడి, శ్రమపడి పనిచేసే వాండ్లకు ఆహారం లేకుండా చేస్తున్నారు. వీటికనుకూలంగా చట్టాలు కూడ చేసుకొన్నారు. భాగ్యవంతులు బీదలను దోచుకుంటే దాని పేరు వ్యవహారం. బీదలు తమ హక్కును తీసుకుంటే చౌర్యం బీదల దగ్గరనుంచి మోసంచేసి ఆకర్షించిన ధనం మరల బీదలు లాక్కుంటే యెట్లా తప్పయింనో కోర్టువారు నిర్ధారణ చేయగోరు తున్నాను. ఇటువంటి అక్రమచట్టాల ఔరస సంతానమే బీదల నేరాలు. అశాస్త్రీయ చౌర్యములకంటె, శాస్త్రీయ చౌర్యములే లోకాని కెక్కువ హాని చేస్తున్నవి. భాగ్యవంతులకుపయోగించేది చట్ట సమ్మతం. కానిది నేరం. భాగ్యవంతుల ప్రాణానికి విలువ యెక్కువ. బీదవానికంటే భాగ్యవంతుని శునకమే అతిశయం. బీదలొడ్చిన చమటా, రక్తము కరుడుగట్టి ధనికుని భాగ్యం అవు తుంది. కానీ యిది భాగ్యవంతు డంగీకరించడు. భాగ్యవంతుడు పేదవానికెంత అవసరమో, పేదవాడు భాగ్యవంతునకంత అవ సరం. కాని భాగ్యవంతుడది గుర్తించడు. బీదవాండ్లను భాగ్య వంతుల క్షేమానికి భగవంతుడు సృష్టించాడనే వాండ్ల నమ్మకం. అంతకు తప్ప బీదల జన్మలు ప్రయోజనకారులు గావు. అందువల్ల భాగ్యవంతుల కుపయోగపడని బీదవాండ్లుండ నవసరం లేదు. ఇది కలియుగ ధర్మం. మతకర్తల బోధలు వారి అనుచరుల కక్కర లేదు. వారి ధర్మానికనుగుణమయిన కృతయుగ ధర్మాన్ని పునరుద్ధ రించ వలెనని నా ప్రయత్నము. కలియుగములో రాక్షసులు లేరం టారు. గాని ధనికులే కలియుగరాక్షసులు. మా సంతానుల చర్యవల్ల ధనికుల భారం తగ్గుతుంది. బీదలకు సుఖం కలుగుతుంది. దేశ మాత ప్రసాదించగల సౌఖ్యాలు ఆమె సంతానమంతా సమానంగా అనుభవించడానికవకాశం గలిగి ఇహమే స్వర్గమవుతుంది. దేవ రాజ్యం భూమి మీద తిరిగి పునస్థాపితం కావడమే నా పరమావధి. నా పరమావధే నా దేవుడు. దానిని పొందడమే నా కానందం.

కో: ధనధాన్యాలు, సుఖదుఃఖాలూ పూర్వజన్మ కర్మల వల్ల మానవులకు లభింపవా? తక్కువ నోములు నోచి ఎక్కువ కోరికలు కోరితే యేమి ప్రయోజనం?

వెం: పూర్వజన్మల కర్మలవల్లనే లభిస్తవనుకోండి. భాగ్యవంతులకు ప్రాప్తముండేవారు బీదల ధనాన్ని అపహరించారు. ఇప్పుడూ పూర్వజన్మ కర్మఫలం చేతనే బీదలు తమ న్యాయార్జితాన్ని తిరిగి పొందుతున్నారు.

కో: అయితే సంతానులు శిక్షింపబడుతున్నారు గదా?

వెం: అవును. భాగ్యవంతుల బాటు సాగినంతవరకు శిక్షింపబడుతూనే ఉంటారు. భాగ్యవంతులు తమ వర్తనను మార్చుకోకపోతే బీదలే చట్టాలు మార్చి లోకంలో భూతల స్వర్గం స్థాపిస్తారు. ఈ ధర్మం నెరవేరడానికి దయాసత్య శౌచాలు సాధనంగా తీసుకొంటాం. నా హయాంలో జరిగిన ఒక్క బందిపోటులో కూడా హత్యలు జరుగలేదు. నా అనుచరులు మద్యపానం, వ్యభిచారం విడిచిపెట్టినారు. నాది హృదయ రాజ్యం. నా రాజ్యం నశించదు. నే బోయిన తరువాత గూడా అది నిలిచే ఉంటుంది. జనుల హృదయ పీఠాలలో నా సింహాసనం నిలిపాను. నా ధర్మాలు అమలులోకి రాకతప్పవు. పాలనా పద్ధతులు అవసరాన్ని బట్టి మారుతుంటవి.

కో: ముగింపేదా?

వెం: ముగించినట్టే. ఆయాసంగా వుంది. ఇప్పటికే గ్రంథం పెరిగింది".

వెంకటదాసు పాత్ర్యంలో మహాభారతంలో భీష్ముడు ధర్మరాజుకు చెప్పిన భావాలు, బైబిలు భావాలు, టాల్‌స్టాయ్ చిన్నకథ "ఇవను మూర్ఖుడు" లోని భావాలూ, మార్క్సిస్టు ధోరణి, అక్టోబరు విప్లవం (బోల్షివిక్ విప్లవం) ప్రభావం. "రామరాజ్య" భావబీజాలూ వున్నాయి. వర్గ విరోధ తత్వం వుంది. కర్మసిద్ధాంతమూ వుంది. ఇదంతా తత్వ సాంకర్యం. ఉన్నవ వ్రాసిన కాలులో బెంగాలులో కుపిత యువకులు హింసాత్మక ఉద్యమం నడుపుస్తూ వుండేది. టాగూరు "నాల్గు అధ్యాయాలు", శరచ్చంద్ర చటర్జీ "పాథేర్ దాబి" (ఇవి బెంగాలు యువకులు విప్లవ చర్యలను వర్ణించే గ్రంథాలు) లు వెలువడిన కాలం. "మేయిపడగలు"లోని వ్యవస్థా విశ్లేషణ శాస్త్రీయంగా లేదు. చాతుర్వర్ణ్యములతోడి మతం క్షీణిస్తున్నదే అనే బెంగ తప్ప, ఈ సంఘం ఎందుకు క్షీణిస్తున్నదన్న ఆలోచన లేదు.

పాశ్చాత్య ప్రభావం వల్ల అనే వాదం వుంది. పాశ్చాత్య ప్రభావం వల్ల సంఘం ఏల చెడిపోవలెననే ప్రశ్నకు విశ్వనాథ దగ్గర జవాబు లేదు. కాలం మార్పు తెస్తుంది. దాని ప్రకారం పోవలె అనే పురాతనుల తెలివిడికైనా విశ్వనాథ కనబరచలేదు.

అధోజ్ఞాపికలు

1. ముండక, ఛాందోగ్య ఉపనిషదులు.

2. గురజాడ కథ "పెద్దమసీదు"

3. మధురాంతకం రాజారాం కథ "వెలమనీరు"

4. నన్నయ పద్యపాదం ఎంత చక్కగా మార్చబడగలదో చూడండి!

5. వెంకటదాసు జనుల్లో ధనాశ ప్రబలి భాగ్యవంతులు బీదవారు అని రెండు వర్గాలయినాయి అంటాడు. భీష్ముడు కూడా (చూ. తరువాత) ప్రలోభం వలన జనం ధనం పోగు చేసికొన ప్రారంభించినారు అంటాడు. మానవ నైజం గమనిస్తే దానికి బంగారం మీద ఎక్కువ మోజు అని స్పష్టం కాగలదు. "సర్వేజనాః కాంచన మాశ్రయంతి" అనికదా నానుడి! ఆధెన్సు నగరంలోని శ్రీమంతుడు టైమన్. అతిథి సత్కారాలు చేస్తూ (వీరేశలింగం "రాజశేఖర చరిత్ర" లోని రాజశేఖరుడూ ఇట్టివాడే) వున్నదంతా పోగొట్టుకొని బుక్కా ఫకీరవుతాడు. ఒక గుహలో దాగుకొని వుంటాడు. ఒకనాడు నేలను తవ్వుతుంటాడు. బంగారం కనపడినట్లవుతుంది. అప్పుడు టైమను కాంచన విలాసం మీద చేసిన "స్వగతం" అర్థశాస్త్రంలో శాశ్వతస్థాన మాక్రమించింది. బంగారాన్ని "మానవాళి సమష్టిగణిక" అంటాడు టైమన్. పైగా రచన షేక్సుపియరుదాయె. టైమను ఉపన్యాసాన్ని మార్క్సు కూడా తన రచనలో ఉద్ధరించుకొన్నాడు. [సశేషం]

# శ్రీశ్రీ - స్వర్గం

## శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి

ఆకాశంలో విహంగాలను
భూలోకం సారంగాలకు
బ్రెయిన్ గన్ చూపి చూపి
తరలించిన జగజెట్టీ....శ్రీశ్రీ....

**2**

అనియమం భాషలో
అనాచారం జీవికలో
అరాజకం భావంలో
పూరించెను నీ విప్లవ శంఖం.

**3**

నా దండటి తీరు కాదు
మీద గుప్పె డుండెద నని
ఎత్తున కెత్తుగ, మఱి, గ
మ్మత్తు లెన్నో చేసినావు.

**4**

పొగడినారు కొందఱు నిను
తెగడినారు మఱి కొందఱు
పొగడికలును తెగడికలును
నగలయ్యెను నీ కంఠము.

**5**

అసలు కొంత ప్రతిభ కలదు
కొసరుగా నుద్రేక ముండె
మిశ్రీ యై నీ కవితకు
శ్రీశ్రీ గుర్తింపు వచ్చె.

అగ్ని గోళముల నుమిసెడి
అంగారక గ్రహము రీతి
అహరహమును క్రక్కినావు
ఆకలి మంటలను నీవు.

కాలపు పెను గుండంలో
కాలిపోతి వొక సమిధగ
పూరా అర్ధ శతాబ్దం
జారీ చేసియు వాక్కుల.

అస్థానము జన్మించితి, వా
స్థానము లేదు - మహా
ప్రస్థానము వ్రాసి, మహా
ప్రస్థానమె చేరుకొంటి.

**9**

కవిగా నా శుభ చింతన
నాకంలోనే యుండగ
తిరిగి పుట్టవలసిన యీ
దేశంలోనే పుట్టకు.

శ్రీ గోపాలకృష్ణ అబ్బూరి

# శ్రీ తాళ్లపాక పెదతిరుమలాచార్యుల కేశవనామ సంకీర్తనలు

శ్రీ తాళ్లపాక పద కవిత్రయంలో రెండవవాడూ పద కవితా పితామహుడైన అన్నమాచార్యుల 'చినవరి సుతుడూ', శ్రీమద్వేద మార్గ ప్రతిష్ఠాపనాచార్య, శ్రీ రామానుజ సిద్ధాంత స్థాపనాచార్య, కవి తార్కిక కేసరి, శరణాగత వజ్ర పంజరాది బిరుదులు వహించిన శ్రీ తాళ్లపాక పెద తిరుమలాచార్యులు, తండ్రి తన అవసాన దశలో "దినమొక సంకీర్తన శ్రీ వేంకటేశ్వరునకు అంకితం చేసి చెప్పుమనగాను" సంకీర్తన రచనకు పూనుకొని, చక్కని కవితా శక్తితో రచించి తండ్రికి తగిన కొడుకుగా నిరూపించు కొన్నాడు. ఈ విషయంలో ఆయన తన తండ్రి రచనలనే మేలు బంతిగా స్వీకరించాడు.

తాళ్లపాక వారి సంకీర్తనలన్నీ రెండు వర్గాలుగా ఆధ్యాత్మ, శృంగార సంకీర్తనలుగా ప్రసిద్ధిచెంది వున్నాయి. అయితే ఈ విభజన స్థూలమైనదే. సూక్ష్మంగా పరిశీలించినట్లయితే మరింత అర్థవంతంగా వర్గీకరించడానికి ఆస్కారం వుంది. అప్పుడు పద కవితా పరిణామాన్నీ, సంకీర్తన రచనా కాలాన్నీ, ప్రేరేపణలనూ అంచనా వేయడానికి అవకాశం కలుగుతుంది. ఆ ప్రయత్నానికి నాందిగా ఈ వ్యాస రచనకు ఉపక్రమించడం జరిగింది.

కర్ణాటక వాగ్గేయకారుడు శ్రీ పురందరదాసు తాళ్లపాక వారితో ప్రత్యక్ష సంబంధం కలిగి వున్నవాడు. ఆయన రచనలలో అధిక భాగం "దేవర నామా"లుగా కన్నడంలో వ్యవహృతమౌతున్నాయి. ఆ "దేవర నామా" లతో పోల్చదగిన తాళ్ళపాకవారి కృతులు స్వల్పమే. అయితే 'దేవరనామ' ప్రక్రియ కేవలం నామ స్మరణే ప్రధానోద్దేశంగా కలది కనక వస్తు వైవిధ్యం అంతగా కనిపించదు. తాళ్ళపాక వారి సంకీర్తనలలో సమకాలీన సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులు తమ ప్రభావం చూపి భావ వైశాల్యాన్ని కలిగించాయి.

పెద తిరుమలా చార్యుల రచనలను పరిశీలిస్తున్నప్పుడు హరినామ స్మరణే ప్రధానంగా కనిపించే కొన్ని సంకీర్తనలను గుర్తించడం జరిగింది. సూక్ష్మ పరిశీలనలో ఈ రచనలను ఆయన వొక ప్రణాళిక ప్రకారం రచించారని వ్యక్తమౌతోంది. ఆయన తన నీతి సీస పద్య శతకంలోని ఆఖరి పద్యంలో

"మాధవ గోవింద మధుసూదనాచ్యుత
వామన ప్రద్యుమ్న వాసుదేవ
కృష్ణ దామోదర కేశవ శ్రీధర
హరి విష్ణు పురుషోత్తమానిరుద్ధ
సంకర్షణాధోక్షజ త్రివిక్రమ పద్మ
నాభ జనార్దన నారసింహ
శౌరి హృషీకేశ నారాయణోపేంద్ర
తాలాంక ముఖనామ తాళ్ళపాక
యన్నయాచార్య సుత తిమ్మయాహ్వయుండ
బ్రణుతి జేసితి రహిఁగొమ్ము పద్యశతము
కలిత లక్ష్మీశ సర్వ జగన్నివేశ,
విమల రవికోటి సంకాశ వేంకటేశ !"1

అంటూ విష్ణు నామాలను స్మరిస్తూ ముగించాడు. ఇందులో స్మరించిన మొత్తం ఇరవై అయిదు విష్ణు నామాలలో వొక్క శౌరి అన్న నామం తప్ప మిగిలిన యిరవై నాలుగు నామాలూ కేశవ నామాలుగా వ్యవహృతమౌతూ, సంధ్యావందన సమయంలో ఆచమన సందర్భంలో పఠించే నామాలుగా గుర్తించవచ్చు. అయితే సీస పద్య రచనలో గల పరిమితులవల్ల ఈ నామాలను సరియైన వరసలో చెప్పడం కుదరలేదు.

సంధ్యావందన సమయంలో పఠించే నామక్రమం ఇదీ—2

1) కేశవ 2) నారాయణ 3) మాధవ 4) గోవింద 5) విష్ణు 6) మధుసూదన 7) త్రివిక్రమ 8) వామన 9) శ్రీధర 10) హృషీకేశ 11) పద్మనాభ 12) దామోదర 13) సంకర్షణ 14) వాసుదేవ 15) ప్రద్యుమ్న 16) అనిరుద్ధ 17) పురుషోత్తమ 18) అధోక్షజ 19) నారసింహ 20) అచ్యుత 21) జనార్దన 22) ఉపేంద్ర 23) హరి 24) శ్రీకృష్ణ.

పెదతిరుమలాచార్యులవారి అధ్యాత్మ సంకీర్తనలలో 29 రేకులో నాలుగో పాట—

పల్లవి॥
మచ్చ కూర్మ వరాహ మనుష్య సింహ వామనా
యిచ్చ రామ రామ రామ హిత బుద్ధ కలికీ

చరణం॥ నన్ను( గావు కేశవ నారాయణ మాధవ
మన్నించు గోవింద విష్ణు మధుసూదన
వన్నెల త్రివిక్రమ వామనా శ్రీధరా
సన్నుతించే హృషికేశ సారెకు పద్మనాభ ॥మచ్చ॥

కంటిమి దామోదర సంకరుషణ వాసుదేవ
అంటేజాలు ప్రద్యుమ్నుడా అనిరుద్ధుడా
తొంటే పురుషోత్తమ అధోక్షజ నారసింహమా
జంట వాయకు మచ్యుత జనార్దన ॥మచ్చ॥

మొక్కేము వుపేంద్ర హరి మోహన కృష్ణరాయ
యెక్కితి శ్రీ వేంకట మిందిరానాథ
యిక్కువ నీ నామములు యివియే నా జపములు
చక్క(గా నీ దాసులము సర్వేశ అనంత ॥మచ్చ॥3

ఈ సంకీర్తనలో పల్లవిని వదిలిచూస్తే మొదటి రెండు చరణాల్లోనూ, మూడవ చరణం మొదటి పాదంలోనూ వున్న కేశవ నామాలు సరైన క్రమంలో వున్నాయి. పెదతిరుమలాచార్యులు ఈ క్రమంలోనే సంకీర్తన రచనకు ఉపక్రమిస్తూ మొదటగా ఈ సంకీర్తనను చెప్పి ఉంటాడు. ఈ యిరవైనాలుగు కేశవ నామాలకు సంకీర్తనలను అదే క్రమంలో చెప్పారనే సంగతి రేకుల సంఖ్యనూ పాటల సంఖ్యలనూ పరిశీలిస్తే వ్యక్తంకాగలదు. పెద తిరుమలాచార్యుల అధ్యాత్మ సంకీర్తనల రేకులలో కనిపించే క్రమం ఇదీ—4

| రేకు సంఖ్య | పాట సంఖ్య | నామం |
|---|---|---|
| 20 | 5 | హరి |
| 39 | 6 | నారాయణ |
| 41 | 3 | కేశవ |
| | 6 | మాధవ |
| 42 | 2 | అచ్యుత |
| | 3 | జనార్దన |
| 43 | 1 | గోవింద |
| | 2 | విష్ణు |
| | 3 | మధుసూదన |
| | 4 | త్రివిక్రమ |
| | 5 | వామన |
| | 6 | శ్రీధర |
| | 7 | హృషీకేశ |
| 44 | 1 | పద్మనాభ |
| | 2 | దామోదర |
| | 3 | వాసుదేవ |
| | 4 | ప్రద్యుమ్న |
| | 5 | అనిరుద్ధ |
| | 6 | పురుషోత్తమ |
| 45 | 1 | అధోక్షజ |
| | 2 | నరసింహ |

ఈ పట్టికను పరిశీలించినపుడు 43, 44, 45, రేకుల్లోని నామ సంకీర్తనలు (44 వ రేకులో ఉండవలసిన సంకర్షణ నామం తప్పించి) సంధ్యావందన క్రమాన్నే పాటించడం గమనార్హం. అంటే పదిహేను నామాలు. వొక్క సంకర్షణ నామం తప్పించి (పైన పేర్కొన్న కేశవ నామాలలో 13 వ సంఖ్యది) సరైన వరస లోనే వున్నాయన్నమాట. దీనిని బట్టి సంకీర్తనలన్నీ సరైన క్రమంలోనే రాసినా రాసి రేకులమీద చెక్కించడంలో క్రమం తప్పినట్టు గ్రహించవచ్చు. అచ్యుత, జనార్దన నామాలు ఈ పద్ధతి ప్రకారం 45 వ రేకు తరవాత రావలసినవి 42 వ రేకులోనే చోటు చేసుకున్నాయి. 41 వ రేకులోని మాధవ, కేశవ నామాలు సక్రమమైన వరసలో లేవు. హరి, నారాయణ నామాలు 20, 39 రేకుల్లో వేరొక చోట సద్దుకున్నాయి. అయితే ఇవన్నీ అధ్యాత్మ కీర్తనల రేకులుగా లెక్కలో వున్నాయి. వొక్క సంకీర్తన తప్పించి నిజానికి ఇవన్నీ శృంగార సంకీర్తనలే. అయితే పై పట్టికలో కానరాని ఉపేంద్ర, కృష్ణ, సంకరుషణ నామ సంకీర్తనలు శృంగార సంకీర్తనల రేకుల్లోని 39వ రేకులో 3, 5, 6 సంఖ్యలతో కనిపిస్తున్నాయి.5

అసలు రేకులు చెక్కడంలోనే అధ్యాత్మ శృంగార సంకీర్తనలుగా వర్గీకరించుకున్నా కూడా, ఆ వర్గీకరణను చెక్కించినవారే సరిగా పాటించడం జరగలేదు. అలాగే ఈ కేశవనామ సంకీర్తనలు కూడా కొంత వరస చెడి కనిపిస్తున్నా, పెద తిరుమలాచార్యుల రచనా ప్రణాళికను వెల్లడిస్తున్నాయన్న సంగతిని గుర్తించక తప్పదు.

ఈ కేశవనామ సంకీర్తనల రచనలో వున్న విశేషం పల్లవిలోనూ చరణాలలోని ప్రతి పాదాంతానా ఇరవై నాలుగు నామాల్లోని ఏదో వొక నామం మాత్రమే సంబోధన రూపంలో వస్తూ వుంటుంది. వివిద రాగ తాళాలలో రచితమైనప్పటికీ ఈ లక్షణాలు వొకే వొక్క సంకీర్తనలో తప్ప మరెక్కడా తప్పలేదు. 20 వ రేకులోని 5 వ పాట హరి నామాన్ని స్మరించిన సంకీర్తన మిగిలిన సంకీర్తనలకన్నా భిన్నంగా వున్నది. ఈ సంకీర్తనలో రెండు పాదాల పల్లవీ, మూడు పాదాలు మాత్రమే గల రెండు చరణాలూ ఆఖరి చరణంలో నాలుగు పాదాలూ వున్నాయి. పాద మధ్యంలోనూ పాదాంతంలోనూ కూడా హరి నామం పునరావృత మౌతున్నది. ఈ సంకీర్తనకూ మిగిలిన కేశవ నామ సంకీర్తనలకూ తేడా యిది వొకటే కాదు. మిగిలిన సంకీర్తనలన్నీ శృంగార సంకీర్తనలు కాగా యిదొక్కటే పూర్తిగా ఆధ్యాత్మికమైనది.

పల్లవి॥ ఇతని చందము హరి హరి
యేమి చెప్పఁగొలది హరి హరి
అతి రహస్యముల హరి హరి
అదిగో మనకుఁ జిక్కె హరి హరి

చరణం॥ ఆది విష్ణుడితడు హరి హరి
అదె యశోద కొడుకు హరి హరి
వేదమూర్తి ఇతఁడె హరి హరి
వెన్న దొంగిలించె హరి హరి
సాదు బండి విఱిచె హరి హరి
చంటి విషము చెరిచె హరి హరి ॥ఇతని॥6

(వ్యాప విస్తర భీతివల్ల పూర్తిగా ఉదహరించలేదు.)

పల్లవిలోనూ చరణాలలోని ప్రతి పాదాంతాన ఒక విష్ణు నామాన్నో కాకపోతే క్షేత్ర నామాన్నో నిలుపుతూ అన్నమాచార్యుల రచనలూ వున్నాయి.

"ఆనంద నిలయా ప్రహ్లాద వరదా
భాను శశి నేత్ర జయ ప్రహ్లాద వరదా"7

"నగుమోము తోడి వో నరకేసరి
నగ రూప గరుడాద్రి నరకేసరి"8

అనాది జగమున కౌళళము
అనేకాద్భుతం బౌళళము"9

కేశవ నామ సంకీర్తనల రచనలో అన్నమాచార్యులు రచించిన సంకీర్తనలే పెద తిరుమలాచార్యుడికి ఉత్తేజాన్నిచ్చి వుంటాయని ఊహించడంలో తప్పులేదు. అన్నమయ్య రచనలేవీ ఏదో ప్రణాళిక ప్రకారం చేసినవి కావు. ఏ క్షణంలో ఆయన్ని ఏ భావం కదిలిస్తే ఆ భావంతోనే ఆ ఉద్వేగంతోనే సంకీర్తనలు పాడుకుంటూ పోయాడు. నిజానికి శృంగార, అధ్యాత్మ సంకీర్తనలన్న విభాగాన్ని ఆయన తరువాతి వారు చేశారేమోనన్న అనుమానం కలగకపోదు. పద కవితా ప్రక్రియలో నూతన ప్రయోగాలు ఆయన చేసినంతగా మరెవరూ చేయలేక పోయారు. ఆయన్ని అనుకరించడమే తరువాతి వారు చేసింది.

అదీగాక అన్నమయ్యకు సంధ్యావందనం మీద అట్టే శ్రద్ధ వున్నట్టు కనిపించదు కూడా. ఈ సంకీర్తనను చూడండి—

పల్లవి॥ సహజ వైష్ణవాచార్య వర్తనుల
సహవాసమె మా సంధ్య

చరణం॥ అతిశయమగు శ్రీహరి సంకీర్తన
సతతంబును మా సంధ్య
మతి రామానుజ మతమె మాకును
చతురత మెరసిన సంధ్య. ॥సహజ॥10

అలాగే తీర్థస్నానాల మీద కూడా అన్నమయ్యకు అట్టే మక్కువ లేదు—

పల్లవి॥ నదులొల్లవు నా స్నానము
సదరము నాకీ స్నానము

చరణం॥ పరమ భాగవత పాదాంబుజలముల
దరిశనమే నా స్నానము
తిరు వేంకటగిరిదేవ నీ కథా—
స్మరణమే నా స్నానము ॥నదులొల్లవు॥11

మరి తిరుమలాచార్యుల మనస్తత్వమే వేరు. ఆయన బిరుదే "శ్రీమద్వేద మార్గ ప్రతిష్ఠాపనాచార్య" అయినప్పుడు నియమ నిష్ఠల మీద ఆయనకున్న పట్టుదలను సులభంగానే ఊహించుకోవచ్చు.

పెద తిరుమలాచార్యుల వారి సంకీర్తనలను కొంచెం సూక్ష్మంగా పరిశీలిస్తే ఈ కేశవ నామ సంకీర్తనలు ఆయన తొలి సంకీర్తనలని అనుకోక తప్పదేమోననిపిస్తోంది. పెద తిరుమలాచార్యులు మంచి పండితుడు. ఆయన రచనలను చూస్తే— "రేఫ అకార నిర్ణయం" ఆయనలోని వైయ్యాకరుణుణ్ణి, నీతి

సీసపద్య శతకమూ, శృంగార వృత్తపద్య శతకమూ, సుదర్శన రగడ, శ్రీ వేంకటేశ్వరోదాహరణమూ, చక్రవాళ మంజరీ మొద లయినవి ఆయనకు సాంప్రదాయిక కవితా రచనలో గల ప్రీతినీ సమర్థతనూ వ్యక్తం చేసేవిగా వున్నాయి. శృంగార అధ్యాత్మ సంకీర్తనలలోకూడా ఎన్నో గడుసు పోకడలుపోయి సుందర కవితా ఖండికలను సృష్టించిన పెదతిరుమలాచార్యులేనా ఈ కేశవ నామ సంకీర్తనలు రాసినది అనిపించేటంత నీరసంగా వున్నాయి కొన్ని.

ఈ నామ సంకీర్తనలలో ప్రతిపాదాంతాన ఏదో వొక కేశవ నామాన్ని సంబోధనగా నిలపడం వలన మిగిలిన పాదభాగం లోనే భావాలను ప్రకటించవలసి రావడం అనివార్యమై కవిస్వేచ్ఛ పరిమితం కావడం తటస్థించింది. కొన్ని సంకీర్తనలు కేవలం రోకటి పాటగా తయారయాయి. చూడండి—

"వసుసలు వెదికేవు వామనా, నీవు
వరుఁడ విందరికిని వామనా
వరవాత వలపించి వామనా, దే
వరవలె నున్నాఁడవు వామనా" 12

ఇందులో వామన నామం అవతార పరంగా కాక శ్రీ వేంక టేశుని పరంగా మాత్రమే వాడటం వలన వామన నామానికున్న ప్రత్యేకత అంతరించింది. రచన కూడా పేలవమైపోయింది. సంకీర్తనలోని వస్తువుకూ వామన నామానికీ ఏ విధమైన పొందికా లేకపోయింది. కేశవ నామ సంకీర్తనలు రాయ తలపెట్టినప్పుడు అధ్యాత్మ సంకీర్తనలుగా కాక శృంగార సంకీర్తనలుగా రాయడం కూడా ఆశ్చర్యం కలిగించే విషయమే. ఈ ఇరవైనాలుగు కేశవ నామ సంకీర్తనలలోనూ విష్ణువు పేర రచించిన సంకీర్తన చక్కగా వచ్చింది.

"వెట్టి వలపు చల్లకు విష్ణుమూరితి నాతో
వెటిదేర మాటాడు విషుమూరితి

వెలసె నీ సేతలెల్లా విష్ణుమూరితి, మా
వెలుపల, లోన నీవె విష్ణుమూరితి
వెలలేని శ్రీ వేంకట విష్ణుమూరితి, కూడి
విలసిల్లితివి నాతో విష్ణుమూరితి" 13

ఈ రచన అధ్యాత్మ, శృంగార సంకీర్తనల శైలులను కల గలుపుకొని ఉదాత్తంగా సాగింది.

ఈయన సంకీర్తనల తొలి రాగి రేకుమీద వున్న శాసనం "శాలివాహన శక వరుషంబులు ౧౪౨౪ అగు నేటి దుందుభి సంవత్సర ఫాల్గుణ బ॥ ౧౨ మొదలుగాను, తాళ్ళపాక అన్నమా చార్యులుం గారు తమ కొమారుఁడు తిరుమలాచార్యులను దిన మొక సంకీర్తన శ్రీ వేంకటేశ్వరునకు అంకితము చేసి చెప్పు మనఁగాను విన్నపము సేసిన సంకీర్తనలు"14 పై శాసనంలోని తేదీ (క్రీ॥ శ॥ 23 గురువారం, ఫిబ్రవరి 1503) అన్నమాచార్యుల నిర్యాణ దినం. అప్పటిదాకా సంకీర్తనా రచనను వొక మహా తపస్సుగా ఆచరించిన అన్నమయ్య తన తదనంతరం కూడా ఆ మహా కార్యాన్ని కొనసాగించమని పెదతిరుమలా చార్యులను కోరగా అతడు ప్రారంభించినట్లు అర్థం చేసుకోవచ్చు. అంటే ఆయన సంకీర్తన రచనను మిగిలిన రచనలకన్నా చాలా తరువాత ప్రారంభించినట్లు భావించవలసి వస్తోంది. కృత్యాద్యవస్థను అధిగ మించడానికి కేశవ నామాలను సంకీర్తన రచనకు ఎన్నుకొని వుంటాడు. తొలి రచనలు కావడం వలన తన కవితా శక్తిని పూర్తిగా ప్రకటించడానికి సంకీర్తన ప్రక్రియ అప్పటికి ఆయనకు పూర్తిగా లొంగి రాలేదనుకోవలసి వస్తుంది. అప్పటిదాకా తనకు అలవాటైన సాంప్రదాయిక కవితా శైలి కూడా కొంతలో కొంత, పద కవితా శైలిగా మారడానికి ఇబ్బంది కలిగించి వుంటుంది.

అయితే పెద తిరుమలాచార్యులు అనతికాలంలోనే ఈ ఇబ్బందులన్నింటినీ అధిగమించి చక్కని సంకీర్తనలను రచిం చాడు. సాంప్రదాయిక కవిత్వంలోని భావ గాంభీర్యాన్నీ దేశికవిత్వం లోని సారళ్యాన్నీ కలబోసి రచించిన చక్కని కవితాఖండిక లెన్నో ఉన్నాయి. అధ్యాత్మ సంకీర్తనల్లో

"అన్ని పదార్థము లమ్ము నంగళ్ల లోపల
తిన్నఁగా మంచివే కొని తెచ్చుకొన్నట్లు
పన్నినానా ధర్మములు ప్రాణుల కెల్లాఁగలవు
అన్నిటా మంచితనాన కానందించ వలయు" 15

అన్న విశాల దృష్టినే కాక—

"ఒకపరి యీశ్వరుఁడ నౌదును, వూహపోహలను
ప్రకటపు పట్టణ గోపుర ప్రాకారంబులు సృజింతును,
సకలము భోగించిన వాఁడనౌదు, చవులారకే కొందును,
అకటా! అంతలో భిక్షుక కేఁగుదు, హరిఁ గొలిచిన వాడగా
నైతి." 16

అన్న మానవ హృదయ దౌర్బల్యాన్ని మనోహరంగా ప్రకటించిన కవిత్వాన్ని రాశాడు. ఆయన కవిత్వాన్ని గురించి రాయాలంటే వేరే పెద్ద వ్యాసమే రాయవలసి ఉంటుంది.

అన్నమాచార్యుల జనన నిర్యాణ తేదీలు రాగిరేకుల మీద చెక్కించడంలో శ్రద్ధ తీసుకున్నవారు పెద తిరుమలాచార్యుని జనన నిర్యాణ తేదీలను చెక్కించ లేదు. అనాటికి ఆయన ఇంకా సజీవుడుగానే వున్నాడేమో! పెదతిరుమలాచార్యుల జననం నాటికి అన్నమయకు 34 ఏళ్ల వయసు ఉండి ఉండాలి. క్రీ. శ. 1458-60 ప్రాంతాలలో పెద తిరుమలాచార్యులు జన్మించి వుంటాడనే శ్రీ వేటూరి ఆనందమూర్తిగారి భావన సహేతుకంగా వుంది. 17 అంటే అన్నమాచార్యుల అవసాన దశలో పెద తిరుమలయ్య సంకీర్తన రచనను ప్రారంభించే నాటికి 43, 45 సంవత్సరాల ప్రాయపు వయసు వాడై వుండాలి. కేశవనామ సంకీర్తనల రచనా కాలం ఇంచుమించుగా ఆ ప్రాంతాలకే చెంది వుండాలి. ఇది స్వల్పమైన ఆధారాల మీద నడచిన వూహ అయినా ఆయన తదుపరి రచనలను విశ్లేషించి చూస్తే మరికొంత వివరంగా రచనా కాలక్రమణికను నిర్ణయించు కోవడానికి వీలు వుంటుందని భావిస్తున్నాను.

కేశవనామ సంకీర్తనల పల్లవులు — 18

1. కేశవ

"కిందుపడి మొక్కెకుమీ కేశవా
కెందమ్మి రేకుఁ గన్నుల కేశవా"

2. నారాయణ

"నన్ను నిన్ను నెంచుకోవో నారాయణా
అన్నియు నీ చేతినే అదివో నారాయణా"

3. మాధవ

"మా యింటికి రావోయి మాధవా, నీ
మాయలెల్లా గంటిమిదె మాధవా"

4. గోవింద

"కొల్ల వలపులు చల్లే గోవిందరాజ, నిన్ను
గొల్లెతలు నవ్వేరు గోవిందరాజ"

5. విష్ణు

"వెట్టి వలపు చల్లకు విష్ణుమూరితి, నాతో
వెట్టి దేర మాటాడు విష్ణుమూరితి"

6. మధుసూదన

"మానరాని చుట్టమవు మధుసూదనా, నీ
మానిిఁ జుమ్మీ నేను మధుసూదనా"

7. త్రివిక్రమ

"వేగిరించకంతేసి త్రివిక్రమ
వేగుఁజుక్క రానీ త్రివిక్రమ"

8. వామన

"వద్దు వద్దు సటలింక వామనా, నీ
వద్దనే వున్నారమిదె వామనా"

9. శ్రీధర

"చెప్పరాని మహిమల శ్రీధరా, నీవు
చెప్పినట్టు చేసేము శ్రీధరా"

10. హృషీకేశ

"ఇద్దరము నిద్దరమె హృషీకేశ
యిద్దె సనకాన వచ్చె హృషీకేశ"

11. పద్మనాభ

"బందుగుడ వన్నిటాను పదుమనాభ, వట్టి
బందెలు గట్టకు మమ్ము పదుమనాభ"

12. దామోదర

"తప్పని బొంకనియట్టి దామోదర, నాకు
దప్పిదేర మోవియ్యవో దామోదర"

13. సంకర్షణ

"సాధించితివి విద్యలు సంకరుషణా, మంచి
సాదువలె సుండే నీవు సంకరుషణా"

14. వాసుదేవ

"వాడిక లాయె నీ బొందు వాసుదేవుడా
వాడుదేరెఁ గెమ్మోవి వాసుదేవుడా"

15. ప్రద్యుమ్న

"పంతము తప్పదు నీకు ప్రద్యుమ్నా, వొక్క
బంతి గూడేవు సతుల ప్రద్యుమ్నా"

16. అనిరుద్ధ

"అంతా నీకులోనే అనిరుద్ధా, మన
యంతరంగ మొక్కటాయె ననిరుద్ధా"

17. పురుషోత్తమ

"పోకు పోకు పంత నీవు పురుషోత్తమా, వట్టి
బూకలు మే మెఱుఁగమా పురుషోత్తమా"

18. అధోక్షజ

"అల్లనాఁడే కంటి వింటి నధోక్షజా
అల్లుకొంటి విని చెలుల నధోక్షజా"

19. నరసింహ

"చిత్తగించు మా మాటలు శ్రీ నరసింహ
చిత్తజ జనకవో శ్రీ నరసింహ"

20. అచ్యుత

"అసలు చెరచకుమీ యచ్యుత
ఆ సుద్దులె యీ సుద్దులు అచ్యుత"

21. జనార్దన

"చతురుఁడ వన్నిటాను జనార్దనా, మమ్ము
సతముగా నేలితివి జనార్దనా"

22. ఉపేంద్ర

"వొద్దివారెల్లా సాక్షి ఉపేంద్రుఁడా మన
వొద్దిక నీ వెఱఁగవా ఉపేంద్రుఁడా"

23. హరి

"ఇతని చందము హరి హరి యేమి చెప్పఁగొలది హరిహరి
అతి రహస్యముల హరి హరి అదిగొ మనకుఁ జిక్కె-
హరి హరి."

24. శ్రీకృష్ణ

"కేరక మాచీర లీవోయి కృష్ణరాయ మేని
గీర లేదవోయి నీకు కృష్ణరాయ"

## అ ధో జ్ఞా పి క లు

1. నీతిసీస పద్య శతకము-ఆంధ్రసాహిత్య పరిషత్తు పత్రిక నుండి పునర్ముద్రితం. 1917.

2. ఈ ఇరవై నాలుగు కేశవ నామాలకు ఆధారమేమిటో తెలియ డంలేదు గాని 'రూపమండనమ్' (కలకత్తా ముద్రణ) లోనూ, పద్మ పురాణంలోని పాతాళఖండం లోనూ ఉన్నాయి. (విష్ణువు వొకొక్క రూపంలో ధరించే ఆయుధాల విషయంలో తేడా లున్నాయి.) అంతేకాక పద్మపురాణంలో జనార్దన, ఉపేంద్ర, హరి నామాలు లేనే లేవు. 'రూపమండనమ్' శిల్పశాస్త్ర గ్రంథం.

3. పుట 112. శ్రీ తాళ్లపాకవారి గేయరచనలు. సంపుటం 21. అధ్యాత్మ సంకీర్తనలు పెద తిరుమలాచార్య విరచితములు. పరిష్కర్త డా॥పి. టి. జగన్నాధరావు. తిరుపతి.

4. ఈ పట్టికలోని సంకీర్తనలన్నీ పైన పేర్కొన్న గ్రంథంనుంచే

5. పుటలు 135, 137. శ్రీ తాళ్లపాకవారి పద సాహిత్యము సంపుటము 23, శృంగార సంకీర్తనములు. పెద తిరుమలా చార్య విరచితములు. పరిష్కర్త డా॥ పి. టి. జగన్నాధరావు. తిరుపతి.

పుట 77. అధ్యాత్మ సంకీర్తనలు పెద తిరుమలాచార్య విర చితములు. సంపుటం 21.

7. సంకీర్తన 213. తాళ్లపాకవారి పదసాహిత్యము, సంపుటి 9.

సంకీర్తన 421. తాళ్లపాకవారి పదసాహిత్యము. సంపుటం 1. పునర్ముద్రణ (1980) తాళ్లపాకవారి కృతులు 1935 నుంచీ ఈ నాటికీ కూడా తిక్కిరి బిక్కిరిగానే అచ్చవుతుండడం తెలుగువారి దురదృష్టాలలో వొకటి. ఈ పునర్ముద్రణలో సంకీర్తనల వరుస సంఖ్యను మార్చి వేయడంతో పరి శోధకులు తమ వ్యాసాలలో, గ్రంథాలలో ఈ సంపుటికి మాతృకలైన 5 వ సంపుటం, 6 వ సంపుటం నుంచి ఉదాహ రించి యిచ్చిన సంఖ్యలు నిరుపయోగమైనాయి. పాతసంపు టాలలోని సంఖ్యలను కనీసం కుండలీకరణాల్లో ఇచ్చి వుండ వలసింది.

సంకీర్తన 29. తాళ్ళపాకవారి పద సాహిత్యం, సంపుటం 10.

10. సంకీర్తన 10. తాళ్ళపాకవారి పద సాహిత్యము 1వ సంపుటం. పునర్ముద్రణ.

11. సంకీర్తన 51. పై సంపుటమే.

12. సంకీర్తన 244. అధ్యాత్మ సంకీర్తనలు. పెద తిరుమలా చార్య విరచితములు. సంపుటం 21.

13. సంకీర్తన 211. పై సంపుటమే.

14. సంకీర్తనల మొదటి పుటలు - 21, 22 సంపుటాలు. పెద తిరుమలాచార్య విరచితములు. తొలి రేకుల మీది శాసనాల్లో శృంగార, అధ్యాత్మ సంకీర్తనలన్న విభాగం సూచితం కాక పోవడం గమనార్హం.

15. సంకీర్తన 322, అధ్యాత్మ సంకీర్తనలు. పెదతిరుమలాచార్య విరచితములు.

16. సంకీర్తన 387, పై సంపుటమే.

17. పుటలు 66, 67. తాళ్లపాక కవుల కృతులు, వివిధ సాహితీ ప్రక్రియలు. డా॥ వేటూరి ఆనందమూర్తి.

18. ఈ పల్లవుల పట్టికలో 13, 22, 24 సంఖ్యల నామాలైన సంకర్షణ, ఉపేంద్ర, శ్రీకృష్ణ నామాలున్న సంకీర్తనలు పెద తిరుమలాచార్య రచితాలైన శృంగార సంకీర్తనల సంపుటం 23 లోవి. మిగిలిన సంకీర్తనలు 21 సంపుటంలోనివి

—✡—

# చూపు నిలిపి క్షణం

నది
వేగంగా ప్రవహించనిది
ఆగనిది
మెత్తగా మలుపు తిరిగినది
నది ....

అవతల
ఇవతల
తడిసిన తటి తడవనట్లు
ఒడ్డుమీద వంగి వంగని కొబ్బరిచెట్లు

కొబ్బరి ఆకుల
చీలిన సూర్యుని రేకల
శబల సంధ్యా మిలమిలలు
నిశ్శబ్ద పత్రపు గలగలలు ....

నీలిమ
నదిలో నీళ్ళు నీలిమ
నీటిలో ప్రతిఫలిత గగనం నీలిమ
నీలిమ ....

ముందు
మెత్తని రాళ్ళ
మధ్య మధ్య గరిక చిగుళ్ల
ఆకుపచ్చని తివాచి
ఆరబెట్టుకొన్న వాంఛార్ద్రితమీద
తడిసిన తెలని గాగర

ఒదిగి మోకాళ్ళమీద విలసిత ముగ్ధ
దుకూల పారదర్శక పాటల పాటలి
నీలి వెంట్రుకల విప్పు
మల్లెలు చుట్టిన కొప్పు ....
తేటి

వాలని నాటి
గుర్తుగా
సాంద్ర నీహారస్నాత
గోముగా తిప్పిన మెడ
ఒంపు భుజాల నెలవంక ....

వాలిన కళ్ళు
వేడిని కోరినటు
వేడుకొని నటు ....

తడి ముడతల
మేనంటిన అపరంజి అంచు
శార్కర చేలా వ్యవధను చీల్చి
పైకెగబ్రాకి
తొంగి తొంగి చూడాలనుకునే ఉత్కంఠల జంట
నడుమ
ఎగబ్రాకిన సరళరేఖ ....

ఎదలో
తీయని చల్లని నిశ్శబ్దపు జ్వరం ధ్యాస
నిర్నిమేషంగా
చూడాలనే ఏకాగ్రతకు స్వరం శ్వాస.

# స్వేచ్ఛ - దీక్ష

వియత్తలంనుండి జగత్తలం చూస్తోంది మింటిమీది డేగ
జగత్తలం నుండి వియత్తలం ఎగబ్రాగ చూస్తోంది
మంటిలోని తీగ
సప్తద్వీపాలు కలేసి తిరగాలన్న కాంక్ష డేగలో
సుప్త సౌందర్యాలు దాచుకుని ఎదిగే సొంపు తీగలో

ఫాలం తడుముకోని డేగలో ఏకైక దీక్షా మేధ
ఫలం పాదులోని తీగతో పైకివచ్చే స్వేచ్ఛాగాథ
మెలికలు మెలికలుగా తిరుగుతోంది డేగ
మెలేసుకు పెరుగుతోంది తీగ.

"సాంధ్యశ్రీ"

# అగారగంప

## విష్ణువర్ధనుడు

ఫిబ్రవరి '83 భారతి లో వెలువడిన, "కన్యకా పురాణము నందలి విష్ణువర్ధనుడెవ్వరు?" అను వ్యాసము ఘట్ట కుటికా ప్రభాత న్యాయమునకు ప్రముఖ లక్ష్యము.

1951 వ సంవత్సరమునందు ప్రకటితమైన వాసవీ కన్యకా పురాణము, తెలుగు వచనానువాదము తోడి సంస్కృత గ్రంథము. స్కాంద పురాణోత్తర ఖండములోని సనత్సుజాత సంహిత. సాలంకాయన మహర్షి ప్రోక్తము. అందు అభిమన్యుని కొడుకు పరీక్షిత్తు, పరీక్షిత్తు కొడుకు జనమేజయుడు, జనమేజయుని కొడుకు శతానందుడు, శతానందుని కొడుకు క్షేముడు, క్షేమ ని కొడుకు విజయార్థుడు, విజయార్థుని కొడుకు విష్ణువర్ధనుడు, విష్ణువర్ధనుని కొడుకు రాజ రాజేంద్రుడు అని కలదు. (9-18 శ్లో. 30అ.) అంతేకాదు. విష్ణువర్ధనుడు అంగ వంగ కళింగ సింహళ, చోళకళ పాండ్య తుండీర, కాంభోజ పారశీక బర్బర నిషాద పుళింద మ్లేచ్ఛ, కురు పాంచాల కోసల రాజులను జయించి, స్వస్థానమైన పద్మ శయనమునకు తిరుగు ప్రయాణమై, మార్గమధ్యమునందు జ్యేష్ఠ శైలాఖ్య పురికి వచ్చెననియును కలదు. (20-43 శో. 30 అ.) [జ్యేష్ఠ శైలాఖ్యపురి అనగా పెనుగొండ. మరి పద్మశయన రాజధాని అనగా? తామర పడక = తామరవాడ = తామరాడ అగునా?] ఉపరి, వాసవీ కన్యకతోపాటు నూటరెండు గోత్రముల వైశ్యులను అగ్ని ప్రవేశము చేయుటకు గురుత్వము వహించిన భాస్కరాచార్యులకు, వారు ఇచ్చిన శాసనము కూడ కలదు. (21-34 శో. 44 అ.) అందు శాసనకాలము సహితము కలదు. ఆ శ్లోకమిది:

> "కల్యాద్యబ్ది గణేషణాబ్ధి రసదైస్సంఖ్యాం గతే వత్సరే
> ప్రాప్తేఒథ ప్రభవే తపస్యవ సితే పక్షే ద్వితీయా గురౌ
> వైశ్యైర్భాస్కర పండితార్యధరణీ బృందారకాయోత్సుకైః
> ప్రీత్యాష్టాదశ పట్టణాధిపతి భిర్దత్తం శుభం శాసనమ్"
>
> 22 శ్లో. 44 అ.

ఇది ఆ భాస్కరాచార్యులే ఆంధ్రీకరించిన వైశ్యపురాణము నందు ఇటు కలదు.

"భాస్కరాచార్యులకు జాహ్నవీతీరంబునఁ దామరవాడయను గ్రామం బగ్రహారంబుగా నిడుండని చెప్పి పెనుగొండలో నర్ధాంశంబు తత్పురదేవతా మహోత్సవంబున కొసంగి మిగిలిన యర్ధంబు కులగురువులైన పండిత వర్గంబుల కిమ్మని పురమధ్యంబున శాసన స్తంభంబు నిలిపి భాస్కరాచార్యులకుఁ దామ్రశాసన పత్రిక లిఖియింపం జేసిరి. తత్క్రమం బెట్టిదనిన

◆ ◆

> కల్యాద్యబ్దగణేష్ట నేత్రరస దృక్సంఖ్యే గతే వత్సరే
> ప్రాప్తేఒబ్దే ప్రభవే తపస్యపి సితే పక్షే ద్వితీయా గురౌ
> ఆర్యా భాస్కర పండితాది ధరణీ బృందారకేభ్యస్సదా
> ప్రీత్యాష్టాదశ పట్టనాధిపతిభిః దత్తం శుభంశాసనమ్—"

ఇందు సంస్కృత పురాణమునందులేని పెనుగొండ స్తంభ శాసనము, తామరవాడ తామ్రశాసనము తెలుగు పురాణములోని విశేషములు. అంతేకాదు. సంస్కృత పురాణములోని శాసనసంఖ్యా కాలము కంటే, తెలుగు పురాణములోని శాసనసంఖ్యాకాలము భిన్నము. అదికల్యాద్యబ్ద గణేషణాబ్ధిరసదోస్సంఖ్య. ఇది కల్యాద్యబ్ద గణేష్ట నేత్రరస దోస్సంఖ్య. ఇందు మొదటి సంఖ్య 2642. కలికాలము. కనుక క్రీస్తుపూర్వము 458 వ సంవత్సరము. పరీక్షిత్తు పరిపాలనము కలియుగాదిని కావున, అతని మనుమని మనుమడు విష్ణువర్ధనుని దానకాలము క్రీస్తుపూర్వము 457 వ సంవత్సరము కావచ్చును. వారు పురాణపురుషులు కావున, తరమునకు 20, 30, 40 సంవత్సరములు, శతాబ్దికి మూడు తరములు అను చరిత్ర లెక్కలకు అతీతులు. ఇక రెండవ సంఖ్యకు లెక్కలు వచ్చినవి. పెనుగొండ పురమధ్యమునందు స్తంభశాసనము గోడ కానరాదు. తామరవాడ చుట్టుపక్కలయందు తామ్రశాసనము జాడ కానరాదు. కాని, సంస్కృతాంధ్రపురాణములలోని భాస్కరాచార్యుల కాలము మాత్రము బమ్మెర పోతన అనంతరము.

అగ్ని ప్రవేశమునకు ముందు అష్టాదశ పట్టణాధి పతులకు సంబంధించిన నూటరెండు గోత్రముల వైశ్యులు, భాస్కరాచార్యులకు కావించిన అభ్యర్థనమిది:

> "మీరు మహానుభావులు సమిద్ధవచోవిభవాభిరాము లింపారఁగ వైశ్య వంశము మహత్కృత వృద్ధియొనర్ప దీవనల్
> ధీరత నిచ్చి గోత్రశత దీప్తయశస్థితి శీల మూలమై
> పేరతలుల్ల సిల్లఁగఁ గవిత్వకృతిన్ గృతిసేయుటొప్పగున్.

మును మా పెద్దల చరితము
ముని సాలంకాయనుండు ముదమునఁజెప్పెన్
ఘనముగఁ దత్కృతి పొందుగ
ననుగుణమై చేసి చెప్ప డాంధ్రోక్తిఁదగన్."

"భారతరామ సత్కథలు భాగవతంబుఁ దెనుంగు సేయఁగా
నేరరె సత్కవీశ్వరులు నేర్చి రచించిన సత్కవిత్వముల్
మీఱుఁ దెనుంగు బాస నిల మెచ్చుగ నొక్క తెనుంగు
గ్రంథమిఁ
పారఁ బ్రసిద్ధిసేయు మహి మండలి నొప్పఁగఁ బండి
తాగ్రణీ."

భారతమును తెనుగు సేసినది నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలు. రామాయణమును తెనుగుసేసినది గోనబుద్ధారెడ్డి, గోనకాచ, విఠల రెడ్లు. హుళక్కి భాస్కరాదులును. భాగవతమును (దశమ స్కంధము మాత్రము తెనుగు సేసినది మడికి సింగన) ద్వాదశ స్కంధములును తెనుగు సేసినది బమ్మెర పోతన. కనుక భాస్కరా చార్యులు తెనుగు సేసిన తెలుగు వైశ్య పురాణము, భాస్కరా చార్యులు పాత్ర వహించిన సంస్కృత వాసవీ కన్యకాపురాణము, బమ్మెర పోతన భాగవతము రచనా కాలము కంటె అనంతర గ్రంథములు కావలయును. బమ్మెర పోతిన భాగవతము రచనా కాలము స్థూలముగ 1480 వ సంవత్సరము. భాస్కరా చార్యులు తెనుగుసేసిన తెలుగు వైశ్య పురాణము వ్రాత ప్రతుల లేఖన కాలములందు తెలిసినంత వఱకు పూర్వతరమైన లేఖన కాలము 20–9–1704 వ తేదీ.1 కనుక సంస్కృతాంధ్ర వైశ్య పురాణ ముల కాలము స్థూలముగ పదునారు, పదునేడు శతాబ్దాల కాలము.

కన్యకా పురాణములోని వాసవీకన్య కథకు మూలము మార్కండేయ పురాణము, గౌరన నవనాథ చరిత్ర అని వ్యాస కర్త అపాదించుట2 కేవలము అజ్ఞాన విలాసము. వాసవీ కన్య కథకు మూలము మార్కండేయ పురాణమునందు లేదు. ఉన్న మార్కండేయ పురాణోత్తర ఖండములోని కథకు, కన్యకా పురా ణములోని కథయే మూలము. కారణము, మార్కండేయ పురా ణోత్తర ఖండములోని కథయందు పూసపాటిని జయించిన, జయ పురాధీశుడైన గజపతి సంగతియును కలదు. కనుక మార్కండేయ పురాణోత్తర ఖండము పరమార్వాచీన కాలికమని ప్రసిద్ధము. ఇక గౌరన నవనాథచరిత్రమునందును వాసవీ కన్య కథకు మూలము లేదు. అసలు నవనాథ చరిత్రమునందు ఆంధ్రదేశమునకు సంబం ధించిన రాజు కథయే లేదు. మాళవదేశమునకు సంబంధించిన రాజ మహేంద్రి భూవిభుని, మహారాష్ట్రదేశమునకు సంబంధించిన గణ్యా వంతుని, కృష్ణకందార భూపుని కథలు మాత్రము కలవు. సింహాద్రి పురమేలు సింహళుని కథ కలదు గాని, ఆంధ్రావనిలోని సింహాద్రి ఏనాడును రాజధాని కాదు. కనుక వాసవీకన్య కధ సమూ లము కాదు.

సంస్కృత వైశ్య పురాణములోని శాసన కాలమునకు భిన్నమైన, తెలుగు వైశ్య పురాణములోని తామరవాడ తామ్రశాస నము నకలు కాలము, పెద్దచెఱుకూరు శిలాశాసనమునందు దఖలు పడినది. పెద్దచెఱుకూరులోని త్రివిక్రమ స్వామి దేవాలయము నందలి గరుడ స్తంభము నలుప్రక్కల చెక్కిన శాసనము, పెద్ద చెఱుకూరు శిలాశాసనము. పెద్ద చెఱుకూరు గుంటూరుజిల్లా బాపట్ల తాలూకాలోనిది. పెనుగొండ, తామరవాడ (ఇప్పటి తామరాడ) పశ్చిమగోదావరిజిల్లా తణుకు తాలూకాలోనివి. తామరవాడ తామ్ర శాసనము నకలులోని కాలమును తెలుపు శ్లోకము పూర్వార్థము, పెద్దచెఱుకూరు శిలాశాసనములోని కాలమును తెలుపు శ్లోకము పూర్వార్ధము ఒకటే. అలతి మార్పున అది ఇక్షుగ్రామ తామ్ర శాసనము నందును కలదు. ఇక్షుగ్రామమన చెఱుకూరే. అంతే కాదు. పెద్ద చెఱుకూరే. ఇట్లు మూడు శాసనముల కాలములు ముడిపడియుండుట మఱి ముచ్చట గొలుపు విషయమే.

తూర్పు చాళుక్యుల చరిత్రను తూర్పారఁబట్టిన నేలటూరి వెంకటరమణయ్యగారు, చాళుక్యచోళుల చరిత్రను చాలనము చేసిన మల్లంపల్లి సోమశేఖరశర్మగారును ప్రక్కను బెట్టిన శాస నము పెద్దచెఱుకూరు శిలాశాసనము:

గరుడ స్తంభము మొదటి ప్రక్కను ఒక విష్ణువర్ధన మహా రాజు వర్ణనము, మఱొక విష్ణువర్ధన మహారాజు వివరము, తదుపరి కుముదవర్ధన మహారాజు విషయము కలదు. రెండవ ప్రక్కను విగ్రహ వర్ణనాత్మకమైన త్రివిక్రమస్వామి స్తోత్రము కలదు. మూడవ ప్రక్కను కుముదవర్ధన మహారాజు దిగ్విజయయాత్ర, బృహదిక్షుగ్రామ సమాగమనము, దానము, దానకాలము మొదలైనవి కలవు. నాల్గవ ప్రక్కను దానమిచ్చిన మూడు గ్రామముల ఎల్లలు కలవు. మొదటిప్రక్క తుదిని, రెండవప్రక్క తొలిని, తుదిని అక్షరములు పోయినవి. కనుక మొదటిప్రక్క విషయమునకు రెండవ ప్రక్క విషయమునకు గల అనుబంధము, రెండవప్రక్క విషయమునకు మూడవ ప్రక్క విషయమునకు గల అనుబంధము తెలియు అవకాశము లేదు. అయినను రెండవప్రక్క విషయము ముందు చెక్కినది లేక తర్వాత దూర్చినది అని వ్యాసకర్త అ-

ప్రాయపడుట[3] అనాలోచన పూర్వకము. పెద్ద చెఱుకూరు దేవాలయములోని త్రివిక్రమస్వామిని సందర్శించి(దదర్శ), మూడుగ్రామములు దానము చేసినట్లు కల శాసనము నందు విగ్రహ వర్ణనాత్మకమైన త్రివిక్రమస్వామి స్తోత్రము ప్రకరణ విరుద్ధము కాదు. స్తోత్ర శ్లోకముల వలన శాసనమునకు "అస్పష్టత" కలిగినది, "చరిత్ర పరిశీలకులకు తీవ్రమైన సమస్యగా పరిణమించును" అని వ్యాసకర్త ఆందోళన చెందుట[4] అనభిజ్ఞతా స్థాపకము. అందుకు నేలటూరు వేంకటరమణయ్యగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు పెద్ద చెఱుకూరు శిలాశాసనమును ప్రక్కను బెట్టలేదు. ఎందుకు ప్రక్కను బెట్టినదియు శాసనమును సరిగా పరిశీలించిన స్పష్టము కాఁగలదు.

పెద్ద చెఱుకూరు శిలాశాసనము నందు లేఖక దోషములు మాత్రమేగాక, కవి దోషములును కలవు. మొదటి ప్రక్కను "చతుర్ద్దిక్కారాతి" అని కలదు. "చతుర్ద్దిగరాతి" అని ఉండవలయును. మొదటి ప్రక్కనే "అథ చాళుక్య కులాబ్ధి సుధాకరః కుముదవర్ధన మానవనామకః" అని కలదు. అది చూచి, "అథ"కు ముందు కల విష్ణువర్ధన మహారాజు పేరు కుముదవర్ధన మహారాజు అని వ్యాసకర్త అర్థము చెప్పుట[5] అవిచార మూలకము. మానవ నామము కలవాడు, దానవనామము కలవాడు అని ఉండదు. విష్ణువర్ధన మహారాజు అను పేరు కూడా మానవనామమే. అంతేకాదు. "అథ" అను నిర్దేశము అర్థరహితము కాదు. విష్ణువర్ధన మహారాజు తర్వాత కుముదవర్ధన మహారాజు అని శాసనపంక్తికి అర్థము. "మానవ నామకః" అనునది "మానవ నాయకః" అను దానికి లేఖకదోషము. యమలేఖన వ్యత్యయము ప్రసిద్ధము. ఒక విష్ణువర్ధన మహారాజు మనుమడు, రామదేవ యువరాజు ఇష్టుడు అయిన వేరొక విష్ణువర్ధన మహారాజు తర్వాత కుముదవర్ధన మహారాజు ఎవరు? అన్నది ఒక సమస్య. "కుముదవర్ధన మానవ నాయకః జయతి రాజమహేంద్ర వరే స్థితో ..... శాసిత .. తలం ........." అని కలదు గావున, రామదేవ యువరాజు ఇష్టుడైన విష్ణువర్ధన మహారాజు తర్వాత రాజమహేంద్రవరః రాజధానిగ పరిపాలించిన కుముదవర్ధన మహారాజు ఎవరు? అన్నది మఱొక సమస్య. మూడవ ప్రక్కను,

"పూర్వ వైరమను స్మృత్య జిత్వా కల్యాణభూపతిం
తస్య రాజ్యశ్రియం హృత్వా యుద్ధే లబ్ధ పరాక్రమః"

అని కలదు గావున, రామదేవ యువరాజ ప్రియుడు, రాజమహేంద్రవరస్థితుడు మాత్రమేగాక, దిగ్విజయ యాత్రయందు పూర్వవైరమును పురస్కరించుకొని కల్యాణ భూపతిని జయించి, అతని రాజ్యలక్ష్మిని అపహరించిన కుముదవర్ధన మహారాజు ఎవరు? అన్నది ఇంకొక సమస్య. కల్యాణభూపతి అనగా కాంచీ నగరాధిపతి అని పండితులు అర్థమును కిట్టించుట[6] ప్రమోదకరము కాదు గాని, అది పూర్వ చరిత్రయొక్క పునరుద్ధరణమని వ్యాసకర్త చరిత్రను కిట్టించుట[7] ప్రమాదకరము. "పూర్వవైరమ్" అను ప్రథమ పురుషలోని పూర్వ శ్లోకమునకు, "తత్రమధ్యే" అను ప్రథమ పురుషలోని తర్వాతి శ్లోకమునకు మధ్య "కించత్త్రైః" అను మధ్యమ పురుషములోని శ్లోకమునకు అన్వయమెట్లు? అన్నది వేఱొక సమస్య. ప్రథమ పురుష ప్రకరణము కుముదవర్ధన విషయము. మధ్యమ పురుష ప్రసంగము మరల విష్ణువర్ధన విషయము. అన్నిటికంటె అగ్రేసరమైనది పెద్ద చెఱుకూరు శిలాశాసనములోని కాలము. కలికాలము. కలిసిరాని కలి కాలము. ఇది అసలు సమస్య.

"కల్యాద్యబ్ది గణేష్ట నేత్రరసదో [స్స]ంఖ్యే గతే వత్సరే
ప్రాప్తేథ ప్రభవే తపస్యపి సితే పక్షేద్వితీయా గు[రౌ]
వారే చేతు పురీంధ్రినామ చెరయూరి గ్రామకే శ్రీపతిం
నత్వా నేన పురా త్రివిక్రమ రమానాథాయ దత్తా[ం] స్థితిం."

ఇట్లు పెద్ద చెఱుకూరు శిలా శాసనమునందు కలదు. ఇందు "పురీంద్ర" అనుటకు "పురీంధ్ర" అనునది లేఖక దోషము. "నత్వా" అనుటకు "నాత్వా" అనునది కూడ లేఖక దోషము. ఇందలి పూర్వార్ధమే యథా తథముగ, తెలుగు వైశ్య పురాణములోని తాండరవాడ తామ్రశాసనము నకలునందు కలదు. "దోస్సంఖ్యే" అనునెడ "దృక్సంఖ్యే" అని మాత్రము పాఠాంతరము. అర్థాంతరము కాదు.

కల్యాద్యబ్ది గణేష్టనేత్ర రసదోస్సంఖ్యా సంవత్సరము గతించిన తర్వాత ప్రాప్తించిన ప్రభవనామ సంవత్సర మాఘ శుద్ధ విదియా గురువారమునాడు – కుముదవర్ధన మహారాజు – పూర్వము ("పురా") త్రివిక్రమస్వామికి – పురత్రయ – స్థితిని దానమిచ్చెను అని శ్లోకార్థము.

పయి శ్లోకములోని పురాశబ్దము పురాణార్థము కాదు. పూర్వార్థకము. కనుక పూర్వము కుముదవర్ధన మహారాజు త్రివిక్రమ స్వామికి పురత్రయమును దానమిచ్చిన కాలము శ్లోకము నందు కలదుగాని, తర్వాతి శాసనకాలము లేదని కరతలామలకము.

కల్యాద్యబ్ది గణేష్టనేత్ర రసదోస్సంఖ్యా సంవత్సరము గతించిన తర్వాత ప్రాప్తించిన ప్రభవనామ సంవత్సర మాఘ శుద్ధ విదియా గురువారము శాసనకాలము కాదు. దానకాలము. దాన

కాలము, శాసనకాలమును ఒకటే అగుట సర్వశాసన సాధారణము. కాకపోవుట పెద్ద చెఱుకూరు శిలా శాసనము ప్రత్యేకత.

"కల్యాద్యబ్ధ గణేష్ట నేత్ర రసదోస్సంఖ్యే" అను పంక్తి నుండి అష్టనేత్ర రసదోస్సంఖ్య అని గ్రహించుటకు అవకాశము కలదు గాని, అష్టశబ్దము సంఖ్యావాచకము. నేత్రరసదోశ్శబ్దములు సంఖ్యా వాచకములు కావు. సంఖ్యాసూచికములు. సంఖ్యా వాచకమునకు సంఖ్యా సూచకములకు సాంకర్యము చేయుట సాంప్రదాయిక సరణి కాదు. అంతేకాదు. "గతే వత్సరే ప్రాప్తేఽబ్దే" అను శాసన పంక్తికి అనుగుణమును కాదు. కనుక ఇష్టనేత్రి రసదోస్సంఖ్య అని గ్రహింపవలెయును. ఇష్ట శబ్దమునకు యజ్ఞమని అర్థము కలదు. సప్త యజ్ఞములు ద్విధా ప్రసిద్ధము. ఇష్ట నేత్రి రసదోస్సంఖ్య 2627 గాని, 2927 గాని అగును. అది క్రీస్తు పూర్వము 473 గాని, 173 గాని అగును. క్రీస్తుపూర్వము 472 వ లేక, 172 వ సంవత్సరము ప్రభవనామ సంవత్సరాదికమైనను కాకపోయినను, తూర్పు చాళుక్యుల, చాళుక్య చోళుల పరిపాలన కాలము క్రీస్తు పూర్వము కాదు. కనుక ఇష్ట (అష్ట) నేత్రి రసదోస్సంఖ్య కల్పితము.

ఇక ప్రభవనామ సంవత్సర మాఘ శుద్ధ విదియా గురువారము తూర్పు చాళుక్యుల, చాళుక్య చోళుల పరిపాలన కాలము[8] నందు (క్రీ.శ. 624 - 1179) ఒక్క 12-1-848 వ తేదీని మాత్రమే కలదు.[9] అది సరిగా గుణక విజయాదిత్యుని రాజ్యారంభ కాలము.[10] కాని, గుణక విజయాదిత్యుని కాలమునందు రాజమహేంద్రవరము రాజధాని కాదు. కల్యాణ కటకము లేదు. కనుక 12-1-848 వ తేదీ పెద్ద చెఱుకూరు శిలా శాసనములోని దానకాలము కాదు అనగా ప్రభవ నామ సంవత్సర మాఘ శుద్ధ విదియా గురువారమును కల్పితమని అవగాహనమగును.

మఱి శాసనకాలము - పెద్ద చెఱుకూరు శిలాశాసనము లిపి పదమూడు, పదునాల్గు శతాబ్దుల లిపి కావున, పదునాల్గవ శతాబ్ది లోని ప్రభవనామ సంవత్సర మాఘశుద్ధ విదియా గురువారము, 14-1-1328 వ తేదీ శాసనకాలమని వ్యాసకర్త సమన్వయించుట[11] కూడ సమంజసము కాదు. 14-1-1328 వ తేదీని సూర్యోదయాత్ప్రభృతి సుమారు మూడు గంటల వఱకు పాడ్యమి కలదు.[12] (12) సూర్యోదయకాల తిథియే దినతిథి. కనుక 14-1-1328 వ తేదీ ప్రభవనామ సంవత్సర మాఘశుద్ధ పాడ్యమీ గురువారమేకాని విదియా గురువారము కాదు. తత్కాల విదియతిథి వివక్షశాసనము నందు లేదు. కనుక 14-1-1328 వ తేదీ శాసనకాలము కాదు. దానకాలము ఎటును కాదు. అంతేకాదు. శాసన లిపి శాసన కాలము పదునాల్గవ శతాబ్ది అనుటకు సాధకమైనను, శాసనస్థ విషయము బాధకము. మూడవ ప్రక్కనే శాపోక్తుల చివర, సీమా చిహ్నాల మొదట శాసనకర్త సంగతి ఇట్లు కలదు.

"విద్యాధికారీ శ్రీపతిర్వీర శ్రీ విష్ణువర్ధనః
అకరోద్దానకరో వాచా నిర్మలం ధర్మశాసనం."

ఇందు లేఖక దోషముతోపాటు కవి దోషములు కలవు. అవి "శ్రీపతిః" అనునెడ ఛందోభంగము. "విష్ణువర్ధనః" అనునెడ వ్యాకరణ దోషము. అది కూడ కారక దోషము. విభక్తి ప్రత్యయ విపర్యయము. నిజముగ విద్యాధికారి అయిన కవి ఎవ్వడును విభక్తి ప్రత్యయ విపర్యయముగ శ్లోకరచన - కాదు - వాక్యరచన చేయడు. కారకదోషమునకు కారకుడు కాడు. ఛందోభంగమునకు గురికాడు. నిజముగ విద్యాధికారి అయిన శ్రీనాథుడు రచించిన పెద కోమటి వేమారెడ్డి శాసనమునందు ఇట్లు కలదు.

"విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీ వేమభూపతేః
అకరో దాకరో వాచాం నిర్మలం ధర్మశాసనం."

ఇందు ఛందోభంగము లేదు. వ్యాకరణ దోషమును లేదు. అయినను పెద్ద చెఱుకూరు శాసనములోని అవక తవక శ్లోకమునకు శ్రీనాథుడు మెఱుగుపెట్టెనని పండితులు వ్రాయుట[13] ప్రామాదికము. శ్రీనాథుని శ్లోకమునందు పెట్టిన మెఱుగు లేదు. శ్రీపతి శ్లోకమునందు పట్టిన తుప్పు కలదు. "శ్రీనాథః" అను చోట "శ్రీపతిః" అని మార్చుట వలన మాత్రమే ఛందోభంగము ఘటిల్లును. "వేమభూపతేః" అనుచోట "విష్ణువర్ధనే" అనుటకు వీలు లేదు. అది ఇకారాంత శబ్దము, ఇది అకారాంత శబ్దము. "విష్ణువర్ధనస్య" అనవలయును. అనిన శ్లోకపాదమునందు అక్షరము పెరుగును. శ్లోకపాదము అక్షరబద్ధము కావలయును. కనుక "విష్ణువర్ధనః" అని కర్తృ ప్రయోగము. అనగా శ్రీనాథుని శ్లోకమునకు పెద్ద చెఱుకూరు శాసనములోని శ్లోకము అగతికమైన అనుకరణ మని అవగాహన మగును. శ్రీనాథుని శ్లోకము అసలు వజ్రము. శ్రీపతి శ్లోకము నకిలీ వజ్రము. కనుక శ్రీనాథుడు రచించిన పెద కోమటి వేమారెడ్డి శాసనముల కాలముకంటె, శ్రీపతి రచించిన పెద్ద చెఱుకూరు శిలా శాసనము కాలము అనంతర మగుట అపరిహార్యము.

పెద కోమటి వేమారెడ్డి చిట్టచివరి రుద్రవరము శాసనము కాలము 1419 వ సంవత్సరము.[14] కనుక పెద్ద చెఱుకూరు శిలా శాసనము కాలము 1420 వ సంవత్సరము కంటె అనంతరము కావలయును.

పయి శ్లోకము తర్వాత "ఉంద్రాలపాలెమితి పూర్వతశ్చ ఖండం యామ్యంచ ఖండమిదమో బళసానిపాలెం-" అని శాసనము నందు కలదు. ఇందు "పాలెము" అను లేఖనము ఇతోధికమైన అర్వాచీన కాలమును సూచించును. పాలెము ప్రాచీన రూపము. ప్రాచీన లేఖనమును. పాలెము అర్వాచీన రూపము. అర్వాచీన లేఖనమును. అంతే కాదు. పెద్ద చెఱుకూరు శిలా శాసనము నందు ప్రాచీన వర్గ పంచమాక్షర లేఖన విధానమును సరిగా పాటింపఁబడలేదు. అది కూడ అర్వాచీనతాస్ఫోరకము.

ఇంతకు, 1881 వ సంవత్సరము ప్రాంతమునందు ప్రథమతః పెద్ద చెఱుకూరు శిలాశాసనమును పరిశీలించిన రాబర్ట్ స్యూయెల్ అందఁజేసిన సమాచార మిది:[15]

"పెద్ద చెరుకూరు:- 10 మైల్స్ నార్త్-వెస్ట్ అఫ్ బాపట్ల. ఇన్ ది టెంపిల్ అఫ్ త్రివిక్రమస్వామి అర్ టు ఇన్స్క్రిప్షన్స్ ఆన్ ది గరుడ స్తంభ.

(1) అన్‌డేటెడ్. గ్రేంట్ బై "విష్ణువర్ధన మహారాజ."

(2) శ్లోకాస్ ఇన్ ప్రైజ్ అఫ్ ది డెయిటీ."

ఇందు 1881 వ సంవత్సరము ప్రాంతమునందు, పెద్ద చెఱుకూరు శిలాశాసనమునందు కాలము లేదని ఇదమిత్థముగ కలదు. (అన్‌డేటెడ్) అంతే కాదు. త్రివిక్రమస్వామి దేవాలయములోని గరుడ స్తంభము మీద రెండు శాసనములు కలవని, ఒకటి విష్ణువర్ధన మహారాజు దానమని, మఱొకటి త్రివిక్రమ స్వామి స్తోత్రమని స్పష్టముగ కలదు. కనుక దాన కాలమును తెలుపు ప్రస్తుత శ్లోకము, పెద్ద చెఱుకూరు శిలా శాసనమునందు, 1881 వ సంవత్సరము ప్రాంతము తర్వాత ప్రవేశించినట్లు కరతలా మలకము.

ఇది గమనింపకుండ, అది పట్టుకొని వ్యాసకర్త అట్టహాసము చేయుట[16] అక్షంతవ్యము.

ఇక మఱి ఇఱుగ్రామ తామ్రశాసనము - ప్రభుత్వ శాసన పండితుడు అందఁజేసిన సమాచారమిది:[17]

"కింగ్- విష్ణువర్ధన రూలింగ్ ఫ్రమ్ రాజమహేంద్రవరమ్.

డేట్ - కలి ఇయర్ 2628. (అష్ట - నేత్ర రసదోః రాంగ్ ఫర్ 4428) ప్రభవ. తపస్. (తపా = మాఘ) అమావాస్య, థర్స్‌డే= 1328 ఎ.డి. ఫిబ్రవరి 11, యఫ్. డి. టి. 18.

రిమార్క్స్ - రిజిష్టర్స్ ది గ్రేంట్ అఫ్ ది విలేజ్ ఇఱుగ్రామ టు ది బ్రాహ్మణ నారాయణ సన్ అఫ్ బొభళయ అండ్ ది గ్రేండ్ సన్ అఫ్ జ్యేష్ఠ శర్మన్ అఫ్ ది హరిత గోత్ర బై ది కింగ్. ది లాంగ్వేజ్ అఫ్ ది రికార్డ్ ఈజ్ వెరీ కరెప్ట్. ఇన్ కేరెక్టర్స్ అఫ్ ఎబౌట్ ఫోర్టీన్త్ సెంచరీ. సియఫ్. ఎ. అర్. ఇ పి 1890. పి. 2. నెం IV అల్సో. సియఫ్. యస్ ఐఐ. వాల్. VI. నెం. 202."

ఇది కేవలము ఇఱుగ్రామ తామ్ర శాసనమునకు విషయ సూచిక మాత్రమే. ఇందు "కలి సంవత్సరము 2628. అష. రసదోః, ప్రభవ, తపస్, అమావాస్య, గురువారము" అని కలదు గావున, ఇఱుగ్రామ తామ్ర శాసనమునందును,

"కల్యాద్యబ్ద గణేష్ట నేత్ర రసదోస్సంఖ్యే గతే వత్సరే
ప్రాప్తేఽథ ప్రభవే తపస్యపి అమావాస్యే గురౌ వాసరే"

అని ఉండును. అక్షరశః లేకపోయినను అర్థ మదే. అంతే కాదు. "రాజమహేంద్రి వరేస్థితః" అనియును ఉండును. ఉపరి, విష్ణువర్ధన మహారాజః అని కూడ ఉండును. 'కుముదవర్ధన మానవ నామకః" అని కూడ ఉండవచ్చును. ఇఱుగ్రామ తామ్ర శాసన లిపి సుమారు పదునాల్గవ శతాబ్ది అని సూచించుటకు ఆధారము పెద్ద చెఱుకూరు శిలా శాసనము అని విషయ సూచిక యందు మూదలింపఁబడినది. శాసన లిపితోపాటు శాసనకవి కూడ ఒకడే కావచ్చును. శాసన లిపి సుమారు పదునాల్గవ శతాబ్ది నాటిదని-కలిసిరాని కలికాలము తప్పని కలిసి వచిన ప్రభవసంవత్సరాదికమును బట్టి కాలము 11-2-1328 వ తేదీ అని ప్రభుత్వశాసన పండితుని ప్రకటనము. అది నిజమైనచో, 1328 వ సంవత్సరము ప్రాంతమునందు ఒక విష్ణువర్ధన మహారాజు రాజమహేంద్రవరము రాజధానిగ, రాజ్యాధిపతిగ ఉండవలయును. రాజమహేంద్రవరము రాజధాని కాకపోయినను రాజమహేంద్రవరము ప్రాంతమునకైన రాజ్యాధిపతిగ ఉండవలయును. మఱి 1328 వ సంవత్సరము ప్రాంతమునందు రాజమహేంద్రవరము ప్రాంతమునకు మాత్రమే గాక, పారతంత్ర్య పరిముక్తము కావించిన మధ్యాంధ్ర దేశమునకెల్ల రాజ్యాధిపతి మునునూరి ప్రోలయనాయకుడు[18] కదః మునునూరి ప్రోలయనాయకునికి ఒక విష్ణువర్ధనమహారాజు సామంతుడు కాడు కదః కనుక 1328 వ సంవత్సరము ప్రాంతమునందు ఒక విష్ణువర్ధన మహారాజు రాజమహేంద్రవరము ప్రాంతమునకైన రాజ్యాధిపతి కాఁజాలడు. కనుక ఇఱుగ్రామ తామ్రశాసనములోని కాలము పదునాల్గవ శతాబ్ది కాఁజాలదు.

1890 వ సంవత్సరమునందు పెద్దచెఱుకూరు శిలాశాసనము లిపి పదమూడు, పదునాల్గు శతాబ్దుల నాటిదని ఒక ప్రభుత్వశాసన పండితుడు సూచించినను, దానిని బట్టి 1961-62 వ సంవత్సరము నందు ఇఱుగ్రామ తామ్రశాసనము లిపి కూడ సుమారు పదునాల్గవ శతాబ్ది నాటిదని మఱొక ప్రభుత్వ శాసనపండితుడు ప్రకటించినను, పెద్ద చెఱుకూరు శిలాశాసనము కాలము ఆంతరంగిక సాక్ష్యమును బట్టి 1420 వ సంవత్సరముకంటె, అనంతరము కావున, పెద్ద చెఱుకూరు శిలాశాసనము లిపిని పునఃపరిశీలనము చేయింపగా, ఇటీవలి అసమగ్రమైన ప్రతిబింబమును బట్టి, అది పదునైదవ శతాబ్ది లిపి అగునని, పదునారవశతాబ్ది లిపి కూడ కావచ్చునని లిపి కాలజ్ఞులు తెలిపిన సంగతి. పెద్దచెఱుకూరు శిలాశాసనము లిపి పదునైదు, పదునారు శతాబ్దుల లిపి అయిన, ఇఱుగ్రామ తామ్రశాసనము లిపి కూడ పదునైదు, పదునారు శతాబ్దుల లిపియే అగును. పదునైదవ శతాబ్దిని లేదుగావి, పదునారవ శతాబ్దిని ప్రభవనామ సంవత్సర మాఘమాసామావాస్యా గురువారము కలదు. 29-1-1568 వ తేదీ. కనుక ఇఱుగ్రామ తామ్రశాసనము లోని కాలము సహితము అర్వాచీనము కావలయును.

ఇంతకు, 1881 వ సంవత్సరము ప్రాంతమునందు ప్రథమతః ఇఱుగ్రామ తామ్రశాసనమును కూడ పరిశీలించిన రాబర్ట్ స్యూయెల్ అందఁజేసిన సమాచారమిది: 9

''దేర్ ఆర్ త్రి కాపర్ - ప్లేట్ ఇన్‌స్క్రిప్షన్స్ ఇన్ ది విలేజ్ (పెద్ద చెరుకూరు) ఇన్ పొజిషన్ ఆఫ్ నోరు కృష్ణయ్య ఎ రెసిడెంట్.

(1) గ్రాంట్ ఆఫ్ ఏన్ అగ్రహార బై "విష్ణువర్ధన మహారాజ," నో డేట్. ది కమెన్స్‌మెంట్ ఆఫ్ ది ప్లేట్ ఈజ్ ఇన్ ది చాళుక్యన్ స్టైయిల్, అండ్ ఐ ఇమేజిన్ దట్ ది గ్రాంట్ మస్ట్ బి బై ఒన్ ఆఫ్ ది ఈస్టెర్న్ చాళుక్య సోవరిన్స్ ఆఫ్ ది నేమ్, బట్ ఐ కెనాట్ ఎస్రర్టెన్ విచ్."

ఇందు పెద్ద చెఱుకూరులోని ఇఱు గ్రామ తామ్రశాసనము నందు కాలము లేదని ఇదమిత్థముగ కలదు. (నో డేట్). ఇది గమనార్హమైన విషయము.

1881 వ సంవత్సరము ప్రాంతము నందు రాబర్ట్ స్యూయెల్‌కు అందిన ఇఱుగ్రామ తామ్రశాసనమునందు కాలము లేదు. 1961 వ సంవత్సర ప్రాంతము నందు ప్రభుత్వ శాసన పండితునికి అందిన ఇఱుగ్రామ తామ్రశాసనము నందు కాలము కలదు. కనుక ఇఱుగ్రామ తామ్రశాసనము నందును కాలమును తెలుపు శ్లోకము 1881 వ సంవత్సరము ప్రాంతము తర్వాత ప్రవేశించినట్లు కరబదరకము.

పెద్ద చెఱుకూరు శిలాశాసనము, పెద్దచెఱుకూరు ఉరపు ఇఱుగ్రామ తామ్రశాసనము, తామరవాడ తామ్రశాసనము నకలు అన్యోన్యాశ్రయ గుణభూషితములు కావు. అన్యోన్యాశ్రయ దోష దూషితములు.

1704 వ సంవత్సరము నాటికి వ్రాతప్రతికల తెలుగువైశ్య పురాణము నందలి తామరవాడ తామ్ర శాసనము నకలులోని, కాలమును తెలుపు శ్లోకము 1881 వ సంవత్సరమునకు తర్వాత, 1890 వ సంవత్సరమునకు పూర్వము- పెద్దచెఱుకూరు శిలాశాసనము నందు, ఇఱుగ్రామ తామ్రశాసనమునందును ప్రవేశించినట్లు ప్రతీయమానము.

తామరవాడ తామ్రశాసనము నకలు మాతృక నకలు. పెద్ద చెఱుకూరు శిలాశాసనము, పెద్ద చెఱుకూరు ఉరపు ఇఱుగ్రామ తామ్రశాసనము కూటశాసనములు. (స్పూరియస్ ఇన్‌స్క్రిప్షన్స్), జనమేజయుని శాసనములు.

ఇక వాసవీ కన్య కథలోని విష్ణువర్ధనుడు - ఇతడు చాళుక్య విష్ణువర్ధనుడు అని సంస్కృత వైశ్య పురాణమునందు లేదు. అంతేకాదు. అతని రాజధాని రాజమహేంద్రవరము అనికూడ సంస్కృతవైశ్య పురాణమునందులేదు. తెలుగు వైశ్య పురాణము నందు మాత్రమే కలదు.

"శ్రీ మార్కండేయ మునికి
స్వామికి నిలయంబనంగ జగతిన్ దివిష
ద్ధామము రాజమహేంద్రని
నామమున నొప్పు పురము నవ్యస్ఫూర్తిన్.

ధూర్జటి పాదభక్తుఁ డరిదుర్గ విభేదన శౌర్యశాలి న్యా
యార్జిత వైభవుండు విబుధావన కల్పకుఁ డార్యసమ్మతుం
డర్జున వంశ వర్ధనుఁ డహర్పతి తేజుఁడు విష్ణువర్ధనుం
డూర్జిత సర్వ సంపదల నొప్పును రాజమహేంద్రనాథుఁడై

రాజ కళాధర భక్తుఁడు
రాజకులోత్తంసుఁ డన్యరాజ యశస్తే
జోజయ శాలిగఁ బరగును
రాజిత చాళుక్య వంశ రక్షకుఁడెలమిన్."

సంస్కృత వైశ్య పురాణమునందు లేని సమాచారమిది తెలుగు వైశ్య పురాణమునందు తీగ సాగినదో లేక, తెలుగు

వైశ్య పురాణములోని సమాచారము సంస్కృత వైశ్య పురాణము నందు మూగవోయినదో ఇంకను పరిశోధనీయము. ప్రాకృతము తెలుగు వైశ్య పురాణములోని సమాచారమునకు రక్ష కవచము కలదేమో పరిశీలనార్హము.

1124 వ సంవత్సరమునందు పెనుగొండ పురవాధీశ్వరుడు, మొక్కాల గోత్రుడు, కోసానిసెట్టి కొడుకు కామసెట్టి నాదెండ్లలో విశ్వేశ్వర స్వామికి దేవాలయము కట్టించినట్లు, 1144 వ సంవత్సరమునందు పెనుగొండ పురవరాధీశ్వరుడు, నాబెలగోత్రుడు, గొంటా కొమ్మిసెట్టి ఘంటసాలలో జలధరేశ్వర స్వామికి దీపారాధన కొఱకు 10 రాజమాడలు సమర్పించినట్లు, 1145 వ సంవత్సరమునందు పెనుగొండ (పురవరాధీశ్వరుడు) మాదిసెట్టి కొడుకు పోలిసెట్టి పట్టిసములో వీరభద్రేశ్వర స్వామికి 25 గోవులను దానము చేసినట్లు, 1151 వ సంవత్సరమునందు పెనుగొండ పట్టణాధిపతి, వాసయసెట్టి కొడుకు కోసయనసెట్టి కొణిదెనలో చెఱువు త్రవ్వించి, సోమేశ్వరుని ప్రతిష్ఠించి, ఆలయము నిర్మించినట్లు, ఇంకను పెనుగొండ పురవరాధీశ్వరులు వైశ్యులు ఉన్నట్లు పెక్కు శాసనములు కలవు.20 అంతేకాదు. 1233 వ సంవత్సరమునందు పెనుగొండ శాసనుడు ఆయత సెట్టి ఏలూరులో నారాయణమూర్తికి లక్ష్మీయుత మూర్తిని పెట్టినట్లు శాసనము కలదు. 21 కనుక పండ్రెండు, పదమూడు శతాబ్దులందు శివభక్తులైన వైశ్యులు, విష్ణుభక్తులైన వైశ్యులు పెనుగొండ పురమధీశ్వరాది బిరుదాంకితులుగ కలరు. కనుక వైశ్యులు అష్టాదశ పట్టణాధిపతులు అనఁబడిన కాలము ప్రధానముగ పండ్రెండు, పదమూడు శతాబ్దులు కావలయును. కనుక అష్టాదశ పట్టణాధిపతులైన వైశ్యుల ప్రమేయము కల వాసవీకన్య కథ చారిత్రికమైనచో, అది పండ్రెండు పదమూడు శతాబ్దులందు జరుగుటకు అవకాశము గలదు.

కథానాయకుడైన విష్ణువర్ధనుని కొడుకు రాజరాజేంద్రుడు అని మాత్రమేగాక, కథాంతమునందు రాజరాజేంద్రుడు వాసవీకన్యక సోదరుడైన విరూపాక్ష శ్రేష్ఠికి యౌవరాజ్య పట్టాభిషేకము చేసినట్లు సంస్కృత వైశ్య పురాణమునందు కలదు. (1- 50శ్లో, 53 అ.) ఇది తెలుగు వైశ్య పురాణము అయిదు ప్రతులందు, ముద్రిత గ్రంథము నందు లేదుగాని, ఒక వ్రాత ప్రతియందు అష్టమాశ్వాసమునందు "విరూపాక్ష పట్టాభిషేకము" అను ఘట్టముగ కలదు.22 అందు విరూపాక్షశ్రేష్ఠికి పట్టాభిషేకము చేసినది రాజనరేంద్రుడు అని కలదు. ఇట్లు కల తాళపత్రి గ్రంథము లేఖనకాలము 31-3-1787 వ తేదీ.23 అప్పటికి దక్షిణభారత దేశమునందు అధునిక చరిత్ర పరిశోధన ఆరంభము కాలేదు. కనుక ప్రక్షిప్తము కావలసిన ఆవశ్యకము లేదు. కనుక వాసవీ కన్య కథకు సంబంధించిన విష్ణువర్ధనుడు రాజనరేంద్రుని తండ్రి కావలయును.

వేంగిదేశమునందు పరిపాలనము కావించిన తూర్పుచాళుక్య రాజులు, వారి వంశీయులైన చాళుక్య చోళరాజులు అందఱును విష్ణువర్ధనులు అగుదురు కాని, రాజనరేంద్రులు కొందఱు. కొందఱిలిన రాజరాజనరేంద్రులు ఇద్దఱు ముగ్గురే కలరు. ఒకడు తూర్పు చాళుక్యరాజైన, నన్నయ భారతమునకు నాందీవాక్యము పలికిన, మొదటి రాజరాజనరేంద్రుడు. వేఱొకడు చాళుక్య చోళ రాజైన ఇమ్మడి రాజరాజనరేంద్రుడు. ఇతడు మొదటి రాజరాజనరేంద్రుని మనుమని (మని) మనుమడు. ఇమ్మడి కులోత్తుంగ చోళుని కొడుకు. కాలము 1145-1173. కనుక వాసవీకన్య కథకు సంబంధించిన విష్ణువర్ధనుడు మొదటి రాజరాజనరేంద్రుని తండ్రి విమలాదిత్యుడు కాక, రెండవ రాజరాజనరేంద్రుని తండ్రి రెండవ కులోత్తుంగ చోళుడు కావచ్చును.

తెలుగు వైశ్య పురాణమునందు వాసవీకన్య కథకు సంబంధించిన విష్ణువర్ధనుడు, రాజ నరేంద్రుని తండ్రి అని మాత్రమే గాక, రాజ రాజ నరేంద్రుని కొడుకు అనియాడ కలదు.

"గంధర్వాంతి చిత్రకంఠుఁడు సొంపున
వైశ్య శాపమునంది వసుధ నతఁడు
సోమవంశంబున సురరాజ భోగియై
రాజ రాజ నరేంద్ర రాజునకును
శుభముహూర్త శుభగ్రహ దృష్టి వేళలఁ
బరమ పాతివ్రత్య భాసుమైన
సర్వలక్షణయగు శర్వాణి దేవికి
వంశవర్ధన విష్ణు వర్ధనుండు

పరగ జనియించి సత్పరిపాలనంబు
సేయుచుండెను శ్రీరామచంద్రు మాడ్కి
తల్లిదండ్రుల గురువుల దైవములను
భక్తిఁ గొలుచుచు నుండెను రక్తితోడ."

ఇందు వంశ వర్ధనుడైన విష్ణువర్ధనుడు శ్యామాంగీ రాజ రాజ నరేంద్రుల కొడుకు అని ఇదమిత్థముగ కలదు. మఱి రెండవ కులోత్తుంగ చోళుని తండ్రి విక్రమ చోడుడు. కాని విక్రమ చోడునికి రెండవ కులోత్తుంగ చోళుడు ఔరస పుత్రుడు కాడు. స్వీకృత పుత్రుడు. కూతురు కొడుకు. కనుక రెండవ కులోత్తుంగ చోళుని తల్లి శ్యామాంగి నామధేయ, తండ్రి రాజ రాజ నరేంద్ర నామధేయుడు కావచ్చును. పల్లవ రాయన్‌పేట శాసనమును

పరిశీలింప వలయును. అథవా, మొదటి కుళోత్తుంగ చోళుని తండ్రి రాజ రాజ నరేంద్రుడు కావున, అతడు రెండవ కుళోత్తుంగ చోళుని తండ్రిగ, అర్వాచీనాంధ్ర వైశ్య పురాణమునందు ఆపాదితముకావచ్చును; శ్యామాంగి అను పేరు కవిత్వముకావచ్చును.

ఇక 1164 వ సంవత్సరమునందు "నూటరెండు గోత్రముల వైశ్యుల" సంగతియును ఒక శాసనమునందు కలదు గావున, వాసవీ కన్యకతోపాటు నూటరెండు గోత్రముల వైశ్యులును అగ్నిప్రవేశము చేయుటకూడ అచ్చ చారిత్రికమైనచో, అది 1164వ సంవత్సరము కంటె పూర్వమే జరుగుట కూడ అనుకూలము. కనుక వాసవీ కన్యకతోపాటు నూటరెండు గోత్రముల వైశ్యులును అగ్నిప్రవేశము చేసిన కాలము స్థూలముగ 1150 వ సంవత్సరము కావచ్చును.

ఇదొక సంభావ్యమైన సమన్వయము. కాని, ఇందు సంస్కృత వైశ్య పురాణమునందు పాత్ర వహించిన, తెలుగు వైశ్య పురాణమునకు కర్త అయిన, బమ్మెర పోతనకు అనంతరుడైన భాస్కరాచార్యుల ఉదంతము సంగతము కాదు. అది కూడ సంగతము కావలయును. కనుక మఱొక సంభావ్యమైన సమన్వయము కర్తవ్యము.

ఏడవ శతాబ్దినుండి పండ్రెండవ శతాబ్ది వఱకు పరిపాలించిన తూర్పు చాళుక్య రాజులు, చాళుక్య చోళ రాజులు మాత్రమే గాక, పదమూడవ శతాబ్దిని వారి వంశీయులును మాత్రమే గాక, పదునాల్గవ శతాబ్ది నుండి పదునారవ శతాబ్ది వఱకు విష్ణువర్ధన మహారాజ శబ్ద వాచ్యులు అన్యులు కలరు. అందు వాసవీ కన్య కథకు రంగస్థలమైన పెనుగొండకు సమీపమునందలి పాలకొల్లులోని రామేశ్వరాలయము నందలి శయనాగార స్తంభముమీది శాసనము ఇట్లు కలదు.26

"స్వస్తిశ్రీ అభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౫౧౮ అగు నేటి దుర్ముఖి సంవత్సర ఫాల్గుణ శు ౧౩ శు స్వస్తిశ్రీ సర్వ లోకాశ్రయ విష్ణువర్ధన మహారాజులైన శ్రీ సాతోడా బెహరా మహా పాత్రులైన శ్రీ శంకర హరిశ్చంద్ర మహారాజులుంగారు సుముహూర్తాన ప్రతిష్ఠ చేసిన [పెరుమాండ్లు నగరము]."

ఇందు "శంకర హరిశ్చంద్ర మహారాజులుంగారు సాతోడా బెహరా మహాపాత్రులు" మాత్రమే గాక, "సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజులు" అని కూడ ఇదమిత్థముగ కలదు. శాసన కాలము 1518 + 78 = 1596 వ సంవత్సరము. (19-2-1597?) ఈ విష్ణువర్ధన మహారాజు కాలములోని భాస్కరాచార్యులు-బమ్మెర పోతనకు అనంతరుడగుట, తెలుగు వైశ్య పురాణమునకు కర్త అగుట, సంస్కృత వైశ్య పురాణమునందు పాత్ర వహించుట సంభవము. సంస్కృతాంధ్ర వైశ్య పురాణముల కాలము పదునారు, పదునేడు శతాబ్దులని పూర్వోక్తము. పదునారవ శతాబ్ది అపర విష్ణువర్ధన మహారాజును అసలు విష్ణువర్ధన మహారాజును చేయుటకు చాళుక్య వంశ వర్ధనత్వము, రాజమహేంద్రవర రాజధానీత్వము, రాజ రాజ నరేంద్రు పుత్రత్వ పితృత్వములు భాస్కరాచార్య కల్పితములు కావచ్చును.

కనుక సంస్కృతాంధ్ర వైశ్య పురాణములలోని విష్ణువర్ధనుడు పురాణ పురుషుడు గాక, చారిత్రిక వ్యక్తి అయినచో, అతడు రెండవ కుళోత్తుంగ చోళుడుగాని, శంకర హరిశ్చంద్రుడుగాని కావచ్చును. అటు నిటు సాధకములు, బాధకములును కలవు. కనుక వాసవీకన్య కథకు సంబంధించిన విష్ణువర్ధనుడు చారిత్రిక వ్యక్తి కాకపోవచ్చును.

## సూచికలు

1. ఆంధ్ర కవితరంగిణి, తొమ్మిదవ సంపుటము, పుట 207.
2. భారతి, ఫిబ్రవరి '83, పుట 43.
3. అదే, అక్టోబరు '80, పుట 16.
4. అదే, పుట 17.
5. అదే, పుట 14.
6. అదే, సెప్టెంబరు '72, పుట 18
7. అదే, అక్టోబరు '80, పుటలు 15-6.

తెలుగు విజ్ఞాన సర్వస్వము. మూడవ సంపుటము, పుటలు 142-73 & 191-223.

9. ఇండియన్ ఎఫిమెరిస్
10. ఎన్మిదివలె, పుట 148.
11. రెండువలె, పుట 45.
12. తొమ్మిదివలె.
13. ఆరువలె, పుట 12.
14. హిస్టరీ ఆఫ్ ది రెడ్డి కింగ్‌డమ్స్, పుట 167.

15. ఏన్టిక్వేరియన్ రిమైన్స్ ఇన్ ది ప్రెసిడెన్సీ ఆఫ్ మెడ్రాస్, పుట 84.

16. రెండు, ఏడు వలె.

17. ఏన్యువల్ రిపోర్ట్ ఆఫ్ ఇండియన్ ఎపిగ్రఫీ, పుట 37.

18. ఎన్మిదివలె, పుట 282.

19. పదిహేను వలె.

20. రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక, పుట 148.

21. దక్షిణ హిందూదేశ శాసనములు, సంపుటము 5, సంఖ్య 171, పుట 65.

22. ఎ డిస్క్రిప్టివ్ కేటలాగ్ ఆఫ్ తెలుగు మేన్యుస్క్రిప్ట్స్ ఇన్ ది మెడ్రాస్ ఓరియంటల్ లైబ్రరీ, వాల్యూ. 1, పుట 301.

23. ఒకటి వలె.

24. ఎన్మిది వలె, పుట 211

25. అదే, పుట 208.

26. ఇరువది యొకటి వలె, సంఖ్య 165, పుట 64.

డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తి

# రాయవాచకం - కృష్ణరాయ విజయం

1983 ఏప్రిల్ నెల భారతిలో అచ్చయిన 'రాయవాచక రచనాకాలము-దాని చారిత్రకత' అనే వ్యాసా న్ని సాహిత్య అకాడమీ 1982లో పునర్ముద్రించిన రాయవాచకానికి పీఠికగా అచ్చు యింది. వ్యాసాంత సూచికల్లో దీన్ని వ్యాసకర్త పేర్కొన్నాడు కూడా. అకాడమీ తాంబూలం అందుకొన్న అదే వ్యాసా న్ని భారతికి వ్యాసకర్తలు ఎందుకు పంపించినా ఔచిత్యం మాత్రం కొరవడింది. అకాడమీ ముద్రణలో కంటె ఈ మధ్య కాలంలో అపూర్వమైన సమాచారం వ్యాసకర్తకు అందితే దాన్ని లోకానికి తెలపడానికి వ్యాసకర్త పరిశిష్టవ్యాసం ప్రచురణకి పంపుకొన డంలో ఔచిత్యం ఉంది. ముందుగా అకాడమీకి నిర్దిష్టమైన దానిని మరో పత్రికకు 'అమ్మడం' తప్ప వ్యాసంలో చెప్పుకోదగ్గ అత్యద్భుత పరిశోధన ఏటికేపు కూడా లేదు. మొదటిదా కి రెండోది న లు.

అయితే "శవాన్నయినా వ్యాకరణయుక్తంగా కట్టమంటాడు జయంతి రామయ్యపంతులు" అనిశెట్టి లక్ష్మీనరసింహంగారన్నట్లు శీర్షికలు, ఉపశీర్షికలు, అధస్సూచికలు, అనుబంధాలు సాంప్ర దాయ సిద్ధంగా వ్యాసకర్త అలంకరించడానికి చేసిన ప్రయత్నం మాత్రం మెచ్చుకో తగింది. ఇది ఈనాటి సాహితీ, చారిత్రక పరి శోధకుల ఫేషన్.

ఇది ఇలా ఉండగా కుమార ధూర్జటి కృష్ణరాయ విజ యాన్ని సాహిత్య అకాడమీ 1981లో పునర్ముద్రించింది. దాని పీఠికా కర్తలు కూడా డా. సి. వి. రామచంద్రరావుగారే. ముద్ర ణలు ఏప్రుపు వెలసినా డా. రావుగారు నెల్లూరు చిరునామాతో 80 నవంబరు 1 వ తేదీకే రెండింటికి పీఠికలు రాశారు-అకాడమీ కోరికపైన.

రాయవాచక వచనానికి కృష్ణరాయ విజయం పద్యచ్ఛాయ కాబట్టి రెండు గ్రంథాలు ఒకరికే అకాడమీ అప్పగించడం మంచిదే.

విజయనగర చరిత్రకు అతిముఖ్యమైన సారస్వతాధారం రాయవాచకం అని, స్వర్ణఖని అని చెప్పిన వ్యాసకర్త కేవలం రాయవాచక, కృ. రా. వి. రచనల కాల నిర్ణయాలకే పీఠికలను వినియోగించే రెందుకు ? కవుల కాల నిర్ణయాలు, పాఠభేదాలు చర్చించే కాలమా ఇది ! కృ. రా. విజయంలో లేకపోయినా రాయ వాచకంలోని అపూర్వ విషయాలను ఈనాటి వారికి తెలిసేటట్లుగా చెప్పవచ్చు కదా ! కాల నిర్ణయానికి అనవసర యుక్తులు చూపిం చారు. అయినవారిని, కానివారిని ప్రామాణికులుగా పేర్కొన్నారు. వీరేశలింగంపంతులు, వేటూరి పొరబడ్డారన్నారు. మరి వ్యాస కర్తే పొరబాటుగా పైవారి రచనలను గ్రహించారంటే ఏమవు తుంది ?

కందుకూరి వీరేశలింగంపంతులుగారు ఆంధ్రకవుల చరిత్ర మూడు భాగాలలో రాశారు. మొదటి భాగాన్ని (1917) అయన బతికున్న రోజుల్లోనే పరిష్కరించి ప్రకటించారు. అపరిష్కృత మైన రెండు, మూడు భాగాలను 1950లో రాజమండ్రి హితకారిణీ సమాజం ప్రకటించింది.

తెలుగుదేశ చరిత్రలో సాహిత్యాధారమైన వ్యాసాలు రాయ వలసి వచ్చినప్పుడు వీరేశలింగం పంతులుగారి పై మూడు సంపు టాలు 'ఏదో చదివేం' అని కాకుండా నిదానంగా చదవాలి. అట్లా చదివిన వారిలో మానవల్లి, వేటూరి, నిడుదవోలు, నేలటూరి, కొమ రాజు, మల్లంపల్లి, డా. రావుగారు కవి చరిత్రకారులు పొర పాటు వడ్డారని ఈ క్రింది విధంగా రాశారు.

కృష్ణరాయ విజయం కృతిభర్త - "చినవెంకటాద్రి కాల నిర్ణయ విషయంలో చాలామంది చరిత్రకారులు, కవి చరిత్రకారులు, పొరపాటు చేశారు. ఏలనో కందుకూరి వీరేశలింగం పంతులు ఈ అర్వీటి చినవెంకటాద్రిని అకువీటి చినవెంకటాద్రిగా పొరపడినాడు" (కృ. రా. వి. పీఠిక XX పుట).

◆ ◆

"కుమార ధూర్జటి తన కావ్యముల ఆశ్వాసాంత గద్యలలో అవతారికా పద్యాలలో తనను 'ధూర్జటి పౌత్ర' అని చెప్పుకొన్నది ఆధారంగా వీరేశలింగం కృష్ణరాయవిజయం 1550 ప్రాంతంలో రచింపబడి ఉంటుందని కుమార ధూర్జటి 1560-70 ల వరకు జీవించి ఉంటునని భావించారు." (అదే పుట)

వీరేశలింగం పంతులుగారు కొన్నిచోట్ల భ్రమ ప్రమాదాలకు లోనైనా తరవాత సందర్భం వచ్చినపుడు సర్దుకొంటూ వచ్చారు. కవుల చరిత్ర మూడో భాగంలో ధూర్జటి వెంకటరాయ కవి గూర్చి రాస్తూ ఈ విధంగా తెల్పారు.

"ఈ కుమార ధూర్జటి తాను కృష్ణదేవరాయల కాలములో నుండి కాళహస్తి మాహాత్మ్యమును రచించిన ధూర్జటి కవికి మనుమఁడైనట్టు తన కృష్ణరాయవిజయమున వ్రాసికొని యున్నాఁడు. 1520 వ ప్రాంతమునందుఁ గృష్ణదేవరాయల కాలములో నుండిన ధూర్జటి కవి మనుమని కొడుకగు లింగకవి 1730 వ సంవత్సర ప్రాంతమునం దక్కిరాజు వేంకటపతి కాలములో ననఁగా నిన్నూఱు సంవత్సరముల తరువాత నుండుట పొసఁగ నేరదు. కాబట్టి కుమార ధూర్జటికి ధూర్జటి సరిగా తాత కాక తాత వరుస వాఁడయి యుండవచ్చును. అందుచేతనే కాఁబోలుఁ గుమార ధూర్జటియే యొకచోట ధూర్జటిని దన పెదతాతనుగాఁ జెప్పుకొన్నాఁడు. ఈ లింగకవియుఁ దన తండ్రిని ధూర్జటి మనుమనిగాఁ జెప్పక 'ధూర్జటి వంశ పాథోధిచంద్ర' యని తద్వంశజునిగా మాత్రము చెప్పినాఁడు. కుమార ధూర్జటి చిన వెంకటాద్రీశ్వరుని యాజ్ఞాప్రకారముగాఁ దాను కృష్ణరాయ విజయము చేసితినని చెప్పుకొన్న చిన వేంకటాద్రి నరపతి కృష్ణరాయవిజయ కృతిపతి యగు కోదండరామరాజు యొక్క రెండవ కుమారుడగు చినవేంకటాద్రి యైనచో నీ కాలనిర్ణయమించుమించుగా సరిపోవును." (ఆంధ్రకవుల చరిత్ర, తృతీయ భాగం, ఆదునిక కవులు 1950, పుటలు 129-130.)

కవుల చరిత్ర మూడో సంపుటాన్ని ప్రొఫెసర్ రావుగారు చదవక పోబట్టి, అనవసరంగా కాలనిర్ణయ చర్చ పొడిగించారు. అకువీడును, అరవీడుగా, పౌత్రుడనగా మనమడి పరసగా చిన వెంకటాద్రి అరవీటి చిన వెంకటాద్రిగా అచ్చుదాదులు అక్షింతలు వేయక మునుపే వీరేశలింగం పంతులుగారు మూడోసంపుటంలో సవరించుకొన్నారు.

ఇక రా. వా. పీఠిక VI లోను, కృ. రా. వి. పీఠిక XX లోను కృ. రా. వి. కృతి భర్త చిన వెంకటాద్రిని గుర్తించడంలో నేలటూరి వేంకటరామయ్యగారు పొరపాటు పడ్డారని డా. రావుగారు అన్నారు. ఆ పొరపాటుకి కారణమేమిటో సోర్సెస్ ఆఫ్ విజయనగర హిస్టరీ పుట 311 ఫుట్‌నోట్ చూస్తే తెలిసిపోను కదా! అది చూడలేదని తెలుస్తోంది. హిస్టరీ పాఠాలు చెప్పేవారికి కవుల చరిత్ర ఈసడింపు కావచ్చు. సోర్సెస్ వారికి మొదటి తరగతి వాచకం గదా!

కవికర్ణ రసాయనం లోని పద్యాలు రా. వా. కంలో ఉన్నాయని మొదట చూపినవారు నిడుదవోలు వేంకటరావుగారు. (చూ. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయం). రా. వా. పద్యాలను గుర్తించుటకు పీఠికా కర్తకు సాధ్యం కాలేదని ఒప్పుకోనప్పుడు (L III, పై విషయాన్ని ఎందుకు ఒప్పుకోలేక పోయారో? కనీసం గుర్తించిన పద్యాలకు ఆకరాలైనా చూపలేక పోయారే. పైగా "ఏవంక జూచిన" అనే సీసపద్యం మనమెవ్వరయినా గుర్తిస్తే- సీ రా. వా. కాల నిర్ణయానికి తోడ్పడుతుందట!

విజయనగర నిర్మాణం కాలనిర్ణయం గురించే చెప్పారు. కాని ముల్లంద్ర డిండిమపుంభార సరస్వతిని గూర్చి గాని, విద్యారణ్యులవారు కాశీలో దర్శించిన వేదవ్యాసుడనే యతినిగూర్చి కాని ఒక్క ముక్కయినా విదల్పలేదే. శ్రీనాథుని కాలం నుండి విజయనగర దొరల ఆస్థాన విద్వాంసులుగా పేరొందిన ముల్లంద్రం అరుణగిరినాధాది డిండిమ సార్వభౌముల పండిత కుటుంబాన్నిగూర్చి డా. రావుగారు వినలేదేమో! కృ. రా. వి. లో ముల్లంద్రం వంశం పేరు లేదు రాయవాచకంలో కదా!

విజయనగర స్థాపన విషయంలో కర్ణాటకంలో వీరశైవులకు అద్వైతులకు కొంతకాలం క్రితం జరిగిన వాదోపవాదాలను గూర్చి కూడా డా. రావుగారు వినలేదు కాబోలు. విద్యారణ్యులు కాదు కాశీవిలాస క్రియాశక్తి విజయనగర స్థాపకుడని ఒక వాదన అక్కడ లేచింది. రా. వా. లో విద్యానగర స్థాపన నిమిత్తం విద్యారణ్యులు కాశికి వెళ్ళి అక్కడ వికృత వేషధారిగా అయనకు కనబడిన వ్యక్తి శైవాచారంలోని వామ శాఖకు చెందిన అవతారంగా డా. రావుగారికి గోచరించటం లేదా? మాధవుని గురువు కాశీవిలాసక్రియా శక్తిగా సూతసంహిత వ్యాఖ్యలో చెప్పుకోలేదా? రా. వా. లో జంగమువాడు భిక్షాటనకు వచ్చి శంఖనాదం చేసి ముహూర్తం తప్పింపలేదా?

వీర నరసింహరాయలు ఆరాధ్య నామావళులు బ్రాహ్మీ ముహూర్తాన్నే లేచి వినేవాడని రా. వా. ఓం ప్రథమంలోనే ఉందే. ఆరాధ్య నామావళులు పాల్కురికి సోమనకృతి. పండితారాధ్య చరిత్రలో ఉంది. విడిగా ఉంది. పైగా వీరనరసింహరాయలు "విభూతి ధరియించి" పేరోలగానికి వచ్చేవాడని కూడా ఉందే. అప్పుడు ఆరాధ్య పీఠాలు కూడా ఉన్నట్లు చెప్పబడిందే. ఇవన్నీ కాశీవిలాసక్రియాశక్తి వాదానికి తోడ్పడటం లేదా ?

ఇకపోతే రా. వా. లో (పుటలు 13-18) 'సభాపతి వచనం' ఇమిడి ఉంది. 1922 లో వేటూరి ప్రభాకర శాస్త్రిగారు చాటుపద్య మణి మంజరి ద్వితీయభాగం చివర అచ్చు వేసిన నాటినుండి పరిశోధకుల కందరికీ తెలిసిన విషయమే. ఇది తెలియక, ఎన్ని పుట్నోట్లు? ఎంత అనవసర ప్రసక్తి. ఈ సభాపతి వచనాన్ని తంజావూరి నుండి నకలు తెప్పించి కర్నూలు జిల్లా డోన్ తాలూకా ఉ. కొత్తపల్లి 'గాయత్రీ ప్రచురణలు' సంస్థ డా. రావుగారి పీఠికా రచనకు ముందే ప్రత్యేక గ్రంథంగా అచ్చువేసిన విషయం వ్యాసకర్తకు తెలియదంటే నమ్మటానికి వీలుంది.

అవంత భూపాలుని సిద్ధవటం శాసనం లభించడమేమిటి ? భూమిలోంచి పైకి తీసినట్లు 15, 20 సంవత్సరాలనుండి తెలుగు ఎం. ఎ. విద్యార్థులందరికి కొట్టినపిండి. కొందరికి జిహ్వాగ్రం మీద కూడా ఉంది ('శాసన పద్యమంజరి' ప్రతులు దొరక్క).

అర్థ వివరణలు విమర్శించాలంటే పాఠకులకు తలనొప్పి, ఈ వ్యాస రచయితకు కంచిగరుడసేవ. చిన్న విషయం- "కర్తాపుడు ముస్లిం దేవత కాడు" అని (84 వ పుట) అర్థ వివరణలో ఇచ్చారు. "కర్తాపుడును తుర్కల మసీదు" అని క్రీడాభిరామంలో ఉందే.

కృష్ణరాయ విజయం రాయవాచకాన్ని దగ్గర పెట్టుకొని కుమార ధూర్జటి ఆరవీటి కోదండ రామరాజు చిన్నకొడుకు చిన వెంకటాద్రి ప్రేరణచే శ్రీ రాములవారికి అంకితం ఇచ్చింది. రాయ వాచకానికి నూరేళ్ల తర్వాత పుట్టిందని ఇప్పటికి అందరూ ఒప్పుకొంటాం.

ఇందులో కూడా డా. రావుగారు కుమార ధూర్జటి కృతిపతి చినవెంకటాద్రి కాలానికే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చారు. రాయ వాచకాన్ని ఎట్లా కు. ధూ. అనుసరించాడో పనికిరాని రెండు అంశాలు చెప్పి దాటేశారు.

రామ రాజీయంలో కోదండ రామరాజు ఆసనపురం (హసన్) వద్ద మైసూరు దళవాయి కుమారయ్యను ఎదుర్కొన్నాడు (రామ. రా. 480 పద్యమాలిక). కుమారయ్య మైసూరు చిక్కదేవ రాయని దళవాయి. 1673 లో దొడ్డ బేలూరులో చిక్కరాయల శాసనంలో కుమారయ్య పేర్కొన బడ్డాడు. క్రీ. శ. 1674 లో కుమారయ్యపై కోదండ రామరాజు దండెత్తి ఉండవచ్చునని సి. హయవదనరావు హిస్టరీ ఆఫ్ మైసూర్ (1399- 1799) 276వ పుటలో రాశారు. కోదండ రామరాజు రెండోకొడుకు చినవెంకటాద్రి 1700 - 1725 మధ్య ఉండటంలోను కృతిని స్వీకరించటంలో ఆశ్చర్యమేముంది ?

ద్విపద రామాయణ కృతికర్త కట్టా వరదరాజు తండ్రి హరిదాసరాజు 1630 లో శాసనం వేయించాడు. అంటే వరదరాజు 1650 లో ఉన్నాడట మాట. మరి వరదరాజు మనుమరాలు, అప్పలరాజు కూతురు, ఆర్వీటి కోదండ రామరాజు భార్య అయిన తిరువెంగళాంబ 1710 ప్రాంతంలో ఉండొచ్చుకదా (రామరాజీయం) కోదండరామరాజు రెండోకొడుకు కృ. రా. వి. కృతిపతి వీరేశ లింగం పంతులు గారు చెప్పినట్లు 1730 లో ఉండటం అసంభవం కాదు కదా!

కొత్త ఆలోచనలతో కాలం నిశ్చయించడానికి ఈ విధంగా వీలుంటుందే. ఇంతకు పూర్వం పండితుల వ్రాతలను, గుది గుచ్చటం, ఇప్పటి సిద్ధాంత గ్రంథాలలోని అభిప్రాయాలను 'మధ్య మధ్యే పానీయం సమర్పయామి'లా తయారు చేస్తే కొత్తసంగతులు బయట పడే దెప్పుడు? అక్కిరాజు ఉమాకాంతం గారు పల్నాటి వీరచరిత్ర భూమికలో చెప్పినట్లు మనం ఇంకా "ఎత్తి వ్రాసుకొనే దశ"లోనే ఉన్నాం.

రాయలవారు, ఉభయదేవేరుల తామ్ర ప్రతిబింబాలు తిరుమలలో స్వామివారి సన్నిధిలో ఎప్పుడు నిలిపిందీ స్పష్టంగా తెలియక పోవటం నిజమే కాని తిరుపతి శాసనాలను కాస్త ఓపికతో తిరగవేస్తే వాటి సంపాదకులు ఏమన్నారో తెలుస్తుంది కదా ! క్రీ. 1513 సంవత్సరంలో అవి వెలసినట్లు డా. రావుగారన్నారు. టి. టి. డి. శాసనాల సంపాదకులు మాత్రం 1517 ఫిబ్రవరి 2 వ తేదీన రాయలవారు తమ సమక్షంలో పోతపోయించినట్లు నిర్ణయించారు. (చూ. కృష్ణరాయల శాసనాలు, పుట 175, టి. టి డి. రిపోర్టు 186 వ పుట). పేయస్సీ, అల్లసాని పెద్దన వర్ణించిన తీరులో రాయలవారి విగ్రహం ఉన్నదని వారు చెప్పారు. టి. టి. డి. దేవస్థానం పూర్వంలో ప్రచురించిన శాసనాల్లోని ఇంగ్లీషు అనువాదాలు, రిపోర్టు సంపుటం చదివి చాలామంది పెద్దలు కాలం గడిపేశారు. కాని తమిళ మూలం చదివి ఆశ్చర్యకరమైన విషయాలు, భాషాప్రయోగ వైచిత్రి గుర్తించిన వారెందరు ?

అందుగుల వెంకయ్య రాసిన రామరాజీయం లేదా నరపతి విజయం కృష్ణరాయ విజయ కృతిభర్త చిన వెంకటాద్రి అన్న పెద వెంకటాద్రి వర్ణనతో అసంపూర్తిగా ఆగిపోయింది. దీనికి కారణం చెప్పలేం. తన వ్యసనలేని కారణం చేతనో, అవమానం చేతనో తండ్రి రామరాజీయం రాయిస్తే, కుమారుడు చిన వెంకటపతి ఆ రామరాజు మావగారి చరిత్రను రాయించాడు. రామరాజీయ పరిష్కరణలో గవర్నమెంట్‌కి తోడ్పడిన వారు భారతవర్ష ప్రథమ మహా మహోపాధ్యాయ బిరుదాంచితులు కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు.

మొత్తం మీద రాయవాచక, కృష్ణరాయ విజయ పునర్ముద్రణల వల్ల సాహితీ శోధకులకు పుస్తకాలు లభించేటట్లు సాహిత్య అకాడమీ చేసిందేకాని వాటి పీఠికలు మాత్రం ఆ రంగంలో పని చేసిన వారికి ఏ మాత్రం సంతృప్తి పరచలేక పోవటమే కాక ప్రధాన గ్రంథాలలోని అపూర్వ విషయాలను ఆవిష్కృతం చేయలేనట్టి నీరస స్థితిలో ఉన్నాయని చెప్పటానికి వీలు కల్పించాయి. అకాడమీకి జమాఖర్చులు, పీఠికాకర్తలకు పేరు ప్రధానమవి ఈ పీఠికలే కాకుండా ఇటీవల వెలువడిన ప్రాచీనాంధ్ర గ్రంథాల పీఠికలు ఋజువు చేస్తాయి. అవకాశ మున్నప్పుడు వాటికో రేవు పెట్టవచ్చు.

— ఒక పాఠకుడు



# గ్రంథ విమర్శలు

## శ్రీ దేవీ భాగవతం

[వ్యావహారిక వచనకావ్యం. రచయిత: కవికిశోర, కవితావిశారద, కవితావతంస, విద్వాన్ శ్రీ పూడి వేంకట రామయ్య. డెమ్మీ సైజు. మొదటి సంపుటం. 1, 2, 3 స్కంధములు 16+274 పేజీలు. వెల 15 రూపాయలు. రెండవ సంపుటం. 4, 5 స్కంధములు. 268 పేజీలు. వెల 15 రూ. ప్రతులకు - శ్రీ పి. శివకుమార్, 486, కొండమిట్ట, శ్రీకాళహస్తి - 517 644, చిత్తూరు జిల్లా.]

భారత భాగవత రామాయణాల తర్వాత ఎక్కువగా ప్రజామోదాన్నీ, బహుళ ప్రచారాన్నీ పొందిన గ్రంథాలలో దేవీభాగవతం ఒకటి. దీనిని యిదివరలో దాసు శ్రీరాములుగారు, తిరుపతి వేంకటకవులు, పురిపండా అప్పలస్వామిగారు, సరిపెల్ల విశ్వనాథశాస్త్రిగారు, స్థానాపతి రుక్మిణమ్మగారు తెలుగులోకి తర్జుమా చేశారు. పిలకా గణపతిశాస్త్రిగారు ఆంధ్రపత్రికలో అనుస్యూతంగా ప్రకటించారు. పిల్లలకు ఉద్దేశించిన చందమామలో కూడా ఇది పడింది. ఇప్పుడు పూడి వెంకటరామయ్య గారు వ్యావహారిక భాషలో దీన్ని రచించి ప్రకటిస్తున్నారు. కొంత కాలం క్రిందట రచయిత సంస్కృత మూలంలోని కొంత భాగం పారాయణ చేస్తున్నప్పుడు దీనిని తెలిగించాలనే సంకల్పం కలిగింది. దీక్షతో అనువాదాన్ని పూర్తి చేశారు. ప్రస్తుతం రెండు సంపుటాలలో అయిదు స్కంధాల వరకూ ప్రకటించారు. శ్రీ దేవీ భాగవతం చాలా పెద్ద గ్రంథం కావడం వల్ల రచయిత దీనిని నాలుగయిదు సంపుటాలుగా ప్రకటించదలచారు. ఇంత పెద్ద గ్రంథాన్ని ముద్రించడానికి ఎన్నో వేల రూపాయలు కావలసి ఉన్నది. తిరుమల తిరుపతి దేవస్థానాల వారూ, శ్రీకాళహస్తిలోని శుక బ్రహ్మాశ్రమాధిపతులూ, ఇతరులైన వదాన్యశేఖరులు, మిత్రులూ ఆర్థిక సహాయం చేసి దీని ముద్రణకు ఎంతో తోడ్పడినట్లు రచయితయే చెప్పుచున్నారు.

పురాణాలన్నీ ఏదో ఒక్క గాథనే చెప్పకుండా పెక్కు విషయాలను చెప్పుతూ ఉంటాయి. భాగవతాదుల్లో రామాయణ కథ కూడా కానవస్తుంది. భారతంలో కౌరవ పాండవుల వృత్తాంతమే కాకుండా సందర్భానుసారంగా ఎన్నో గాథలు, పూర్వరాజుల వృత్తాంతాలూ చెప్పబడి ఉన్నాయని అందరికీ తెలుసును. ఆ రీతిగానే యీ దేవీ భాగవతంలో కూడా దేవీ మాహాత్మ్యం మాత్రమే కాక అవతారాలకు సంబంధించిన కథలు, ఇతర కథలు కూడా ఉన్నవి.

మొదటి సంపుటంలోని విషయ సూచికలో - మొదటి స్కంధంలో శౌనకుని ప్రశ్న, పురాణ సంఖ్య, హయగ్రీవావతారం, మధుకైటభ వృత్తాంతం, పురూరవుడు, వ్యాస శుక సంవాదం, జనక శుక సంవాదం, ధృతరాష్ట్రాదుల జననం ఉన్నవి. రెండవ స్కంధంలో మత్స్యగంధీ వ్యాసుల జననం, గాంగేయుని జననం, సత్యవతీ శంతనులు, యుధిష్ఠిరాదుల చరిత్ర, ధృతరాష్ట్రాదుల మరణం, పరీక్షితుని, జనమేజయుని చరిత్రలు, వ్యాస జనమేజయ సంవాదం ఉన్నవి. మూడవ స్కంధంలో దేవీ స్వరూపం, బ్రహ్మాదులు భువనేశ్వరిని దర్శించడం, త్రిమూర్తులు భువనేశ్వరిని స్తుతించుట, బ్రహ్మాండోత్పత్తి, సత్త్వాది గుణ స్వరూపం, సత్యవ్రతోపాఖ్యానం, దేవీయజ్ఞ విధి, దేవీ వ్రతం, సుదర్శనుని కథ, నవరాత్ర వ్రత మాహాత్మ్యాలు, శ్రీరామచరిత్రం ఉన్నవి. కాని యివి ఏయే పేజీలలో ఉన్నవీ చెప్పబడలేదు. పేజీలను సూచిస్తే పాఠకులకు సౌకర్యంగా ఉండేది.

రెండవ సంపుటంలో విషయ సూచిక లేనే లేదు. పేజీలను తిరగవేస్తూ, హెడ్డింగులను చూస్తూ, విషయాలను గ్రహించ వలసినదే! నాల్గవ స్కంధంలో శ్రీకృష్ణ జన్మ కారణ ప్రశ్న, కర్మగతి, అదితికి శాపం, సంసార విముక్తికి ఉపాయం, ఇంద్రుని యీర్ష్య, మన్మథుని దండయాత్ర, ప్రహ్లాద నారాయణుల సంగ్రామం, భృగు శాపం, శుక్ర వృత్తాంతం, కృష్ణావతార గాథ ఉన్నాయి. అయిదవ స్కంధంలో శివకృష్ణుల ఉత్కర్షాపకర్షలు

మహిషాసురుని కథ, దేవీప్రాదుర్భావం, దేవీమాహాత్మ్యం, లోక కల్యాణం, శుంభ నిశుంభులు, శుంభుని వధ, సురథ సమాధుల కథ అనే శీర్షికలు ఉన్నవి. వీటిలో "మహిషాసురుని కథ" అనే శీర్షికలు, "శుంభ నిశుంభుల కథ" అనే శీర్షికలు, "సురథ సమాధుల కథ" అనే శీర్షికలు చాలా ఉన్నాయి. అందువల్ల పాఠకులు సంపూర్ణంగా చదివితే గాని కథ ఎక్కడ ప్రారంభమయ్యేదీ తెలియదు. ఇలాటి పెద్ద పుస్తకాలలో విషయ సూచికను పేజీల సూచనతో సహా సరియైన పద్ధతిలో చేర్చడం ఎంతో అవసరం.

రచయిత సంస్కృతాంధ్రాలలో విద్వాంసులు. ప్రాచ్య కళాశాలలో అధ్యాపకులు. అందువల్ల సామాన్యులకు సులభంగా బోధపడేటట్లు వ్రాయగలవారు. అందువల్లనే యీ గ్రంథం సులభంగా బోధపడే సరళ శైలిలో కూర్చబడింది. అక్కడక్కడ మూలంలోని శ్లోకాలూ, వాటి అభిప్రాయం ఇవ్వబడినవి. ఒక్క ఉదాహరణ -

"బ్రహ్మా సృజ త్యవతి విష్ణు రిదం మహేశః
శక్త్యా తవైవ హరతే నను చాన్తకాలే,
ఈశాని తేఽపి చ భవంతి తయా విహీనా
స్తస్మాత్ త్వమేవ జగతః స్థితినాశకర్త్రీ.

కీర్తి ర్మతిః స్మృతిగతీ కరుణా దయా త్వం
శ్రద్ధా ధృతిశ్చ వసుధా కమలా జయా చ,
పుష్టిః కళా థీ విజయా గిరిజా జయా త్వం
తుష్టిః ప్రమా త్వమసి బుద్ధి ఉమా రమాచ.

[రెండవ సంపుటం, పుట 181]

పై మూలానికి అభిప్రాయం -

"తల్లీ! జగన్మాతా! నీ చెంతనుండి శక్తిని పొంది బ్రహ్మ విష్ణు మహేశులు సృష్టి స్థితి సంహారాలు కొనసాగిస్తున్నారు. వాళ్లు శక్తి విహీనులైతే ఆ కార్యాలు చేయలేరు. అంచేత నిజంగా నీవే సృష్టి స్థితి సంహారాలు కొనసాగిస్తున్నావు. కీర్తీ, మతీ, స్మృతీ, గతీ, కరుణా, దయా, శ్రద్ధా, ధృతీ, వసుధా, కమలా, జయా, పుష్టి, కళా, విజయా, గిరిజా, తుష్టీ, బుద్ధీ, ఉమా, రమా, నీవే.... [పుట 182]

శ్రీ కాళహస్తి నివాసులు, సుప్రసిద్ధ విద్వాంసులు, అరుణాచల కృష్ణమూర్తి ఘనపాఠి గారు దీనిపై సదభిప్రాయాన్ని ఇచ్చారు. సులభంగా దేవీభాగవతాన్ని తెలిసి కొనుటకు ఈ గ్రంథం ఉపయోగ పడుతుంది.

ఆంగీరస"

# వెన్నెల వెలుగులు

[పద్మభూషణ్ శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య జీవితచరిత్ర. సంకలనం, రచన : అడ్సుమిల్లి పూర్ణచంద్రరావు. ప్రచురణ : ఆంధ్రరాష్ట్ర ఆదిమజాతి సేవక్ సంఘ్, కస్తూర్బాపేట, విజయవాడ-520 010. వెల : లేదు.]

ఆదిమ జాతులను మానవులుగా తీర్చిదిద్దటానికి జీవిత సర్వస్వం సమర్పించిన శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య ఆదిమ జాతుల అంధకారానికి వెన్నెల వెలుగుకే. ఆయన జననం 1897 జూన్ 4. మహాప్రస్థానం 1981 నవంబరు 24. రాఘవయ్యగారు ఆంధ్రప్రదేశ్‌లోని ఎఱుకలు, యానాదులు, ఇతర ఆదివాసుల అభ్యున్నతికి జీవితమంతా కృషి చేశారు. ఆయన కృషిలో అధిక భాగం నెల్లూరు జిల్లాకు పరిమితం కావటం సహజమే. ఆదివాసులు కూడా మనందరివంటి వారే. నిజానికి వారే భూమి పుత్రులు. ప్రకృతి అందరి సొమ్ము. దానికి పాక్షికత్వం లేదు. ప్రకృతి మాతకు వారు ముద్దు బిడ్డలు.

పెక్కు వారిత్రకాది కారణాలవల్ల ఎఱుకలు, యానాదులు ఇతర ఆదివాసుల వారు సంఘంలో వెనుకబడి పోయారు. సమాజంలోని ఇతరు తోపాటు వారు అభ్యున్నతిలో భాగస్వాములయినపుడే స్వరాజ్యం సార్థకమవుతుందని మహాత్ము డేనాడో ప్రబోధించారు. ఆ ప్రబోధాలను కీర్తిశేషులు ఉన్నవ లక్ష్మీనారాయణ, గొల్లపూడి సీతారామశాస్త్రి గారలు ఒక రంగంలో ఆచరణలో పెట్టారు. వెన్నెలకంటి రాఘవయ్యగారు ఆదివాసుల అభివృద్ధికే జీవితాన్ని అంకితం చేశారు. ఎఱుకలు, యానాదుల ఆర్థికాభ్యున్నతికీ, వైజ్ఞానికాభ్యున్నతికీ అవిరళ కృషి చేసిన మహనీయుడు వెన్నెలకంటి రాఘవయ్య. ఆదివాసులకు ఆయన చేసిన సేవలను ఈ 166 పుటల పుస్తకంలో పరిచయం చేశారు. ఇది సమగ్ర జీవిత చరిత్ర కాదు. సంఘ సేవ పట్ల యువతరం శ్రద్ధాసక్తులను పెంపొందించడానికి ఈ పుస్తకం బాగా ఉపయోగ పడుతుంది. "అలవాటు పడిన నేరస్థుల చట్టం" బ్రిటిష్

పాలకులు ప్రవేశ పెట్టినది. ఆ చట్టం రద్దయిన తర్వాత కూడా పోలీసులు కొన్ని తెగలవారిపై దానిలోని నిబంధనల ప్రకారం చర్యలు కొనసాగించారు. శ్రీ రాఘవయ్య గారి నాయకత్వాన రాష్ట్ర ఎరుకల సంఘం అవిరళ కృషి చేసింది. 1951లో రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ మద్రాసులో విడిది చేసినప్పుడు రాష్ట్రఎరుకల సంఘం ఆయన చేసిన విజ్ఞప్తిని సమర్పించింది. ఆయన జాతీయ వాదియే అయినా విశాల మానవతా దృక్పథం కలవాడు. ఇటువంటి జీవిత చరిత్రలను వ్రాసేప్పుడు మరింత పరిశీలన జరపాలి. సాధ్యమయినంత వరకూ నిష్పాక్షికంగా వ్రాయగలగాలి ఏమయినా "పద్మభూషణ్" వెన్నెలకంటి రాఘవయ్యగారి జీవితం యీనాటి యువకులకు పరిచయం చేసే మంచి పుస్తకం యిది.

**శ్రీ వి. ఎస్. అవధాని**

# రామాయణ తనిశ్లోకి

[పెరియవాచ్చాన్పిళ్ళె వ్యాఖ్యానానికి శ్రీ చిలకపాటి వేంకట రామానుజశర్మగారి ఆంధ్రానువాదం. 93 పేజీలు. వెల : 10 రూ. లు. ప్రతులకు : శ్రీ గోదా గ్రంథమాల, ముసునూరు - 521 207, కృష్ణా జిల్లా.]

ఆంధ్ర వైష్ణవులు వైష్ణవ సాహిత్యం విషయంలో తమిళ గ్రంథాలను పరమ ప్రమాణంగా భావించడం జగద్విదితం. దివ్య ప్రబంధాన్ని అర్థం తెలియకున్నా పారాయణంచేసే భక్తులు ఇంకా అక్కడక్కడ కనిపిస్తారు. ఆళ్వారుల అద్భుతచరిత్రలను, స్తోత్రాలను అనుసంధానం చేసుకొంటూ సోలిపోతూ ఉంటారు. ద్రావిడ వైష్ణవుల్లో సంస్కృత భాషలో మహా పండితులయిన వారు పలువురున్నారు. వారిలో పెరియవాచ్చాన్ పిళ్ళె చెప్పదగినవాడు. ఆయన వాల్మీకి రామాయణంలోని కొన్ని ప్రముఖ శ్లోకాలకు తమిళభాషలో 'తనిశ్లోకి' పేరిట వ్యాఖ్యానం వెలయించాడు. 'తని' అనే పదానికి 'ప్రత్యేకమైన, ఒంటరి, విశిష్టమైన' అనే అర్థాలున్నాయి. అలాంటి కొన్ని శ్లోకాలు ఎంపిక చేసి అతివిపులమైన వ్యాఖ్యానం సంతరించాడు. ఒకొక్క శ్లోకానికి పూర్వాపరాల్లో వాల్మీకి, కాళిదాసు ప్రభృతుల శ్లోకభాగాలు అసంఖ్యాకంగా ఉదహరించడం జరిగింది. అక్కడక్కడ తమిళ పద్యభాగాలు కూడా ఉటంకించి వ్యాఖ్యాత తన ప్రాజ్ఞతను ప్రదర్శించాడు.

ఈ ప్రసిద్ధ గ్రంథంలోని 20 శ్లోకాలను ఎంపికచేసి శ్రీ చిలకపాటి వేంకట రామానుజశర్మ గారు శతాబ్దం క్రితం చక్కగా తెనిగించారు. ప్రస్తుత గ్రంథం వాటిలో ఓ ఏడు శ్లోకాలకు వారు వ్రాసిన వ్యాఖ్యానం మాత్రమే. ఈ శ్లోకాల్లో ప్రతి పదమూ సార్థకమే అని నిరూపించడమే వ్యాఖ్యాత లక్ష్యం. అనువాదకులు మద్రాసు నివాసులు కావడం వల్ల కావచ్చు, తమ తెలుగులో అడయాళం (గుర్తు) వంటి తమిళపదాలు ప్రయోగించారు. ఇక తమిళ పద్యభాగాల్లో 'కుట్రం' అనే పదాన్ని 'కుత్తం' అని వ్యావహారికరీతిలో ముద్రించడం కుట్రం (నేరం).

"హరిణీ ఖుర మాత్రేణ చర్మణా మోహితం జగత్" (జింక గిట్టంత స్త్రీ అవయవ విశేషముచే జగత్తంతయు మోహితమై యున్నది.) ఇత్యాది వైరాగ్యపరమైన శ్లోకాలు ఈ గ్రంథానికి వన్నె తెస్తున్నాయి. మొత్తం మీద రామభక్తులంతా పఠించవలసిన గ్రంథం యిది.

**శ్రీ పులిచెర్ల సుబ్బారావు**

# నీడలు (కథా సంపుటి)

[రచన, ప్రచురణ: శ్రీమతి ఆర్. వసుంధరాదేవి, 8-241, సువిశేషపురం, రాజమండ్రి - 4. పేజీలు: 140. వెల: తొమ్మిది రూపాయలు.]

ఈ సంపుటిలో పన్నెండు కథలున్నాయి. ఇవన్నీ 1967-1979 మధ్య కాలంలో 'భారతి' లో ప్రచురింపబడ్డాయి.

చిన్న కథలనుకుని చిటికెలో చదివేవారికి ఈ కథలు అంతు పట్టవు. మనిషి ఆలోచనలు, మనసు చేసే విన్యాసాలు ఈ సంపుటిలోని కథలకు వస్తువు. ఆలోచనలను చిక్కబట్టుకుని స్పష్టమైన వ్యాఖ్యానాలతో కథారూపం కల్పించటం, రచయిత్రి గొప్పతనాన్ని తెలియ జేస్తుంది. ఇట్లాంటి కథలు రాయటం అంత సులువుకాదని పిస్తుంది కూడా.

వస్తువుకుగానీ, మనిషికిగానీ, ఆకర్షణశక్తివుండాలి. అప్పుడే వాటికి విలువ. ఆకర్షణ శక్తి లేకపోతే బొద్దింకలాంటి అసహ్యకరమైన జీవితో సమానం. బజార్లో ఏ వస్తువైనా కొనాలనుకున్నప్పుడు

ఎక్కువమందిని ఆకర్షించే వస్తువునే కొనాలని వుంటుంది. ఆ వస్తువు ఎంతవరకు ఉపయోగం అన్నది తర్వాత చూస్తారు. మనిషీ అంతే. మనుష్యులు-బొద్దింకలూ కథలో- కిష్టుడు పద్మాలు గేళ్ళ పని కుర్రాడు. ఏ పని చెప్పినా తప్పించుకోడానికి చూస్తాడు, అయినా మాటలుచెప్పి నెగ్గుకురాగల సమర్థతవుంది. రామయ్య అలాకాదు. చెప్పినపని మౌనంగా, వినయంగా చేస్తాడు. తండ్రి మాట జవదాటనివాడు. ఒక ఉద్యోగం ఖాళీవచ్చినపుడు, రామయ్యకు కాకుండా, కిష్టుడికి ఇప్పించాలని మనసు అనుకుంటుంది. కిష్టుడికి వుద్యోగం రావాలి, వస్తే సంతోషిస్తాడు. రామయ్యకు వచ్చినా వాడికి సంతోషించటం తెలీదు. కానీ కిష్టుడుకి రాలేదు, రాకపోవటం చాలాఅన్యాయం అని విచారిస్తుంది మనసు.

'మాయ' కథలో సత్యంమేష్టారు, హెడ్మాస్టారుగా సిరిపాడు గ్రామం వెళ్తాడు. అక్కడ రెండు వర్గాలు - రైతులు, కూలీలు. ఇరుపక్షాలనుంచీ కానుకలూ, సేవలూ స్వీకరించి, ఎవరిపక్షానా నిలవకుండా వాళ్ళకు వేదాంతాన్ని బోధిస్తూ వుంటాడు. పనిమనిషి రత్తితో సంబంధం ఏర్పరచు కున్నాడనే అపోహతో రత్తితాలూకు మనుషులు తాగివచ్చి ఇంటిమీదపడి చావబాదేస్తారు.

కథ చదివాక ఎందుకిలా జరిగిందీ, ఏమిటీ అనుకుంటే కారణం కనిపించదు. వేదాంతం చెప్తున్న సమయంలో సత్యం మేష్టారు ఒకడు వేసిన ప్రశ్నకు ఇట్లా సమాధానం చెప్తాడు.

'నిజమైన దానికి కారణం వుంటుందిగానీ, లేనిదానికి, మాయకు కారణం ఏముంటుంది?'

కాబట్టి కారణం 'మాయ' అనుకోవాలి. లేకపోతే తన కోసం ఏర్పాటుచేసిన ఇంట్లో అష్టమీ మంగళవారం కృత్తికా నక్షత్రం వేళ కాలు పెట్టడం కారణమా?

ప్రతి విషయాన్నీ అల్పమని త్రోసిపుచ్చే మనసు ఏ పనినీ సరిగా చెయ్యనివ్వదు- ఇది నళిని విషయంలో. అందువల్లనే తన స్వంత వస్తువు అయిన గిన్నెను సరిగా గుర్తించలేక పోతుంది 'గుర్తు' కథలో.

మలినం అంటని మనసు, నిర్మలమైన జీవితం గల దానిగా వుండాలని నిర్మల తాపత్రయం. కానీ సంసార బాధ్యతలు స్వీకరించాక జీవితాన్ని ఆదర్శాల మేరకు నడపటం కష్టమని భావిస్తుంది.

చిన్నతనంలో తమ ఇంట్లో వస్తువులు పోయినప్పుడు తల్లి, ఇంట్లో పనివాళ్ళమీద కేకలేసేది. ఏ ఋజువూ లేకుండా దొంగలైనట్లు నిలదీసేది. ఆ పద్ధతి మంచిదికాదనిపించేది నిర్మలకు. అట్లాంటిది ఇప్పుడు తన ఇంట్లో వస్తువు పోయినప్పుడు ఏం చెయ్యాలి? ఎవరు మంచివారో, ఎవరు చెడ్డవారో తెలుసుకోలేని అశక్తత, ఒక వ్యక్తి మంచివాడని ఋజువయినప్పటికీ, మళ్ళీ ఆ వ్యక్తిమీద ఏదో సందేహం. 'మనసా' నిర్మలంగా వుండటం అసాధ్యం అని చెప్తుంది 'నీడలు' కథ.

పథ్యం సరిగా చెయ్యకుండా కోడలు అదీ ఇదీ తినే మనిషని, పిల్లాడికి అలాంటి తల్లి పాలు ఇస్తే ఎదిగి రాడని తల్లికి దూరంగా పిల్లాడిని వుంచుతుంది అత్తగారు. కోడలికి పిచ్చిపట్టి అత్తగార్ని తిడుతుంది. దాంతో నలుగురూ కోడలిని పట్టుకుని తాళ్ళతో కట్టేసి వొంటిమీది బంగారుబొట్టు గొలుసూ, రెండు గాజులు లాగేస్తారు.

బిడ్డను తల్లినుండి వేరు చెయ్యక పోయినా, పోనీ నగలు లాగేసుకోపోయినా, ఆమెకు పిచ్చి ఎక్కకపోను. తర్వాత బిడ్డను ఆమె దగ్గరకు పంపినా, నగలు ఇచ్చినా పిచ్చి తగ్గేదేమో. తన దగ్గరివస్తువు ఇతరు బలవంతంగా లాగేసుకుంటే, ఎవరికైనా పిచ్చి ఎక్కుతుంది- కాకపోతే కాస్త ప్రమాణంలో తేడా వుంటుంది, అంతే, అనిపిస్తుంది. 'పిచ్చి' కథచదివాక.

సామాన్య సంసారపుస్త్రీ. ఇంట్లో ఎంతోపని. అన్నీ ఒక్కర్తే చూసుకోవాలి. పిల్లల గొడవ. చేతివేళ్ళ వాపుల గొడవ. కష్టరోగమో ఏమో అన్న భయం.. వీటన్నిటికీ కారణాలు ఈ పిల్లలే. వీళ్ళే లేకపోతే హాయిగా ప్రశాంతంగా వుంటుంది. ఇలాంటి ఆలోచన వచ్చిన సమయంలో టపాకాయలు పేలి ఆ వీధిలో ఎవరో నలుగురు పిల్లలు చనిపోతే, తన పిల్లలే అనుకుని కంగారు పడిపోతుంది ఓ తల్లి మనసు, 'మచ్చాలు' కథలో.

కేవలం సంపద, స్నేహితులు, పార్టీలు, ఆడంబరాలతో, ఎదుటి మనుషులలోని ఆప్యాయతా, అనురాగాలు గుర్తించక, చీకటైన మనసుతో బ్రతుకుతున్న లలితకు, ఇంకా ఎక్కువ ఆడంబరాలతో బ్రతకాలని ఆశ. ఆమెకు సంతానం లేదు. అక్కర్లేదు. మరణశయ్య మీద వున్న తండ్రిని చూడటానికి బయలుదేరి, మధ్యలో హోటల్లో తన కిష్టమైనవి తినివెళ్ళేసరికి తండ్రి చూపు దక్కదు. ఇది పాత అనుభవం. ఇప్పుడు భర్త కారుప్రమాదానికి లోనయి, హస్పిటల్లో ఉన్నాడని తెలిసినప్పుడు పాత అనుభవం గుర్తుకొచ్చి వెంటనే బయలుదేరాలనుకుంటుంది. మనుషుల విలువ తెలిసివచ్చే సమయాలు ఎప్పుడోగానీ రావు అని చెప్పేకథ 'చీకటి'.

పిల్లలు వస్తువులు పాడు చేస్తుంటే, తనకింటూ ఓ బీరువా చేయించుకుని అందులో వస్తువులు పెట్టుకోవాలనుకుంటుంది ఆమె. జాన్‌పాల్ మంచి వడ్రంగి పని మంతుడు. కానీ డబ్బులు ఎక్కువ గుంజేరకం. ఓ పట్టాన పనిపూర్తి చేయడు. పైగా కాస్త త్రాగుబోతు. అందువల్ల అతనిభార్య, కూతురూ పట్నంలో విడిగా వుంటారు. జాన్‌పాల్ కొడుకు ఫిలిప్‌తో వుంటాడు. అతడు సోమరి, చదువులేదు.

బీరువా తయారు చేయటానికి రోజుల తరబడి టైము తీసుకుంటాడు. ఎన్నో రోజులకు బీరువా పూర్తి చేసి ఇంట్లోపెడతాడు. ఆ సమయంలో కొడుకు ఏటిలో కొట్టుకుపోయినట్టు కబురు విని పరుగెడతాడు. నాలుగురోజుల తర్వాత మళ్ళీ కనిపిస్తాడు జాన్‌పాల్. అతనిలో పూర్తి హుందాతనం వస్తుంది. టక్కరితనం కనిపించదు. ఒక్కొక్కరి జీవితంలో తగిలే దెబ్బ వల్ల వారి నిజమైన మనసు, ప్రవర్తన బయట పడతాయి. ఇది 'జాన్‌పాల్ చేసిన బీరువా' కథ.

ఇద్దరి అక్కా చెల్లెళ్ళ మనస్తత్వాల్లోని వైవిధ్యమే 'గడియారం' కథ. ధర్మ అక్కయ్యకు జీవితం అంటే హృదయ

సంబంధి. అందులో అనుభూతి వుండొచ్చు గానీ, ప్రగతి లేదు - తను? రాగద్వేషాల్ని తీరిగ్గా నెమరు వేసుకుంటూ, తనకు తానే కితకితలు పెట్టుకునే సోమరితనం లేదు. దుఃఖపడి ఏం సాధించ గలం అనుకుంటుంది - సోదరి చనిపోతుందని తెలిసి.

'అమల' ఒక విచిత్రమైన మనస్తత్వం గలది. ఆమె మనసు ఒక్కోసారి నిశ్చలమైన లోకంలోకి వెళ్ళిపోతూ వుంటుంది.

'తొందర అనేది ఎక్కడో జారిపోయింది. నాకసలు ఏపనీ చెయ్యాలని వుండదు. పని చెయ్యటం శ్రమ. దేనికీ విలువ, ప్రయోజనం లేవు. నేను క్రమంగా ఒక నిరంతర నిశ్శబ్దంలోకి మునిగిపోతున్నాను. ఇక్కడ నేను స్వతంత్రురాలిని. బరువు, బాధ్యతలు లేని స్వేచ్ఛాజీవిని' అనుకుంటూ వుంటుంది.

ఆమె ఆలోచిస్తున్నప్పుడు తప్ప మిగతా ఎప్పుడైనా చురుకుగానే వుండగలదు. ఎప్పుడైనా ఒకసారి పని మధ్యలో ఆపి శూన్యంలోకి చూస్తున్నట్లు నిలుస్తుంది. మరుక్షణంలోనే తిరిగి మామూలు స్థితికి వస్తుంది.

వంట గదిలో ఓసారి అమల అగ్గిపుల్ల గీస్తుంది. కానీ స్టవ్‌ని ముట్టించదు. మండుతున్న పుల్ల అలాగే పట్టుకుని చెయ్యి దించుతుంది అగ్గిపుల్ల నైలాన్ చీరకంటుకుని కాలిపో తుంది. మనసు శూన్యంలోకి వెళ్ళినప్పుడు మనిషికి ఏం జరుగు తుందో తెలియదు. ఇది 'అమల' కథ.

చిన్నతనంలో తను బుద్ధి తెలియని పసివాడు. అమ్మ ప్రేమమూర్తి. నాన్న క్రమశిక్షణతో రూపుదిద్దిన గురువు. ఆ జీవిత గమనంలో అక్క తన సహచరి. ఇదంతా ఇప్పటి వూహ. కానీ. వారితో అతని అనుభవాలు వేరు. రెంటికీ సంబంధమే వుండదు. ఇప్పటికి వూహ సత్యమా, అప్పటి అనుభ వాలు సత్యమా అన్న తర్కంతో నిండిన కథ 'సీతాకోక చిలుక'.

శివరావు గొప్ప మేధావి. 'మానవ అనుభవాన్ని నిత్యసత్యంగా మార్చటం ఎలా? అన్న విషయంమీద పరిశోధన చేస్తుంటాడు.

"దైనందిన జీవితంలో మనిషి ఎన్నో అనుభవాలకు లోనవు తున్నాడు. అందులో కొన్ని అర్థం లేనివి, వ్యర్థమైనవి పోయినా మిగిలిన అనుభవాలు అతనికి మిగలటం లేదు. రుచికరమైన పదార్థం తిన్నప్పుడు, ఆ అనుభవం ఆ క్రియతో మాయమై పోతుంది. అలాగే. వాసన, సుఖము, భోగము, నవ్వు, ఏడుపూ న్నీ ఎటో పోతాయి. కొన్ని అనుభవాలు జ్ఞాపకాలుగా కొద్దికాలం నిలిచినా తర్వాత జారిపోతాయి. తాను కోరుకున్న కొన్ని ముఖ్య మైన అనుభవాల్ని శాశ్వతం చేసుకుంటే మానవ జీవితానికి పరి పూర్ణత వస్తుంది అనుకుంటాడు. కానీ నిజానికి ఆ అనుభవాలన్నీ ఒక్కసారిగా అనుభూతి పొందుతుంటే, మనిషి తట్టుకోగలడా? శివరావు తట్టుకోలేక పోతాడు.

"తానొరిలా వ్రాయక పోవటం, ఇంకొకరు తనలా వ్రాయటానికి వీలుండక పోవటం శ్రీమతి వసుంధరాదేవి గారి కథలలో విశిష్టత" అని శ్రీ మధురాంతకం రాజారాం గారు అనటం సరైన వ్యాఖ్యానం అనిపిస్తుంది.

— బాబు

# గ్రంథ స్వీకారాలు

**శ్రీ తనికెళ్ళవారి పంచాంగము:** పంచాంగ కర్తలు: శ్రీ తనికెళ్ళ వేంకట సూర్యనారాయణ సిద్ధాంతి, పుత్రులు. వెల: రు. 3-25 పై. లు. కావలసినవారు పంచాంగకర్త పేర మృత్యుంజయ నగరం (కొత్తపట్నం), పార్వతీపురం తాలూకా, విజయనగరం జిల్లా కు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

**నూతన** (మాసపత్రిక): సంవత్సర చందా రు. 20 లు. ప్రతులకు: నూతన, సి-85, వనస్థలి పురం, హైదరాబాద్ - 500 661.

**ఎక్స్‌రే** ఆధునిక కవితా వేదిక. సాలు చందా 6 రూ. లు. ప్రతులు కావలసినవారు ఎక్స్‌రే, కొల్లూరి హౌస్, అమలాపురం 533 2?2 కు వ్రాయవచ్చును.

**శ్రీ శ్రీ:** సంస్మరణిక. ఉచిత ప్రతులకు: శ్రీ "కాట్రు గడ్డ", పెదపాడు-534 437 అను అడ్రసుకు వ్రాసి తెప్పించుకోవచ్చును.

**శ్రీ రామపూజ:** గ్రంథకర్త శ్రీ గుండు విఘ్నే శ్వర శాస్త్రి. ప్రతులు దొరుకు చోటు: శ్రీ వీర వెంకట సీతారామ భజన మందిరము, లలితా నగరము, రాజమండ్రి-5. లేదా శక్తి ప్రబోధ మండలి, అనపర్తి-533 342 (తూ. గో. జిల్లా).

**నవత:** సాహితీ ఉద్యమ వేదిక. సంవత్సర చందా రు. 10లు. ప్రచురణ: సింహపురి సాహితీ సమాఖ్య, 10-170, సంతపేట, నెల్లూరు-524 001.

**ఊపిరి:** వెల: 50 పైసలు. కావలసినవారు చైతన్య సాహితీ మిత్రులు, సిద్దిపేట అను చిరునామాకు వ్రాయవచ్చు.

**సమాలోచన:** జాతీయ సాంస్కృతిక పక్ష పత్రిక. సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామ శాస్త్రి. ప్రతులకు సంపాదకుని పేర రాజమండ్రికి వ్రాసి తెప్పించుకోవచ్చును.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3 Editor: S Radhakrishna, Vijayawada. Phones: 75667 & 61247.

# భారతి

సాహిత్య మాసపత్రిక
నవంబరు 1983

శిరోజాలు విరబోసుకో
మాణిక్యరావు

ప్రయాణం
రామసూరి

చైతన్య సంకల్పం
సోమసుందర్

మన పాడి పరిశ్రమ
రవికుమార్

ఆదిలాబాదు మాండలిక భాష
వేంకటేశ్వర్లు

ఎండ
వెంకటేశ్వరరావు

ఇంకా వెంకటరామశాస్త్రి, కిశోరుబాబు — అశోకుబాబు, సాంధ్యశ్రీ, సుధాకరరావు, రామారావు, అప్పలస్వామి, విజయ దత్తాత్రేయశర్మ, అనంతపద్మనాభశాస్త్రి, సుబ్బారావు, శ్రీరామమూర్తి, కోణార్క ఇతరుల రచనలు.

వ్యవస్థాపకులు
దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# భారతి

మాసపత్రిక

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

నవంబరు 1983

సంపుటము: 60 సంచిక: 11

విడిపత్రిక వెల నాలుగు రూపాయలు

# విషయానుక్రమణిక

## నవంబరు 1983

# నాన్యః తరుః నన్నయ వృక్ష ఏవ

## శ్రీ పిడపర్తి వెంకటరామశాస్త్రి

గోదావరీ తీర నిరూఢ మూలః
ఛాయా పరివ్యాప్త త్రిలింగ భూమిః
మూర్ధన్య విద్వత్కవి వాక్ప్రసిద్ధః
నాన్యః తరుః నన్నయ వృక్ష ఏవ.

ఆదే మహా భారత బీజరూపః
మధ్యే ప్రబంధ ప్రియ వాక్సమూహః
శాఖా ప్రశాఖా పరి వర్ధమానః
నాన్యః తరుః నన్నయ వృక్ష ఏవ.

సారంగ దుర్భాగ్య నిరుద్ధవృద్ధిః
వాణ్యశ్రుధారా హుత హృత్ప్రసూనః
వైదేశికోన్మూలన లబ్ధప్రాణంః
నాన్యః తరుః నన్నయ వృక్ష ఏవ.

## ఆచార్య రోణంకి అప్పలస్వామి

# తెలుగు భాష, సాహిత్యం పై ఆంగ్లభాషా సాహిత్యాల ప్రభావం

ఇప్పుడు మనం గ్రాంథికమంటున్న భాష గ్రంథాలలో స్థిరపడి వుండేది. ఆంగ్లేయుల సంపర్కము వలన గిడుగు రామమూర్తిగారి నిర్విరామకృషి వలన ప్రారంభంలో శిష్ట వ్యావహారికం తదుపరి వాడుకభాష సాహిత్యంలో సైతం ప్రవేశించి ఈనాడు గ్రాంథికాన్ని పూర్వపక్షం చేసివేశాయి. భావకవులలో ఎక్కువమంది గ్రాంథికాన్నే వరించారు. గురజాడ అప్పారావుగారు కన్యాశుల్క నాటకంలోనూ ముత్యాలసరాలలోను తన కొద్దిపాటి కథలలోను వాడుకభాషనే వాడ నిశ్చయించి అట్టి భాషకు సాహిత్యస్థాయిని సాధించారు.

మొదటినుండి వాడుకభాషలోనే పండితులు సైతం మాట్లాడే వారు. అయితే సంస్కృత భాష గంభీరతను తెలుగులో సాధించవలె నని ఒక కృతక భాషను తెలుగు గ్రంథాలలో రాయనారంభించారు. కాలక్రమేణ తెలుగు దీర్ఘసమాస భూయిష్టమై జటిలాతి జటిలతను అందుకుంది. కవిత్వంలో సంస్కృత వృత్తాలు రాసినవాడే కవినని పించుకునేవాడు. ఈ సంకెళ్ళ నన్నింటినీ తెంచుకోమని గిడుగు పిడుగు హెచ్చరించాడు. గురజాడ గిడుగు వలన ప్రభావితుడై నూతన శకానికి నాంది పలికాడు కన్యాశుల్కంలోను, ఇతర అసంపూర్ణ నాటకాలలోను సమర్థవంతంగా వాడుక భాషను ప్రవేశపెట్టాడు. ముత్యాలసరాలలో నూతన మాత్రా ఛందస్సును ప్రయోగించాడు. నారాయణబాబు, శ్రీశ్రీ, పురిపండా నైపుణ్యంతో ప్రజల భాషను కవిత్వంలోను, వచనరచనలోను స్థిరపరచారు.

ఈనాడు కవులు, రచయితలు ఈ భాషలోనే రచన సాగిస్తు న్నారు. నవలలలోను, కథలలోను ఆంగ్లపదాలను విరివిగా చొప్పించ నలవాటు పడ్డారు. ఇదేమీ తప్పు లేదు. చదువుకున్నవారు అక్షర శూన్యులు కూడా ఆంగ్ల పదాలను అర్థం చేసికోగలరు. ప్రభుత్వ ఆధ్వర్యములో మాత్రం ఒక కృతక భాషను తయారు చేస్తున్నారు. ఇది సమర్థనీయం కాదు. ఆంగ్ల రచయితలు ప్రపంచ భాష లన్నింటి నుండి పదాలను అరువు తెచ్చుకొని ఇంగ్లీషులో స్థిరపరచుకొన్నారు. ఇది సరియైన పద్ధతి. నావెల్ అన్న ఇంగ్లీషు పదము తీసికొని తెలుగు వారు తెలుగుకు తగినట్లుగా మలిచారు. మనుచరిత్రంలో "నవలా నొకానొక మరున్నారీ శిరోరత్నమున్" అని వుంది. అందుచేత నవల అన్నమాట తెలుగులో అతుక్కుంది. హిందీ, బెంగాలీ భాషలలో నవలను ఉపన్యాస్ అంటారు. మహారాష్ట్రి భాషలో గాబోలు కాదంబరి అంటారట. నవల అన్న పదమే అన్ని దేశభాషలలోవుంటే బాగుండేది. తెలుగువారు ఏ భాషనుండైనా సరే పదాలను తీసికొని తెలుగులో మలచుకోగలరు. 'రోజు' అన్నమాట తెలుగు కాదు. అనాడు, ఈనాడు, కొన్నినాళ్లు, నేడు అంటాము గాని 'రోజు' అన్నమాటకు తెలుగుమాట ఏమిటో మరచిపోయాము. పారశీక, అరబ్బీ భాషలలోనుండి మహమ్మదీయ పరిపాలన కారణంగా అనేక పదాలు మన దేశభాషలలో చోటు చేసుకున్నాయి.

కార్లమీద, జీపులమీద "ప్రభుత్వ వాహనము"అని రాస్తున్నారు. ఎవరూ ప్రభుత్వ వాహన మనరు. గవర్నమెంటు లేదా గవిరిమెంటు జీపు, గవిరిమెంటు కారు, గవిరిమెంటు వాను అంటే అందరికీ తెలుస్తుంది. బస్సు, జీపు, కారు అని అందరూ అంటారు. ఆసుపత్రి అన్నమాట మనకి స్థిరపడి వుంటే "వైద్యశాల" అనడం సబబుగా లేదు. చదువురానివారు కూడా ఎలోపథీ వైద్యుడిని డాక్టరనే అంటారు. వైద్యుడు అంటే గ్రామీణులు నాటువైద్యు డనుకొంటారు. పల్లెప్రజలకు కోర్టు, జడ్జీ, మేస్ట్రీటు, ప్లీడరు తెలుగు మాటలై పోయాయి. రైల్వే స్టేషన్ని నిరక్షరాస్యులు సైతం టేసను అంటారు. సిగ్నల్ సిగినేలు అయిపోయింది. అందరూ లంకిలేరు ( లైన్ క్లియర్ ) అయింది అంటారు. బోటు, సైటు ఈ మాటలకు తెలుగు పదాలు అవసరంలేదు.

కాలేజీ అనడమే మంచిది. రిక్షావాడిని 'కళాశాలకు తీసుకు పో' అంటే తెల్లముఖం వేసి 'ఎక్కడికి బాబూ' అంటాడు. కాలేజీ అన్నా,

యూనివర్సిటీ అన్నా బోధపడనివాడుండడు. టైమ్ అన్నమాట తీసికొండి. అడుక్కునేవాడు కూడా 'టైమెంతైంది బాబూ'అంటాడు. అందరూ టైమైపోయింది, మరి టైములేదు అంటారు. ఇలాంటి పదాలన్నీ తెలుగులోకి జీర్ణించుకొని పోయాయి. మనం శాస్త్రమంటున్న సైన్సు మనకు పాశ్చాత్య దేశాలనుండి సంక్రమించింది. అందుచేత అన్ని సైయన్సులు, మాథమాటిక్స్‌ల పారిభాషికాన్ని ఆంగ్లపారిభాషికాన్ని తీసికొని తెలుగులో మలచుకోవడం అన్నివిధాలా శ్రేయస్కరం. విద్యార్థులే కాదు అనేకమంది విద్యాధికులు కూడా పలకలేని సంస్కృత సమాసాలను తయారు చేయడం వ్యర్థం అంచే తప్పులేదు. ప్రయోజన శూన్యము, హానికరం కూడా.

నేను విపులీకరించ నుద్యమిస్తే చదువురానివాళ్లు కూడా ఇంగ్లీషు ఏమాత్రం రానివారు సైతం ఇంగ్లీషు భాషలోని అనేక పదాలను ఈనాడు తెలుగులో మలచుకొని ఉపయోగిస్తున్నారు. భాష మారుతూ వుంటుంది. ఇంగ్లీషు పదాలను పారదోలే ప్రయత్నం ఫలించదు. ఇది తెలుసుకోలేని విజ్ఞులను ఏమనాలో నాకు బోధపడడం లేదు. షవెల్ ని శవల లేక శవల పార అంటారు. పిక్‌ఆక్స్‌ని పిక్కాసు అంటారు నెయిల్ ని మేకు అంటారు గాని నట్ ని నట్టు అనే అంటారు. బోల్‌ట్ ని బోల్టు అనే అంటారు. సినిమాని సినిమా అనే అంటారుగాని చలనచిత్రం అనరు. ఫిలిమ్ ని చదువురానివారు ఫిలుము అంటారు. ఫొటోగ్రాఫ్ ని ఫొటోగ్రాపు లేదా ఫోటో అంటారు. పెన్సిల్ ని పెన్సలు అంటారు. ఈ విధంగా విస్తరిస్తే లెక్కలేనన్ని ఇంగ్లీషు పదాలు ప్రజానీకానికి పరిచితమే. కొన్నిటికి తెలుగు పదాలు అసలు లేవు. ఇంగ్లీషు పదాలు తెలుగు పదాలుగా మారిపోయాయనడం సముచితం.

వాడుకభాష అన్నది కేవలం తెలుగేకాక ఇతర భాషలనుండి అవసరానికి ఎరువు తెచ్చుకున్న పదాలతో మిశ్రమమని తెలుసుకోవడం మంచిది. వాడుకభాషకు ఎవరూ సంకెళ్ళు వేయలేరు. వేయ నుద్యమించినవారు కృతకృత్యులు కాలేరు. భవిష్యత్తులో ఎట్టి మార్పులు వచ్చినా రావచ్చు. ప్రజలభాష ప్రజలే సృష్టించుకుంటారు. విజ్ఞుల శాసనం నిరర్థకం.

ఇంతవరకూ వాడుకభాషను గురించి ప్రస్తావించాను. ఇకమీదట తెలుగుపై ఆంగ్ల లేక పాశ్చాత్య సాహిత్యం ప్రభావం గురించి చర్చిద్దాం. ఆంగ్లేయులు మనదేశాన్ని పరిపాలించడం వల్ల మాత్రమే ఈ ప్రభావం మన సాహిత్యంపై రాలేదు. మనవారు ఇంగ్లీషు చదువుకొని అందలి సాహిత్యాన్ని చదివి మననం చేసికోవడం వలన వచ్చిందనుకోవడం న్యాయం. పాశ్చాత్యులు సంస్కృత పాళీ భాషలను చదువుకోవడం వలన పాశ్చాత్య సాహిత్యాలలో కొన్ని మార్పులు కలిగినవి. ఇంతేకాక భాషాశాస్త్రం ఏర్పడింది. ఆంగ్ల విద్యావంతులు కొందరు మనదేశ భాషలను నేర్చుకొని పరిశ్రమించి మన తోడ్పాటుతో నిఘంటువులను తయారు చేశారు. వారు మన భాషలకు చేసిన సేవ మరువరానిది. వీరిలో సి. పి. బ్రౌన్ అన్న ఆంగ్లేయ ప్రముఖుడు తెలుగు భాషకు చేసిన సేవ ఇంతింతనలేము. మన లిపిని ముద్రణకు వీలైన విధంగా మలిచేడు. మొట్టమొదట ఈయన వేమన పద్యాలను ఆంగ్లములోనికి అనువదించి అతని ప్రతిభను మనవారు గుర్తించేటట్లు చేసి తెలుగు సాహిత్యంలో వేమనను సుస్థిరమొనర్చాడు. ప్రముఖ తెలుగు రచయితలు వచన రచనను అలవర్చుకున్నారు. మన సాహిత్యంలోని గద్యాన్ని స్వేచ్ఛా కవిత అనాలి గాని వచనమన వీలులేదు. వీరు మొట్టమొదట నవల అనే ప్రక్రియను ఆంగ్లం నుండే గ్రహించారు. స్కాట్ నవలలను చదివి చారిత్రక నవలా రచనను బహుళంగా ప్రచారంలోకి తెచ్చారు. సాంఘిక నవలలు, డిటెక్టివ్ నవలలు ఆంగ్ల ప్రభావ జనితములే. ముఖ్యంగా చిలకమర్తి, వీరేశలింగం పంతులు మొదలగు వారి కృషి అసల్పం. వీరేశలింగం వచన రచనలలో స్విఫ్ట్, ఆడిసన్‌లలోని ఎగతాళి, అపహాస్య హాస్యాత్మక ధోరణులను సమర్థవంతంగా తెలుగుపరం చేయగలిగాడు. పానుగంటి హాస్యరచన విధానం దేశీయమనే చెప్పాలి. జీవిత చరిత్రలు, స్వీయ చరిత్రలు ఆంగ్ల సాహిత్యం నుండే మనకు సంక్రమించాయి. గురజాడ గురించి ఇదివరకే ప్రస్తావించడం జరిగింది. మరి విస్తరించనవసరం లేదు. అతని సాహిత్యకృషి ఆంగ్ల సాహిత్య ప్రభావితం అంటే సరిపోతుంది. ఆంగ్ల సాహిత్యంలో నిష్ణాతుడవడం వల్ల తెలుగు సాహిత్యాన్ని నూతన మార్గాలు పట్టించాడు.

గురజాడ తరువాత నారాయణబాబు, శ్రీశ్రీ లు కవిత్వంలో వాడుకభాష సుస్థిరతను సాధించారు. వీరి ఆధునికతను చర్చించక ముందు భావ కవిత్వాన్ని పరిశీలించడం అవసరం ప్రారంభంలో నారాయణబాబు, శ్రీశ్రీ లిద్దరూ భావకవులనే అనుసరించారు. రాయప్రోలు, కృష్ణశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ, వేదుల, ఊషశ్రీ, మొదలగువారు భావకవిత్వంలో అగ్రగణ్యులు. వీరు షెల్లీ, కీట్సు, టెనిసన్ మొదలగు ఆంగ్లకవుల వలన ప్రభావితులయారు. వీరిలో కొందరు తమకు తెలియకుండానే ఫ్రెంచి కవులతో ఏవిధమైన సంపర్కం

లేకుండా వారితో సరితూగ గలిగే సింబలిస్టు పద్ధతి కవిత్వం చెప్పేరు. దీనిని బట్టి చూస్తే సింబలిస్టు ధోరణి తెలుగుభాషకు అనువుగా వుందనుకోవాలి. ఇట్టివారిలో ముఖ్యులు కృష్ణశాస్త్రి విశ్వనాధ అని చెప్పవచ్చు. చావలి బంగారమ్మ రచించిన "ఆకొండ" ప్రథమశ్రేణికి చెందిన సింబలిస్టు కవిత. భావకవులు అంతకుముందు తెలుగులో లేని ప్రేమకవిత్వాన్ని ప్రవేశపెట్టారు. గురజాడ స్త్రీని ఒకేవిధంగా నఖశిఖ పర్యంతం వర్ణించడాన్ని తిరస్కరించాడు. 'కొయ్యబొమ్మలె మెచ్చుకళ్ళకు కోమలుల సౌరెక్కునా' అని ఈసడించాడు. వేదుల ప్రేమకవిత్వ ప్రాశస్త్యం ఎన్నదగినది. కింది చరణాలు పరిశీలించండి:

ఆమె జగదీశ మకుటాగ్ర సీమ నుండి
యుర్విపై జారిన సుధా మయూఖరేఖ
ఆమె మూడు లోకాల కళ్యాణమునకు
అవతరించిన యొక పవిత్రాను భావ మామె
నా జన్మ జన్మ పుణ్యములు పండి
ప్రాప్తమైన కేళీ పరిత్యాగ లీల
ఆమె పద సన్నిధాన దివ్యస్థలాన
భక్తి నమ్రుడనై నిలంబడిన యపుడు
తలపునకు వచ్చు నాపేదతనమె నాకు.

రామచంద్ర అప్పారావు ఒక జవ్వని వాలు జడను వర్ణించడం ఈవిధంగా ప్రారంభించాడు

కలకలలాడు వాలు జడకై
జగమెంత తపస్సొనర్చెనో చెలియ

ఈ ప్రారంభం మధురాతి మధురం. అతిశయోక్తి అయినను పరిత కట్లనిపించదు సరికదా అసలు సిసలైన నిజమనిపిస్తుంది.

కృష్ణశాస్త్రి సింబలిస్టు పద్ధతి చూడండి :

పీడని వియోగమున వేగు మోడు మేను
తరిలు తోరణమై సుమదామ మాయె

ఈ పదజాలం ప్రతి పదార్థ తాత్పర్యాల కతీతం.

చెదరు చేతుల నెటొ కై సేసుకొంటి
మొయిలు వసనమ్ములో పొద్దుపొడుపు నగలో
ఏదొ కాలుచు హాయియో ఏదొ తేల్చు
భారమో ఏమొ సైరింప నేరనైతి.

మరొక ఉదాహరణ చూడండి:

ఈవు తేనియ గొంతెత్తితేని నీ క
పోలములు చిరునవ్వు నేత్రాలు కూడ
మరచి సర్వమ్ము, సొగసుగా శిరసు ద్రిప్పు
చెందులకొ పాడినట్లుండు, నేదొ ఏదొ!

మరియు నేవేవొ కలలు, ముంగురుల జారి
వాలి కనుబొమ్మ నునుగొమ్మ వంపులందు
దూరి, చూపుల, చెక్కిళ్ల జేరి, మంద
మందహాసంపు మసకలో మాయమౌను.

ఈ ధోరణినే సింబలిస్టు ధోరణి అనాలి. కవి సంగీతజ్ఞుడు సంగతులు వేసినట్లు పదాలు కూర్ప నుద్యమిస్తాడు. ప్రతిపదార్థ తాత్పర్యాలతో నిమిత్తం లేదు. మాటలకు దొరకని దివ్యానుభూతి పరిత అనుభవించడం తథ్యం. విశ్వనాథ సత్యనారాయణ 'చిన్నమబ్బులు' ఈ కోవకు చెందినదే.

ఆకాశ మధ్యాన అటనొక్క తెలిమబ్బు
మెరపులా మెరిసిందిలే
వెలుగులో ఒరసిందిలే
ఈఅనుభవం భార్యకళ్లు
కదలులాడిన వేళ
కందలించిన వేళ

అంటాడు కవి. ఈ పద్ధతినే సింబలిస్టు పద్ధతిగా ఫ్రెంచి రసజ్ఞులు కొనియాడుతారు. నేనింతకు ముందు రాసినతెలుగు కవిత్వంలో సింబలిస్టు ధోరణి అనే వ్యాసం శ్రీశ్రీకి మద్రాసులో జరిగిన సన్మాన సందర్భంలో ప్రచురించిన ప్రత్యేక సంచికలో వెలువడింది.

ఈనాడు కవులలో అధిక సంఖ్యాకులు వాడుక భాషలోనే కవిత్వం రాస్తున్నారు. పూర్వకవులను యువతరం చదవడమే మానివేసి నట్టుగా వుంది. వచన కవిత్వం వెల్లువుకుతోంది. మినీ కవిత్వమని ఒక నూతన ప్రక్రియ బయట పడ్డది. ఇంతకుముందే గురజాడ వాడుక భాషను ప్రవేశపెట్టేడని చెప్పేను. అతను అభ్యుదయ పథాన్ని చేబట్టి మన సాంఘిక దురాచారాలను, అర్థరహితనమ్మకాలను దుయ్యబట్టాడు' మన పురోగతికి పాటించవలసిన విధులను విశదీకరించాడు. నారాయణ బాబు, శ్రీశ్రీలు గురజాడవలన, ఆధునిక ఆంగ్ల, ఫ్రెంచి కవుల వలన ప్రభావితులయారు. ఒకే కాలంలో భావకవిత్వానికి నిశితాతి నిశితంగా ఎదురు తిరిగారు. అయితే నారాయణబాబు, శ్రీశ్రీల పద్ధతులు వేరు వేరు. వాచ్యంతో శ్రీశ్రీ ప్రజానీకాన్ని ఉత్తేజపరచగలిగాడు. పాశ్చాత్య భాషలలో వలె తెలుగులో అంత్యప్రాస ఆదినుంచీ వుంది. ఆంగ్ల కవిత్వ శయ్యలను తెలుగువారి జన్మసొత్తు అనేటట్టు తెలుగులో మలచ గలిగిన దిట్ట. సంస్కృత పదాలను తెలుగు విరుపులతో జనసామాన్య భావోద్వేగాన్ని ప్రజ్వలింపజేయగల నైపుణ్యాన్ని ప్రదర్శించాడు. ఇతని కవిత్వంలో సింబలిస్టు ధోరణి మెండుగా వుంది. ఇంతటితో తెలుగు కవిత ప్రజల భాషకు అనువైన పుంతలను ఏర్పరచుకుందని చెప్పవచ్చు. నారాయణబాబుది పరోక్షపద్ధతి. నినాదాలను విసర్జించి, సిద్ధాంతాల జోలికి పోకుండా పెట్టుబడిదారీ వ్యవస్థలో అధిక సంఖ్యాకుల దీనావస్థను విగ్రహస్పష్టి పర మొనర్చి, సుఖసంపదలకు నోచుకున్నవారిలో సైతం మానసికమైన మార్పును తేగలిగేటట్టు తన కవితను మలచగలిగేడంటే అతిశయోక్తి కాదు. ఏ పదానికైనా అందరికీ తెలిసిన అర్థమొకటుంటుంది. గాని పూర్వకవులు ప్రయోగించిన సందర్భాలను బట్టి వివిధ తళుకులను సంతరించు కుంటుంది. ఈ తళుకులెరిగిన కవి తన పదబంధాలలో వివిధ స్మృతులను పొందుపరచి, శబ్దాంతర సంగీత గుణగ్రహణ పారీణత ద్వారా పఠిత హృదయ పరిణతిని సంగీత స్థాయికి గొనిపోగల పదకూర్పుతో రసానిశయాన్ని సాధించి తీరుతాడు. ఇట్టి నేర్పరితనం నారాయణబాబుకు అమితంగా వుందనక పీలులేదు. భావకవిత్వానికి ఎదురు తిరగడంతో నారాయణబాబు, శ్రీశ్రీలిద్దరూ అద్యులే అనాలి. పద్ధతులు వేరైనా కళాకౌశలంలో ఒకరకొకరు తీసిపోరు. నేనింతకు ముందు వీరిద్దరిని గూర్చి విపులంగా రాసివున్నాను. అయితే శ్రీశ్రీ అధివాస్తవికతను గూడా చేపట్టి కొన్ని కవితలు చేశాడు. ఇంగ్లీషు లిమరిక్కులను 'లిమ ఋక్కులు'గా తెలుగులో స్వతంత్రించి రాశాడు. నారాయణ బాబు కూడా 'మౌనశంఖం' అన్న అధివాస్తవిక కవితను స్వాప్నికంగా మలిచాడు. స్వప్న జగత్తు సర్రియలిస్టు భూయిష్టమనవచ్చు. ఇంతేకాక సర్రియలిస్టు ప్రయోగాలు చేశాడు. 'ఐరావతపు పంది అర్ధచంద్రుడు', 'పాపారాయుడు తమస్సు' అన్న ప్రయోగాలు ఈ కోవకు చెందినవే.

మనదేశంలో చాలాకాలంనుండి ఇంగ్లీషుభాష నెలకొనివుంది. ఇంగ్లీషును విస్మరించడం ఈ కాలంలో మనకు శ్రేయస్కరం కాదు. ఈ భాష ప్రపంచభాషగా పరిణమించింది. మన భాషకు, మన సాహిత్యానికి, మన శాస్త్రజ్ఞాన విస్తృతికి అత్యవసరం. పాశ్చాత్యులు సంస్కృతం అధ్యయనం చేసి రెండు భాషాశాస్త్రాలను సృష్టించారు. మొదటి భాషాశాస్త్రం 'ఫిలాలజీ' అంటారు. ఈ శాస్త్రం ప్రపంచభాషల ఉత్పత్తి, వాటి సంబంధ బాంధవ్యాలను వివరిస్తుంది. రెండవది పాణిని వ్యాకరణాన్ని నిశితంగా పరిశీలించి భాషలను త్వరిత గతిని నేర్చుకునే పద్ధతులను బోధించ నేర్చింది. ఈ శాస్త్రాన్నే 'లింగ్విస్టిక్స్' అంటారు. మనం ఇంగ్లీషును దేశభాషలలో ఒకటిగా పరిగణించి క్షుణ్ణంగా అభ్యసించడం బహుళార్థసాధకం. పాశ్చాత్య భాషజ్ఞులు సంస్కృతాన్ని, గ్రీకు, లాటిన్ భాషలను, ప్రాచీన పారశీక భాషను, అరబిక్ హీబ్రూలను నేర్చిన గాని సంపూర్ణ పాండిత్యం సంపాద్యం కాదని విశ్వసిస్తారు. మనం సంస్కృతాన్నైనా సరిగా నేర్వవలసిన ఆవశ్యకతను గుర్తించక పోవడం విచారకరము.

# మ ధు రా ను భూ తి

ప్రియా!

నీవులో నేను

నేనులో నీవు

లీనమైన ఈ శుభగడియల్లో

కొండగాలి తిరిగె

ముత్యాల జల్లు కురిసె

రతనాల మెరుపు మెరిసె

పగలే వెన్నెల విరిసె

లాహిరి లాహిరి లో జగమే ఊయలగా ఊగె!

మనసున మల్లెల మాలలె పొరలె

కన్నుల వెన్నెల డోలలె కదిలె!

తనువు తలిరు తోరణమై సుమదామమే ఆయె!

గోదావరి వరదలాగా కోరికలే చెలరేగె!

ఏదో హాయియో భారమో

ఎదను కాల్వసాగె!

# వె లు గు - చీ క టి

ఉజ్జ్వలమైంది వెలుగని

గొప్పగా వర్ణిస్తుంటారు

కాని

అది ఉజ్జ్వలమైందా?

దాని కాంతిలో

ఒళ్ళు నజ్జు అయ్యేటట్లు కష్టించినా

జానెడు పొట్టనే నిండదు!

మీదు మిక్కిలి చిక్కులు - చీకాకులు కలుగుతుంటాయి

మరి అలాంటిది వెలుగా?

కాదు - చీకటే!!

అసహ్యమైంది చీకటని

అనాదరంగా మాట్లాడుతుంటారు

కాని

అది అసహ్యమైందా?

దాని చేరువలో

గుండెల్ని తొలిచివేసే గొడవలన్నింటిని మరచిపోయి

ఖుషీగా నిద్రించవచ్చు

హాయిగా నిషాగా ఉండవచ్చు

మరి అలాంటిది చీకటా?

కాదు - వెలుగే!!

శ్రీ కె. కిశోరుబాబు
శ్రీ కె. అశోకుబాబు

1983

డా॥ సూర్యదేవర రవికుమార్

# మన పాడి పరిశ్రమ

ప్రపంచములోగల పశువులలో సుమారు నాల్గవవంతు భారతదేశమున గలవు. కాని భారతదేశము పాలఉత్పత్తిలో ప్రపంచములోని కొన్ని చిన్నచిన్న దేశాలతో కూడ పోల్చలేని పరిస్థితిలో ఉన్నది. మన దేశంలోని 1055 లక్షల ఆవులు సంవత్సరానికి 52,900 టన్నుల పాలను ఉత్పత్తిచేస్తే, జపాన్‌లో 18.5 లక్షల ఆవులే 48 లక్షల టన్నులపాలను ఉత్పత్తిచేస్తున్నాయి. నెదర్‌లాండ్స్‌లో అయితే కేవలం 74 వేలఆవులు 3.3 లక్షల టన్నుల పాలను ఉత్పత్తి చేస్తున్నాయి. దీనినిబట్టి పాలఉత్పత్తిలో మన పశువుల స్థోమతను, ప్రపంచంలో మనదేశస్థానాన్ని సులభంగా ఊహించుకొనవచ్చును.

మన గోజాతి మనదేశవాతావరణమునకు తగినట్లుగా, వనరులకు ఇముడునట్లుగా కొన్ని ప్రత్యేక లక్షణములతో రూపొందింప బడినది. ఆ లక్షణములివి.

మన గోజాతి శరీరపరిమాణము పెద్దది. దీనికితోడు విస్తృతమైన ఉపరితల ప్రదేశాన్ని కలిగించే గంగడోలుబాగా అభివృద్ధి చెందినది. సింధునాగరికతా కాలమునాటి గోజాతిరూపాలను గమనించిన ఈ విషయము స్పష్టమగును. గంగడోలుతోపాటు చర్మపు ముడుతలుకూడా ఎక్కువగా యేర్పడినవి. స్వేచ్ఛగ్రంథులీ జాతి పశువులలో దట్టముగాను, పెద్దవిగాను ఉండి ఎక్కువ చెమటను బయటకు పంపుటద్వారా శరీర ఉష్ణోగ్రతను స్థిరముగా ఉంచుటకు సహాయపడుచున్నవి. శరీరమున వెంట్రుకలు తక్కువగాఉండి చర్మము నునుపుదేలి మెరుస్తుండును.

వాలుమలుగులు ఈ పశువుల ప్రత్యేక లక్షణము. వీటికి రోగ నిరోధక శక్తి ఎక్కువ. మాతృప్రేమ అధికము. సంతానోత్పత్తి దశకు ఆలస్యముగా వచ్చును. ప్రజనన సామర్థ్యము, పాలఉత్పాదక శక్తి తక్కువ. మితాహారాన్నేగాని, అమితాహారాన్ని జీర్ణించుకొనేశక్తి, ముడి ఆహారపదార్థాన్ని పాలుగామార్చే శక్తితక్కువ. మృగశిరవచ్చే దాకా మునిలెద్దుకు రంకెవేసే ఓపికకూడా ఉండని యీ ఉష్ణదేశంలో వర్షాకాలంలోనే తప్ప ఇతర కాలాలలో సహజంగాలభించే పచ్చిగడ్డి తక్కువ. గడ్డి విస్తారంగాలభించే కాలంలో విరివిగాతిని, తిన్న ఆహారాన్ని క్రొవ్వురూపంలో నిల్వచేసుకొని, కరువుకాలంలో దానిని శరీరపోషణకు వాడుకొనవలసిన అవసర మేర్పడటముతో పెద్దపెద్ద మూపురాలు క్రొవ్వుతో బలిసిన చర్మం యీజాతికి ఏర్పడినాయి. మూపురం గల గోజాతికి భారతదేశమే ప్రథమ నివాసస్థానము (ఆఫ్రికా ఖండము ప్రథమ నివాసస్థానమని కొందరి అభిప్రాయము). పశుజాతికూడా ఇతర ప్రాణికోటివలెనే వాతావరణ పరిస్థితుల, వంశపారంపర్య లక్షణాల కలయికలతో రూపొందింప బడినదే.

మనదేశంలోని సింధునాగరికతావశేషాలలో ఎంతో అభివృద్ధి చెందిన గోజాతి కనుగొనబడినది. 'గోవులు పొదుగులతో బలిసియున్నవి' అని, 'అధికమైన వెన్నను ధరించుచున్నవని' వేదాలలో చెప్పబడినది. పశువులే ధనముగా, ఆరు ఆవులైనా లేనివాడు బీదవాడుగా పరిగణింప బడిన ఆరోజులలో గోజాతి ఎక్కువపాలను ఉత్పత్తిచేసేవని, శ్రద్ధగా పోషింపబడుతుండేవని తెలుస్తున్నది. కాలక్రమేణ అనేక కారణముల వలన మనదేశంలోని గోజాతి పాల ఉత్పత్తి స్థోమత తగ్గిపోయినది.

ఇటువంటి పశువులతో రోజురోజుకు విపరీతంగా పెరుగుతున్న దేశజనాభాకు అవసరమైన పాలను ఉత్పత్తిచేయటం సాధ్యంకాదు. తరతరాలుగా, శతాబ్దాలుగా గోజాతి పోషణలో భారతీయులకు ఆర్థిక దృష్టిలేదు. గోజాలిని ఎంతో పవిత్రమైన జాతిగా ఉన్నతపీఠమేసి పూజించటమేగాని, దానిపోషణలో లాభనష్టాలప్రసక్తి కనబడదు.

మన వాఙ్మయంలో గోవులు ఎంతో పవిత్రమైనవిగా మంగళ కరమైనవిగా పేర్కొనబడినవి. గోమయము, గోక్షీరము పవిత్రమైన వదులతో పోల్చ బడినవి. కాశీఖండములోని యీ గోసంకీర్తనను గమనించండి.

> వినుడనయంబు గోవులు పవిత్రము గోవులు మంగళంబు ధ
> ర్మను ఖురటంకశృంగ వతిఘట్ట ధరాధ్వరజ శ్శ్రుటిక్
> కనుకని తృప్తుచుండు బుర ఘుస్మపమూర్ధ జలాటవీ నటి
> ర్ఘనపథ సింధువార్లహరి గర్వభరార్భటీ బావనోన్నతిన్.

ప్రతివసియించు గోవుల ఖుర్రాగ్రములందు సమస్తతీర్థ సం
తతియును నర్వపర్వత వితానము గొమ్ముల మధ్యసీమ న
ద్భుత చరితుండు శంకరుఁడు మూర్ధరకన్యయుఁ దానునుండుఁ ద
ద్వితతకుచేథ కుంభపరిదిగ్ధ పటీర పవిత్ర వక్షుఁడై.

గోమయం యమునా సాక్షా ద్గోమూత్రం నర్మదా శుభా
గంగాక్షీరస్తు యాసాం వై కిం పవిత్ర మతః పరమ్.

గవామంగేషు తిష్ఠన్తి భువనాని చతుర్దశ
యస్మా త్తస్మాచ్ఛివం మేస్యా దిహలోకే పరత్రచ.

మహాభారతమున గోప్రభావ మాహాత్మ్యములు వివరింప బడినవి. "సారములగు గోవులు...సౌఖ్యముఁజేర్చు" నని, "గోవు పవిత్రంబు గోవు హవిర్జన్మభూమి గోవరయఁగా భూతములకు నెల్ల నాధారభూతమౌ నీడ్యవస్తు, వతుల లక్ష్మికి మూల, మత్యంత దురిత జలనిధికి నోడ, నిర్జరసద్మమునకు నిచ్చెన, సురలకు మనికిపట్టు" అని కొనియాడబడినవి.

గోజాతి విషయమై మనకున్న ఈ సంప్రదాయ దృష్టిని, ప్రేమాభిమానాలను వీడకుండానే, గోపోషణలో లాభ నష్టాలను బేరీజు వేసికొని, ఆర్థికంగా వ్యక్తి, దేశము పరిపుష్టి చెందేవిధంగా మన దృష్టిని కేంద్రీకరించవలసిన అవసరము ఈనాటి కాలానుగుణము.

పాలు సంపూర్ణాహారముగా చెప్పబడినవి. 'ఓ పాలయందుండు ఉదకములారా! మీరు ప్రపంచమును భరించు వారలగుడు' అని వేద మంత్ర మాసించుచున్నది. మనిషికి రోజుకు సగటున 284 గ్రాముల పాలు అవసరమని భారతీయ వైద్య పరిశోధకసంస్థ (ఐ.సి.యం.ఆర్) సిఫార్సు చేసింది. ఈ సిఫార్సు ప్రకారం మనదేశంలోని ప్రజలకుపాలను సరఫరా చేయాలంటే సంవత్సరానికి 550 లక్షల టన్నుల పాలను ఉత్పత్తి చేయవలసి ఉంటుంది. కాని మన దేశంలో పెరుగుతున్న జనాభాతోపాటు పాల ఉత్పత్తి పెరగక పోవటముతో తలసరి వాడకం నానాటికి తగ్గిపోతున్నది. 1951లో తలసరి వాడకం 132గ్రాములుగా ఉంటే 1961 నాటికి 123 గ్రాములకు 1971 నాటికి 105 గ్రాములకు దిగజారిపోయింది. ఈ దుస్థితి తొలగాలంటే పాలు సముద్రంలా పొంగాలి. కాని ఈనాటి మన దేశవాళీ పశుజాతులతో పాలసంద్రాలను ప్రవహింపచేయటం సాధ్యంకాదు. ఇది పొదుగులలో పాల సంద్రాలను దాచిన విదేశీ గోజాతులవలననే సాధ్యం కావలసిఉన్నది.

విదేశీ గోజాతులు 15-30°c ఉష్ణోగ్రతలో పుట్టిపెరిగాయి. ఆ వాతావరణములో నివసించే ఆ జాతుల లక్షణాలు ఇవి.

ఎత్తుమెలుగులు గలిగిన యీ జాతి పశువులలో గంగడోలు, చర్మపుముడుతలు చాల తక్కువ. చర్మము రోమపూరితమై శీతల బాధను తట్టుకొనటానికి అనువుగా ఉంటుంది. ఈ పశువులకు రోగ నిరోధకశక్తి తక్కువ. రోగకారక సూక్ష్మజీవులకు సులభముగా వశమౌతాయి. మాతృప్రేమ చాల తక్కువ. లేత వయసులోనే సంతానోత్పత్తి స్థోమతను కలిగి ఉంటాయి. ప్రజననసామర్థ్యమధికము. పాల ఉత్పాదక శక్తి ఎక్కువ. ఆహారాన్ని అమితంగా తిని జీర్ణించుకొనుశక్తిని గలిగియుండును. ముడి ఆహారాన్ని పాలుగా మార్చే సామర్థ్య మధికము.

ప్రపంచంలో ఈనాడు పశుపరిశ్రమలలో అగ్రస్థానాలను పొందిన దేశాల చరిత్రను గమనిస్తే ఎంతో అద్భుతమనిపిస్తుంది. పాల ఉత్పత్తిలో అగ్రగామిగా ఉన్న న్యూజిలాండ్‌లోను ఉన్ని ఉత్పత్తిలో అగ్రగామిగా ఉన్న ఆస్ట్రేలియాలోను అమెరికాసంయుక్త రాష్ట్రాల లోను మొట్టమొదట బ్రిటీష్‌వారు కాలుపెట్టేసరికి అక్కడ సరైన గోజాతిగాని గొర్రెలమందలుగాని లేవు. బ్రిటీష్‌వారు తమవెంట తమతమ పశువులను తీసుకువెళ్ళారు. వారు శ్రద్ధ తీసుకొని అభివృద్ధి పరిచిన జాతులే ఈనాడు ఆయాదేశాలను ప్రపంచంలో ప్రథమశ్రేణిలో ఉంచుతున్నాయి. ఒక పశుజాతిస్థాయిని బాగా అభివృద్ధి పరిచేందుకు 40సం॥ల కాలం సరిపోతుందని అంచనా. మనదేశంలో చరిత్రకు అందిన తొలి రోజులనుంచీ పశుజాతులున్నాయి. అవి ఆనాడు ఉత్తమ జాతి పశువులే కావచ్చును. కాని అవి దేశ ఆర్థిక స్థితిగతులను, యజమానుల ఆర్థిక స్థితిగతులను మెరుగు పరిచే విధంగా రూపొందింప బడలేదు. అందుకు మనదేశీయులు తరతరాలుగా ఉత్సాహాన్నీ, ఆసక్తినీ చూపలేదు. ప్రాచీనకాలంలో వ్యక్తిసంపద అతనికి గల పశువుల సంఖ్యపైనే ఆధారపడినప్పటికీ ఆ పశువుల ఉత్పాదకశక్తిని అభివృద్ధి పరచేందుకు తగినంత కృషి జరగలేదు.

మొన్నమొన్నటివరకు భారతదేశం ఎడతెరపిలేని రణరంగమే. యుద్ధంలో విజయం, పరాజయం ప్రధానంగా అశ్వ, గజ బలాలను అనుసరించి ఉండేది. అయినప్పటికి ఏ రాజు మన దేశంలోనే ఉత్తమ అశ్వజాతిని, గజజాతిని రూపొందించేందుకు, ఉత్పత్తి చేసేందుకు ప్రయత్నం చేసినట్లు కనిపించదు. ఎంతధనమైనా వెచ్చించి అరబ్బు దేశాలనుంచి అశ్వాలనూ, సింహళంనుంచి ఏనుగులను ఎప్పటికప్పుడు దిగుమతి చేసుకొనేవారేగాని తమ అధీనంలో ఒక మేలుజాతిని ఉత్పత్తి చేస్తే పనికి వారు పూనుకోలేదు. పశుజాతిని రూపొందించటం లేక అభివృద్ధిపరచటం ఒక బృహత్ప్రణాళిక. కొన్ని సం

దాని ఫలితాలు కనిపించవు. యుద్ధ ప్రయత్నాలు లేకుండా కొన్ని సంవత్సరాలైనా ఉన్న రాజులేనప్పుడు ఈ విధమైన పశుజాతి అభివృద్ధి కార్యక్రమాలను రాజులు చేపట్టకపోవటం సహజమే. ఇక సకాలంలో

వర్షాలు లేకపోవటం, పశువుల మేతకు కరువురావటం, విపరీతంగా విజృంభించే అంటురోగాలు- ఈ వ్యాధిబాధలతో సతమతమయ్యే సాధారణ పశుకామందుకు ఈ విషయంలో తగినంత శ్రద్ధలేక పోవడమూ సహజమే.

ఈస్టిండియా కంపెనీ మనదేశంలో కాలుమోపినప్పటినుండి సైనికావసరములకై పశుజాతుల స్థావరములనేక మేర్పాటుచేయ బడినవి. వీటితోపాటు పశుగ్రాసాభివృద్ధికి కూడా విస్తారమైన భూభాగము ప్రత్యేకించబడినది. దీనితో పశుజాతులపై కొంత శ్రద్ధఏర్పడి ప్రత్యేక పరిశోధనకు అవకాశము లభించినది. 1929 నుంచి మన దేశంలో ఈ పరిశోధనలు విస్తరించాయి. మన దేశంలోని పశుజాతుల సమగ్రాభివృద్ధికి కృషి ప్రారంభమైనది.

మన దేశంలో 26 ప్రధానమైన గోజాతులున్నాయి. ఇవన్నీ ప్రధానంగా వ్యవసాయపు పనులలో ఉపయోగించటానికే పోషింప బడుతున్నాయి. ఒంగోలు వంటి కొన్నిజాతులు వ్యవసాయానికి, పాల ఉత్పత్తికి కూడా పేరుపొందినా పాల ఉత్పత్తిలో విదేశీ గోజాతులతో పోల్చదగినవిగా లేవు.

మనదేశంలోని ఉత్తమమైన గోజాతులు అత్యుత్తమ పోషణలో సగటున ఈతకు 700 నుండి 2000 కిలోల పాలను మాత్రమే ఇవ్వ గలుగుతాయి. ఇవి గ్రామాలలో రైతుల ఇళ్ళలో సాధారణ పోషణలో ఇచ్చేపాలు చాల తక్కువ. ఒంగోలుజాతి ఆవు మొదటి ఈతలో ఇచ్చే సగటుపాలు 815 కిలోలుగా అంచనా వేయబడింది. మన దేశంలోని ఆవుల సగటు పాలఉత్పత్తి సంవత్సరానికి 173 కిలోలు. ఇటువంటి ఆవులు ఈ దేశస్థుల పాల అవసరాలను తీర్చజాలవు. సాధారణ రైతుల పోషణలో సగటున ఈతకు 2000 కిలోల పాలను ఉత్పత్తి చేయగల ఆవులు ఉంటేతప్ప మన పాల అవసరాలు కొంతవరకైనా తీరవు. ఈ లక్ష్యాన్ని సాధించటానికి సగటున ఈతకు 5వేల కిలోల పాలను ఉత్పత్తిచేసే విదేశీ గోజాతులతో మన గోజాతిని సంకరపరచటం తప్ప మార్గాంతరం లేదు. ఇందుకు జెర్సీ, ఫ్రీషియన్‌వంటి విదేశీ గోజాతులు అనుకూలమైనవి. కనుకనే ఈ దేశంలోని ఒంగోలువంటి వివిధజాతుల ఆవులను, ఇతర నాటు ఆవులను విదేశీజాతుల ఆబోతుల వీర్యముతో సంకరపరచి సంకరజాతి ఆవులను ఉత్పత్తి చేయటం మన జాతీయ విధానంగా నిర్ణయించబడినది. దీనికి కృత్రిమ గర్భోత్పత్తి విధానమే ఏకైక సాధనముగా అంగీకరించబడినది.

కృత్రిమ గర్భోత్పత్తి విధానం రెండవ ప్రపంచ యుద్ధకాలంలో రూపొందింపబడినది. మన దేశంలో కృత్రిమ గర్భోత్పత్తి విషయమై ప్రారంభమైన కృషి ప్రోత్సాహకరంగా ఉండటంతో 1945-47 సం॥ లలో బెంగుళూరు, కలకత్తా, పాట్నాలలో కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రాలు నెలకొల్పబడినవి. కృత్రిమ గర్భోత్పత్తి ద్వారా మనదేశంలో మొట్టమొదటి సంకరజాతి జెర్సీ దూడ బెంగుళూరులో పుట్టింది.

ఐరోపా దేశాలలో పాల ఉత్పత్తికి పేరుగాంచిన ప్రధానమైన గోజాతులు నాలుగు. అవి ఫ్రీషియన్, జెర్సీ, బ్రౌన్‌స్విస్, రెడ్‌డేన్‌లు. ఈ జాతుల గురించి స్పష్టంగా తెలుసుకొందాం

## ఫ్రీషియన్

ఈ జాతి ఆవులకు హాలెండ్ పుట్టినిల్లు. డచ్‌లోని ఫ్రీష్‌లాండ్‌లో అభివృద్ధి పరచబడిన ఈ ఆవులు ఫ్రీషియన్ ఆవులుగా ప్రపంచ ప్రఖ్యాతి బొందాయి. ఉత్తర అమెరికాలో ఇవి హోల్‌స్టెయిన్ అని పిలవబడటముతో 'హోల్‌స్టెయిన్ ఫ్రీషియన్' అను వ్యవహారనామ మేర్పడినది. నలుపు, తెలుగు రంగుల కలబోతతో ఉండే ఈ ఆవులు పాల ఉత్పత్తిలో ఛాంపియన్‌లు. వీటి తోకకుచ్చు తెలుపు. ఈ జాతి ఆవుల పాలు తక్కువ వెన్నశాతాన్ని(సగటున 3.6) గలిగి ఉంటాయి. ఈ జాతిలో ఛాంపియన్ ఆవు 365 రోజులకు 19,262 కిలోల పాలను ఉత్పత్తి చేసింది.

## జెర్సీ

ఇంగ్లీషు చానల్‌లోని జెర్సీ దీవులలో అభివృద్ధి పరచబడిన ఈ జాతి విదేశీగోజాతులలో శరీరపరిమాణమున చిన్నది. లేతఎరుపునుండి నలుపుదాకా దీని శరీరవర్ణము వివిధంగా ఉంటుంది. తోకకుచ్చు తెలుపుగా గాని, నలుపుగాగాని ఉంటుంది. ఈ జాతిలో ఛాంపియన్ ఆవు 365 రోజులకు 11,984 కిలోల పాలను ఉత్పత్తి చేసింది దీని పాలు లేత గులాబీ రంగులో ఉంటాయి. వెన్నశాతం 5.3.

## బ్రౌన్‌స్విస్

ఇది స్విట్జర్లండ్‌లో రూపొందింపబడిన జాతి. పాల ఉత్పత్తితో పాటు, మాంసోత్పత్తికి కూడా ఈజాతి పేరుగాంచినది. దీని పాలు నాలుగు శాతం వెన్న గలిగి తెల్లగా ఉంటాయి. ఈ జాతిలో ఛాంపియన్ ఆవు 365 రోజులకు 15,841 కిలోల పాలను ఉత్పత్తి చేసింది.

## రెడ్‌డేన్

ఇది డెన్మార్క్‌లో రూపొందింపబడిన జాతి. ఈజాతి ఆవుల సగటు పాల ఉత్పత్తి ( 305 రోజులకు ) 4522 కిలోలు.

పై నాలుగు జాతులు వివిధ దేశాలలో ఆయాదేశ వాతావరణ పరిస్థితుల ననుసరించి ప్రత్యేకంగా రూపొందింపబడినవి. ఫలితంగా, వివిధ దేశాలలో వీటిపాల ఉత్పత్తిలో వైవిధ్యం ఏర్పడింది. ఉదాహరణకు అమెరికాలోని ఫ్రీషియన్ ఆవులు సగటున 305 రోజులకు 6433 కిలోలపాలను ఉత్పత్తిచేయగా అదే ఫ్రీషియన్ ఆవులు రష్యాలో సగటున 305 రోజులకు 3883 కిలోల పాలను మాత్రమే ఉత్పత్తి

చేస్తున్నాయి. మనదేశంలో రికార్డు చేయబడిన జెర్సీ ఆవు మొదటి ఈత పాల ఉత్పత్తి 5793 కిలోలు. కాగా ఫ్రీషియన్‌ది 5256 కిలోలు, రెడ్‌డేన్‌ది 3182 కిలోలు, బ్రౌన్‌స్విస్‌ది 2121 కిలోలు. జెర్సీజాతితో మన దేశంలోని గోజాతిని సంకరపరచటం మనదేశ వాతావరణ దృష్ట్యా చాల అనుకూలమైన విధానముగా నిర్ణయించబడినది. ఫ్రీషియన్ జాతి ప్రపంచంలో అత్యధికంగా పాలను ఉత్పత్తి చేసే గోజాతిగా పేరు పొందటముతో జెర్సీ, ఫ్రీషియన్ జాతులతో సంకర పరచిన గోజాతిని రూపొందించే ప్రయత్నాలు మన దేశంలో విరివిగా జరుగుతున్నాయి.

ఈనాడు మనదేశంలో ఉత్పత్తి అయ్యేమొత్తం పాలలో సగం పాలను గేదెలే ఉత్పత్తి చేస్తున్నాయి. అసలు ప్రపంచంలోని మొత్తం గేదెల సంఖ్య (110మిలియన్లు) లో సగానికి పైగా (52.8మిలియన్లు) మనదేశంలోనే ఉన్నాయి. బ్రహ్మదేవుడు ఆవులను సృష్టిస్తే విశ్వామిత్రుడు బర్రెజాతిని సృష్టించాడని చెపుతారు పెద్దలు. మనదేశంలోని మహిషజాతిని 'ఇండియన్ వాటర్ బఫలో' అంటారు. పేరుకు తగినట్లుగానే వీటికి, నీటికి ఎంతోబంధమున్నది. నీటి గుంటలలోను, కాలువలలోను గంటలతరబడి పడిదొర్లటం వీటికి సరదా! కాళిదాసు ఋతుసంహారంలో ఈజాతి జలతృష్ణను చక్కగా వర్ణించాడు.

సఫేన లోలాయత వక్త్ర సంపుటం
వినిస్సృతా లోహిత జిహ్వా మున్ముఖం
తృషాకులం నిస్సృత మద్రిగహ్వారా
దవేక్ష్యమాణం మహిషీకులం జలమ్.

ఉష్ణతాపం లైంగిక వాంఛని, ప్రజనన సామర్థ్యాన్ని తగ్గిస్తుంది. మహిషజాతి ఉష్ణతాపాన్ని భరించలేవు. వాతావరణంలోని అధికమైన వేడి వీటి ఉత్పాదక శక్తిపై విపరీత ప్రభావాన్ని చూపిస్తుంది. వాతావరణం చల్లబడితేనే తప్ప ఈసజీవయంత్రాలు సక్రమంగా పనిచేయవు.

కనుకనే, సంవత్సరంలోని అన్నినెలలలోను ఒకేస్థాయిలో ఈ బర్రెజాతిద్వారా పాలఉత్పత్తి జరగటంలేదు. శీతాకాలంలో అత్యధికంగాను, వేసవిలో అత్యల్పంగాను బర్రెపాలు ఉత్పత్తి కావటంతో దేశంలోని పాలఉత్పత్తిలో ఒక అస్తవ్యస్త పరిస్థితి ఏర్పడింది. వేసవి కాలంలోకూడా బర్రెజాతి పాల ఉత్పత్తిని ఒక స్థాయికి తగ్గకుండా చూడాలంటే వాటిపోషణలోని మెళకువలను గ్రహించాలి. ఉష్ణతాపాన్ని తట్టుకొనేవిధంగా పశువులపాకలను ఏర్పాటు చేసుకోవటం, తగినంత నీటివసతిని కలిగిఉండి పశువు పరిసర వాతావరణ ఉష్ణోగ్రతను పశువు శరీర ఉష్ణోగ్రతకు దగ్గరగా ఉంచగలగటం, పచ్చిగడ్డిని సమృద్ధిగా సమకూర్చటం వంటి చర్యలద్వారా వేసవిలోకూడా పశువుల పాల ఉత్పత్తి, ప్రజనన సామర్థ్యాలను తగ్గకుండా చూడవచ్చు.

మన దేశంలోని గేదెలలో తర్రప్రధానమైన జాతులున్నాయి. వీటిలో ముర్రాజాతి ప్రముఖమైనది. ఢిల్లీ,పంజాబ్,హర్యానా ప్రాంతాలు ఈజాతికి పుట్టినిల్లు. వీటిపాలలో వెన్న శాతం అధికంగా ఉంటుంది. దేశంలోని నాటుగేదెలను ఈజాతితో సంకరపరచి అభివృద్ధిచేయుచున్నారు.

రైతుకు లాభసాటికాకుండా, అంటురోగాల వ్యాప్తికి దోహదం చేస్తూ, దేశంలోని భూభాగం భరించలేనంతగా ఉన్న మనదేశంలోని నాసిరకం పశువుల మందలను త్వరితగతిని మేలుజాతి పశుసంపదగా రూపొందించుకొన వలసిన ఆవశ్యకతను ప్రతి పశుకాముడు గుర్తించి తదనుగుణంగా వ్యవహరించాలి.

అయితే ఒక్కమేలుజాతి పశువులను రూపొందించుకోవటం ద్వారానే మనం మన పాల అవసరాలను తీర్చుకోగల మనుకోవటం పొరపాటు. ఉత్తమ జాతిని రూపొందించటంతోపాటు వాటికి తగినంత పోషకాహారాన్ని సమకూర్చి శ్రద్ధగా పోషించినప్పుడే మనకు ఆశించిన ఫలితాలు లభించగలవు.

మానవున కాహారముగా పనికిరానిగడ్డి, గాదములనుపయోగించుకొని మానవునికి కావలసిన పోషకాహారాన్ని మేల్తరముగా ఉత్పత్తి చేయగలిగేది జంతుజాలములోకెల్ల పాడిపశువు ఒక్కటే. పాడిపరిశ్రమ ఆర్థికంగా లాభదాయకంగా ఉండాలంటే పశువు ఉత్పత్తి స్థోమత,దానికి సమకూర్చే పోషకాహారం, దాని పోషణలో శ్రద్ధ ప్రధాన పాత్ర వహిస్తాయి. పాల ఉత్పత్తి ఖర్చులో సగానికిపైగా పశువుకిచ్చే పోషకాహారానికే అవుతున్నది. పశువుకిచ్చే పోషకాహారాన్ని ఉత్పత్తిచేసే ఖర్చు ఎంతతగ్గితే పాలఉత్పత్తి అంత లాభదాయకంగా ఉండగలదు. దీనికి హైబ్రిడ్ నేపియర్, పేరాగడ్డి, లూసర్న్, అలసంద, జనుము మొదలగు పుష్టికరమైన పచ్చిమేతలు విస్తారంగా ఉత్పత్తి చేయవలసి ఉంటుంది. ఈ పచ్చిమేతలను సమృద్ధిగా సమకూర్చ గలిగినపుడు పాడిపశువుకిచ్చే మిశ్రమదాణాను తగ్గించవచ్చు. దీనివలన పాడిపశువుకు సమకూర్చే పోషకాహారపు ఖర్చుతగ్గి పాలఉత్పత్తి లాభదాయకంగా ఉండగలదు.

అయితే, మనదేశంలోగల పెరిగే, పాలిచ్చేపశువులకు తగినంత పుష్టికరమైన పచ్చిమేత ఈనాడు సమకూరటంలేదు. దేశంలోసాగుబడి అయ్యేభూభాగంలో కేవలం 4.4 శాతం భూమిలోమాత్రమే పచ్చిమేత పైరులువేయడమే దీనికి ప్రధానకారణము. ఈ భూభాగంలో ఉత్పత్తి అయ్యే పచ్చిమేత మనదేశంలోని మూడవవంతు పశువులకు మాత్రమే సరిపోతుంది.

ఈ పరిస్థితులలో పాడిపశువుల పోషకాహార అవసరాలను తీర్చలేని పశుకాముడులు ఉత్తమ జాతి పశువులను పోషించటం లాభదాయకం కాదు. పుష్కలంగా పచ్చిమేతను పండించగలవారే పాడిపరిశ్రమను చేపట్టటం మంచిది. అప్పుడే వ్యక్తి ఆదాయముతోపాటు దేశంలో పాల ఉత్పత్తి కూడా అధికమౌతుంది. పాలవెల్లువ దేశాన్ని ముంచెత్త గలుగుతుంది. పాడి పశువుల సంఖ్యలోనే కాక పాల ఉత్పత్తులలోకూడా భారతదేశం ప్రపంచంలో ప్రముఖ స్థానాన్ని అలంకరించగలుగుతుంది.

# సఖీ శిరోజాలు విరబోసుకో

శ్రీ వెల్దుర్తి మాణిక్యరావు

సఖీ శిరోజాలు విరబోసుకో
నీలిమి నలుదెసలు వ్యాపించనీ

నీలి ఛాయల్లో నిండుగా
నీ ముఖలావణ్యం చూసుకోనీ.

తెల్లని వెన్నెల కన్నా
నలుపే మిన్నయనీ

శ్యామలమే సుందరమని
లోకానికి తెలిసిపోనీ.

"శ్యామల' మా జాతిది
శ్యామసుందరుడు మా వాడనే

తత్వం తలకెక్కిన శిరోజాలు
మెరుస్తూ మురుస్తున్నవి.

అవి తెల్లబడితే
ముఖం వెలవెల బోతుంది.

శిరోజాలు విరబోసుకో.

శ్రీ చివుకుల అనంతపద్మనాభ శాస్త్రి

# లింగాల శాసనము

ప్రాచీన శిలాశాసనములు, ముఖ్యముగా తెలుగు భాషకు సంబంధించినంతవరకు, కడప జిల్లాలో ఎక్కువగా దొరికినవి. వాటిలో కలమళ్ల, ఎఱ్ఱగుడిపాడు, పొట్లదుర్తి, తిప్పలూరు మొదలగు శాసనములు సుప్రసిద్ధములు. అవేకాక, 7–8వ శతాబ్దికి చెందిన మరికొన్ని శిలాశాసనములు కూడా చెప్పుకోదగినవి. అందులో ప్రస్తుతము సమీక్షిస్తున్న శాసన మొకటి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పురావస్తుశాఖ కడపజిల్లా శాసన సంపుటములను ప్రచురించి చారిత్రికులకు, భాషాశాస్త్రవేత్తలకు మహోపకారము చేసినారు. ఆ శాసన సంపుటములలో పేరెన్నిక గన్నది మొదటి సంపుటము. బ్రహ్మశ్రీ పుచ్చా వాసుదేవ పరబ్రహ్మ శాస్త్రిగారు వాటికి ఆధ్వర్యము వహించి, చక్కని పరిచయముతోను, శీర్షికలతోను వ్రాసినారు. వారి నిశితదృష్టి, పరిశీలనాశక్తి నుండి మరేలకో ఈ శాసనము తప్పించుకొనినది. ఇది అక్షర పరిణామమునకును, కొత్తరాజులను గురించి చెప్పు శాసనము.

ఈ శాసనము[1] కడపజిల్లా, పులివెందుల తాలూకా, లింగాల గ్రామములో నున్న శ్రీ వీరభద్రస్వామి దేవాలయములోనున్న శిలపై చెక్కియున్నది. అచ్చటచ్చట ఒకటి రెండక్షరములు కానవచ్చుటలేదు కాని శాసనమును చూడగానే ప్రాచీనమయినదిగా చూపరులను ఆకట్టుకొనును.

కాలనిర్ణయము చేయుటకు తగిన శకసంవత్సరాదులు లేకపోయి ననూ, అక్షర పరిణామము, నిర్మాణతనుబట్టి ఇది సుమారుగా 8వ శతాబ్దికిచెందినదిగా భావించవచ్చును.[2]

శాసన లిపిలో కొన్ని అక్షరములు, ముఖ్యముగా 'అ' కారము దాని పరిణామమును గమనింపదగినవి. ఈ అక్షరము రెండు విధములుగా చెక్కబడినవి. మొదటిది మామూలుగాను, రెండవది ఒత్తక్షరముగాను కలవు. మొదటిది మూడు రకములుగా లిఖించబడినది. మొదటి దానియందు (8వ పంక్తి) అక్షరము సుమారు నలుచదరముగా నుండి, మధ్యగీతతో రెండు భాగములు చేయబడినది. రెండవరకమున (అదే పంక్తిలోనే) బండి 'అ' వలె యున్ననూ, రెండువైపుల పైభాగము లోపలికి వంపు తిరిగియున్నది. ఎడమవైపు వంపు మధ్యగీతకు తగిలి యున్నదికాని కుడివైపు వంపు మధ్యలోనే ఆగిపోయి ఉండుట గమనింపదగినది. ఇక మూడవరకమున (పంక్తులు 6, 9, 11, 12, 13 లలో) మధ్యగీత లేదు. ఈ అక్షరమందు పైన చెప్పినవిధముగా గాక అర్థానుస్వారముగా నుండుట గమనింపదగియున్నది. పైన చెప్పబడిన అక్షరములు ఒకే శాసనములో నుండుట చూడవచ్చును. దీనివలన 'అ' అక్షరము కాలానుగుణ్యముగా ఎట్లు మార్పు చెందుచున్నది తెలియు చున్నది.

ఒత్తక్షరముగా నిందులో రెండవ పంక్తిలోను, పదునాలుగవ పంక్తిలోను చెక్కబడినది. పై సమీక్షవలన, మనకు 'అ' కారము ఒత్తక్షరముగా వాడబడుచున్నప్పుడు ప్రాచీన రూపముగా వాడబడు చుండెననియు, మామూలు అక్షరము వాడబడుచున్నప్పుడు వివిధ రూపములుగా మార్పుచెందుచున్నది.

భాషా ప్రయోగమున పెద్ద మార్పులుగాని, ప్రయోగములుకాని లేకపోయిననూ, అయిదవ పంక్తిలోను, పదవ పంక్తియందు 'న' కారంతముచూడవచ్చును. 'మగ' అనుటకు బదులుగా రెండక్షరములు కలిపి 'మ్గ' గా రాసినారు. బహుశ నిది శిల్పి లోపము కావచ్చును.

శాసనము 'స్వస్తి' వాచకముతో ప్రారంభింపబడినది. ఆ తరువాత దొమ్మెరి విక్రమాదిత్యుని యోధుడు (మగన్డు) అయినటువంటి చోఌపుళ విజయాదిత్యుడు రట్టగుళ్లను, అతని కుమారుడు అభిమాని గుదియన్, అగణితగుణదాని బిరుదాంకితుడు అయినటువంటి శ్రీ జయమేటి వాయూరి యుద్ధమున, బాణరాజుల కుమాళ్లు అయిన వఌవరేణ్డు, గువమవుళన్ను మరియు సత్తికుమారుని చంపెను. ఆపైన శ్రీజయమేటి ఒక గాడిదను, నలుగురు వీరులను నిహతమొందించెను.[3] దీని తరువాత పదములు చుచ్ఛిత్రములైనవి. యుద్ధములోని పొరకుక్క విషయము (పొగరు) శ్రీ జయమేటి వున్న సభలో ఎవరికి తెలియదు అన్నదానితో ఈ శాసనము పూర్తి చేయబడినది.

శాసనములో మొదట చెప్పబడిన శ్రీ దొమ్మెఌ విక్రమాదిత్యుడెవరో తెలియటం లేదు. అతని దగ్గర అభిమానగుణవంతుడు, సత్త్వవంతుడు, వీరుడు అయినటువంటి శ్రీ [illegible] ఉండటం బట్టి, విక్రమాదిత్యుడు ఒక స్వతంత్రరాజని తెలియవచ్చును. ఇతనికి

చాళురాజులకు, సత్తి కుమారులనగల పైరెండిట్లో తెలియదు. దీనిలో చెప్పిన సత్తికుమారుడు, రేనాటిచోళ రాజయినటువంటి సత్తికుమారుడు కావచ్చునా అని సందేహము కలుగుచున్నది. ఈ సందేహములు ప్రాజ్ఞులెవ్వరయిననూ వివరింతురని ఎదురుచూచుచున్నాను. విజయాదిత్యరట్టగుళ్ల చోళుపులకు అధినేత అతని కుమారుడు శ్రీ జయమేటి.

శాసనమున కొన్ని విశేషములు కానవచ్చును. 'వెఱుళ' 'మెఱుళ' అన్న పదప్రయోగము. ఇవి సాధారణముగా మనకెచ్చటను (శాసనములలో) కనిపించవు. బహుళ 'వెఱుళ' అనగా భయంకరమనియు, 'మెఱుళ'అంటె పొగరు అన్నఅర్థముగా తీసుకుంటె, సమయ సందర్భాలకు తగినట్టుగా వుంటుంది. ఇక రెండవది ఛందస్సు. శాసనము చివరిలో నున్న పదములు. ఛందస్సు ప్రయోగించిచూడగా అది 'రగడ'కు సరిపోవు చున్నది. 'రగడ' ఈ శతాబ్దిలో ప్రయోగించటం ఇదే మొదటిది.

స్థలనామములయిన వాయూరు, చోళుపుళలలో వాయూరు గుర్తించుటకు వీలుకాకున్నది. చోళుపుళ చిప్పిలి కావచ్చును.

## శాసనము[4]

1. స్వస్తి[॥*] శ్రీ దొమ్మయా [టి][5]
2. విక్రమాదిత్యు మ్గాను[6] చో [ళు]
3. ంపుళ విజయాదిత్యరట్ట-
4. గుడ్ళ కొడుకు అభిమానగు-
5. డియన్ అగణితదాని శ్రీ జయ
6. మేటి వాయూరిపోటున సత్తి-
7. పురాగ పొపరావతి వారుర [ను ల]
8. ది కుమాళ్ళు వఱువరేణ్ణు గువ-
9. మవుళు ఒక్క[8] గాణ్ణి ను న్రల్వు-మగ.
10. లను పొడిచి పడియె [న్] [॥*]
11. పాతిలో పరి[పరి]వల్కు వెఱుళ పో-
12. అకుక్క మెఱుళ [–] నెవ్వరెఱుంగవా [న్లు*]
13. శ్రీ జయమేటి వొన్నిసభ
14. శోన [॥*]

## అధోజ్ఞాపికలు

1. ఇన్‌స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్, కడప డిస్ట్రిక్ట్, వాల్యూం 1, పే. 42.
2. పై వాల్యూం సంపాదకులు ఈ శాసనము తొమ్మిదవ శతాబ్దికి చెందినదిగా భావించారు. కాని లిపి పరిణామమునుబట్టి 8 వ శతాబ్దికి చెందినదిగా నిర్ణయించవచ్చు.
3. పై గ్రంథము, పే. 41, ఆంగ్లశీర్షిక సరిగాలేదు.
4. ఫోటో ఆధారముగా చదవబడినది.
5. ఈ అక్షరము పై వాల్యూంలో చదవలేదు.
6. మగన్నుగా చదువవలెను
7. 'వా' సరికాదు 'జా' అయితే అర్థము స్ఫురిస్తుంది
8. దీక్క అని చదివినారు.
9. న్రు అని చదివినారు.

# ప్రయాణం

## రామసూరి

నిరంతర జీవన యాత్రలో మనిషికి
ఎన్ని అనుభవాలు
ఎన్నెన్ని జ్ఞాపకాలు—
అన్నీ
గుండె 'సూట్ కేస్' లో
దాచుకుంటూ
సాగిపోయే ప్రయాణీకుడు మనిషి.
చినుకులు పలకరిస్తే
ఆనందంగా కేరింతలు కొట్టే మనస్సు
వెన్నెల చిలకరిస్తే
హాయిగా సేదతీరే మనస్సు
దట్టంగా మంచు కురిస్తే
గజ గజ వణికే మనస్సు
ఆకులు రాలి రేపటి చైతన్యం కోసం
గాలికి ఊగే చెట్లని చూస్తే
ఆశలు పెంచుకునే మనస్సు
చిగుళ్లు తొడిగిన ఎలమావి తోటలలో
పాటలు పాడుకునే మనస్సు
రకరకాల అనుభూతులు
లయాన్విత రసగీతులు
కాల ప్రవంతిలో కలలై అలలై
పలకరిస్తుంటే—
జీవితం పొడుగునా
తనివి తీరా అనుభవిస్తూ ఆనందిస్తూ—
ఏడ్చి ఓదార్చి నవ్వి నవ్వించి
ఎన్నెన్నో
ప్రపంచానుభూతి ప్రవాహాలతో
సయ్యాటలాడి విసిగినా వేసారినా
వేదనలూ నిట్టూర్పులూ అన్నీ
ఉదయాస్తమయాల కౌగిట్లోనే-
ఆనందాన్వేషణలో
దుఃఖాన్ని కౌగిలించుకునే వాళ్లూ
కన్నీటిలోనే
అమృతాన్ని అందుకునే వాళ్లూ
అందరి గమ్యం ఎక్కడికో మరి
ఏ ఆశ నడిపిస్తోందో మరి
ప్రతి మనిషి కదలికా ముందుకే
జీవితం అసలు రహస్యం తెలుసుకునేందుకే
ఈ ప్రయాణం.

శ్రీ సోమసుందర్

# చైతన్య సంకల్పం చైత్రం

ఈ ఉగాదితోపాటు నవయుగాది సైతం ఆగమించింది.

ఇరవై ఒకటో శతాబ్దం వచ్చి - నీ నిశాంత దేహళిలో నిలచింది.

ఆప్యాయంగాతలుపుతట్టి పిలిచింది.

లే! ఎందుకాలస్యం చేస్తావింకా?

ఉన్నవ పున్నెమా అని ఆరు దశాబ్దాలుగా మనం కలలుగన్న సమధర్మ వ్యవస్థకై సంఘవిజయం సమకూరలేదు. అనైక్య కాలయాపనలలో ఆశాబింబాలు నీరుకారిపోతున్నాయి. అజ్ఞాన తిమిరంలోపడి నీరసించి పోతున్నాయి. అభిప్రాయ విభేదాల విరిగిన వంతెనల క్రిందనుంచి ఎంతెంత జీవజలం వ్యర్థమైపోయిందో చరిత్రనడిగి తెలుసుకో! ఆగామి శతాబ్దం ఆహ్వానిస్తోంది; చైతన్యాలనన్నిటినీ సమీకరించు; మనస్సులన్నీ కేంద్రీకరించు!

మన అలసత్వాన్ని బలహీనతగా పోల్చుకొని స్వార్థం బొర్రలు పెంచుకుంటోంది. నల్లడబ్బుల పరకీయప్రవేశం చేస్తున్నారు కామందులు! పొద్దెక్కి-లేచి వికటాట్టహాసం వినిపిస్తున్నారు కామాంధులు! వీళ్ళేవీళ్ళే వసంతాన్ని అడ్డినవాళ్ళు! శిశిరానికి గల సహస్రముండిత శిరస్సులు!

అభిప్రాయ విభేదాలున్నంతలో అన్నతమ్ము లాజన్మ శత్రువులు కారు; ఆయుధ ప్రయోగంలో అభిప్రాయ సమన్వయం సాధించాలనుకోవడం- జంతువును చెల్చి చెట్టుకు వ్రేలాడగట్టి అరుణోదయమనుకొని పిచ్చి గంతులు వేయడం వంటిదే!

ఖగనాథులు జగన్నాథులుగా అందలా లెక్కుతూంటే - పక్షీంద్రులు మక్షీంద్రులుగా పరగళ్ళ పాలవుతున్నారు. సంఘం బహిష్కరించవలసిన దుష్టులు విశిష్టరాజలాంఛనాలాక్రమించారు. అధికార పర్వతాగ్రాలకధిరోహిస్తున్నారు. నా దారులు కాలిదారివిడిచి విమానాలెక్కి విహరిస్తున్నారు. తృటికాలంలో మనబొక్కసాలు దోచారు, కోట్లకు పడగలెత్తారు. ధనరాశులు పేరుకొన్న ఆ దూరపు కొండలు - పొగమంచుల జూలు దులిపి, సింహాలై గర్జిస్తున్నాయి; ధన వర్గ రథానికి పూన్చబడ్డ తురంగాలయ్యాయి ప్రభుత్వాలు!

లే - ఎందుకు తాత్సారం చేస్తున్నావు? అందరినీ ఒక బిరిలోనికి పోగెయ్యి... నీకెందుకయ్యా ఈశషభిషలు? తూర్పు పడమరల పట్టింపులు? విజృంభించే ఉత్తుంగతరంగానికి కోటలన్నీ పాదాక్రాంతాలు! అదోవిను ఆగామి శతాబ్దం కోటి శంఖనాదాలొలికిస్తోంది! ఆలకించు...

గడచినకాలం కన్నీళ్ళతో వ్రాసుకుంది తన చరిత్ర... దారిపొడుగునా కడగండ్లను ముళ్ళతుప్పల్లో దాచుకుంది. నెత్తుటితో ఉత్తరీయాలు తడుపుకుంది. ఎండుచితుకులతో మంటలు రాజుకుంది. తిరుగుబాటు బాటలు పతాకాలుగా మార్చుకుంది. ఐతే ఏమైనట్లు? నక్షత్రకాంతులే మన ధ్వాంత రాత్రిని పట్టపగలుగా మార్చేనా?

అస్సీరియా బాబిలోనియాల మానవీయ విజయాల నాగరకతా పరంపరలు సాధించిన వైభవాలన్నీ ఏమైపోయినట్లు? ఏసాఫల్య గుణపాఠాలందించినట్లు? ఏథెన్సో-పాటలీపుత్రమో, ఏ థిలీసో-హస్తినాపురమో- ఏవైఫల్య కాలగర్భ కార్కశ్యంలో కలసి పోయాయి? సింధునదీతీరాల ప్రాక్తన భారతీయులు సాధించిన సౌమనస్య సస్యాలన్నీ ఏ బూడిద ప్రోగుల క్రింద నిద్రించాయి? ఏ థార్ ఎడారి ఇసుక తుఫానుల క్రౌర్యం మింగేసింది.

ఎలా వెళ్ళి పోయింది నీ కాంతి పరివేషం? విక్రమాదిత్యుల చల్లని పరిపాలనా వైభవాలు సమకూర్చిన రుచిర కావ్య రత్న వీథులన్నీ ఏ దిశగా తరలిపోయాయి?

తెలుసుకొనే వీళ్ళేవి? ఆనవాళ్ళెక్కడ? పురావైభవాల జ్యోత్స్నా విభావరులను ఏ దగ్ధ కామనల కాననాలలో వెదికేది? ఎంతని విలపించేది? ఎలా పోల్చుకొనేది?

దివారాత్రాలు — ఆక్రోశిస్తున్న చరిత్రహృదయారవాలు... సకలవిలాపాలకూ సమాప్తి పలికే ఉజ్జ్వలరేఖ భవిష్యత్తు!

ఈ లోకం తనంత తానేమారుతుందను కుంటున్నావా? ఉత్తభ్రమ... దురవగాహనల మాయపొరల్ని చీల్చు! డాకురేకుల మెరుపులతో కన్ను

[illegible]
మలినదుకూలాల్ని విసర్జించు... ఆగామి శతాబ్దం ఆహ్వానిస్తోంది పురోగమించు !

నిజమే గతానేక ప్రకరణాలు కనీవినీయెరుగని మహత్తర మానవతా విజయాలు సాధించిందీ శతాబ్దం. ఎన్నో కాంతిపుంజాలందించింది. రుచిరజీవన విచిక లామోదాలెన్నో సమకూర్చింది ! ఆ సత్ఫలజాలానికి ఫలితార్థం ఇదా? నిష్క్రియా పాలిత్య పాటవ పరీక్షలేనా?

మన శతాబ్దం- పీడితమానవులందరికీ విప్లవ మంత్రోపదేశం చేసిందే! పీడనారహిత సమధర్మోజ్జ్వల ధ్వజాల భూనభోంతరాళాల నింపిందే? మరింకా ఎన్నాళ్ళిలా అవుగాముల పలుబాముల సుడిగుండాలపడి, ఉక్కిరి బిక్కిరి అవుతాం? నిన్నటిలాగే నీరవంగా విలపిస్తాం?

పరాన్న భుక్కులకు అధికారాలందించి అడుగుమెట్లపై నిస్తేజంగా పడి గాపులు పడుతున్నాం మనం? మరియికనైనా మేలుకో-సాధించు సాగించు జైత్రయాత్ర !

నిర్జీవ జడపదార్థం ఇసుకను మరగించి, కరగించి, తళతళలాడే అందచందాల గాజుపాత్రల్ని మలుస్తున్నామే, శప్తువై పడివున్న సజీవ మానవులను జీవకాంతులతో మెరిపించలేమూ? శ్రమైకజీవనకుంజర యూథాల కెన్నాళ్ల ఈసంకెళ్ళు? మానవతా నుబంధాలను ముందుకు నడిపించలేని చక్రబంధాలు ?

ఎందుకిలా విరిగినకలల్ని ప్రోగుచేసుకుంటూ బ్రతకడం? గుడ్డిపేలికల కోసం, చిత్తుకాగితాలకోసం, ఇనుపముక్కలకోసం, పందిపెంటల కోసం- పెంటపోగుల్ని కెక్కరిస్తూ ఎంతకాలం బ్రతకడం ? నికృష్ట జీవులమై, నిర్వీర్యదేహులమై, ఇలాగేనా బ్రతకడం?

ప్రపంచాన్ని పునర్నించాల్సిన ప్రతిభాసూర్యులకా దుర్వ్యవస్థా మేఘాచ్ఛాదనలు? లేయింక! విజృంభించు; ఆగామిశతాబ్దం ఆహ్వానిస్తోంది. చేలాంచలమందుకో, కేలందుకో ! మురికిముదుసళ్ళ మంచుల్ని దులుపుకుని ముందుకు నడుద్దాంపద! ఆగామి సకల జగజ్జన జీవన గాయత్రి ! సర్వంకషసవిత్రి !

సోమరిపోతులకే హంసతూలికా తల్పాలందించి, వంచనల పంచలలో తలదాచుకొనే నిర్భాగ్యం మనకెన్నాళ్ల? పగలంతా కష్టాల కాష్ఠాలలో కరగిన అలుబిడ్డలన్నదమ్ములందరినీ రాత్రంతా దుర్భర యాతనల కడగళ్ళకన్నీళ్ళలో ముంచుతున్నాం! పసిడివెలుగుల మంచి

[illegible]
విలపించడం ఆత్మవిమర్శ ఎంతమాత్రం కాదుసుమీ! మనజీవనోద్యాన వనాలు దురంతశ్మశానాటవులు కారాదు. కర్తవ్యాన్ని శేణికసు కూల్చడం వివేకంకాదు. దౌష్ట్యాన్ని పరిమార్చక మృష్టాన్నం లభించదు. కాల యాపనలలో కరగి ఉనికయినా మిగలదు !

నిన్నలవలెనే నేడులన్నీ పసచచ్చి, పసిచెడిన మోడులై, పుల్లవిరిగి పోతూంటే, నీ ఆశాలతలు కుక్కమూతి పిందెలు దింపుతూంటే- ఇంకెంతకాలం దీన్ని కల్పలతగా భావించడం? బొప్పబిందువుల్ని పైసలుగా మార్చుకుంటూ అడియాసలు పడడం ఎన్నాళ్ళు? ప్రాణంలేని బొమ్మలకోసం చేతులు చాపడం ఎన్నాళ్ళు ?

సర్వాధికారివి నీ ముంగిట కెవడో వేషధారి వాజమ్మవచ్చి ఉత్తుత్త ఆశల బొమ్మలాంతరు చూపుతూంటే- నిర్జీవప్రతిమలా నిలచి నిన్ను నీ వమ్ము కుందుకెందుకు సిద్ధపడతావు? బానిసలా దీనంగా ఒణుకుతావు? లే, ఇక చాలించు; నీ ముఖకళవళికల్ని సొంతం కడిగేసుకో!

నీ కుపితోగ్ర జ్వాలా కీలలతో అశ్రుజలరాశుల్ని సత్వరం ఇంకించు ! క్రుద్ధ సాయుధ యూథంగా పురోగమించు. నైచ్యలోకాన్ని పరిమార్చు! ఆగామి శతాబ్దం ఆహ్వానమందిస్తోంది, సందేశమందుకో !

ఈ నిశాంతవేళ నీ మొగసాలలోనిలచి ఇరవై ఒకటో శతాబ్దం పిలుస్తోంది ! ఆప్యాయంగా చేతులుచాపి, శతారమందిస్తోంది. నీ కోసమే నిరీక్షిస్తోంది.

మకుక్కపచ్చలారకుండానే మిత్రిని కౌగలించుకుంటున్న మన తమ్ములు నెత్తమ్ములు! వ్యక్తి నిర్మూలనమే వర్గ శత్రుసంహరణ మనుకుంటు న్నారు! అదే శ్రామిక విప్లవంగా భ్రమిస్తున్నారు. వాళ్ళందరినీ పిలుచుకురా! భగత్సింగ్‌వంటి మహావిప్లవవీరుల వైఫల్యాల అనుభవ సారాల గుణపాఠాలందించు !

అందరమూ కలసి ఈ కష్టాల కందకాలు దాటుదాం ! సమధర్మ సుదర్శనం అవతలిగట్టుపై నిరీక్షిస్తోంది ! అందరమూ కలసి మానవతా మణిహారం ధరించుదాం ! మణికంధరులమై తరిద్దాం ! సమైక్య కంఠ నాదంతో సురభిళవసంతాన్ని చేరబిలుచుకుందాం ! గుండె గుండెకీ చల్లని ద్రాక్షాసవాల పసందులందించి గుబాళిస్తుంది ఆగామి వసంతం ! !

ఆగామి శతాబ్దం ఆహ్వానిస్తోంది...

అందరమూ తరలి పోదాం కదలండి...!

## శ్రీ రేబల్లి వేంకటేశ్వర్లు

# ఆదిలాబాదు మాండలికభాష దాని తీరుతెన్నులు

ఆదిలాబాదు జిల్లా చాలా పూర్వకాలమునుండి వివిధ రాజవంశముల కాలమున మహారాష్ట్రులతో రాజకీయ, సాంఘిక, సంబంధములు కలిగియున్నట్లు తెలియుచున్నది. నేటికి వీరు వైవాహిక, వ్యాపార, సంబంధములు కలిగియున్నారు. కావున వీరు జరుపుకొను పండుగలు, భాషలలో సారూప్యము గోచరించును. ఉదా :- పోలాపండుగ (ఎడ్లపండుగ)

ఈ వ్యాసమున ఆదిలాబాదు మరియు పరిసర ప్రాంతవాసులు వాడుకొను కొన్ని మాండలిక పదముల వాడుకతీరు వివరింపబడును. ఇందు శిష్ట, శిష్టేతర వ్యవహారములో తేడా అగుపించకుండుట గుర్తింప దగినది. భాషలోని వైవిధ్యం మూడు రకాలు 1) చారిత్రకం 2) ప్రాంతీయం 3) సాంఘికం. ప్రాచీన ఆధునిక మాండలికాలమధ్య కన్పించే వైవిధ్యం చారిత్రకాంతరంవల్ల ఏర్పడుతుంది. ప్రాంతీయ వైవిధ్యం నైసర్గిక సీమలు, రాజకీయపు హద్దులవల్ల ఏర్పడుతుంది. సాంఘిక అంతరం వ్యవహర్తలమధ్య భాషావైవిధ్యాన్ని కలిగిస్తుంది.[1] పై విభజనలోని చారిత్రకం మరియు ప్రాంతీయ వైవిధ్యాలు ఆదిలాబాదు మాండలికపు తెలుగులో (ఆ. మాం. తె) అగుపించును.

## మరాఠీపదాలు

1. "ఆయి" అనగా అమ్మ. చాలామంది తల్లిని "ఆయి" అని పిలుస్తారు. "అవ్వ" అనే అచ్చతెనుగు పదము చాల కొద్దిమంది నోట వినగలము.

నానాయి = నాన + ఆయి = నాయినమ్మ

అమ్మాయి = అమ్మ + ఆయి = అమ్మమ్మ

అత్తాయి = అత్త + ఆయి = అత్తమ్మ

పై పదాలు తెలంగాణా ప్రాంతంలో వాడే పెద్దాయి (పెద్దమ్మ) అనే పదాన్ని పోలియున్నది. "ఆరె" వాళ్ళు "ఆయి" అనే పదాన్ని వాడుట గమనింపతగిన విషయము. ఆరేవాళ్ళ పూర్వీకులు మహారాష్ట్ర నుండి వచ్చి తెలంగాణ గ్రామాలలో స్థిరపడినట్లు తలపబడుచున్నది.

2. బాయి = ఆడవాళ్ళందరినీ ( చిన్నపెద్ద అనే భేదం లేకుండ ) "బాయి" అని పిలుతురు. ఉదా :- పండ్లబాయి, బిచ్చపుబాయి, కూరగాయలబాయి, పనిబాయి మొదలగునవి.

3. బాపు = మగవాళ్ళందరిని "బాపు" అనిపిలుస్తారు. ఉదా :- చుట్టపుబాపు, దుకాణపుబాపు, కూరగాయలబాపు మొదలగునవి.

4. మౌషి = చిన్నమ్మఅని అర్థము. "కాకి" అనిగూడ చిన్నమ్మను పిలుస్తారు.

5. కాక = చిన్నాయన. కరీంనగర్, వరంగల్ జిల్లాలలోకూడ కొందరి నోట, "కాక" అనే పదం వింటాము.

6. వైణి = వదినె.

7. భేటి = భేటి అనగా కలుసుకొనుట. మహారాష్ట్రుల సంపర్కంవల్ల దక్షిణాంధ్ర సాహిత్యంలో కూడ "భేటి" అనుపదం అగుపడును. ఉదా : "తొండమాన్ వంశావళి" అనుగ్రంథమున నిట్లున్నది.[2] "వారితోనేవినస్వామి భేటికిపోవ" అనియున్నది. ఇట యుద్ధమున, పోరాటమునకై శత్రువులను "కలిసికొనుట" అను అర్థమున వాడబడినది.

8. పోత = "పోత్" అను మరాఠీపదము "పోత" గా మారినది పోత అనగా బస్త అని అర్థము. ఉదా :- బియ్యపుపోత, పప్పుపోత, సిమెంటుపోత మొదలగునవి.

9. సండాస్ = మరుగుదొడ్డి. "సండాస్" అనేపదాన్ని మనం రైల్వే కంపార్టుమెంటులలోని మరుగుదొడ్డి తలుపులపై చూడగలము.

10. సాకర్‌పుడి = (సాకర్‌అనగా చెక్కర) పెండ్లికుమార్తెకు నిశ్చితార్థము సమయమున (పెండ్లికిముందు) చీర, రవిక, పూలు, పండ్లు మొదలగునవి పెట్టుటను సాకర్‌పుడి అని అందురు.

11. ఎర్రబొట్టు = వరపూజ చేయుటను "ఎర్ర బొట్టు" అందురు. "పొగాచుట్టించుట" అనికూడ కొన్నిచోట్ల వ్యవహరింతురు.
12. రత్నపురి గడ్డ=(రతాళు. మరారి) కందగడ్డ
13. భరణి = జాడి లేక మర్తబాను.
14. లౌకర్ = తొందరగా
15. బొప్పసు = అన్న. *
శబ్దరత్నాకరము
16. నీదెం = చక్కగా, సూటిగ
17. లెంకుడు = వెతుకుట.

పై పురాతీ పదాలు యథాతథంగా లేక కొలదిమార్పులతో ఆ. మాం. లె. లో వాడుచున్నారు. ఈ పదాలు వాని వరుసలకు, నిత్యవాడుకకు సంబంధము కలవగుటచే ప్రాంతీయ వైవిధ్యము సుస్పష్టమగుచున్నది.

**తెలుగు పదములు** (తెలుగు పదముల సంజ్ఞావివరణ పట్టిక 7)

## వర్గము-1

1. తోడెము=(దే) కొంచెము, లేశము అని అర్థములు. ఈ పదము చిన్నయసూరి మిత్రభేదములో అగుపించును.
ఉదా :- "తోడెంబు" తోడనే ప్రొద్దుపుచ్చుకొనియెద, నేనేమి చేయుదునని సింహము, కాక వ్యాఘ్రజంబుకములతో యనును.
2. కొత్తలు=(దే) చిల్లర డబ్బులకు హాత (నైజాం), కల్దారు (ఇంగ్లీషు) నాణాలను వాడుకాలమున తెలంగాణా జిల్లాలలో వాడిన పదము. నయాపైసల వాడుకతో 'కొత్తలు' అనుమాట అదృశ్యమైనది. కాని నేటి ఆదిలాబాదు ప్రాంతప్రజల వాడుకలో ఈ పదము నిలిచియున్నది.
3. రంజ ణ=(దే) గాదెవంటి కాగు. ఇది నీళ్ల పోసుకొనుటకు వాడబడు మట్టిపాత్ర. ఈ పాత్రకు అనేక సన్ననిరంధ్రములుండుటచే నీరు బయటకు వచ్చుటకు, గాలి పోవుటకు వీలుండి నీరు చల్లగా నుండును. ఈ పాత్రల తయారీ వీరి ప్రత్యేకతను తెలుపును.
4. రజాయి (దే)=చలికి కప్పుకొనెడి దుప్పటి. ఇది 2½ కి॥ దూదితో సన్నని పరుపువలె తయారుచేయుదురు. ఇది కప్పుకొనిన చలి కాలమునకూడ ఒంటికి చెమట పట్టును.
5. లగ్గము (వై) పెండ్లి
బొప్పడు = (దే) మూఢుడు—తెలుగు. శబ్దరత్నాకరము
6. మొగులు = (దే) ఆకాశము, మబ్బు. "మొగులు చేసింది"అనగా వాన మబ్బు చేసిందనే అర్థంలో వాడుదురు.
7. రెండక్కల్ల, మూడక్కల్ల = రెండు దిక్కుల, మూడు దిక్కుల (చోట్ల)
8. డాగులు (దే) = మరకలు, గురుతు
ఉదా :- "విరహిజనమ్ములన్ మరుడు వీపున డాగులు వేయబూని" (చంద్రహాసోపాఖ్యానము.)
(డాగులు అనే పదాన్ని మూటల లెక్కలకు ఉపయోగిస్తారు కొన్నిచోట్ల)
9. మరెంక = తర్వాత. ఉదా :- పనికి మరెంక రమ్మనుట.
10. పగలెక్కుట = ప్రొద్దెక్కుట. పొద్దు పోయిందనుటకు ఈ పదమును వాడుదురు.
11. సోలాలు = పచ్చి దినుసులను ముఖ్యంగ పచ్చి బబ్బెర్లను, పచ్చి కందులను "సోలాల" ని అందురు.
12. పిసికిళ్ల (దే) = జొన్నలు లోనగువాని యూచబియ్యమనిఅర్థము. "పిసుకుళ్లు"గా రూపాంతరం చెందింది. పలుగురాళ్ళను కాల్చి ఒక గుడ్డలోవేసి, జొన్నలుకూడ పోసి పిసుకుట వలన, వానికి పిసికిళ్ళను పేరు వచ్చినది. ఖమ్మం, వరంగల్ జిల్లాలో కూడ ఈ పదము వాడుకలో కలదు.
13. మస్తు (దే) = సమృద్ధి, చాల. ఉదా:- మస్తుదూరం, మస్తుపని, మస్తుమంది, మస్తుబియ్యం/చక్కెర మొ॥
14. కాల్వకు పోవుట = (దే) దొడ్డికి పోవుట
15. శనగపిండికి గల పేర్లు = (ఎ) సూన్‌పిండి (సూన్ అనగా ఉల్లిగడ్డలు మరియు శనగపిండి కలిపి వండు కూర) వీరు సూన్‌ను మదరం (మదనం) అనికూడ అంటారు. (బి) మదరం పిండి.
16. అగ్గిడబ్బ = అగ్గిపెట్టె
17. మంటినూనె = (ద్వి) (మన్ను + నూనె) గ్యాసునూనె.
18. కోక(దే) = వలువ, వస్త్రమని అర్థము. "చీరె"కు ఈపదం వాడుక కరీంనగర్, వరంగల్ జిల్లాలో చాకలివాళ్లు వాడుదురు. ఖమ్మం, ఆదిలాబాదు జిల్లాలలో చాలామంది "కోక" అని వాడుదుర్రు.
ఉదా :- ఆ॥ చాకివాడు కోక చీకాకు పడజేసి...
పు.17.ఎస్. వి.గోపాల్ అండ్ కో ప్రచురణ, 1941)
19. చట్టాగొట్టుట = ఎగవేయుట, ఇవ్వకుండుట.
20. తొగరి(వై) = కందిచెట్టు, తొగరుపప్పు = కందిపప్పు.
21. తెల్లబాసన్లు=రాతెండి/అల్యూమినియం బోళ్లు/పాత్రలు.

## వర్గము - 2

| క్ర. సం. | అంశం | ఆ. ప్ర. తె. రూపం | ఆ. మాం. తె. రూపం |
|---|---|---|---|
| 1 | "ఎవ" కు బదులు "ఓ" వాడుక | ఎవరు | ఓలు |
| | | ఎవడు | ఓడు |
| 2 | "చి" అక్షరానికి బదులు "స" వాడుక | ఇడిచి పెట్టి | ఇడస పెట్టి |
| | | చక్కెర | సక్కెర |
| 3 | "ళ్ళ" లావత్తుకు బదులు "డ్ర" వాడుక | మళ్లీ | మల్డ్రి / మళ్లి |
| | | బర్లు, చెర్లు | బల్డ్రి, చెల్డ్రి |
| 4 | "వె" కు "ఏ" వాడుక | వెరచుట | ఎరసుట |
| 5 | "న" కు "స" వాడుక | దినము | దిసము |
| 6 | "చ" కు "ఛ" వత్తు | పోచమ్మ | పోచ్ఛమ్మ |

## వర్గము - 3

భాషా స్వరూపము మారుచున్నట్లే కాలక్రమమున అర్థములోగూడ మార్పుచూపట్టు ననుటకుదాహరణములు.

| క్ర. సం. | పదము - అర్థము | ఆ. మాం. తె. వాడుకతీరు |
|---|---|---|
| 1 | లేక ( దే ) = మరొకటి | లేక = లేదు అనిఅర్థము<br>ఉదా :- ఇచట వరి పంట లేక (లేదు) |
| 2 | గొలుసు ( దే ) = సంకెల, చేతధరించెడి సొమ్ము | గొలుసు = గొళ్లెము |
| 3 | ముంత = ( దే ) మానిక కొలపాత్ర | ముంత = చెంబు |
| 4 | జీతము ( వై ) = వేతనము<br>జీతగాడు (ద్వ) జీతము + కాడు | జీతము = ఉద్యోగము<br>జీతము చేయుట = ఉద్యోగము చేయుట |
| 5 | యేగు ( డు ). దే. = పూయుట | యేగుడు = ఇల్లు అలుకుట. |
| 6 | పూటకూళ్ళు. దే. = వెల తీసుకొని పెట్టెడి అన్నము | పూటకూళ్లు = చిరుతిండ్లు<br>ఉదా :- బిస్కట్లు, పిప్పరమెంట్లు, పాపడ్, నువ్వు/పల్లిముద్దలు మొ॥ |
| 7 | లేపుట ( దే ) = లేవజేయు | లేపు = తీసుకొనుట, సర్టిఫికెట్ లేపుట. |
| 8 | పగుల కొట్టుట ( దే ) = ముక్కలు ముక్కలు చేయుట | పగులకొట్టుట = విప్పుట<br>ఉదా:- బియ్యంపోత పగులకొట్టుట, అగ్గిపెట్టెల పుడా పగులకొట్టుట |
| 9 | నూకుట = ( దే ) తోచు, త్రోలు | నూకుట = ఊడ్చుట, వాకిలి నూకుట |

అనేక దేశ్యపదములు (అచ్చతెనుగు) మరాఠీ, హిందుస్థానీ (ఉర్దూ)భాషా ప్రభావమునకు లోనుగాక నిలిచి యున్నవనుటకు తోడెము, కొత్తలు, రంజ ణ, రజాయి మొదలగుపదములు సాక్ష్యములు. కిన్వట్, రాజురా మహారాష్ట్ర ప్రాంతములలోనేటికి తెలుగు మాట్లాడువారుండుట నైసర్గిక సాన్నిహిత్యమని చెప్పుకొనవచ్చును. (*తెలుగుపదములన్నియు శబ్దరత్నాకరముతో సరిచూసి, పరిష్కరింపబడినవి).

## హిందుస్థానీ (ఉర్దూ) పదములు

1. కిస్మత్ (కిస్మత్) = అదృష్టము, భాగ్యము.
2. దుకాన్ = దుకాణము.
3. కిరాణా (కిరానా) = ఉప్పు, మిర్చి, మసాలా మొ॥ వస్తువులు
4. కిరాయి (కిరాయా) = బాడుగ, కూలి.
5. హక్ = "హక్కు"గా మారినది.
6. అల్మారు (అల్మారా) = సొరుగులుగల ఎత్తైన కఱ్ఱపెట్టె.
7. అత్తరు = (అతర్) వాసనద్రవ్యము.
8. హోదా = ఉద్యోగస్థాయి.
9. ఖబర్ = ఖబురు, కబురుగా మారినది = వార్తఅని అర్థము.
10. ఖర్చ్ = ఖర్చుగా వాడబడుచున్నది (వ్యయమని అర్థము).
11. షబాష్, సెబాసు, శాబాసు రూపములలో వినుచున్నాము. ఇది మెచ్చుకొనుటను తెలుపును.
12. హుషార్ లేక హుసారనివాడబడుచున్నది. "తెలివిగల" అనిఅర్థము.
13. జమ్‌ఖాన, జముకాణ, జంపఖానగా మారినది.
14. తమాష్, తమాష, తమాస = వింత అని అర్థము.
15. "ఛప్పన్" "ఛప్పన్న" గా రూపాంతరం చెందినది. "ఏబది" అని అర్థము. (పేజి 409 ద.వా.భా.వి)

ఉదా : "ఛప్పన్న దేశ రాజ్యములచేత కప్పముల్ దెప్పించి గర్వించినట్టి" (చొక్కనాథ చరిత్రము, పు. 51.)

16. ఫరక్ = తేడా, భేదము. ఉదా :- ధరలో ఫరక్ పడదు.
17. తుట్టి = తక్కువ. ఉదా :- రూపాయికి పావలా
18. అంగార్‌డబ్బి = అగ్గిపెట్టె.
19. తువ్వర్‌దాల్ = కందిపప్పు.
20. కజ్జాడుట/గూసులాడుట = కొట్లాడుట.

కజ్యా/ఖజ్యా అను హిందీ పదములు "కజ్జాడుటకు" మూలము

నోటు : క్ర. సం 1-8 మరియు 16-20 వరకు శబ్దరత్నాకరముతో సరిచూడబడినది. క్ర. సం. 9-15 వరకు దక్షిణాంధ్ర వాఙ్మయ భాషా విశేషములనుండి తీసుకొనబడినవి.

(సంజ్ఞ వా. భా. వి.)

| | | | |
|---|---|---|---|
| క్ర. సం. | 12 & 13 | ... పేజి. | 414 ,, |
| ,, | 09 | ... ,, | 419 ,, |
| ,, | 11 | ... ,, | 413 |

పై పదాలన్ని హిందుస్థానీ (ఉర్దూ) పదాలు. ఉర్దూను లష్కరీ (సైనికుల) భాష అని అంటారు. సైనికులు పలు భాషలు మాట్లాడుదురు (పలుప్రాంతముల వారగుటచే). పలుభాషా పదములు కలిసి ఉర్దూ భాషేర్పడినది. ఉర్దూ సుల్తానులకాలములో రాజభాషైనది. కావున ఉర్దూ వ్యవహారభాషలో, సాహిత్యములో చోటు చేసుకొన్నది. తత్ఫలితముగనే మాండలికభాషలో ఉర్దూ పదములు స్వభాషా పదముల వలెనే వాడబడుచున్నవి.

## అ ఇ లు

1. భారతి సెప్టెంబరు 1982, పేజి 9,రాయలసీమ తెలుగు-అసాధారణ లక్షణములు (చూడుము)రచయిత శ్రీ సి.ఆర్.యస్. శర్మ.
2. దక్షిణాంధ్ర వాఙ్మయ భాషావిశేషములు, పు. 407.
3. తెలుగు పదముల సంజ్ఞావివరణ పట్టిక (శబ్దరత్నాకరము)
   అ) దే = దేశ్యము.
   ఆ) వై = వైకృతము. ప్రాకృత సమమును, సంస్కృత భవమునైన పదము.
   ఇ) ద్వ = ద్వయము. వైకృతమును, దేశ్యమును మిశ్రమమైన పదము.
4. నీతిచంద్రిక. మిత్రభేదము చూడుము.
   "కాక వ్యాఘ్రంబులు లొట్టియను జంపించుట" అను కథలోనిది.

## సహాయక గ్రంథములు


1. శబ్దరత్నాకరము : విద్యారత్న నిడదవోలు వెంకటరావు పరిష్కరించిన 1981 ప్రచురణ.
2. దక్షిణాంధ్ర వాఙ్మయ భాషావిశేషాలు, డా॥ హేమలత, పిహెచ్.డి. డిగ్రీకొరకివ్వబడిన సిద్ధాంత వ్యాసము.
3. ఆం. ప్ర. డిస్ట్రిక్ట్ గెజిటీర్‌లు : ఎమ్. వి. రాజగోపాల్, 1976
4. ప్రాచీనాంధ్ర నగరములు : ఆదిరాజు వీరభద్రరావు, దేశోద్ధారక గ్రంథమాలా ప్రచురణ.
5. తెలుగు మెఱుగులు : శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి.
6. నలందా హిందీ శబ్దకోష్ : సంపాదక్ శ్రీ ఎన్. ప్రభాకర్.
7. 1980-82 ఉద్యోగరీత్యా ఆదిలాబాదు నగరమున ఉన్నపుడు సేకరించిన పదములిందు చేర్చబడినవి.
8. ఎ హిస్టరీ ఆఫ్ సౌత్ ఇండియా : నీలకంఠశాస్త్రి, 1966.
9. లఘుకోశము : సంయోజకుడు-ఉభయభాషా ప్రవీణ దుగ్గిరాల వేంకట పూర్ణభుజంగ శర్మ.

# తెలుగు తేజం - వెలుగు నిత్యం

కాకతీయుల తర్వాత చెల్లాచెదరైన తెలుగుజాతి ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుతో మళ్ళీ ఒకేచోటుకు, ఒకే నీడకు చేరుకొని అఖండజాతిగా అవతరించింది. నాటినుండి గత కీర్తి స్మృతులను నెమరువేసుకుంటూ, వర్తమానాన్ని సుభిక్షంగా, సుందరంగా, సుఖప్రదంగా నిర్మించుకుంటూ, భవిష్యత్తును అఖండంగా ఊహించుకుంటూ ప్రగతివైపు పురోగమిస్తున్నది.

ఈ పురోగమన యాత్రను మరింత సంగమం చేయడానికి, రాష్ట్రాభ్యుదయాన్నీ, ప్రజాసంక్షేమాన్ని సత్వరమే సాధించడానికి శ్రీ ఎన్. టి. రామారావుగారి నాయకత్వంలో ఏర్పాటైన రాష్ట్రప్రభుత్వం అనేక కార్యక్రమాలు చేపట్టింది.

- ★ 15 అంశాల ప్రగతి పథం కార్యక్రమం ద్వారా బడుగువర్గాల జీవితాల్లో నూతన చైతన్యం వెల్లివిరుస్తోంది.
- ★ సంక్షేమ సేవా కార్యకలాపాలకు నిధుల కేటాయింపు రెట్టింపు చేయబడింది.
- ★ బలహీనవర్గాలకోసం 2,20,000 పక్కా ఇండ్ల నిర్మాణం దశలవారీగా చేపట్టబడింది.
- ★ పేదవారికి కిలో బియ్యం రెండు రూపాయలకే అమ్మించే పథకంవల్ల 94.22 లక్షలమందికి లాభం చేకూరుతోంది.
- ★ ప్రాథమిక విద్యావ్యాప్తికి 16,000 ఉపాధ్యాయులను ప్రత్యేక ప్రాతిపదికపై క్రొత్తగా నియమిస్తున్నారు.
- ★ స్వచ్ఛమైన పాలనా యంత్రాంగాన్ని ప్రజలకు అందించే ఉద్దేశంతో ప్రభుత్వం నెలకొల్పిన లోకాయుక్త 1983 నవంబరు 1 నుండి అమలులోకి వచ్చింది.
- ★ వృత్తి విద్యాలయాల్లో అర్హతకు ప్రాధాన్యం యిచ్చే ఉద్దేశంతో కాపిటేషన్ ఫీజు వసూలు చేయడాన్ని ప్రభుత్వం నిషేధించింది.
- ★ ప్రాథమిక విద్యావ్యాప్తికి మధ్యాహ్నభోజన పథకాన్ని అమలుపరుస్తున్నారు. దీనివల్ల దాదాపు 40లక్షలమంది బలహీన వర్గాలకు చెందిన పిల్లలు ప్రయోజనం పొందుతున్నారు.
- ★ మహిళలకోసం ప్రత్యేకంగా ఒక మహిళా విశ్వవిద్యాలయాన్ని తిరుపతిలో ప్రారంభించడం జరిగింది.
- ★ గ్రామాలలో మంచినీటి ఎద్దడిని తీర్చడానికి కనీసం 100 జనాభాకు ఒక మంచినీటి వనరును ఏర్పాటు చేస్తున్నారు.
- ★ తరచుగా అనావృష్టికి గురయ్యే రాయలసీమ ప్రాంతాల్లో సాగునీటి సౌకర్యాన్ని కల్పించే ఉద్దేశంతోనూ, పొరుగున వున్న తమిళసోదరుల దప్పిక తీర్చడానికి మానవతాదృక్పథంతో తెలుగు గంగ పథకం చేపట్టబడింది.

## నవంబరు 1, 1983 నుండి అమలు జరుగుతున్న నూతన కార్యక్రమాలు

**గ్రామోదయ :** గ్రామీణ ప్రాంతాల్లో ప్రగతి పథకాలను చేపట్టి సౌభాగ్యాన్ని సాధించడానికి, నిరుద్యోగాన్ని నిర్మూలించేందుకు యువతకు స్వయంఉపాధి సౌకర్యాలు కల్పించడానికి కేంద్ర సహాయంతో చేపట్టబడినది. ఈ కార్యక్రమం గ్రామీణాభివృద్ధికి యువత సేవలను వినియోగించుకోనటం ఈ పథకం ప్రధానలక్ష్యం.

**దీప :** ప్రతి జిల్లాలో ఉపాధి, పారిశ్రామిక పెంపుదల సంస్థను ఏర్పాటుచేసి విద్యావంతులలో నిరుద్యోగాన్ని పరిష్కరించడానికి ఉద్దేశించబడినది ఈ కార్యక్రమం. గ్రామసౌభాగ్య సాధనకు దీనివలన దోహదం కలుగుతుంది.

**విముక్తి :** అతిహేయమైన పాకీపని నుండి ఆ పనిలో వున్నవారికి విముక్తి కలిగించడానికి, గ్రామాలలో ప్రధానంగా మహిళల సౌకర్యార్థం సెప్టిక్ మరుగుదొడ్లను నిర్మించడానికి ఉద్దేశించినది. ఈ పథకం. ఈ కార్యక్రమం క్రింద అన్ని మున్సిపల్ పట్టణాలలోను, రక్షిత మంచినీటి పథకాలుగల పెద్ద పంచాయతీలలోను తక్కువ ఖర్చుతో సెప్టిక్ మరుగుదొడ్లను దశలవారీగా నిర్మిస్తారు. సామాజిక మరుగుదొడ్ల నిర్మాణంలో ప్రయోగాత్మకంగా బయోగ్యాస్ ఉత్పత్తికి అవకాశం కల్పించాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఈ సందర్భంలో పాకీ వృత్తిని అవలంబిస్తున్న వారి సంపాదనకుగాని, ఆర్థిక ప్రతిపత్తికిగాని భంగం కలగని రీతిలో వారికి పునరావాసం కల్పించబడుతుంది.

ఇటీవలి తుఫాను, వరదలవల్ల కలిగిన నష్టాన్ని భర్తీ చేయాలంటే పెద్ద ఎత్తున నిర్మాణ, సంక్షేమ, సహాయ, పునరావాస కార్యక్రమాల్ని చేపట్టాల్సి వుంటుంది. ప్రభుత్వం చేపట్టే బృహత్తర కృషిలో ప్రతి పౌరుడు ముందుకువచ్చి ప్రభుత్వ కార్యక్రమాలలో భాగస్వామిగా తోడ్పడినప్పుడే యిది సాధ్యమౌతుంది.

DIPR NO.24556/Advt/c4/83 సమాచార, పౌర సంబంధ శాఖ : హైదరాబాదు

# మనం మనం కలసి జనం....

## శ్రీ మేకా సుధాకరరావు

ఆశల శిథిలాల అట్టడుగునుంచి
ఆర్తంగా ఈ ఆక్రందన—
ఎవరో వచ్చి ఈ శకలాలను తొలగించి
లేవ నెత్తుతారని కాదు—

అన్యాయాక్రమాల మబ్బుల క్రింద
దురవకాశాల ఆకాశం క్రింద
అసూయా ద్వేషాల అనల జ్వాలల మధ్య
మానవత మరుగు పడిన చీకట్ల లో
వక్రీ భవించిన మేధస్సుల వికృత సదస్సులో—

రాద్ధాంతలు సిద్ధాంతాలుగా
నటియించే రంగస్థలిని—
పరుల అపజయం స్వీయవిజయంగా
మెలి పెట్టే మీసాల సహవాసాలలో—

ధనాధికారాల దాహం దట్టంగా
పెరిగి పోయిన జనారణ్యంలో—
అసహనం ఆవేశం అవాంఛనీయంగా
పేరుకుపోయిన క్రూరతీరాలలో—

ఏ సినిమాకో బయలు దేరే సందడిలో
పాలకై గుక్క పెట్టే పసిపాప రోదనను
పట్టించుకోని తల్లుల కొల్లల మధ్య—
దాచుకోవడం, దోచుకోవడం
దర్జాగా చలామణీ అయ్యే నాటు—
అభిమానం అంతరించిన వీటు
వంచన వర్ధిల్లే చోటు

అనారోగ్యం దురాక్రమించిన సమాజంలో
ఈ వ్యవస్థ గాడ్పుల వడదెబ్బకు
ఒరిగిపోయిన నన్నూ నిన్నూ
ఎవరో ఉద్ధరిస్తారనే భ్రమలు లేవు—
నేనే మారాలని—

అనునిత్యం జ్వలియించే
ఆరని ఆశగా;
బీడువారిన జీవిత క్షేత్రాలూ
మోడు వారిన బ్రతుకు వృక్షాలూ
చూచి, కరిగి కన్నీరు కురిసే మేఘంగా—
ఆగిపోతే చనిపోయే
ఆగని హృదయంగా—
అంధకారాన్ని చీల్చే అమరజ్యోతిగా—

రూపు దిద్దుకుని
నేనే మారాలని—
ఆ గమ్యం చేరాలని....

అందుకే
ఈ శకలాలను చెల్లా చెదురుచేసి
బైటపడే బలం, నాలో
పుంజీ భూతం గావించడానికే
ఉగ్గపట్టి బిగ్గరగా ఈ పిలుపు!

గుడ్డను పొడుచుకొని
స్వేచ్ఛగా బైటపడే పక్షికూనలాగా—
రాతిని పగులగొట్టి నవ్వే పువ్వులాగా—

అంతరాంతరాలలో మరిగిమరిగిన
ఆలోచనల అవగాహనలూ, అనుభూతులూ
వికసించిన సుకవితా కిరణంలాగా—
ఉర్విని నిలవాలని

ఉత్తేజంతో ఉరుముతూ
శుష్కప్రియాలను తరుముతూ
నీవూ నేనూ కలసి మనం....
మనం మనం కలసి జనం....!

—

# శ్రీ పాలడుగు వెంకటేశ్వరరావు

# ఎండ

ఎండ పేల్చేస్తోంది.

ఎండ వాయించేస్తూ వుంది.

ఎండ దంచేస్తూ వుంది.

*   *   *

వెచ్చటిగాలి ఆవిర్లు గ్రక్కుతూ వుంది. జీవృక్షాలు అల్లాడుతు వున్నయి.

'అబ్బ' అనుకున్నాడు అబ్బయ్యా.

'అబ్బబ్బా' అని ఆపసోపాలుపడ్డాడు, అబ్బయ్య. ఊపిరాడ నట్లుగా, ఉక్కిరి బిక్కిరి అయిపోయినట్లుగా, అల్లాడిపోయాడు అబ్బయ్య. మెలికలు తిరిగిపోయి తెగరొప్పాడు.

'అయ్యో' అంటూ బాధకి లోనయాడు.

'అబ్బా' అని మూలిగాడు.

'అమ్మా' అనుకుని ఆక్రోశించాడు.

కరెంటు ఆగిపోయింది.

ఎయిర్కండిషనర్ చచ్చిపోయింది.

గాలి వేడెక్కింది. ఉక్కిరిబిక్కిరి చేసివేస్తూఉంది. వళ్ళు బిగిసి పోయింది. వంటిమీద చెమట్లు ధారలుగా కారాయి-ఆవిర్లయిపోయాయి.

'అమ్మమ్మ' అనుకుంటూ, కరెంటునీ, కరెంటువాళ్ళనీ తెగతిట్టు కున్నాడు, కోటీశ్వరరావు.

'నేను, చచ్చిపోతానేమోరా, నాయనా' అనుకుని గిలగిల్లాడాడు, ఇట్లా ఈ కరెంటు, వాళ్ళు ఎంతమందిని చంపేస్తారోగదా! అని జాలి కూడా పడ్డాడు.

పేట్రేగి పోతున్న ఈ ఎండలు, చీటికీమాటికీ ఆగిపోయి అజా పజాలేకుండా పోతున్న ఈ కరెంటు! ఈ ప్రపంచం కాలి, మాడి మసయి పోతుందేమోరా దేవుడా అనుకుంటూ, తెగ యిదయి పోయాడు కోటీశ్వరరావు.

ఆ ఒక్కచెట్టూ మోడులాగఅయింది. ఆకులు రాలిపోయాయి. కొమ్మలుఎండి గిడసబారినట్లుగా అయాయి. ఆ చెట్టుక్రింద ఇంత చల్ల దనాన్ని అందించే బారెడు నీడకోసం వెతుక్కుంటూ, అల్లల్లాడాడు అబ్బయ్య. ఆ నీడకోసమే వెతుకులాడుతూ, ఎండకి రొప్పుతూ, చొంగలు గార్చుకుంటూ, అటుగా వచ్చి నిలబడింది ఒక గజ్జికుక్క. పిచ్చి ముండ.

ఛీ ఛీ అనుకున్నాడు అబ్బయ్య.

ఫో ఫో అని అదిలించాడు - అక్కడినించి ఆ కుక్క కదలక పోగా, ఒక మాంచి పలుకురాయిని తీసుకుని నడుం విరిగేటట్టు కొట్టాడు. కుయ్యోమంటూ, పరుగు లంకించుకుంది కుక్క.

'నీయమ్మ! తిక్కకుదిరిందా?' అని అథార్టీగా, ఆ నీడలో సర్దుకున్నాడు అబ్బయ్య. గర్వంగా నలుదిక్కులా పరికించి చూసాడు.

సరిగ్గా సమయానికి ఫోను కూడా మొరాయించింది. అలో-హలో అని పిలవగా చివర్కి అది పనిచెయ్యటం ప్రారంభించగా-అవతల్నించి ఎంగేజుడు అన్న కూతలు వినవచ్చాయి. ఎంతసేపూ అవే కూతలు!

'ఛీ... నీయమ్మ. ఇక ఈ దేశం బాగుపడదు. ఎటు బట్టుకుని చూద్దామన్నా అంతా డిసార్డరే!' అని ఆశ్చర్యపోయాడు, ఆ పట్నంలో రెండు సినిమాహాల్సుకీ, నాలుగు పెద్ద వ్యాపారాలకి అధిపతి అయిన కోటీశ్వరరావు. ఇంటావిడ పూటికి పోయింది. కొడుకులిద్దరూ కేష్మీరు వెళ్ళారు. ఈ ఆస్తిపాస్తులకి ఇక్క కుక్క కాపలా కాస్తూ కోటీశ్వరరావు మిగిలి పోయేడు, ఈ ఎండల్ని పుష్కలంగా భారీగా అనుభవిస్తూనే!

అబ్బబ్బ !!

ఎండ వాయించేస్తూ వుంది !!!

ఏం[్]టానాయనా !

ఈ ఎండకి మనసులేదా?

ఈ వడగాలికి జాలిలేదా ?

ఈ సూరీడుకి బుద్ధిలేదా ?

ఏమిటిది ?

ఇది ఏమిటీ అని !

అసలు మనుషులు బ్రతకాల్నా వద్దా అని ! ఈ చెట్టూ చేమలు ప్రాణాలు నిలుపుకుని మళ్ళీ వచ్చే వసంతానికి చివురులు వేస్తాయా, అని!

భగమంతుడా !

నాయనా !

పిచ్చి నాయనా !

నేను సచ్చిపోతన్నానురా ! మూడు దినాల్నుండీ తిండి లేక పోయినా భరించాను. ఒక మొండి బండముండా కొడుకులాగా నిలబడ్డాను. బ్రతగాల్ననే తాపత్రయంతోనే 'అమ్మా ఆకలి' అని ఆక్రోశించాను. ఛీ ఛో అన్న ఎన్నో ఛీత్కారాల్నీ భరించాను. ఎలాగో లాగా ఆ ఎంగిలి ముద్దల్నయినా, ఆ ఆకూ అలముల్నయినా, ఆ పంపు నీళ్ళనయినా ఆ కడుపులో పడవేసి, ఇట్లా నిలబడటానికి ప్రయత్నించానా–

ఎండా ! ?

నిలుపునా జీవుల్ని చంపటమే దీని ఇదా? ! దీనెమ్మ. ఫా! పఫా.

*

అబ్బా!

అమ్మా!

ఏవిటీగుండె! ఇదేమి గుండెరా నాయనా? ఒకటే ఇదిగా దడదడా దడదడా కొట్టుకుంటూ వుందే! ఏమయిపోదామనీ?!

లబాడబా

డబాలబా

డబాలబా

ఏమిటని! ఆగిపోదుగదా! అమ్మో ! ఇంకేమయినా వుందా ? అంతపనీ జరుగదుగదా కొంపదీసి ! అల్లాగే అయ్యితే ఇక రక్షించే నాధు డెవరూ?

ఇక లాభంలేదు. బొల్చీ తన్నుదుగా వెధవ ప్రాణం!

ఏదో ఒకటి చెయ్యాలి. చెయ్యాల్చెయ్యాలి.

ఆ ఘోరమే జరిగితే- ఈ చుట్టూ వున్నవాళ్ళు సామాన్యులు కాదుగదా!

ఆ స్వంతబామ్మర్ది ఆ సినిమాహాళ్ళని స్వంతం చేసేసుకుంటాడు. ఆపార్ట్నర్లు దొంగలెక్కలు రాసిపారేసి, తనపెళ్ళాం బిడ్డల నెత్తిన చేతులు పెట్టేస్తారు! రాస్కెల్సు! అందువలనా,

తను పోకూడదు! పోనే పోకూడదు.

తను పోకుండా వుండాలంటే-

ఏదో ఒకటి చెయ్యాలి. చెయ్యాల్తప్పదు మరి!

తప్పదు... తప్పదు మరి.

అబ్బా! అమ్మా!

ఎండ !

వేడి, ఉక్క, ఊపిరాడని స్థితి!

పాడు గుండె లబడబ డబలబ

స్వామీ...

దేవాదిదేవా! అనాధరక్షకా! ఆర్త్రత్రాణ పరాయణా.

నీదగ్గరకు వచ్చి నిలువుదోపిడీ ఇస్తాను. కొల్చుకుంటాను. పూజలు చేస్తాను.

రక్షించు నన్ను.

రక్షించు నా కుటుంబాన్ని.

కాపాడు నన్నూ, నా భార్యాబిడ్డల్నీ, నా ఆస్తిపాస్తుల్నీ, నా అన్నింటినీ.

నా చిన్ని పొట్టకు శ్రీరామరక్ష. సర్వే జనా స్సుఖినో భవంతు

అబ్బా !

అమ్మా !

ఏమిటీ ఆయాసం !

సమయానికి, ఇంట్లో ఎవరూ లేకుండా పోయారు గందా ఖర్మ బాబూ ఖర్మ.

* * *

'ఏయ్'

'......'

'ఇదుగో. నిన్నే'

'......'

'మాట. ఇట్లారా. బాబూ !

'......'

'ఒక్కమాటవినిపో. ఇదిగో. ఈ పదిరూపాయలూ నీకుఇస్తాను. త్వరగా రా బాబూ! నామాట వినవూ?'

* * *

'ఎవరదీ?'

'......'

'నన్నేనా, పిలుస్తూంటా ! అవునూ. నన్నే.'

'......'

'ఏమిటబ్బా మాట అంటున్నాడూ!? తెగ సంపాదించి బొజ్జ పెంచుకున్న ఆ సిల్కులాల్చీ, వుంగరాల పెద్దమనిషికి తనతో ఏం పని చెప్మా?'

'......'

'పది రూపాయలిస్తానంటున్నాడే! ఎంత మంచి పెద్దమనిషీ!'

* * *

'చూడుబాబూ ! ఈ వీధిచివర డాక్టర్ బొజ్జయ్య వుంటారు. నువ్వు అక్కడికి వెళ్ళి ఆయన్ని పిల్చుకొస్తివా, ఈ పది రూపాయలూ నీకే ఇచ్చేస్తాను. ఏం? వెళ్ళి పిల్చుకుని వస్తావా? అబ్బ ! అమ్మ ! అయ్య ! అయ్యో! ఇక్కడ ఒక పెద్ద మనిషికి ప్రాణం మీదికి వచ్చిందని చెప్పి పిల్చుకురా.'

'......'

'ఏం నాయనా ! నువ్వు మంచి వాడివిగదూ ! వెళ్ళవూ ! వెళ్ళి ఆ డాక్టర్ని వెంటనే పిల్చుకుని రావూ ! సాటి మనిషిమీద నీకు ఆ మాత్రం జాలిలేదూ! ఇదుగో. ఈ పదిరూపాయలూ తీసుకో. నీకే.'

అబ్బయ్య తల పైకీ క్రిందికీ వూపి, వెనక్కి తిరిగి పరుగు లంకించుకున్నాడు. వూపిరి బిగపట్టి మండుతూవున్న నిప్పులమీద పరుగెత్తే శూరుడిలాగా, వీరుడివలే, దవుడు తీసాడు.

* * *

'ట్రింగ్. ట్రింగ్'

'ట్రింగ్. ట్రింగ్'

'ట్రింగ్. ట్రింగ్'

ఎయిర్కండిషనర్ ఆగిపోగా ఆ వుక్కకి తట్టుకోలేక, బట్టలన్నీ విడిచి, తడి తువ్వాలు నడుంకి చుట్టుకొని, బాత్ రూంలో టబ్ దగ్గిర కూర్చుని ఎంజాయ్ చేస్తూవున్న, డాక్టర్ బొజ్జయ్య చిటపటలాడుతూ వచ్చి తలుపుదీసాడు.

ఎదురుగా, మాసిన జుత్తుతో, వొంటిమీద జీరాడ్తున్న గుడ్డ పీలికలతో, వెన్నుకి అంటుకుపోయిన కడుపుతో. ఎర్రగా జ్యోతుల్లా అయిన కళ్ళతో నిలబడివున్న అబ్బయ్యగాడ్నిచూసి, కళ్ళెర్రజేసి—

'ఎవడ్రా నువ్వూ ! ఫో. ఫో' అని అరిచాడు, చిరాగ్గా.

అబ్బయ్య నోరుతెరిచి ఏదో చెప్పటానికి ప్రయత్నించాడు.

'పోలీసుల్ని పిలిచి బొక్కలో తోయిస్తాను. నీ అమ్మాబాబులు జ్ఞాపకం వచ్చేలాగా, ఎముకలు నలగ బొడిపిస్తాను. దొంగరాస్కెల్. ఫో. పోరాఫో' అంటూ కర్రతీసుకుని మీదిమీదికి వస్తూ— బొజ్జయ్య—

'టామీ ! కమాన్. టామీ. కాచ్ దిస్ రెచెడ్ ఫెలో', అంటూ, అల్సేషియన్ని పిలిచాడు. ప్రళయ భీకరంగా పళ్ళు బయటపెట్టి, గర్జిస్తూ ఇంట్లోనించి బయటకి వస్తూవున్న, ఆ విశ్వాసంగల జంతువుని గమనించి, ప్రాణభయంతో వెనుదిరిగి, పెనంలాగా కాల్తువున్న రోడ్డెక్కి, మిల్కాసింగ్ని తల్చుకున్నాడు అబ్బయ్యగాడు, అర్భకుడు!

రొప్పుతూ రోజుతూ—

చమట్లు కారుస్తూ—

ఆయాసంతో వూగిపోతూ—

భయంకరమయిన పొగలూసెగలూకక్కే ఆ ఎండని చీల్చుకుంటూ కోటీశ్వరావు మేడదగ్గరకి వచ్చిపడిన అబ్బయ్యగాడికి—

అక్కడ వరండాలో, క్రిందపడి—దిక్కూ మొక్కూ లేనట్టుగా-పక్షిలాగా—గిలగిలా కొట్టుకుంటూ, హృదయ విదారకంగా మూల్గుతూ, మృత్యుదేవత కౌగిలిని తప్పించుకొనటానికి విశ్వప్రయత్నం చేస్తూ; వోడిపోయే దశలోవున్న కోటేశ్రావుని చూస్తూ—

శోకనివ్వాపుతూ, అసహాయంగా నిలబడి, కళ్ళవెంట ధారాపాతంగా నీరు కార్చుతూవున్న ఆ గజ్జికుక్క కనపడింది. దాని నడుం మీద ఎర్రగా ఆ గాయం! అవతలి వ్యక్తి బాధని చూడలేక, తన నొప్పిని కూడా మరిచి, కన్నీరు పెట్టున్న పిచ్చ జీవి! ఫూలిష్ పెరో!

అప్రయత్నంగానే, అబ్బయ్యగాడి కళ్ళూ చెలమలయ్యాయి. తనకీ ఏం చెయ్యటానికీ దిక్కుతోచక భోరుమని ఏడ్చాడు; ఫూల్ అబ్బయ్య.

ఎండ పేల్చేస్తోంది.

ఎండ దంచేస్తోంది.

ఎండ వ్యాయించేస్తూవుంది. అప్పుడు ఆఖరిసారిగా—ఆయొక్క జీవుడు గిలగిల్లలాడాడు.

డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తి

# విరియాలమల్లని గూడూరుసానుబంధ శాసనము విమర్శ - పరామర్శ

భారతి-మార్చి '83 సంచికలోని "విరియాలమల్లని గూడూరు శాసనమునందలి బొట్టుబేత, కాకతిబేతకాడు" అను శ్రీ కొల్లూరు సూర్యనారాయణగారి వ్యాసమునందు అపార్థములు, అపార్థీకరణములు కలవు. అవి :

1. "శాసనపు భాషాప్రయోగ సంస్కరణలెట్లు జరిగినను చారిత్రక విషయములు కొన్ని నిష్కారణముగా బలియైపోవుటను బట్టి, వారందు ప్రకటించిన అభిప్రాయములు కొన్నింటిని వెంటనే సవరించుకొనుమని గోరుటయే యీ వ్యాసపు ముఖ్యోద్దేశము."

విరియాల మల్లని గూడూరు సానుబంధ శాసనములోని తెలుగు పద్యములు కవి రచించినవి. లేఖకుడుచెక్కినవి. కనుక లేఖదోషములు కలవు. అవి పరిష్కరించుకొనుట అవశ్యకర్తవ్యము. "భాషాప్రయోగ సంస్కరణలు" ఇష్టానుసారము జరుగవు. నియమానుసారముజరుగును. పరిష్కరణము వలన చారిత్రిక విషయములు బలికావు. సంస్కరణములేని, శాసనములోని ఏకదేశములను పట్టుకొని కావించిన అందదుకు సమన్వయములు బలికావచ్చును. అది నిష్కారణము కాదు; సకారణము. పరిష్కరణమునందు భ్రమప్రమాదములు కలవేని, అవి సవరించుకొనుమని కోరుట సముచితము. అపశబ్దములనుబట్టి, గణయతి ప్రాసభంగములను బట్టి అల్లుకొనిన అందదుకు చారిత్రిక సమన్వయములను, అచ్చమైన చారిత్రిక విషయములుగ స్వయము చాటుకొనుచు సవరించుకొనుమని కోరుట విపరీతము.

2. "శాసనపద్యార్థము నూహింపవలదని, సమకాలీన చారిత్రక విశేషములను గుర్తింపవలెనని మనవి చేసుకొనుచున్నాము."

శాసనపద్యార్థమేకాదు; ఏ పద్యార్థమును ఊహించునది కాదు. భాషాచ్ఛందో వ్యాకరణాద్యనేక విషయముల పరిజ్ఞానమును బట్టి గ్రహించునది. పద్యార్థము నిష్కృష్టమైన తదుపరి సమకాలిక చారిత్రిక సత్యముల పరిగణనము. బండిముందు, గుఱ్ఱము వెనుక కాదు.

3. "పద్యములలోనున్న దోషముల నన్నింటిని లేఖకున కొక్కనికే అంటగట్టిరి. శాసన రచయితపైనున్న గౌరవముచే నాతనికి దోషము లాపాదింప నిచ్చగించక వారిట్లు గావించియుందురు."

"పద్యములలో నున్న" అచ్చుతప్పులవంటి "దోషముల నన్నింటిని" లేఖకునికిగాక, కొన్నింటిని కవికి కూడ "అంటగట్ట" వలయును కాబోలు! కవిదోషములకు, లేఖకదోషములకు భేదముకలదు. అది సాహిత్య పరిజ్ఞానమువలన తెలియును. తెలియుటచేత లేఖక దోషములను కవికి "అంటగట్ట" లేదు. శాసనరచయితపై గౌరవముచేతకాదు. శాసన లేఖకునిపై అగౌరవముచేత కాదు. శాసన సాహిత్యముపై గౌరవముచేత.

4. "కన్నడ భాగమున దోషములు లేకపోవుటను బట్టి లేఖకుని లేఖన పాండిత్యమును అంతగా శంకింప పనిలేదు."

లేఖకుని లేఖనము పాండిత్య విషయముకాదు. లేఖకులు పండితులునుకారు. కవులు పండితులు కాకపోరు. కవిత్వము పాండిత్య విషయముకాకపోదు కవిదోషములు పాండిత్య విషయిక భ్రమప్రమాదములు. లేఖక దోషములు అపాండిత్య విషయిక వర్ణస్ఖాలిత్యములు. కన్నడ భాగమునందు లేఖకదోషములు లేకపోయినను, (ఉన్నవో, లేవో కన్నడ సాహిత్య పరిజ్ఞానము కలవారు తెలుప వలయును) తెలుగు భాగమునందు ఉండుటకు హేతువు, లేఖకుడు కన్నడభాషా పరిజ్ఞాత అగుట, తెలుగుభాషా పరిజ్ఞాత కాకపోవుట కావచ్చును. కారణాంతరమును కావచ్చును.

5. "తెలుగుభాషలో అంతగా పరిచయములేని లేఖకునిద్వారా కొన్ని చిక్కులు వచ్చియుండిన వచ్చియుండవచ్చును. కాని మొత్తమన్నింటికి నాతడే బాధ్యుడనుట అసమంజసము".

తెలుగుభాషలో అంతగాకాదు; ఎంతగా పరిచయమున్నను, లేకపోయినను, లేఖకుని వలన వచ్చునవి చిక్కులుకావు. తప్పులు.

అవి తెలియని పరిశీలకులవలని వచ్చునవి చిక్కులు. కవి దోషములకు కవివలె, లేఖక దోషములకు లేఖకుడే బాధ్యుడు అగును. కాదనుట అసమంజసము. లేఖక దోషములు కొన్నింటికి లేఖకుడు, కొన్నింటికి కవి బాధ్యుడు అనుట మిక్కిలి అసమంజసము. అచ్చుతప్పులు కొన్ని ముద్రాపకునివి, కొన్ని గ్రంథకర్తవి అనుటవంటిది.

6. "కన్నడ శాసనమును వ్రాసిన రచయితయే, తనకున్న పరిమిత పాండిత్యముతో నీ తెలుగు భాగము కూడ వ్రాసియుండెనని అనుమానించుటకు అవకాశమున్నది."

అనుమానించుటకు ఏమైన అవకాశముండును !— "అవకాశమున్నది" అనుటయేగాని, ఉన్నదనిన అవకాశమును ఉట్టంకించినదిలేదు. కనుక ఊహామాత్ర శరణ్యము కావలయును. అంతయును ఊహామాత్ర శరణ్యమే ! — రచయితకు పరిమిత పాండిత్యమును, లేఖకునికి పరిపూర్ణ పాండిత్యమును ఆపాదించుట విపరీతము. శాసనకాలమునందు కన్నడ కవులు తెలుగు పద్యములు వ్రాయుట "సమకాలీన చారిత్రక విశేషము" కాఁబోలు ! ఆ కాలమునకు ముందు వెనుకల - తెలుగు వారు కన్నడ కావ్యములు వ్రాసినట్లు, తెలుగు కవులు కన్నడ పద్యములు వ్రాసినట్లు ఆధారములు కలవుగాని, కన్నడిగులు తెలుగు కావ్యములు వ్రాసినట్లు, కన్నడ కవులు తెలుగు పద్యములు వ్రాసినట్లు ఆధారములు కానరావు.

7. "శాసనపు మొదటి పద్యమున పెద్ద మార్పులేమియు సూచింపలేదు."

కారణము పెద్ద లేఖక దోషములు లేకపోవుటమాత్రమే. ఉన్న చిన్న లేఖకదోషమునకు చిన్న మార్పు సూచింపఁబడినదికద.

8. "రెండవ పద్యమునుండి వీరి సంస్కరణ మొదలైనది... నామవాచకమైన 'విరియాలు'ను విడదీసి ఆతనిని 'భీమనృపఘస్మరుని'గా పేర్కొనిరి. అటువంటి యితర ప్రయోగముల నుదాహరించుచు కటుకూరు శాసనమునందలి "వీరనరేంద్రఘస్మరే" అను దానిని చూపిరి. కాని కటుకూరు శాసనమీయబడిన కాలము పదమూడవ శతాబ్ది ఆరంభము."

పదమూడవ శతాబ్ది ఆరంభములోని శాసన ప్రయోగము, పదునొకండవ శతాబ్ది ఆరంభములోని శాసన ప్రయోగమునకు ప్రమాణము కాదు కాఁబోలు ! ఏమి శబ్ద శాసన ప్రామాణిక బుద్ధి !- "భీమనృపఘస్మరుఁడై" అను సమాసము సాధ్యసమాసముకాదు. సిద్ధసమాసము. అది సంస్కృతభాషయందు పుట్టును. సంస్కృతభాష పుట్టినదిమొదలు నేటివఱకు మాత్రమే కాదు; ఏనాటి వఱకును "భీమనృపఘస్మరః" అను సమాసమునకు భీమరాజును సంహరించినవాడనియే అర్థము. "విరియాలభీమనృపఘస్మరః" అని సమాసమును గ్రహించినచో, విరియాల భీమరాజును సంహరించినవాడు అని మాత్రమే అర్థము వచ్చును. అది ప్రకరణ విరుద్ధము. అనన్వితము. కనుక పరిత్యాజ్యము.

9. "ఈ శాసనపు తొలి నాలుగు పద్యములు ప్రతిష్ఠాపన కాలము నాటివని అంగీకరించిన, సుమారు నాటికి రెండు శతాబ్దుల క్రిందటివగును. కనుక రెండు శతాబ్దుల తరువాతి ప్రయోగములను బట్టి యిచ్చట పదచ్ఛేదము జరుపుట పద్ధతికాదు. అట్లు జరుపుటయే వారికభీష్టమైనచో సమకాలీనుడై, తత్ప్రాంతమున విరియాలుతో కలహించి నశించిన "భీమనృపు" నొక్కనిని శాసన ప్రమాణముతో చూపవలసి యున్నది."

తొలి నాలుగు పద్యముల రచనాకాలము స్థూలముగ 1005వ సంవత్సరము, లేఖనకాలము 1124వ సంవత్సరము అని పూర్వోక్తము. తన్మధ్యకాలము రెండు శతాబ్దులా ? 1124 - 1005 ఎంత? 119. వింశోత్తర శతాబ్దికిని ఒకటి తక్కువ. లెక్కలుకూడ రావుకాఁబోలు!- "రెండు శతాబ్దుల" తర్వాతివి లేఖనములా? ప్రయోగములా?- రెండు శతాబ్దుల తర్వాతి లేఖనములను బట్టి ఇచ్చట పదచ్ఛేదము చేయుట పద్ధతికాదా? ఏల?- నన్నయ భారతమునకు లభించిన తాళపత్ర గ్రంథములు రెండు శతాబ్దుల తర్వాతివికావు; నాలుగైదు శతాబ్దుల తర్వాతివి. కనుక నన్నయ భారతములోని పద్యములకు పదచ్ఛేదము చేయుట పద్ధతి కాదన్నమాట! ఇట్టి విపరీత సిద్ధాంతములు చేయుట మాత్రమే పద్ధతి కాఁబోలు!- పదచ్ఛేదము చేయకుండ పద్యార్థము ప్రత్యక్షము కాదు. అయినదనుకొనుటవలని అనర్థకము.

విరియాలు సంహరించిన భీమనృపుని శాసన ప్రమాణముతో చూపవలసియున్నచో, మఱి విరియాల సూరడు కాపాడిన రవ్వనృపుని, రాపాడిన భీమనృపుని కూడ శాసన ప్రమాణములతో చూపవలయును.

10. "శాసనమునుబట్టి 'పాండవ మధ్యమ భీముని పోలిన విరియాల భీముడ'ని చెప్పవలెను. 'భీముడు' అని తత్సమముగా ఆ పదము లేకపోవచ్చును. 'విరియాలుడ'ని కూడ లేదు. కనుక 'విరియాలభీమ' అనునది ప్రథమైక వచనములో తత్సమ రూపమని అంగీకరించవలెను."

శాసనమును బట్టి "పాండవ మధ్యమ భీముని పోలిన విరియాల భీముడు" అని చెప్పరాదు. "పోలిన" అనుటకు పద్యమునందు ఉపమాలంకారము లేదు. ఉత్ప్రేక్షాలంకార ముకలదు. "విరియాల భీముడు"

అనుటకు "భీమ" అను పదమునకు [illegible] లేదు. [illegible]

కన్నడభాష యందునులేదు. ఒరియా భాషయందు కలదు. కాని శాసన భాష ఒరియాభాషకాదు. ఒరియా సంబంధము సమకాలిక చార్త్రిక సత్యముకాదు. "భీముడు" అనియే తత్సమముగా ఆ పదము తెలుగుభాష యందుకలదు. ఉండవలయును. అట్లు"విరియాలుడు" అనిఉండనక్కఱ లేదు. "విరియాలు" అని కూడ ఉండవచ్చును. అది సాంస్కృతికము. ఇది ఆచ్ఛికము. "భీమ" అని లేదు. ఉండదు. కనుక "విరియాల భీమ అనునది ప్రథమైక వచనములో తత్సనురూపమని అంగీకరింప" రాదు. శబ్దజ్ఞానము కల ఎవ్వరును అంగీకరింపరు. ఇది చరిత్ర పరిశోధకులకు మహాబధిరశంఖారావమే అయినచో, "అపశబ్ద భయం నాస్తి అప్పలాచార్య సన్నిధౌ" అని మాత్రమే అనుకొనవలయును. అథవా, చరిత్ర పరిశోధకులు సదృశమైన సమకాలికశాసన ప్రయోగాంతరమునైన చూపవలయును.

పద్యమునందు "పాండవమధ్యమ భీముఁడోయనంగా విరియాలు భీమనృపుఁడుస్మరుఁడై యుదయించె" అని ఉండవలయును. ఇందలి "ఓయనంగా" అనునది ఉపమావాచకము కాదు. ఉత్ప్రేక్షాసూచకము. ఉపమాలంకారముగాక, ఉత్ప్రేక్షాలంకారము ఎందుకు కలదు ? అని ఆయోజించినచో, ( ఆయోజనము పద్యార్థమును గ్రహించు పద్ధతి ) సంహరింపఁబడినవాడు పేరునకు భీముడు, సంహరించినవాడు తీరునకు భీముడు అనియే అభివ్యక్తమగును. ఛందోవ్యాకరణాలంకారాది విశేషములను గ్రహింపని అర్థము పద్యార్థము కాదు. అద్యతన చరిత్ర అగును కాఁబోలు !

11. 'ఇక మూడవ పద్యము... సంస్కరణమున బడి అర్థము మారిపోయినది. ఫలితముగా కాకతీయ ముదిగొండ చాళుక్య చరిత్రలో ముఖ్యమనదగు ఘట్టము నిష్కారణముగా బలియైపోయినది."

పరిష్కరణము వలన మారిపోయిన అర్థము, బలియైపోయిన కాకతీయ ముదిగొండ చాళుక్య చరిత్రలో ముఖ్యమనదగు ఘట్టము వీరి మాటలతోనే వీరు ఒకసారి "కల్పించి"నది. మఱొకసారి "సరిచేసి" నది. తర్వాత మఱొకరు ఖండించినది.[2] ఇట్లు కల్పించునది, సరిచేయునది, ఖండింపఁబడునది చరిత్ర అగునా? చరిత్రాభాసమగును.

12. "'తత్తనెయురు' అను శాసనపదము, 'తత్తతనయు' అని యుండవలెనని వీరి సంస్కరణ."

అవును. శాసన పదము కాదు శాసన లేఖనము. కారణము, "తత్తనెయురు" అను శాసన లేఖనము ప్రాసస్థలమునందు కలదు. పద్యమునందు తకారము ప్రాసము. కనుక "తత్తతనయు" అని ఉండి తెలుగు పద్యము

ప్రాసభంగము కవికృతము కాదు. కారణము కన్నడమునందును ప్రాసము కలదు. ప్రకృత శాసనములోని కన్నడభాగమునందు ఏడు పద్యములు కలవు. ఏడు కన్నడ పద్యములందును ప్రాసకలదు. ఏడవ పద్యము నందు మాత్రము ఒకచో విలక్షణముగ కలదు.[3] అది లేఖక దోషమో, ముద్రణదోషమో, కన్నడ గుణమో కన్నడ సాహిత్యవేత్తలు తెలుపవలయును.

ఎనిమిదవ శతాబ్ది గుణకవిజయాదిత్యుని లేక పండరంగని అద్దంకి శాసనము మొదలు పందొమ్మిదవ శతాబ్ది మండల తమ్మన్న శ్రీకూర్మశాసనముల వఱకును గల శతాధిక పద్యశాసనములందు సహస్రాధిక లేఖకదోషములు కలవు. అందు పద, గణ, యతిమైత్రి, ప్రాస భంగములును కలవు. అవి కవి దోషములు అని గాక, లేఖక దోషములు అనియే లెక్కించి జయంతి రామయ్యపంతులుగారు సూచించిన పరిష్కృత పాఠములు కలవు.[4] సుష్ఠుపాఠములనుగాక "భ్రష్ఠ" పాఠములను పట్టుకొని ప్రాకులాడుట దయనీయము.

కవిదోషముకాని, "తత్తనెయురు" అను లేఖకదోషమునకు "తత్తతనయు"అనుసాధు పాఠమునుగాక, మరొక సాధుతర పాఠమును ప్రాసభంగములేని ఇతరదోషమురాని పాఠమును- సూచించినచో, అవశ్యము పరిగ్రాహ్యము. వట్టినే "కవిపాఠములుగా భ్రమింపజేయుటకు చేయుచున్న ప్రయత్నమిది. నిరసింపదగినది" అని ఎంతవదరినను ప్రయోజనము సున్న. అపపాఠములను కవిపాఠములుగ, అపసిద్ధాంతములను స్థిరసిద్ధాంతములుగ [illegible] పాఠకులు బాలురుకారు.

13. "వీరు పూర్వపు పండితాభిప్రాయములను మన్నించుటగాని ఖండించుటగాని జరుగలేదు".

పరిష్కరణమునకు, అర్థవివరణమునకు సంభావ్య సమన్వయమునకు ఉద్దిష్టమైన వ్యాసము, పూర్వపండితాభిప్రాయముల ఖండన మండనములకు విషయముకాదుగాని, అవి గతార్థములే. అంతేకాదు. పండితాభిప్రాయములు సంభావ్యములైన సమన్వయములు మాత్రమే. వితండ వాదములు, విపరీత సిద్ధాంతములు కావు. ఉపరి ప్రమాదపతితములకు పండితులను చీల్చిచెండాడుట ప్రాజ్ఞ లక్షణముకాదు.

14. "'తత్తనెయురు' అనుపదమునకు ముందున్న 'ప్రతిష్ఠసేసి'అను పదమును'పేరు'కు ముడిపెట్టి,పేరు ప్రతిష్ఠచేసి అని అన్వయించి 'నిలబెట్టి' అని అర్థము చెప్పుట జరిగినది. కాని పద్యమునందు 'ప్రతిష్ఠసేసి' అనునది కొరవిదేశమున 'ప్రతిష్ఠింప' బడిన బొట్టు బేతనికి సంబంధించి నట్టిది".

చెప్పుమనక ప్రతిపదార్థము, తాత్పర్యము అని ప్రక్రియగాక "దండాన్వయము" అని ఒకటి కలదు. అది తెలిసిన, "ముడిపెట్టి, అన్వయించి, అర్థముచెప్పుట జరిగినది" అని వృథా వాగ్వ్యయము చేసి కొనుట జరగదు. "చేకొన్న బొట్టు బేతరాజు పేరు కొరవి దేశమునందు నిలబెట్టి" అనియే చెప్పిన అర్థము.[5]

15. "ఇక నాల్గవపద్యము. దీనికిని మూడవపద్యమునకు ఆంతరిక సంబంధము కలదు. దీనికిని రెండవపంక్తిలో తొలిభాగము కొద్దిగా పగిలిపోయినది. ఇచ్చటి పదము 'మేల్గరుడని' అని పేర్కొనిరి."

ఇట "ఆంతరిక సంబంధము" కలదని, స్థలాంతరమున మూడు, నాలుగు పద్యములు ఒక్క ప్రకరణమనుటను కాదనుట స్వవచోవ్యాఘాతము. "ఆంతరిక సంబంధము" ఆకాశమునుండి ఊడిపడదు. ఏకప్రకరణమైననే ఏర్పడును.

ఇక రెండవ పంక్తిలో తొలిభాగము ఎంత పగిలిపోయినను, ఎప్పుడు పగిలిపోయినను, అక్కడ ఒక్క అక్షరముకూడ చెక్కుచెదర లేదు. "మేల్గరుడని" అని స్పష్టముగ కలదు. అయిదవ పద్యమునందు "మేలుగ" అను నాలుగు స్థలములందును "మే" ఎట్లు కలదో, "మేల్గరుడని" అను చోట కూడ "మే" అట్లే కలదు. దీర్ఘము అయిదు స్థలము లందును లేదు. అంతేకాదు. "ల" యొక్క ఎడమప్రక్క పిసరంత ప్రిదిలినను, "ల" స్పష్టముగ కలదు. అది "య" శేషము కాగల అవకాశము లేదు. ఉపరి "ల" క్రింద "గ" ఒత్తుకలదు. ఇది యెల్ల శాసన ప్రతిబింబమును కంటితో చూచిన కనిపించక పోయినచో, మరి "భూతద్దముతో" చూచిన స్పష్టముగ కనిపించును. శాసనప్రతిబింబమునకు దీర్ఘకృతచ్ఛాయాపటము తీయించిచూచినచో, ఇంకను స్పష్టతరముగ కనిపించును. అట్టి "మేల్గరుడని" అను పదబంధము శాసనము నందు లేదనుట, లేనట్లు ఉదాహరణము నందు "ల్గ" కుండలీకరించుట, ఇట్లు పేర్కొనిరని అంగలార్చుట, "అహో! మూలచ్ఛేదీతవ పాండిత్య ప్రకర్షః" అనిపించునది మాత్రమేకాదు; ఆత్మ వంచనముతోపాటు జగద్వంచనము కూడ. అక్షంతవ్యము.

వా పక్షముగ "మేల్గరుడని" కాదు "మెయ్గరుడని" అని వాదించినను, పద్యమునందు "గరుడని" అను పదము అపరిహార్యము. అది గరుడు + అని = గరుడని. అని పదచ్ఛేదముకాదు. గరుడని అనుపదము ద్వితీయాంత విశేషణము. ఇది తెలిసిన, బహ్వర్థములు భాసించును. "గరుడని బేత భూవిభుని" అను పంక్తికి గరుడబేతరాజు అనియే అర్థము.

... ...

పదచ్ఛేదము చేసినయెడల దీనిముందున్న 'మేల్' నకు ఏమి అర్థము చెప్పవలసి యుండును?"

ఇది "రామాయణ మంతయు విని రామునికి సీత ఏమగును?" అని ప్రశ్నించినట్లు కలదు. 'మేల్' అనునది లుప్తరూపము. అచ్చతెనుగు పదములందు పదాంతమందలి డ,ల,ట,ర, ల ఉత్వమునకు లోపము రావచ్చును. మేలు అనునది పూర్ణరూపము. అసలు శబ్దము. అందరికిని తెలిసిన అచ్చతెనుగు శబ్దము. ఆ శబ్దమునకు ముందు "కామవసాని యొక" అని శాసన లేఖనము. అది లేఖక దోషము. "కామవసాని యొక్క" అని కవి పాఠము. కామవసానియొక్క మేలు అనగా ఉపకారమని అర్థము. కామవసాని కారణమైన ఉపకారమని తాత్పర్యము. ఇంత స్పష్టార్థప్రతిపత్తికల సరళవాక్యమునకు సహితము అర్థము తెలియకుండ, అకాండ తాండవము చేయుట అత్యంత శోచనీయము.

17. "ఇన్ని శ్రమలుపడి యీ మేలును కామవసానియొక్క మేలుగా చెప్పి దీనిని, గరుడ బేతగా చిత్రింపవలసిన ఆవశ్యకత ఏమి వచ్చిపడినది?... కాకతి వంశీయుడైన రెండవబేతనితో యీచారిత్రకాంశము సమయానుకూలమై యొప్పుచుండ, యింత నిష్కారణ నిరర్థక ప్రయత్నము దేనికి?"

పద్యమునందు "కామవసానియొక్కమేలు" అని కలదు. కనుక అది కామవసానియొక్క మేలు అనిచెప్పుటకు శ్రమలు పడవలసిన ఆవశ్యకము వచ్చిపడదు. కాదని చెప్పుటకే అన్ని శ్రమలు పడవలసిన ఆవశ్యకము వచ్చిపడును. పద్యమునందు "గరుడని బేతభూవిభుని" అని కలదు. కనుక గరుడబేతనిగా చిత్రింపవలసిన ఆవశ్యకము వచ్చిపడదు.



ఇది శాసన ప్రతిబింబమునకు దీర్ఘకృతచ్ఛాయాపటము. మూడవపంక్తి చివరి అక్షరము "మె". అది "మే" అగును. ఇక నాల్గవపంక్తి మొదటి నాలుగు అక్షరములు "ల్గరుడని." కనుక "మేల్గరుడని" కవి పాఠము.

గరుడ బేతడు కాడనుటకు మాత్రమే చింతింపవలసిన ఆవశ్యకము వచ్చి పడును. పద్యములోని చారిత్రికాంశము "కాకతి వంశీయుడైన గుండవ బేతనితో సమయానుకూలమై యొప్పుచుండ" లేదని, వీరి సంయుక్తాభిప్రాయము 'చరిత్రను మార్చుచున్న'దని శ్రీ పి.వి. పరబ్రహ్మశాస్త్రిగారి ప్రత్యాఖ్యానము కలదు.[7] దానికి సమాధానమీయక ఈ "నిష్కారణ నిరర్థక" దుస్సాహస దురర్థక ప్రయత్నము దేనికి?- "శ్రీ శాస్త్రిగారి చర్చకు మేమింకను సమాధాన మీయవలసియున్నది. కనుక ప్రస్తుతమున కది విషయముకాదు" అనిన సరిపోవునా ? అది ప్రస్తుతమునకు విషయముగాక అప్రస్తుతమునకు విషయమా?- పరబ్రహ్మశాస్త్రిగారి ప్రత్యాఖ్యానము వెలువడి పదియేను నెలలు గడచినవి. ఇంకను సమాధానము లభింపలేదు కాఁబోలు!

18. "ఇచ్చట 'అరుదగునట్టి' అను పదము ఎఱ్ఱనృపునంగన కామవసానికి సంబంధించినది. అసామాన్యురాలైన కామవసాని అని భావం. కాని దీనిని కామవసాని యొక్క 'మేలు'కు ముడిపెట్టిరి. ఆ 'మేలు' పైన పేర్కొనబడిన 'మేల్గరుడని' డింపం విడగొట్ట

ఇచ్చట అనగా స్పష్టార్థప్రతిపత్తికల సరళవాక్యమున పాఠము అర్థము కానిచోట! ఆ చోటు "అరుదగునట్టి ఎఱ్ఱనిపునంగనగామవసాని యొక మేల్గరుడని" అను లేఖకుని లేఖనము, "అరుదగునట్టి యెఱ్ఱనృపునంగన గామవసానియొక్క మేల్గరుడని" అను పరిష్కృతపాఠము. ఇందు "అరుదగునట్టి అను పదము కామవసానికి సంబంధించి, అసామాన్యురాలైన కామవసాని అని భావ" మైనచో, "యొకమే" అను లేఖకుని లేఖనముతోపాటు "యొక్కమేలు" అను కవి పాఠమునకును డొక్కశుద్ధి ఉండదు. అది "యొక్కమేలు" కాదు మఱొకటి అని చెప్పినది లేదు. చెప్పఁగలిగినదిలేదు. "ముడిపెట్టిరి"అని మోరకించుటయే గాని, ముడి విప్పినది లేదు. విప్పఁగలిగినది లేదు. "విడగొట్టబడినది" అని విహ్వలించుటయేగాని, విడగొట్టకుండ సరియైన అర్థము చెప్పినది లేదు. చెప్పఁగలిగినదిలేదు. అసలు పదములను విడఁగొట్టకుండ పద్యములకు అర్థము చెప్పుట ఆకాశ చిత్రలేఖనము. "పదచ్ఛేదము" అను పద బంధమునకు కూడ అర్థము తెలియదు కాఁబోలు!- "అరుదగునట్టి యెఱ్ఱనృపునంగన గామవసానియొక్కమేలు" అను వాక్యమునందు "అరుదగునట్టి" అను విశేషణము "మేలు" అను విశేష్యమునకు అన్వయించునని విశేష్యవిశేషణ సంబంధ పరిజ్ఞానము కలదేని తెలియును.

ఇటు "అరుదగునట్టి" అను పాఠమునకలదు.[8] అది కవి పాఠమైనచో, కామవసానియొక్క మేలు అరుదగునట్టి అని మాత్రమే అర్థము వచ్చును. కామవసాని అరుదగునటు అని అర్థము రాదు. అంటఁగట్టిన తెలుగు నుడికారము కాదు. ఇంగ్లీషు పలుకుబడి అగును. "బొట్టుబేత, కాకతిచేత" అనుట కూడ ఇంగ్లీషు దుష్ప్రభావమే.

19. "బల్లహరాయనియోగిని ఆశ్రయించునది, చక్రవర్తియైన భాస్కరరవిభుని దర్శించునది, ఆ కాలమునందు స్త్రీ కాదని పేర్కొన్నారు... కాకతీయ రాజ్య చరిత్రలో స్త్రీలు నిర్వహించిన పాత్రను గుర్తించిన ఎవ్వరునూ పై వాక్యము నంగీకరింపరు. సిద్ధేశ్వర చరిత్రాది కథనములు కూడ పై చారిత్రక సంఘటనలను తలపింపజేయుట గమనింపదగినది."

పయి వాక్యములోని ఆశ్రయణము, అన్యరాజ్య సందర్శనము రాయబారమునకు సంబంధించినవిగ పద్యమునందు ప్రతీయమానము. కాకతీయరాజ్యచరిత్రలో స్త్రీలు నిర్వహించిన పాత్రను గుర్తించినవారు రాయబారము నెరపిన స్త్రీల చరిత్రను తెలిపిన, అవశ్యము స్వీకార్యము.

(సిద్ధేశ్వర) చరిత్రాది కథనములందు ఎఱుక దేవరాజు మేనత్త కుంతలిదేవి గుజరాష్ట్ర 'మహారాష్ట్ర' ఘూర్జర యవనరాజులపై దండు వెడలి వారినోడించి, మరల దండెత్తివచ్చిన కటకబల్లహుని గంగిదేవుడను సేనాధిపతిచేత చంపించి, పందొమ్మిదేండ్లు రాజ్యముచేసినట్లు కలదు.[9] రాజ్యకాలమును కలదు.[10] మఱి కాకతీయ సామ్రాజ్య చరిత్రకారులు రుద్రమదేవిపేర అధ్యాయమువలె, కుంతలిదేవిపేర అధ్యాయము కాదు- కనీసము- ఒక పరిచ్ఛేదమునైన వ్రాయలేదేమి? ఇక వ్రాయుదురు కాఁబోలు!

సిద్ధేశ్వర చరిత్రాది కథనములు "పయి చారిత్రకసంఘటనలను తలపింపజేయుట గమనింపదగినది" అయినచో, అవి మొదటి కాకతి బేతరాజు కాలమునందు జరిగినట్లును మఱి గమనింప వలయునుగదా! అనుకూలమైనది ప్రమాణముగ, ప్రతికూలమైనది అప్రమాణముగ ఒకే విషయమును పరిగణించుట అర్ధజరతీన్యాయదోషమునకు లక్ష్యీభూతమగును.

20. "వారి అభిప్రాయమున యీ ఘనకార్యములన్నియు ఎఱ్ఱనవే"

అవును. అందుకు హేతువు పద్యమునందు "తాను" అను సర్వనామము కలదు. అది ఎఱ్ఱ నరేంద్రునికి ఎట్లు అన్వయించునో పూర్వోక్తము.[11] కామవసానికి అన్వయించునది కాదని చెప్పక పోవుటకు హేతువు, అట్లు తలపోయువారు కూడ ఉందురని, ఉన్నను తలయెత్తుదురని తలంపక పోవుట మాత్రమే. ప్రకరణమును వదలి పద్యార్థమును గ్రహించుట నిరాలంబనృత్యము. పదములను వదలి వాక్యాన్వయము చేయుట తల్లకిందు తాండవము.

"పై మూడు, నాలుగు పద్యముల నొక్క ప్రకరణముగా చెప్పి, రెండింటిలో వర్ణితములైన ఘనకార్యములను ఎఱ్ఱ నరేంద్రునివిగా వివరించినారు. కాని అది అంగీకార యోగ్యమైన వివరణ కాదు. మూడవ పద్యమున ఎఱ్ఱ నరేంద్రుడు బాధ్యత వహించిన కార్యమును, నాల్గవ పద్యమున కామవసాని చేబూని సాధించిన దుర్ఘటరాజకీయ బాధ్యతను వర్ణించుచున్నవి."

అర్థవివరణలకు అంగీకార యోగ్యతాయోగ్యతలు నిర్ణయింప వలసినది పద్యార్థము. పదార్థము తెలియనివారుకారు. తెలిసినవారు, మూడవ పద్యము ఎఱ్ఱ నరేంద్రుడు బాధ్యత వహించిన కార్యమును, నాల్గవపద్యము - కామవసాని చేబూని సాధించిన దుర్ఘట రాజకీయ బాధ్యతను వర్ణించుచున్న"చో, భార్యాభర్తలైన కామవసానికి ఎఱ్ఱనరేంద్రునికి విడాకులు ఈయవలయును. అథవా, ఎఱ్ఱనరేంద్రుని చంపవలయును. అదికూడ జరుగకపోలేదు. "ఇట్ మే బి దట్ . ఎఱ్ఱ హెస్ట్ అవే. బిఫోర్ హి కుడ్ కన్సాలిడేట్ హిజ్ వర్క్" అని ఖండవల్లి లక్ష్మీరంజనము గారి అభిప్రాయము.[12] కాని, "విరియాల ఎఱ్రన కాకతిబేతరాజ శత్రువులను నిర్మూలించి అతనిని కొరవి దేశమునకు ఏలికగ ప్రతిష్టించెను. ఈ యెఱ్రన భార్య కామవసానిగూడ ఇతనికి సాయముచేసి కాకతి వంశమును సుప్రతిష్ఠితము చేసెను." అని మారేమండ రామారావుగారి అభిప్రాయము.[13] "తెలంగాణములోని గూడూరు శాసనము ప్రకారము విరియాల వంశజుడగు ఎఱ్ఱమాపతి కాకతి బేతనృపాలుని శత్రువును నిర్జించి, యాబేత వసుధాధిపుని కొరవిదేశమునందు ప్రతిష్ఠ జేసెననియు దెలియుచున్నది". అని కుందూరి ఈశ్వరదత్తుగారి అభిప్రాయము[14] కూడ. ఇవి "పూర్వపు పండితాభిప్రాయము"లే. అపండితాభిప్రాయములు కావు. ఇట్టివింకను కలవు.

22. "పొరపాటున ఎఱ్ఱడు చంపిన కొరవియందలి శత్రువే ముదిగొండ చాళుక్యరాజుకావలెనని పేర్కొనిరి".

పొరపాటునకాదు. శాసన పద్యార్థమున. అది పూర్వోక్తము.[15] పద్యార్థము తెలిసిన ఖండవల్లి లక్ష్మీరంజనముగారి అభిప్రాయమును[16] అదే. "విరియాల ఎఱ్ఱ డిఫీటెడ్ దిస్‌లోకల్ ఛీఫ్‌టెన్ (పెర్‌హేప్స్ వుయ్ హేవ్‌టు లుక్ ఫర్ హిమ్ ఇన్ ది ముదిగొండ చాళుక్యాస్) అండ్ ఎస్టాబ్లిష్ బేత I ఇన్ ది కొరవి సీమ". ఇందలి బేత I మొదటి కాకతి బేతరాజే. ఇది కూడ "పూర్వపు పండితాభిప్రాయమే". అపండితాభిప్రాయముకాదు.

23. "కాకతి బేతడట్టి నిస్సహాయస్థితికి చేరుటకు మూలకారణమే ఆ విరియాల ఎఱ్ఱడు... పై పద్యమున చెప్పబడినట్లు అతడు కొరవి దేశమున కాకతీయులకు స్థానము లేకుండ చేయుట వలననే యీ స్థితి యేర్పడినది. తమ బాంధవ్యమును పురస్కరించుకొని కామవసాని నడుముకట్టి కాకతి రాజ్యపునర్వ్యవస్థీకరణకుద్యమింపవలసి వచ్చినది."

కాకతి బేతరాజు నిస్సహాయస్థితికి మూలము విరియాల ఎఱ్ఱడని శాసనమునందులేదు. కాకతి వల్లభుడైన బేతరాజు పిన్నవాడు అని మాత్రమే కలదు. విరియాల ఎఱ్ఱడు కాకతీయులకు కొరవి దేశమునందు స్థానము లేకుండచేసినట్లు "పై పద్యమున చెప్పబడి" లేదు. ఆ పద్యములోని బొట్టుబేత వసుధాధిపుడు ముదిగొండ చాళుక్యరాజుఅనీ, అతని శత్రువు కాకతీయరాజు అని కల్పించిన అద్యతన కథనములందు మాత్రమే "చెప్పబడి" కలదు. అట్లు చెప్పిన భర్త విరియాల ఎఱ్ఱడు కొరవిదేశమునందు, భార్య కామవసాని అనుమకొండ దేశమునందు ఉండి కాపురము చేయవలయును. అథవా కథలు అల్లవలయును. భర్త విరియాల ఎఱ్ఱడు కాకతీయ మహారాజును "ఉద్ధృతముగ" చంపగా' భార్యకామవసాని కాకతీయ యువరాజును ఉద్ధరించుటకు కారణము"తమ బాంధవ్యము" అయిన, మఱి కామవసానికి - కాకతీయయువరాజుతోనే గాని, భర్తవిరియాల ఎఱ్ఱనితో బాంధవ్యము లేదు కాఁబోలు ! అంతే కాదు. భార్యాభర్తృ సంబంధము "తమబాంధవ్యము"కాదు కాఁబోలు !! ఉపరి వీరు గుర్తించిన, కాకతీయ సామ్రాజ్యచరిత్రలోని, స్త్రీలు నిర్వహించిన పాత్రలో- భర్తతోడి బాంధవ్యమును తెగతెంపులు చేసికొని, భూభర్తతోడి బాంధవ్యమును మాత్రమే పునరుద్ధరించుకొనుట కూడ కలదు కాఁబోలు!!! ఇట్టి దురర్థములకు దోహదము చేయు చారిత్రిక సమన్వయములు దురదృష్టము.

24. "ఇందు ప్రస్తావింపబడినవి యిరువురు శత్రువుల రాజకీయమునకు సంబంధించిన భిన్నవిషయములు."

ఇట్లు చెప్పుటకు పద్యార్థప్రాప్తిని మాత్రమేగాక, ప్రమాణాంతరమును కూడ చూపవలయును. స్వీయచరిత్రకాదు. ఇదే ప్రమాణమైనచో, పద్యార్థ గ్రహణశక్తి రహితమగును. అంతేకాదు. అన్యోన్యాశ్రయ దోషదూషిత మగును.

25. "ముందు పద్యమున శత్రుసంహారము జరుగగా, తరువాతి పద్యమున అన్యసహకారము లభించినదట"

ఇది వక్రీకరణము. శత్రుసంహారము పద్యమునందు జరుగదు. యుద్ధమునందు జరుగును. అన్యసహకారమును పద్యమునందు లభింపదు. రాయబారమునందు లభించును. "అన్యసహకారము లేని శత్రుసంహారము మూడవపద్యమునందు అసహాయశూర లక్షణమేకాని, శత్రుసంహా

రేపుచేసి అన్యసహకారము నాల్గవ పద్యమునందు వర్ణము' అని పూర్వోక్తము! అర్థముకాలేదు కాఁబోలు! ఏది అర్థమయినది కనుక ఇది అర్థము అగుటకు? కాకతి వల్లభుని చేతఁబట్టుటకు, కాకతి (వంశము)ను నిలుపుటకు "బల్లహరాయనియోగిని" ఆశ్రయించినది, భాస్కరవిభు చక్రవర్తిని సందర్శించినది ఎందుకు? ఎత్తుకొనుటకు ,ముద్దుపెట్టుకొను టకు కాదు, శత్రుసంహారమునకు. అది నాల్గవ పద్యమునందు లేదు. మూడవ పద్యమునందు కలదు. ముందు శత్రుసంహారమును చెప్పి, తర్వాత తదర్థమైన అన్యసహకారమును వివరించుట-కార్యమును ముందుచెప్పి, కారణమును తర్వాత వివరించుట క్రమవిరుద్ధముకాదు, తర్కసహము. సంస్కృతాంధ్ర కావ్యములు చదివిన తెలియును.

26. "గతములో...మేమును ముదిగొండ చాళుక్యవంశమున తత్కాలమున కానక (బొట్టు బేతరాజును) యీ అవసరము గడుపుటకై ఒకనిని క్రీ॥శ॥ 985 - 1000 ప్రాంతమున కల్పించితిమి. కాని తర్వాత యిందలి విషయములన్నియు శాసనములందు కానవచ్చుచున్న తర్వాత బొట్టు బేతరాజునకు సరిపడుటచే పై సన్నివేశమును క్రీ॥ శ॥ 1075 - 1110 ప్రాంతమున నున్న బొట్టు బేతరాజునకు సరిచేసితిమి."

ఇందు "అవసరము గడుపుటకై", "కల్పించితిమి", "సరి చేసితిమి" అను పదరాజములు అవశ్యగమనార్హములైనవి. గతములో కల్పనము! వర్తమానములో సరిచేత !! కలనేత. భవిష్యత్తులో ?- దిద్దుబాటు కాఁబోలు !!! చరిత్ర ఇంత చపల చిత్తమా? ఇంతకు, గూడూరు శాసనమునందలి విషయములు ఇతర శాసనములందు "కానవచ్చినవి" అన్నవి తమకు అనుకూలమైనవి, ప్రతికూలమైనవి కావు. వీరి కాలనిర్ణయము ప్రకారమైనను, ముదిగొండ చాళుక్యులందు 1075వ ప్రాంతమునందు బొట్టు బేతరాజు లేడు. వట్టి బేతరాజు కలడు. అతడు బొట్టు బేతరాజు అని సొంత ఆపాదనము!- ఇన్ని పల్లటీలు కొట్టుటకు హేతువు పద్యార్థగ్రహణశక్తి లేకపోవుటమాత్రమే కావలయును. అథవా, "తాఁబట్టిన కుందేటికి మూడేకాళ్లు" అను దృఢ నిశ్చయము కావలయును.

27. "అందు-(క్రివ్వాక శాసనమునందు) ఇరువురు బేతరాజులు కలరు. మా కాలనిర్ణయమునసరించి మొదటి బేతరాజు క్రీ॥శ॥ 1075-1100 ప్రాంతము వాడగును. రెండవ బేతరాజు క్రీ॥శ॥ 1125-1150 ప్రాంతము వాడగును... అయితే వీరు'కొరవిపురవల్లభులు'గా తెలియుచున్నను, ప్రత్యేకముగా నాతనికి 'బొట్టు' శబ్దముపేరు ముందులేదు. కాని తరువాత మాడు నత్తరామేశ్వర, శ్రీకాకుళ శాసనములల బట్టి తమ నామములందుంచుకొనుటను బట్టి... వీరి సమీప పూర్వీకుడైన బేతని కూడ బొట్టుబేతగ పరిగణించుట జరిగినది. కనుక ఆ కాలమునకు సరిపడునట్లు ముదిగొండ చాళుక్యవంశములోని బొట్టుబేతని గూర్చిన శాసన ప్రమాణ మున్నది."

ఇదా శాసన ప్రమాణము అనగా ?! ఏ కాలమును అనుసరించి సరిపడు శాసన ప్రమాణము? "మా కాలనిర్ణయమునసరించి" అను మాటనుబట్టియే అది మఱొకరు అంగీకరించిన కాలనిర్ణయము కాదని అభివ్యక్తమగుచున్నది. అంతేకాదు. వీరి కాలనిర్ణయము "పురుషాంత రమునకు 25సంవత్సరముల ననుసరించి "నదని,"మెకానికల్ పద్ధతిలో చేయబడిన"దని పరబ్రహ్మశాస్త్రిగారు ప్రక్కను బెట్టినది.[17] శాసన ప్రమాణములను బట్టి తెలిసిన అంశములకు, తరమునకు 20మొదలు 40 సంవత్సరముల వఱకు పరిగణించి సమన్వయించుట ఇదివఱకటి చారిత్రిక పద్ధతి. తరమునకు 25 సంవత్సరములు మాత్రమే పరిగణించి, శాసన ప్రమాణములను బట్టి తెలిసియు తెలియని అంశములను సరిపెట్టుట ఇప్పటి చారిత్రిక పద్ధతి కాఁబోలు! 40 సంవత్సరముల పరిగణనము "అసాధారణమైనది కనుక పరిహరింప దగినది" అనుట ప్రసిద్ధ చారిత్రిక పద్ధతికి విరుద్ధము. అట్లు పరిగణించిన సందర్భములు మాత్రమే కాదు; పరిగణింపనిచో, పంగతములు కాని సందర్భములును కలవు. అంతేకాదు. ప్రాచీన కాలమునందు బహు భార్యా నిషేధ శాసనములు, సంతాన నిరోధ శాసనములులేవు. సంతాన సాగర శాసనములే కలవు. సంతాన నిరోధక వ్రతము సాగుచున్న ఈ కాలమునందే 40వ ఏట సంతానము కలుగుచున్న సంసారములు కలవు. "ఫ్రమ్ నోన్ టు అన్‌నోన్" కాని, "ఫ్రమ్ అన్ నోన్ టు నోన్" కాదు. గత్యంతరములేనిచో, తరముల పరిగణనమును తప్ప సరియేగాని, అది స్థిరముకాదు. చరము.

ఇంతకు, "నత్తరామేశ్వర, శ్రీకాకుళ శాసనము"లను బట్టి క్రివ్వాక శాసనములోని రెండవ బేతరాజునకు "బొట్టు" పెట్టనక్కఱ లేదు. అతనికి "బొట్టు" క్రివ్వాక శాసనమునందే కలదు. శాసనములను చూడగానే సరికాదు. సరిగా చూడవలయును. అంతేకాదు సరిగా అర్థము చేసికొనవలయును. క్రివ్వాకశాసనములోని వాక్యమిది:[18]

> "కుసుమాయుధు (ధు) నకు విని (నీ) త జన్మాస (శ్) యుఞెన బొట్టు బేతభూపాలుణ్ణ జనిమిం (స్మిం) చె."

ఇట్లు పరబ్రహ్మశాస్త్రిగారి శాసన పాఠమునందు మాత్రమేగాక శాసన ప్రతిబింబమునందును కలదు.[19] కనుక క్రివ్వక శాసని ప్రమాణమున లభించు ముదిగొండ చాళుక్య బొట్టు బేతరాజు ఇతడు మాత్రమే కలడు. ఇతని కాలము తెలిసికొనుటకు క్రివ్వక శాసనమునందు కాల నిర్దేశములేదు. శాసనలిపియందు క్రీనీడలు కలవు. కనుక ఎవరి కాలనిర్ణయము వారిది! ఉభయుల కాలనిర్ణయములందును నిజమైన శాసన ప్రమాణమున లభించు ముదిగొండ చాళుక్య బొట్టు బేతరాజు కాలము, ఇద్దరు కాకతి బేతరాజుల కాలమునుకాదు. కనుక ఊహాగానము!

విజయనగరరాజులందు మొదటిదేవరాయలకు, రెండవ దేవరాయలకు, మల్లికార్జున దేవరాయలకు, విరూపాక్ష దేవరాయలకు "ప్రౌఢ" విశేషణము కలదు. ప్రసిద్ధము. అయినను హరిహరదేవరాయలకు, బుక్కదేవరాయలకు "ప్రౌఢ" విశేషణమును ఎవ్వరును తగిలింపలేదు. కాకతీయ రాజులందు రెండవ రుద్రదేవునికి "ప్రతాప" విశేషణము కలదు. కనుక మొదటి రుద్రదేవునికి కొందఱు "ప్రతాప" విశేషణమును తగిలించినను, అతడు ప్రతాపరుద్రుడు కాడని ఉద్దండులైన చరిత్రకారుల - నేలటూరి వేంకటరమణయ్య, మల్లంపల్లి సోమశేఖర శర్మ ప్రభృతుల - ఉద్ఘోష. అది ఉద్బోధ. కనుక, క్రివ్వకి శాసనమునందు రెండవ బేతరాజునకు "బొట్టు" విశేషణము కలదని, మొదటి బేతరాజునకు కూడా "బొట్టు" విశేషణము తగిలించుట ప్రామాణిక చారిత్రిక పద్ధతికి పరమవిరుద్ధము. అది "శాసన ప్రమాణము" అని ప్రగల్భము కొట్టుట ప్రతారణము.

28. "ఇచ్చటి 'బొట్టు' అనునది స్థలనామము. పాల్వంచతాలూకాలోని అడవిలో నేదో ప్రాంతము కావచ్చును. 'బొట్టున వాని ప్రధానులు' అని క్రివ్వక శాసనవాక్యము."

బొట్టు అనగా "స్థలనామము" అనుటకు, ఆ స్థలము "పాల్వంచ తాలూకాలోని అడవిలో నేదో ప్రాంతము కావచ్చును" అనుటకును గల ఆధారము క్రివ్వకశాసనవాక్యమే. కాని, ఆ క్రివ్వకశాసన గద్యవాక్యమును పాపము అర్థము కాలేదు! ఆ వాక్యమిది :

> "—ఆతని ( కుసుమాదిత్యుని ) ప్రథమ రాజ్యంబున భూమి ప్రఘట్టంబు పుట్టిన యవసరంబున బొట్టున వాని ప్రధానులు శ్రీకరణాధిపతియైన యుందపరాజును ఆతని తమ్ముడైన రేమ రాజును సమస్త వస్తువాహనంబులనుం గులధనంబులనుండకొని కుసుమాదిత్యుతోడన పరమణ్డలాభిముఖులై కందమూలప(ఫ)ల సా(శా)ఖాదులాహారంబుగా గైకొని—"

ఇందు కందమూల ఫలములు కలవుగావున, క్రివ్వకగ్రామము పాల్వంచ తాలూకాలోనిదని పరబ్రహ్మశాస్త్రిగారి స్థలనిర్దేశమును కలదుగావున, "బొట్టున" అను శబ్దమునందు బొట్టు అని కలదుగావున, "బొట్టు స్థలనామము పాల్వంచతాలూకాలోని అడవిలో నేదో ప్రాంతము కావచ్చును" అని ఊహాగానము! ఇది ఏనాడో చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు చమత్కరించిన భాగవత పురాణపరిశోధనమును జ్ఞప్తికి తెచ్చునది!

కుసుమాదిత్యుడు రాజ్యమునకు వచ్చిన తొలి సంవత్సరమునందు భూమిప్రఘట్టము పుట్టినది. భూమిప్రఘట్టమన భూకంపము. అవసరమన సమయము. అవశ్యకము కాదు. "అయ్యవసరంబున" అను ప్రయోగములు కోకొల్లలు. "భూకంపము పుట్టిన సమయమునందు 'బొట్టున' కుసుమాదిత్యునితోపాటు వాని ప్రధానులు పరమండలమునకుపోయిరి" అను వాక్యమునందు "బొట్టున" అను పదమునకు "స్థలనామమున" అని అర్థము కాదు. "బొట్టున" అను పదము నిఘంటు పఠితముకాదు. కనుక ప్రకరణమును బట్టి అర్థమును గ్రహింపవలయును. భూకంపము పుట్టినపుడు పరమండలమునకు పోవుట ప్రకరణము. ప్రమాదము వచ్చునపుడు "వెంటనే" పోవుట లోకసహజము. కనుక "బొట్టున వాని ప్రధానులు" అను క్రివ్వక శాసన వాక్యములోని "బొట్టున" అను శబ్దము చట్టున అను శబ్దము వంటిది. చట్టు అను శబ్దమునకు, చట్టున అను శబ్దమునకు సంబంధము లేదు. అట్లు బొట్టు అను శబ్దమునకు, బొట్టున అను శబ్దమునకు సంబంధము లేదు. ఉండనక్కరలేదు. చటుక్కున అను శబ్దము చట్టున అగునట్లు, పుటుక్కున అను శబ్దము బొట్టున అగును. ఇది భాషాశాస్త్ర పరిజ్ఞానము వలన తెలియునది. "బొట్టున" అను శబ్దము క్రివ్వకశాసన కాలమునందు మాండలిక పదము కావచ్చును. దేశ్యము.

ఇక పేరునకు ముందు కల బొట్టు శబ్దము తద్భవము. వ్యక్తి నామములకు ముందు భట్ట శబ్దము బహు ప్రసిద్ధము. భట్టితౌత, భట్టినాయక, భట్టనారాయణాద్యనేక వ్యక్తినామములు గ్రంథములందు మాత్రమేగాక, పదవశతాబ్ది తెలుగు శాసనములందును భట్టగుణ్డ, భట్టదేవనికి అను వ్యక్తినామములు కలవు.[21] సంస్కృత భట్టశబ్దమునకు తెలుగు భట్టుశబ్దము తత్సమము అది భొట్టు, బొట్టు అను తద్భవములు అగును. "గొప్పవాణ్ణి కావాలని వుంది కొండుబొట్టూ అంటే పెద్దవాళ్ళని పట్టుకు తిట్టరా పెద్దిబొట్టూ" అను సామెత వ్యవహార ప్రసిద్ధము. వ్యావహారిక పదములను చాలవఱకు స్వీకరించిన సి. పి. బ్రౌను నిఘంటువునందు "బొట్టు ఆర్. భొట్టు [ ఫర్ యస్కెటి భట్ట]" అని కలదు. తత్తదేక వచనములు బొట్టు, భొట్టు. కనుక పేరునకు ముందుకల బొట్టు శబ్దమునకు ఆద్యప్రకృతి సంస్కృత భట్టశబ్దము. సంస్కృత భట్ట శబ్దమునకు పండితుడు అని మాత్రమే గాక; రాజు, యువరాజు అను అర్థ తాత్పర్యములు కలవు.

"ఎలార్డ్, మాస్టర్, ( యూజ్‌డు ఏజ్ ఎ టైటిల్ ఆఫ్ రెస్పెక్ట్ ఇన్ ఎడ్రెసింగ్ ప్రెసెన్స్" అని వి. యస్. ఆప్టే నిఘంటువునందు కలదు. కనుక భట్ట శబ్ద వికృతి అయిన, పేరునకు ముందుకల, బొట్టు శబ్దము స్థల నామము కాదు. బిరుదనామము. అంతేకాదు. యువరాజును సంబో ధించు గౌరవసూచకమైన బిరుదనామము. ఉపరిప్రభువాచకము.

నాల్గవ పద్యమునందు కాకతివల్లభుడైన బేతభూవిభుడు "పిన్న వాడు" అని కలదు. అనగా చంటిపిల్లవాడని అర్థము కాదు. తక్కువ వయస్సు కలవాడని తాత్పర్యము. బాలుడని భావము. కనుక యువరాజు కాగలడు. యువరాజైన, కాకతివల్లభుడైన బేతభూవిభుని మూడవ పద్యమునందు బొట్టుబేత వసుధాధిపుడు అనుటయే అర్థవంతము. తదితరము అర్థరహితము. ఇందుకు, మొదటి కాకతి బేతరాజు గరుడ బేతరాజుతోపాటు బొట్టుబేతరాజును అగుట మరి అసంభవముకాదని పూర్వోక్తము.[22] ఇట్లు సుసంభవము.

శబ్దము యొక్క అర్థమును "అధ్వాన్నపు అడవిలో వదిలి" పద్యముయొక్క తాత్పర్యమును కల్లోలపు కడలిలో కలిపి చేయు కల్పనము అధివాస్తవిక కవిత అగును గాని ఆధునిక చరిత్ర కాదని విజ్ఞేయము.

ఇంతకు, మొదటి కాకతి బేతరాజు "పిన్నవాడు" అయిన కాలమునందు గాని, రెండవ కాకతి బేతరాజు "పిన్నవాడు" అయిన కాలమునందు గాని, ముదిగొండ చాళుక్య రాజులందు బొట్టు బేతరాజు కలడనుటకు ఊహాగానము వినా, ఖచ్చితమైన శాసనప్రమాణము లేదు. ఆ కాలమునందు ముదిగొండ చాళుక్య బొట్టు బేతరాజుకలడని గూడూరు శాసనానుబంధ పద్యమునందు లేదు. పద్యతాత్పర్యమును కాదు. ప్రసిద్ధ ప్రాయము కూడా కాదు. నాల్గవ పద్యమునందు (వంశము), కాకతివల్లభుడు అని ద్విరుక్తమయినను, మూడవ పద్యము నందు చాళుక్య వంశము, చాళుక్య వల్లభుడు అను ప్రసక్తి లేదు. అయినను ముదిగొండ చాళుక్య రాజునకు గుదిబండ వేసిన పూర్వ వాదమును పునరుద్ధరించుకొనుటకు మరింత అనభిజ్ఞతను ప్రదర్శించు కొనుట చిత్రము. చింత్యము.

29. "ఇదే ప్రాంతాల్లో సమకాలీన కన్నడ శాసనాల్లో ఒక 'పల్లవ రాయడు' కానవస్తున్నాడు. కుమారసోమేశ్వరు డంతటివాడు కూడ వేములవాడలోని అరికేసర దేవునికి దానము సమర్పించ డానికి, యీ పల్లవరాయని అనుమతిని పొందటము జరిగింది. కనుక 'పల్లవరాయని' గూర్చి చెప్పేముందు యింకా విపులమైన పరిశీలన చాలా అవసరము."

ఒక లేముడవాడ కన్నడ శాసనమునందు "పల్లవరాయడు" కాదుగాని, "బల్లవరాయడే కలడు. అతనికి కుమారసోమేశ్వరుడు విన్నపము చేసి, హరికేశ్వరదేవునికి పూలతోట దానము చేసినట్లు శాసనము కలదు.[23]

"శ్రీమతు కుమారం సోమేశ్వరదేవరు శ్రీమతు బల్లవరసగ్గె బిన్నప హెంగెయ్దు...శ్రీమద్ధరికేశ్వరదేవర నివేద్యక్కం..."

ఇందలి బల్లవరసు బల్లవరాజే. అతడు బల్లవరాయడు అగును. గూడూరు శాసనానుబంధ పద్యమునందు "ఘను బల్లవరాయ నియోగిఁజొచ్చి"అనియే కలదు. అది"ఘనున్ + పల్లవరాయనియోగిన్" అనియే పదచ్ఛేదము చేయనక్కరలేదు. "ఘనున్ + బల్లవరాయని యోగిన్" అనికూడ పదచ్ఛేదము చేయవచ్చును. కాని, లేములవాడ కన్నడ శాసనము కాలము 10-4-1106 వ తేదీ.[24] అది మొదటి కాకతి బేతరాజు కాలములోనిది కాదు. రెండవ కాకతి బేతరాజు కాలము (1076-1108) లోనిదేకాని, అతని బాల్యములోనిది కాదు. కనుక "ఇంకా విపులమైన పరిశీలనచాలా అవసరము" కాఁబోలు!

ఎంత "విపులమైన పరిశీలన" చేసి, 1106 వ సంవత్సరము నాటి బల్లవరాయని 1076 వ సంవత్సరమునకు లాగికొనివచ్చినను, రెండవ కాకతి బేతరాజు అప్పటికి "పిన్నవాడు" కావున, బల్లవరాయ డును పిన్నవాడే అగును. అనగా యువరాజు. మరి యువరాజైన కాకతి బేతరాజును ఉద్ధరించుటకు మహారాజు నియోగినిగాక యువరాజు నియోగిని అనగా రాజోద్యోగిని ఆశ్రయించెననుట మరొక అనుచిత మగును.

"సిద్ధేశ్వర చరిత్రాది కథనములుకూడా పై చారిత్రక సంఘట నలు తలపింపజేయుట గమనింప దగినది" అయినచో, ఆ కాలమునందు కటకబల్లహుడు కలడుకదా! అతనిని ఒకసారి ఆశ్రయించుట, మరొక సారి చంపించుట రాజకీయములందు సహజమే. అందును కామవసాని "అసామాన్యురాలు"కద!– పూర్వోత్తర విరోధశంకానిరాతంక ప్రకట నములకు మూలము, పూర్వవాద పునరుద్ధరణ ప్రయత్నము కావల యును. అందువలన "తొందరపాటుచర్య, పాడిగాదు, నిరసింపదగినది" మొదలైన అధిక ప్రసంగములు!

30. "ఇక మిగిలిన ఐదవపద్యము... ఇందు 'మేలుగ' అనునది పడికట్టు మాటగా పేర్కొనిరి. కావచ్చును. కాని పద్యమునందలి ఆఖరి పంక్తి(ని) శ్రీశాస్త్రిగారు 'గరెండయరాజు' అను కన్నడ ప్రయోగముగా పేర్కొన్నారు."

శాస్త్రిగారు "గరెండయరాజు" అని పృథక్కరణము చేసినమాట నిజమేగాని, అది "కన్నడ ప్రయోగముగా పేర్కొన" లేదు. "కన్నడ సంస్కారముతో 'గరుడయ' పదమును (గరెండయ అని) వాడెను" అని పరబ్రహ్మశాస్త్రిగారి స్పష్టప్రతిపాదనము.[25] కన్నడ సంస్కార

ముతో వాడినను తెలుగు ప్రయోగము కన్నడప్రయోగముకాదు. తెలుగు ప్రయోగమే అగును. ఇంతకు కన్నడసంస్కారమును ఇదమిత్థముకాదు. అపాదనము. అంతేకాదు. అయిదవ పద్యమునందు ఉత్తరార్ధమునకు,

"మేలుగ మూడుముప్పయిని మేలుగ నేరెడు బేటిపాడునుం
మేలుగ బేకు(క్క) మావిణ్ణు మేలుగ రెండెయరాజు సంగణ్ణు"

అని శాసనలేఖనము. మొదటి మూడుస్థలములందు "మేలుగ" అని కల పదము, నాల్గవ స్థలము నందును "మేలుగ" అని ఉండుట సహజము. "మేలు"అనివుండుట అసహజముమాత్రమేకాదు;అనన్వితముకూడ.కనుక ప్రాస, యతిమైత్రి ఘటితమైన "మేలుగ" అనుపదము నాలుగు స్థలము లందును ఇమ్ముగ, మానుగ వంటి పడికట్టు మాటయే. "కావచ్చును" కాదు. అగును. నాల్గపద్యమునందు "గరుడని బేత భూవిభుని" అను పదచ్ఛేదము ఎంతసమంజసమో, అయిదవ పద్యమునందు "గరెండయ రాజు" అను పృథక్కరణము అంత అసమంజసము. అదిసరే, నాల్గవ పద్యమునందు శాసనస్థమైన; ప్రాస, యతి మైత్రిఘటితమైన "గరుడని" అను పదమునకు మూలచ్ఛేదము, అర్ధమునకు అన్యథాకరణము-చేసి, అయిదవ పద్యమునందు అనుచితవిభాగమైన "గరెండయ" అను పదమును గౌరవించుటలోని ఆంతర్యము గమనార్హము. అది గర్హ్యము.

ఒక పద్యశాసనమును పరిష్కరించుటకు మాత్రమేకాదు; ఒక పద్యశాసనము యొక్క మాత్రమేకాదు; ఒకగద్యశాసనము యొక్కయు అర్థమును గ్రహించుటకు ప్రథమతః భాషాచ్ఛందో వ్యాకరణాద్యనేక విషయముల పరిజ్ఞానము ఆవశ్యకము. తదుపరి సమకాలిక చారిత్రిక సత్యముల సమన్వయము కర్తవ్యము. ఊహామాత్ర శరణ్యములైన చారిత్రిక సమన్వయములు (కన్జెక్చర్స్) సప్రమాణ నిరూపణచణము లైన చారిత్రిక సత్యములు (హిస్టారికల్ ఫేక్ట్స్) కాఁజాలవు. చరిత్రకు ధ్యేయము సత్యాన్వేషణము. స్వకపోల కల్పితములైన చారిత్రిక సమన్వయములనుబట్టి శాసనపద్యములకు విపరీతార్థ కల్పనము, శాసనగద్యము నకును విరుద్ధార్థజల్పనము చేయుటకంటె, సరియైన అర్థములను తెలిసికొని, స్వకపోల కల్పితములను సవరించుకొనుట సహృదయ లక్షణము.

చరిత్ర (హిస్టరీ) పురావస్తుతత్త్వము (ఆర్కియాలజీ) వలె, సాహిత్య పురాతత్త్వము (లిటరరీ ఆర్కియాలజీ) కలదు. అది ప్రథమతః మల్లంపల్లి సోమశేఖర శర్మగారి ముఖతః విన్నది. వారి పీఠికను కలది.[26] తదుపరి వేదము వేంకటరాయ శాస్త్రిగారి (మనుమడు) ముఖతః విన్నది. వారి గ్రంథమునందు కలది.[27] తత్తాదృశమైన సాహిత్య పురాతత్త్వ సరణిని కూడ, విరియాలమల్లని గూడూరు సానుబంధ శాసనములోని తెలుగు పద్యముల రచనాకాలము పరిశీల నీయము. పరిగణనార్హము.

విరియాల మల్లని గూడూరు సానుబంధ శాసనములోని తెలుగు పద్యములు చంపకోత్పలమాలలు. అవి సంస్కృతచ్ఛందస్సులు. కాని సంస్కృత కావ్యములందు కానరావు. మాఘకావ్యమునందు ఒక్క చంపకమాల కలదుగాని, అది సంశయాత్మకము. అయినను చంపకో త్పలమాలలు సంస్కృతచ్ఛందస్సులే. అంతేకాదు. వృత్తములు. సంస్కృత వృత్తములకు పాదాంత విరతి విధాయకము. తెలుగు వృత్త ములకు తొలుత విధాయకముగ కలదు. నన్నయనుండి వికల్పముగ కలదు. నన్నయ భారతములోని మొట్టమొదటి ఉత్పలమాల మొట్ట మొదటి పాదమునందే పాదాంత విరతి పాటింపఁబడలేదు. వృత్తరచ నమునందు పాదాంతవిరతి పాటింపకపోవుట సంస్కృత లక్షణాను సారముకాదు. కన్నడలక్షణానుసారము. కన్నడమున ఆదికవి పంపని భారతమునందు ఇట్లు కలదు.[28]

"సకలక్ష్మాచర ఖేచరాంచిత మహామాణిక్యాణిక్యహ
స్తిక—"
తెలుగున ఆదికవి నన్నయ భారతమునందు ఇట్లు కలదు.
"రాజకులైక భూషణుఁడు రాజమనోహరుఁడన్యరాజతే
జోజయశాలి శౌర్యుఁడు—"

ఇట్లు వృత్తమునందు పాదాంతవిరతిని పాటింపకపోవుట నన్నయకు పూర్వము తెలుగునందు లేదు. తర్వాత కలదు. ఎనిమిదవ శతాబ్ది గుణక విజయాదిత్యుని లేక పండరంగని అద్దంకి శాసనములోని తరువోజ పద్యమునందు, తొమ్మిదవ లేక పదవ శతాబ్ది యుద్ధమల్లుని బెజవాడ శాసనములోని అయిదు మధ్యాక్కర పద్యములందును పాదాంత విరతి పాటింపఁబడినది.[29] 1108వ సంవత్సరము నాటి కొమ్మసాని అమరావతీ శాసనములోని మూడు ఉత్పలమాల పద్యము లందును పాదాంతవిరతి పాటింపఁబడలేదు.[30] 1118వ సంవత్సరము నాటి సూరని చేబ్రోలుశాసనములోని ఆరువృత్తములకు మూడువృత్తము లందు పాదాంత విరతి పాటింపఁబడలేదు.[31] 1120వ సంవత్సరము నాటి రేవని మాచేడు శాసనములోని నాలుగు వృత్తములకు రెండు వృత్తములందు పాదాంత విరతి పాటింపఁబడలేదు.[32] 1124వ సంవత్సరమునాటి భీముని బెజవాడ శాసనములోని రెండు వృత్తములకు ఒక వృత్తమునందు పాదాంత విరతి పాటింపఁబడలేదు.[33] ఇట్టి వింకను కలవు. కనుక పాదాంతవిరతి పాటింపఁబడిన శాసనముల రచనాకాలము నన్నయ భారతమునకు పూర్వము, పాదాంతవిరతి పాటింపఁబడని శాసనముల రచనాకాలము నన్నయ భారతమునకు తర్వాత కావలయును.

విరియాల మల్లని గూడూరు శాసనములోని మూడు కన్నడ వృత్తములందును కన్నడ లక్షణానుసారము పాదాంతవిరతి పాటింపఁ

ఆమె అంతిమ కేక
'రూపాయి కొరుక్కుతినగా' మిగిలిన
నీ భావాస్తిపంజరంలో కల్సిపోతుంది
దారి తప్పిన నీ దానవత్వంలో కల్సిపోతుంది
అస్త్రసన్యాసం చేసిన
నీ చాతకాని తనంలో కల్సిపోతుంది
ఆమె అంతిమ కేక
మతం గంతలు కట్టిన
నీ టాంగాగుర్రం బానిన బతుకులో కల్సిపోతుంది
తెల్లారినా చీకటి జ్ఞాపకాల్లో బతికే నీ నీరసంలో
కల్సిపోతుంది
ప్రశ్నించడం నేర్పని
నీ యూనివర్సిటీ డిగ్రీల చిత్తడిలో కల్సిపోతుంది
కర్మనాశ్రయించే
నీ నిష్క్రియత్వంలో నీ భావ దారిద్ర్యంలో కల్సిపోతుంది
అది హుసేనుసాగరైనా
వినాయక సాగరైనా.... అంతే!
చీమకుట్టిన మంట
హస్తవమంత బాధగా ఉంటుంది
ఆ బాధ నాది
ఆ బాధంతా ప్రపంచాంది
బాధ్యతంతా ఈ ప్రపంచాంది
ఆమె అంతిమ కేక
తోక తొక్కిన నా హృదయంలో
పామై పడగ విప్పుతుంది
మంటై మాట్లాడుతుంది
తీగ లాగాను-
ఇక డొంకంతా అంటుకుంటుంది

[ 30—7—'83 నాటి సాయంత్రం హుసేనుసాగరు ఎదురుగా......... ]

శ్రీ ఎ. విజయ దత్తాత్రేయ శర్మ

# పశ్చిమ గోదావరి జిల్లా గ్రామనామములు - ఒక పరిశీలన

ఆంధ్రప్రదేశ్ తీర ప్రాంతపు జిల్లాలలో నొకటి యైన పశ్చిమ గోదావరిజిల్లా 1925 సం॥ లో నాటి కృష్ణాజిల్లా నుండి వేర్పడి (1942 సం॥ లో తూర్పు గోదావరి జిల్లాలోని పోలవరం తాలూకాను కలుపుకొని) ఏర్పడి నది. 8 తాలూకాలతో, 7780 చ॥ కి. మీ॥ వి స్తీర్ణంతో 16°-15'-17°-30' ఉత్తర అక్షాంశ రేఖల మధ్యను, 80°-51'-81°-55' తూర్పు రేఖాంశముల మధ్యను వ్యాపించియున్న ఈ జిల్లాకు దక్షిణమున కృష్ణాజిల్లా, బంగాళా ఖాతము, పడమట కృష్ణాజిల్లా, ఉత్తరమున ఖమ్మంజిల్లా, తూర్పున గోదావరి నది ఎల్లలుగా వున్నవి.[1] 1975 సం॥ ఆంధ్రప్రదేశ్ స్టాటిస్టికల్ ఏబ్‌స్ట్రాక్ట్ ననుసరించి ఈ జిల్లాలోని వివిధ తాలూకాల లోని గ్రామముల/పట్టణముల సంఖ్యా వివరము క్రింది విధముగా నున్నవి.[2]

| క్రమ సంఖ్య | తాలూకా పేరు◆ | గ్రామముల సంఖ్య జనావాసము గలవి | లేనివి | పట్టణముల సంఖ్య | మొత్తము |
|---|---|---|---|---|---|
| 1. | భీమవరం | 85 | 1 | 2 | 88 |
| 2. | చింతలపూడి | 102 | 8 | — | 110 |
| 3. | ఏలూరు | 139 | 5 | 1 | 145 |
| 4. | నరసాపురం | 87 | — | 2 | 89 |
| 5. | పోలవరం | 126 | 9 | — | 135 |
| 6. | కొవ్వూరు | 100 | 9 | 2 | 111 |
| 7. | తాడేపల్లిగూడెం | 104 | 7 | 1 | 112 |
| 8. | తణుకు | 98 | — | 2 | 100 |
| | జిల్లా మొత్తం | 841 | 39 | 10 | 890 |

## చారిత్రక నేపథ్యము

చరిత్ర పూర్వయుగం నుంచి ఈ జిల్లా ప్రాంతం జనావాస యోగ్యమై యుండినదని మైప (భీ) మొ॥ చోట్ల అల్పప్రమాణ పరికరములు బయల్పడుట వలన తెలుస్తోంది.[3] మౌర్య, శాతవాహన సామ్రాజ్యాంతర్భాగముగ, ఇక్ష్వాక, బృహత్పలాయన, ఆనందగోత్ర, సాలంకాయన, విష్ణుకుండిన రాజ్యాంతర్గతముగ, తూర్పుచాళుక్య రాజ్యకేంద్ర బిందువుగ, వెలనాటి చోడ, కోట, కొలను, మలయ, నిడుదవోలు చాళుక్యాది సామంత మాండలిక వంశముల కొటపట్టుగ, రెడ్డి, ముసునూరి, కోరుకొండ నాయక, గజపతి, విజయనగర రాజ్యములలో భాగముగ ఈ జిల్లా చరిత్ర పుటలలో చోటుచేసుకున్నది. కుతుబ్‌షాహి, మొఘల్, ఆసఫ్ జాహీలపాలన చవిచూసినది. ఆధునిక కాలములో నూజివీడు, వల్లూరు, లక్కవరం, పోలవరం మొ॥ జమిందారీల పాలన ఈ ప్రాంతమున సాగినది. ఆ ఈ రాజవంశముల, పాలకుల ప్రభావము ఈ జిల్లా గ్రామనామములపై తగు మాత్రముగ ద్యోతకమైనది. ఆ విషయమును విపులీకరించుటకు ముందుగా, ప్రాచీన, మధ్యయుగములందు ఈ జిల్లాలో వివిధ ప్రాంతములకుండిన ప్రత్యేక నామ విభాగములను శాసనాధారములను బట్టి తలస్పర్శగా పరామర్శించుట అవశ్యకమై యున్నది.

## ప్రాచీన, మధ్య యుగములలో ప్రాంతీయ భాగములు

### కురవాటము

సాలంకాయన రెండవనందివర్మ (క్రీ. శ. 395 - 410 ప్రాంతము) కంచేరు శాసనములో పేర్కొనబడిన ఈ విభాగము ముమ్మడి నాయకుని కోరుకొండ, (శ॥ సం॥ 1363) శ్రీరంగం శాసనము (శ॥ సం॥ 1363) లందును ప్రస్తావింపబడినది. మరియు, శ్రీనాదుని క్రీడాభిరామమున "పావనంబైన తమిలేటి పరిసరమున వేగి కురవాటికా దేశ విపిన భూమి" యని వుండుటను

బట్టి (తమిలేరు చింతలపూడి, ఏలూరు తాలూకాలగుండా ప్రవహించు చున్నది) "వేంగీదేశమున నీ తమ్మిలేరు ప్రాంత పరిసరములు-గోదావరికి దక్షిణమున నున్న కొవ్వూరు, ఏలూరు తాలూకాలు. కాబట్టి కురవాటి సీమయనగా నీ రెండు తాలూకాలు అని చెప్ప వచ్చును"5 అని పరిశోధకాభిప్రాయము.

## కొలను మండలము

పశ్చిమ గోదావరిజిల్లా యందు మాత్రమే కాక మొత్తం ఆంధ్ర కోస్తాలోనే పెద్దదైన మంచినీటి జలాశయము కొల్లేరను పేర గోదావరి, కృష్ణాజిల్లాల నడుమ నున్నది. రెండవ పులకేశి అయివోలు శాసనమందు 'కునాలము'గా ప్రస్తావించ బడినది. "కునాల శబ్దమే 'కులను', 'కొలను'గా పరిణామ మందినదని శబ్ద తత్త్వజ్ఞులు అనుచుందురు. 'కొలను' శబ్దము సంస్కృతీక రింపగా 'సరస్సు' అయినది."6 "కొలను మండలము పశ్చిమ గోదావరి మండలములోని ఏలూరు, భీమవరము, తణుకు తాలూకా ప్రాంతము"7 అని పరిశోధక నిర్ణయము.

## పానార విషయము

7 శ॥ పృథ్వీమహారాజు తాండివాడ శాసనములో 'పాగుణార', ప్రథమ చాళుక్య విజయాదిత్యుని యొక్క శాసనములో 'ప్రాకునోర', రెండవ అమ్మరాజ విజయాదిత్యుని వందప్రిము శాసనములో 'పావునవార', రెండవ చాళుక్య భీమ విష్ణువర్ధనుని శాసనములో 'పగుణవార', మూడవ విజయాదిత్యుని సీసలి తామ్ర శాసనములో 'పాగుణవార', ముమ్మడి నాయకుని శ్రీరంగం శాసనములో 'పానార' విషయమని పేర్కొన బడిన ఈ విషయ విభాగము "తణుకు, భీమవరము, నరసాపురము తాలూకా ప్రాంతమున వ్యాపించి యుండెనని భావింప వచ్చును."8 అత్తిలి విషయము (తణుకు, భీమవరం తాలూకా ప్రాంతము) పానార విషయాంత ర్భాగముగా పరిగణించ బడినది.9

## మలయ మండలము

12, 13 శతాబ్దములనాటి కొన్ని శాసనములలో ప్రస్తావింప బడిన గ్రామ నిర్దేశనమునుబట్టి ఇది ప్రస్తుతము కొవ్వూరు, నిడద వోలు (?) తాలూకాలలో గోదావరి తీరము నంటియున్న భాగముగా గుర్తించ బడినది.10

## చెన్నూరుపల్లి విషయము

"మొదటి జయసింహ వల్లభుని (641-673) మోపఱ్ఱు దానశాసనమందు గానవచ్చు 'చెన్నూరుపల్లి' విషయమెందున్నదో సరిగా తెలియదు. అయితే ఈ 'మోపఱ్ఱు' పశ్చిమగోదావరిజిల్లా ఏలూరు తాలూకాలోని 'ముప్పఱ్ఱు'ను - ఈ రెండును ఒకటే అయినచో చెన్నూరుపల్లి విషయము ఏలూరు తాలూకా పా మగును."11

## వేంగి మండలము

పై విషయ విభాగము లన్నియు వేంగిదేశాంతర్భాగములే. వేంగి విషయము, వేంగినాడు, వేంగిదేశము మొదలుగా ఈ మండ లము 7-12 శతాబ్దాలనాటి అనేక శాసనములలో ప్రస్తావితమైనది.12

## శాసనములు - గ్రామనామములు

| క్రమ సంఖ్య | శాసనములోని గ్రామ నామము | ప్రస్తుత గ్రామ నామము | తాలూకా | శాసనము - కాలము - ఆధారము |
|---|---|---|---|---|
| 1. | విప్పఱు | విప్పర్ర | తణుకు | యస్. ఐ. ఐ. V, నెం. 124, శ॥ సం॥ 1228 |
| 2. | జుత్తిక | జుత్తిగ | ,, | పైది X, నెం. 10, శ॥ సం॥ 1000, ప్రాచీనాంధ్ర శాసనాలు, పు. 326. |
| 3. | కొట్టలపఱ్ఱు | కొరాలపర్రు | ,, | ముమ్మడి నాయకుని శ్రీరంగం శాసనము - ఎ. ఇం. XIV, పే. 83 - 96, శ॥ సం॥ 1368. |
| 4. | యోనంబఱ్ఱు | మునమర్రు | ,, | పైది |
| 5. | వంగిపూడి | వెగ్గిపూడి | | |
| 6. | చెఱువు | చెరుకువాడ | | |
| 7. | తామరవాటక | తామరాడ | | |

| 1 | 2 | | | |
|---|---|---|---|---|
| 8. | పెనుకొండ | పెనుగొండ | | పైది |
| 9. | మారెడేరు | మారుటేరు | | ,, |
| 10. | ఉమికిలి | ఉనికిలి | | గుణగ విజయాదిత్యుని (క్రీ॥ శ॥ 848 - 891) సీసలి తామ్ర శాసనము-భారతి XXIII, పార్ట్ I, పు. 486. |
| 11. | అరువిల్లి | | | పైది |
| 12. | కలుచుంబఱు | కంచుమర్రు | | ఎ. ఇం. VII, పు. 177-192, క్రీ. శ. 945-70, ప్రాచీనాంధ్ర శాసనాలు, పు. 189. |
| 13. | | | | పైది, ప్రాచీనాంధ్ర శాసనాలు, పు. 179-180. |
| 14. | గజ్జర | గజ్జవరము | కొవ్వూరు | యస్. ఐ. ఐ. V, నెం. 116, శ॥ సం॥ 1170. |
| 15. | నందమూరు | నందమూరు | ,, | పైది. |
| 16. | దేవ | దేవ | నరసాపురం | ముమ్మడి నాయకుని శ్రీరంగ శాసనము. |
| 17. | విల్లూరు | విల్లూరు | | పైది. |
| 18. | పెర్నజీలి | పెనుమంచిలి | | ఐదవ విష్ణువర్ధనుని (క్రీ. శ. 846-847) శాసనము |
| 19. | దిగుంబఱ్ఱు | దిగుమర్రు | | డా॥ నేలటూరి వెంకటరమణయ్య, పల్లవులు-చాళుక్యులు, పు. 121 రెండవ చాళుక్యభీముని(935-945) శాసనము, పైది, పు. 120-121 |
| 20. | కొణ్డమణ్చి | కొండమంచి | | పృథ్వీమహారాజు తాణ్డివాడశాసనము, క్రీ. శ. 630 ప్రాంతము, పైది, పుట 121. |
| 21. | అండలూరు | అండలూరు | భీమవరము | గుణగవిజయాదిత్యుని సీసలి తామ్రశాసనము |
| 22. | కొండెయపూడి | కొండేపూడి | | |
| 23. | వేంద్ర | వేంద్ర | | |
| 24. | యోంగలను | యోగల్లు | | యస్. ఐ. ఐ, X, నెం. 510, శ॥ సం. 1237 |
| 25. | కోర్కొలను | కోరుకొల్లు | | ఎ. ఇం. VII, పుట 177-192, క్రీ. శ. 945-70, ప్రాచీనాంధ్ర శాసనాలు, పుట 189 |
| 26. | పాదొఱు | పాండువ్వ | | రెండవఅమ్మరాజ విజయాదిత్యుని (945-70) వంద్రముశాసనము, ఎ. ఇం. IX, పేజీలు 131-135 |
| 27. | కొండేరు | కోడేరు | | యస్. ఐ. ఐ., నెం. 148, శ. సం. 1076 |
| 28. | చిక్కాల | కొమ్ముచిక్కాల | | అనపోతారెడ్డి కొమ్ముచిక్కాల వలస శాసనము, జె. ఏ. హెచ్. ఆర్. ఎస్. III, పుట 229, శ. సం. 1344. |
| 29. | తెన్దుఱూర | దెందులూరు | ఏలూరు | ఎ. ఇం. IV, పుట 193-198, క్రీ. శ. 506, ప్రాచీనాంధ్ర శాసనాలు, పుట 520. |
| 30. | ఏలూరె | ఏలూరు | | శాలంకాయన దేవవర్మ (క్రీ. శ. 300-335) ఏలూరు ప్రాకృత శాసనము. |
| 31. | చిన్నపుర | చింతలపూడి | | శాలంకాయన స్కందవర్మ (410-420) కంతేరు శాసనం. |
| 32. | విడెనూరు | వడ్డిగూడెము | | శాలంకాయన రెండవ నందివర్మ (395-410) కొల్లేరు శాసనం. |
| 33. | కంబురాంచెరువు | కొమ్మర (ఉత్తర-దక్షిణ) | | పైది, పెద వేగి శాసనం. |
| 34. | మ్రొపఱ్ఱు | ముప్పఱ్ఱు | | మొదటి జయసింహ వల్లభుని (641-677) శాసనం. |
| 35. | వేగి | (పెద) వేగి | | యస్. ఐ. ఐ. VI, నెం. 102, క్రీ. శ. 1006, ప్రాచీనాంధ్ర శాసనాలు, పుట 495. |

పట్టిక అయా గ్రామముల ప్రాచీనతను తెలియజేయుటయే గాక ఉదాహరణ ప్రాయముగా కొన్ని గ్రామనామములు కాలగతిని మార్పునొందుటయు, మరికొన్ని, వందల సంవత్సరములు గడిచినప్పటికీ ఏ విధమైన మార్పులకు లోనుగాకుండుటయును తెలియజేసేదిగా వుంది.

## గ్రామనామముల పరిణామము

కొన్ని గ్రామనామములు కాలగతిని కొన్ని ప్రత్యేక కారణముల వలన తమ పూర్వ రూపములను కోల్పోయి అపభ్రంశమొందుట గమనించదగిన విషయము. ఈ అంశమును విశదీకరించుటకు మూడు ఉదాహరణ లీయబడుచున్నవి.

### గుంటుపల్లి

క్రీస్తు పూర్వ కాలమునాటి ప్రసిద్ధ బౌద్ధక్షేత్రము. టాలెమి (క్రీ. శ. 150) మరియు ఖారవేలుని హాతిగుంఫ శాసనములోను పేర్కొనబడిన పితుంద్ర – జయస్వాల్ భావించినట్లు పృదు–అండ అనియు, ఆ నామము ఆ స్థలము యొక్క స్థితివలన ఏర్పడియుండి యుండవచ్చుననియు, కాలక్రమమున ఈ గుడుపల్లి (పృదు-అండ) - యే గుంటుపల్లిగా మారినదనియు ఒక అభిప్రాయం.[13] కాగా, పితుంద్రను – పృదు అండగా అన్వయించి గుడ్డపల్లి – గుంటుపల్లిగా శ్రీ సుబ్రహ్మణ్యంగారు తేల్చిరి. ఇది యెంతమాత్రము సమంజసముగా తోచదు. గుంటుపల్లి ప్రాచీన నామము మహా నాగ పర్వతముగా శాసనముల వలన నిరూపితమైనది....గుంటుపల్లియే పితుంద్ర అనువాదము నిరాధారము[14] అని వేరొక సిధాంతము.

### కమ్మురాజ్రువు

శాలంకాయన నన్దివర్మ 10 వ రాజ్యకాలము (క్రీ. శ. 435 ప్రాంతము) నాటి పెద వేగితామ్రశాసనము లో ముణ్డూరు, చెంజెరువు, కంబురాం చెరువు గ్రామములు ప్రసక్తమైనవి. "కంబురాం చెరువు, ముండూరు అనునవి ప్రస్తుతము పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు తాలూకాలోని ఉత్తర దక్షిణ కొమ్మరలు, ముందూరు అను గ్రామములు. కంబురాం చెరువును కమ్మర చెఱువు గ్రామముగా గుర్తించిరి. ప్రాచీనాంధ్ర భాషయందు పూర్ణబిందు పూర్వక 'బు' వర్ణము వాడుకలో నుండెను. ఇది తరువాత కాలమున సమీకరణము చెంది 'మ్మ'గా మారినది. వనము, వసంబు, వనమ్ము రూపములు ఇట్లేర్పడినవియే. కంబురాం చెరువు కమ్మరి చెరువుగా పరిణామము నొందుట భాషారీతికి అనుగుణముగా వున్నది. చెంజెఱువు నరసాపురము తాలూకా కొజ ఫిర్కాలోని చించినాడ. చెంజెరువును చించినాడగా దినేశ్ చంద్ర సర్కారుగారు "శాతవాహనాంతరులు" అను గ్రంథమున గుర్తించిరి. కాని ఇది చాల దూరమైన పేరు. చెంజెరువు అనగా అందమైన చెరువు, ఎఱ్ఱ చెరువు అని యర్థము. చెన్ను అనగా, శోభ లేక ఎఱ్ఱదనము. చెంజెరువు ఎఱ్ఱ చెరువైనది అన్నచో బాగుండును కాని 'చించినాడ'ను సరిక్రొత్త రూపము దాల్చునా అను సందియము కలుగుచున్నది.......... తాలవ్యీకరణము అను విధానము కూడా తెలుగు భాషయందు అప్పటికే ప్రవేశించినట్లు సూచనలు కలవు. కంఠ్యాక్షరములు తాలవ్యములైన అచ్చుల సాన్నిధ్యమున తాలవ్యాక్షరములుగా మారుటను తాలవ్యీకరణ మందురు. చెంచెఱువు కంబురాం చెఱువు శబ్దములలోని చెఱువు శబ్దము దీనికి ఉదాహరణము. ఈ శబ్దము కన్నడములో కెఱె అని యుండగా తెలుగులో చెఱువుగా మారినది. కకారము చకారమైనది. ఇ, ఈ, ఎ, ఏ లు తాలవ్యచ్చులు. వాటి ప్రభావముచే ఈ మార్పు కలిగినది."[15]

### దెన్డులూర – దెందులూరు

"విష్ణుకుండినుల రాజధాని దెందులూరు నగరము. ఇప్పటి ఏలూరుకు సమీపమున ఉత్తరమునందున్న గ్రామము. దీని పూర్వరూపము 'ఠెందులూరు.' తరువాత డెందులూరు అయి క్రమముగా దెందులూరు అయినది. ప్రాచీన భాషయందు మూర్ధన్యాక్షరములకు గల ప్రచారమునకు ఇది యొక నిదర్శనము... .... ఇప్పటి భాషలో మూర్ధన్యాక్షరములు ఎక్కువగా వినవచ్చును. ఐ, శ వంటివి. ఇవిగాక పరుషోచ్చారణము గల ఒక ఊష్మ వర్ణము వాడుకలో నుండినట్లు కన్పించును. దానిని మనము 'ఠ' గుర్తుతో వ్రాయవచ్చును. ఇది ఠెందుబూరు పలికి రాష్ట్రమువంటి పదములలో వచ్చినది. ఈ ధ్వని తెలుగు భాషయందు కొన్ని శతాబ్దములుండి, నన్నయ నాటికి కావ్యభాషనుండి తొలగినది."[16]

గ్రామనామ పరిణామముగూర్చి కొంకొకచో ఏవిధముగా విరుద్ధాభిప్రాయ ప్రకటనము జరిగినదో గ్రామ నామావిర్భావము గూర్చి కూడ ఆ విధమైన దృష్టాంతములను పేర్కొన వలసియున్నది. ఉ॥ దా॥ ఏలూరు, వేం(ం)గి.

### ఏలూరు

"ఏలు+ఊరు=ఏలూరు (ముఖ్య పట్టణము) అన్న రీతిగా, ఈ పదమేర్పడినదని కొందరు చెప్పుచున్నారు."[17] 'హేలాపురి అనునది ఏలూరునకు సంస్కృతీకరణమనియు, ఏల అను చిన్న ఏరు ఈ పట్టణ పరిసరములందు ప్రవహించు చుండుటచే

ఏలేరునుంచి ఏలూరు గ్రామ నామము సంభవమై యుండవచ్చు ననియు[18] అభిప్రాయము వ్యక్తమై యున్నది.

### వేం(ం)గి (ఏ)

"తూరుపు కనుమలనుండి సముద్రము వఱకును కృష్ణా, గోదావరుల మధ్య వ్యాప్తమై యుండు తీర ప్రాంత దేశమునకు పూర్వము వేంగి యని పేరు చెల్లుచుండెను. దీనికి దగ్ధ రాష్ట్రమనియు జెప్పుట కలదు. ఒకా నొకప్పుడిది యరణ్య ప్రాంతమై జన నివాసమునకు యోగ్యముగాక యుండగా నా యరణ్యమును దగులబెట్టి వాసయోగ్యముగా జేయబడుట వలన దీ కీపేరు వచ్చి యుండును."[19] ఈ ప్రకారము వేడి–వేగి అను క్రమమున 'వేం(ం)గి' యేర్పడినదనిపించును. కాని 'వేకువ' 'వేగు' సంబంధముగా ఈ పదము జనియించి వుండవచ్చునను అభిప్రాయము[20] పరిగణించ దగినది.

### నామాంతరములు

కొలనిపాడునకు సరసీపురి, పద్మినీపురము, కమలాకర పురము[21] అను పేర్లుండెడివి. భీమవరం తాలూకాలోని గణపవరమునకు పూర్వ నామం పద్మినీపురం.[22] "పూర్వం టౌన్ ప్లానింగ్‌లో పద్మాకారం వున్న మాట నిజమే కాని అందువల్ల పద్మినీపురం కాలేదు."[23] పరి నాటి కొలని ప్రభువుల ముఖ్య పట్టణ నామ పరంగా ఈ పేరుండినట్లు భావించాల్సి వుండేది. "అప్పుడు రావులపట్టు వుండేది నగరమని రాజుపేర పిలువబడు చుండెడిది."[24] అను మాట అలా వుండగా "దీనికి పూర్వము దుండిపురము అను పేరు కలదు. కాల క్రమేణ ఇది ఉండిగా మారినది."[25] అను అభిప్రాయమున్నది. కేతకీపురము, కేతవరము మొగల్తుఱ్ఱు (న) నకు సంస్కృతీకరణ రూపములు. పాలకొల్లునకు దుగ్గోపవనపురము, ఉపమన్యుపురము అను నామాంతరములు చెల్లినవి. ఉండిపిల్లి (త)కి ఒకప్పటి పేరు ఉత్తరేశ్వర పురము.[26] శ॥ సం॥ 1314 లో చిక్కాల(న)గ్రామమునకు "ప్రోలయ కొమర గిరిపురము" అను నామకరణముచేసి తన అన్నగారి పుణ్యము కొరకు అనపోతారెడ్డి దానము చేసెను.[27] కాని నూతన నామము నిలువక నేటి కాగ్రామము కామ్మచిక్కాలపు పేర నున్నది. కొన్ని సందర్భములలో నూతన నామము వచ్చి చేరి నిలుచును. అట్టిది గుండేపల్లి అను చోడవరం ఈస్ట్(తా). తమునకు 'తార కేశ్వరపురం' మను వ్యవహారముండెడిది.[27a]

### పౌరాణికములు

మతం లేని (దే) మనిషిలేడనే మాట పూర్వకాలానికి మరిం సరిపోతుంది. ఈ సంగతి గ్రామనామకరణ విషయంలో కూడా ప్రస్ఫుటంగా ద్యోతకమవుతుంది. అందుకు సాక్ష్యంగా ఈ జిల్లాలోని కొన్ని గ్రామనామకరణాల వెనుక పౌరాణిక వ్యక్తులూ, సంఘటనలు దర్శన మవుతున్నవి.

### అత్తిలి (త)

"అత్రిమహర్షి నివసించుటచే ఈ గ్రామము అత్రి అని మొదట పిలువబడి క్రమముగ అత్రి అను పదము అత్తిలిగ మారినదట." 8

### ఆచంట (న)

"రక్షణ నిచ్చు మార్తాండేశ్వరి దేవత పేర దీనిని మార్తాండ పురమనిరి." పరమశివభక్తుడైన ఒడయనంబి ఒకానొక వేళ ఆత్మ లింగమును పూజించుటకు తగిన వ్యవధానములేక తన ప్రేయసి యైన పరవనాంబి వామ స్తనచూచుకమును శివలింగముగా భావించి అర్చించుట మొదలుగా సాగిన గాథను బట్టి అచంట నామమేర్పడినదని నమ్మిక గలదు.[29]

### కాళ్లకూరు (భీ)

"చెఱువు గట్టుపై అడుసులో కాళ్ళు కూరుకొనియున్న ప్రతిమను గ్రామస్తులు జూచిరట. ఆ దారిని తిరుపతి తీర్థయాత్రకు పోవుచున్న మొగలితుర్రు జమిందారు కాసంగతి జెప్పిరట. వారిని

సరుకు జేయక వెళ్ళిన జమీందారుకు తిరుపతిలో స్వామి కనిపించ లేదట. వెంటనే తిరిగివచ్చి జమీందారు గ్రామస్తులు చూపిన ప్రతిమనే వెంకటేశ్వర స్వామిగా ప్రతిష్ఠించెనట. దేవునికాళ్ళు మట్టిలో కూరుకొని యున్నందున ఊరిపేరు కాళ్ళకూరై నదట"30

### కొ వ్వూ రు (కొ)

పూర్వమిది గోవూరన పేర బరిగెడిది. గౌతమ మహర్షి-గోదావరి నదికి సంబంధించిన గాథామూలకముగ నేర్పడిననామము.

### జు త్తి గ (త)

"స్థల పురాణం-ఆవరణలో అంతర్ధూతిక, ఊర్లో బహిర్ధూతిక పేరిట ఊరి పేరు జుత్తిగయట.... చక్రకూట రాజ్యదేవత దంతేశ్వరి నచట ప్రతిష్ఠించెను. ఆమె జుత్తిగ దూతిక....బస్తరు రాజ్యదేవత దంతేశ్వరి. ఈ దంతేశ్వరికీ, జుత్తిగ దూతికకూ సంబంధములేదు. దూతిక దేవతబట్టి గ్రామం జుత్తిగ కాలేదు. ఏదో పరివార దేవతకు కుతుబ్షాహీలనాడు కట్టిన దానిలో చిన్న ప్రతిమను ప్రజలు దూతిక అన్నారే కాని చరిత్రకాదు."31

### ద్వారకా తిరుమల (ప)

చిన్న తిరుపతియని ప్రసిద్ధి. "దారక లేక ద్వారకుడను విప్రుడొకడు ఏటా తిరుపతియాత్ర చేసేవాడట. ఒకసారి దారిలో వడగాడ్పులకు స్పృహ దప్పెనట. స్వామి వృద్ధ బ్రాహ్మణుడుగా వచ్చి సేద దీర్చెనట. కలలో కనిపించి ఇక తిరుపతిరావద్దు, నీకై ఇచటనే వెలసెద ననెనట....ద్వారకుని పేరిట క్షేత్రము ద్వారకా తిరుమల యైనదట . ఈగాథలో గూడ ఏదో నొక శిథిల ప్రతిమను వేంకటేశ్వరునిగా ప్రతిష్ఠించుటే స్ఫురించును. ద్వారకా తిరుమల ప్రాంతాల దారువులున్నవి. అనేకుల వృత్తి గూడా దారుకము - చెట్లుకొట్టి, చీలి , కట్టెలుగా అమ్ముట. ఇటు కోస్తా - అటు మెట్ట ప్రాంతానికి ద్వారము (గడప) వంటిది ద్వారకా తిరుమల."32

### దు వ్వ (త)

దూర్వాశ పురమని వ్యవహరింప బడిన ఈ గ్రామము దూర్వాశ మహర్షి చేతనే వెలయింప బడినదని విశ్వాసం.33

### వత్తా రామేశ్వరం (త)

"సీతలింగ ప్రతిష్ఠాపనకు ఆంజనేయుని బాణలింగము తేనంపెనట. ముహూర్తమునకు తిరిగి రానందున ఇసుక (సైకత), మట్టి (పార్థివ), గుల్లలు కలిపిచేసిన లింగము-నత్తారామేశ్వరుడు....క్రీ॥ శ॥ 1314 నాటి శాసనములో "మూలస్థానము నత దేవర'కు అఖండదీపం ప్రసక్తి వున్నది. ఈ నత్త (నాథ) దేవర నెవరో నత్తగుల్లను జేసారు."34

### ప ట్టి స ము (పో)

లము, కాశి, కాళేశ్వరం, శ్రీకాళహస్తిలతోపాటుగా పంచశివక్షేత్రములలో నొకటిగా నెన్నబడిన ప్రదేశము.

తన తండ్రియగు దక్షుడొనర్చిన యాగ సందర్భమున సతీదేవి అవమానింపబడి యోగ విసృష్టదేహ మయ్యెను. తన్మూలమునఅత్యంత కుపితుడై ఆమె భర్తయగు మహాదేవుడు వీరభద్రావతారము తాల్చి దక్షుని శిర మ్ముత్తరింప పట్టసము అను ఆయుధమును ప్రయోగించెను....ఆ కారణమైన నాటనుండి ఆ దేవకూటాగ్రి పట్టసాద్రి లేక 'పట్టసాచలము' అను నామముచే వ్యవహరింప బడుచు వచ్చెను."35

### పా ల కొ ల్లు (న)

పంచారామములలో నొకటియైన క్షీరారామమునకు నెలవు కావున ఆ పేరు సార్థకమే అయినది.

### పె ను గొ ం డ (త)

"ఏ కొండ పెనుగొండలో లేదు. దేవతలు స్వర్గలోక వాసులు అనే పురాతన విశ్వాసాలలో కొండలపైనా ఎత్తైనచోట్ల క్షేత్ర నిర్మాణము పురాతనము. ఆ నమ్మకాలలో ఊరిపేరు చివర కొండ వుండుట పరిపాటి .. మన్యప్రాంత గిరిజనులలో పెన్ అనగా దేవుడట.. పెన్+కొండ=దేవరకొండ - పెనుగొండ ఐనదా ? ... ... పెనుగొండ వైశ్యసమ్మాననాకేంద్రము. సుసంపన్న పురము. వారి తూనికలు, కొలతలు నాడు ప్రామాణికము లని పించును. పెనుగోల (పెద్ద తక్కెడ, కాటా) కు పెనుగొండకు శబ్ద సంబంధ ముండనేమో!"36

### లక్ష్మణేశ్వరము (న)

శ్రీరామచంద్రుని సోదరుడైన లక్ష్మణునిచే ప్రతిష్ఠింప బడిన లక్ష్మణేశ్వరాలయముండిన గ్రామముగావున ఆ పేరేర్పడి నదిగా తలంప బడుచున్నది.37

### మ ం డ పా క (త)

"ప్రజలు ఆ యా తావుల కాపేరు వచ్చిన కారణాలు చెప్పడంలో అత్రిముని పేరిట అత్తిలి, దూర్వాసుని పేరిట దువ్వ

అన్నట్లే మండపాకకు మాండవ్యునికి ముడి పెట్టారు ...... మండపాక నేడు కమ్మటూరు. పూర్వం గొల్ల లెక్కువగా వుండేవారట. వారి తావు మందపాక మండపాకగా మారెను"38 ఈ విషయమే మరింత వివరముగా విశదీకరింప బడినది. "శ్రీమాండవ్య మహాముని ఈప్రాంతమున తపస్సు చేసుకొను చుండెడి వాడట. అందుచే తత్తీరప్రాంతముననున్న ఈ గ్రామము నకు మాండవ్య క్షేత్రమనియు, మండపాకయనియు వ్యవహారము కలిగెనట.... పశువుల మందలుండుటచే ఈగ్రామము 'మందపాక' యనియు, ఆ మందపాక అను గ్రామము కాలక్రమమున 'మండ పాక'యని వ్యవహరింపబడ దొడగెనని పెద్దలవలన వినికిడి."39

## మల్లేశ్వరం (త)

చాళుక్య మల్లపరాజుచే ఈ గ్రామమందు ప్రతిష్ఠితుడైన స్వామి 'మల్లేశ్వరుడు'గా పేరొందాడు. ఆ దేవుని పేర గ్రామం 'మల్లేశ్వరం' అయినది.

## రేలంగి (త)

"పూర్వం రాముడు తాటకిని చంపినప్పుడు తాటకి తల తెగి ఈ ఊరు వున్న ప్రదేశంలో రాలింది. అందుకని ఈ ప్రదేశాన్ని 'రాలింది' అని పిలవసాగారు. వాడుకలో రూపాంతరంచెంది ఆ మాట 'రేలంగి' అయింది."41

దేవర చెరువు ఖండ్రిక (భీ), రామానుజపురం; వేదాంత పురం (పో), అమృతలింగంపేట; నాగులదేవునిపాడు (ఏ); చక్రదేవరపల్లి; దేవరాపల్లి; దేవులపల్లి (కొ), గుడిపాడు; గుడి పాడు ఖండ్రిక; శంఖచక్రపురం (చిం) మొ॥ గ్రామ నామములు కూడ హిందూ దేవతా పరముగా నేర్పడినవిగా ఎంచవచ్చును.

## బౌద్ధము

"పేరులో బౌద్ధ సంబంధమనిపించు వడలి, సిద్ధాంతం,త,"42 వగైరా గ్రామములీ జిల్లాలో నున్నవి.

## జైనము

ఈ జిల్లాలో ఆచంట (న), ఏలూరుపాడు (భీ), కలశమూరు (త), పెనుమంచిలి(త) మొ॥చోట్ల జైన ప్రాభవ సూచక అవశేష ములు లభించినవి. జైనవారిగూడెం (పో) అను గ్రామము స్పష్టముగా జైన ప్రాభవమును సూచించుచున్నది. పెదమిరాం(భీ) అనగా పెద్ద చెట్టు అని అర్థంకాగా అది ఆచోట నేర్పడిన జైన స్థావరమును సూచించేదిగా వున్నదని పరిశోధకాభిప్రాయం.43

## రాజ వంశముల, పాలకుల నామ ప్రభావము

గ్రామ నామములకు, వ్యక్తినామములకు సంబంధము నిరూ పించుటలో సూక్ష్మ పరిశోధన అవసరమెంతైనావుంది. ఒకే పేరు గల గ్రామములు ఒకే జిల్లాలో పలు తాలూకాలలోను, వేరొక జిల్లాలోను కూడా కానవస్తవి. ఒకే పేరుగల రాజన్యులు వివిధ రాజవంశములలో కానవస్తూ వుంటారు. ఉదాహరణకు తాడేపల్లి గూడెం తాలూకాలోని "గణపవరం అనే పేరు కాకతి గణపతిదేవ మహారాజునుండి వచ్చెను"44 అని కేవలం పేరు పోలికనుబట్టి కాక వేరు ప్రబల సాక్ష్యాధారము లాధారంగా పరిశోధకులు నిశ్చ యించి వుంటవచ్చు. గణపవరం అనే గ్రామం పోలవరంతాలూకా లోనూ వున్నది. కోన, కొలను, మలయ మండలాధిపతులలో వుండిన 'గణపతి' నామధేయు లెవరైనా ఈ గణపవరములకు కర్తలై యుందురా అనునది వివేచించవలసిన విషయము. మహా దేవపురం (పో), మహాదేవపట్నం (భీ) గ్రామములున్నవి. మలయ మండలాధిపతులలో, నిడదవోలు చాళుక్యులలో 'మహాదేవ' నామధారులున్నారు. తాడేపల్లిగూడెం తాలూకాలో కూనవరమను గ్రామము ఇది. కొలను కూనపరాజు-కోమకొండ మంచికొండ కూనవ నాయకులలో నెవరీ గ్రామమునకు తమ పేరిచ్చిరో ? మల్లవరం (కొ&న), మల్లేశ్వరం (త&ఏ&చిం), చినమల్లాం-పెద మల్లాం (న) గ్రామములున్నవి. తూర్పు చాళుక్యులలో యుద్ధ మల్లులున్నారు. కల్యాణి చాళుక్య త్రైలోక మల్ల సోమేశ్వరుడు- ఈ ప్రాంతముపై ప్రభావము నెరపినవాడే. ప్రౌఢ దేవరాయల రాజమహేంద్రవర ప్రతినిధి మల్లప ఒడయరు గలడు. వీరిలో నెవరీ గ్రామనామ కారకులై యుందురు? రెండవ పులకేశి 'సత్యాశ్రయ' బిరుదాంకితుడు. కల్యాణి చాళుక్యులకు ఈ బిరుదు అనువంశికము. తూర్పు చాళుక్య రాజరాజు 'సత్యాశ్రయకులశేఖర' బిరుదు వరించాడు. కోన పాలకులలోని 'సత్య' నామధేయులు అలా వుండగా, స్థూలముగా సత్యవోలు (ఏ), సత్యవాడ సత్యవరం (త) గ్రామములు చాళుక్యుల బిరుద పరంగా వెలసినవని భావించడానికి వీలున్నది. కొప్పుల సామంత నృపతులలో ప్రోలయ - కాపయ లున్నప్పటికీ వారి పైవారైన ముసునూరి ప్రోలయ-కాపయ నాయ కుల పేరుమీదుగనే ఈ మండలములోని పోలవరములు(భీ&పో), కాపవరములు (భీ&న&త) వెలసినవని ఎంచవచ్చును. "సామాన్య ముగా కోటలు-దుర్గములకు సమీపమున కేసవరమని, కాపవరమని గ్రామములుండును."45 కనుక కావలిపురము (త) వలే ఈ కావ వరములో నేవైన కావలిపురములు కావచ్చును. ఇక కేశవరం (తా) కొలని కేశవదేవరాజులతో సంబంధము కలిగినదిగా

ఎంచబ్బుననుకొందుమన్న "కేసవర మనగా - కేసరులవంటి వీరు లుండెడి గ్రామము"46 ను అభిప్రాయమున్నది. బేతపూడి (భీ), (కంపాలి) బేతంపూడి (న) కోటగణపాంబ భర్త బేతరాజు పేరున నేర్పడినవి కావచ్చును. (కోతుల) గోకవరం (చిం), గోకినపల్లి (ఏ) గ్రామముల పూర్వరూపము 'గోకర్ణ' శబ్దసారూప్యము కలిగి నవిగా భావిస్తే వెలనాటి గొంక (గోకర్ణ గొంక-గోక) తో సంబంధము సంభావింపవచ్చును. ఈ ప్రాంతముపై సాగిన చోళ, చాళుక్య-చోళ, వెలనాటి చోడాది రాజవంశపాలనా ప్రభావసూచికముగా తాడేపల్లిగూడెం తాలూకాలో రెండు చోడవరం గ్రామము లున్నవి. ఈ జిల్లాలో ఒక తాలూకా కేంద్రమైన భీమవరము మొదటి చాళుక్య భీముని పరంగా రూపెత్తినదని భావింపబడు చున్నది47 రెండవ కోట కేతరాజు పేరు కేతవరం (కొ), కొప్పుల వంశపు నామయనాయకుని పేర నామవరం (చిం) ఏర్పడి వుండ వచ్చును. వేమవరములు (భీ&న&త) సహజముగా 'వేరు' నామాభి దానముగల రెడ్డిరాజులకే చెందినవై యుండుననుకొనుటకు అభ్యంతరము లేదు. కాని పోలవరమునకు రెడ్డిపోలవరమను వ్యవహారము అది రెడ్డిరాజుల పాలనలో నుండి యుండుటవలననే నేర్పడినది48 అని నిశ్చయించుటకు చిన్న అభ్యంతరమగుపడుచున్నది. శాశ్వతకరనిర్ణయము (1802) నాటికి పోలవరం జమిందారీ రెడ్డి లక్ష్మీనారాయణదేవు. ఇట్టి సంశయగ్రస్తతకు ప్రబల ఉదాహరణముగా నిడదవోలు [కొ] ను పేర్కొన వచ్చు. (i) "నిడదవోలు, నిడుదవోలు, నిడుదప్రోలు పూర్వనామం నిరవద్యపురము. నరేంద్రమృగరాజు, కలివిష్ణువర్ధన ద్వితీయ విజయాదిత్యుని (క్రీ. శ. 799-839) బిరుదుల్లో ఒకటి నిరవద్య-ఆ పేరిటి పురము"49 (ii) "'నిరవద్య' అనేది పశ్చిమచాళుక్య రెండవ విజయాదిత్యునకు (క్రీ. శ. 699-729) బిరుదనామము. అతని పేరనే యీ పురమున కాపేరు లభించియుండవచ్చును."50 బాదామి, వేంగి చాళుక్యవంశములకు చెందిన సమీపకాలమువారైన ఇరువురు రాజన్యుల కొకే బిరుదము ఉండుటయేగాక బాదామి చాళుక్య ఉద్యోగవర్గములోని వారికి కూడా ఈ బిరుదు చెల్లియుండుట గమనించదగిన విషయము.50-A

అంతగా చరిత్ర ప్రసిద్ధిగాని గ్రామ నామముల పుట్టు పూర్వోత్తరములను గూర్చి కూడ 'స్థలపురాణములు' వేర్వేరుములుగా వుండుట గమనించవచ్చు. ఉ॥ దా॥ దండగర్ర (తా). "ఉంపుడుకత్తె తన దండకడియమువెలతో చెరువుకట్టవేయించెను. అందువలన "దండకర్ర" అని పేరు వచ్చెను. ఈ "దండకర్రే" ఒక గ్రామముగా రూపొందినది."51 "ఒకప్పుడక్కడ యేనా పల్లకీల ప్రయాణ కాలమున బోయీలు భుజములక్రింది కర్రలను (దండగర్ర)మార్చుకునే మజిలీ కాబట్టి ఆ పేరు వచ్చెనని కొందరి నమ్మకము. దండగర్రలో ఒకప్పుడు దండు (స్కంధావారము, కంటోన్మెంట్) ఉండెనేమో పరిశోధనీయము."52

ఏరువబోడ భక్తిరాజ కామరాజు (1356-1367) పేరున వెలసినది కామవరపుకోట (బిం), ఈతని రెండవ కుమారుడు అన్నదేవచోడుడు (1377-1416) మహాయోధుడు. అన్నదేవరపేట (కొ) ఈతని పరంగా రూపెత్తినదికానగును. అన్నదేవ చోడుడు ఉండేశుల అల్లుడు. "ఈ ఉండ్రాజుల పేరననే ఉండ్రాజవరము, ఉండేశపురమిత్యాది నామాంకితములగల గ్రామములు వెలసినేటికి వారల కీర్తి ప్రతిష్ఠలను వ్యాపింప చేయుచున్నవి.

## సంస్థానములు / జమిందారీలు

### నూ జి వీ డు

పశ్చిమగోదావరి మండలములోనికి కూడ విస్తరించుకొని వుండిన నూజివీటి తొలినాటి సంస్థానాధీశులలో విఖ్యాతుడును, 'అప్పారావుగా' ప్రసిద్ధుడును (క్రీ. శ. 1665 ప్రాంతము) యైన అప్పన్న పేరిట వెలసినవి అప్పనవీడు (భీ), అప్పారావుపేట (తా). ఈతని కుమారుడు వెంకటాద్రి అప్పారావు. ఈ కోవలోని నిజామునుండి 'సవైరాజా' బిరుదు బడసిన మరియొక వెంకటాద్రి అప్పారావు (1772 ప్రాంతము) గలడు. వీరిరువురిలో నెవరి పేరుననగాని వెంకటాద్రి అప్పారావుపురం (తా) ఏర్పడినది. పెద వెంకటాద్రి అప్పారావు కుమారుడు, 'తీన్ హజార్ మన్సబ్దార్' బిరుదాంకితుడు కుమార ధూర్జటి 'ఇందుమతీ పరిణయ' ప్రబంధ కృతిభర్తయైన నరసింహ అప్పారావు. అతని వారసుడు రామచంద్ర లేక నరసింహ అప్పారావు. ..... ఇంకను నూజివీటి వారి వంశమున నరసింహ - రామచంద్ర నామధేయులున్నారు. నరసింహపురం (ఏ&భీ), నరసింహరాజపురాగ్రహారం (భీ), పెద రామచంద్రాపురం, చినరామచంద్రాపురం (భీ) గ్రామములలో వేటికి ఎవరు పేర్లిచ్చిరో ! 1812 సం॥ లో పోలవరము ఎస్టేట్‌ను వేలములో నూజివీటి రామచంద్ర అప్పారావు ఖరీదుచేసెను. కనుకనే కాబోలు పోలవరం తాలూకాలో నొక క్రొత్త రామచంద్రపురం అను గ్రామము వెలసినది.

### పో ల వ ర ం

1803 సం॥ శాశ్వతకర నిర్ణయకాలము నాటికి రెడ్డి లక్ష్మీనారాయణదేవు పేర నమోదయి యుండిన పోలవరం జమిందారీ

తరువాతి పాలకుడగు రాజా మంగపతి దేవు కాలమున ఏ॰ము వేయబడినది. పోలవరం తాలూకాలోనివైన లక్ష్మీనారాయణదేవుపేట, మంగపతిదేవుపేట ఈ పాలకుల మూలమున ఏర్పడినవని స్పష్టము.

## మొగల్తుర్రు

మొగల్తుర్రు తొలియేలికలలో నొకడైన పెదబాపరాజు (17శం.) పేరున రూపెత్తినది. బాపిరాజుగూడెం (ఏ) కావచ్చును. ఇట్లే ఈ సంస్థానాధీశులలోని నారాయణరాజు పేర నారాయణపురం (ఏ), తిరుపతిరాజు (1760–1791) పేర తిరుపతిపురం (ఏ) అని లెక్కవేసుకొన వచ్చునుగాని అందులకు ప్రబల ప్రమాణము స్థానిక పరిశీలనము వలన సాధింపబడవలసి యున్నది.

## ముస్లిం పాలనా ప్రభావము

రుసుమ్‌బాదా (న) పేరు అసఫ్‌జా (1713–1748, రాజమండ్రి ప్రతినిధి-చండశాసనుడు-మొగల్తుర్రు, నూజివీడు, పెద్దాపురం మొ॥ జమిందారీలకు కంటకప్రాయుడైన రుసుమ్‌ఖాన్‌ను స్ఫురణకు దెచ్చును. నవాబుపాలెం (తా) ఫలానా ఈ నవాబు సృష్టియని నిర్ణయించుట కష్టమే. కెస్‌పా (కసుబా.కస్బా) పెంటపాడు (తా) నాటి అధికార భాషయైన ఉర్దూభాష ప్రభావమును సూచించును. "కసుబా పెంటపాడు నాటి సరిపాలనా యంత్రాంగమునకు ముఖ్యస్థలమై యుండును. కసుబా అర్థం గడిస్థానము, వర్తకస్థలము, గుజరీ. రెవెన్యూ ఇచ్చే పెద్ద గ్రామము."55 'తానాషా' అని పేరుగాంచిన అబుల్‌హసన్ కుతుబ్షా (1673–1687) మంత్రి సేనాధిపతులుగా అక్కన-మాదన్నలు ప్రసిద్ధులు.

## ఆకివీడు (భీ)

"అక్కన్న మాదన్నలు ఇచ్చటనే నివసించిరని ప్రజలు అనుకొందురు. అక్కన్న నివసించుట వలన ఈ గ్రామమునకు ఆకివీడు అని పేరు. మాదన్న నివసించుటచే దీనికి సివారుగా నున్న గ్రామమునకు మాదివాడ అను పేరువచ్చినట్లున్నది."56 కాగా, విక్రమేంద్ర (విష్ణుకుండిన) మహారాజు తుండి తామ్రశాసనమున దాన గ్రహీత స్వస్థలము ఆకి అని శాసనమున చెప్పబడినది. "పరిష్కర్తలు ఆకి గ్రామము పశ్చిమగోదావరిజిల్లా ఆకివీడు గ్రామము అయివుండవచ్చునను అభిప్రాయము వెలిబుచ్చిరి."57 ఎక్కడ విష్ణుకుండిన విక్రమేంద్రుని కాలము- ఎక్కడి అక్కన్న మాదన్నలు!

## గూడెములు- పాలెములు

శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం జిల్లాలలో 'వలసలు' మిక్కుటముగా నున్నట్లు, ఈజిల్లాలో గూడెములు - పాలెములు శతాధికముగానున్నవి. వాటిలో మూడు వంతులకుపైగా వ్యక్తి నామములతో వెలసినట్టివిగానున్నవి. ఉదా : అక్కిరెడ్డిగూడెం, చక్రయ్యగూడెం, కొండలరావుపాలెం, లింగారావుపాలెం, మేదినీరావుపాలెం, రాజమ్మపాలెం, రామారావుగూడెం, రామన్నపాలెం, సత్తెన్నగూడెం, సూరప్పగూడెం, తిరుమలమ్మపాలెం, తిమ్మనగూడెం (అన్నీ ఏ); అల్లంచెర్ల రాజుపాలెం, అప్పలరాజుగూడెం, అయ్యవరాజుగూడెం, చంద్రన్నపాలెం, ధర్మాజీగూడెం, గురవాయిగూడెం, కృష్ణారావుపాలెం, లింగారావుపాలెం, మల్లయ్యగూడెం, పట్టయగూడెం, రామనగూడెం, రామన్నపాలెం, శాయన్నగూడెం, తిమ్మారెడ్డిపాలెం, వెంకమ్మపాలెం (అన్నీ చిం) చిన్నయ్యగూడెం, బొప్పరామన్నగూడెం, ధూమంతునిగూడెం, కిన్నయ్యగూడెం, తిమ్మరాజుపాలెం, ఎర్రనగూడెం (అన్నీ కొ). ఈవిధమైన గ్రామములన్నియు ఏతత్ గ్రామస్థాపకుల పేర్లమీదను గాని, ఏతత్ స్థాపనాకాలమునాటి ప్రముఖ వ్యక్తుల పేళ్ళమీదగాని ఏర్పడినవి. చాలవరకు ఇవి జమిందారీ యుగములో (18–19 శ॥) నేర్పడినవి కావచ్చును. స్థలజ్ఞులు ఆయా గ్రామముల పుట్టు పూర్వోత్తరముల విషయమై విశదీకరింప గలుగుదురు.

## ఇంటిపేర్లు - గ్రామనామములు

ఈ రెండింటికిగల అవినాభావ సంబంధము ఈ జిల్లాలో కొన్ని గ్రామములు ఇంటిపేర్ల ననుసరించియే ఏర్పడుటబట్టి మరింతగా స్పష్టము. ఉ॥ దా॥ దానంవారిగూడెం, దాట్లవారిగూడెం, మడకంవారిగూడెం, రావువారిగూడెం, స్వర్ణవారిగూడెం, (అన్నీపో), చెలికానివారి పోతిపల్లి, మైలవరపువారిగూడెం (ఏ); బండివారిగూడెం, గణపవారిగూడెం, పుప్పాలవారిగూడెం, సెట్టివారిగూడెం (అన్నీ చిం); జలగంవారి ఖండ్రిక (కొ). గ్రామనామములు ఇంటిపేర్లుగాను, ఇంటిపేర్లు గ్రామ నామములుగను అయిన సందర్భమునకు ఉదా॥ నేలటూరు, నిడదవోలు(కొ), నందమూరు (కొ&తా); కోవల్లి (భీ&ఏ) అడవికొలను, తెలికిచర్ల, వల్లూరు (తా), క్రొవ్విడి (భీ), ముంజులూరు (పో), అండలూరు, గుమ్ములూరు, కాళ్ళకూరు, నవుడూరు, ఉంగుటూరు, వల్లూరు (అన్నీ భీ).

## జాతి, కుల, వృత్తి సంబంధములు

ఏదియో ఒక జాతి, కుల, వృత్తులకు సంబంధించిన వారు తొలుత నివసించుటను బట్టియో, లేక వారి సంఖ్య గణనీయమైనదిగా నుండుటవలననో కొన్ని గ్రామములకు తత్ సూచనా పూర్వక నామము లేర్పడినట్లు తోచును. ఉ॥ దా॥ గవరవరం, కోమటిలంక, మాలసానిగుంట, సానిగూడెం, రావులకుంట, వడ్డిగూడెం(అన్నీ ఏ); బ్రాహ్మణగూడెం, గవరవరం, కోమటిగుంట, సెట్టిపేట(అన్నీ కొ);

కంసాలి బేతపూడి (న): కోయ రాజమండ్రి (పో): గొల్లల కోడేరు (భీ): రావులపట్టు (తా).

## పశు, పక్షి, వృక్ష సంబంధములు

ఉ॥ దా॥ డిప్పకాయలపాడు, చింతలగూడెం, దోరమామిడి, నిమ్మలగూడెం, తాటియాకులగూడెం, దొండపూడి, తాడిమూడి, గోగుమిల్లి, పూతికపాడు (అన్నీ పో), శృంగవృక్షం (భీ): ఆముదాలపల్లి, చీపురుగూడెం (తా): కోరుమామిడి, నిమ్మల గూడెం, చెరుకుమిల్లి (అన్నీ కొ): బూరుగుపల్లి, చిన్నమామిడిపల్లి, గోరింటాడ, నేరేడుమిల్లి (అన్నీ న): కాకరపాడు, మామిడూరు, తాడిపర్రు, తేపర్రు, (త): ఆముదాలచెలక, చింతలపూడి, రావికంపాడు, వేములపల్లి, (అన్నీ చిం): బూరుగుగూడెం, చల్లచింతలపూడి, చోడిమళ్ళ, దోశపాడు, జాజులకుంట, పైడిచింతపాడు (అన్నీ ఏ): చిలకలూరు (పో), కాకుల ఇల్లిందలపర్రు, [త] కోతులగోకవరం [చిం]: నాగులపల్లి శరభపురం, కొక్కిరాయిలంక [ఏ]

## భౌగోళిక విశేష సంజనితములు

గుంటుపల్లికి పూర్వరూపముగా భావింపబడు పిదుండ [పృథు+అండ=పెద్దగుడ్డు=గుడుపల్లి - గుంటుపల్లి] పేరు ఆ గ్రామ భౌగోళిక స్వభావముచేత వచ్చియుండునను అభిప్రాయము ఇదివరకే గమనించడం జరిగింది. అట్టి భౌగోళిక ప్రత్యేకతల సూచించు గ్రామనామములను మరికొన్నింటిని గుర్తించవచ్చును. ఉదా॥ అరుగొలను [తా]. "పూర్వం అరుకొలనులు ఉండేవట. వాటి పేరిట గ్రామం అరుగొలనయినదట."58 అడవికొలను, చినఇంద్రకొలను, పెదఇంద్రకొలను, తెలికచెర్ల [పూర్వనామం తెలికచెఱువు] [అన్నీ తా], మోగల్లు [మోంగొలను] [భీ], పాలకొల్లు [న]; గుండుగొలను [ఏ] గుండుగొలనుకుంటి [చిం] మొ॥ పేర్లుకూడా కొలనుల బట్టి ఏర్పడినవియే అయిఉన్నవి. తూర్పువిప్ప [రు&త], పడమట విప్పర్రు [తా], కొమ్మర ఉత్తర-దక్షిణ [ఏ] మొ॥ ఆయా గ్రామములున్న దిక్కులను బట్టి విశేషణములను చేర్చుకొన్నవి.

## పెద్ద - చిన్న, క్రొత్త - పాత వగైరా

ఒకేపేరుగల గ్రామాలను వేరువేరుగా గుర్తించడానికి ఆయా పేర్లముందు పెద్ద-చిన్న అనే విశేషణం చేర్చడం ఒక ఆనవాయితీ. ఉదా: పెదకాపవరం-చినకాపవరం, పెదమిర్రాం-చినమిర్రాం, పెదపుల్లేరు-చినపుల్లేరు (అన్నీ భీ): చిన నిండ్రకొలను - పెద నిండ్రకొలను, చిన రామచంద్రపురం - పెదరామచంద్రపురం [తా]: పెదమల్లాం-చినమల్లాం, పెదమామిడిపల్లి-చినమామిడిపల్లి [న]. క్రొత్తగా ఏర్పడిన గ్రామాలను అదే పేరుగల పాత గ్రామాల నుంచి వేరుగా గుర్తించడానికి ఆయా గ్రామ నామముల ముందు పాత కొత్త అనే విశేషణములను చేర్చడం ఒక పద్ధతి. ఉదా: పెద్ద-చిన్న రామచంద్రపురములు భీమవరం తాలూకాలో వుండగా కొత్త రామచంద్రపురం పోలవరం తాలూకాలోనున్నది. అయితే కొత్తపల్లి [ఏ&చిం&తా] అనే ఊళ్ళు వున్నవిగాని పాత పల్లి అనే ఊరు తటస్థపడలేదు. అట్లే కొత్తగూడెం [ఏ], కొత్తపాడు[త], కొత్తూరు [ఏ]. పెమ్మరాజు పోలవరం, అయ్యవారి పోలవరం, పోలవరంవున్న తాలూకాలోనేవుండి తమ ప్రత్యేకతను కలిగివుండగా మడుగు పోలవరం భీమవరం తాలూకాలో వున్నది. తణుకు తాలూకాలోనేవున్న కముదవల్లి నుంచి దాసుల కుముదవల్లి - కన్నయ్య కుముదవల్లి గ్రామాలను వేరుగా గుర్తించడానికి వీలుగా వున్నవి. వేమవరం గ్రామాలనుంచి తణుకులోగల ఒక వేమవరం తాలూకానుబట్టి ప్రత్యేకంగా తణుకు వేమవరమని పిలువబడుచుండగా అదే తాలూకాలోని మరియొక వేమవరం పిట్టల వేమవరమని ప్రత్యేకంగా గుర్తించడానికి సౌకర్యప్రవిశేషణం కలిగియున్నది. నరసాపురం తాలూకాలోని రెండు వల్లూరులలోను ఒక దానియందు ఏకాలములోనో పండితులు నివసించినట్లున్నది కావున అది పండిత వల్లూరను పేరు కలిగియున్నది.

వేర్పాటుగా గుర్తించడానికి వీలుకల్పించనిగ్రామనామములు లేకపోలేదు. ఉదా: కుముదవల్లి [భీ&త], వల్లూరు [న&తా], వేమవరం [భీ&న] సారిపల్లి [తా&పో], నందమూరు [కొ&తా] గవరవరం [ఏ&కొ], నిమ్మలగూడెం[పో&కొ], సీతాపురం[తా&భీ] రామన్నపాలెం [రెండూ చిం], లింగారావుపాలెం [ఏ&చిం] శ్రీరామపురం [ఏ&చిం], సీతానగరం [పో&చిం], జగన్నాధపురం [ఏ&కొ&న&పో], నరసింహాపురం [భీ&ఏ], నరసాపురం (న&చిం), రాఘవపురం [ఏ&చిం], కేతవరం [కొ&చిం], వేగవరం [చి&ఏ]. ఒకే పేరునగల గ్రామములు ఏలూరు, చింతలపూడి తాలూకాలలో ఎక్కువగా నున్నట్లు తెలుస్తోంది. ఇది ఆయా తాలూకాల మధ్య జరిగిన వలస పద్ధతిని సూచించేదిగా వున్నది.

## ఊరి పేరుపై మమకారం

ఏ కారణముల చేత వలసపోయి వేరొకచోట స్థిరపడిన వారైనా పాతపట్టులపై మమకారమును వదులుకొనలేరనిపించును. గ్రామనామములందు కొంత సాక్ష్యము. చేబ్రోలు-చేబ్రోలు ఖండ్రిక, తాడేపల్లి - తాడేపల్లిగూడెం [తా], రాపాక-రాపాక ఖండ్రిక,

కానూరు - కానూరుఅగ్రహారం [తా]; గుడిపాడు - గుడిపాడు ఖండ్రిక, రంగాపురం - రంగాపురంఖండ్రిక [చిం], పాండువ - పాండువఖండ్రిక, వేంద్ర - వేంద్ర అగ్రహారం [భీ]. ఈ విధముగా ఖండ్రిక అను గ్రామనామాంత్యమును గలిగియున్నవి. ఆయా గ్రామ అనుబంధ సూచితములని భావించినను, విజయనగరం జిల్లాలోని భోగాపురం [ఏ], విశాఖజిల్లాలోని ఎలమంచిలి [న] తూర్పుగోదావరి జిల్లాలోని కాకినాడ [తా], గుంటూరు జిల్లాలోని చేబ్రోలు [తా] వంటిగ్రామములీ జిల్లాలో యుండుట గమనించదగి యున్నది.

## ముగింపు

పై వివరణలను అనుసరించి ఈ క్రింది నిశ్చయములకు రావచ్చును. 1. పౌరాణిక పరముగా నేర్పడినట్లు చెప్పబడిన గ్రామనామ కారణపైనము గతికాలము నాటి సాంఘిక జీవనముపై మత సంబంధ విశ్వాసములకుండిన పట్టును తెలియజేసేదిగా ఉన్నది. 2. కళింగాంధ్రములో వలెనే ఈ వేంగీ మండలాంతర్గతమైన జిల్లాలో కూడా పూర్వ రాజవంశ పాలక వర్గ ప్రభావము గ్రామనామములపై ప్రగాఢముగ నున్నట్లు కనుగొనబడినది. కాని ఈ ప్రాంతముపై ఏలుబడి సాగించిన రాజ వంశములలో ఒకే పేరు గల రాజన్యులుండుటచే అట్టి గ్రామనామ కారక నిర్ణయ విషయములో ప్రత్యేక శ్రద్ధ వహించవలసి ఉన్నది. 3. ముస్లింపాలనా కాలమున ఏలూరు ఒక సర్కారు కేంద్రమై యుండినప్పటికిని గ్రామనామములపై ఆ ప్రభావము కన్పట్టలేదు. 4. ఈ జిల్లాలో కొంత ఏజెన్సి [మన్యం] తాలూకా ఉన్నది కాని ఆ ప్రాంత గ్రామనామములపై గిరిజన భాషా ప్రభావము లేకుండినది. 5. సంస్థానములు రాసిలో ఇరుగు పొరుగు మండలములకు తీసి పోవుగాని సంస్థానాధీశుల నామవాసి గ్రామములకు అంతగా పట్టినట్లులేదు. అయితే, వ్యక్తుల పేర నేర్పడిన 'పాలెము' 'గూడెము' వంటి చరిత్రగతిలో ఆధునికతను సూచించు గ్రామ నామాంత్యములు గల గ్రామముల సంఖ్య శతస్థానమున నుండుటను బట్టి ఆయా గ్రామములు జమిందారీయుగపు న – తదాశ్రిత ప్రభు వర్గ ప్రభావజనితములని భావించుటకు వీలున్నది. 6. ఈ విషయముపై సాగవలసిన భాషాపరిశోధన కేవలము శాసన, సాహిత్యాధారములతో సరిపెట్టుకొనక – క్షేత్రవిచారణావసరమును గూడ పరిగణనలోనికి తీసుకొనవలసి యుండునని ఈ ప్రాథమిక పరిశీలన గుర్తించు చున్నది.

## అధోజ్ఞాపికలు

1. ఎమ్. రామమోహనరావు, వెస్ట్ గోదావరి డిస్ట్రిక్ట్ 1925-1947, ఎ హిస్టారికల్ సర్వే విత్ స్పెషల్ రిఫరెన్స్ టు రెవిన్యూ ఎడ్మినిస్ట్రేషన్ [ఆంధ్ర విశ్వకళాపరిషత్, వాల్తేరు, 1982] అన్ పబ్లిష్డ్ ఎమ్. ఫిల్. థీసిస్.

2. పై. వి. కృష్ణారావు & ఏటుకూరి బలరామమూర్తి [సం] ఆంధ్రప్రదేశ్ దర్శిని, (విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1976), పు. 1031.

◆ సౌలభ్యము కొరకు తాలూకాల పేర్లు కుండలీకరణములలో సంక్షిప్తముగా పేర్కొనబడినవి. ఆ సంజ్ఞా వివరణ: భీ= భీమవరం; చిం=చింతలపూడి; ఏ=ఏలూరు; న=నరసాపురం: పో=పోలవరం; కొ=కొవ్వూరు; తా=తాడేపల్లిగూడెం; త =తణుకు.

3. మద్రాస్ డిస్ట్రిక్ట్ గజిటార్స్, గోదావరి, 1907.

4. ఈ ప్రకరణమునకును, శాసనములు-గ్రామ నామములు అను ప్రకరణమునకును ప్రధాన ఆధారములు: 1) కుందూరిఈశ్వర దత్తు, ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, [ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాద్, ద్వితీయముద్రణ, 1979] 2) డా. బూదరాజు రాధాకృష్ణ, ప్రాచీనాంధ్రశాసనాలు [ఆం. ప్ర. సాహిత్య అకాడమి, హైదరాబాద్, 1971].

5. సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము, ఐదవ సంపుటము [హైదరాబాదు, 1966], పు. 199.

6. సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము, మూడవ సంపుటము [హైదరాబాదు, 1962], పు. 93.

7. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు. 114.

8. పైది, పు. 2 2.

9. పైది, పు. 3.

10. పైది, పు 256.

11. సంగ్రహ విజ్ఞాన కోశము, నాల్గవ సంపుటము, పు. 90.

డా ఎన్. వెంకట రమణయ్య, ది ఈస్టరన్ చాళుక్యాస్ అఫ్ వేంగి, [మద్రాసు, 950], పు. 65.

12. చూ॥ డా. యస్. యస్. మూర్తి, 'సంఖ్యాకిత ప్రాంతీయ విభాగాలు', భారతి, డిసెంబర్ 1979, పుట 16.

13. డా॥ ఆర్. సుబ్రహ్మణ్యం, ది గుంటుపల్లి బ్రాహ్మీ ఇన్‌స్క్రిప్షన్ ఆఫ్ ఖారవేల, [ఆం. ప్ర. గవర్నమెంట్ ఎపిగ్రాఫికల్ సిరీస్ నెం. 3, హైదరాబాద్, 1968], పే. 5.

14. ఇంగువ కార్తికేయశర్మ, 'గుంటుపల్లి గుహలు-బ్రాహ్మీశాసనములు', భారతి, జూలై 1978, పుట 24 మరియు ఆగస్టు 1978, పుట 27.

15. ఆంధ్రదేశ చరిత్ర భూగోళసర్వస్వము, రెండవ సంపుటము, పు. 2 & 486

16. పైది, పుట 485, 486.

17. పైది, పుట 483.

18. డా॥ బూదరాజు రాధాకృష్ణ, ప్రాచీనాంధ్ర శాసనాలు, పు. 250

19. ఖండవల్లి లక్ష్మీరంజనం - బాలేందుశేఖరం, 'ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి, (మద్రాస్, 1965) పుట 47.

20. ప్రాచీనాంధ్ర శాసనాలు, పుట 495-96

21. యస్. ఐ. ఐ. X, నెం. 262, శ. సం. 1140

22. పైది, నెం. 126, శ. సం. 1073.

23. జి. ఆర్. వర్మ, 'గుడీ-గుంపా' (వర్మన్ పబ్లికేషన్స్), తాడేపల్లిగూడెం, 1974) పుట 22.

24. ఆంధ్రదేశ చరిత్ర భూగోళ సర్వస్వము, మూడవసంపుటము, పుట 554.

25. పైది, పుట 552.

26. తురగా కృష్ణమూర్తి, 'దాయగజకేశరి ఖండవల్లి శాసనము', ఎపిగ్రాఫియా ఆంధ్రికా, IV, (హైదరాబాదు, 1975), పుట 106

27.A. ఆం. ప్ర. డి. గ. వెస్ట్‌గోదావరి, పుట 238

27. రెడ్డిసంచిక, పుట

28. భూగోళసర్వస్వము, మొదటిసంపుటము, పుట 155.

29. పైది, మూడవసంపుటము, పుట 36-37, 33. ఆంధ్రభూమి [వారపత్రిక, సికింద్రాబాద్], 21-7-1983, పుట 46.

30. గుడీ - గుంపా, పుట 4.

31. పైది, పుట 53, 55.

32. పైది, పుట 5.

33. డా॥ ఎన్. రమేశన్ [సం] ఆం. ప్ర. డిస్ట్రిక్ట్ గ వెస్ట్‌గోదావరి, పు 237.

34. గుడీ - గుంపా, పుట 44.

35. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము, పదవసంపుటము, పుట 462.

36. గుడీ - గుంపా, పుట 57.

37. ఆం. ప్ర. డి. గ. వెస్ట్‌గోదావరి, పు. 233.

8. గుడీ-గుంపా, పు. 35.

39. సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము, ఏడవ సంపుటము పు. 90.

40. ఆంధ్రపత్రిక (దినపత్రిక, విజయవాడ), 13-2-1983, పు. 7-8.

41. ఆంధ్రభూమి (వారపత్రిక, సికింద్రాబాద్), 21-7-1983, పు. 46.

42. గుడీ-గుంపా, పు. 57.

43. యస్. గోపాలకృష్ణమూర్తి, జైన్ వెస్టీజెస్ ఇన్ ఆంధ్ర (హైదరాబాద్, 1963) పు. 38.

44. గుడీ-గుంపా, పు. 21.

45. భారతి, డిసెంబర్ 1979, పు. 57.

46. పైది.

47. ఆం॥ ప్ర॥ డి॥ గ॥ వెస్ట్ గోదావరి, పు. 229

తరువాతి పాలకుడగు రాజా మంగపతి దేవు కాలమున ఏః ము వేయబడినది. పోలవరం తాలూకాలోనివైన లక్ష్మీనారాయణదేవుపేట, మంగపతిదేవుపేట ఈ పాలకుల మూలమున ఏర్పడినవని స్పష్టము.

## మొగల్తుర్రు

మొగల్తుర్రు తొలియేలికలలో నొకడైన పెదబాపరాజు(17శం.) పేరున రూపెత్తినది. బాపిరాజుగూడెం (ఏ) కావచ్చును. ఇట్లే ఈ సంస్థానాధీశులలోని నారాయణరాజు పేర నారాయణపురం (ఏ), తిరుపతిరాజు (1760-1791) పేర తిరుపతిపురం (ఏ) అని లెక్క వేసుకొన వచ్చునుగాని అందులకు ప్రబల ప్రమాణము స్థానిక పరిశీలనము వలన సాధింపబడవలసి యున్నది.

## ముస్లిం పాలనా ప్రభావము

రుసుమ్‌బాదా (న) పేరు అసఫ్‌జా (1713-1748) రాజమండ్రి ప్రతినిధి-చండశాసనుడు-మొగల్తుర్రు, నూజివీడు, పెద్దాపురం మొ॥ జమిందారీలకు కంటకప్రాయుడైన రుసుమ్‌ఖాన్‌ను స్ఫురణకు దెచ్చును. నవాబుపాలెం (తా) ఫలానా ఈ నవాబు సృష్టియని నిర్ణయించుట కష్టమే. కెస్బా (కసుబా-కస్బా) పెంటపాడు (తా) నాటి అధికార భాషయైన ఉర్దూభాష ప్రభావమును సూచించును. "కసుబా పెంటపాడు నాటి పరిపాలనా యంత్రాంగమునకు ముఖ్యస్థలమై యుండును. కసుబా అర్థం గడిస్థలము, వర్తకస్థలము, గుజరీ, రెవెన్యూ ఇచ్చే పెద్ద గ్రామము."55 'తానాషా' అని పేరుగాంచిన అబుల్‌హసన్ కుతుబ్షా (1673-1687) మంత్రి సేనాధిపతులుగా అక్కన-మాదన్నలు ప్రసిద్ధులు.

## ఆకివీడు (భీ)

"అక్కన్న మాదన్నలు ఇచ్చటనే నివసించిరని ప్రజలు అనుకొందురు. అక్కన్న నివసించుట వలన ఈ గ్రామమునకు ఆకివీడు అని పేరు. మాదన్న నివసించుటచే దీనికి సివారుగా నున్న గ్రామమునకు మాదివాడ అను పేరువచ్చినట్లున్నది."56 కాగా, విక్రమేంద్ర (విష్ణుకుండిన) మహారాజు తుంచి తామ్రశాసనమున దాన గ్రహీత వ్యస్థలము ఆకి అని శాసనమున చెప్పబడినది. "పరిష్కర్తలు ఆకి గ్రామము పశ్చిమగోదావరిజిల్లా ఆకివీడు గ్రామము అయివుండవచ్చునను అభిప్రాయము వెలిబుచ్చిరి."57 ఎక్కడ విష్ణుకుండిన విక్రమేంద్రుని కాలము- ఎక్కడి అక్కన్న మాదన్నలు!

## గూడెములు- పాలెములు

శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం జిల్లాలలో 'వలసలు' మిక్కుటముగా నున్నట్లు, ఈజిల్లాలో గూడెములు - పాలెములు శతాధికముగానున్నవి. వాటిలో మూడు వంతులకుపైగా వ్యక్తి నామములతో వెలసినట్టివిగానున్నవి. ఉదా : అక్కిరెడ్డిగూడెం, చక్రాయ్యగూడెం, కొండలరావుపాలెం, లింగారావుపాలెం, మేదినీరావుపాలెం, రాజమ్మపాలెం, రామారావుగూడెం, రామన్నపాలెం, సత్తెనగూడెం, సూరప్పగూడెం, తిరుమలమ్మపాలెం, తిమ్మనగూడెం (అన్నీ ఏ); అల్లంచెర్లరాజుపాలెం, అప్పలరాజుగూడెం, అయ్యపరాజుగూడెం, చంద్రన్నపాలెం, ధర్మాజిగూడెం, గురవాయిగూడెం, కృష్ణారావుపాలెం, లింగారావుపాలెం, మల్లయ్యగూడెం, పట్టయగూడెం, రామనగూడెం, రామన్నపాలెం, రాయన్నగూడెం, తిమ్మారెడ్డిపాలెం, వెంకమ్మపాలెం (అన్నీ చిం) చిన్నయ్యగూడెం, బొప్పరామన్నగూడెం, ధూమంతునిగూడెం, కన్నయ్యగూడెం, తిమ్మరాజుపాలెం, ఎర్రనగూడెం (అన్నీ కొ). ఈవిధమైన గ్రామములన్నియు ఏతత్ గ్రామస్థాపకుల పేర్లమీదను గాని, ఏతత్ స్థాపనాకాలమునాటి ప్రముఖ వ్యక్తుల పేళ్ళమీదగాని ఏర్పడినవి. చాలవరకు ఇవి జమిందారీ యుగములో (18-19 శ॥) నేర్పడినవి కావచ్చును. స్థలజ్ఞులు ఆయా గ్రామముల పుట్టుపూర్వోత్తరముల విషయమై విశదీకరింప గలుగుదురు.

## ఇంటిపేర్లు - గ్రామనామములు

ఈ రెండింటికిగల అవినాభావ సంబంధము ఈ జిల్లాలో కొన్ని గ్రామములు ఇంటిపేర్ల ననుసరించియే ఏర్పడుటబట్టి మరింతగా స్పష్టము. ఉ॥ దా॥ దాసంవారిగూడెం, దాట్లవారిగూడెం, మడకంవారిగూడెం, రావువారిగూడెం, స్వర్ణవారిగూడెం, (అన్నీపో), చెలికానివారి పోతపల్లి, మైలవరపువారిగూడెం (ఏ); బండివారిగూడెం, గణపవారిగూడెం, పుప్పాలవారిగూడెం, సెట్టివారిగూడెం (అన్నీ చిం); జలగంవారి లంద్రిక (కొ). గ్రామనామములు ఇంటిపేర్లుగాను, ఇంటిపేర్లు గ్రామ నామములుగను అయిన సందర్భమునకు ఉదా॥ నేలటూరు, నిడదవోలు(కొ), నందమూరు (కొ&తా); కోవల్లి (భీ&ఏ) అడవికొలను, తెలికిచర్ల, వల్లూరు (తా), కొప్పర్తి (భీ), ముంజులూరు (పో), అండలూరు, గుమ్ములూరు, కాళ్ళకూరు, నవుడూరు, ఉంగుటూరు, వల్లూరు (అన్నీ భీ).

## జాతి, కుల, వృత్తి సంబంధములు

ఏదియో ఒక జాతి, కుల, వృత్తులకు సంబంధించిన వారు తొలుత నివసించుటను బట్టియో, లేక వారి సంఖ్య గణనీయమైనదిగా నుండుటవలననో కొన్ని గ్రామములకు తత్ సూచనా పూర్వక నామము లేర్పడినట్లు తోచును. ఉ॥ దా॥ గవరవరం, కోమటిలంక, మాలపానిగుంట, సానిగూడెం, రావులకుంట, వడ్డిగూడెం(అన్నీ ఏ); బ్రాహ్మణగూడెం, గవరవరం, కోమటిగుంట, సెట్టిపేట(అన్నీ కొ);

కంసాలి బేతపూడి (న): కోయ రాజమండ్రి (పా): గొల్లల కోడేరు (భీ): రావులపర్రు (తా).

## పశు, పక్షి, వృక్ష సంబంధములు

ఉ॥ దా॥ దిప్పకాయలపాడు, చింతలగూడెం, దోరమామిడి, విమ్మలగూడెం, తాటియాకులగూడెం, దొండపూడి, తాడిమూడి, గోగుమిల్లి, పూతికపాడు (అన్నీ పో), శృంగవృక్షం (భీ: ఆముదాలపల్లి, చీపురుగూడెం (తా): కోరుమామిడి, విమ్మల గూడెం, చెరుకుమిల్లి (అన్నీ కొ): బూరుగుపల్లి, చిన్నమామిడిపల్లి, గోరింటాడ, నేరేడుమిల్లి (అన్నీ న): కాకరపాడు, మామిడూరు, తాడిపర్రు, తేపర్రు, (త): ఆముదాలచెలక, చింతలపూడి, రావికంపాడు, వేములపల్లి, (అన్నీ చిం): బూరుగుగూడెం, చల్లచింతలపూడి, చోడిమళ్ళ, దోశపాడు, జాజులకుంట, పైడిచింతపాడు (అన్నీ ఏ): చిలకలూరు (పో), కాకుల ఇల్లిందలపర్రు, [త] కోతులగోకవరం [చిం]: నాగులపల్లి శరభపురం, కొక్కిరాయి లంక [ఏ]

## భౌగోళిక విశేష సంజనితములు

గుంటుపల్లికి పూర్వరూపముగా భావింపబడు పిడుండ [పృధు+అండ=పెద్దగ్రుడ్డు=గుడుపల్లి - గుంటుపల్లి] పేరు ఆ గ్రామ భౌగోళిక స్వభావముచేత వచ్చియుండునను అభిప్రాయము ఇదివరకే గమనించడం జరిగింది. అట్టి భౌగోళిక ప్రత్యేకతల సూచించు గ్రామనామములను మరికొన్నింటిని గుర్తించనగును. ఉదా॥ ఆరుగొలను [తా]. "పూర్వం ఆరుకొలనులు ఉండేవట. వాటి పేరిట గ్రామం ఆరుగొలనయినదట."[58] అడవికొలను, చినసింద్ర కొలను, పెదనింద్రకొలను, తెలికచెర్ల [పూర్వనామం తెలికచెఱువు] [అన్నీ తా], మోగల్లు [మోంగొలను] [భీ], పాలకొల్లు [న]; గుండుగొలను [ఏ] గుండుగొలనుకుండి [చిం] మొ॥ పేర్లుకూడా కొలనుల బట్టి ఏర్పడినవియే అయిఉన్నవి. తూర్పువిప్ప [రు&తి] పడమట విప్పర్రు [తా], కొమ్మర ఉత్తర-దక్షిణ [ఏ] మొ॥ ఆయా గ్రామములున్న దిక్కులను బట్టి విశేషణములను చేర్చుకొన్నవి.

## పెద్ద - చిన్న, క్రొత్త - పాత వగైరా

ఒకేపేరుగల గ్రామాలను వేరువేరుగా గుర్తించడానికి ఆయా పేర్ల ముందు పెద్ద-చిన్న అనే విశేషణం చేర్చడం ఒక ఆనవాయితీ. ఉదా : పెదకాపవరం-చినకాపవరం, పెదమిరాం-చినమిరాం, పెదపుల్లేరు-చినపుల్లేరు (అన్నీ భీ): చిన నింద్రకొలను - పెద నింద్రకొలను, చిన రామచంద్రపురం - పెదరామచంద్రపురం [తా]; పెదమల్లాం-చినమల్లాం, పెదమామిడిపల్లి-చినమామిడిపల్లి [న]. క్రొత్తగా ఏర్పడిన గ్రామాలను అదే పేరుగల పాత గ్రామాల నుంచి వేరుగా గుర్తించడానికి ఆయా గ్రామ నామముల ముందు పాత కొత్త అనే విశేషణములను చేర్చడం ఒక పద్ధతి. ఉదా : పెద్ద-చిన్న రామచంద్రపురములు భీమవరం తాలూకాలో వుండగా కొత్త రామచంద్రపురం పోలవరం తాలూకాలోనున్నది. అయితే కొత్తపల్లి [ఏ&చిం&తా] అనే ఊళ్ళు వున్నవిగాని పాత పల్లి అనే ఊరు తటస్థపడలేదు. అట్లే కొత్తగూడెం [ఏ], కొత్తపాడు [త], కొత్తూరు [ఏ]. పెమ్మరాజు పోలవరం, అయ్యవారి పోలవరం, పోలవరంవున్న తాలూకాలోనేవుండి తమ ప్రత్యేకతను కలిగివుండగా మడుగు పోలవరం భీమవరం తాలూకాలో వున్నది. తణుకు తాలూకాలోనేవున్న కుముదవల్లి నుంచి దాసుల కుముదవల్లి - కన్నయ్య కుముదవల్లి గ్రామాలను వేరుగా గుర్తించడానికి వీలుగా వున్నవి. వేమవరం గ్రామాలనుంచి తణుకులోగల ఒక వేమవరం తాలూకానుబట్టి ప్రత్యేకంగా తణుకు వేమవరమని పిలువబడు చుండగా అదే తాలూకాలోని మరియొక వేమవరం పిట్టల వేమవరమని ప్రత్యేకంగా గుర్తించడానికి సౌకర్యార్థ విశేషణం కలిగియున్నది. నరసాపురం తాలూకాలోని రెండు వల్లూరులలోను ఒక దానియందు ఏకాలములోనో పండితులు నివసించినట్లున్నది కావున అది పండిత వల్లూరను పేరు కలిగియున్నది.

వేర్పాటుగా గుర్తించడానికి వీలుకల్పించని గ్రామనామములు లేకపోలేదు. ఉదా : కుముదవల్లి [భీ&త], వల్లూరు [న&తా], వేమవరం [భీ&న] సారిపల్లి [తా&పో], నందమూరు [కొ&తా] గవరవరం [ఏ&కొ], విమ్మలగూడెం [పో&కొ], సీతాపురం [తా&భీ] రామన్నపాలెం [రెండూ చిం], లింగారావుపాలెం [ఏ&చిం] శ్రీరామపురం [ఏ&చిం], సీతానగరం [పో&చిం], జగన్నాధపురం [ఏ&కొ&న&పో], నరసింహాపురం [భీ&ఏ], నరసాపురం (న&చిం), రాఘవపురం [ఏ&చిం], కేతవరం [కొ&చిం], వేగవరం [చి&ఏ]. ఒకే పేరుగల గ్రామములు ఏలూరు, చింతలపూడి తాలూకాలలో ఎక్కువగా నున్నట్లు తెలుస్తోంది. ఇది ఆయా తాలూకాల మధ్య జరిగిన వలస పద్ధతిని సూచించేదిగా వున్నది.

## ఊరి పేరుపై మమకారం

ఏ కారణముల చేత వలసపోయి వేరొకచోట స్థిరపడిన వారైనా పాతపట్టులపై మమకారమును వదులుకొనలేరనిపించును. గ్రామనామములందు కొక సాక్ష్యము. చేబ్రోలు-చేబ్రోలు ఖండ్రిక, తాడేపల్లి - తాడేపల్లిగూడెం [తా], రాపాక-రాపాక ఖండ్రిక,

కానూరు - కానూరుఅగ్రహారం [తా]; గుడిపాడు - గుడిపాడు ఖండ్రిక, రంగాపురం - రంగాపురంఖండ్రిక [చిం], పాండువ - పాండువఖండ్రిక, వేంద్ర - వేంద్ర అగ్రహారం [భీ]. ఈ విధముగా ఖండ్రిక అను గ్రామనామాంత్యమును గలిగియున్నవి. ఆయా గ్రామ అనుబంధ సూచితములని భావించినను, విజయనగరం జిల్లాలోని భోగాపురం [ఏ], విశాఖజిల్లాలోని ఎలమంచిలి [న] తూర్పుగోదావరి జిల్లాలోని కాకినాడ [తా], గుంటూరు జిల్లాలోని చేబోలు [తా] వంటిగ్రామములీ జిల్లాలో యుండుట గమనించదగి యున్నది.

## ముగింపు

పై వివరణలను అనుసరించి ఈ క్రింది నిశ్చయములకు రావచ్చును. 1. పౌరాణిక పరముగా నేర్పడినట్లు చెప్పబడిన గ్రామనామ కారణపైనము గతకాలము నాటి సాంఘిక జీవనముపై మత సంబంధ విశ్వాసములకుండిన పట్టును తెలియజేసేదిగా ఉన్నది. 2. కళింగాంధ్రములో వలెనే ఈ వేంగీ మండలాంతర్గతమైన జిల్లాలో కూడా పూర్వ రాజవంశ పాలక వర్గ ప్రభావము గ్రామనామముపై ప్రగాఢముగ నున్నట్లు కనుగొనబడినది. కాని ఈ ప్రాంతముపై ఏలుబడి సాగించిన రాజ వంశములలో ఒకే పేరు గల రాజన్యులుండుటచే అట్టి గ్రామనామ కారక నిర్ణయ విషయములో ప్రత్యేక శ్రద్ధ వహించవలసి ఉన్నది. 3. ముస్లింపాలనా కాలమున ఏలూరు ఒక సర్కార్ కేంద్రమై యుండినప్పటికిని గ్రామనామములపై ఆ ప్రభావము కన్పట్టలేదు. 4. ఈ జిల్లాలో కొంత ఏజెన్సి [మన్యం] తాలూకా ఉన్నది కాని ఆ ప్రాంత గ్రామనామములపై గిరిజన భాషా ప్రభావము లేకుండినది. 5. సంస్థానములు రాసిలో ఇపుగు పొరుగు మండలములకు తీసిపోవుగాని సంస్థానాధీశుల నామవాసి గ్రామములకు అంతగా పట్టినట్లులేదు. అయితే, వ్యక్తుల పేర నేర్పడిన 'పాలెము' 'గూడెము' వంటి చరిత్రగతిలో ఆధునికతను సూచించు గ్రామ నామాంత్యములు గల గ్రామముల సంఖ్య శతస్థానమున నుండుటను బట్టి ఆయా గ్రామములు జమిందారీయుగమున – తదాశ్రిత [illegible] వర్గ ప్రభావనిమిత్తములని భావించుటకు వీలున్నది. 6. ఈ విషయముపై సాగవలసిన భావిపరిశోధన కేవలము శాసన, సాహిత్యాధారములతో సరిపెట్టుకొనక – క్షేత్రవిహారణావసరమును గూడ పరిగణనలోనికి తీసుకొనవలసి యుండునని ఈ ప్రాథమిక పరిశీలన గుర్తించు చున్నది.

## అధోజ్ఞాపికలు

1. ఎమ్. రామమోహనరావు, వెస్ట్ గోదావరి డిస్ట్రిక్ట్ 1925-1947, ఎ హిస్టారికల్ సర్వే విత్ స్పెషల్ రిఫరెన్స్ టు రెవిన్యూ ఎడ్మినిస్ట్రేషన్ [ఆంధ్ర విశ్వకళాపరిషత్, వాల్తేరు, 1982] అన్ పబ్లిష్డ్ ఎమ్. ఫిల్. థీసిస్.

2. పై. వి. కృష్ణారావు & ఏటుకూరి బలరామమూర్తి [సం] ఆంధ్రప్రదేశ్ దర్శిని, (విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1976), పు. 1031.

◆ సౌలభ్యము కొరకు తాలూకాల పేర్లు కుండలీకరణములలో సంక్షిప్తముగా పేర్కొనబడినవి. ఆ సంజ్ఞా వివరణ: భీ= భీమవరం; చిం=చింతలపూడి; ఏ=ఏలూరు; న=నరసాపురం: పో=పోలవరం; కొ=కొవ్వూరు; తా=తాడేపల్లి గూడెం; త=తణుకు.

3. మద్రాస్ డిస్ట్రిక్ట్ గజిటార్స్, గోదావరి, 1907.

4. ఈ ప్రకరణమునకును, శాసనములు-గ్రామ నామములు అను ప్రకరణమునకును ప్రధాన ఆధారములు: 1) కుందూరిఈశ్వరదత్తు, ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, [ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాద్, ద్వితీయముద్రణ, 1979] 2) డా. బూదరాజు రాధాకృష్ణ, ప్రాచీనాంధ్రశాసనాలు [ఆం. ప్ర. సాహిత్య అకాడమి, హైదరాబాద్, 1971].

5. సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము, ఐదవ సంపుటము [హైదరాబాదు, 1966], పు. 199.

6. సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము, మూడవ సంపుటము [హైదరాబాదు, 1962], పు. 93.

7. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు. 114.

8. పైది, పు. 2.2.

9. పైది, పు. 3.

10. పైది, పు. 2.6.

11. సంగ్రహ విజ్ఞాన కోశము, నాల్గవ సంపుటము, పు. 90.

డా ఎన్. వెంకట రమణయ్య, ది ఈస్టర్న్ చాళుక్యాస్ ఆఫ్ వేంగి. [మద్రాసు, 1950], పు. 65.

12. చూ॥ డా. యస్. యస్. మూ_ర్తి, 'సంఖ్యాకిత ప్రాంతీయ విభాగాలు', భారతి, డిసెంబర్ 1979, పుట 16.

13. డా॥ ఆర్. సుబ్రహ్మణ్యం, ది గుంటుపల్లి బ్రాహ్మి ఇన్‌స్క్రిప్షన్ ఆఫ్ ఖారవేల, [ఆం. ప్ర. గవర్న మెంట్ ఎపిగ్రాఫికల్ సీరీస్ నెం. 3, హైదరాబాద్, 1968], పే. 5.

14. ఇంగువ కార్తికేయశర్మ, 'గుంటుపల్లి గుహలు-బ్రాహ్మశాసనములు', భారతి, జూలై 1978, పుట 24 మరియు అగస్టు 1978, పుట 27.

15. ఆంధ్రదేశ చరిత్ర భూగోళసర్వస్వము, రెండవ సంపుటము, పు. 2 &

16. పైది, పుట 485, 486.

17. పైది, పుట 483.

18. డా॥ బూదరాజు రాధాకృష్ణ, ప్రాచీనాంధ్ర శాసనాలు, పు. 250.

19. ఖండవల్లి లక్ష్మీరంజనం - బాలేందుశేఖరం, 'ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి, (మద్రాస్, 1965) పుట 47.

20. ప్రాచీనాంధ్ర శాసనాలు, పుట 495-96

21. యస్. ఐ. ఐ. X, నెం. 262, శ. సం. 1140

22. పైది, నెం. 126, శ. సం. 1073.

23. బి. ఆర్. వర్మ, 'గుడీ-గుంపా' (వర్మన్ పబ్లికేషన్స్, తాడేపల్లిగూడెం, 1974) పుట 22.

24. ఆంధ్రదేశ చరిత్ర భూగోళ సర్వస్వము, మూడవసంపుటము, పుట 554.

25. పైది, పుట 552.

26. తురగా కృష్ణమూర్తి, 'దాయగజకేశరి ఖండవిల్లి శాసనము', ఎపిగ్రాఫియా ఆంధ్రికా, IV, (హైదరాబాదు, 1975), పుట 106

27.A. ఆం. ప్ర. డి. గ. వెస్టుగోదావరి, పుట 238

27. రెడ్డిసంచిక, పుట 394.

28. భూగోళసర్వస్వము, మొదటిసంపుటము, పుట 155.

29. పైది, మూడవసంపుటము, పుట 36-37, 38. ఆంధ్రభూమి [వారపత్రిక, సికింద్రాబాద్], 21-7-1983, పుట 46.

30. గుడీ - గుంపా, పుట 4.

31. పైది, పుట 53, 55.

32. పైది, పుట 5.

33. డా॥ ఎన్. రమేశన్ [సం] ఆం. ప్ర. డిస్ట్రిక్ట్ గజిటీర్స్, వెస్టుగోదావరి, పు 237.

34. గుడీ - గుంపా, పుట 44.

35. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము, పదవసంపుటము, పుట 462.

36. గుడీ - గుంపా, పుట 57.

37. ఆం. ప్ర. డి. గ. వెస్టుగోదావరి, పు. 233.

38. గుడీ-గుంపా, పు. 35.

39. సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము, ఏడవ సంపుటము పు. 90.

40. ఆంధ్రపత్రిక (దినపత్రిక, విజయవాడ), 13-2-1983, పు. 7-8.

41. ఆంధ్రభూమి (వారపత్రిక, సికింద్రాబాద్), 21-7-1983, పు. 46.

42. గుడీ-గుంపా, పు. 57.

43. యస్. గోపాలకృష్ణమూర్తి, జైన్ వెస్టీజెస్ ఇన్ ఆంధ్ర (హైదరాబాద్, 1963) పు. 38.

44. గుడీ-గుంపా, పు. 21.

45. భారతి, డిసెంబర్ 1979, పు. 57.

46. పైది.

47. ఆం॥ ప్ర॥ డి॥ గ॥ వెస్టు గోదావరి, పు. 229.

48. పైది, పు. 236.

49. గుడీ–గుంపా, పు. 17.

50. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు. 192.

50-A ది ఈస్టరన్ చాళుక్యాస్ ఆఫ్ వేంగి, పు. 70, 76.

51. భూగోళ సర్వస్వము, మూడవ సంపుటము, పు. 231,

52. గుడీ–గుంపా, పు. 17.

53. రెడ్డి సంచిక, పు. 47.

ఆంధ్ర దర్శిని (విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1959) పు. 153.

54. నరసింహనామధేయులు ఏలూరు తాలూకాలో విస్తరించుకొని యుండిన వల్లూరు జమిందారులలో నిరువురు కలరు.

55. గుడీ–గుంపా, పు. 13.

56. భూగోళ సర్వస్వము, మూడవ సంపుటము, పు. 8.

57. పైది, పు. 2.

58. గుడీ–గుంపా, పు. 14.

[గ్రామనామముల జాబితా వ్రాయుటలో సహాయపడిన కుమారి శ్రీరంగం రత్నకుమారికి రచయిత కృతజ్ఞుడు.]



# పుప్పొడి చినుకులు

## "సాంధ్య శ్రీ"

[భారతి, ఆంధ్రపత్రిక రుధిరోద్గారి ప్రత్యేక సంచికలలో ప్రచురితమైన పుప్పొడి చినుకుల మొదటి సర్గ ఈ రెండు పద్యాలతో సమాప్తం. మొదటి సర్గ పూర్తిగా పృధివీ సూక్తానికి సంబంధించినది. "యస్యాం సముద్ర ఉత సింధు రాపో; యస్యా మన్నం కృష్టయః సంబభూవుః; యస్యామిదం జి న్వతి ప్రాణ దేజత్; సా నో భూమిః పే యే దధాతు."]

పద్యం : 9

నేల ధరించిన ఈ మొక్కలు
కాండాత్కాండ ప్రరోహ కృతజ్ఞతా స్వరూపాలు
అడవిదారుల్ని అంటి
తెరలు తెరలుగా పొరలే పుప్పొడిగాలి కల్నేతలో
కాలాన్ని
శిల్పంగా మలుస్తు
మానవజాతికి మహత్తర గీతికల్ని పత్రాలమీద చిత్రించి
మంగళాశాశనం చేసాయి....

క్షణాలు దేవతలు
నీలో నాలో కదిలే ప్రత్యక్షరానుభూతులు
ఆత్మ కళ్లు తెరుచుకుంటే
ప్రత్యక్షానుభూతులు....

చెట్టుమీదికాయ
మొక్కమీది పూవు
స్వచ్ఛందంగా ఆనందం పంచుతోంది
ధరించు మిత్రమా....

మట్టి
విత్తులోనే వియత్తలమంటే
విషయాన్ని ఉంచుతోంది
గ్రహించు మిత్రమా....
క్షణాలు దేవతలు
అదృశ్యం కాకుండా కాపాడుకో.... !

పద్యం : 10

ఒడిలో
జల తరంగిణిని సంగతిస్తూ
అమృతశీతల స్పర్శానుభూతి పతాకాన్ని పవనాగ్రాని
కెత్తినప్పుడు
ఆ తప స్నానంతో
అక్షయ కాంతి కిరణ జాలాన్ని
అంతరంగవేదిపై వెల్గు వెల్లువ తోరణాలుగా మలచు
కున్నప్పుడు
చంద్రా తపస్నాతమై
నవజీవన వనమూలిక మొలిపించిన
విమృగ్వరి వసంత కుసుమాకర నికుంజ మైనప్పుడు
మట్టీ....
నీ మౌన యోగ పూర్ణ శబ్ద సంకాశంలో
మట్టీ....
నీవు కన్నపూలగుండె సందేశంలో
ఆ పుప్పొడి చినుకుల్లో

విన్నానమ్మా ఓమ్[1]
విన్నానమ్మా హూమ్[2]
విన్నా అమీన్[3]
విన్నా ఆమెన్[4]
విన్నా విన్నా ఇంకావిన్నానమ్మా అడమ్[5]

1. వైదిక శబ్ద బ్రహ్మం
2. టిబెటన్ల శబ్ద బ్రహ్మం
3. మహ్మదీయ శబ్ద బ్రహ్మం
4. క్రైస్తవుల, ఈజిప్షియన్ల, రోమ్, గ్రీక్, జ్యూస్ శబ్దబ్రహ్మం
5. పారశీక శబ్ద బ్రహ్మం....

శ్రీ ఆర్. వి. ఎన్. సుబ్బారావు

# హిందీ - తెలుగు కవుల భావ సమన్వయము

ప్రాచీనులు గాని, అర్వాచీనులు గాని, మహాత్ములైన వారి భావములు సార్వకాలికములు, సార్వదేశికములు. అవి సమస్త ప్రజలకు అనువర్తించునవై, భావసామరస్యము కలిగియుండును.

ఉత్తరభారతమున, తులసీదాసు, సూరదాసు, కబీరు, బిహారి, రహీమ్ మున్నగు భక్తి కవులెందరో ప్రసిద్ధి వహించి, సాహిత్య విను వీను వీధిలో ధృవతారలై వెలయుచున్నారు. ప్రజల క్షేమమునకై ఎన్నియో ఉపదేశములు చేసిరి. అట్లే ఆంధ్ర దేశమందు కూడ పోతన, త్యాగయ్య, వేమన, నన్నయ, తిక్కన, శ్రీనాదుడు, రామదాసు మొదలగు - ఉద్దండ పండితులు, భక్త కవులెందరో జన్మించి, ఈ తెలుగు నాటను పునీత మొనరించినారు. వారు చెప్పదలచిన విషయములు, చెప్పెడి విధానములో మార్పున్నను, భావములు సన్నిహితములుగనే ఉండును. తమ రచనల ద్వారా ప్రజల హృదయాలలో చెరగని ముద్రవేసి, తమకొక ప్రత్యేక స్థానమును వెలయించుకొనిన భక్తరామదాసుగారి రచనలలో - తులసీదాసు మొదలగు వారి రచనలలోని భావములు కొన్ని సమన్వయము నొందుచున్నవి. అట్టి అవినాభావత్యము లెన్నియో వారి భావ జలధిలో - తరచి చూచిన కొలది కనుపించుచునే ఉండును. అవి అనంతములు - ఉదాహరణకై కొన్నిటిని పేర్కొందును.

## రామదాసు - తులసీదాసు

ఉత్తర భారతమున - హిందీసాహిత్య వినువీధిలో 'తులసీదాసు' - పర్వచంద్రునివలె భాసించుచుండగ, ఆంధ్రావనిలో సాహిత్య గగనమున 'రామదాసు' ధృవతారయై సుస్థిరమైన కీర్తి సముపార్జితుడైనాడు.

హిందీ సాహిత్యమున - తెలుగువారి యదృష్టమో యనునట్లు లభ్యమైన కవిత్రయము వాటి భారతము వంటిది. ఇంతవరకు ప్రసిద్ధినొందినట్లగుపించదు. కానీ-భాగవతము విషయమున ఇరువురి పంటలు పండినవి. సూరదాసు - పోతనలు సమఉజ్జీలై - ప్రజల హృదయ సౌధములలో సుస్థిరనివాస మేర్పరచుకొనినారు. ఇక రామాయణము విషయమున - తులసీదాసుగారి 'రామచరిత మానస్' - వినయపత్రిక మొదలుగునవి అసమానములై విరాజిల్లుచున్నవి. కానీ రాముడు - తెలుగువారికి ఇలవేల్పైనాడు. 'శ్రీరామ' లేనిదే - కావ్యారంభమేలేదు. రామచరిత్ర తెలుగువారికి ఆదర్శము. భాస్కర రామాయణము మొదలగునవి ఉన్నను - రామచరిత మానసమునకున్న ప్రచారము జనబాహుళ్యమున కనుబడదు. కాని, భక్తకవులగు-పోతన, త్యాగయ్య రామదాసులవంటి వారు గావించిన రామగుణ గానము తెలుగునాట - ప్రతినోట విలచిపోయినవి. ప్రతి హృదయమందును - ప్రతిధ్వనించు చున్నవి. భక్తకవులు చెప్పెడి రీతులు వేరైనను, భావమొకటిగనే యుండును. 'నదీనామ్ సాగరో గతిః' అని కదా! దారులు వేరైనా, గమ్యస్థాన మొకటే. భక్తకవులగు రామదాసు - తులసీదాసుల భావము లనేకములు సామరస్యము నొందుచుండుట సహజమే.

భక్తి స్థిరపడుటకు-ముందుగా ఆత్మ పరిశోధన. అవసరము. తెలిసియో, తెలియకో - మానవుడెన్నియో పాపములొనరించి యుండుట సహజము. వాటిని గుర్తించి, పశ్చాత్తాపము నొందిన, పరమాత్మ చేరువ యగును. — తులసీదాసు

"అబ్ కీ నసానీ, అబ్ న నసైహౌఁ,
రామకృపా, భవనిసా సిరానీ, జాగే-ఫిర్ న డసైహౌఁ" ॥

ఇంతవరకు దుష్టమార్గమున నడచిన నా జీవితము, రామచంద్రుని కృపా కటాక్షముచే-సంసారమనెడి మత్తును వదలిదిన. ఈ మాయ ఇటుపై తిరిగి నన్ను కాటు వేయదు - (ఆవరించదు) - అని తులసీదాసనును. ఇదే భావనలో రామదాసుగారు కూడ -

"చేసితి ఘోరకృత్యములు, చేసితి భాగవతాప చారముల్,
చేసితి నన్య దైవముల జేరి భజించిన వారి పొందు, నే-
జేసిన నేరముల్ దలచి చిక్కులు బెట్టకుమయ్య, యయ్య, సీ-
దాసుడ నయ్య, భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ!" (49)

నేననేకములైన పాపములుజేసి యున్నాను. కానీ ఓరామా! నిన్ను శరణుబొంది, నీ దాసుడనని నమస్కరించుచున్నాను. నన్ను మన్నించి, ఈ సాంసారిక బాధలనుండి నన్ను విముక్తుని చేసి, నీ దరికి చేర్చుకొనమని, రామదాసు వేడుకొనును.

మరి ఇన్ని పాపములు చేసిన విన్నెటుల మన్నించవలె నందువేమో! మేము పతితులము. నీవో - పతితపావనుడవు. మా వంటి పాతకుల నెందరినో నీవు పూర్వముద్ధరించి యున్నావు. నీ కీర్తివి, నీ భక్తులు, దేవతలు ఎల్లప్పుడు కొనియాడుచునేయుందు రనుచు, తులసీదాసు, రామదాసులు

"బిరద్ గరీబ నివాజ్ - రామకో,
గావత్ బేద్-పురాణ్, సంభు, శుక్, ప్రగట్ ప్రభావు నామ్‌కో-
ధ్రువ, ప్రహ్లద్, బిభీషన్, కపిపతి, జడ్,
పతంగ్, పాండవ్, సుదామకో -
లోక్ సుజస్ పరలోక సుగతి, ఇన్హియే
కో హైరామ్ కామ్‌కో॥ (వినయ్-99)

పతితపావనుడవని, ఆర్తులపాలిటి పెన్నిధివని, వేదములు, పురాణములు, ఈశ్వరుడు, నీప్రభావము తెలిసికొని, నీచే ఉద్ధరింప బడిన ధ్రువుడు, ప్రహ్లాదుడు, విభీషణుడు, పాండవులు, కుచేలు దులేకాక, పక్షి జంతు, జడములైన - జటాయువు, సుగ్రీవుడు, రాతిరూపు వహించిన - అహల్యకూడ నీ ప్రభావమును వేనోళ్ళ చాటినారు. కనుక నన్ను తప్పక కాపాడవలసినదని తులసీదాసను చుండగ, రామదాసు —

"పాతకులైన మీకృపకు పాత్రులుకారె, తలంచిచూడ, జ-
ట్రాతికిగల్గె పావన, మరాతికి రాజ్యసుఖంబుగల్గె, దు-
ర్జాతికి బుణ్యమబ్బె, గపిజాతి మహత్వమునొందె గావునన్,
దాతవ యెట్టివారలకు, దాశరథీ కరుణాపయో ధీ" -

రాయి-రమణి అయినది. శత్రువైన విభీషణునకు లంకా సామ్రాజ్యము లభించినది. శబరి మొదలగువారు తరించిరి. వానర జాతికి-ఎనలేని మహత్వమబ్బినది. కనుక - ఎటువంటి వారైనను నీ దయకు పాత్రులగుచుండగ, నన్ను మాత్రమేల కాపాడవని - రామదాసు రాముని ప్రార్థించును.

సులభసాధ్యుడైన రాముడుండగా, ఇతర దేవతలను ప్రార్థించుట-ఆకాశ గంగను వదలి, వడగండ్లనీళ్ళకై పరుగెత్తుట, పంచదారను వదలి వేపాకుతినుటకు ఆశపడునట్లగునని - తులసీ దాసు, రామదాసు లందురు. రాముని మించిన దేవుడు లేడని - వారి "అనన్య భక్తి"ని ప్రదర్శించుచు - వారిరువురు - ఈ విషయమును పదిమందిముందు చాటి చెప్పెదమందురు.

ఎప్పుడో - పెద్దైన పిదప భగవంతుని సేవించవచ్చునను కొనుట పొరబాటని - ప్రాణా లనిత్యములని - అంత్యసమయమున వీలుకాక అప్పుడు బాధపడుటకంటె, ఇప్పటినుండియే భగవంతుని సేవింపవలెనని-వీరిరువురు విభిన్న రీతులలో తెల్పెదరు.

"మన్ పఛితైహై అవసర బీతే,
దుర్లభ్ దేహపాయి, హరిపద భజు,
కరమ్ బచన్ అరు హీతే,
సహసబాహు, దసబదన్, ఆదినృప బచే నకాల్ బలీతే,
హమ్-హమ్ కరి, ధన, ధామ్, సవారే,
అంత్ చలే ఉఠి రీతే"— (వినయ్-198)

అవకాశము చేయజారినపిదప బాధపడి - ప్రయోజనముండ బోదు. మహాబలవంతులు, అమోఘ బలసంపన్నులైన సహస్ర బాహుడగు కార్తవీర్యార్జునుడుగాని, దశకంఠుడగు రావణుడుగాని, చావునుండి తప్పించుకొనలేకపోయినారు. కాలపురుషుని బలము ముందు వీరి బలమెంత ? నాది-నాదని కూడబెట్టినదేదియు ఓవరకు మనవెంటరాదు. అందుచే దుర్లభమైన మానవజన్మనొంది, శ్రీహరి నాశ్రయించి, శాశ్వతమైన ముక్తిని బొందుటే మానవాళికి శ్రేయస్కరమని - తులసీదాసనును.

"ముప్పున గాలకింకరులు ముంగిట వచ్చినవేళ, రోగముల్,
గొప్పరమైనచో గఫము కుత్తుక నిండినవేళ, బాంధవుల్,
గప్పినవేళ, మీ స్మరణ కల్గునొ గల్గదొ, నాటికిప్పుడే,
తప్పకచేతు మీ భజన, దాశరథీ కరుణాపయోనిధీ"

అంత్యకాలమున రోగములు ముంచుకొచ్చి, చుట్టూ బంధు వులుచేరి గొడవపెట్టుచుండగ, గొంతుకకు కఫము చుట్టుకొని మాటరానివేళ, యమకింకరులు ఎదుట ప్రత్యక్షమైయుండగ - ఓ రామా! నిన్ను స్మరించవలెనని తోచకపోవచ్చును-తోచినా వీలు గాకపోవచ్చును. అందుచే నీపవిత్ర నామస్మరణను ఇప్పటినుండియే చేయుచుండెదనని-రామదాసనును.

రాముని పవిత్ర నామ మహిమను వర్ణించుటలో తులసీదాసు-రామదాసులిద్దరు — ఒకటగుదురు —

"తులసీ'రా'కె కహిత్ హీ నికసత్ పాప్ పహార్
ఫిరి, భీతర్ నహి ఆవతే దేత్, 'మ'కార్, కివార్"!

'రామ'—లోని 'రా' అను అక్షరముచ్చరించుట తోడనే, కొండలవంటి పాపములు బయటకు వెళ్ళుచున్నవి. అవి తిరిగి లోపలకు ప్రవేశించకుండుటకై — 'మ' తలుపువలె వారించు చున్నదని — తులసీదాసును — రామదాసుకూడ —

"'రా' కలుషంబులెల్ల బయలం బడద్రోచిన, 'మా' కవాటమై
దీకొని ప్రోచు, నిక్కమని ధీయుతులెన్న, దదీయ వర్ణముల్,
గైకొని భక్తిచే నుడువ గానరుగాక, విపత్పరంపరల్
దాకొనునే, జగజ్జనుల, దాశరథీ కరుణాపయోనిధీ॥" 26

రామదాసుగారు కూడ తులసీదాసువలెనే, 'రామా' యను పదములో — 'రా' అను అక్షరమే—సమస్త పాపములను బయటకు నెట్టివేయుచుండగ, 'మా' అను అక్షరము కవాటమై, అవి తిరిగి లోపలకు రాకుండ అడ్డగించుననుచు, ఇట్టి మహత్తరమైన రామ నామ మహిమను గుర్తించి మానవులేల జపించి, తరింపరు? అట్టి వారిని ఆపదలు దరిచేరలేవుకదా ! అని — రామ నామము జపింపనివారి బాగుకై రామదాసు వ్యధచెందును. మహాత్ములు, 'తమకుఁదారె పరహితాచరణమతులు' గదా!

## రా మ దా సు - బి హా రీ

పరమత ప్రభావము వలన హిందూదేశములో, ఆస్తికత కుంటుపడి, ధర్మమునకు గ్లాని కలుగుచుండగా, దేశములో వివిధ ప్రాంతములలో భక్త కవులుద్భవించి, తమ రచనలద్వారా ప్రజలను, పతనోన్ముఖులైన వారిని, కాపాడిరి. ఆస్తికతను పెంపొందించిరి. నిరీశ్వర వాదమును ఖండించిరి. ప్రజల భావ ములను భిన్నత్వమునుండి, ఏకత్వమునకు మరల్చి, అనన్య భక్తిని, ప్రేమ భక్తిని నెలకొల్పిరి. అట్టివారిలో ఉత్తరభారతమున-బిహారి - ఒకరుకాగా, ఆంధ్రప్రాంతమున రామదాసు గారొకరై ప్రసిద్ధి వహించిరి. ఆశయములు ఒకటైన వారిలో - భావములు కూడా సన్నిహితములగుట సహజమే కదా!

జీవితములోని - లౌకిక సుఖములు నశ్వరములైనవని తెలిసి కొని, శాశ్వత సుఖప్రదుడు - భగవంతుడొక్కడేయని గుర్తించి, అతనినే త్రికరణశుద్ధిగ శరణువేడిన - తప్పక రక్షించి కాపాడు నని తెలియజేయుచు, దానికి అచంచలమైన విశ్వాసమవసరమని రామదాసు - బిహారీలు ఒకేతీరున తెలియజేయుచున్నారు. —బిహారీ

"జిన్ దిన్ దేఖే వే కుసుమ్, గయీ సూ బీత్ బిహార్,
అబ్ అలీ రహీ గులాబ్ మే, అపత్ కటీలీ డార్."

వికసించిన గులాబీపువ్వుల మకరందము నాస్వాదించిన తుమ్మెదలు, అవి వాడిపోయినను, తిరిగి వికసించు సమయము (ఋతువు) వచ్చునన్న ఆశతో, ఆకులు కూడా రాలిపోయి, ముళ్ళు మాత్రమే మిగిలిన ఆ గులాబీ కొమ్మనే ఆశ్రయించుకొని యున్నవి. (అటులనే, ఎన్ని కష్టములు సంప్రాప్తించినను, భగవంతునిపై అవిచ్ఛిన్న విశ్వాసముండవలెనని) బిహారీ అనుచుండగ- రామదాసు-

"జీవన మింక బంకమున జిక్కిన మీను చలింప కెంతయున్,
దావున నిల్చి జీవనమె దద్దయు గోరువిధంబు చొప్పడం,
దావలమైనవాని గుఱి దప్పనివాడు తరించు వాడయా,
తావక భక్తియోగమున దాశరథీ కరుణాపయోనిధీ॥ 94

నీళ్ళెండిపోయి, బురదమాత్రము మిగిలియున్నను, చేప ఆ మడుగునందే, తిరిగి నీరువచ్చు నన్న ఆశతో ఎదురుచూచు నట్లుగ, కష్టము లెదురైనను, చలింపని భక్తితో ఓ రామా! నిన్నే నమ్మి యున్న వాడు తప్పక తరించగలడని రామదాసు గారు నొక్కి చెప్పును,

ఆ ఘటన, ఘటనా సమర్థుడగు భగవంతునకు సాధ్యము కానిదిలేదు. శరణు కోరినవారి పాపములను హరించి, వారిని పవిత్రుల నొనరించుట వానినైజగుణము. ఇట్టి సంఘటనలనేక ములు జరిగియున్నవని — రామదాసు, బిహారీలు తెల్పెదరు —

"తు యహ్ బిరియా నహీఁ ఔర్ కీ, తూ కిరియా వహ్ సోధి,
పాహన్ - నావ్ చఢాయ్ జిన్, కీన్హే పార్ పయోధి॥"

రాళ్ళను నావలవలె నీటిపై తేలించి, సముద్రమును దాటించిన (ఓ రామా) నీకంటె నన్ను భవసాగరము దాటించి రక్షింపగల్గు సమర్థు డెవ్వరని - బిహారీ భగవంతుని సూటిగా ప్రశ్నించును. దీనినే భంగ్యంతరముగ — రామదాసు —

"చరణము సోకినట్టి శిల జవ్వనియాయెను బొక్కవింత, సు
స్థిరముగ నీటిపై గిరులు దేలిన దొక్కటి వింతగాని, మీ
స్మరణ దనర్చు మానవులు, సద్గతి జెందిన దెంతవింత, యీ
ధరను, ధరాత్మజా రమణ! దాశరథీ కరుణాపయోనిధీ॥"

ఓ రామా! నీ కాలు తగిలి, రాయి — రమణిగా మారుటొక వింత గావచ్చును. నీ పేరు రాసినంత మాత్రమున రాళ్ళు నీళ్ళపై తేలుట వేరొక వింతగావచ్చును. కానీ-సదా నిన్నే స్మరించు మానవు లకు సద్గతులు కలుగునన్న దానిలో వింత ఏమాత్రము లేదు. తప్పక తరించెదరన్న భావమును—రామదాసు రూఢిగా తెల్పును.

భగవంతుని సేవలో నిరవధికమైన సుఖమున్నదని, ఆ ఆనందము చవిచూచినవారికి సర్వము సమకూరునని, వేరొకటి కోరదగినదుండదని వీరిరువురు ముక్తకంఠముతో తెల్పెదరు- బిహారీ-

"మన్ మోహన్ సేఁ మోహకరి, తూ ఘనశ్యామ్ విహారి,
కుంజ బిహారీ, సౌఁ బిహారి, గిరిధారి_ఉర్ ధారి॥"

మనోహరుడైన ఆ కృష్ణునే ప్రేమించుము. ఆ నల్లనివాని రూపే సదా ధ్యానించుము. ఆ బృందావన సంచారితోనే_ఊహలలో విహరింపుము. ఆ గోవర్ధన ధారినే మనసున ధరించి యుండుము. ఇంతకన్న కావలసినదేమున్నదని బిహారీ చెప్పుచుండగా, రామదాసు-

"అండజవాహ! నిన్ను హృదయంబున నమ్మినవారి పాపముల్
కొండలవంటివైన వెస గూలి నశింపకయున్నె? సంత తా
ఖండల వైభవోన్నతులు గల్గక మానునె? మోక్షలక్ష్మి కై
దండ యొసంగకున్నె తుద? దాశరథీ కరుణాపయోనిధీ॥"

ఓ గరుడగమనా! నిన్ను హృదయములో త్రికరణ శుద్ధిగ నమ్మినవారి పాపములు కొండలంత ఉన్ననూ, నశింపకుండునా? వానికి ఇంద్రభోగములు సమకూరవా? చివరకు మోక్షలక్ష్మి సంప్రాప్తింపక పోవునా? అని తన అచంచల విశ్వాసమును ప్రకటించును.

"అనన్యా శ్చింతయంతో, మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం, యోగక్షేమమం వహామ్యహమ్॥"

అనన్యభక్తితో, ఇతరమును ధ్యానింపక, నాయందే యనురక్తులై యుండువారి యోగక్షేమములను నేనే వహించు చుండెద నన్న గీతావాక్యములిట స్ఫురించు చున్నవి.

## రామదాసు - రహీమ్

రహీమ్, అక్బర్ ఆస్థాన కవులగు - నవరత్నములలో నొకడు, బహుగ్రంథకర్త. సూక్తులు — లోకుక్తులు వీరి పద్యములందు చక్కగా ఉపయోగింపబడి, హృదయాకర్షకములై యుండును. మహమ్మదీయుడైనను, పరమత సహనము కలిగిన విశాల హృదయుడు, దానశీలి. జీవితమందలి వివిధ పరిస్థితులను అవగాహన మొనరించుకొని, వానిని సులభశైలిలో నీతిపద్యముల రూపమున ప్రజల కందించి, వారి హృదయాలలో స్థావర మేర్పరచుకొనెను.

తెలుగువారిలో రామదాసు భక్తకవి. సంగీత, సాహిత్యములందు సవ్యసాచి. [భద్రాచలము పైనున్న రామాలయ పునరుద్ధరణకై తహసిల్ దారుగా ప్రభుత్వ సొమ్ము వినియోగించి, జైలుపాలైన మహనీయుడు. వాని బాధలను తీర్చుటకై శ్రీరాముడే స్వయముగా వచ్చి, బాకీ చెల్లించి, రామదాసుకు బంధవిముక్తి కలిగించెను. రామదాసు సంతోషమునకు మేరలేదు. శ్రీరాముని అనేకరీతుల కీర్తించెను.] భద్రాచల రామదాసు కీర్తనలు, దాశరథీ శతకములు వీరి ప్రసాదములే. గోపన్న రామదాసయ్యెను. తన రచనల ద్వారా ప్రజలలో భక్తిభావమును పెంపొందించెను. నిర్గుణోపాసనను తోసిరాజని, సగుణోపాసనకు ప్రాతినిధ్య మిచ్చెను. భిన్నత్వము నుండి - ప్రజలభావములను ఏకోన్ముఖము గావించి, 'అనన్యభక్తి'ని బలపరచెను. తెలుగువారిలో పోతన పద్యములవలె, రామదాసు పద్యములుకూడ ప్రతినోట ప్రతిధ్వనించినవి. త్యాగరాజు కీర్తనలకు, రామదాసు కీర్తనలు అనుయాయిలైనవి. దృష్టాంత పూర్వకముగా వీరి రచనలు సాగినవి.

మహానుభావులైన రహీమ్, రామదాసుల భావములలో సమన్వయము గోచరించుట సహజము కదా!

గొప్పవారు దీనుల అవస్థలను చూచి సహించలేరు. వారు స్వభావముగనే పరహితాచరణమతులై ఉందురు. వారి కరుణకు చుట్టరికములతో పనిలేదు. హెచ్చుతగ్గుల తారతమ్యములేదు. పిలచిన వెంటనే సహాయపడెదరు. అందుచేతనే వారు మహాత్ములైనారని రామదాసు_రహీమ్‌లు తెల్పెదరు.

"బడే దీన్ కో దుఃఖ్ సున్, లేతే దయా ఉర్ ఆని,
హరి హాథీసో, కబ్ హుతీర్, కహు 'రహీమ్' పహచాని"

గొప్పవారికి దీనరక్షణ సహజము. హరికి, కరికి - ఏమి పరిచయమున్నది? అది పిలువగనే హరివచ్చి కరిని రక్షించెనుకదా! అని రహీమనును. రామదాసు_

"వాసిన చుట్టమా శబరి? దాని దయామతి నేలినావు, నీ
దాసుని దాసుడా గుహుడు, తావక దాస్య మొసంగినావు, నే
జేసిన పాపమో, వినుతి సేసిన గావవు, కావుమయ్య, నీ
దాసులలో నేనొకడ, దాశరథీ కరుణాపయోనిధీ॥"

సశేషము

శబరి నీకు దూరపు చుట్టముకాదు, గుహుడు కనీసము నీ సేవకులకు కూడ సేవకుడుకాడు. కడజాతివారన్న భేద భావన నీకు లేదు. వారి సేవలను స్వీకరించి, వారిని తరింప చేసినావు. కానీ నీ దాసుడని చెప్పుకొనినా, నన్నేంకను ఎందులకు రక్షించి కాపాడవని రామదాసుగారు భగవంతుని ఎడ భక్తునికిగల చొరవ, హక్కులను ప్రదర్శించును. భక్తపరాధీనుడుకదా భగవంతుడు.

గొప్పవారి యనుగ్రహముండిన చాలును. సామాన్యులు కూడ అసాధ్యములగు పనులుచేయగలరు. అందుచేతనే భక్తులు భగవదనుగ్రహమునకు పాటుపడెదరు. గొప్ప పనులు చేయుట వారి ఘనత చాటుకొనుటకుకాదు. భగవద్భక్తిలోని మహిమను, భగవంతునికి భక్తులయెడగల అనురాగమును చాటుటకే. ఈ విషయమును రామదాసు, రహీములు భిన్న రీతులలో బహిర్గత మొన రించెదరు. బిహారీ –

"అనుచిత్, ఉచిత్ 'రహీమ్' లఘు, కరహి బడనికే జోర్,
జ్యోం, ససికే సంయోగ్‌తే, పచవత్ ఆగ్ చకోర్॥"

గొప్పవారి ఆశ్రయానుగ్రహములచే, సామాన్యులుకూడ అసంభవమనిపించు పనులు చేయగల్గుచున్నారు. చంద్రుని ఆశ్రయించుట వలన చకోరములు (నిప్పుకోళ్ళు) నిప్పునుకూడ తిని జీర్ణించుకొన గలుగుచున్నవని రహీమనును. (ఇది ఉత్తరాదివారి సాంప్రదాయము.) మరి, రామదాసన్ననో –

"కోతికి శక్యమా! యసురకోటుల గెల్వను, గెల్చెఁబో, నిజం
బాతని మేన శీతకరుఁడేట దవానలుఁ డెట్టి వింత! మా
సీత, పతివ్రతా మహిమ, సేవకు భాగ్యము, మీ కటాక్షమున్
ధాతకు శక్యమా పొగడ? దాశరథీ కరుణాపయోనిధీ॥" 62

ఒక వానరుడగు హనుమంతుడు సముద్రముదాటి, దేవతలను కూడ జయించిన – లంకలోని రాక్షసులను ఒక్కడే జయించ గలుగుటేమి? ఒకవేళ గెల్చినను, అతని తోక కంటించిన అగ్ని, అతనిని కాల్చక చల్లగా ఉండుట మహాశ్చర్యముకదా? వీనికి శక్తి సామర్థ్యము లెక్కడనుండి వచ్చినవి? అవి సీతామతల్లి పాతివ్రత్య మహిమ వలనను, బ్రహ్మకుగూడ దురవగాహమైన నీ యనుగ్రహము వలనను, నీ సేవకుని భాగ్యము పండినదని రామదాసుల భాగ్యమును రామదాసు పారవశ్యముతో ప్రకటించును.

మనకు కలిగిన ఆపదను గుర్తించి, దానిని నివారింప సమర్థుడగు వానిని నాశ్రయించినచే ఫలితముండును. లేనిచో, చెవిటికి శంఖమూదినట్లు వ్యర్థమగును. ఈ భావమును రహీమ్ –

"దివ్యదీనతాకే రస హిఁ కా జానే జగ్ – అన్‌ధు (అన్ధు)
భలీ విచారి దీనతా, దీన బన్ధుసె బన్ధు॥"

దీనుల కేర్పడిన బాధలను, వాటిలోని గొప్పదనమును, ఈ గుడ్డిలోక మేమి తెలిసికొనగలదు? మానవులలోని మహిమను గుర్తించి, ఆర్తులైన వారి కష్టములను తొలగించ గలిగినది ఆ భగవంతుడొక్కడే! అసమర్థులైన ఈ లోకులను నమ్ముకొని చెడుటకంటె, ఆ ఆపద్బాంధవునితోనే సంబంధము పెంచుకొనుట వివేకవంతుల లక్షణముకదా! అని రహీము అనును. రామదాసు వాని విధానములో ఇట్లనును –

"సరసుని మానసంబు, సరసజ్ఞుఁ డెఱుంగును ముష్కరాధమం,
డెఱిఁగి గ్రహించువాఁడె, కొల నేకనివాసముగాఁగ దర్దురం
బరయఁగ నేర్చునెట్లు; వికచాబ్జ మరందరసైక సౌరభో
త్కరము మిళింద మొందుక్రియ, దాశరథీ కరుణాపయోనిధీ॥"96

సరసుని మనోగత భావములను సాటి సరసుడే గ్రహింప గల్గునుగాని, విరసుని కవగతము కావుకదా! పూర్ణ వికసితమై, తన మకరందమును, పిల్లవాయువులతో పద్మములు వ్యాపింపజేయుచుండగ, వాటి సువాసనను గాలిలో ఎక్కడో ఎగురుచున్న తుమ్మెద గ్రహించి వాటిపై వ్రాలి తేనెను గ్రోలగల్గుచున్నదికాని ఆ కొలను లోనే ఉన్న కప్ప ఆ విషయమునే గ్రహింపలేకున్నదిగదా! అని అనుచు రామదాసు–

"గురుతరమైనకావ్యరసగుంభన కబ్బురమందిముష్కరుల్,
సరసులమాడ్కి సంతసిలఁజాలుదురోటు! శశాంకచంద్రికాం
కురముల కిందు కాంత మణికోటి స్రవించినభంగి, వింధ్యభూ
ధరమున జాలునే శిలలు, దాశరథీ కరుణాపయోనిధీ" (8)

మహా కావ్యములోని రసమాధుర్యమును సరసులైనవారు గ్రహించి ఆనందించునట్లు–మూఢులకది అశక్యమగు చున్నది కదా! పున్నమినాటి చంద్రకిరణాలకు చంద్రకాంత మణులు కఱగినట్లు, వాటికంటెను ఆకారములో పెద్దవియే యైనను, వింధ్య పర్వతముమీది బండరాళ్ల కరుగలేవు. అందుచేతనే తన కావ్యమును నరపరము కాకుండ, నారాయణ పరము గావించుచున్నానని రామదాసు విన్నవించుకొనును.

చిలికినకొలది వెన్న, ఇటువంటి లు తఱచిన కొలది లభించుచునే యుండును.

# కొండలు

అవి కొండలు
అణువణువు నిండిన బండలు
స్పందన లేని గుండెలకు
ప్రతిఫలించే బింబాలు
కాని
వాటి గుండెల మాటున
ఎన్నెన్ని వనమూలికలు
వాటి కండల చాటున
ఎన్నెన్ని కళాఖండాలు
అయితే !
వాటి తనువులు జ్వలిస్తే
లావాలే స్రవిస్తాయి
వాటి మనసులు ద్రవిస్తే
జీవనదులే ప్రవహిస్తాయి

ఇంకా
మహావృక్షాలు సైతం
వాటి నెత్తిమీద మొలుస్తాయి
మహామునులు సైతం
వాటి ముసుగుల్లో వసిస్తారు

ఆ కొండలు ఎందరికో
కూడుగుడ్డ పెడతాయి
ఆ బండలు ఎందరికో
భవంతులై నిలుస్తాయి

అయినా వాటికేం తెలుసు
అవి కొండలు
ప్రపంచానికి కొండంత
అవే అండలు.

# (ఆ) విరికవిలు

నా
మానస విరి తోటలో పూచిన
ఎన్నెన్నో భావాల పుష్పరాశులు
సమాజ కలగూర గంపల్లో లాగ
సర్వస్వం కలిసిపోయి వున్నాయి
నేను
వాటి సౌరభాన్ని ఆఘ్రూనించలేక పోతున్నాను
వాటి రూపాల్ని తిలకించలేక పోతున్నాను
వాటి అందాల్ని స్పృజించలేక పోతున్నాను
వాటి భావాల్ని అందుకోలేక పోతున్నాను

అందుకే
ఏ స్వభావంతో
ఏ స్వభావం కలుస్తుందో చూశాను
ఏ జాతికి
ఏ జాతి చెందుతుందో ఆలోచించాను
విడివిడి గా
విరి కవితలు ఏర్చికూర్చాను
అభ్యుదయ కవిత ఒక వైపు
ఆలోచనలు చిందిస్తుంటే
విప్లవ కవిత ఒక వైపు
ఆవిరులు చిందిస్తోంది.

శ్రీ తమ్మిశెట్టి రామారావు

# కలిగారగంప

## అహోబలము - వేదాద్రి - యాదగిరి

మా తండ్రిగారు విద్యారణ్య పంచానన విద్యా వాచస్పతి **కళానిధి** శ్రీమాన్ (కీ. శే.) వికాల రామచంద్రాచార్యులవారు సుమారిప్పటికి అరువదియేండ్లనాడు మూడవసారి భూప్రదక్షిణము వారి తల్లిగారు (మా నాయనమ్మగారు), మా తల్లిగారు, పండిత శ్రీమాన్ మాయన్నగారు, శ్రీమాన్ మా మేనమామగారు, నేను ఇందఱితోడ సలిపిరి. కాని యీ యాత్ర అప్పుడు శ్రీమాన్ మా తండ్రిగారి కెక్కువ జబ్బుచేసి వారు చెప్పుచున్నను మా యజ్ఞానమువలన హరిద్వారమువరకేసాగి యటనుండి వెనుకకు మఱల వలసి వచ్చెను. అహోబలములో కొండలపైన ఏడుగురు నరసింహులు కొండక్రింద యిద్దఱని నాకు జ్ఞాపకముండి యీ విషయము నెఱుంగఁ గోరి యెచ్చట నుండునా? యని గ్రంథములు తిరుగ వేయ (చదువ) నారంభించితిని. చివరకు మా తండ్రిగారే మొదట భూప్రదక్షిణము సలుపుచు రచించిన "దివ్య దేశాలయవిశేషములు" అను గ్రంథమునుఁ జూచితిని. అందు కొంత విరివిగ నున్నది కాని అచట ఆ నవనారసింహు లేర్పడిన కారణ మేమి? వారివారి కథలేమి? యను నా సందేహము తీరలేదు. తెలుఁగు బాసయందు ఎఱ్ఱాప్రెగ్గడ విరచించిన లక్ష్మీనృసింహావతార మనెడు నామాంతరము కల నరసింహపురాణము (అహోబల మాహాత్మ్యము) నందు ఈ నవనారసింహుల విషయము కనుపించలేదు. దీనికి గొల్లపూడి శ్రీరామమూర్తి శాస్త్రులుగారు సలిపిన వచనానువాదమునం దీవిషయము కానరాదు. ఇది యిట్లులుండ శ్రీనివాస వేదాంత యతీంద్ర **మహాదేశిక విరచితమైన మంగళాశాసనమునందు**

శ్లో॥ శ్రీ పరాంకుశయోగీంద్ర శఠారి ప్రముఖాన్గురూన్
మఙ్గళాశాసనపరా న్మహితా ననిశం భజే ॥౧॥

జగజ్జన్మాది లీలాయ జగదానంద హేతవే ।
జగద్వృక్ష నివాసాయ శ్రీ నృసింహాయ మఙ్గళమ్ ॥౨॥

హిరణ్య స్తమ్భ సమ్భూతి ప్రఖ్యాతపరమాత్మనే ।
ప్రహ్లాదార్తిముషే జ్వాలానారసింహాయ మఙ్గళమ్ ॥౩॥

గరుడాద్రి గుహా గేహ గజకుణ్డ సరస్తటే ।
హిరణ్యస్థా ణ్యహంకార హారిసింహాయ మఙ్గళమ్ ॥౪॥

స్తంభోద్భవ నృసింహస్వామి కాఁబోలు? శ్రీమాన్ మా తండ్రిగారు ముందటి "దివ్యదేశాలయవిశేషముల"లో వ్రాసినవారు.

వారిజా వారితభయై ర్వాణీపతిముఖై స్సురైః ।
మహితాయ మహోదార మాలోలాయాఽస్తు మఙ్గళమ్ ॥౫॥

లక్ష్మీ నృ సిం హ స్వా మి

వరాహకుణ్డే మేదిన్యై వరాహార్థ ప్రదాయినే ।
దన్తలగ్న హిరణ్యాక్ష దంష్ట్రసింహాయ మఙ్గళమ్ ॥౬॥

ఈ వరాహనరసింహస్వామి యెవరో తెలియదు. సింహాచలము నందు వరాహనరసింహు డుండు కాని వీరిచ్చటివారో.

గో భూ హిరణ్య నిర్విణ్ణ గోభిలజ్ఞానదాయినే ।
ప్రభఞ్జన శునాశీర కారఞ్జాయాఽస్తు మఙ్గళమ్ ॥౭॥

కరంజ శబ్దమునకు కర్జకాయలు, కానుగుచెట్టు రెండర్థములు కనుక ఈ నరసింహ స్వామివారికి కజ్జకాయల న యిష్టమో? కానుగుచెట్టు క్రింద నున్నారో? తెలియదు.

భార్గవాఖ్య తపస్వీశభావనా భావితాత్మనే ।
అక్షయ్య తీర్థస్థ భార్గవాయాఽస్తు మఙ్గళమ్ ॥౮॥

వీరు పరశురామ నృసింహస్వామి.

చతురానన చేతోబ్జ చిత్రభానుస్వరూపిణే ।
వేదాద్రి గహ్వరస్థాయ యోగానందాయ మఙ్గళమ్ ॥౯॥

అహోబలపు కొండలలో నొకదానికి వేదాద్రి యని పేరు కలదేమో?

హాహాహూహ్వాఖ్య గన్ధర్వ నృత్తగీత హృతాత్మనే ।
భవహంత్ర తటచ్ఛత్ర వటసింహాయ మఙ్గళమ్ ॥౧౦॥

భారద్వాజ మహాయోగి మహాపాతకహారిణే ।
తాపనీయ రహస్యార్థ పావనాయాఽస్తు మఙ్గళమ్ ॥౧౧॥

భారద్వాజ మునీంద్రుని పాపములనుఁ బోఁగొట్టిన ఈ నరసింహస్వామి యెవరో?

శ్రీ శఠారియతీంద్రాది యోగిహృత్పద్మభానవే।
సర్వత్ర పరిపూర్ణాయాఽహోబిలేశాయ మఙ్గళమ్ ॥౧౨॥

అహోబిల నరసింహస్వామి

మఙ్గళాశాసన మిదమ్ మానివాసమునీరితమ్।
మహనీయం పఠన్ భక్త్యా న్మఙ్గళాయతనం భవేత్ ॥౧౩॥

జ్వాలానృసింహ మఙ్గళం సంపూర్ణమ్॥

మొదట లక్ష్మీనృసింహాది మంగళాశాసనమని, ముగిసిన పిమ్మట జ్వాలానృసింహమఙ్గళ మనుట యేలకో? 378 వ పుటయే. విషయసూచికయందు జ్వాలానృసింహమంగళమ్ మనియు దాని పుట 378 అనియు వేసియున్నది. (చూ. 1897 సం॥ రము బెంగుళూరు బుక్‌డిపో ముద్రాక్షరశాలా ముద్రితమై తూప్పల్ వేంకటాచార్య శోధితమైన స్తోత్రరత్నాకరము.) శ్రీ శోభనాచల మాహాత్మ్యము వచనకావ్యము శ్రీ లక్ష్మీనారాయణాచార్య ప్రణీత ములోవలె అనుబంధము లేర్పఱచి యందు అసలు స్వామివారి చరిత్రమును వ్రాసి యనుబంధములలో 1 - 2 - 3 మొదలుగా గల యంకెలువేసి యచ్చట తతిమ్మావారి కథలను వ్రాసిన బాగుండును. లక్ష్మీనృసింహాది మంగళాశాసన ప్రణేతగారు అందఱు నరసింహ మూర్తు లచ్చట యేర్పడిన కథలను దెలుపునట్టి ఒక్క శతకమును రచించివేసినను బాగుండెడిది. ముందు నుడివిన శ్రీ లక్ష్మీనరసింహాది మంగళాశాసన గ్రంథమునందు గజకుండమని, వరాహకుండ మని రెండు తీర్థకముల పేళ్ళున్నవి. శ్రీమాన్ మా తండ్రిగారు పూర్వోక్తమయిన "దివ్యదేశాలయవిశేషము"లను గ్రంథమునందు ఈ యన్ని సన్నిధుల ప్రక్కన కొండసెలయేఱులు పాఱుచుండు నని వ్రాసియున్నారు కాన అచ్చటచ్చట ఆయా సెలయేఱలకాయా పేళ్లు ఉండునని యనుకొన్నను ఫరవాలేదని నాయుద్దేశము.

ఇట్టులే కృష్ణామండలాంతర్గతమైన వేద్రాది పంచనారసింహ క్షేత్రము. (నల్లగొండజిల్లా భువనగిరితాలూకా అప్పటి యద్రను.) వంగపల్లి రైల్వేస్టేషనుకు పడమరదిశయందు మూడుమైళ్ళలో నుండు యాదగిరి పల్లెయు పంచనారసింహక్షేత్రము. (యాదగిరి పల్లెయందు పంచనారసింహు లొక్క సన్నిధియందే యుందురు.)

ఇది యిట్లుండ శ్రీమాన్ పండిత మాయన్నగారు ఒక పురాణ గాథను ఒకప్పుడు నుడివిరి. నవనారసింహసందర్శన మని. అది శ్రీఆంజనేయులకు శ్రీకృష్ణుఁడు దశావతారములను చూపించిన కథ. దాని సంగ్రహము - పూర్వకాలమున శ్రీరామభద్రుఁడు హనుమత్సుగ్రీవాదివానరులును జాంబవదాది వెలుఁగుబంట్లు వీరు లయు సాయమున లంకలోని దుష్టులయిన రావణాదులను వధించి సీతను పొంది ఆమె సౌమిత్రి మిత్రబలగము మున్నగువారి తోడను అయోధ్య కేతెంచి పట్టాభిషిక్తుఁడై యున్నతఱి హనుమత్సుగ్రీవాది మిత్రబృందము రామవియోగమునకు ఓడి వీడక యుండునప్పుడు రాముఁడు "రాజు లేకుండిన ప్రజ లధర్మప్రవర్తను లయ్యెదరు. వీరు నన్ను విడలేక యున్నారు. అని మది నెఱింగి వారి వారికి కావలసిన వరముల నొసఁగి పంపి చివరను హనుమంతుని యెచ్చరించి అయన కోరిన వరము లిచ్చి హనుమ యొనరించిన మహోపకారమును మదిఁదలఁచి హనుమా! నీవు కోరకుండి నను నేనొక్క వరము నిచ్చుచుంటిని. త్రైకొమ్మని రాఁబోవు కల్పమున నన్ను బ్రహ నొనర్చెద నని నుడివి ఆయన కోరిన వరములలో రెండవది దశావతార సందర్శనము. దాని నీ రామావతారమున కాదు, కృష్ణావతారమున అని నుడివి ద్వాపరయుగమున కృష్ణుఁడుగ నవతరించి సేతువువద్ద అర్జునుఁడు కట్టిన శరసేతువు ఆంజనేయ పదా హతము కాఁగా ఆ కృష్ణుఁడు పాండవుల నేవురను కాపాడువాడు కావున తానెచ్చట నుండియో వచ్చినట్లు నటించి యసాక్షిగఁ జేసిన యే పనియు చెల్లదని చెప్పి తానే ఆ పనియందు సాక్షిగ నుందునని చెప్ప అర్జునుఁ డాతడవ తన శరసేతువు హనుమడి పదాహత మయ్యెనేని తాను నిప్పులో దుముకుదునని సింధువున శరసేతువు నిర్మించెను. హనుమ పాదాహతము అయ్యెను. అర్జునుఁడు తానొనర్చిన శపథము ప్రకార మగ్నిఁ జొచ్చ యత్నించ, బావా! అర్జునా! నాఁవీపుఁ జూడుమని ఆంజనేయ పాదఘాతములను జూపి యిమ్మహానుభావుని పాదముల ఘాతము నెవ రోర్వఁగలరు. ఇద్దఱి ప్రతిజ్ఞలు నెరవేరినవని నుడివి, ఆంజనేయుఁడన్న ప్రకారము యుద్ధకాలమున అర్జునుని రథముపైన ధ్వజముగ నుండి యుద్ధానంతరము శ్రీకృష్ణునితో స్వామీ! దేవరవారు రామావతారమునందు చెప్పిన దశావతార సందర్శనము నెప్పుడు దయచేసెద రన నేను మఱవలేదు. ఇది యందుకు స్థానము గాదు. అని హనుమమెడలపై యెక్కించుకొని కాశ్మీరదేశమునకుఁ దీసుకుని పోయి (తన) కృష్ణుని మాట ప్రకారము కన్నులు మూసి తెఱచునప్పటికి మత్స్యావతారముఁ జూప హనుమ పూజించి యిట్లే నరసింహావతారము మినహాగా దశావతారములనుఁ జూపఁ జూచినావా యని కృష్ణుఁడడుగ స్వామీ! నరసింహావతారము జూపరైరి యన దానిని నీవు చూడఁజాలవని నేనే చూపనైతిని మఱచి కా దన హనుమ బలాత్కారము చేత

కన్నులు మూసి తెఱవ స్వామి నాకాశమును గ్రమ్మి యొక సింగము హుంకారముతోడ జడలు విదలింప నాంజనేయులు పెడకేక వేసి యచ్చట నుండి మఱియొక తావుకు దుమికి చూడ నటను అట్టులే కనుపింప ఇట్టులు సేతువు వరకు తొమ్మిది తావులఁ గూర్చుని యచ్చటనుఁ గన్నులు దెఱచి చూడ అట్టులె పెద్ద సింహము కనుపింప హనుమ యిట్లు మదిఁ దలఁచెను. నేను స్వర్గసత్యాది సమస్త లోకములను తిరిగి రాఁగలను. కాని యీ సింగ మిప్పగిది కనుపించుచునే యుండును. ఇప్పుడు శరణాగతి కంటెను రక్షణకు వేఱొం డుపాయము లేదని యెంచి నుతించెను:

శ్లో॥ జ్వాలాఽహోబిల మాలోల క్రోడ కారుణ్య భార్గవాః ।
యోగానందో వటచ్ఛత్రిః పావని ర్నవమూర్తయః ॥౧॥
మహాశౌర్యో మహాధైర్యో మహాభయనివారకః
నారసింహః పరోదేవః పాతు మాం శ్రీ నృకేసరీ॥౨॥ అని.

కృష్ణుఁడు ప్రసన్నుఁడై నరసింహ స్వరూపమునుఁ జూచితివా? నీవు ఆ రూపమును చూడ నేర వని యెఱిఁగి నేను విడువ నీవు బలవంతముఁ జేయఁ జూపితిని. హిరణ్యకశిపుఁ డనిన నా వైకుంఠ లోకమునం దొక ద్వారపాలకుఁడు. చివరకు పోరి నా చేతనే చచ్చె నని చెప్పెను. (ఇంకనుఁ గలదు.) ఇది శ్లోకము కాదు. మంత్రము. దీనియొక్క యర్థము జ్వాలా - జ్వాలానరసింహ మెచ్చటనో? అహోబల - అహోబల నరసింహస్వామి, మాలోల - లక్ష్మీనరసింహస్వామి - మంగళగిరి యని మా యన్నగారు, మఱి కొందఱు మాలెకొండ యని, ఇంకఁ గొందఱు ఇంకొకటి యని యందురు. క్రోడ - వరాహనరసింహస్వామి, సింహాచలమున, కారుణ్య - కరుణా నారసింహస్వామి ఎటనో? భార్గవాః - పరశురామనరసింహస్వామి ఎటనో? యోగానందః - యోగానందనరసింహస్వామి. సింగరాయకొండ యని పెద్దలు. వటచ్ఛత్రిః - మఱ్ఱిచెట్టు క్రింద నుండు నరసింహస్వామివారు ఎచ్చటనో? పావనిః - హనుమన్నరసింహస్వామి, చోళంగివర మేమో? తెనుఁగు బాసయందు అహోబలనరసింహస్వామివారికి చెందిన గరుడాచల మను పాట యొకటి కలదు.

అహోబలమునందు తొమ్మండుగురు, వేదాద్రి - యాదగిరుల యందు ఐదేసిమంది నరసింహమూర్తులు అయా తావులయందు అహోబలము - వేదాద్రి - యాదగిరులపై వెలసిన గాథలు వారి వారినిఁ గురించినవి ఏయే గ్రంథములయందుఁ గలవో? భారతి మూలమున లోకమునకుఁ దెలిపి నాకుఁ బ్రత్యేకముగ జాబు వ్రాసి తెలుపఁగలందులకు విన్నపములు.

వికాల శేషాచార్యులు,
కలికినాయ పోస్టు, వయా సింగరాయకొండ, ప్రకాశం జిల్లా.

## 'తిరు' - 'శ్రీ'

భారతి, (ఆగస్టు 1983) లో శ్రీ కాకుమాను తారానాథ్‌గారి "భాష - సంస్కృతి అప్పుడు - ఇప్పుడు" అను వ్యాసములో ఈ క్రింది వాక్యమును చర్చించెదను. ప్రాచీనత పేరుతో సంస్కృతం బదులు శుద్ధ తమిళాన్ని పెట్టడం, ఫలితంగా "శ్రీ" బదులు "తిరు" అనటం, "ఆకాశవాణి" బదులు ఇంకేదో....

పై వాక్యము బట్టి తిరు" శబ్దమును శుద్ధ తమిళముగా భావించుచున్నట్లు స్పష్టము

"తిరు" శబ్దము "శ్రీ" శబ్ద భవమే కాని వేరుకాదు.

సంస్కృతములోని స, శ లు ద్రావిడ భాషలలో 'త' గా మారును. ఉదాహరణములు

| సంస్కృతము | ద్రావిడ భాషలు |
|---|---|
| శ్రీ | తిరి_తిరు |
| శ్రీమాన్ | తిరుమాన్ |
| సేన | తానాయ్ |
| స్వర్గ | సువర్క్కం |
| సూచి | తూచి |

మలయాళ తుళు భాషలలోనూ పదాదిలో 'త' ల మార్పిడి కన్పట్టును. ఉదాహరణలు

| మలయాళము | తుళు |
|---|---|
| సంగం | తంగం |
| సంచి | తంచి |
| సమరం | తమరం |
| సభ | తప |

| మలయాళము | తుళు |
|---|---|
| సన్యం | తన్య |
| సేవ | తేవ |
| నోన | తోన |
| నోలు | తోలు |

పైనుదాహరణములను ఆర్. స్వామినాథఅయ్యరు గారి "ద్రావిడ సిద్ధాంతములు" అను గ్రంథమునుండి తీసికొన్నాను.

గుజరాతులో 'శ్రీఖండ్' అను మిఠాయి చేయుదురు. తియ్యని కండ అని అర్థము. 'శ్రీ' యన విషము, తీయదనము అని నానార్థము లుండియుండును. కన్నడ భాషలో 'శ్రీకరణి' అను తీయని వంటకము (చోష్యము) కలదు. 'శ్రీ' అను శబ్దము మధురము అను నర్థమున కన్నడ భాషలో 'సీ' యనియు, తెనుగులో 'తీ' (య) లేక 'తి' (య్య) అనియు మారినది.

దీనిని బట్టి 'శ్రీ' అను శబ్దము తిరి-తిరుగా మారి యున్నదనుట స్పష్టము. తమిళ భాషలో సంశ్లిష్టాక్షరములు సకృత్తుగా నుండును.

అందుకే సంస్కృతపరముగా 'శ్రీ' యెచ్చటెచ్చటు వచ్చునో, ఆయా చోట్ల తమిళములో 'తిరు' గా మారుట సర్వేసర్వత్ర కన్పించుచున్నది. 'ఆకాశవాణి' బదులు తమిళులు వాడు 'వాణొలి' కూడ సంస్కృత తద్భవమే. తెలుగులో ప్రకృతి - వికృతుల విలాసము చెప్పబనిలేదుకదా. అరవభాషా స్వభావము వలననే సంస్కృత శబ్దములు ఆ విధముగా మారినవి. దీనిని తమిళుల సంకుచిత తత్త్వముగా భావించుట సమంజసము కాదు.

'త్రి'

# సోమలదేవి - దాక్షారామ శాసనము

1982 అక్టోబరు 'భారతి'లో సోమలదేవి-దాక్షారామశాసనము గురించి నేను వ్రాసినదానికి 1983 ఫిబ్రవరి, మే 'భారతి' సంచికలలో శ్రీ తురగా కృష్ణమూర్తిగారు ప్రకటించిన వ్యాసములు చదివిన తరువాత ఈ నాలుగు మాటలు వ్రాయదలచితిని.

కళింగ రాజరాజు దేవేంద్రవర్మ భార్య రాజసుందరి 'చోడ మహీభుజాత్మజ' అని, 'రాజేంద్ర చోళస్య తనయా' అని శాసనాలలో చెప్పబడినది. ఈమె చాళుక్య రాజరాజ నరేంద్రుని మరదలు అని శ్రీ కృష్ణమూర్తిగారు 1982 జులై 'భారతి'లో అభిప్రాయపడ్డారు. అమ్మంగదేవి - చాళుక్య రాజరాజుల వివాహము క్రీ॥ శ॥ 1020 లోను, రాజసుందరి-కళింగ రాజరాజుల వివాహము 1063 లోను జరిగినది. అమ్మంగదేవి, రాజసుందరి అక్క-చెల్లెళ్ళయిన వారికి వివాహములకు 43 సం॥ ల అంతరము ఏవిధముగా సమర్థనీయమో శ్రీ కృష్ణమూర్తిగారు తెల్పలేదు. పై అభిప్రాయానికి భిన్నంగా వారే ఫిబ్రవరి 83 'భారతి'లో రాజసుందరి చాళుక్య రాజరాజ నరేంద్రుని కుమారుని మామయగు రెండవ రాజేంద్ర చోళునకు దాయాదియైన వీరరాజేంద్ర చోళుని రెండవ కుమార్తెగా చెప్పారు. రాజసుందరి తండ్రి చోడరాజైన గంగై కొండచోళుడా? చాళుక్య రాజరాజ సుతుడు రాజేంద్ర చోళుడా? 'ఈ ఇరువురిలో నెవ్వరన్నదే ప్రశ్న' అని ప్రారంభించిన శ్రీ కృష్ణమూర్తిగారు ఈ ఇరువురినికాక మూడవ వ్యక్తిని - వీర రాజేంద్రచోళుని-రాజసుందరి తండ్రిగా చెప్పినదానిపై పరిశోధక శిఖామణులే వ్యాఖ్యానించ సమర్థులు.

రేవణారాధ్యులు వివాహమాడిన సోమలదేవి చాళుక్య వీర విజయాదిత్యుని కుమార్తె అనుటకు "సోమలదేవి రేవణారాధ్యుల సమకాలీనత, ఆవాసముల సన్నిహితత్వము"లను కృష్ణమూర్తిగారు ప్రధానముగా పేర్కొనిరి. ('భారతి' జనవరి 83) ఏ కాలపు రచనో తెలియని పంచబ్రహ్మోదయ భాష్యమున పేర్కొనబడిన రాజమందిరము ఎక్కడిదో తెలియదు. అది రాజమహేంద్రవరము కాదు. నన్నయభట్టు రాజమహేంద్రపురమును 'రాజమహేంద్రపురము'గా పేర్కొనినాడు. (భార. 1-1-8) అది రాజరాజు నిర్మించినదే అయితే నన్నయ ఆవిషయమును చెప్పక విడువడు. అది రాజరాజు నిర్మితముకాదు. శ్రీ కృష్ణమూర్తిగారుదాహరించిన కావ్యాలంకార చూడామణిలోని పద్యములో రాజమహేంద్రవరమును గల్పించిన రాజు 'రాజమహేంద్రు'డని యున్నది కృష్ణమూర్తిగారు గమనించినట్లులేదు. "రాజమహేంద్రపురస్థాత రాజనరేంద్రుడు" అని కావ్యాలంకార చూడామణిలోనే చెప్పబడినదానికి, 14 వ శతాబ్ది శాసనంలో చెప్పబడినదానికి జనశ్రుతియే ఆధారము కావచ్చును. ఎట్లయినను, క్రీ. శ. 1050 ప్రాంతమునకే రాజమహేంద్రవరము ఆపేరున ప్రసిద్ధమైయున్నప్పుడు క్రీ. శ. 1100 లోనో, ఆ తరువాతనో అది రాజమందిరమని పిలువబడినదనుట,

ఆ రాజమందిరమే కాలక్రమమున రాజమహేంద్రి, రాజమహేంద్రపురముగా ప్రసిద్ధి చెందినదనుట హాస్యాస్పదము, సత్యదూరము. కనుక వీర విజయాదిత్యుని కుమార్తె సోమలదేవి రేవణారాధ్యుల "ఆవాసముల సన్నిహితత్వము" ఊహకు సైతము అందునది కాదు. ఏ ఇతర ఆధారము లేకుండ కేవలము సమకాలీనతపై ఆధారపడి వీరవిజయాదిత్యుని కుమార్తె సోమలదేవికి, కోటిపల్లారాధ్యుల తండ్రి రేవణారాధ్యులకు వివాహ సంబంధ మంటగట్టుట సరికాదు. ఇంతకూ "ముఖలింగశాసనములో నుదహరింపబడిన సోమలదేవికి దాక్షారామశాసనములో నుదహరింపబడిన సోమలదేవికి యెట్టి సంబంధములేదు" అని చెప్పగలిగిన శ్రీ కృష్ణమూర్తిగారు పంచబ్రహ్మోదయభాష్యములో చెప్పబడిన 'సోమలాదేవి'ని దాక్షారామ శాసనములో చెప్పబడిన 'సోమలదేవి'గా ఎట్లూహించిరో అర్థమగుటలేదు.

'మంత్రి పురోహిత సేనాపతి యువరాజదౌవారికు'లు మహారాజునకు పంచప్రధానులు. రాజు పంచప్రధానుల సమక్షమున దానధర్మములిచ్చినట్లు చెప్పుట ఒకనాటి ఆచారము. వీరవిజయాదిత్యుని ర్యాలి శాసనమున పేర్కొనబడిన 'సంతాన'ము యువరాజే అయిన ఆ యువరాజును స్పష్టముగా, ప్రత్యేకముగా పేర్కొనక పంచప్రధానులతో కలిపి ఏశాసనకర్తయైన పేర్కొనునా? స్పష్టార్థముకాక 'అంతరార్థము'న విషయవివరణ మొనరించబూనునా? విజ్ఞులు వివరించ ప్రార్థన.

ముఖలింగ శాసనములో చెప్పబడిన సోమలదేవి పుట్టింటి వారెవరో తెలియదు దాక్షారామశాసనములో చెప్పబడిన సోమలదేవి "దేవేంద్రవర్మ భార్య కాదని, అనంతవర్మ చోడగంగుని భార్య అసలేకాదని" కృష్ణమూర్తిగారి నమ్మకము. అయినను సోమలదేవి, దేవేంద్రవర్మల మధ్య ఉండగల వయోభేదమునుగూర్చి చర్చించి క్రీ. శ. 1068 నాటికి ఇరువురు సమవయస్కులని వూహించారు. నూతనాధారములు లేకుండా ఈచర్చనిక పొడిగించుట అనుచితము. ఇక రాజసుందరి వివాహము దేవేంద్రవర్మతో కుదిరిన సంధితో ముడిపడినది కనుక వధువు వయోవృద్ధత్వము ఇటువంటి వివాహములలో ఆరోజులలో అంతగా గణింపదగినది కాదని నా అభిప్రాయము.

శ్రీ సూర్యదేవర రవికుమార్

# కూరాకు - ఖురాక్

1983 ఏప్రిల్ భారతిలో శ్రీ "తి" గారు కూరాకు పద వివరణపై చర్చచేస్తు దానికి "ఆకుకూర"అనే అర్థం పొసగదు అది ఖురాక్ శబ్దతద్భవంగాని ఆకుకూర మాండలికం గాదని తాత్పర్యం అన్నారు.

తెలంగాణంలో నైజాంకాలంలో "ఖురార్ - గిజా" అనే పదాలు బాగా వ్యాప్తిలో ఉండేవి. ఖురాక్ పారసీకశబ్దం. దానికి ఆహారం ఔషధపుమోతాదు అనే రెండర్థాలున్నవి. గిజాలనేది అరబ్బీ పదం. దానికి ఆహారం అనే అర్థం మాత్రమే ఉంది. ఇక తెలుగులో కూరకు ఆహారం అనిగాక శాకం అనేదే రూఢి.

"నేయి లేని తిండి నీ యాన కసవది
కూర లేని తిండి కుక్కతిండి."

అని కూరకు శాకార్థంలో ఇటువంటి ప్రయోగాలెన్నో మనకు కనిపిస్తవి.

కూరాకు అనే పదానికి డా. గంగప్పగారు తమ వ్యాసంలో "ఆకుకూర" అనే అర్థం వ్రాసినారుకాని శ్రీ తి. గారన్నట్లు దాని కక్కడ ఆ అర్థం పొసగదు. కూరాకు షష్ఠి అయితే ఆకుకూర విశేషణపూర్వం అవుతుంది. "కూర" అన్నపుడు తెలుగువారికది సాధారణంగా "హరితక" సంకేతమేగాని అన్యాపకిగాదు. కాలక్రమేణా అది, వ్యంజనార్థంలో రూఢి అయి వంకాయకూర, బీరకాయకూర అని కాయలతోచేసిన వానికి, కోడికూర-చేపలకూర అని మాంస వ్యంజనాలకు చేర నారంభించింది.

"తి" గారు కూరకు రాయలసీమలో "మాంసం" అనే అర్థం ఉందన్నారు. అది దానికి లేకపోలేదుగాని మాంసాన్ని కూర అనే సామాన్యులే "మాంసంకూర" అనిగూడ వాడుతారు కాబట్టి ఇది కౌలికులు మద్యానికి "వస్తువు", వ్యభిచారులు పడుచుకు "పిట్ట" అని పేరు పెట్టుకున్నట్టు వ్యంజనోపయోగమైన మాంసానికి లోకం నిర్ణయించుకొన్న ఒక సంకేతం అనుకోవలె.

ఇక తాళ్లపాకవారి ప్రయోగంలో కూరాకు ఈ విధంగావుంది:

చెలఁగి కూరాకుఁగాఁ జేసేవు, నీ
తలమీఁద నుండే తరుణిఁబో నేను. . XII-194.

ఇది ఒక నాయికా వాక్యం. నేను నీకు శిరోధార్యమైన దానిని. అట్టి నన్ను నీవు కించపరుస్తున్నావు అని దీని భావం. తెలంగాణంలో ఈ పలుకుబడి యింకా సజీవంగానేవుంది. వాడు

నన్ను కూరకు కొఱగాకుండా చేసినాడు, నేనంత కూరకు కొఱగాని వానిననుకున్నావా? అనేవి జానపదుల్లో వినిపిస్తుంటవి.

మామూలుగా కూరనే హీనార్థమైతె అందులో దొగ్గలికూర, పుంటికూర మరీను. దొగ్గలిని తోటకూర, పుంటిని గోంగూర లంటారు. దగ్గరుండేవారు దొగ్గలికి కొఱగారని, గోంగూర ఆంధ్రులకెంత ప్రియమయిందయినా, పుంటకూర తిన్నా పుట్టినిల్లే అష్టభాగ్యాలమరినా అత్తవారిల్లే అని సామెతలు వినిపిస్తూనే వుంటవి. కాబట్టి ఈవిధంగా కూర అల్పార్థమైతె కూరాకుఅందులో మరికొంత విశేషంగా భావించవలె.

కూర అనే పదానికి తెలంగాణా భాషీయంలో అల్పార్థమే గాక ఈడిగిలబడు అనే అర్థంగూడవుంది. "కూరాకుసేయు" అనే పదానికి సూ. ని. వధించు అనే అర్థం యిచ్చిందిగాని వారిచ్చిన ప్రయోగానిని ఆ అర్థం సమంజసంగా కనిపించదు. చూడండి.

తే. పులుల చట్టలు చీరి దుప్పులను లేళ్ళ
నేకలమ్ముల గ్రుమ్మి కూరాకు సేసి
యమరఁ జమరులఁ బట్టి పాలార్తు మిపుడు
సామి చూడుము నీ బంట సతువనుచు. సారంగ-1-8

ఇది సారంగధరుని భటులు వేటలో తమ పౌరుషాన్ని చాటుకునే సందర్భం. కర్తయైన చేమకూర వెంకటకవి జాతి వార్తా చమత్కారఘటికుడు కనుక పైని ప్రయోగించిన చట్టలు చీరు, క్రుమ్మి కూరాకుసేయు, పట్టి పాలార్చు తాత్పర్యంలో ఒకటే యైనా వ్యుత్పత్తిలో గావు.

చట్ట అంటే కవచం అని శ. ర. చర్మం అని. ఆం.శ.ర. కాబట్టి చట్టలు చీరు అంటె చర్మం వొలుచు అని ఆంధ్ర శబ్ద రత్నాకరం చెప్పింది సరిపోతుంది. క్రుమ్ముట అంటె పొడుచుట కాబట్టి క్రుమ్మి కూరాకుసేయు అనేదానికి సూ. ని. వధించు అనే అర్థంయిస్తే ఆం.శ.ర. సులువుగాజేసి చంపు అనే అర్థం ఇచ్చింది. ఇది కొంతవరకు వరిపోతుంది. అయినా సులువుగాజేసి అనే దాని కంటె పొడిచి ఈడిగిలబడజేసి చంపు అంటె ఇంకా సరిపోతుంది.

పట్టి పాలార్చులో-పాలార్చు అనేదానికి శ. ర. ఉపేక్షించు అనే అర్థం యిచ్చింది. అది యిక్కడ పొసగదు కాబట్టి ఇది పాలార్చుకంటె "పల్లార్చు "అయివుండవలె. "పల్లార్చు "అనేదానికి శ. చం. చంపట్టు అని, సూ. ని. నశింపజేయు అనే అర్థాలిచ్చినవి కాని వీనికంటె "చలముడించు" అనేది ఇక్కడ సరిపోతుంది.

సారంగధరుని భటులు మేము పెద్దపులుల తోలువొలుస్తాము, "ఏకలం" అంటె ఒంటరిగాడనే అడవిపంది. అది మహా పొగరుబోతు కనుక అట్టిదాన్నిగూడ పొడిచి పొడిచి ఈడిగలపడవేస్తాం, చమరి అంటె గురిమెకం వాటినిపట్టి మత్సరందించివేస్తాం, మా పరాక్రమం చూడండి అని చెప్పుకుంటున్నారు కాబట్టి పైని ఉపయోగించిన చట్టలుచీరు, మున్నగువానికి చంపటం అనే అర్థం సామాన్యమే అయినా అది వారి పౌరుషాన్ని తెలుపదుకాబట్టి వానికి యౌగికార్థాలు చెబితేనే తగినట్టు ఉంటుందని పాఠకులకు తెలియక పోదు. అందువల్ల కూరాకుసేయు అనే పదానికి ఈడిగిలబడజేయు, లేదా మెత్తబడజేయు అనటమే తగినట్టుగావుంటుంది. దానికీయర్థం.

ఈరీతి గడుపునొప్పిం
గూరాకై యుడికి గోడుగుడుచుచు - 4-560.

అనే వెంకటకవిపంచతంత్ర ప్రయోగంచేతగూడ లభిస్తుంది.

కూరాకు మొక్కపై వున్నపుడు వెన్ను ఈనె బలంతో చక్కగా నిటారుగా వుంటుందికాని కోసినపిమ్మట కొలదిసేపటికి వాడి వెన్ను బలంచచ్చి ఎటుపడితె అటు వాలిపోతుంది. కనుక, క్రుమ్మి కూరాకు సేయటమంటె దాన్ని అలాగా చేయటమని తాత్పర్యం. అపుడే వారి బలమెంతదో తెలుస్తుంది.

"కూరాకగు" అనేదానికి వ్యవహారంలోగూడ "మాతంద్రి జ్వరంలో కూరాకైపోయినాడు, ఏరా! ఈడిగిలబడి కూరాకైనావు? అని శక్తిహీనతను తెలిపేవిధంగానే వున్నవి కాబట్టి "కూరాకు సేయు" అనేదానికి సూ. ని. యిచ్చిన అర్థం తాత్పర్యమూలమయిందనవలె.

ఇక దానికి డా. గంగప్పగారిచ్చిన అర్థంచూస్తే దాని ప్రయోగం వారిప్రాంతంలో ఏవిధంగావుందోగాని అది "ఖురాక్" తద్భవమని లేదా ఆ అర్థంలోగాని వాడబడిందని అనుకోలేం. అది అల్పార్థంలోనే వాడబడింది అనటం సబబు.

శ్రీ కపిలవాయి లింగమూర్తి

## పదాలు - పదార్థాలు

మెకాలే ప్రవేశపెట్టిన పాశ్చాత్య విద్యావిధానం మన దేశంలో వేళ్ళూనిన తరువాత ఎన్నో కొత్త పదాలు వాడుకలో వచ్చాయి.

ప్రస్తుతం వాడుకలో వున్న 'స్కూల్'. పదం గ్రీక్ భాషా జన్యమైన విరామకాలం అన్న అర్థంలో ప్రయోగింపబడేది. విరామకాలాన్ని సద్వినియోగ పరచే సాధనం అధ్యయనం. అధ్యయనం సాగే ప్రాంతం అధ్యయన కేంద్రమైన 'స్కూల్' గా మారింది. 'స్కూల్' పదం లాటిన్, కెల్టిక్, ఆ తరువాత రష్యన్ భాషలో చదువుకొనే స్థలంగా స్థిరమై శతాబ్దాలుగా ప్రయోగంలో వుంది.

మన 'పాఠశాల' లోని శాల పదం మూలతః పాఠాలు చెప్పే కేంద్రమన్న అర్థంలో ప్రయోగింపబడలేదు. అధర్వ వేదంలో 'శాలా' పదం కార్యాలయం, 'గుర్రాలు కట్టే లాయం' అన్న అర్థాల్లో ప్రయోగింపబడింది. అక్షశాల, చిత్రశాల, నృత్యశాల మున్నగువాటి ననుసరించి పాఠశాల ఏర్పడింది. ప్రాచీన కోశాలలో 'శాల' విద్యా సంబంధమైన పదంగా కనిపించదు. క్రీ. శ. 10 వ శతాబ్దికి చెందిన రాష్ట్రకూట వంశీయుడైన మూడవ కృష్ణుని శాసన మొకదానిలో 'శాల' శబ్దం కానవస్తుంది. అమరకోశంలో 'శాల' విద్యార్థులు - సన్యాసుల నిలయంగా పేర్కొనబడింది.

'కాలేజ్' అంటే లాటిన్ భాషలో సమూహం అని అర్థం. ప్రత్యేక లక్ష్యంతో నెలకొల్పబడిన వ్యక్తుల సంఘం, ఆ తరువాత ధార్మిక సంఘం అన్న అర్థాలతో ప్రచురితమైన 'కాలేజ్' 11 వ శతాబ్దం చివర్లో విశ్వవిద్యాలయం యొక్క అంగంగా మారింది. ఆ మూలార్థంలోనే అంగ్లంలో 'ఎలెక్టరల్' కాలేజ్ (ఓటర్ల సంఘం) మున్నగు రూపాలు కన్పిస్తున్నాయి.

నేటి 'కాలేజీ' లకు సమానమైన సంస్థ ప్రాచీనకాలం నాటి మన 'ఘటికాస్థానం'. ఈ ఘటికాస్థానాలు విభిన్న శాస్త్రాలను నేర్పే విద్యా సంస్థలుగా వుండినట్లు మన శాసనాలు తెలుపుతున్నాయి. ఒక ఘటికాస్థానంలో అధ్యయనం సాగిస్తున్న మయూరశర్మ తనకు జరిగిన అవమానానికి రెచ్చిపోయి క్షాత్ర ధర్మాన్ని స్వీకరించి కదంబరాజ్య స్థాపనకు కారకుడయ్యాడు.

'ఘటికా' శబ్దానికి గడియ (24 నిమిషాల కాలం) అని మరొక అర్థం. కాలమును కొలిచేవని బుద్ధి సూక్ష్మతకు సంబంధించినది. జ్యోతిష, గణిత శాస్త్రజ్ఞులే అందుకు సమర్థులు. అట్టి పండితులు ఉన్నత విద్యాకేంద్రాలలో వుంటూ బోధన జరిపేవారని భావింపవచ్చు. ఉన్నత విద్యాకేంద్రాలంటే కాలగణన మొనర్చే కేంద్రాలుగా భావించి యుండవచ్చు. ఈ ఘటికాస్థానాలే కాలక్రమంలో చతుర్దశ విద్యాకేంద్రాలుగా రూపుదాల్చినట్లు ప్రొఫెసర్ సత్యనాథయ్యర్ పేర్కొన్నారు.

ఈ విద్యాస్థానాలే ప్రాచీన విశ్వవిద్యాలయాలని చెప్పవచ్చు. నేటి విశ్వవిద్యాలయాలు ఆంగ్ల పదమగు 'యూనివర్సిటీ' అన్న పదానికి అనువాదం, ల్యాటిన్ పదమగు 'యూనివర్సెటాస్' అంటే 'ఒకని ఆస్తి మొత్తం' అని అర్థం.

13 వ శతాబ్ది తరువాత ఫ్రెంచి భాషలో ఈ పదం 'మహా విద్యాకేంద్రం' గా ప్రచురితమైంది. మన ప్రాచీన గురుకుల విశ్వవిద్యాలయానికి అనురూపం (కుల అనగా సమూహం). ఇటీవల మన దేశంలో 'అకాదమి' లు బాగా పెరిగాయి.

'అకాదమి'అన్న గ్రీక్ మూల పదానికీ, విద్యకు సంబంధం లేదు. వివిధ కళల్లో శాస్త్రాలలో ఆరితేరిన వారిని ప్రోత్సహించే సంస్థ 'అకాదమి'.

'అకాదమి' గ్రీస్ రాజధానియైన ఏథెన్స్ నగర సమీపంలోని ఒక ఉద్యానవనం. బహుశా 'అకాదమోస్' అన్న వ్యక్తి పేరుతో ప్రసిద్ధమైనదనవచ్చు. సుప్రసిద్ధ గ్రీక్ తత్వవేత్త ప్లేటో- ఆ ఉద్యానవనంలో శిష్యులకు తత్వోపదేశం చేస్తూ వుండినందున, 'అకాదమి' కి తత్వశాస్త్రానికి లంకె ఏర్పడిందనవచ్చు. ఉద్యానవనాల్లో తత్వబోధ చేయటం భారతీయ సంప్రదాయంగా వుండేది. బుద్ధభగవానుడు బీహార్‌లోని ఆమ్రవనం, కాశీ సమీపంలోని సారంగ వనంలో తత్వోపదేశం చేశాడు.

జర్మన్ దేశీయులు తమ మాధ్యమిక పాఠశాలలను 'జిమ్నాశియం' అనేవారు. జిమ్నాశియం అన్న గ్రీక్ పదానికి గరిడీగుడి (సాముకూటు) అని పేరు. ఈ గరిడీ గుళ్ళలో అంగ సాధన చేస్తున్నట్లే పాఠశాలలో విద్యాభ్యాసం చేస్తారు కదా! జర్మన్ పాఠశాలలు క్రమశిక్షణకు పెట్టిన పేరు కాని వాస్తవానికి 'జిమ్నోస్' అన్న గ్రీక్ శబ్దానికి అర్థం బిత్తలగా అంగసాధన చేయటం. శరీరాన్ని పవిత్ర సాధనంగా భావించిన గ్రీకులు బిత్తలగా శరీర సాధన, ఆటపాటలు కొనసాగించే వారు. కిండర్‌గార్టన్ అన్న జర్మన్ పదం యొక్క అర్థం 'బాలల ఉద్యాన వనం'. ఇక్కడ విద్య ప్రకృతి ఒడిలో నేర్పబడుతుంది.

('కస్తూరి' ఫిబ్రవరి '83 లోని శ్రీ పా. వెంగారి వ్యాసం ఈవ్యాసరచన కెంతో వుపకరించింది. వారికి కృతజ్ఞతతో....)

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

## సంభాషణలో చిన్న చిన్న పొరపాట్లు

“నాపశబ్దాన్ ప్రయుంజీత” అని సాధువులైన శబ్దాలనే వాడాలనీ, అపశబ్దాలను వాడరాదని వైయాకరణుల నిర్ణయం.

వ్యాకరణ మహా భాష్యకర్తయైన పతంజలి సాధుశబ్దోచ్చారణ వలన పుణ్యం, అపశబ్దోచ్చారణ వలన పాపం వస్తుందనీ చెబుతున్నాడు. "ఏకశ్శబ్దః సుప్రయుక్తః సమ్యక్‌జ్ఞాతః స్వర్గేలోకే కామధుక్ భవతి" అనే న్యాయం సుశబ్దోచ్చారణం వలన స్వర్గం లభిస్తుందని చెబుతుంది. ప్రాచీన వైయాకరణులు "గౌర్గౌఃకామదుఘా" అని చెప్పారు. అంటే చక్కని వాక్కు కామధేనువు వంటిదని భావం. ఏది ఏమైనా మనం మాట్లాడే భాష సంస్కరింపబడినది. లలితము, సద్భావయుతమై వీనుల విందొనరించాలి. మన సంభాషణవలన మన సంస్కారం తెలుస్తుంది. "మృదుభాషణం కుర్యాత్" అనే న్యాయం చిలుక పలుకులు లాగ ఆకర్షణీయంగా మృదు మధురంగా ఉండాలని సూచిస్తుంది.

మన ఆంధ్రభాష సంస్కృతం మొదలైన ఇతరభాషా సంబంధంచేత సుసంపన్నమూ, సమృద్ధమై యలరారుతూంది. నిత్యవ్యవహారాలలో అనంతమైన భాష ప్రయోగింపబడుతూంది. మన సంభాషణలలోనూ, పత్రికలలోను తెలిసీతెలియక కొన్ని అపశబ్దాలు దొర్లుతుంటాయి. వీటిని చాలామంది విద్యావేత్తలు గూడ ఎక్కువగా పట్టించుకోరు. ఈ పదాలు, వాటి సాధుత్వం గూర్చి స్థాలీపులాకన్యాయంగా ముచ్చటించడం ఈ వ్యాసం యొక్క ముఖ్యోద్దేశం. దోషైకదృష్టి విడచి నిష్పాక్షికంగా సాధుత్వాసాధుత్వ నిర్ణయం చేయాలి.

చాలమంది 'ఈ ఉద్యోగానికు వయోపరిమితి' అని అంటూ వుంటారు. పత్రికలలో గూడ ఇలాగే ఉంటుంది. ఇది సరైన రూపంగాదు. సంస్కృత వ్యాకరణానుసారం 'హశిచ' అనే ఉత్వం ఇక్కడ రాదు. 'కుప్వోఃకఃపౌచ' అని ఉపధ్మానీయవచ్చి 'వయః పరిమితి' అనే అవుతుంది. 'మన క్రీడాకారులు ఆధిక్యతతో గెలుపొందారు' 'నీ ఆధిక్యత ఏమిటి ?' అని అంటూంటారు. ప్రాధాన్యత, ప్రాముఖ్యత అనేవి గూడ ఈ పద్ధతికి చెందినవే. ఆధిక్యత, ప్రాధాన్యత, ప్రాముఖ్యత అనే పదాలు అసాధువులే. భావార్థంలో ష్యఞ్ చేశాక మరల భావార్థంలోనే తల్ ప్రత్యయాన్ని చెయ్యడం అనవసరం. ఇలా రెండుమార్లు భావార్థక ప్రత్యయాన్ని చెయ్యడం ప్రియం గాదు. కనుక ఆధిక్యం, ప్రాధాన్యం, ప్రాముఖ్యం లేదా అధికత్వం, ప్రధానత్వం, ప్రముఖత్వం, లేదా అధికత, ప్రధానత, ప్రముఖత అనేవి ష్యఞ్, త్వ, తల్ ప్రత్యయాంతాలై సాధువులవున్నాయి. ఇలాగే వివక్షత అనే పదం. వివక్ష అంటే చెప్పాలనే కోరిక అని అర్థం. ఇదే భావాన్ని సూచించే పదంగనుక దీనికి తిరిగి భావార్థకప్రత్యయం చేర్చడం ఉచితం గాదు. వివక్షే గాని వివక్షత గాదు. ధర్మని చేసే దానికి భావప్రత్యయాన్ని చేర వచ్చు 'పిపాసుతా శాంతి ముపైతి వారి జాన జాతు దుగ్ధాన్మదునోఽధికాదపి' అని నైషధప్రయోగం. ఇలాగే దిదృక్షత అంటున్నారు. దిదృక్ష సరైన రూపం. చూడాలనే కోరిక అని అర్థం.

ఇంకా మనకి హోటల్ బోర్డులపైనా తదితర స్థలాలలోను శాఖాహారం అని కనిపిస్తుంది. శాఖాహారం అంటే కొమ్మలతో చేయబడిన ఆహారం అని అర్థం. ఈ అర్థం అసమంజసం గనుక శాకాహారం అనేది సరైన పదం. కూర మొదలైన ఆహారం అనే అర్థంలో వెజిటబుల్ ఫుడ్ అనే పదానికి శాకాహారం సరైన పదం. వీధుల్లో ఫలహారశాల అని గూడ కనిపిస్తూ ఉంటుంది. ఫలహారశాల అనేది తప్పు. ఫలాహారం అనేది సరైన పదం. పండ్లు మొదలైన అల్పాహారా లుంటాయని అర్థం. ఆహారం గాని హారం గాదు. అలాగే 'శీతాకాలం వచ్చింది. శీతాకాలంలో జాగ్రత్తలు' అని అంటున్నారు. పై పదంలో సవర్ణ దీర్ఘానికి ప్రసక్తి లేదు. శీతకాలం అనే అనాలి.

ప్రస్తుతం సౌదామిని అనే పదం గూర్చి చర్చిద్దాం. ఈ పదంలో సౌదామిని అని మకారానికి ఇకారాన్ని చేర్చడం పొరపాటు. హరి ప్రబోధం అనే సంస్కృత కావ్యంలో ఈ శ్లోకాన్ని చూడండి :

"ఖేఽభ్రం జగామ కాంచనసరసమ సౌదామనీలతా ధామా స్తమ్
కువలయ మివహి సరజసం సరసమ సౌదామనీలతా ధామా స్తమ్"

ఇక్కడ యమకం కుదరాలంటే సౌదామనీ అనే ఉండాలి. ఇదే సరైన రూపం.

ఇలాగే భానూజీ దీక్షిత వ్యాఖ్యలో గూడ కనుపిస్తుంది. 'తేనైకదిక్' అనే సూత్రంచేత సుదామన్ ప్రాతిపదిక కంటె అణ్ ప్రత్యయం. పిమ్మట జీప్‌వచ్చి సౌదామనీ అని అవుతుంది. సౌదామని అంటే మెఱుపుతీగ అని అర్థం. ఇత్వప్రసక్తి దోషజష్టం.

ప్రస్తుత కాలంలో చాలామంది స్త్రీలు కిరణ్మయి అనే పేరు పెట్టుకుంటున్నారు. సంస్కృతంలో హిరణ్మయి అనే పదం ఉంది. హిరణ్మయి అంటే బంగారుబొమ్మయని అర్థం. ఈ పదంతో సామ్యం ఉండటం వలన కిరణ్మయి అంటున్నారు. హిరణ్మయి శబ్దం "దాడింనాయన..." అనే సూత్రంలో నిపతింపబడిందిగనుక కుదురుతుంది. కనుక కిరణమయి అని ఉండాలి. ఇలాగే 'సృజనాత్మక శక్తిని పెంపొందించాలి.' 'సాహిత్యంలో సృజనాత్మక రచనలు రావాలి' అనే ప్రయోగాలు కనపిస్తున్నాయి. సృజనంగాదు సర్జనం, సర్జనాత్మకశక్తి అనడం ఉచితం. కానీ ఈ ప్రయోగం భాషలో బాగా నాటుకుపోయింది. ఇలా రూఢమైన పదం వ్యావహారిక భాషలో

దోషం గాదేమో. కాలం నిర్ణయించాలి. సృజన్ అనేది హిందీలో కుదురుతుంది. సర్జనమని గుణయుతరూపం సాదువు.

“అహ్వానితులైన రసజ్ఞుల సమక్షంలో” అని చెబుతూ ఉంటారు. ఆహ్వానితులు అనేదాన్ని ఇతజన్తంగా సమర్థించుకో వచ్చు. ఆహ్వానితులు అనేది తప్పుగాదుగాని ఆహూతులు అంటే ఇంకా బాగుంటుంది. 'భక్తిరస ప్రధానమైన సినిమా' అని సాధారణంగా మనం అనే మాట. భక్తిని రసం అనడం కంటె భావం అనడం ఉచితం. ఐతే భక్తిని రసంగా పరిగణించిన ఆలంకారికులు చాలామంది ఉన్నారు. కాని ఎక్కువమంది భక్తిని భావంగా పరిగణించారు. కనుక భక్తిరసం అన్నా, భక్తిభావం అన్నా దోషంలేదు. 'సుస్వాగతం' అనే పదం పరిశీలనార్హం. మంచిరాక అనే అర్థంలో సు + ఆగతం అని సంబోధిస్తే స్వాగతం అవుతుందిగాని సుస్వాగతం కాదు. పోనీ నిస్ నిర్, దుస్ అన్నట్లు సుస్ అనేది ఉపసర్గమో అనుకుంటే అట్టి ఉపసర్గ దృగ్గోచరం గావడం లేదు. సు, సు అని ఒకే ఉపసర్గను రెండుమార్లు పదానికి జేర్చడం తప్పు. కనుక స్వాగతం అనే అనాలి. 'బంధు మిత్ర సపరివారసమేతంగా అనే వాటిలో ఏదో ఒకటి చాలు. రెండూ అవసరం లేదు.

ఉద్యోగం అనే పదం వృత్తిఅనే అర్థంలో బాగా లోకంలో నాటుకు పోయింది. న్యాయంగా ఉద్యోగమనే సంస్కృత పదానికి ప్రయత్నం అని అర్థం. సంధి ప్రయత్నాలు సాగాయి కనుక భారతంలో పర్వానికి ఉద్యోగపర్వం అని పేరు. “ఉద్యోగః పురుష లక్షణం” అనే చోటా, 'ఉద్యోగినం పురుషసింహముపైతి లక్ష్మీః' అనే చోటా ఉద్యోగ పదానికి ప్రయత్నమనే అర్థం. కానీ అనంత భాషా ప్రవాహంలో వృత్తి అనే అర్థం ఉద్యోగపదానికి రూఢమైంది. రూఢమైంది గనుక ఉద్యోగం అనేది వృత్తి అనే అర్థంలో తప్పు గాదేమో. కాని సంస్కృతంలో మాత్రం ఇప్పటికీ ఉద్యోగం అంటే ప్రయత్నమే.

కొందరికి ఉషస్విని అనే పేరుంటుంది.. మనస్విని అన్నట్లే ఉషస్విని అనేది కూడ సాధువే అని కొందరి అభిప్రాయం. మనస్విని అంటే ప్రశస్తమైన మనస్సు కలిగినది అని అర్థం. ఉషస్విని అంటే ప్రభాతకాలం కలిగినది అనే అర్థమా? అనే సందేహం కలుగుతుంది. అంటే రాత్రి అనుకుందాం అంటే రాత్రికి ఆ పేరు ఎక్కడా లేదు. అసలు మనస్విని అన్నచోట వచ్చిన విన్ ప్రత్యయం ఇక్కడ రాదు. 'సమిష్టిగా మనం కృషి చెయ్యాలి' అని చాలా మంది చెబుతూ వుంటారు. సమిష్టి అంటే మంచి యజ్ఞం అనే అర్థమే వస్తుంది. కాని కలసికట్టు అనేఅర్థం రాదు. వి+అష్టి=వ్యష్టి ఐనట్లుగానే సమ్+అష్టి=సమష్టి అవుతుంది. వ్యష్టి, సమష్టి అన్నా రెంటిచోట్లా అష్టి అనేపదమే గాని ఇష్టిగాదు. కనుక సమష్టి సరైన రూపం. 'ఇది మన సాంప్రదాయం' అంటారు. కాని సంప్రదాయం అనే అనాలిగాని సాంప్రదాయం అనగూడదు. సంప్రదాయం అంటే పద్ధతి అని అర్థం. నిదానస్థులు అనేది సంస్కృత పదం. నిదానం అంటే మెల్లగాఅని చాలామంది భావిస్తున్నారు. కాని 'నిదానం త్వాదికారణం' అనే అమరాన్నిబట్టి నిదానము అంటే మూలకారణం అని అర్థం. వాడుక భాషలో ఇలాగే 'ఆయన చాలా శుబ్బరస్థులు' అని అంటున్నారు. ఇది తెలుగు సంస్కృతాలవలన ఏర్పడ్డ అపభ్రంశరూపం. ఇది పూర్తిగా తప్పే. 'అంతర్రాష్ట్రీయ పద్ధతి' అనిగూడ వాడుకభాషలో ప్రయోగంవుంది. దేశంలో దాగియున్న పద్ధతులు అనే అర్థంలో అంతా రాష్ట్రీయ అనడం వుచితంగాని రేఫక్రింద రేఫప్రయోగం ఉచితంగాదు. మనోశక్తి అనేది తప్పు. మనశ్శక్తి అనేది సాధుప్రయోగం. 'ఆయన దేవునిలో ఐక్యత చెందారు' 'మనలో ఐక్యత చాలా అవసరం' అనే సందర్భాలలో ఐక్యం అనడం యుక్తము. పత్రికల్లోగూడ ఐక్యత అని కనిపిస్తుంది. 'అందుకు అనుగుణ్యంగా' అనడం పొరపాటు. “అందుకు అనుగుణంగా” అనిగానీ 'అందుకు ఆనుగుణ్యంగా' అని గానీ అనాలి. 'ఆయన దేశంలో ఏకైకకవి' అనడం తప్పు. ఏకైక అంటే ఒక్కొక్క అని అర్థం వస్తుందిగాని ఒకే ఒక్క అనే అర్థంరాదు. 'ఏకైక కవి. ఏకైకపుత్రుడు' అనేవి అపరూపాలు.

సభ్యత అని మనం సాధారణంగా అనాలోచితంగా అంటూ ఉంటాము. సభ్యం అనేది సరైన పదం. సభ్యతగాదు. 'ఈమె బ్రహ్మచారిణిగా ఉండిపోయింది' అనే చోట వాడబడిన బ్రహ్మచారిణి అనేపదం సరైన అర్థాన్నివ్వదు. స్త్రీని బ్రహ్మచారిణి అనడంకంటె కన్య అనడమే సముచితం. స్త్రీలకు బ్రహ్మచర్యం లేదుగదా. ఐతే బ్రహ్మపదార్థ భావనతో సంచరించే స్త్రీ అనే అర్థంలోమాత్రం సమంజసమే. అవివాహిత అనే అర్థంలోగాదు.

కొందరు 'ఈమె మాగుర్విణి' అని గురువు అనే అర్థంలో స్త్రీనుగురించి ప్రయోగించడంగూడ గలదు. గుర్విణి అనేది సరైన రూపంగాదు. గుర్విణి అంటే గర్భవతి అని, ప్రసిద్ధమైన అర్థం. కనుక గుర్వి లేక గురువు అనాలి. “వోతో గుణవచనాత్” అని జీష్ వికల్పంగా వస్తుంది. “ఆయనకేం ఆయన కవిసామ్రాట్”, “నటసామ్రాట్” అంటారు. సమ్రాట్ అనాలిగానీ

సామ్రాట్ అనరాదు. అందుకే విశ్వనాథ సత్యనారాయణగారికి కవిసమ్రాట్ అనే పేరుంది.

"వారిరువురూసమకాలీకులు" అనడంశాస్త్రవిరుద్ధం. ఇందుకు వ్యాకరణం అంగీకరింపదు. సమకాలికులు అనాలని వ్యాకరణం చెబుతూంది. భానోదయం అనడం తప్పని మనందరికీ తెలిసినదే. సవర్ణదీర్ఘం చేస్తే భానూదయ అనే అవుతుంది. ఇంకా 'అరిషడ్వర్గము' అనేది కొంచెం క్లిష్టమైన రూపం. షణ్ణాం వర్గః షడ్వర్గః, అరీణాం షడ్వర్గః అరిషడ్వర్గః అని చెప్పాలి. శివభాగవతరూపం వలె ఇదీ అసమర్థసమాసమే. ఇది కవులచే ఆదృతమై ప్రయుక్తమైంది. "కృతారిషడ్వర్గజయేన మానవీమ్" అని భారవి ప్రయోగం.

'నా జన్మ పునీతం అవుతుంది' అనడం పరిపాటి. పునీతం అనేది ప్రామాదికమే. పవిత్రమైంది అనే అర్థంలో పూతం అవుతుంది గాని పునీతం గాదు. పవిత్రం చేయబడింది అనే అర్థంలో పావితం అవుతుంది. పునీతః అని క్రియారూపం సంస్కృతంలో ఉంది. దాన్ని క్తాంతమని భ్రాంతిపడి ఉంటారు కొందరు. ఆ శబ్ద భ్రాంతితో వచ్చిన పదమే పునీతం అనేది. కాని పునీతం అనేది వాడుకభాషలో బాగా వ్యాపించింది. ఇలాగే తెలివి అనే అర్థంలో మేధస్సు అనడం కూడా కొంచెం ఇబ్బందిని కలిగిస్తుంది. మంచి మేధ అనడం ఉచితం. మేధస్సు గాదు. సమాసంలో మేధా శబ్దం 'నిత్యమసిచ్ ప్రజామేధయోః' అనే సూత్రం వలన సాంతం అవుతుంది గాని విడిగా మేధాశబ్దం ఆకారాంతమే. "ఉపాధ్యాయినులు కావలెను" అనడం చాలా సందర్భాలలో కానవస్తుంది. ఇది పొరపాటు. ఉపాధ్యాయి లేక ఉపాధ్యాయ అనాలి గాని ఉపాధ్యాయిని గాదు. మల్లికార్జున పదంలో కకారమేగాని ఖకారం గాదు.

పైవాదాలు శాస్త్రవిరుద్ధాలు. కాని అనంతమైన కాలగమనం, పొంగే నదిలా దినదినాభివృద్ధి జెందే ఆంధ్రవాఙ్మయం పైపదాలకు సాధుత్వాన్ని కలిగిస్తాయేమో ? కానీ సంస్కృత భాషలో పైపదాలు నాటికీ నేటికీ అపశబ్దాలే. చక్కని భాష, లలితమైన భావాలు, వీనులవిందొనరించే లలిత పదవిన్యాసం, సంభాషణా చాతురికి, ఆకర్షణకు, సభ్యతకు, సంస్కారానికి మూలకారణాలనడంలో సందేహం లేదు. 'వాగేకాసమలంకరోతి' అన్నట్లు చక్కనివాక్కే మనిషికి పెట్టని అలంకారం. సుశబ్దశోభితమైన భాషనుపయోగించడానికి మనం అందరం ప్రయత్నిద్దాం.

శ్రీ నిష్ఠల సుబ్రహ్మణ్యం

# నిత్య జీవితంలో అలంకారాలు

"వాక్యం రసాత్మకం కావ్యం" అని ముష్టాలుని నిర్వచనం.

"రమణీయార్థ ప్రతిపాదకశ్శబ్దః కావ్యం" అని జగన్నాథ పండితరాయల ప్రతిపాదన.

ఎవరి ఉపన్యాసమైనా ఉచ్చారణ స్పష్టంగావుండి, భాష దోషరహితంగావుంటే, ధార అనర్గళంగావున్నా, చమత్కారంగా, హృదయరంజకంగా లేకుంటే, సభాజనుల నాకట్టుకోలేదు. అలాగే కావ్యం సుందరమై భాసించాలంటే పదాడంబరం, నాలుగుపాదాలకు సరిపడే సుదీర్ఘ సంస్కృత సమాసాలూ, పది పుటల వచనమూ వుండేచాలదు. రసాత్మకంగా, రమణీయార్థ ప్రతిపాదకంగా వుండాలి. కావ్యానికటువంటి శోభను గూర్చేవే అలంకారాలు. సహజ సుందరులకైనా శోభను పెంచేవి అలంకారాలేకదా.

అలంకారాలు కావ్యాలకు పరిమితంకావు. నిత్య జీవితంలోని చమత్కార భాషగాల్లోనూ అలంకారాలు పాత్ర వహిస్తుంటాయి. మనం వుపయోగించే సామెతల్లో ఏ విధంగా యతి ప్రాసల్లో ఒకటిగానీ, రెండుగానీ, ఒక్కోసారి ఓ విధమైన లయ గానీ వుంటాయో, అదేవిధంగా మనకు తెలియకుండానే ఎన్నో అలంకారాలు మన మాటల్లో దొర్లుతాయి.

కావ్యాల్లో పదే పదే చదువుతున్నా మన కందుబాటులోలేని చందురుని, మన అనుభవంలోకిరాని శీతనగపు చల్లదనాన్ని వర్ణించుకోడంకన్నా నిత్యజీవితంలో ఎదురయ్యే రకరకాల మనుష్యుల్ని, అనేక సంఘటనల్ని అర్థాలంకారాలకు ఉదాహరణలుగా చెప్పాలనే ప్రయత్నంలో కొన్నింటిని యీ క్రింద పొందుపరచాను.

**1. ప్రతీపాలంకారము :** ఉపమానాన్ని వుపమేయంగా చెబితే ప్రతీపాలంకారము.

**ఉదా :** అప్పడం నీ ముఖంలా వుంది.

ఇక్కడ ముఖం ఉపమానం; అప్పడం వుపమేయం; వర్ణించవలసిన ముఖాన్ని ఉపమానంగా చెప్పినందువల్ల ప్రతీపాలంకారము.

**2. ఉపమేయోపమ :** ఉపమేయాన్ని వుపమానంగా, వుపమానాన్ని వుపమేయంగా మార్చి మార్చి చెబితే ఉపమేయోపమ.

**ఉదా :** బీదరికం,నిరక్షరాస్యతలాగా, నిరక్షరాస్యత బీదరికంలాగా మనిషిని చిన్నబుచ్చుతాయి.

**3. శుద్ధాపహ్నుతి :** ఇతర ధర్మాన్ని వర్ణనీయ వస్తువులో నిలపడానికై వస్తువు స్వధర్మం దానియందు లేదని చెప్పడం శుద్ధాపహ్నుతి.

**ఉదా :** అతడు డాక్టరుకాదు బాబూ! రోగుల్ని చంపడానికి వచ్చిన సాక్షాత్తు యముడు.

డాక్టరునందు యమధర్మాన్ని నిలపడానికై అతడి స్వవృత్తి అయిన డాక్టరు కాదని చెప్పడం.

**4. దీపకాలంకారము :** వర్ణ్యానికీ, అవర్ణ్యానికీ (ప్రస్తుతానికీ, అప్రస్తుతానికీ) ఏకధర్మం చెప్పడం దీపకాలంకారము.

ఉదా : జమీందారుకు డబ్బువల్ల, ఆయన భార్యకు జబ్బు వల్ల కళ్ళు కన్పించవు.

ఇక్కడ కళ్ళు కన్పించక పోవడమనేది సామాన్యధర్మం. కారణాలు వేరు.

**5. వినోక్తి :** అల్పవస్తువు లేకపోవడంవల్ల వర్ణ్యానికి హైన్యం కలిగితే వినోక్తి.

ఉదా : ఉప్పు లేని కూర ఎంత గొప్పదైనా తినలేం కదా.

ఉప్పు అనే అల్ప వస్తువు లేనందువల్ల గొప్ప వస్తువైన కూరకు రుచిహీనతే ఏర్పడింది.

అల్పవస్తువు పోవడంవల్ల వర్ణ్యానికి గొప్పదనం కలిగినా అది వినోక్తమే.

ఉదా : మీసాలు తీసేస్తే నువ్వు అచ్చం హిందీ సినిమా హీరోలా వుంటావు. నే చెప్పలా!

అల్పవస్తువైన మీసాలు పోవడంవల్ల ఆ యువకుడికి హిందీ సినిమా హీరో అనే రమణీయత కలిగింది.

**6. అధికాలంకారము :** గొప్ప ఆధారానికన్నా ఆధేయానికి ఆధిక్యంచెప్తే అధికాలంకారము.

ఉదా : ఏనుగులు స్నానంచేసే ఆ చెరువులో గజలక్ష్మమ్మ పట్టదులేవయ్యా, కంగారుపడకు.

చెరువు పెద్దదే. ఏనుగులు కూడా స్నానం చెయ్యొచ్చు. కానీ గజలక్ష్మమ్మ అంతకన్నా పెద్దది కనుక పట్టదు. ఆమె ఆ చెరువులో దూకుతుందని భయపడం అనవసరం అని భావం.

**7. వ్యాఘాతాలంకారము :** ఒక పనికి సాధనమైన వస్తువు తద్విరుద్ధమైన పనికి సాధనం చెయ్యబడితే వ్యాఘాతాలంకారం.

ఉదా:- ఏ భోజనం పేదలను తృప్తి పరుస్తుందో, అదే ధనికులను బాధిస్తుంది.

భోజనం వల్ల పేదలు సంతోషిస్తారు. కానీ అజీర్ణాదిరోగాల వల్ల ధనికులకు ఆ భోజనమే బాధాకరమౌతుంది.

**8. కారణమాలాలంకారము :** ఒకదానికి మరొకటి దానికి మరొకటి కారణంగా చెబితే కారణమాల. ఒకదానికి మరొకటి, దానికి మరొకటి ఫలితంగా చెప్పినా కారణ మాలయే.

ఉదా : 1. అహంకారం తెలివితక్కువతనం వల్ల, తెలివితక్కువతనం చదువు లేమి వల్ల కలుగుతాయి కాబట్టి మనిషికి చదువు ముఖ్యం.

2. డబ్బు వల్ల వ్యసనాలూ, వ్యసనాల వల్ల రోగాలూ, రోగాల వల్ల మరణం కలుగుతాయి.

**9. సారాలంకారము :** రాను రాను ఉత్కర్షము వర్ణిస్తే సారాలంకారము.

ఉదా : ఇల్లు బాగుంటుంది. ఇంటికన్నా ఆఫీసు బాగుంటుంది. ఆఫీసుకన్నా క్లబ్బు మరీ బాగుంటుంది.

**10. పరివృత్తి :** కొద్దదిచ్చి గొప్పది గానీ, గొప్పదిచ్చి కొద్దిది గానీ మార్చుకుంటే పరివృత్తి.

ఉదా : వందరూపాయలు లంచమిచ్చి వెయ్యి రూపాయల ఉద్యోగం సంపాదించాడు శివరాం.

ఇక్కడ తక్కువ ఖర్చుతో ఎక్కువ లాభం పొందడం వల్ల పరివృత్తి.

ఉదా : కామాక్షమ్మ పట్టుచీర యిచ్చి స్టీలు చెంచా కొన్నదట, నీకు తెలుసా.

ఇక్కడ పట్టుచీర విలువైంది. స్టీలు చెంచా తక్కువ వెలది కాబట్టి పరివృత్తి.

**11. సమాధి :** పనికి కావలసిన కారణం వల్ల గాక మరో కారణం వల్ల ఆ పని సులభంగా నెరవేరితే అది సమాధి.

ఉదా : పిల్లవాడు పరీక్షలు వద్దనుకున్నాడు. స్కూలు బిల్డింగు తగలబడింది.

పిల్లవాడు కోరింది పరీక్షల రద్దు, స్కూలు బిల్డింగు తగలబడ్డం కాదు. కానీ బిల్డింగు కాలిపోవడం వల్ల పిల్లవాడి కోరిక సులభంగా నెరవేరింది కనుక సమాధి.

**12. కావ్యార్థాపత్తి :** కిముత (చెప్పవలసినదేమి) అనడంచేత అర్థ సంసిద్ధి కలిగితే అది కావ్యార్థాపత్తి.

**ఉదా :** ఆ తాయారమ్మ నోటికి భూతాలే జడుస్తాయే, వాళ్ళాయనొక లెక్కా !

అందరినీ జడిపించే భూతాలు కూడా తయారమ్మ నోటికి జడుస్తాయి. ఇక వాళ్ళాయన సంగతి చెప్పవలసినదేమి ?

**13 కావ్యలింగము:** సమర్థింప వలసిన దానికి సాధనం చెప్పడం కావ్యలింగం.

ఉదా : నేను చదవకుండానే ప్యాసయినాను. మా నాన్న ఎమ్మెల్లే.

చదవకుండా ప్యాసవడం అసాధ్యంకదా అంటే దానికి సమర్థనము వాళ్ళ నాన్న ఎమ్మెల్లే కావడం.

**14. మీలనము :** సాదృశ్యము వలన భేదమే కనబడక పోతే మీలనము.

ఉదా : ఆమె కందెన ముఖంలో కాటుక కూడా కన్పించడం లేదు.

**15 అనుగుణము :** ఒక వస్తువుకు మునుపుండిన గుణమే మరొక వస్తువు సన్నిధిలో మరింత పెరిగినట్లు చెబితే అది అనుగుణము.

ఉదా : ఈ కోతి వెధవ ఆ రాజుగాడితో స్నేహంచేసి మరీ చెడిపోయాడండీ.

అసలేకోతివెధవ. రాజుగాడనువాడి స్నేహంవల్ల ఆ గుణమే మరీ ఎక్కువైంది కొబట్టి అనుగుణము.

**16. ఉన్మీలితము :** భేదస్ఫూర్తి చెప్పబడితే ఉన్మీలితము.

ఉదా : అమావాస్య చీకట్లో ధూమేశ్వరరావు సిగిరెట్ పొగ వల్ల ప్రత్యేకంగా తెలుస్తాడు.

అమావాస్య చీకట్లో ఏ వస్తువూ కనబడలేదు. కానీ ధూమేశ్వరరావునుమాత్రం సిగిరెట్ పొగవల్ల ప్రత్యేకంగా గుర్తుపట్ట వచ్చు. అంటే అంత ఎక్కువగా సిగిరెట్లు కాలుస్తాడన్నమాట.

**17. ఉత్తరాలంకారము :** ఒక ప్రశ్నకు అదే జవాబైనా, రెండు ప్రశ్నలకు ఒకే జవాబైనా ఉత్తరాలంకారము.

ఉదా : వాడు ఏ సెక్షనులో పనిచేస్తాడు ? ఇది ప్రశ్న. జవాబూ అదే; వాడు 'ఏ' సెక్షనులో పనిచేస్తాడు.

గాలిని కదిలించేదేది ?<br>సినీతారకు వృత్తరం రాసేదెవరు ? | ఫ్యాను.

రెండు ప్రశ్నలకూ ఒకే జవాబు.

**18. ప్రతిషేధము :** చెప్పకుండానే ప్రసిద్ధమైన నిషేధాన్ని మళ్ళీ చెబితే ప్రతిషేధము.

**ఉదా :** అమ్మా ! యిది వంటిల్లు కాదు, ఆఫీసు.

నెమ్మదిగా పనిచేస్తున్న టైపిస్టును చూచి నెమ్మదిగా పని చేయడానికిది వంటిల్లు కాదు, ఆఫీసు. పని త్వరగా కావాలి అని చెప్తున్నాడు ఆఫీసరు. ఆఫీసు వంటిల్లు కాదన్నది ఇదివరకే ప్రసిద్ధం. కానీ మళ్ళీ చెప్పడం వల్ల ప్రతిషేధము.

**19. నిషేధాభాసము :** నిషేధము వలె కనబడుతుంది కానీ నిషేధము కాదన్నది నిషేధాభాసము.

**ఉదా :** బాబూ ! యివి చేతులు కావు. నా బిడ్డను కాపాడండి. పట్టుకున్నది చేతులనే. చేతులనే చేతులు కావనడం నిజమైన నిషేధం కాదు కాబట్టి నిషేధాభాసము.

**20. మిథ్యాధ్యవసితి :** ఒకదాని మిథ్యాత్వం నిరూపించడం కోసం మరొక మిథ్యను కల్పించడం మిథ్యాధ్యవసితి.

**ఉదా :** లాటరీలో ఇరవై లక్షలు వస్తే సినిమా తీద్దువులే.

లాటరీలో ఇరవై లక్షలు రావడమెంత నిజమో, సినిమా తియ్యడమూ అంత నిజమే. రెండూ మిథ్యలే అని అర్థం.

**21. వికల్పము :** సమాన బలములు గలవానికి విరోధము కలుగ జెబితే వికల్పము.

**ఉదా :** పరీక్ష రిజల్టు రానీ, నీకు సైకిలో, సైకిలు రిపేరో కొనిపెడతాను.

సైకిలు కొనడం ప్యాసైతే ప్రోత్సాహకరంగా, సైకిలురిక్షా కొనడం ఫెయిలైతే అంతట చదువు ఆపేసి రిక్షా తొక్కడం కోసం. ఒకదానికొకటి వ్యతిరేకం కనుక వికల్పాలంకారం.

**22. విరోధాభాస :** విరోధమున కాభాసత్వము అంటే విరోధమున్నట్లు కన్పిస్తుందే కానీ నిజంగా విరోధం లేకుంటే విరోధాభాస.

**ఉదా :** అవర్తకుడి అంగట్లో టోపీలు లేకున్నా కొనేవారి కతడు టోపీ వెయ్యగలడు.

టోపీలున్నప్పుడు కదా టోపీ వెయ్యగలిగేది ! టోపీలు లేకున్నా టోపీ వేస్తాడనడం విరోధం. టోపీ వెయ్యడం అంటే మోసం చెయ్యడం అనే అర్థం వుంది గనుక నిజంగా విరోధం లేదు కాబట్టి విరోధాభాసం.

**23. వికస్వరము :** ఒక విశేషం చెప్పి, దాన్ని సామాన్యంతో సమర్థించి ఆ సమర్థనంతో తృప్తిపడక మరొక విశేషం చెప్పడం వికస్వరం.

**ఉదా :** ఏమే! కాసేపు ఆ వాగుడు కట్టిపెట్టి వెళ్ళి లైబ్రరీలో కూర్చో లైబ్రరీలో కూర్చుంటే చదువుకున్నదాని వనుకుంటారు. స్థానమహిమవల్ల కొందరికి గొప్పదనం వస్తుంది. లక్షాధికారి వంగరావు భార్య మెడలోవుండే గిల్టునెక్లేసును బంగారని ఎవరనుకోరు?

లైబ్రరీలో వుంటే చదువుకున్నదనుకుంటారనేది విశేషం. స్థాన మహిమ వల్ల కొందరికి గొప్పదనం వస్తుందనే సామాన్య విషయం. దీనిపై విశేషం సమర్థింపబడింది. దాంతో తృప్తిపడక "లక్షాధికారి.........ఎవరనుకోరు" అని మరొక విశేషం చెప్పబడింది గనుక వికస్వరం.

**24. వ్యాజనింద :** నింద వల్ల నింద స్ఫురిస్తే వ్యాజనింద.

**ఉదా :** రివర్షనిచ్చిన జగన్నాథం గార్నవాలి కానీ గుర్నాథాన్ననడ మెందుకు ?

గుర్నాధం లంచగొండి. అతడికి రివర్షనిచ్చినా గుణం మారలేదు. రివర్షనివ్వకుండా వుద్యోగమే తీసేసివుంటే ఆ లంచగొండితనం వుండదు కదా. రివర్షనిచ్చాడని జగన్నాధం గార్ని నిందించడం వల్ల లంచగొండి గుర్నాథం నింద తెలుస్తున్నది కనుక వ్యాజనింద.

**25. అతద్గుణము :** తనకు దగ్గరగా వున్నా, తనతో కలసినా అన్య పదార్థము గుణాన్ని స్వీకరింపకుండటం అతద్గుణము.

**ఉదా :** బొగ్గు గనుల్లో పనిచేస్తున్నా రామనాధం ముఖం ఎప్పుడూ నల్లబడలేదు.

బొగ్గు గనుల్లో పనిచేసేవారి ముఖం నల్లబడాలి కదా. కానీ రామనాధం ముఖం నల్లబడలేదు. అంటే అతడెప్పుడూ యితర్ల చేత మాటపడలేదని అర్థం.

కుమారి జె. వి. సుబ్బలక్ష్మి

# నిరుధాన

తాళ్ళపాక అన్నమాచార్యుల సంకీర్తనల రాగిరేకు ప్రారంభంలో ఈ వాక్యం కనిపిస్తుంది.

"స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శక వరుషంబులు ౧౩౪౬ అగు నేటి క్రోధి సంవత్సరమందు తాళ్ళపాక అన్నమాచార్యులు అవతరించిన పదారు యేండ్లకు తిరువేంగళ నాథుండు ప్రత్యక్షమైతేను అది మొదలుగాను శాలివాహన శక వరుషంబులు ౧౪౨౪ అగు నేటి దుందుభిసంవత్సర ఫాల్గుణ బ ౧౨ నిరుధానకు తిరువేంగళ నాథుని మీదను అంకితముగాను తాళ్ళపాక అన్నమాచార్యులు విన్నపముచేసిన శృంగార । అధ్యాత్మ సంకీర్తనలు."

అన్నమాచార్యుల సంకీర్తనలను తొలిసారిగా శాస్త్రీయమైన దృష్టితో పరిష్కరించిన కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు — "నిరుధానకు (నిరోధానకు ? తిరోధానానకు," అని చిప్పలో సూచించారు.[1] తర్వాత ఈ సంకీర్తన వాఙ్మయ పరిష్కరణాన్ని కొనసాగించిన నా గురువర్యులు కీ. శే. రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు - "ఈ శబ్దము అపరిచితము. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు 'నిరోధానకు ? తిరోధానానకు ?' అని సందేహముతో పాఠము సూచించిరి. 'సరిగా' అను నర్థమున ప్రయోగించినట్లున్నది. ఇది యింకను అన్వేషణీయము."[2] శాస్త్రిగారి తర్వాత కొంతవరకు పరిష్కరణ భారాన్ని వహించిన అర్చకం ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారు "ఈశబ్దము అపరిచితము. అస్మద్గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'నిరోధానకు? తిరోధానానకు' అని సందేహముతో పాఠము సూచించిరి. నిరుధానము అనగా చనిపోవు అను అర్థమున ప్రయోగించినట్లున్నది."[3] కొన్ని తాళ్ళపాకవారి సంకీర్తనలను పరిష్కరించిన శ్రీ పి. టి. జగన్నాథరావుగారు — "ఈపదము నిరోధ శబ్దమునకు సంబంధపడినది. నిర్యాణమువరకు నను నర్థమున ప్రయోగింపబడినది. (నిరోధము = వినాశము.)[4] ఈ వాఙ్మయ పరిష్కరణాన్ని రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారితో కలసి, తర్వాత ఒంటరిగ సాగిస్తున్న శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు "ఈ శబ్దము 'నిరోధ' 'నిరుద్ధ' శబ్దములకు వ్యావహారిక రూపముగా గానవచ్చుచున్నది. అడ్డగింపు, అవధి - అని యర్థము. ఆనాడు కడపటి దినమని తాత్పర్యము. కీ. శే. ప్రభాకరశాస్త్రిగారూహించిన 'సరియగు' అనునర్థము తాత్పర్యార్థము గావచ్చును.◆ అవధి అను నర్థములో 'ఈ నిరుద్ధమునకుఁ గుశలంబు మాకు' అను తరిగొండ వెంగమాంబగారి ప్రయోగము దీనికి సహాయపడుచున్నది. సాహిత్య అకాడమీవారి 'విష్ణు పారిజాతము' (౫౫ పుట) నేనీ ప్రయోగమివ్వగా శ్రీమాన్ రాళ్ళపల్లి అనంత

కృష్ణశర్మగారు 'నిఱుత్తం' అను అరవ పదముగూడ "నిలుపు" అను నర్థముతో దీనికి సహాయపడుననిరి."5

ఈ తాళ్ళపాక వాఙ్మయం గురించి పరిశ్రమిస్తున్న నాకు 'నిపధాన' శబ్దం మీద ఒక వింత మమకారం ఏర్పడ్డది. తాళ్ల పాక కవుల పాటలలో మరెక్కడైనా ఈ ప్రయోగం కన్పిస్తుం దేమో అని వెదికాను. ఇంతవరకు అది అదృష్టమే. మరి యే యితర తెలుగు కవులలో కూడ ఈ ప్రయోగం నాకు కనిపించలేదు. కాని కొన్ని శాసనాలలో ఈ ప్రయోగం వుంది:

(i) నిరుద్ధానకు [హరిహర, II. 1382 క్రీ. శ.]

(ii) [ని] రుద్ధానకు [అచ్యుత, 1532 క్రీ. శ.]

(iii) నిరు [పా]నకు [అచ్యుత, 1532 క్రీ. శ.]

(iv) నిరుధానకు [సదాశివరాయలు, 1547 క్రీ. శ.]

(i) నెం. 6. [అ. రి. నెం. 404, 1904]

చిలమకూరు, కమలాపురం తాలూకా, కడప జిల్లా, అగస్త్యే శ్వరస్వామి దేవాలయ ప్రాంగణంలో ఒక స్తంభం మీద మలచిన శాసనం.

ఉదయగిరి సీమను హరిహర దేవరాయలు కుమారుడు మహామండలేశ్వర వీరదేవరాయ ఒడయులు పాలించేవారు.

హరిహర, 1382 క్రీ. శ.

40. .... .... మా [శీమం] జెల్లే సగం బాలి

41. కిని ఒడంబడను అథ[ా]ుగొని యీ దినం

42. నిరుద్ధానకు యీ స్తావనకుం జెల్లే అటువంటి

43. మా సగం

44. ప్రవిత్తి మేరపై

45. తమైన అష్ట

46. భోగ తేజ

47. సాం మ్యతలు

48. ంన్ను ఈ దినం

49. ఆరభ్యంగాను,

(ii) నెం. 97. [అ. రి. నెం. 512, 1919]

చిన్న కాంచీపురం, కాంచీపురం తాలూకా, చంగల్‌పట్ జిల్లా, అరుళాళ పెరుమాళ్ గుడి.

అచ్యుతరాయలు, 1532 క్రీ. శ.

[విషయం— అచ్యుతరాయలు కిరీటధారణం చేసిన రోజు కొందరు పాళెగార్లకు అభయమివ్వడం. పాండ్యరాజు కూతురిని పరిణయం కావడం. వరదరాజస్వామిని దర్శించి కైంకర్యాలు చేయడం.]

పాఠము

2. .... .... విరోధి సంవత్సర కార్తీక మాసం మొదలు నందన సంవత్సరం ఆషాఢమాస [ని]రుద్ధానకు కానికెంగా సమ ర్పించిన గ ౪ం౫ నైవేద్యానకు సమర్పించిన ౧౫౦ ఉభయం గ ౫౬౫ పితాంబర ౧కి తట్టు ౧కిన్ని చెఱగులు ౨కిన్ని తిరు [మ] హరాల కిచ్చిన. .... .... .... ...

(iii) నెం. 98 [అ. రి. నెం. 158, 1924]. కాళహస్తి, చంద్రగిరి తాలూకా, చిత్తూరు జిల్లా, కాళహస్తీశ్వరాలయము మూడవ ప్రాకారం యొక్క ఉత్తరం, పడమర గోడలమీద.

అచ్యుతరాయలు, 1532 క్రీ. శ.

4. రం శ్రావణ బ ౧౦ నిరు[పా]నకు కానికగాను సమ ర్పించిన.

(iv) నెం. 161. [అ. రి. నెం. 409, 1926].

మిడుతూరు, నందికోట్కూరు తాలూకా, కర్నూలు జిల్లా, చెన్నకేశవస్వామి గుడి ప్రాకారంలో ఒక ఫలకం మీద.

సదాశివ, 1547 క్రీ. శ.

9. ........సదాసివదేవ మహారా

10. యులుంగారు। మాకు అమరనాయంకరానకు పాలించిన మిడుతూరి గ్రామా

11. నను స్వామికి పూర్వాన చెల్లివచే క్షేత్రం హస్తాక్షి ప్రమాణం కొలపాటి ఖ ౨౫॥౨ కున

12. యి నిపధానకు చెలివచె క్షేత్రమును.

రేకులోని వాక్యాన్ని పరిశీలిస్తే, అన్నమాచార్యులవారు నిర్వహించిన సంకీర్తన యజ్ఞం ప్రారంభ పరిసమాప్తాలను తెలిపె దేమే అని తోస్తుంది. '........అది మొదలుగాను .... బ. ౧౨ నిరుధానకు.......' బహుళ ద్వాదశి దాక, వరకు అనే అర్థాలు పొసగుతాయి. గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు ఈ శబ్దం గురించి

చేసినచర్చ కొంత మెరుగైనది. శాసనస్థమయిన ప్రయోగాలను పరిశీలిస్తే దినం, మాసం, తిథుల తర్వాత ఈశబ్దాన్ని వాడడం గమనించవచ్చు. ఒక నిలుపును, అవధిని ఖండితంగ తెలపడం

ఈ ప్రయోగాలను, చర్చను శ్రీమాన్ రాళ్ళపల్లివారి దృష్టికి తేగా వారు 26-7-77 బెంగుళూరునుండి ఉత్తరం వ్రాశారు — " 'నిరుధానకు' శబ్దార్థం నీ పరిశీలనతో స్థిరమైనది. 'నిఱుత్తం' అనే తమిళపదము నిఱుతం - నిరుధంగా పరిణమించేది ఆ భాషలో సహజం. నిరోధ-నిరుద్ధ శబ్దాలకు ఆ యర్థంలో సంస్కృత వ్యవహారం కానరాదు. తెలుగులోను క్వాచిత్కముగానే ఒకప్పుడుండి ఊడిపోయినదనిపిస్తుంది. ఎట్లైనా అర్థభేదం లేదు. ఇట్టి పదాలెన్ని కాలక్రమంలో ఊడిపోయినవో ప్రాచీన వాఙ్మయం పరిశీలిస్తే తెలుసుకోగలము. తమిళంలోను నాటి-నేటి మాటలలో ఎక్కడైనా వాడుకలో నుండునేమో పరిశీలింప దగును."

బహుభాషా కోవిదులైన పండితుల పరిశీలనకు ఈ శబ్దాన్ని అందిస్తున్నాను. ఈ చర్చ క్షోదక్షమమనే నా విశ్వాసం.

♦ శాసనాలకు ఆకరం :

ద. దే. శ. సం XVI, [ఆర్కియాలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా వారి తెలుగు ఇన్‌స్క్రిప్షన్స్ ఆఫ్ ది విజయనగర్ డయినస్టీ].

---

1. శృం. సం. సంపు. 4, పుట 1, తి. తి. దే. 1949.
2. శృం. సం. సంపు. 12, పుట, 1, క్రీగీతలో, తి. తి. దే. 1956.
3. శృం. సం. సంపు. 15, పుట 1, క్రీగీతలో, తి. తి. దే. 1961.
4. శృం. సం. సంపు. 18, పుట 1, క్రీగీతలో, తి. తి. దే. 1964.
5. శృం. సం. సంపు. 22, పుట 1, క్రీగీతలో, తి. తి. దే. 1975.

♦ 'సరియగు' అనే అర్థాన్ని శాస్త్రిగారూహించినట్లు శర్మగారు వ్రాయుటకు ఆధారము కనిపించదు.

**శ్రీ కామిశెట్టి శ్రీనివాసులు**

# ఖ లు

## ప్రమాదో ధీమతా మపి

జులై 1983 భారతిలో శ్రీ కాపూరి పాపయ్యశాస్త్రి వ్రాసిన శ్రీమద్రామాయణ కల్పవృక్షము - బాలకాండము - కవితా రామణీయకత అనే వ్యాసం చక్కని పరిశీలనకి తార్కాణ —

శాస్త్రిగారు రామకథ వివరిస్తూ "కూజంతం రామ రామేతి" అనే శ్లోకం విశ్వనాథ రచించినట్లు వ్రాశారు—. "ఆ రామాయణ మహీరుహంపై కవికోకిలలు కూర్చొని మధురంగా గానంచేస్తాయి ఆ నాడు ఆ కోకిల వాల్మీకి. ఈ నాడు ఆ కోకిల విశ్వనాథ.

కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్।
ఆ రుహ్య కవితాశాఖామ్ వందే వాల్మీకి కోకిలమ్॥

పై పద్యంలో ఇంతటి భావమరందతుందిలము గావించి నాడు విశ్వనాథ.

"త్రవ్వినకొద్దీ తరగనిసంపద. త్రాగినకొద్దీతరగనిరసధార."
(జూలై భారతి 1983, 43వ పేజీ)

ఇలా వ్రాయడంవల్ల విశ్వనాథే "కూజంతం" అనే శ్లోకాన్ని వ్రాసినట్లు అనిపించదా? శ్రీమద్రామాయణం నిత్యానుసంధేయంగా పారాయణం చేసే వారంతా అనూచానంగా పై శ్లోకాన్ని ప్రార్థనా శ్లోకాల్లో పఠిస్తారు. ఆ శ్లోకకారు లెవరో తెలియదుగాని, విశ్వనాథ మాత్రం కాదు. ఈ తప్పు ఎలా దొర్లిందో!

**ఎస్. టి. పి. వి. రామానుజాచార్యులు,**
నూ జి వీ డు.

## "అప్పిన్నది" - "నప్పిన్నయి" పాఠనిర్ణయము

"ఆముక్తమాల్యద" మహాకావ్యావతారికలో ఆంధ్ర రాయడగు విష్ణువు, కన్నడరాయడైన శ్రీకృష్ణదేవరాయలకిట్లానతిచ్చెను:

"ఎన్నినుఁ గూర్తునన్న, విను, మేమునుదాల్చిన మాల్య మిచ్చుటన్న
ప్పిన్నది రంగమందయిన పెండిలి సెప్పము........ "

ఏ నిన్ను ఉద్దేశించి కథను వ్రాయుదునంటివా వినుము నేనును తాను ముందుగా ధరించిన దండను

నాకు పిమ్మట సమర్పించు చుండిన యాబాలికయు శ్రీరంగమందు చేసికొనిన వివాహము వర్ణింపుము అని అర్థమయి యున్నది. వేదమువారి సంజీవని వ్యాఖ్య ఇట్లే వివరణ వ్రాసినది.

ఇందు "వాల్చిన మాల్యమిచ్చు నప్పిన్నది" అను వాక్యము తికమక పెట్టుచున్నది. ఇచ్చున్ + అప్పిన్నది = ఇచ్చునప్పిన్నది. ధరించిన దండను సమర్పించు అపిన్నది ఉన్నదే అది అని చప్పున అర్థమువచ్చును. కానీ యిది అంత సూటి వ్యవహారము కాదని నాయూహ. "అప్పిన్నది" అన్నచోట నున్నది కిటుకంతయును. ఇందు కవి గడుసుదనము చూపించినాడు అని నాకెప్పుడును అనిపించుచుండును. ఆ శబ్దము "అప్పిన్నది" కాదు "నప్పిన్నయి" అయి యుండునని నా అనుమానము. అప్పుడు వాక్యము "వాల్చిన మాల్యమిచ్చు నప్పిన్నయి" అగును. ఇందును గణ యతి ప్రాసములు కుదిరినవి. "నప్పిన్నయి" శబ్దార్థము శ్రీవైష్ణవులు రకరకాలుగా నిచ్చెదరు. కొందరు "నప్పిన్నయి" శ్రీకృష్ణమహిషి అనియు, ఈమెయే నీళాదేవి (విష్ణువుకు ముగ్గురుదేవేరులు శ్రీభూనీళలు) అని యందురు. మఱికొందరు ఆనీళాదేవి గోదాదేవిగా పుట్టినదనియు నందురు. వీరి ప్రకారము "నప్పిన్నయి" గోదాదేవియే. "నప్పిన్నయి" అనిన అరవములో "నాపిన్నది" అని అర్థము చేయవచ్చును. విష్ణువుకు గోదాదేవి "నాపిన్నదే" మనకు తల్లి కావచ్చును

ఇప్పుడు కావ్యపద్యములో అప్పిన్నది-నప్పిన్నయి అను రెండుపాఠభేదములకు పోటీవచ్చును. "ఎన్నిన" అన్నదానికి "అప్పిన్నది" అనునది తూగునిచ్చు ప్రతిశబ్దముగా భాసించును. ఇది ఈ పాఠము సుగుణము.

"నప్పిన్నయి" అను పాఠములో ద్రావిడవేద సారమూ, అర్చపురాణ విషయమూ ప్రతిబింబించుచున్నవి. ఇవి ఈ పాఠ సుగుణములు. పాఠము "నప్పిన్నయి" యని యుండినదే ఔచిత్యమని నా అభిప్రాయము నేను పాఠాంతర పరిశోధన చేయలేదు. నాకు శ్రీవైష్ణవమత పరిజ్ఞానమునులేదు. కాని సంగతిసందర్భములు యోచించి యిది వ్రాసినాను. రసజ్ఞులు, శ్రీవైష్ణవ పుంగవులు ఇందలి సామంజస్యమును నిర్ణయింతురు గాక.

"తి"



# గ్రంథ విమర్శలు

## తమిళాంధ్ర భారతముల తులనాత్మక పరిశీలనము

[రచన: శ్రీ వి. ఎస్. రాఘవన్. 360 పేజీలు. వెల: 7-25 రూ. లు. ప్రతులకు: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, సైఫాబాద్, హైదరాబాద్ - 500 004.]

"వింటే భారతం వినాలి" అంటారు ఆంధ్రులు. తెలుగు వారికి ఇష్టదైవం రాముడయినా, మిక్కిలి ఇష్టమయిన గ్రంథం భారతమే. మన పొరుగున ఉన్న తమిళులకు ఇష్టదైవం మురుగన్ అయినా, వారిలో అధిక సంఖ్యాకులు అభిమానించేది కంబ రామాయణం. తమిళంలోకూడా భారతం వ్రాయబడక పోలేదు. కాని పలు కారణాలవల్ల తమిళ భారతం అంతగా ప్రజాదరణకు నోచుకోలేదు. అందుకు కొన్ని కారణాలు వివరిస్తూ "తమిళాంధ్ర భారతముల తులనాత్మక పరిశీలనము" చేశారు శ్రీ వి. ఎస్. రాఘవన్ గారు.

తమిళనాడులో ప్రతి గ్రామంలోనూ ద్రౌపది అమ్మన్ కోయిల్ ఉంటుంది. ద్రౌపదికి మిక్కిలి కోలాహలంగా పూజలు జరుగుతాయి. ద్రౌపది అనే పేరుగల స్త్రీలు కూడా కనిపిస్తారు. భారత కథను పలువురు కవులు తమిళంలో వెలయించారు. దాదాపు 23 తమిళ భారతాలున్నాయని రాఘవన్‌గారు వెల్లడించారు. వీటిలో ముఖ్యంగా విల్లికవి వ్రాసిన భారతంతో కవిత్రయం రచించిన ఆంధ్రభారతాన్ని పోల్చి చూడటం ఈ రచయిత ముఖ్య ఉద్దేశం.

తమిళంలో ఇన్ని భారతములు వెలసినప్పటికీ ప్రజానీకంలో భారత కథకు అంతగా ప్రాచుర్యం, ఆదరణ లేకపోవడానికి రచయిత కొన్ని హేతువులు పేర్కొన్నారు. 1) తమిళ శైవులు కృష్ణ ప్రాధాన్యత కలిగిన భారతాన్ని అభిమానించరు. 2) దౌత్యము, సారథ్యమూ నిర్వహించిన భారత కృ ని యెడ తమిళ వైష్ణవులకు వైముఖ్యంవుంది. 3) ఇక భారతం పాఠ్యగ్రంథమైతే కథకు సంబంధించిన కొంటె ప్రశ్నలతో విద్యార్థులు ఉపాధ్యాయుల్ని వేధిస్తారు. 4) తరగతులలో భారత పాఠము చెప్పవలసినపుడు అన్యమతస్థులు హిందూ విద్యార్థులను పరిహసిస్తారు.

ఇలాంటి హేతువులు వివరిస్తూ రచయిత ద్రవిడకజగం వారి ప్రభావాన్ని గురించికూడా ప్రస్తావించారు. కజగంవారి ప్రభావం ఎంత ఉన్నా నేటికీ తమిళనాడులో దైవభక్తికి ఏలోటూ రాలేదు. పైగా పైన పేర్కొన్న కారణాలు ఒక్క తమిళనాడుకు మాత్రమే పరిమితం కావడానికి ఆస్కారంలేదు. తమిళులు అనువాద గ్రంథాలను ఆదరించరన్న ఉపపత్తి కొంతవరకు హేతుబద్ధంగా ఉంది. ఒక్క కంబ రామాయణం తప్ప తక్కినవేవీ అంతగా ప్రాచుర్యం పొందినట్లు కనిపించదు. తమిళులకు 'శిలప్పదికారం' మున్నగు స్థానిక కథా వస్తువులపైనే ఎక్కువ మక్కువ ఉన్నట్లు తోస్తుంది.

శ్రీ వి. ఎస్. రాఘవన్‌గారి తులనాత్మక పరిశీలన ఆసక్తిదాయకంగా సాగింది. పెరుందేవనార్ రచించిన భారతవెణ్బా, విల్లి విరచించిన భారతం ఈరెంటినుంచీ ఎన్నో ఉదాహరణలు గైకొని కృతకృత్యులైనారు. అందునా ముఖ్యంగా సంస్కృతాంధ్ర భారత ములకంటె విభిన్నమైన కల్పనలు ఉటంకించడం ఎంతైనా ఉచితంగా ఉంది.

దుర్యోధనుడు యుద్ధ ప్రారంభానికి మంచి ముహూర్తం చెప్పమని భీష్ముని కోరాడు. నీ శత్రువైన సహదేవుణ్ణి అడగమన్నాడు భీష్ముడు. సంకోచంతోనే తన్ను సమీపించిన దుర్యోధనుని కోరికను మన్నించి సహదేవుడు నిస్సంకోచంగా శుభముహూర్తం పెట్టాడట!

సహదేవుణ్ణి గురించే మరో కల్పన! శ్రీకృష్ణుడు రాయబారానికి వెళ్తూ యుద్ధం నివారించడానికి మార్గమేమిటని సహదేవుణ్ణి అడిగాడు. అతడు నిర్ [illegible] "! [illegible] కటి చెఱలో వేయించుట, ద్రౌపది శిరోముండనము, అర్జునుని సంహరించుట, కర్ణుని రాజు చేయుట" అని చెప్పాడు.

ఉలూపి కుమారుడు ఇరావంతుని గురించి అమోఘమైన ఓ ఉదంతం విల్లి భారతంలో ఉంది. ఇరావంతుడు కర్ణుని మించిన దాత. దుర్యోధనుడతన్ని కళబలి (యుద్ధరంగానికి ఇచ్చే బలి) కమ్మని కోరగా అతడు అంగీకరించాడు. ఇది తెలుసుకుని కృష్ణుడు ఇరావంతుణ్ణి మాయమాటలతో మోసగించి పాండవుల తరపున కళబలి గావించాడు.

ద్రౌపది మనస్తత్వం గూర్చిన మరో కథను విల్లి భారతం నుండి ఉదహరించారు రచయిత. పాండవులు అరణ్యవాసం చేస్తూ ఉన్న సమయంలో ఆ సమీపంలో ఒక ముని తపమాచరిస్తూ ఉండేవాడు. అతని ఆశ్రమంలోని ఉసిరిక చెట్టుకు గల పండును చూసి ద్రౌపది ఆశపడి అర్జునుణ్ణి అడిగింది. అర్జునుడు బాణంతో దాన్ని నేలరాల్చాడు. తరువాత ఆ పండు మహిమాన్వితమైనదనీ, దాన్ని నేలరాల్చినందుకు తపస్సు చాలించాక ముని ఆగ్రహించ గలడనీ తెలిసి పాండవులు భీతులై కృష్ణుని ధ్యానించారు. కృష్ణుడు ప్రత్యక్షమై మీ మనస్సుల్లోని కోరికలను దాచక చెప్పితే పండు మళ్ళీ వృక్షాన్ని అంటుకుంటుందని తెల్పాడు. పంచ పాండవులు తమ మనస్సులలోని విషయాలను చెప్పారు. కాని అవి అసత్యాలవడంచేత పండు యథాస్థానం చేరలేదు. తుదకు ద్రౌపది "షష్ఠో మే రోచతే పతిః" అని చెప్పింది. ఆమెకు కర్ణునిపై కూడ ప్రేమ కలదన్న సత్యం వెల్లడి కావడంతో పండు చెట్టును చేరుకుంది. అందరూ సంతోషించారు. ఈ కథ విల్లి భారతంలోనే గాక ఒకానొక కన్నడ భారతంలో కూడ ఉంది.

విల్లి భారతంలో కర్ణుని గూర్చిన కల్పనలు కూడ కడు హృద్యములై ఉన్నాయి.

కర్ణుడు యుద్ధరంగంలో క్రుంగిన రథము నెత్తే ప్రయత్నంలో ఉన్నాడు. అప్పుడు కృష్ణుడు బ్రాహ్మణ వేషంతో అతన్ని సమీపించి "నీవు చేసిన పుణ్యము ను దానము చేయు"మని యాచించాడు. కర్ణుడు వెనువెంటనే తన శరీరమున గ్రుచ్చుకున్న బాణములను లాగివేసి వెడలివచ్చు రక్తధారతో ఆ బ్రాహ్మణునికి తాను చేసిన పుణ్యం ధారపోశాడు. అంతట బ్రాహ్మణుడు నారాయణ స్వరూపమున అతనికి ప్రత్యక్షమై అనుగ్రహించాడు.

కర్ణుడు నేలగూలిన వార్తను ఆకాశవాణి కుంతికి తెలిపింది. వెంటనే పరుగున వచ్చి కర్ణుని శిరమును ఒడిలో పెట్టుకుని విలపిస్తూ పాలిచ్చింది. అతడు తన పుత్రుడే అన్న సత్యం సర్వులకూ వెల్లడించింది.

ఇలాంటి కల్పనలు ఇంకా అనేకాలు. వీనిని రాఘవన్ గారు ఉచిత రీతిని ఉటంకించారు. తెలుగు భారతమునుండీ, విల్లి భారతమునుండీ తులనాత్మకంగా ఎన్నో ఉదాహరణ లిచ్చి గ్రంథ రచనకు వన్నెతెచ్చారు.

విల్లి తన పద్యాల్లో "చెవి, ఏను, చెప్పు" మున్నగు తెలుగు పదాలు వాడి తన ఆంధ్రభాషాపాండిత్యం ప్రకటించారనీ ప్రాశాదు రచయిత. ఈ పదాలే కాక ఇలాంటి ఎన్నో మూల ద్రావిడపదాలు కంబ రామాయణం మున్నగు ప్రాచీన తమిళ గ్రంథాల్లో అక్కడక్కడ ప్రయుక్తములైనాయి. అంతమాత్రాన అవి తెలుగు పదాలు అనుకోనక్కరలేదు. ఉదాహరణకు "పులు (గడ్డి), కై (చేయి)" తెలుగు కావ్యాల్లో ప్రయుక్తములైనాయి. అవి కేవలం తమిళ పదాలుగా భావించరాదు. అవి మాండలికమైన తెలుగులోను, తమిళంలోను మిగిలిపోయిన మూల ద్రావిడ అవశేషాలు మాత్రమే.

"శిఱప్పుప్పాయిరం" అన్న సమాసం కూడా "శిరప్పాయిరం"గా (అచ్చుతప్పు అనుకోవడానికి వీల్లేకుండా) మూడు చోట్ల ముద్రితమైంది. ఎందుకో?! భారత కథ కల్పితమనీ, వాల్మీకి రామాయణానికి పోటీగా వ్రాయబడిందనీ చెబుతూ పెక్కు ఉపపత్తులు ప్రతిపాదించారు రచయిత.

మొత్తంమీద ఆంధ్ర తమిళ భారతముల తులనాత్మక సరి పరిశీలన ప్రయోజనకరంగా ఉంది. జాతీయ భావసమైక్యతను పెంపొందించడానికి ఇలాంటి గ్రంథాలు ఇంకా విరివిగా వెలువడ గలవని ఆశించవచ్చు.

శ్రీ పులిచెర్ల సుబ్బారావు

## వజ్ర సంకల్పం (వచన కవితా సంకలనం)

[సంకలన కర్తలు : వెంపల వెంకట శివప్రసాద్, పెమ్మరాజు గోపాలకృష్ణ. వెల : రు. 3_00 లు. ప్రతులకు 1) వెంపలి వెంకట శివప్రసాద్, బోయినవారి అనకాపల్లి - 531 001. 2) పి. వి. రమణమూర్తి, విల్లూరి జోగి నాయుడు వీధి, అనకాపల్లి-531 002.]

ఈ కవితా సంకలనం రేపటి సామ్యవాద వ్యవస్థ కోసం ఈనాటి పీడిత సమాజంలోని ఆగ్రహోదగ్రులైన యువతరం రాసినది. ఈనాడు కవిత్వం రాస్తున్న వాలా మందికి వారి అక్షర శక్తిమీద, దాని ప్రభావంమీద అచంచలమైన విశ్వాసం ఉండటం సాధారణమై పోయింది. శివారెడ్డిగారు 'నా తపన' అంటూ రాసిన కొన్ని వాక్యాలు యువకులందరూ గుర్తుంచుకో తగ్గవి. "ఈ నలభై మంది కవుల్లో అయిదేళ్ళ తరువాత ఎంతమంది మిగుల్తారో చూడాలి. పదేళ్ళ తరువాత మరెంతమంది కవిత్వం రాస్తూ ఉంటారో చూడాలి." విప్లవం పోరాటం, తిరుగుబాటు ఇత్యాదులైన మాటలు కవిత్వంలోనూ, జీవితంలోనూ ఫ్యాషన్‌గా మారకూడదని చాలామంది ఆశిసున్నారు.

ఈ కవితా సంకలనంలో మంచి కవిత్వముందని చెప్పటానికి వెనకాడవలసిన అవసరం లేదు. కవిత్వం చెప్పే పద్ధతిలో ఒడుపు, నేర్పు ఈ కవులకు పుష్కలంగా ఉందని చాలా కవితలు ఋజువు చేస్తున్నాయి.

ఏ పాపమూ తెలియని కొండల్ని
కంకర కోసం పేల్చేయడం లేదూ ?
ఏ మోసమూ ఎరుగని వృక్షాల్ని
కట్టెల కోసం నరికెయ్యడం లేదూ ?
మరి
పాపాలే మోసాలే చేస్తూ
మన నెత్తురు పీల్చేస్తున్న జలగల్ని
మనందరి కోసం ఏదైనా చేస్తే తప్పా ?

ఈ గేయంలో భావం వాచ్యం కాకపోయినా కవితా పాఠకులకు స్పష్టంగానే అర్థం అవుతుంది. కార్య కారణ సంబంధం కవితాత్మకంగా చెప్పినప్పుడే దాని ప్రభావం ఫలవంతమవుతుంది. అట్లాంటిదే మరొక గేయ

చెకుముకి రాళ్ళ రాపిడికి శిరసెత్తుతుంది అగ్నికణం
అడవి వృక్షాల ఒరిపిడికి పుడుతుంది లావా లాంటి దావానలం
సెలయేటి కెరటాల ఉరవడికి
గులకరాయి గొంతు విప్పుతుంది.
క్షుభితాశ్రు జలపాతాల తాకిడికి
గుండెల జనరేటర్లు చలించి జ్వలించి
విప్లవ విద్యుత్తు జనిస్తుంది
వేన వేల బ్రతుకు బల్బుల్ని వెలిగించటానికి."

వచన కవిత్వంలో రాసే గాని వాసి లేదనే వారు ఇట్లాంటి సంకలనాలను ఒకసారైనా చూడటం మంచిది.

## దృష్టి (నవ్య కవిత్వం)

[తమిళ మూలం: కొ. న. [illegible]లరామన్. తెనిగింపు కె. ఆర్. వేలాయుధరాజా. ప్రతులకు: దక్షిణాంధ్ర భాషాసమితి, గూడలూరు, పి.ఓ. - 627789 వయా వాసుదేవనల్లూరు, తిరునెల్వేలి జిల్లా, తమిళనాడు.]

ఈ వచన కవితా సంకలనం తమిళంలో ఈనాడు వస్తున్న [illegible]నిక కవిత్వం యొక్క రూపానికీ వస్తువుకీ నిదర్శనం. తమిళ మూలం నాకు తెలియదు. ఈ అనువాద కావ్యాన్ని బటి పై భావానికి రావలసి వచ్చింది. వేలాయుధరాజా గారు వచన కవిత్వాన్ని రాయడానికి వ్యాకరణాన్ని ఎదిరించినట్లుగా చెప్పుతున్నారు. వ్యాకరణం శబ్దానికి సంబంధించినది; ఛందస్సు కవిత్వానికి సంబంధించినది. వచన కవిత్వం ఛందో నియమాలను విచ్ఛిన్నం చేసింది. వాడుక భాష వ్యాకరణ సంప్రదాయాన్ని మార్చింది.

ఈ కవిత్వంలో సంఘ దౌష్ట్యాన్ని అతి తీవ్రంగా ఖండించటం కంటె అతి బలంగా అపహాస్యం చేసి వెక్కిరించటం జరిగింది. కవిత్వం చెప్పటంలో ఈ సెటైర్ పద్ధతి కవికి ఆయుధంగా ఉపయోగపడింది. ఉదాహరణకు—

పుష్పలావిక పూర్ణమ్మ
పుష్పించుటకు ముందుగానే
బొట్టు చెడింది పొలుపు చెడింది
పూవూ చెడింది.

పై పాదాల సెటైర్‌లో కూడా ఒక ధర్మ ధ్వనిని పాఠకుడు గమనిస్తాడు. 'ఏమిటి వ్రాస్తున్నావ్' అనే ఖండికలో ఆధునిక కవిత్వ లక్ష్యాన్ని వివరించటం జరిగింది. మూఢ విశ్వాసాన్ని అధిక్షేపిస్తూ 'జ్యోతిషం' అనే ఖండిక ఈ కవి రాశాడు.

"జ్యోతిషం చెబుతున్న ఆదిశేషుడు
తన కుమార్తె వివాహాన్ని
హడావిడిగా ఆడంబరంగా జరిపించాడు
మూడవ దినం ఆమె విధవ"

ఇట్లాగే ఈ కవితా సంకలనం రాజకీయ, సాంఘిక, మత మౌఢ్యాలపై పెద్ద సెటైర్‌గా కనబడుతుంది.

## సెబ పదచిత్రాలు

[వె[illegible] రు. 8-[illegible] లు. ప్రతులకు ఇంమారు భారతి, తెలుగు రచయితల సమాఖ్య, నిజామాబాద్.]

కవిత్వ భావుకతను, చి[illegible] జోడించి అందంగా ముద్రించిన పదచిత్రాలివ్వి. ప్రతి ఖండికలోనూ గాఢమైన కవితానుభూతి ఆవిష్కృతమైంది. కావ్యమంతా ఇక్కడి జీవితం తాలూకు అవ్యక్తమైన వేదన పరచుకుని ఉంటుంది. ఏ మాత్రం భాషాభేషజం లేకుండా, అంత్యప్రాసల, ఆదిప్రాసల, సమాసాల అర్భాటి లేకుండా అలతి మాటలతో జీవితం యొక్క ఎత్తుపల్లాలను గురించి వర్ణించటం ఈ కావ్యం ప్రత్యేకత.

కరుడు కట్టిన రేయిలా నిలిచిపోయిన జీవితంలోని వేదనను కవితాగానం చేస్తూ ఎక్కడో, ఎప్పుడో, ఏ చూరు మూలో వెలిగే మిణుగురు వెలుగుకోసం కవి మనస్సు అన్వేషిస్తుంది. జీవితంలో సౌందర్యారాధన ఒక ఉన్నతమైన భాగం. కాని జీవితావసరాలు మనిషిని ఈ సౌందర్యం నుంచి బీభత్సంలోకి నెట్టుతున్నాయి. ధనం అన్ని విలువల్ని హత్య చేస్తోంది. జీవితాలు బ్రతుకుతున్న కంకాళాలుగా మారి పూటగడవటం కోసం ఎడారిలో మార్గాన్ని అన్వేషిస్తున్నాయి.

"ఆకలిని చంపుకోలేక
సగం చచ్చిన రాత్రిలో
శవాలు నడుస్తూనే వున్నాయి
వెన్నెల వెలుగులూ
మలయ మారుతాలూ
కోయిల కూజితాలూ
చిగురాకు విందులూ
ఇవేవీ పట్టించుకోకుండా
కదుల్తూనే ఉన్నాయి."

తూరుపు ఆకాశంలో ఆకలి అంచాన్ని రెప్పల గోడల మీద చిత్రించటం గొప్పతనం కదా! వెలిగించడం కాదు; వెలగడం నేర్చుకోమంటున్నారు. ఉపదేశం కంటే అనుష్ఠానం ఎప్పుడూ గొప్పదే.

'మేము ఊపిన ఆలోచనల్ని
కట్టేసి ఆకాశంలో
వారు బంతులాడే వేళ
నా తరాన్ని - దేశాన్ని
రంగు నీళ్ళలో ముంచుతూ'

రక్తం సూర్యుడు ఉదయిస్తాడు. పై ఐదు పాదాల్లో వ్యక్తం అయిన భావాన్ని విశ్లేషిస్తే తాత్పర్యం రాసినట్లవుతుంది. "అవకాశం, ఆదరణా లేక రచయిత గుండె లోతులో అణిగి నిద్రాణ స్థితిలో పడివున్న సృజనాత్మక శక్తినీ, ప్రతిభనూ జాగృతం చేసి కొత్త ఊపిరులూది ఉత్తేజం రికే ఆదర్శాలలో అడుగు లేస్తూ, సాహితీ చిత్రణలో ప్రపంల్లో మనోవికాసాన్ని కలిగిస్తూ, స్పందిస్తూ, స్పందింపజేస్తున్న ఇందూరు భారతి" సాహితీ సమాఖ్య ముమ్ముందు వారి కార్యక్రమాలను జయప్రదం చేసుకొంటూ, మంచి కవితా సంకలనాలను అందించాలని ఆశిస్తున్నాను.

# కెరటం నా ఆదర్శం

[ఆచార్య భావన్. వెల : రు. 4-00 లు. ప్రతులకు : ఆచార్య భావన్, దాసన్నపేట, విజయనగరం - 531 202.]

లేచి పడినందుకు కాదు పడినా లేచినందుకే కెరటం తన ఆదర్శమని భావన్‌గారు మొదటి ఖండికలో చెప్పారు. వెలగటమంటే కవితా నేత్రాన్ని తెరవటమని, ఎదగటమంటే మనోవిహాగాన్ని పైకివిసరటమనీకవిగారు అభిప్రాయపడుతున్నారు. మార్పుని సహించలేని వాళ్ళు, నవ్యతను ఆహ్వానించలేని వాళ్ళు, నేటి పాటను పాడలేని వాళ్ళు, రేపటి బాటను వేయలేని వాళ్ళు, వెలుగులో పయనించటానికి ఇష్టపడలేని వాళ్ళు, అభ్యుదయ గమనం చెయ్యలేని వాళ్ళు, బూజు భావాల ఛాందసులు ఎప్పుడూ ఉంటారు. అట్లాంటి హృదయాలకు 'అనంతాక్షర అగ్నిధార పదును పదాల కవితా కదన రంగ పరశు ధార' తన కవిత అని చాటించారు. 'కల నిజమై నిలబడాలని, అల అంబుదమై విహరించాలని, కలం ప్రజాగళమై నినదించాలని' కవిగారు నిరీక్షిస్తున్నారు. శ్రమ నిజంగా సత్ఫలితాలను అందిస్తే విప్లవాల అవసరమేమిటని ప్రశ్నిస్తున్నారు.

"పక్షి పాడుతుంది
నిప్పు మండుతుంది
గాలి నడుస్తుంది
పక్షి పాటలో స్వేచ్ఛ
నిప్పుమంటలో విప్లవం
గాలి నడకలో ప్రగతి
అందుకే—
ప్రకృతి - ప్రపంచానికి
ఆదర్శం."

అంటూ స్వేచ్ఛనూ, విప్లవాన్ని కాంక్షిస్తూ, మార్పుకోసం, మరో లోకం కోసం ఈయన కవిత్వం రాస్తున్నారు.

శ్రీ టి. ఎల్. కాంతారావు

Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd., by S Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna, Vijayawada. Phones: 75667 &61247.

# భారతి

సాహిత్య మాసపత్రిక

మార్చి 1984



వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# భారతి

మాసపత్రిక

❧

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

❧

మార్చి 1984

సంపుటము : 61 సంచిక : 3

---

విడిపత్రిక వెల నాలుగు రూపాయలు

# విషయానుక్రమణిక

## మార్చి 1984



ముఖచిత్రం :

1929లో కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు బర్మా వెళ్ళినప్పుడు అక్కడి ఆంధ్ర మహాసభవారు వారికి బహూకరించిన బుద్ధుడి దంతపు విగ్రహం.

# సచ్చిదానందలహరి

## శ్రీ ముళ్ళపూడి సచ్చిదానందమూర్తి

మౌనము ధ్యానము మంచిమందు లింటికిని వంటికిని
కాని యట్లుండనీదు గృహకాలుష్య మందుకే నీవు
స్థాణువుగా చక్కని అవతారమెత్తితివి. యోచించి
శోణాంబక విచిత్రమూర్తి ! సోమేశ్వరా మహాలింగ !

రాత్రిళ్ళు నిద్ర రాదుగదర ! పగలు మెలకువ రాదు
ధాత్రిని నేనొనరెడిది దాదాపు శూన్యమ్ము. యింత
మాత్రానికే సూత్రపట్టి మనుగడ నా కిచ్చుచుంటి?
స్తోత్రప్రియా ! మహాదేవ ! సోమేశ్వరా మహాలింగ !

ఓపికలేక కొంత మనసుండబట్టగలేక కొంత
ఏ పూవు లెట్లు వేసితినో ! ఈశ్వరార్పణమంచు
నీ పాదముల పంకజములు నిజముగ నావె. ముక్కంటి
చూపానడము లేదో? నీకు. సోమేశ్వరా మహాలింగ !

చీకటినుండి చీకటికి చేరెడి నంధుల యట్లు
శోకమునుండి మరియొక శోకానబడి పోవుచుంద్రు
లోకులు సుఖమును గోరి లోభ మింతకు కారణమ్ము
సోకుమూకలగొంగ ! స్వామి ! సోమేశ్వరా మహాలింగ !

కవులకు కాకిమూకలకు కరువులేదీ ప్రపంచాన
చివరికి పంది నందిగ రచింతురు నాల్గు మెతుకుల
కెవ డెటుచచ్చిన నేమి? యీ జాతి యేమైననేమి ?
సువియన సువియంద్రు ! సోమేశ్వరా! మహాలింగ !

డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

# సునిశిత మేధోపరిజ్ఞానం కేవలం పరిపోషకశక్తి ప్రభావమేనా?

మేధోపరిజ్ఞానం ఏవిధంగా ఏర్పడుతుందన్నది ఈనాటికీ ఒక సవాలుగానే నిలిచివున్నది. మనిషి తెలివితేటలలో కాని, బుద్ధి వికాసంలో కాని ఇతర జంతువులకన్నా అత్యధిక స్థాయిలో ఉన్నాడు. ఇది ఎవరూ కాదనలేని సత్యము. అయితే మనిషి, మనిషికీ ఈ పరిజ్ఞానంలో వ్యత్యాసముంటున్నది. పండితపుత్రుడు శుంఠ అవుతున్నాడు. చేపలు పట్టుకొనే గంగపుత్రుడు మహావిద్వాంసుడౌతున్నాడు. ఎందుకనిలా? అఖండ మేధావిగా గొప్పశాస్త్రవేత్తగా విశ్వవ్యాప్తంగా కొనియాడబడ్డ అయిన్‌స్టీన్ మెదడును పరిశీలించి, పరిశోధించి సాధించిందొకటే! ఆ మహాపురుషుని మెదడుకూ, సామాన్యమైన తగుమాత్రం తెలివితేటలున్న మనిషిమెదడుకూ సాంకేతికంగా పెద్దభేదమేమీలేదని. మరెక్కడున్నది ఆ వ్యత్యాసం ?

"చింపాంజీ", "గొరిల్లా"ల వంటిజంతువుల నుంచి, ఆదిమ మానవులనుంచి నేటిమానవుడు అత్యధికమైన పరిజ్ఞానాన్ని ప్రదర్శించేందుకు కారణభూతంగా శరీరపరిమాణానికి, మెదడు పరిమాణానికి మధ్యన నెలకొనే నిష్పత్తి ప్రభావంగా తేల్చిచెప్పినారు. మెదడుపరిమాణం గణనీయంగా పెరిగేకొద్దీ తెలివితేటలు ఎక్కువకావడం సహజంగానే జరుగుతుందని భావించడం అసమంజసమేమీకాదు. మెదడు పరిమాణం పెరిగేకొద్దీ, దానికి అనులోమానుపాతంగా, జ్ఞాన నాడీకణాలు (ఆలోచించగలిగేవి!) కూడా అధికంగాఉండి, బుద్ధివికాసం పరిణిత స్థాయికి ఎదుగుతూఉంటుంది. 45 కిలోగ్రాముల బరువున్న "చింపాంజీ" మెదడు పరిమాణం, 60 కిలోగ్రాముల బరువున్న నేటిమనిషి మెదడు పరిమాణంకన్నా రెండురెట్లు తక్కువగా ఉండడంవల్ల, దాని తెలివితేటలుకూడా మనిషికన్నా చాల తక్కువ స్థాయిలో ఉందని స్పష్టంగా తెలిపినారు. కాబట్టి మెదడు మృదుకణజాలంలో విస్తరించుకొని ఉన్న "థింకింగ్ న్యూరాన్" ల సంఖ్య అధికంగా ఉంటే తెలివితేటలు కూడ ఎక్కువగా ఉంటుందని తెలుసుకోవచ్చు. "చింపాంజీ" లో 3.4 "బిలియన్"లు,మనిషిలో 8.5 "బిలియన్"లు-"థింకింగ్ న్యూరాన్"లు ఉండడం, మనిషికి ఉన్న ఆధిక్యతను (బుద్ధివికాసపరంగా) తేటతెల్లం చేస్తుంది. ఈ విషయానికి సంబంధించి మనిషికి, మనిషితో దగ్గరి సంబంధం ఉన్న మరికొన్ని క్షీరదాలకు ఉన్న బాంధవ్యాన్ని పట్టిక రూపంలో ఇచ్చినాను.

### శరీరానికి - మెదడుకూ ఉన్న సంబంధ బాంధవ్యాలు

| క్షీరదం పేరు | శరీరం బరువు (కిలోగ్రాములలో) | మెదడు పరిమాణము (ఘన సెంటీమీటర్లలో) | శరీర నాడీ కణాలు (బిలియన్‌లలో) | జ్ఞాన నాడీ కణాలు (బిలియన్‌లలో) |
|---|---|---|---|---|
| "చింపాంజీ" | 45 | 400 | 0.9 | 3.4 |
| "గొరిల్లా" | 250 | 600 | 1.9 | 3.6 |
| "ఆస్ట్రలోపెథికస్ రోబస్టస్" | 50 | 600 | 1.0 | 4.7 |
| "హోమో ఎరెక్టస్" | 50 | 1000 | 1.0 | 7.0 |
| "హోమో సాపియన్స్" (నేటి మనిషి) | 60 | 1300 | 1.0 | 8.5 |

[ ప్రొఫెసర్ జెరీసన్, యూనివర్సిటీ ఆఫ్ కాలిఫోర్నియా వారి అంచనా ఇది ! ]

జంతువులపై మనిషికున్న ఆధిక్యత సంగతి సరే! మనుష్యులందరిలోనూ ఒకే విధమైన తెలివితేటలుండటం లేదు. అయిన్‌స్టీన్‌కూ - అంబేద్కర్‌కు భేదముంది. టాల్‌స్టాయ్‌కీ - గొథేకీ తేడా ఉంది. మార్క్స్‌కీ - మహాత్మాగాంధీకీ వ్యత్యాసముంది. పాశ్చర్ కీ-పాపర్ కీ తారతమ్యం ఉంది. ఈ తేడాలు ఎందుకని? వారి రంగాలు ఏవైనా, వారు ప్రదర్శించిన అసమాన ప్రజ్ఞావిశేషాలు ఒక్కటే. ఈ ప్రజ్ఞా విశిష్టతలోనూ ఒకరినుంచి ఒకరు ప్రత్యేకమైన బాణీతో, వ్యక్తిగతమైన ముద్రతో వేరుపడుతునే ఉన్నారు. శరీర పరిమాణము, మెదడు పరిమాణము ఒకే విధంగా ఉన్నాయి. దేహ నాడీకణాల సంఖ్యలో కాని, మెదడు నాడీకణాల సంఖ్యలో కాని ఏ విధమైన మార్పు లేదు. అయినా ఈ తేడా ఎందుకు? కారణాల కోసం అన్వేషణ మొదలు పెట్టినారు. మెదడు నాడీకణాలు ఒకదాన్నొకటి ఒక వలలాగా అంటిపెట్టుకొని ఉంటాయి. ఈ జాలకార నిర్మితం ఎంత జటిలంగా ఉంటే, ఆ జటిలత ఆధారంగా, బుద్ధివికాసం అంతగా పరిణితి చెంది ఉంటుందని ఒక భావన, అంటే నాడీకణానికి ఉండే నాడీపోచల సంఖ్య, ఆ పోచలు మరో నాడీకణం పోచలతో ముడిపడి ఉండే తీరు - ఇవి రెండూ బుద్ధి వికాసానికి దోహదం చేస్తాయన్నమాట. ఇది కొంతవరకు వాస్తవమేనని పరిశోధనలు సెలవిస్తున్నాయి. ఈ జాలాకార నిర్మాణపు అమరిక జన్యుసంబంధమైనదని ఒక ప్రతిపాదన. అయితే ఇది ఆక్సిడెంటల్" గా ప్రకృతిపరంగా జన్యువులో కలిగే మార్పులవల్ల కూడ ఏర్పడవచ్చునని మరొక సూచన. అంటే ఈ సంక్లిష్ట నిర్మాణం యాదృచ్ఛికంగా స్వచ్ఛందంగా ప్రకృతి ప్రభావానికి రూపొందేదని, ఆ విధంగా బుద్ధివికాసం (నా దృష్టిలో వివేచనా శక్తి) ప్రకృతి వరప్రసాదమేనని స్పష్టంగా బోధపడుతుంది. "జెనెటిక్ ఇంజనీరింగ్" లేదా "టైలరింగ్" ద్వారా జన్యువులో మార్పులు కలుగజేసి "సూపర్ మ్యాన్" లను "డేర్ డెవిల్" లను తయారు చేసే పద్ధతి కూడ ఈ భావనను ఆధారంగా చేసుకొని రూపకల్పన గావించబడ్డదే! ఈ ఆలోచనల పరంపరలోనే మనిషి తీసుకొనే ఆహారాన్ని బట్టి మెదడు క్రియాశీలత మారుతూ ఉంటుందనే భావన వెలువడ్డది. పౌష్టికాహారం మేధోశక్తిని పెంచుతుందని భావించడం జరిగింది. ఇది నిజమా? కాదా? తేల్చి చెప్పడానికి మెదడు క్రియాశీలత వేటిపై ఆధారపడి ఉంటుందనే విషయాన్ని అవగాహనకు తెచ్చుకోవాలి.

మెదడు క్రియాశీలత "ట్రిప్టోఫ్యాన్", "టైరోసిన్" అనబడే "అమైనో ఆమ్లాల" మీద, "కొలైన్" అనబడే క్రొవ్వుపదార్థం మీద ఆధారపడి ఉంటుంది. మనం తీసుకొనే పరిపోషకాలలో ("న్యూట్రియంట్స్") వీటి శాతం అధికంగా ఉంటే మెదడు క్రియాశీలత కూడ అధికంగానే ఉంటుంది. ఈ రెండు "అమైనో ఆమ్లాలు", "కొలైన్" క్రొవ్వుపదార్థము ఏవిధంగా మెదడు క్రియాశీలతను పెంచగలుగుతుందన్నది చాల ఆసక్తికరమైన అంశము.

తీసుకొనే ఆహారపదార్థాలలో పిండిపదార్థాలు ఎక్కువగా ఉన్నట్లయితే "ట్రిప్టోఫ్యాన్" వనరులు అంతంతమాత్రంగానే లభ్యమౌతాయి. అదే మాంసకృత్తులు అధికంగా ఉన్నట్లయితే "ట్రిప్టోఫ్యాన్" వనరులు అధికంగా ఒనగూడుతాయి. "టైరోసిన్" కూడ తగు మోతాదులో రూపొందుతుంది. చిక్కుడు, గ్రుడ్డుసొన, గొఱ్ఱె, మేక మాంసాలలో (ముఖ్యంగా కాలేయంలో) - "లెసిథిన్" అధికంగా ఉండి దానిద్వారా "కొలైన్" ఏర్పడుతుంది. ఒక విషయం మాత్రం స్పష్టం. "ట్రిప్టోఫ్యాన్", "టైరోసిన్," "కొలైన్" - వీటిపైనే మెదడు క్రియాశీలత ఆధారపడి ఉంటుంది. ఎందుకనలా? మెదడు నుంచి అనుబంధిత, సహసంబంధిత నాడీకణాలకు సంకేతాలను అందించడానికి కావలసిన "ఎలక్ట్రిక్ పొటన్షియల్", "న్యూరో ట్రాన్స్‌మిటర్స్" ద్వారా కొనసాగించబడి సమాచారం "కమ్యూనికేట్" చేయబడుతుంది. ఈ "ట్రాన్స్‌మిటర్" లు రూపొందడానికి ఈ రెండు "అమైనో ఆమ్లాలూ", ఒక క్రొవ్వుపదార్థమే మూలకారణాలు! ఏ పదార్థం ఏవిధమైన "ట్రాన్స్‌మిటర్" ను ఏర్పరుస్తుందనేది విలయవారీగా చర్చించుకోవలసిన అంశము.

"ట్రిప్టోఫ్యాన్", "సెరటోనిన్" అనే "ట్రాన్స్‌మిటర్" ను ఏర్పరుస్తుంది. అలాగే "టైరోసిన్" అనేది దశలవారీగా "డోపమైన్", "నార్ ఎపిన్ఫ్రైన్", "ఎపిన్ఫ్రైన్" - అనబడే "కన్వేయింగ్ ఏజంట్" ల తయారీకి ఉపకరిస్తుంది. ఇకపోతే "కొలైన్" అనేది "అసిటైల్ కొలైన్" గా రూపొంది సమాచారాన్ని చేరవేసే అపవాహిచాలకంగా వ్యవహరిస్తుంది. ఈ "న్యూరో ట్రాన్స్‌మిటర్" ల నిర్వాకాన్ని స్థూలంగా నిర్దేశించుకోవచ్చు: (రేఖాచిత్రం 6వ పేజీలో)

## "న్యూరోట్రాన్స్ మిటర్"లు - సమాచార వినిమయాలు

ఆహారం

"ట్రిప్టోఫ్యాన్"   "టైరోసిన్"   "కొలైన్"

↓

"డోపమైన్"

↓ "సెరటోనిన్"   ↓ "నార్ ఎపినెఫ్రైన్"   ↓ "అసిటైల్ కొలైన్"

↓

"ఎపినెఫ్రైన్"

——▷ సమాచార వినిమయ విభాగము
(మెదడు నుంచి నాడీకణమండలానికి)

మెదడు క్రియాశీలత మెదడులో ఉన్న "ట్రిప్టోఫ్యాన్" నిలువల మీద, "ప్లాస్మా"లో (రక్తంలో) ఉన్న "ట్రిప్టోఫ్యాన్" నిలువలమీద ఆధారపడి ఉంటుంది. "ప్లాస్మా"లో "ట్రిప్టోఫ్యాన్" అధికంగాఉంటే మెదడులోకి "ట్రిప్టోఫ్యాన్" ప్రవేశించి "సెరటోనిన్" రూపొందడానికి అవకాశమిచ్చి క్రియాశీలతను పెంచుతుంది. ఒకవేళ "ట్రిప్టోఫ్యాన్" శాతం "ప్లాస్మా"లో పడిపోతే మెదడు క్రియాశీలత బాగాతక్కువౌతుంది. అందేమెదడు చురుకుతనం తగ్గిపోతుందన్నమాట! పిండిపదార్థాలను ఎక్కువగా తీసుకొన్నట్లయితే "ట్రిప్టోఫ్యాన్"తోపాటు, మరో ఐదు తటస్థ "అమైనో ఆమ్లాలు" కూడా ఏర్పడుతాయి. ఈ ఐదు తటస్థ "అమైనో ఆమాలు"గా "టైరోసిన్", "ఫెనైల్ అలనీన్" "ల్యూసిన్ "ఐసోల్యూసిన్", "వాలైన్" - లనుగుర్తించినారు. "సెరటోనిన్" ఏర్పడే అవకాశం "ట్రిప్టోఫ్యాన్"కు, మిగిలిన ఈఐదు తటస్థ "అమైనో ఆమ్లాల" కూ -మధ్యనున్న నిష్పత్తిపై ఆధారపడి ఉంటుంది. ఈ నిష్పత్తి ఎక్కువైతే (అంటే "ట్రిప్టోఫ్యాన్" ఎక్కువగాఉంటే) "సెరటోనిన్" రూపొందుతుంది. ఒకవేళ "సెరటోనిన్" శాతం మరీఎక్కువైతే తటస్థమైనో"అమ్లాల"కు "ట్రిప్టోఫ్యాన్"కు మధ్యఉన్న నిష్పత్తిని నియంత్రించేందుకు వీలుగా పిండిపదార్థాలను తీసుకోవడమనే చర్యను అరికట్టడం జరుగుతుంది. అంటే "సెరటోనిన్" ఎక్కువగాఉంటే, పిండిపదార్థాలను తీసుకోవడం మనకు మనమే తగ్గించివేస్తామన్నమాట. పైపెచ్చు "ప్రొటీన్"లను ఎక్కువగాతీసుకొంటాము!"ఫెన్ఫ్లూరమైన్" (ఇది "సెరటోనిన్" తయారీకి వినియోగపడుతుంది.) "ఇంజక్షన్" ఇచ్చిన ఎలుకలు ఎక్కువ పిండిపదార్థాలున్న ఆహారాన్ని (ఇందులో ఐదుశాతం మాత్రమే"ప్రొటీన్"లు ఉన్నాయట!) తీసుకోవడం బాగా తగ్గించి నలభైఐదుశాతం "ప్రొటీన్"లున్న పిండిపదార్థాలను తీసుకోవడం గమనించినారు. కాబట్టి "సెరటోనిన్", పిండిపదార్థాలున్న పోషణపై "ఫీడ్‌బ్యాక్ ఎఫెక్ట్"ను చూపెడుతుందని అర్థమౌతుంది. "ట్రిప్టోఫ్యాన్" పిండి పదార్థాలవల్ల, మాంసకృత్తులవల్ల ఏవిధంగా రూపొందుతుంది. ఆ "ట్రిప్టోఫ్యాన్" నుంచి "సెరటోనిన్" ఏ విధంగా ఏర్పడుతుందన్నది. ఈక్రింది రేఖాచిత్రంలో **విశదపరచాను**

1 మెదడు పనితీరుపై పోషకపదార్థాల ప్రభావం!




"టైరోసిన్" "అమైనో ఆమ్లం", "ప్రొటీన్"ఎక్కువగా ఉన్న పదార్థాలలో ఎక్కువగా ఉంటుంది. ఈ "అమైనో ఆమ్లం", రక్తపీడనాన్ని నియంత్రించే "క్యాటక్యాలమైన్ ట్రాన్స్‌మిటర్" లను ఏర్పరుస్తుంది. ఈ "టైరోసిన్" ద్వారా రూపొందే "నార్ ఎపినెఫ్రైన్" మెదడు క్రియాశీలతపై ప్రభావాన్ని చూపి, దానిద్వారా వెన్నుపామును

కదిలించి - రక్తనాళాల సంకోచ వ్యాకోచాలను, రక్తప్రసరణ తీవ్రతను నియంత్రిస్తుంది. ఫలితంగా రక్తపీడనస్థాయి అదుపులో ఉంటుంది. ఈ విధంగా "టైరోసిన్" ద్వారా రక్తపీడన స్థాయిని సదా సమాయత్త పరిచే మేధో క్రియాశీలత, మనం తీసుకొనే పరిపోషకాల ప్రభావమేనా అని అనిపించి ఆశ్చర్యంలో ముంచెత్తుతుంది. కాబట్టి ఒక విషయం నిర్దుష్టంగా తెలుస్తుంది. పరిపోషకాలవల్ల మెదడుకు చురుకుదనం కలుగుతుందేతప్ప తెలివితేటలు పెరుగదు. బహుశా చురుకుదనం వల్ల తెలివితేటలు పెరిగే అవకాశం ఉందేమో! ఇంకా నిర్ధారించ బడలేదు. రక్తపీడనాన్ని నియంత్రించడంలో "టైరోసిన్" పాత్రను ఈ క్రింది రేఖాచిత్రంలో చూపినాను. పరికించండి.




"కొలైన్" ద్వారా ఏర్పడిన "ట్రాన్స్‌మిటర్" - "అసిటైల్ ____" కండరాల సంకోచ వ్యాకోచాలను నిర్దేశిస్తుంది. ఈ నిర్దేశించడమనే ప్రక్రియ మెదడు క్రియాశీలతపైనే ఆధారపడి ఉంటుంది. "అసిటైల్ కొలైన్" స్థాయిని బట్టి, కండరాలలో నెలకొని ఉన్న శక్తి జనకాల స్థాయిని బట్టి, సంకోచ వ్యాకోచాల వ్యాపకం పెరుగుతూ తగ్గుతూ ఉంటుంది. క్రొవ్వు పదార్థాలు మనం తీసుకొనే ఆహార పదార్థాలలో ఎక్కువగా ఉన్నట్లయితే "కొలైన్" స్థాయి పెరిగే అవకాశముంది. తదనుగుణ్యంగానే "అసిటైల్ కొలైన్" స్థాయి పెరిగి, మెదడు క్రియాశీలత అధికమై నిర్దుష్టమైన సంకేతాల సమీకరణ ఎక్కువై కండరాల వ్యాపారాలను నియంత్రిస్తుంది.

ఈ విధంగా కేవలం రెండు "అమైనో ఆమ్లాల" మీద, ఒకే ఒక క్రొవ్వుపదార్థం మీద మెదడు క్రియాశీలత ఆధారపడి ఉండడం ఆశ్చర్యంగానే ఉంటుంది. మెదడుకు తగిన మేత ఉంటేనే చురుగ్గా ఉంటుందని మనమంటూ ఉంటాము. అంటే మెదడుకు పదును పెడుతూ ఉండాలని మన పరిభాష. కాని అది నిజమేనని, మెదడుకు సరియైన మేత అవసరమని తెలిసినప్పుడు, మనవారి దూరదృష్టికి, శాస్త్ర దృష్టికి జోహారు అనవలసి వచ్చింది. ఆరోగ్య ప్రమాణాలతో అలరారే పోషక పదార్థాలను పరిగ్రహిస్తూ ఉంటే మెదడు చురుకుగా పని చేయగలుగుతుంది. సమస్యలను పరిష్కరించే సంకేతాలను అందించగల పరిజ్ఞానాన్ని పొందగలుగుతుంది. అంతేకాని సృజనాత్మకమైన శక్తిని పొందలేదు. అంటే వివేచనా ప్రవృత్తి అనేది స్వతఃసిద్ధమే కాని పరిపోషకశక్తి ప్రభావం కాదని నా అభిమతం. ఇది నిజం కాకపోయినట్లయితే, ఎంతోమంది పేదవారు, మింగమెతుకు లేనివారు సృజనాత్మత శక్తిలో ఎంతో వెనుకబడి ఉండేవారు. పరిపోషకాలు దైహికపరమైన సమస్యలకు సంబంధించినంతవరకు మెదడుకు పరిజ్ఞానాన్ని అందిస్తాయి. అద్భుతమనిపించే సృజనాత్మకశక్తికి, సంస్కారబద్ధమైన వివేచనా శక్తికి, పరిపోషక ప్రభావంతో పనిలేదని తెలుస్తుంది. కాబట్టి సునిశిత మేధోపరిజ్ఞానం కేవలం పరిపోషకశక్తి ప్రభావమే అని భావించే శాస్త్ర భావనలో శాస్త్రీయత ఎంతమాత్రమూ లేని అవాస్తవిక ధోరణి ఉన్నదని విజ్ఞులు తెలుసుకోవలె!

వాస్తవ దృక్పథంలో విషయాన్ని తరచి చూడవలె!

# పుణ్యభూమి

## శ్రీ చల్లా రాధాకృష్ణశ

పావన గంగా సలిలాలు
ప్రవహిస్తున్నందుకే కాదు
అన్నపూర్ణా విశ్వేశ్వరులు
ఉన్నచోటనే కాదు
తులసీమానస మందిరం
వెలిసినందుకే కాదు__
చిక్కని పాలూ కమ్మని పెరుగూ
సమృద్ధిగా దొరుకుతున్నందుకు
నవనవలాడే కాయగూరలు
పుష్కలంగా లభిస్తున్నందుకు
రకరకాల పళ్లు ఫలాలు
కనులవిందు చేస్తున్నందుకు

విగ్రహపుష్టి సంతుష్టి కలిగి
మనుషులు మసులుతున్నందుకు
అన్నిశాస్త్రాలకూ, భాషలకూ
ఆటపట్టుఅయినందుకు
పుట్టింటికి దూరంగా ఉన్నా
పెద్దపీట తెలుగుకి లభించినందుకు
తులసిదాస మాలవీయాది
అలఘు చరిత్రుల కార్యరంగమైనందుకు
కాశీనగరం పుణ్యభూమి
నిజంగానే పుణ్యభూమి !

# 'అ'శోకపది

## శ్రీ ముక్కామల వెంకటేశ్వరరావు

ఆరని జ్వాలా
మాయని వెలుగూ
ఆగని రాగం
ఆపని వూపూ
అందని చూపూ

చావని చేవా
అతనివి కావా ?
'ఆం' తనివి తీరాయా ?
తెలుగు సాహితిలో
చెరగని సిరా శ్రీశ్రీ.



నేను ఆ థర్మల్ పవర్ స్టేషన్ సూపరింటెండింగ్ ఇంజనీర్‌గా ... ఆ అరణ్యం నడుమ జీవితాన్ని గడుపబట్టి రెండు సంవత్సరాలైంది. మొదట్లో ప్రభుత్వం ఆ ప్రాజెక్ట్ కార్యభారాన్ని నాకు వప్పజెప్పి అక్కడికి పంపినపుడు దట్టమైన అడవీ, దూరంగా సువిశాలమైన నదీపాయ తప్పితే ఏదీ కనిపించేది కాదు. చుట్టూ కొండలే నేస్తాలు. ఆ ఏడాదంతా వేలమంది కూలీలు నా సహచరులు .... కొద్దిమంది ఇంజనీరింగ్ స్టాఫ్, మినిస్టీరియల్ సిబ్బంది పాలనా విభాగంలో నాతోపాటు ఉండేవారు. సరియైన ఇండ్లుగానీ, వసతిసౌకర్యాలు గానీ ఉండేవికావు. ఎక్కడున్నామన్న ధ్యాస ఉండేదికాదసలు. ... ఎప్పుడు ప్లాంట్ తయారవుతుందా ... ఎప్పుడు కమీషనింగై విద్యుత్తు ఉత్పత్తి మొదలవుతుందా అన్నదే ధ్యాస - రాత్రింబవళ్ళ తపస్సు.

దినంలో ఎక్కువభాగం వందల వేల సంఖ్యలో దీక్షతో పని చేసే కూలీలమధ్య గడిపేవాణ్ని. హడావిడితో, ఎంతో చురుకుదనంతో, చకచకా జరిగే ఆ పని జరుగుతున్న చోట ఉంటే ఎంతో తృప్తిగా ఉండేది. ముఖ్యంగా బాయిలర్ ఎరక్షన్, చిమ్నీ ఇన్‌స్టలేషన్, కూలింగ్ టవర్ నిర్మాణం యిలాంటివి జరుగుతున్నప్పుడు ఎంతో సరదాగా ఆ

ఎత్తయిన కట్టడాల్లో ఓ కుర్చీ వేసుకుని స్వయంగా పనిని గమనించే వాడిని.

ఆ పరంపరలో –

మొదటి కూలింగ్ టవర్ నిర్మాణం జరుగుతూండగా,

దాదాపు 50 మీటర్ల ఎత్తున ... ఫైనల్ కాంక్రీట్ స్లాబింగ్ చేస్తున్నారు. నేను ఓ చోట లిఫ్ట్‌లో నిలబడి చుట్టూ చూస్తున్నాను.

కాంక్రీట్ తట్టలను కూలీలు చకచకా అందిస్తున్నారు ఒకర నుండి ఒకరికి. గ్యాప్ ఎక్కువగా ఉన్నచోట తట్టలను నెత్తిపై పెట్టుకుని అంత ఎత్తున నెమ్మదిగా వెదురు వంతెనలపై నడుస్తున్నారు.

– అప్పుడు చూశానామెను.

పాపం నిండు చూలాల్లా ఉంది. ఎంతో భారంగా నెత్తిపై తట్టను ... కడుపులో పాపను ... మోస్తూ, భారంగా అడుగులో అడుగేసుకుంటూ,

ఆమె వెనుక ఓ పన్నెండేళ్ళకూడా నిండని ఓ బాలుడు.

వాడుకూడా నెత్తిపై తట్టతో రథాన్ని లాక్కెళ్ళుతున్న ఒంటరి గుర్రంలా –

మనసు చివుక్కుమంది.

ఆమేనేమో పూర్తిగా దయనీయమైన స్థితిలో – వాడేమో బాల కార్మికుడు ... హృదయాన్ని ఎవరో పిడికిట్లో పిసికినట్టనిపించి –

కంట్రాక్టర్‌ను పిలిపించాను. అడిగితే,

ఆమెపేరు లక్ష్మి అని చెప్పాడు. భర్త ఓ పెద్ద తాగుబోతు. వీళ్ళు ఏంజేస్తారన్నది వాడికినవసరం. కావలసిందల్లా వాడికి ఈమె రోజూ పది రూపాయలీయడం. లేకుంటే గొడ్డుదెబ్బలు తినడం. ఆమె వెనుక ఉన్నది ఆమెకొడుకు బీక్యారాం. వాడిని కొండంత ఆశతో బళ్ళో చదివిస్తోందామె. ఎనిమిదోక్లాసు. ప్రస్తుతం వేసవి సెలవులు కాబట్టి వాడుకూడా అమ్మతో కూలీకొచ్చాడు. సంక్షిప్తంగా అదీ కథ.

"కాని ఆమె పాపం ఆ స్థితిలో ఇంత ఎత్తున పనిచేయడం బాగు లేదయ్యా ... మరీ పాశవికంగా ఉంది... " అని అంటున్నాన్నేను, .... ఇంతలో

"అ....మ్మామ్మామ్మా..." అని ప్రకృతి అదిరిపోయే కేక గాలినిండా అలుక్కుపోయి,

ఉలిక్కిపడ్డాను....

ఆమే...లక్ష్మి...వెదురువంతెన పైనుండి జారి నెత్తిపైనున్న తటతోసహా పడిపోయి...చూస్తూండగానే కట్టబడ్డ అనేక వెదురు స్ట్రక్చర్ అడ్డంకులను తట్టుకుంటూ, చిందరవందరై పోతూ – చటుక్కున నేలపై కూలిపోయింది.

ఆ దృశ్యం చూస్తూనే ..."అమ్మా ..."అన్న ఆమె కొడుకు బీక్యారాం గుండెలదిరిపోయే పిలుపు.

ప్రకృతి స్తంభించి...ఎక్కడివాళ్ళక్కడే శిలలై...భయం... భయం...ఎటుచూసినా భయం.

హృదయం విదారకమైపోయింది,.

కళ్ళనిండా నీళ్ళు...తత్తర...దోషిలా... ఆ ప్రాజెక్ట్‌కు నేనే అధిపతినికాబట్టి – ఆమెను నేనే చంపించినట్టు భావన.

ఆ రాత్రి...నిద్రలేదు...చెవుల్లో ఆమెయొక్క మృత్యుకేకే ...పిల్లవాని పిలుపే.

ఏంచేయాలి...

ఆ పిల్లవాడేంకావాలి...,వాడికిప్పుడెవరు దిక్కు – ఘర్షణ.... ఆమె కుటుంబానికెలా న్యాయం చేయాలి... ఆమె ఓ కాంట్రాక్టర్ క్రింద కూలీ. ప్రభుత్వానికి సంబంధంలేనిది –

ఐనా ... ఏదో ఓ విధంగా రెండువేల రూపాయలు ఆమె తరఫున బీక్యారాంకు అందేట్లు చేయగలిగేను.

శ్రీ

కాలం గడుస్తూండడం –

ఈలోగా ఛీఫ్ ఇంజనీర్‌గా ప్రమోషన్ రావడం, హైద్రాబాద్ మారడం జరిగి, మామూలు జీవన ప్రవాహంలో పడిపోయాను.

ఈరోజు – అదే థర్మల్ పవర్ స్టేషన్‌ను ఎవరో మంత్రి భారతజాతికి అంకిత మిస్తూంటే వెంట ఉంటూ నేనుకూడా వచ్చి – జ్ఞాపకాలు ...

రెండేళ్ళ సుదీర్ఘమైన జ్ఞాపకాలు.

మేం కూర్చున్న కారు అందంగా అలంకరించిన వేదిక వద్దకు చేరుకుంది. దిగగానే చుట్టూ ఎందరో అఫిషియల్స్. ఎస్. ఇ. లు, ఇ. ఇ. లు, డి. ఇ. లు, ఎ. ఇ. లు. – అన్నీ వెకిలి నవ్వులు. నమస్కా నమస్కారాలు.

ప్రభుత్వ రంగంలో పవర్‌లో ఉన్న వాడికి చుట్టూ ఉన్న మనుషులు భరించలేని స్థాయిలో సుత్తి కొడుతూంటారు. దాన్ని తల వంచి సహించక తప్పదు.

మంత్రిగారు త్వరత్వరగా స్టేషన్‌ను కమీషన్ చేసేందుకు ఏర్పాటుచేసిన స్విచ్‌ను ఆన్ చేసి వెళ్ళిపోయేందుకు హడావుడి పడిపోతున్నారు.

కాని - కమీషనింగ్‌కన్నా ముందు, ఆ పవర్ స్టేషన్ నిర్మాణంతో నాకున్న అవినాభావ సంబంధాన్ని పురస్కరించుకొని నాతో ఓ చిన్న కార్యక్రమం ఏర్పాటు చేశారు. అది ... స్టేషన్ మెషినరీ ఎరక్షన్‌లో ఉండగా, డ్యూ్య గుండె ఆగి చనిపోయిన డివిజనల్ ఇంజనీర్ శ్రీ ఎ. రామశాస్త్రిని "కర్తవ్య నిర్వహణలో కన్నుమూసిన అమర జీవి" గా ఓ పాలరాతి ఫలకంపై స్తూపానికి నిర్మింపజేసిన స్మారక చిహ్నాన్ని నేను ఆవిష్కరించడం.

సరే... ముఠా అంతా ఆ స్తూపంవేపు కదిలింది.

కార్లు దిగి...కరకరలాడే బట్టలు ... ఆంగ్ల సంభాషణలు ... సకిలింతలు ...

స్టేషన్ ఇంజనీర్ స్వాగతవచనాలు –

వేదిక అలంకరణలు –

స్మారక చిహ్నావిష్కరణ కాబట్టి ... కాస్త మౌన గంభీర వాతావరణం ఏర్పడింది.

నడుస్తున్నాను స్తూపందిక్కు .... ముందు నా పి. ఎ. దారి తీసున్నాడు.

పాలరాతి ఫలకంపై ఏర్పాటుచేసిన సిల్కు పరదాను తొల గించేందుకు సిల్కుదారాల కుచ్చులను లాగబోతూండగా ...

"ఢన్ ... " మని ఓ కాగితపు ఉండ ఫట్‌మని తుపాకి గుండులా దూసుకొచ్చి - స్తూపాన్నితాకి క్రిందపడి –

వందల, వేల తలలు చటుక్కున వెనక్కితిరిగి,

"పక్‌డో .... పక్‌డో" అరుస్తోందొక ఖాకీ డ్రెస్.

పోలీసుమంద పరుగులు తీస్తోంది.

అంతా నిశ్శబ్దం ... ప్రపంచం బ్రద్దలైపోయినట్టు బాధ.

పిల్లవాడు పరిగెత్తుతున్నాడు ... మెరుపులా ... వాణ్ణి....

వాణ్ణి ఎక్కడో చూచినట్టు గుర్తు...ఎక్కడ....ఎక్కడ !

వంగి కాగితపు ఉండను ముట్టుకోబోతూంటే - "ఆగండిసార్... అది బాంబేమో ... " అంది మరో పోలీస్ కంఠం.

తలెత్తి అతనివంక చూచి ... నవ్వి ... విచ్చుకున్న కాగితం ఉండను చేతుల్లోకి తీసుకుని – విప్పి.

"ఈ నిర్మాణంలో – ఈ దేశంకోసం అసువులు బాసిన మా అమ్మ లక్ష్మి .... కూలీ లక్ష్మి అమరజీవికాదా .... ఎక్కడుంది ఆమె స్మారకచిహ్నం – ఛీక్యారాం."

సిగ్గు .... తలలో, మనసులో ... అణువణువునా సిగ్గు –

"శహరో ... ఆ పిల్లవాణ్ని ఏమీ అనకండి. తీసుకురండిక్కడికి అరిచాను.

కూలీ లక్ష్మి పేరు రాయించాలి స్తూపంపై. లేకుంటే నేను మనిషిని కాను –

గుండెల్లో ఏదో ఉద్వేగం .... !



# తెలుగుమీద కన్నడ ప్రభావమెంత?

సెప్టెంబరు 1983 భారతిలో శ్రీ ఆదవాని హనుమంతప్పగారి "తెలుగుమీద కన్నడభాషా ప్రభావం" అనే వ్యాసం చదివితిని.

బళ్లారి సరిహద్దులో నున్న తెలుగు గ్రామం (జొహరాపురం-ఆలూరుతాలూకా, కర్నూలుజిల్లా) లోపుట్టి, కన్నడం మాతృభాషగకలిగి తెలుగు అభిమానభాషగ కలిగి, ఇప్పుడు శ్రీ హనుమంతప్ప గారు తమ వ్యాసంలో ఉదాహరణాలిస్తున్న స్థలంలో నివసిస్తున్న నాకు ప్రకృత విషయం మీద కొన్ని తోచిన విషయాలు వ్రాస్తాను.

కన్నడతెలుగులు సోదరీమణులు. ఎవరు అక్క, ఎవరు చెల్లెలు అనే ప్రశ్న ఇప్పుడువద్దు. కవలలు అంటే మరీబాగు.

రాష్ట్రేతరాంధ్రులసంఖ్య కోటివరకుండ వచ్చును. అందులో మూడవవంతు కర్ణాటక ప్రాంతములో నున్నారు. కాలక్రమేణ, కన్నడ భాష చాలామార్పులను చెందింది. గుర్తుపట్టలేనంతగ మారిపోయింది. ప్రాచీన కన్నడ కావ్యములిప్పుడు విద్యాధికులకే ప్రయత్నపూర్వకంగా మాత్రమే అర్థమవుతాయి. పంపకవిభారతము చదువుతుంటే తెలుగు - తమిళం మిశ్రమమా అన్నట్లుంటుంది. అందుకేకాబోలు రాజాజీ ఒకసారి తనసహజ వక్రోక్తితో ఇట్లన్నాడు: "తమిళాన్ని తెలుగు లిపిలో వ్రాస్తే అది కన్నడమవుతుంది."

తెలుగు పరిస్థితి వేరు. నన్నయ వాడిన భాషారూపమునే మనము నేటికీ వాడుతున్నాము. ఆయన పద్యాలు ఎవరికైనా చప్పున అర్థమవుతాయి. ఆమాటకువస్తే నేటి "వచనపద్యాలు" కంటే నన్నయ పద్యాలే సులభముగ అర్థమవుతాయి. భాష జీవంతము. భాషప్రవాహిని కాబట్టి తెలుగు భాష అభివృద్ధిచెందలేదని కాదు. ఆధునిక శాస్త్రములు వ్రాయుటకు భారతీయభాషలలోకెల్లా తెలుగు అనువయినదని 1956లో జె. బి. ఎస్. హాల్డేన్ అన్నాడు. దీనినిబట్టితెలుగు భాషాభివృద్ధి తేటతెల్లమవుతున్నది.

కన్నడంలో నేడు పంపకవి మాదిరి పద్యాలు వ్రాసేవారినీ, వ్రాస్తేచదివి అర్థంచేసుకొనేవారిని కర్ణాటకరాష్ట్రంలోఅరుదుగాచూస్తాము. అదే ఆంధ్రలో నేడు నన్నయమాదిరి పద్యాలు వ్రాసేవారూ వున్నారు, వాటిని ఆదరించేవారూ వున్నారు. కన్నడభాష "మాడర్నైజ్" అయింది. ఇంగ్లీషు-వలె తెలుగు అభివృద్ధి అయింది-ఇటాలియన్ వలె. అందుకే కన్నడ తెలుగులు రెండునూ అజంత భాషలైనా, తెలుగుకే "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్" అను ప్రశస్తివచ్చింది. ప్రాచీన కన్నడ కవులు ఛందో విషయంలో చాలా వైవిధ్యం చూపినారు. మనం తెలుగులో వాడే వృత్తములు వారువాడినవే. పంప,రన్న వంటి కవుల పద్యములు నన్నయ తిక్కన పద్యముల మాదిరుండగా, తర్వాతి కన్నడ కవులు "రగడ"లనీ "షట్పదు"లనీ దేశి చందస్సుల స్వీకరించి కన్నడ కవితా గాంభీర్యాన్ని నీరుగార్చివేసిరి. బసవేశ్వరాది భక్తులవి "వచనములు" -మన వచన పద్యాల వలెనే తలాతోకా వుండవువాటికి. వారి భాషమాత్రం ఇప్పటి కన్నడంవలె వుంటుంది. పంప వంటి కన్నడం పాతకన్నడం - "హళగన్నడం". ఈ హళకన్నడంలో వ్రాయుట పెద్ద యజ్ఞం అనుకొంటారు ఇప్పటి కన్నడిగులు. "రామాశ్వమేధ" అనే చిన్న కావ్యాన్ని గద్యంలో హళగన్నడలో నందళికె లక్ష్మీనారాయణయ్య ("ముద్దణ") ఈ శతాబ్ది ఆరంభంలో మారుపేరుతో ప్రచురించగా ఆ గ్రంథం ప్రాచీన మైనదని కన్నడిగులు పడిన సంబర మింతా, అంతా? తెలుగులో వున్నంత పద్యశిల్పం వేరే భారతీయ భాషలలోలేదు. తిక్కన స్త్రీపర్వంలో నున్నంత ఛందశ్శిల్పంనభూతో నభవిష్యతి. టెనిసన్ కవి "మాడ్" అనే కావ్యంలోనూ, రాబర్ట్ బ్రిడ్జెస్ "టెస్టమెంట్ ఆఫ్ బ్యూటీ" అనే కావ్యంలోనూ కొంత ఛందోవిన్యాసం గోచరిస్తుంది. ఇప్పుడుమనం వాడే గద్యవాక్య నిర్మాణం ప్రాచీన తెలుగుపద్యాలలోని వాక్యనిర్మాణంను పోలుతుంది. తిక్కన నుండి, అనంతామాత్యుని "భోజ రాజీయము" నుండి ఎన్నయినా వుదాహరణాలీయవచ్చును. కన్నడ తెలుగు లిపులు ఒకానొక కాలములో ఒకేవిధంగా వుండేవి. తర్వాత ఈ సోదరీమణులు వేర్పాటుపోయినారు. కన్నడ లిపి కొంత గజిబిజి. ఇట్లంటే కన్నడిగు లొప్పుకోరు. సహజమే కదా! అయినా నేడు "లంకేశ్ పత్రిక" లాంటి వార్తాపత్రికలు తెలుగు లిపికి సన్నిహితంగా ఉండే కన్నడ టైపులనే వాడుతున్నారు. తెలుగు కన్నడాల కేకలిపి కావలెననే వుద్యమంవుంది. 1958లో తెలుగు లిపి సంస్కరణ సంఘం ఏర్పడింది. ఆ సంఘంవారు సూచించిన సవరణలనే ఒప్పుకోము. ఇక రెండుభాషలకూ ఒకే లిపియన్న వారూ ఒప్పుకోరు. మనమూ డిటో. ఆ సంఘసభ్యులు దాదాపు అందరూ పరమపదించిరి.

మొత్తానికి కన్నడ, తెలుగులు పడుగుపేకలవలె కలిసిపోయినవి. కన్నడకావ్యాలనుగానీ, తెలుగుకావ్యాలనుగానీ పరిశీలిస్తే పరస్పర ప్రభావం అంతగా కనరాదు. "నాదుభాష నిజంబు కర్ణాటభాష" అని గర్వంగా ప్రకటించుకొన్న శ్రీనాథునిలోనూ కన్నడప్రభావం కనిపించదు. ఆయన అసాధ్యుడాయె. "కర్ణాట" పదానికి డొంకతిరుగుడు అర్థం ఇచ్చి తప్పించుకోగలడు. కన్నడదేశంవాడని శ్రీ చిలుకూరి నారాయణరావు గారంతగా వాదించిన పాల్కురికి సోమన రచనలో కన్నడభాషాప్రభావం అంతంతే. తనది 'జానుతెనుంగు' అని చెప్పుకొన్నాడు. తెలుగురాయని (మహావిష్ణువు) చే "కన్నడరాయలు" అని బిరుదుపొందిన శ్రీకృష్ణ దేవరాయల "ఆముక్తమాల్యద"లో విచిత్రపదాలున్నా కన్నడప్రభావం లేదు. ఒకభాష మాతృభాషగా గల్గినవారు ఇంకొకభాషలో రచన చేస్తే, నిజమాతృభాషా సంప్రదాయాన్ని అవలంబిస్తాడనుకోవడం సరికాదు. శ్రీ పురిపండా అప్పలస్వామి, శ్రీ ప్రకాశచంద్ర శతపథి రచనలలో ఒరియా ప్రభావంవుందా? సుప్రసిద్ధకన్నడరచయిత "బీచి" (రాయసం భీమసేనరావు), "త. రా. సు." (టి. ఆర్. సుబ్బారావు) ఆంధ్రులే అయినా వారికన్నడ రచనలలో తెలుగు ప్రభావంలేదు. కవులె వీరరాజు మైసూరు రాజ్యంలోని ఉన్నతోద్యోగి. ఆయన వ్రాసిన వచనతెలుగు భారతంలో కన్నడప్రభావంలేదు. రచయితలు తమరచనలలో అన్య భాషాపదాలనెందుకు వేస్తారనేది పెద్ద క్వొశ్చెను. తమ బహుభాషా పరిచయం చూపించడానికి కావచ్చు ఆ భాషాపదమే ఆ భావానికనువయిన దని వుండవచ్చు. ఫ్రెంచిపదం "నావ్వురిచ్" (నడుమంత్రపుసిరి) వలె. కావలిసి కొంటెతనంగా అన్యభాషాపదంవాడి, చదువరులను తికమక పెట్టేందుకయి వుండవచ్చు. తానువాడే ఫలానాపదం, నుడికారం అన్య భాషీయం అని తెలిసియుండకపోవచ్చు. పాతపదాన్ని, అన్యభాషాపదం ఆక్రమించడం అనే భాషాదౌర్భాగ్యమూవుంది. చక్కని తెలుగుదేశ్య మయిన "కీసర" అనేపదాన్ని, హిందూస్తానీపదం "జేబు" నెట్టివేసింది. ఈ "జేబు" విశ్వనాథవారినీ కొట్టివేసింది ("జేబు దొంగలు").

ఒకభాషాప్రభావం, ఇంకొకభాషమీద కవుల రచనలలో కాకుండా జనవ్యవహారంలో కనపడవచ్చు. ఇప్పుడు శ్రీ ఆదవాని హనుమంతప్ప గారి వ్యాసంలోని వివిధాంశాలపై నాయాలోచనలను వెల్లడిస్తాను అగత్యం, అసడ్డ, మెయి, సోలు...వంటి పదాలు కన్నడంవి అనే భావంతో వ్రాసినారు. ఇట్టిపదాలు కన్నడంకు, తెలుగుకు భాగస్వామ్యం అనుకొంటేసరి. ఇవీతెలుగుపదాలే. ఏవంచ మాండలికాలనుకోవచ్చును. రెండుకాని, అంతకంటె ఎక్కువకాని భాషల్లోవుండే సమానశబ్దార్థక పదాలను "కోగ్నెట్" పదాలంటారు. ప-హ, వ-బ, న-ణ, క-చ అక్షరభేదాలతో కన్నడ - తెలుగులోనున్న "కోగ్నెట్" పదాలు కొన్ని వేల సంఖ్యలోవుంటాయి. ఈ సింపుల్ ట్రిక్కుతో రెండు భాష లేర్పడినాయా అనే ఆశ్చర్యం కలుగకమానదు. ఒక తెలుగుపదం కన్నడ ప్రభావంవల్ల ఏర్పడ్డది అని ఎట్లుకనుగొనేదిఅంటే ఆ కన్నడపదం తెలుగుచ్చారణలో మార్పుపొంది, ఆ కన్నడపదంలేకుంటే, ఈ తెలుగు పదం ఉండియుండదని అనిపించినప్పుడు. ఉదాహరణకు: శ్రీ హను మంతప్పగారే ఇచ్చిన కన్నడపదం "హోళి"గలే తీసికొందము. దీనికి తెలుగుకోగ్నెటు 'పోళి".కానీ రాయలసీమలోకర్ణాటకాంచలములలో ఉండే వారు"ఓళిగలు" అంటారు. ఇదీకన్నడభాషాప్రభావంఅంటే.దిగువ, నేను తెలుగుపై కన్నడ భాషాప్రభావం ఉండేకొన్ని పదముల పట్టికనిస్తాను.

పట్టిక

## కన్నడ భాషాప్రభావంగల కొన్ని తెలుగు పదములు ("కన్నడ తెలుగు")

| | కన్నడమూలం | అర్థం/ప్రయోగం |
|---|---|---|
| అండా | హండె | పెద్దకాగు |
| అక్కులు | అక్కి | బియ్యం, "అక్కుల్లు" ఇట్లు వచ్చిందే. |
| అవలక్కులు | అవలక్కి | అటుకులు |
| ఉడుగురులు | హుడుగరు | పిల్లలు |
| ఉరక్కులు | హురక్కి | ఉప్పుడుబియ్యపు బొరుగులు |
| ఓళిగలు | హోళిగి | పోళీలు |
| కబ్బినము | కబ్బిణ | ఇనుము |
| కూసు | కూసు | శిశువు, అభ్యాసము కూసువిద్య |
| కుణియు | కుణి | గంతులు వేయు, పిల్లోడు కుణుస్తా వుండాడు |
| కోసుంబరి | కోసుంబరి | నానపప్పు |
| గద్దలము | గద్దల | అల్లరి. ఇది సమాన పదమను కొంటాను. |
| గుంగాడులు | గుంగాడి | దోమలు |
| గొజ్జు | గొజ్జు | చింతపులుసు వంటకము |
| గొత్తు | గొత్తు | తెలియు, నాకు గొత్తులేదు (తెలియదు) |
| జోకుమారుడు | జోకుమార | వానవచ్చేందుకు కొలిచే క్షుద్ర దేవత |
| చౌళేకాయలు | చవుళేకాయి | గోరుచిక్కుడుకాయలు, వీనికి "మొటిక్కాయలు" రాయల సీమ మాండలికము. |

| | | |
|---|---|---|
| జోబి | జోబి | జేబు |
| ధోత్రము | ధోత్ర | దోవతి |
| పల్యము | పల్య | కూర, "పూరీపల్యం తెండి". |
| | | మనుట, "బతికి బాళరా" |
| | | ఎక్కువకాలం వచ్చు, "ఈ గుడ్డ చాలానాళ్లు బాళికి వస్తుంది" |
| బాళేపండు | బాళేహణ్ణు | అరటిపండు |
| బీగము | బీగ | తాళము |
| బుత్తి | బుత్తి | చలిది; రెండూ 'భుక్తి' తద్భవములు |
| బేకు | బేకు | కావలయును; "నాకుబేకులేదు" (నాకు కాబట్టదు) |
| బేడలు | బేళె | పప్పు |
| మొరము | మొర | చేట |
| వఘ్నరిణి | వఘ్నరిణి | తిరుగుబోత; బొరుగుల వఘ్నరిణి |
| సుమ్మనె | సుమ్మనె | ఊరక; "ఉడుగురులూ, సుమ్మనె వుండు" (పిల్లలూ, ఊర కుండండి) |
| సుడగాడు | సుడగాడు | వల్లకాడు |
| హాల్టాలు | హరటె | గప్పాలు, "హల్టాలు కొట్టేదేనా, పని ఏమయినా చేస్తారా?" |

పై "తెలుగు" పదాలను కర్ణాటకరాష్ట్ర సరిహద్దుల్లోవుండే హిందూపురం, మడకశిర, ఉరవకొండ, రాయదుర్గం, కల్యాణదుర్గం (అనంతపురం జిల్లా), ఆలూరు, ఆదవాని, (కర్నూలు జిల్లా) ప్రాంతాల్లోజనులు వాడుతున్నారు. నిజానికి తెలుగుపదాలుకావు. కన్నడభాషారూపాలీ స్వరూపం దాల్చినాయి. కన్నడంరాని తెలుగువాళ్ల తెలుగులోనూ, తెలుగురాని కన్నడిగుల తెలుగులోనూ ఇట్టిమాటలు దొర్లుతుంటాయి.

కొన్నిసమాన (కోగ్నేట్) పదాలు రెండుభాషల్లో అర్థచ్ఛాయల్లో భేదంకల్గిఉన్నాయి.

ఉదా : "కంపు" పదం

కన్నడం కస్తూరి అంటారు.. కానీ కన్నడకస్తూరి "కంపు" కొట్టును, కంపు పదం కన్నడంలో సువాసన అనే అర్థంలోనూ, ఇప్పటి తెలుగులో దుర్వాసన అనే అర్థంలోనూ వాడబడుతూవున్నాయి.

2. "కుడి" పదం

కన్నడంలో నీటినిమాత్రమే లేదాఏదైనా ద్రవాన్ని, గాలిని "కుడి"యుట వుంది. తెలుగులో ఘనపదార్థాన్నిసైతం "కుడి"చేదము (భుజింతుము)

3. "సుళ్ల"పదం

కన్నడంలో "సుళ్ల" అంటే అబద్ధం. తెలుగులో "సుల్లక" పదం అదే అర్థంకలిగి వుంది. సుల్లన, సుల్లోడు అనే పేర్లుగలవారున్నారు. సుల్లక పదం క్షుల్లక (నీచ) పదంనుండి వచ్చివుండవచ్చు.

4. "కళ్ల"పదం

కన్నడంలో "కళ్ల" అంటే దొంగ అని అర్థంకాగా, తెలుగులో "కల్ల" అంటే అబద్ధం అని అర్థం.

శ్రీ హనుమంతప్పగారు తమ వ్యాసంలో ఎల్లెడలా రెండురకాలైన ప్రమాదాలుచేసినారు. ఒకటి తెలుగు నుడికారాన్నీ, వాక్యాల్నీ కన్నడం నుంచి వచ్చినాయని నిరూపించబూనడం, రెండు ఇతర ఆంధ్ర ప్రాంతాల్లోని (ముఖ్యంగా సర్కారుజిల్లాలు) మాండలికాల్ని ప్రమాణ భాషగా తీసికొంటూ, రాయలసీమలోని ప్రామాణికరూపాల్ని మాండలికాలుగానెట్టివేయడం. నాఈవాక్యాలకి ఉపపత్తులు చూపిస్తాను.

## విలక్షణసంధి

నీయాకట్ల మేం షావుకార్లుకాదప్పా. "ఒకేఅర్థాన్నిచ్చే రెండు భాషల పదాల్నికలుపుట" అనే సూత్రంచేసినారు.

కన్నడపదం హాగె (అగ), తెలుగుపదం అట్ల కలిసి ఈక్రింది విధంగా సంధి అయినదట!

నీ అగ + అట్ల → నీ అగ అట్ల → నీ ఆగట్ల → నీయాగట్ల → నీయాకట్ల.

లక్షణంనుంచి లక్ష్యాన్నిసాధించడమంటే ఇదేకాబోలు!

పైని ఉదాహరణం తెలుగువాక్యమే. కన్నడం ప్రమేయమేలేదు. చూడుడు. అది రెండు విధాలుగా నిష్పన్నంకాగలదు.

1. నీ అగు అట్ల → నీ యగు అట్ల → నీయగట్ల → నీయాకట్ల.
2. నీ అట్ల → నీ యట్ల > నీ యగట్ల > నీ యాకట్ల

తెలంగాణావైపు అట్ల అనేందుకు గట్ల, ఇంత అనేందుకు గింత అనడం సర్వేసర్వత్ర చూస్తూన్నాము. పై వాక్యంలోని "కట్ల" అట్లు సిద్ధించిందే కాని వేరుకాదు.

## కిలార్థం

కన్నడ 'అంతె' అనేది తెలుగు "అట" అయినదట! 'అట ప్రాచీనకాలంనుండి కావ్యాలలోకూడ వాడబడింది (ఉదా: 'వనకన్యకనట')

## పదబంధాలు

సున్నపుకాయి డబ్బి.

కన్నడ "కాయి" అంటే డబ్బిఅంటున్నారు.

గోదావరిజిల్లావారు సైతం "పొడుంకాయి" అంటే నస్యం వేసుకొనేడబ్బి అనే అర్థంలో వాడుచుండ, కాయి=డబ్బిఅని కన్నడపదం అనడం సరికాదు.

## పద క్రమం

అప్పా అమ్మా ; క. తందెతాయి

తల్లిదండ్రులు; తె. అమ్మా నాన్న

అని ఇచ్చినారు. కన్నడంలో "తాయితందె" (అమ్మానాన్న) అనికూడా అంటాము. కావున ఈ సిద్ధాంతం చెల్లదు.

## సంఖ్యావాచకం

నూరు (శతం) పదం కన్నడప్రభావంవల్ల వచ్చిందనీ, సరిహద్దు ప్రాంతాలలో ఇన్నూరు మొదలైన రూపాలున్నాయనీ కోస్తాలో 'వంద' అనివున్నదనీ ఇంకొకసూత్రం. ఇదీ సరికాదు.

'వంద' పదం మాండలికం. 'నూరు' పదం ప్రాచీనమూ, ప్రామాణికమూ, గ్రాంథికమూ అయినట్టిది. తెలుగుశాసనాలలోనూ, మహాకావ్యాలలోనూ 'నూరు' పదమే వాడబడింది.

## వాక్యం

వాక్యాల్లో కన్నడ ప్రభావం వుంది అనడానికి ఈ క్రింది వాక్యాన్నిఉదాహరణంగా ఇచ్చినారు.

ఉదా:-

ఉరవకొండకు పోయెల్లేదా అనేదానికి కన్నడ వాక్యం ఉరవ కొండగె హోగోదిల్లా? మూలమంటున్నారు.

పైని తెలుగువాక్యం, కన్నడవాక్యంతో సమానం కావచ్చుగాక. అట్లని కన్నడవాక్యం ప్రభావితం చేసిందనడం సమంజసమా ? "హి వెంట్" అనే ఆంగ్లవాక్యం, 'వాడు పోయెను' అన్న తెలుగువాక్యం నిర్మాణం ఒక్కటే. అట్లని ఇంగ్లిషుదే ప్రభావితమయిందని యనగలరా?

ఉరవకొండకు పోయెల్లేదా? అనే వాక్య నిర్మాణం ఉరవ కొండకు పోయేదిలేదా ? అను వాక్యంతో సమానం. "పోయేది" అనే రూపం శిష్ట వ్యవహారికంలోనూ, కావ్యాలలోనూ ఉన్నట్టిదే.

ఉదా:-

"ఉండేది రాముడొకడే", "కరినేలింది హుళక్కి" ఇత్యాది. మరియూ "పోవుటలేదా?" అనే గ్రాంథిక రూపంకాబట్టి "పోయెల్లేదా?" అనేది అచ్చపు తెలుగు వాక్యమేకాని కన్నడరూపం కాదు. తర్జుమాయూ కాదు. ఇతర ప్రాంతాల్లో అయితే ఈ విధంగా వుంటుంది : ఉరవ కొండకు పోవా? అని శ్రీ హనుమంతప్ప గారన్నారు. 'ఉరవ కొండకు పోవా' అనే వాక్యసరణి 'ఉరవకొండగె హోగోదిల్లా' (క) తో గానీ, 'ఉరవకొండకు పోయెల్లేదా' (తె) తో గాని సమానంకాదు. "పోవా?" లో మధ్యమపురుష ప్రమేయం అధ్యాహార్యంగా వుంది. ఇదే వాక్యం కన్నడంలో ఈలాగుంటుంది :

ఉరవకొండగె హోగెయా?

రాయలసీమలోనూ "పోవా?" రూపంతో వాక్యాల్ని వాడుతారు.

## సర్వనామం

కన్నడంలోని 'యారు' (ఎవరు) అనే పదాన్ని యథాతథంగా వాడుతారని ఇంకొక సూత్రం. కన్నడంలో 'యారు' కు ప్రాచీన రూపం "ఆరు". తెలుగులో 'ఏరు' అనే ప్రాచీన రూపం ఉంది.

## పరిపూర్ణార్థకం

కన్నడంలో "బిడు" అనే సహాయక క్రియను చేర్చితే పరిపూర్ణార్థక మేర్పడుతుంది. దానికి సమాన పదమయిన "విడు" ఈ ప్రాంతంలో వాడబడుతుంది అంటూ శ్రీ హనుమంతప్ప గారు క్రింది యుదాహరణ మిచ్చినారు.

ఉదా:

చేసిడిసినాడు (చేసి విడిచినాడు "చేశేసాడు")

అంటే "చేసిడిసి" అనే రూపం కన్నడం నుంచి వచ్చిందనా వారి నిగమనం?

ఈ క్రియారూపం కన్నడం నుంచి వచ్చిందికాదు, రాయలసీమ సరిహద్దులోని వ్యావహారికమూ కాదు. ఇది ప్రాచీన ప్రామాణిక రూపం. గుంటూరువాడై, నెల్లూరులో వుంటూ, ఓరుగల్లు చక్రవర్తితో రాచకార్యములు నడిపిన కవి తిక్కనయే వాడినాడు.

ఉదా:-

తప్పు దనదెసలేదని చెప్పివిడిచె (మహా భా. ఉద్యోగప., ఆశ్వా. 4, ప. 7)

కన్నడం లోని "హేళిబిడు", తెలుగులోని "చెప్పివిడిచు" కు సమానం. ఇతర భాషలలోనూ ఇట్టి క్రియారూపాలు హిందీని తీసుకొందాం. "మార్‌డాలా" అనేది "చంపివిడిచె" తో సమానం.

శ్రీ హనుమంతప్పగారిచ్చిన లక్ష్య లక్షణాలను పరిశీలిస్తే తెలుగుపై కన్నడభాషా ప్రభావం దాదాపు లేనట్లేలెక్క.

కన్నడ తెలుగు లొకే యింటి యాడపడుచుల్లాంటివి. సమాంతరముగ, సమాన భాగస్వామ్యముతో పెరిగినట్టివి. సంస్కృతపదం

"జోళ" ను ఇవి ఎట్లు పంచుకొన్నాయో చూడండి: తెలుగు – జొన్న, కన్నడం – జోళ. ఒకదానిపై నింకొకటికి గల ప్రభావం అంత స్పష్టంగా ద్యోతకం కాదు. తమిళ, కన్నడ, తెలుగులు స్వతంత్రంగా తమ తమ విశిష్టతను నిల్పుకొంటూ వచ్చినాయి. తమిళం అతి ప్రాచీనం. తర్వాత కన్నడం, ఆ తర్వాత తెలుగు అనే సిద్ధాంతం సుల్లక. ఆ మాటకు వస్తే తెలుగే ప్రాచీనతమం. ఇది నేనంటున్న మాట కాదు. ఇటీవల ఒక తమిళదేశ భాషా శాస్త్రవేత్త ప్రతిపాదించిన సిద్ధాంతమిది.

తెలుగుపై కన్నడ ప్రభావం, ఉర్దూ పారశీక భాషలకన్నా తక్కువుంది. తెలుగులో ఉర్దూపర్షియన్ భాషాపదాలు ఎక్కడపడితే అక్కడ దొరుకుతాయి. ఆ భాషాపదాలు మనవే అనేటట్లు చేరిపోయినాయి. "కొత్తిమిర", "అపరంజి" వంటి మాటలే తార్కాణాలు. అట్లని కన్నడభాషా ప్రభావమే తెలుగుపై లేదా అంటారేమో? ఉన్నది. ఉచ్చారణలో, పసలో, కొన్ని కొన్ని మాటల ప్రయోగంలో సూక్ష్మ సూక్ష్మంగా వుంటుంది. ఉదాహరణాలిస్తాను. "ధని" అనే పదం వుంది. ఇది సంస్కృతం. దీనిని కన్నడంవాళ్లు యజమాని (షావుకారు) కి ఉపయోగిస్తారు. ఆదవాని లాంటి వూర్లలో తెలుగువారు కూడా యజమానిని "ధని" అని వ్యవహరిస్తారు. మావారి ఉచ్చారణలో ఇది "ఢణి" అనికూడా అయింది. ఇదీ భాషా ప్రభావమంటే. ఇంకొక విచిత్ర పదం ఉంది. అది "నౌనేపాటి". ఇది మా వూరిలోని చాలా మంది, ముఖ్యంగా కమ్మ కులస్థులు పెట్టుకొనే పేరు. నౌనేపాటి, నౌనేపాటయ్య, నౌనేపాటప్ప ఇట్లుంటాయాపేర్లు. ఈ పేర్లు కోర్టు పత్రాల్లోనూ, భూమి పట్టాల్లోనూ, పెండ్లి పత్రికల్లోనూ నమోదయి నవి. దీనికర్థమేమప్పా అని ఆ పేర్లవారి నడిగితే, "మాకు తెలియదు స్వామీ, నీవే చెప్పల్ల" అంటారువారు. ఆలోచిస్తే ఈ పేరుపై కన్నడ ప్రభావముందని తేల్చినాను. కమ్మవారు భూస్వాములు. వీరికి "నౌనేపాటయ్య" అనే కులదైవమున్నాడు. ఈ దేవత ధాన్యాధిపతి. ఇతని విగ్రహం (ఒక రాతిగుండు) నల్లరేగడి పొలంలోబయల (గుడి గోపురాలు లేక) వుండును. మా వూరిలో కొర్రలు ముఖ్యపంట. దీని కోతలు, కల్లము అయింతర్వాత రైతులందరూ నౌనేపాటయ్య దేవరను కొల్చుటకు పోతారు. రాతిగుండుపై కొర్రల్ను రాశి పోస్తారు. విందు చేసుకొంటారు. అంటే అర్థమేమి? "నౌనేపాటయ్య" ప్రియంగు (కొర్రలు) ధాన్యాధిదేవత. కొర్రలకు కన్నడభాషలో "నవణె" అని పేరు. 'నవణె' ధాన్యానికి పతి "నవణెపతి". "నవణెపతి" యే మన వారి చిత్రోచ్చారణలో "నౌనేపాటి" అయినది. 'నౌనేపాటి' పదం 'కొర్రపాడు' వంటిది కాదు. "నౌనేపాటి" దైవం. "కొర్రపాడు" గ్రామం. కన్నడ నామం "నవణెపతి", మావారి తెలుగుచ్చారణలో "నౌనేపాటి" యగుట తెలుగుపై కన్నడంయొక్క సూక్ష్మ ప్రభావం. ఇంకొక భాషపై ప్రభావం కల్గియుండుటకు కన్నడభాషపై తెలుగు ప్రభావానికి ఒక ప్రసిద్ధ ఉదాహరణ ఇస్తాను. కన్నడరాయలు శ్రీకృష్ణదేవరాయలు పరిపాలించిన ఈ ప్రాంతానికి మనం "రాయలసీమ" అని పేరుపెట్టుకొన్నాం. కన్నడిగులూ దీన్ని "రాయలసీమె" అంటున్నారు. అచ్చపు కన్నడంలోనే అయితే "రాయరసీమె" కావలెను. "ల" తెలుగుకారకం అయిననూ "రాయలసీమ" అనే పేరు అతుక్కుపోయింది. ఆలిండియారేడియోలో వివిధ భాషా వార్తా ప్రసారాల్లోనూ 'రాయలసీమ' అంటున్నారు. ఇదీ తెలుగు ప్రభావం !

రాయలసీమలో మాట్లాడే తెలుగుభాషను – ఆదొక వస్తు ప్రదర్శనశాలా నమూనాగ లేక బతికిన కాలెజిభాషలాగ, లేక ఒక అనాగరిక జనుల భాషలాగ పరిగణించడం మన నేటి విశ్వవిద్యాలయ భాషా శాస్త్రజ్ఞులకు పరిపాటి అయిపోయింది. గత నాలుగు శతాబ్దాల నుండి రాయలసీమ ప్రజలు ఆలనాపాలనా లేక, కరవులకు గురి అవుతూ, త్రాగడానికి నీళ్లలేక, విద్యాసౌకర్యాలు లేక, వాణిజ్యస్తోమత లేక చితికి చివికిపోయినారు. అట్లని వారిభాషను ఏదో హాస్యభాజనపు సరుకుగా చూడవద్దు. రాయలసీమలోని తెలుగుభాష తిక్కన, నాచన సోమన, పోతనాదికవుల ప్రయోగాలకు కాణాచి. మహాకవుల పలుకుబళ్లు ఇచ్చట సజీవంగా వున్నాయి. రాయలసీమలో "యదారు" (విచారం) అనే పదం వాడుతూ వుంటాము. ఇదే తిక్కన వాడిన "ఎదరు". భయపడు అనే అర్థంలో "యదపడె" అంటాము. దీనిని చేమకూర వేంకటకవి "ఎదవడి" అని వుపయోగించినాడు. ఇంక వాక్యనిర్మాణం చూస్తాము.

మా వూరిలో మేము స్వాములము. మమ్మల్ని అందరూ "స్వామీ ! నీవు భోంచేస్తివా ?" అని అడుగుతారు. స్వామీ ఏమిటి, నీవు అనే ఆ ఏకవచన సంబోధన ఏమిటీ అనే సందేహం వస్తుంది. కానీ తీరాచూస్తే ఇది మహాకావ్య సంప్రదాయం. కవిత్రయ భారతంలో పాత్రలన్నీ ఏకవచనంలోనే పిలుచుకొంటాయి. బహువచనంలో సంబోధన వున్నచోట ఎగతాళికై ప్రయోగించబడినట్లు స్పష్టం. అర్జునుడు ద్రుపద మహారాజును కట్టి తెచ్చి ద్రోణుని ముందర పడవేసినప్పుడు ద్రోణుడు ద్రుపదరాజును పోల్చీపోల్చనట్లు నటిస్తూ "వీరెవ్వరయ్య ద్రుపద మహారాజులె యిట్లు కృపణులై పట్టువడన్ వీరికి వలెనె యహహ" అని అంటాడు. తర్వాత నాగరికం పండినకొద్దీ బహువచనాలూ, ద్విబహువచనాలూ వచ్చినాయిలెండి.

రాయలసీమలోని మహాకావ్యభాషా వారసత్వంను తేలికగా చూడవద్దు. ఈ మహనీయ సంప్రదాయాన్ని నిలబెట్టుకొనుట ఆంధ్రుల విధి. శ్రీ ఆదవాని హనుమంతప్పగారు తమ వ్యాసంలో చివరన చెప్పిన సమగ్ర భాషానిఘంటువు, వ్యాకరణం అవసరాన్ని నేనూ సమర్థిస్తాను. మూడుపువ్వుల వలె గుబాళించిన ఆంధ్రరాష్ట్రం ఆరు కాయలుగా పండి పన్నెండుపండ్లుగా మాగవలెనని ఆకాంక్షిస్తున్నాను.




(గత సంచిక తరువాయి)

**7**

చిన్నా చాల ఉత్సాహంగా ఉన్నాడు. "మామ గురించి మీ అభిప్రాయం ఏమిటి?" అన్నాడు.

శివరావు సమాధానం చెప్పకుండా నవ్వి ఊరుకున్నాడు.

"నన్ను కూడా రోజూ ధ్యానం చెయ్యమన్నాడు !" గూడు పుఠాణీ చేస్తున్న చిన్న పిల్లవాడిలా అంటూ నవ్వాడు చిన్నా. అతని నవ్వులో ఎగతాళీ, విసుగూ, తాను అందులో చిక్కుకోనందుకు గర్వమూ ఉన్నాయి. "చాల బోధ చేశాడులెండి.... మామ మాటలు మహాబోరు. ఈచెవిలోంచీ గ్రహించి ఆ చెవిలోంచీ ఒదిలెయ్యడమే ! ...కాసేపు కళ్లు మూసుక్కూర్చుంటే అద్భుతాలు జరిగి పోతాయా? ప్రతిరోజూ తొమ్మిది గంటల సేపు కళ్లుమూసుకు నిద్రపోవటం లేదా? కావాలంటే యింకోగంట నిద్రపోవచ్చు... అయినా యిదంతా అశాస్త్రీయం!" సర్వజ్ఞుడిలా సెలవిచ్చాడు చిన్నా.

చిన్నాని చూస్తుంటే శివరావుకు నవ్వొచ్చింది. "దానికేం సమాధానం చెప్పారు?" అన్నాడు ప్రోత్సాహపరుస్తూ.

"ఏమిటో చెప్తాడులెండి!... కళ్లుమూసుక్కూర్చుని బాహ్యేంద్రియాల తాకిడిని తగ్గించేస్తే ఆలోచన మరింత సూక్ష్మమూ, తీవ్రమూ అవుతుంది. మామూలుస్థితిలో గుర్తించని అనేక విషయాలు గ్రహింపుకొస్తవి. మనస్సు స్వరూపమూ, ఆలోచనల పరిధీ,పరిమితులూ తెలుస్తవి. దాన్నుంచి జీవితంలోనూ, ఆరోగ్యంలోనూ వచ్చే మార్పులుంటవి.... ముందు ప్రయోగం చేసిచూచి, తర్వాత విమర్శించడం శాస్త్రీయం అంటూ చాలా బోధచేస్తాడులెండి! నేను వినుగనుక బ్రతికి పోతున్నాను!" అన్నాడు చిన్నా.

"మీ మామకు నీవంటే చాల యిష్టం !.... నిన్నుకూడా తన లాగా మార్చెయ్యాలని చూస్తున్నాడు!" అన్న శివరావుమాటల్తో యిద్దరూ హాయిగా నవ్వేశారు!

బస్సు 'అంగళ్లు' మీదుగా గుర్రంకొండ వేపు పరుగెడుతుంటే అక్కడి ప్రకృతి సౌందర్యంతో పాటుగా ఏవిధమైన మార్పునీ ప్రగతినీ ఎరుగని ఆ ప్రాంతపు స్థితి శివరావును కదిలించింది. కట్టూ, బొట్టూ, మాటా, తీరూ, తిండికోసం,నీళ్లకోసం కేవలం ప్రకృతి దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి బ్రతికే దీనస్థితీ—ఏటక్కటి బ్రిటిషువారి కాలం తర్వాత ఏమీ మారలేదు ఈ తాలూకాల్లో!

"ఇరవయ్యో శతాబ్దపు నాగరికత అందిస్తున్న సంపద, అవకాశాల్లో తమకు వాటా దక్కటంలేదని, ముప్ఫైఅయిదేళ్లస్వాతంత్ర్యం తమ కష్టాల్ని గుర్తించలేదని వెనుకబడిన ప్రాంతాల నాయకులు అప్పుడప్పుడూ దుమారం రేపటం వినిపిస్తుంది. సంపన్న ప్రాంతాల వారు తమకింకా తీరవలసియున్న అవసరాలను గుర్తించి, సరిచేసుకుంటూనేవుంటారు. కాని ఈ ప్రాంతాల గురించి ఎప్పుడూవినలేదు!... మీకు సరియైన నాయకులు లేనట్లుంది! దేశంలో వస్తున్న ప్రగతి, పరిణామాల గురించి యిక్కడ స్పృహ కూడా లేనట్లున్నది! ఎంత అల్ప సంతోషులు!" అన్నాడు శివరావు.

చిన్నా కొంచెంసేపు మౌనంగా వుండిపోయాడు. "రాజకీయ వ్యవస్థ పుచ్చిపోయింది! మా పరిస్థితి మారదండీ! ఎవరికి చెప్పుకున్నా జరిగేదేమీ వుండదు ! భుజబలం లేదు" అన్నాడు నిర్వికారంగా ముఖం పెట్టి.

ఆ సమాధానంతో ఆ సమస్యను గురించిన తన బాధ్యత తీరిపోయినట్లుగా వెంటనే ఉత్సాహం పుంజుకున్నాడు. "మీరు చదివింది మనస్తత్వశాస్త్రం కదా... భౌతిక శాస్త్రం గురించి ఎన్నో విషయాలు తెలుసుకున్నారు!" అన్నాడు.

శివరావు చిన్నాని పరికించి చూచాడు...ఈ చిన్నాలోనే కాదు; యిక్కడి మనుష్యులందర్లోనూ - యీ వాతావరణంలోనే ఒక విచిత్రమైన స్తబ్ధత వున్నది! ఈ స్తబ్ధత జీవితానుభవంలో వాళ్లు పొందుతున్న తృప్తి నుంచీ అనుభవిస్తున్న నిండుదనం నుంచీ వస్తున్నదా లేక అది కేవలం ప్రయత్న రాహిత్యమా? అనుకున్నాడు. తిండీ, నీళ్లూ, నెత్తిమీద ఏదో ఒక కప్పువుంటే ఆపైన దేని కోసమూ ఆరాటపడరు వీళ్లు! అల్పసంతోషులు! ఇది అభినందించవలసిన విషయమా లేక అభిశంసింపవలసిన విషయమా? అన్న విషయం అతడు తేల్చుకోలేదు. 'కారణం ఏదైనా, ఇక్కడ మానవ ప్రయత్నంలో నమ్మకమూ, ముందుకెళ్లాలన్న ఊపూ కొరవడ్డవి!' అనుకున్నాడు.

చిన్నా అడిగిన ప్రశ్నకు చిరునవ్వు నవ్వుతూ "నా అభిమాన విషయం మనిషి-అతని సాఫల్యమూ, ఆనందమూను! ఇప్పుడు తత్త్వశాస్త్రం, మనస్తత్వశాస్త్రం, జీవశాస్త్రాలేకాదు-భౌతిక శాస్త్రంకూడా వాటితో కలిసి ఒకే త్రాటిమీదకు వస్తున్నది. ఆ కొసన అన్నీ మనిషి తత్త్వానికి అద్దంపట్టేవే అయిపోతున్నవి...విద్యావంతులైన యువకులు క్లాసులో చెప్పబడే పాఠాలు మాత్రమే కాకుండా తెలుసుకోవలసినవి చాలా విషయాలున్నవి— మీమామ చెప్పినట్లు!" అన్నాడు.

చిన్నాకొంచెంసేపు ఆలోచించాడు. "భౌతికవాదాన్ని గట్టిగా పట్టుకోవటమే శరణ్యం మనుషులకు. దాన్నిదాటి భావవాదాల్లోకి అడుగుపెట్టామా, అంతేసంగతులు! ఎక్కడ తేల్తామో చెప్పలేము! మనకితెలియకుండానే బోడిగుండ్లు కొట్టించేసుకుని, కాషాయ గుడ్డలు కట్టుకొని, 'హరేరామ, హరేకృష్ణ' అంటూ ఎగరటం మొదలెడతాము! ఏ బాబాగుంపులోనో, భక్త సమాజంలోనో భజనలు చేస్తూ జీవిత శేషాన్ని గడిపెయ్యాలని ప్రయత్నిస్తాము!... ప్రమత్తతో వుండటం చాలా ముఖ్యం!" అన్నాడు గట్టిగా.

శివరావు నవ్వాడు."ఆలోచించడానికే భయపడితే ఎట్లాగయ్యా! జీవితంలో తాను ఎదుర్కొంటున్న సమస్యలకూ, చేస్తున్నపనులకూ, పొందుతున్న అనుభవాలకూ- ప్రపంచంలో మనిషి తాను చూస్తున్న విషయాలన్నిటికీ_అర్థం చెప్పగల ఒక సమగ్ర సిద్ధాంతం, ఒక దృక్పథం ఏర్పరచుకొంటేనే మనసుకు తృప్తి దొరుకుతుంది... నేనూ ఆలోచిస్తాను; కాని అందువలన నీవు భయపడ్తున్న పనులేవీ చెయ్యటంలేదు ! ...భావము, అతీంద్రియత అన్నవాటిని చూసి ఝడుసుకుంటే మనిషికి ఎదుగుదల ఎలావస్తుంది? శామ్యూల్ అలెగ్జాండర్ అని ఇరవయ్యో శతాబ్దపు బ్రిటిష్‌తత్వవేత్త ... "

శివరావు మాటల్ని మధ్యలోనే తుంచేసాడు చిన్నా. "మీరు యిప్పుడున్నట్లే లౌకికవాదిగా యిహముందు కూడా వుంటారని గ్యారంటీ ఏమీలేదు!" అన్నాడు.

తాము దిగవలసిన ఊరు రావటంతో మాటలాపి బస్సు దిగారు. శివరావు రామిరెడ్డి యింటివైపు బయల్దేరాడు. రెడ్డెమ్మ యింట్లో యివ్వవలసిన వస్తువులు పట్టుకుని తోట్లోరిపల్లెకు వెళ్ళాడు చిన్నా.

అది నాలుగోరోజు. మధ్యాహ్నం చిన్నకునుకు తీసి ఉత్సాహంగాలేచాడు శివరావు. టీతాగి రెడ్డెమ్మ గుడిసె కేసి నడిచాడు. రెడ్డెమ్మ అతని మనసులో రేపిన అలజడికీ, ఆ పిల్ల విచిత్ర ప్రవర్తనకూ కారణం కనుక్కోవాలనుకున్నాడు.

ఆ కోవెల దగ్గర ఆ అమ్మాయి కన్పిస్తుందని అతనికి నమ్మకం తోచింది ఎట్లాయినా ఈ సమస్య అంతు తేల్చాలని నిశ్చయించుకున్నాడు.

అతను ఊహించినట్లుగానే దోవ మలుపుదగ్గర రెండడుగులు ముందుగా నడుస్తూ కన్పించింది రెడ్డెమ్మ. క్రిందటిసారి కలుసుకున్నప్పుడు ఆమె వింత ప్రవర్తనకు కారణమేమిటని సూటిగా ప్రశ్నించాడు శివరావు.

రెడ్డెమ్మ అతన్ని తీక్షణంగా చూచింది. "నవాబుకి రెడ్డెమ్మ ఎవరో తెలుసుకోవాల్సిన అవసరం లేదు ! కాని శివరావుకి ఆ అవసరం వచ్చింది. సమాధానం చెప్పమంటావా ? నేనెవర్నంటావా ? ...నీవు రాక్షసుడివైనప్పుడు నీ చేత బాధింపబడిన కన్యకనునేను ! నీవు

మనిషివైనప్పుడు నీవుకొలిచేదేవతను నేను ! నీవు దేవుడివైనప్పుడు నేను నీ దేవేరిని ! నీవు ఈశ్వరుడివైనప్పుడు నీలో లీనమైయుండే శక్తిని నేను !... ఇప్పుడుతెలిసిందా, నేనెవరినో?" తీవ్రంగా అన్నది రెడ్డెమ్మ.

జుట్టువిరబోసుకుని, వేపమండలుపట్టుకుని ఊగటంలేదుగాని మాటల్లోని లయ, ముఖంలోని తీక్షణతా, స్వరంలోనితీవ్రతా కొట్టొచ్చి నట్లుగావున్నవి.

శివరావుకి మనసుచెదిరిపోయింది. ఆ అమ్మాయి మాటలు అబద్ధం గానూ, నిజంగానూ కూడాతోస్తున్నవి...ఆమెతో మాట్లాడిన ప్రతిసారీ అతను ఓడిపోతూనే వున్నాడు !

"అనంతకాలాల్లోనూ నువ్వు నాతోనే వుంటూ వున్నావన్నమాట! ...ఇప్పుడూ నీవునాకోసమే పుట్టావా?" అన్నాడు నీరసంగా. అతను వెయ్యాలనుకున్నప్రశ్న అదికాదు...

రెడ్డెమ్మచిరునవ్వుతో తలూపుతూ "అవును! నీకోసమే పుట్టాను! రావణాసురుని చేతచిక్కిన వేదవతి దగ్ధమైపోయింది, కానీ సీతగామళ్లీ వచ్చింది...ఒక్కసారి ఏర్పడ్డ కర్మబంధం కరిగి భగవంతునిలో లీనమవ్వాలి., తప్పదు!" అన్నది.

ఆ మాటల్లోని భావం శివరావుని అప్రతిభుణ్ణి చేసింది. తనకూ, ఆ కాలపు నవాబుకూ ఏమీ సంబంధం లేదని యీ రెడ్డెమ్మకు ఎలా చెప్పాలో అతనికి అర్థం కాలేదు.

"నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలియటంలేదు! సీత రావణాసురుణ్ణి నాశనం చెయ్యటానికి పుట్టింది ... అయితే నన్ను నాశనం చెయ్యటం నీ లక్ష్యమా?" అన్నాడు.

అవికూడా అతననాలనుకున్న మాటలు కాదు! శివరావుకు తన మీద తనకే విసుగు కలుగుతున్నది!

రెడ్డెమ్మ నవ్వుతూ అన్నది: "నిన్ను నాశనం చెయ్యటమా?... నీవెవరు? ... నీ మూర్ఖత్వాన్ని కదిలించి, ప్రేమగా కరిగించి, ఆత్మ సాక్షాత్కారం ప్రసాదిస్తానని ఒకానొక యుగంలో మాటిచ్చాను నీకు!" ఆమె మాటల్లో కొంటెతనం తొంగిచూసింది.

వెంటనే తన మాటల్లోని మరో అర్థం తెలిసివచ్చింది. రెడ్డెమ్మ ముఖం సిగ్గుతో ఎరుపెక్కిపోయింది.

మనోహరంగా ఆ వున్న ముఖాన్ని చూస్తూ వుండిపోయాడు శివరావు. కొంతసేపటికి నిమ్మళంగా అన్నాడు: "ఆత్మసాక్షాత్కారం విషయం యింకా తెలియలేదు గాని నాలో ప్రేమ ఉదయిస్తున్నది గనుక యిదే మనకు ఆఖరు జన్మకావచ్చు!" అన్నాడు నవ్వుతూ, పరీక్షగా రెడ్డెమ్మను చూస్తూ.

కంగారుగా దూరంగా జరిగింది రెడ్డెమ్మ.

"ఇక నాటకం చాలిద్దామా?" అన్నాడు శివరావు.

"ఒక నాటకంలోనుంచీ యింకో నాటకంలోకి వెళ్లామా?" అన్నది రెడ్డెమ్మ తడుముకోకుండా.

"నిన్ను మాటల్లో ఓడించడం ఎవరికీ తరంకాదు!" అని శివరావు అంటూనే నవ్వుతూ యిద్దరూ ముందుకు నడిచారు.

టెంకాయలూ, పసుపూ, పూలూ పట్టుకుని నలుగురు యాత్రీకులున్నారక్కడ. వాళ్ళతోపాటు రామిరెడ్డి కూడా వున్నాడు.

రామిరెడ్డి శివరావునీ, రెడ్డెమ్మనీ చూశాడు. అతని ముఖంలో నవ్వులేదు, పలకరింపులేదు.

"చీకటి పడుతున్నది... ఎందుకిక్కడున్నావు ?" అన్నాడు రెడ్డెమ్మతో కటువుగా.

రెడ్డెమ్మ వెనుదిరిగి యింటివైపు వెళ్లిపోయింది.

శివరావు కోవెలదాటి, దూరంగానడిచివెళ్లి నిర్మానుష్యంగా వున్నచోట విశాలమైన ఆకాశంక్రింద కూర్చున్నాడు. మనసులో విడమరచి ఫలానాఅని చెప్పనలవిగాని ఉద్వేగం నిండిపోయింది.

ఇంక మూడురోజులతర్వాత తానిక్కడ వుండననీ; ఈ ప్రాంతంతోనూ, యిక్కడి చరిత్రతోనూ, రెడ్డెమ్మతోనూ తనకేమీసంబంధం వుండదనీ అనుకోలేకపోతున్నాడు. ముప్పైఅయిదేళ్ల జీవితంలో అతనికి చదువుతోతప్పించి నిజమైన మనుష్యులతో మమకారబంధాలేవీ ఏర్పడ లేదు ! ఇన్నేళ్లూ అతను యీ జీవితంతో, యీ ప్రపంచంతో సంబంధం లేనట్లూ, యీ లోకానికివచ్చిన అతిథిలాగానే వుండిపోయాడు...కాని యీ రెడ్డెమ్మగుండుకు వచ్చినప్పటినుండి మనస్సు స్వస్థానానికి వచ్చి నట్లు, కాలప్రవాహంలో ఎప్పుడో ఎక్కడో తప్పిపోయిన తనజీవితం లోకి తిరిగి అడుగిడినట్లు, ఇదంతా చిరపరిచితమే అయినట్లు విచిత్ర బాంధవ్యపు జ్ఞాపకాలఛాయలు మనసులోనిండి ఉక్కిరిబిక్కిరి చేశా యతన్ని. "నీ మూర్ఖత్వాన్ని ప్రేమగా కరిగించి..." అన్నమాటలూ, సిగ్గుతో ఎర్రబడినముఖమూ గుర్తుకొచ్చి నవ్వుకున్నాడు.

చీకటిపడ్డాకలేచి యింటికి బయల్దేరాడు.

యింటికిరాగానే రామిరెడ్డిఎదురుపడి ఏ ఉపోద్ఘాతం లేకుండానే "మీరిక్కడింకా మూడురోజులుంటున్నారా ?" అన్నాడు. అతని

ప్రశ్నా, అది అడిగినతీరూ స్నేహపూర్వకంగాలేవు. కోవెలదగ్గరి అతనిముఖం గుర్తుకొచ్చింది. తాను రెడ్డెమ్మతో చనువుగా వుండటం అతనికి నచ్చలేదని అనుకున్నాడు.

"అవును. ఆదివారం వెళ్లాలనే నేను అనుకున్నాను ...కాని ..." అంటూ ఆగి, "నేనిక్కడ వుండటం మీకు అసౌకర్యంగా వుంటే చెప్పండి. మరేదైనా ఏర్పాటు చేసుకుంటాను" అన్నాడు.

రామిరెడ్డి మఖావంగానే "అసౌకర్యం కాదు ...మూడురోజులే కదా.... సరే, యిక్కడే వుండొచ్చు" అన్నాడు.

ఇవాళ శివరావుకి మనస్సు కష్టపెట్టుకోవాలని లేదు. అతని మనస్సు అతని అధీనంలో లేదు...

ఆదివారం... ఆదివారం.... మూడురోజులు!.... ఆ తర్వాత? ... ఆలోచనలను బలవంతంగా మరలించుకున్నాడు.

ఇప్పుడు... ఈక్షణం.... తానిక్కడున్నాడు.... రెడ్డెమ్మవుండే యీ వూళ్లో.... అదొక్కటే నిజం! మిగతా ఆలోచనలు అక్ఖర్లేదు! అనుకున్నాడు.

అతనిమనస్సు ఆనందంతో నిండిపోయింది. కాలాని కతీతమైన ఆ పరమశాంతిలో తననుతాను యీ రెడ్డెమ్మగుండుకు అర్పించుకుని, అందులో లీనమైపోవాలన్న విచిత్రమైన ఆవేశం కల్గింది. ఈ ఆవేశంలో తన ఉనికి తనకు తెలియకుండా పోయింది. భోజనం చెయ్యకుండానే క్రమంగా సుషుప్తిలోనికి జారిపోయాడు.

## 9

'అయిదోరోజు!' అనుకున్నాడు శివరావు, వాకిట్లో నిల్చుని. అతని మనస్సు క్రిందటిరోజున కల్గిన అనుభూతి స్థాయినుంచీ తేరుకోలేదు. కాలాని కతీతమైన మరోలోకంలో విహరిస్తున్నది.

రాత్రి వానపడి నేల తడిసింది. ఎర్రని పూలతో ముద్దమందారం ఆనందభారంతో కదలలేనట్లు నిశ్చలంగా నిల్చుని వుంది. రోజారంగు పూలతో దేవగన్నేరు చల్లదనంలో మెల్లగా ఊగుతున్నది. ఇన్నాళ్ళ ఎండతాలూకు తాపాన్నీ, అలసటనూ తుడిచివేసి, యీ చల్లదనం శివరావు మనసులో తియ్యని మత్తును కలిగిస్తున్నది. అకారణమైన సంతోషం అతని మనసులోనూ, బయటాకూడా నిండి వున్నది.

ఆరోజు బయటికు కదలకుండా తను వ్రాయాలనుకున్న నోట్సు వ్రాసుకుందామని టైప్‌రైటర్ తీసిపెట్టాడు. కాని పని జరగటంలేదు.

కొంతసేపటికి రెడ్డెమ్మ ముందువాకిట్లోంచీ లోనికి రావటం కన్పించింది. ఆ పిల్ల తనదగ్గరకు తప్పక వస్తుందనీ, పలుకరిస్తుందనీ అనుకున్నాడు. ఆమె యిటువైపుకూడా చూడకుండా నేరుగా లోపలి వంటగదిలోనికి వెళ్లిపోయింది.

ఎంతోసేపు ఎదురుచూసాడు శివరావు. రెడ్డెమ్మ రానేలేదు. వెనుకవైపు వాకిలి నుంచీ వెళ్లిపోయి వుంటుందని గ్రహించాడు. అతని మనస్సు చివుక్కుమన్నది.

కొంతసేపు 'ఆ పిల్లతో నాకేం సంబంధం?' అనుకున్నాడు. 'నేను గుర్తింపుపొందిన శాస్త్రజ్ఞుణ్ణి. ఈవూరికి కేవలం వారంరోజుల పనిమీద వచ్చాను' అనుకున్నాడు.

'కేవలం వారంరోజులు!' అన్న ఆలోచన యిక్కడి అనుభవాన్నంతటినీ పరిమితం చేసి, కుంచింపజేసి ఊరట కల్గించింది.

కాని అది ఎంతోసేపు నిలువలేదు. ఏదో ఆరాటం మనసును పట్టి ఊపేస్తుంటే 'నాకేమైంది?' అనుకున్నాడు విసుగ్గా. 'రేపే తిరిగి వెళ్లిపోతేనో?' అనుకున్నాడు నీరసంగా.

ఆరోజు సాయంత్రం రెడ్డెమ్మగుండు వైపు వెళ్లాలనిపించినా వెళ్లలేదు. అక్కడికి వెళ్లి రెడ్డెమ్మ కోసం ఎదురుచూడటం, ఆ పిల్లతో మాట్లాడటం తన ఉద్దేశం కాదు! అని నిశ్చయించుకుని యింట్లోనే వుండిపోయాడు.

కాని రెడ్డెమ్మ తనలాగే ఆలోచించి కోవెలదగ్గిరకు వెళ్లకుండా యిక్కడికే వస్తుందని శివరావు అనుకోలేదు.

రామిరెడ్డిభార్య చిన్నమ్మ వెనకదొడ్లో ఆవులకు పాలుతీస్తున్నది. ఇంట్లో ఎవరూలేరు.

రెడ్డెమ్మ గజ్జెలు ఘల్లుమనిపించుకుంటూ వచ్చింది.

శివరావు ఉద్వేగంతో తలెత్తి ఆ అమ్మాయినే చూస్తున్నాడు.

అతన్నిచూసీ చూడనట్లు లోపలికి వెళ్తున్న రెడ్డెమ్మ ఆగి, మెల్లగా వెనక్కితిరిగి శివరావువద్దకు వచ్చింది.

తలవంచుకుని మెల్లగా అన్నది: "మీరు నన్ను ఒకందుకు క్షమించాలి. మీరు రెడ్డెమ్మగుండు దగ్గిరకు అపనమ్మకంతో వచ్చినట్లు మొదటిరోజున చిన్నూవాళ్లతో చెప్తుంటేవిన్నాను. నాకు ఎందుకో మిమ్మల్ని ఏడిపించాలని బుద్ధిపుట్టింది. అందువలన పిచ్చిపిచ్చిగా మాట్లాడి మిమ్మల్ని విసిగించాను. అదంతా మరచిపోండి, దయచేసి!" అన్నది.

ఇదింకో నాటకమా? అన్నసందేహం కల్గింది శివరావుకు క్షణకాలం. కాని తలవంచుకుని క్షమాపణ అడుగుతున్న రెడ్డెమ్మ ఎంతో ప్రియంగా, మనోహరంగా తోచింది.

"నేను తెలిసీ తెలియని మాటలెన్నో వాగాను. ఏమీ అనుకోకండి. ....మిమ్మల్ని చిన్నబుచ్చాలనికాదు ! ...చిన్నూ మీగురించి ఎంతో గొప్పగాచెప్పాడు ! ...నేను ఉత్త...నాకేం తెలుస్తుంది! ..."అన్నది కళ్లు పైకెత్తకుండానే.

ఈ ముగ్ధసుందరి స్తంభించిపోయిన కాలంనుంచీ వర్తమానం లోకి వస్తున్నది ! తనదైన అలౌకికజగత్తునుంచీ వాస్తవ ప్రపంచంలోకి అడుగిడుతున్నదనుకున్నాడు శివరావు.

సంతోషమూ, సంభ్రమమూ వెల్లువలా అతన్ని ముంచెత్తినై.

"రెడ్డెమ్మా, నిన్ను కలుసుకున్నప్పటినుండి నా మనసు పరిపరి విధాలైపోయింది. నా ఆలోచనలు తిన్నగా, స్పష్టంగావుండటంలేదు ! ఈస్థితినాకు అర్థంకావడంలేదు. ఏదోగాలిలో కొట్టుకుపోతున్నట్లున్నది" అంటూ ఎదురుగా టేబిల్‌మీద ఆనించివున్న రెడ్డెమ్మచేతిని తనచేతిలోకి తీసుకున్నాడు. "ఇంతవరకూ నేను నా పరిశోధనల గురించే ఆలోచించాను. అదేలోకంలో వుండిపోయాను. ...నేననుకున్నది సాధించానంటే విజ్ఞానంలో నూతన రహదారి నిర్మించినవాడినౌతాను. బాహ్య, అంతర్లోకాలను సమన్వయపరిచే యీ ప్రక్రియ నాకు కరతలామలకం కావాలన్నదే నాకోరిక — నా తపన - నాప్రార్థన ! కాని..." అంటూ ఆగాడు.

"ప్రార్థనా?..." అంటూ చిన్నగా నవ్వింది రెడ్డెమ్మ. ఆ పిల్ల నవ్వులో మామూలు కొంటెతనం తొంగిచూచింది.

శివరావు అకస్మాత్తుగా లేచి రెడ్డెమ్మను సమీపించాడు. ఆ పిల్లను గాఢంగా కౌగిలించుకుని, నలిపెయ్యాలన్న ఆవేశం అతనిలో రేగింది.

రెడ్డెమ్మ గబుక్కున అక్కడ్నుంచీ కదిలి, వేగంగా వెనుకదొడ్డి వైపు వెళ్లింది.

ఆమెవెనుకనే పరుగెట్టాడు శివరావు. అతని చేతలు అతని స్వాధీనంలో లేవు. వెర్రి ఆవేశంతో ముందుకెళ్తున్నాడు.

ఇంతలో రామిరెడ్డి భార్య చిన్నమ్మ కన్పించింది. పాలచెంబుతో లోనికి వస్తున్నది ... ఒక్క క్షణం ఏంచెయ్యాలో తెలియనట్లు నిలబడిపోయాడు. ఆవేశాన్ని అణచుకొని ముఖానికిపట్టిన చెమటను

తుడుచుకుంటూ వెనక్కి తిరిగాడు. అతని మనస్సు కల్లోలితమై. కోపంతో నిండిపోయింది.

అప్పుడే లోపలి కడుగుపెట్టిన వెంకటస్వామి పలుకరించాడు. "ఈ వేళప్పుడు యింట్లో వున్నారేమిటి? షికారు కెళ్లివుంటారను కున్నాం. ఇంతసేపూ మీగురించే మాట్లాడుకున్నాం" అన్నాడు.

శివరావు సమాధానం చెప్పలేదు. తన గురించి వాళ్ళు మాట్లాడు కున్నామన్న విషయంలో కుతూహలం కూడా లేదు. అతని మనసు నిండా రెడ్డెమ్మమీదా, ప్రపంచంమీదా విసుగూ, కోపం నిండివున్నాయి.

వెంకటస్వామి వెనుకనే చిన్నూ, రామిరెడ్డి యింట్లోకి వచ్చారు.

రామిరెడ్డికి వెనకదొడ్లో చిన్నమ్మా, రెడ్డెమ్మా కన్పించారు. అతని ముఖంలో ప్రసన్నత మాయమైపోయింది.

కుర్చీలో కూర్చుని ఎదుటిబల్లమీద కూర్చున్న తమ్ముడివైపు సాభిప్రాయంగా చూచాడు.

"మీరేమిటోళ్లు?" అన్నాడు వెంకటస్వామి శివరావునుద్దేశించి. తన ప్రశ్న అర్థంకాలేదని గమనించి "మనదేకులం?" అన్నాడు.

"నా కులం గురించిన ఆలోచన నాకులేదు. కాని మీరడుగు తున్నారు గనుక చెప్పాలి...మేము బ్రాహ్మలం."

తండ్రి ప్రశ్నకు చిన్నూ చిన్నగా గొణుక్కున్నాడు.



కొంతసేపాగి రామిరెడ్డి కటువుగా అన్నాడు: "మీరు ఆలో చించనంత మాత్రాన కులాలు లేకుండా పోవు! మా పల్లెటూళ్లలో అవి ఇలంగా, అట్లానే వున్నవి. సుగాలి, బోయ, మాల, మాదిగవాళ్లు తాకినవి మా యిళ్లల్లోకి పనికిరావు. పెళ్లిళ్ల విషయంలో ఇంకా గట్టి పట్టుబట్టున్నవి" అని.

అతని ధోరణిని శివరావు పట్టించుకోదలచుకోలేదు. శివరావు మనస్సు జరిగిపోయిన విషయంమీదే కేంద్రీకరింపబడివున్నది. అతని కిప్పుడు కొంచెం పశ్చాత్తాపం కలిగింది. 'ఆ పిల్లను అట్లా తరుము కుంటూ పోయానేమిటి?' అనుకున్నాడు విసుగ్గా. తానింతకుమును పెప్పుడూ యిలా ప్రవర్తించలేదు! ఇది తన పద్ధతికాదు!...తన అధీనంలో లేని ఏజంతు ప్రవృత్తి తన నిట్లా ఆడించింది? ఈ సంద ర్భంలో తన ప్రవర్తన హేతుబద్ధంగా లేదు; తనకు సహజంగాలేదు; సమర్థనీయంగానూలేదు! అనుకున్నాడు.

శివరావు ఊరిపేరూ, సంపాదనా వగైరా వివరాలడిగాక 'పెద్ద వాళ్ల బాధ్యతలున్నాయా? తల్లీ దండ్రీ ఉన్నారా? వాళ్లు నీ దగ్గరే వుంటారా?" స్నేహపూర్వకంగా నవ్వుతూనే, అడిగాడు వెంకట స్వామి. శివరావుకు తల్లిలేదనీ, అతనొక్కడే సంతానమనీ, తండ్రి స్వగ్రామంలోనే వుంటాడనీ విని "అయ్యో, పెద్దతనంలో ఒక్కడే వుండిపోయాడా? నీ దగ్గరుంటే సరిపోయేదిగా!" అంటూ శివరావు తండ్రిమీద సానుభూతి చూపాడు.

శివరావుకు విసుగొచ్చింది. "ఆయనకు నా అవసరం లేదు. ఎప్పుడూ లేదు. ఊళ్ళో ఆయనకు ఇల్లూ, మూడెకరాల పొలమూ ఉన్నది." అన్నాడు.

"వుంటేఏం? పెద్దతనం వచ్చాక డబ్బుంటే సరిపోతుందా? మీరు చిన్నవాళ్లు. పెద్దతనపు బాధలు మీకు అర్థంకావు! మంచీ, చెడ్డా ఎన్నో వుంటవి! అందులో ఒక్కగానొక్క కొడుకునంటు న్నావు!..."వెంకటస్వామి ఒదిలేటట్లు కన్పించలేదు.

"ఇందులో నా బాధ్యతఏమీ లేదు! నా సంపాదనతో నేను బ్రతుకుతూ ఊళ్లో ఉన్న ఆస్తి జోలికి వెళ్లనంతకాలం ఆయనకు చింత లేదు. నేనున్నా, లేకపోయినా ఆయనకు ఒకటే! తన ఓపికా, కాలమూ వార్తాపత్రిక చదివి దేశం గురించి మాట్లాడటంతోనే సరి పోతుంది...దేశంకోసం ఏంచేశాడని అడక్కండి!" అసంకల్పితంగానే తండ్రిని గురించి వ్యంగ్యపు విసుర్లు విసిరాడు శివరావు.

వెంకటస్వామి అతన్ని ఎగాదిగా చూశాడు. "ఏం మీ నాయన సరైన మనిషి కాదా? నిన్ను సరిగా చూడలేదా? పెంచలేదా?" అన్నాడు.

"పెంచాడు! ఎట్లాపెంచాడు! నాపెంపకానికి ఎప్పుడెప్పుడు ఎంత ఖర్చులయ్యాయో లెక్కలన్నీ వ్రాసిపెట్టి, నాచదువు సగంలో

వుండగా యిహతనతోనూ, తనఆస్తితోనూ నాకేమీ సంబంధంలేదని తేల్చిచెప్పాడు!" అంటున్న శివరావు గొంతులో కోపం దాగలేదు.

వెంకటస్వామి సానుభూతితో తలాడిస్తూ అన్నాడు: "మనుష్యులు రకరకాలుగా వుంటారు. మనచేతులూ, కాళ్లలోనే ఎంత భేదమో చూడు! ఎడంచెయ్యి రకంవేరు, కుడిచెయ్యిరకంవేరు. ఎడంచెయ్యి పనులువేరు! కుడిచెయ్యిపనులువేరు! గుణవంతుడుంటాడు, గుణంలేనివాడుంటాడు. మంచివాడుంటాడు, చెడ్డవాడుంటాడు. ఎట్లాటివాడైనా మనవాడు మనవాడే! పోగొట్టుకోలేముగదా! మీ చదువుకున్నవాళ్లకు యివన్నీ తెలీవు. జీవితంలో ఢక్కామొక్కీలు తినే మాలాటివాళ్లకైతే తెలుస్తవి!" అంటూ తృప్తిగా వేదాంతం మాట్లాడి, నోట్లోవూరిన వక్కాకుఎంగిలి ఉమ్మేయ్యడానికి లేచి బయటికెళ్లాడు.

ఉమ్మడికుటుంబ వ్యవస్థ వ్యక్తివికాసానికి పెద్ద గుదిబండ అని చిన్నూ దృఢవిశ్వాసం. శివరావు జీవితమూ, పరిస్థితులూవిన్నాక పెద్దవాళ్ల స్వైచ్ఛ్యానికి యిదొక ఉదాహరణగా భావించాడు. శివరావు పట్ల చాలా సానుభూతి కల్గింది. అతనెంత వివరించిచెప్పినా తనవాళ్లకు ఏమీ అర్థంకాదనీ తెలుసు. అందుకే "కాస్తఅట్లా బయటికివెళ్దాం, రండి ...చల్లగావుంటుంది" అన్నాడు.

'ఇప్పుడెందుకు...' అంటున్న వెంకటస్వామి అభ్యంతరాన్ని పట్టించుకోకుండా యిద్దరూ లేచారు, ఆ సంభాషణ అంతటితో ఆపివేస్తూ

ఇద్దరూ గుర్రంకొండవేపు కొంతదూరం నడిచారు.

"ఈ పెద్దవాళ్లున్నారే, వాళ్లబుద్ధులు అంతటా ఒకటిగానే వుంటవి! ఇందాక మీరుచెప్పారు... మీవాళ్లగురించి... మావాళ్లూఅంతే! ... అందరికీ డబ్బులెక్కలే! ..." అన్నాడు.

"ఇక్కడమీరు యింకా అంతగా డబ్బుమనుషులు కాలేదు. ఇంకాసమిష్టి కుటుంబపద్ధతి వున్నది. బూర్జువాతత్త్వం పూర్తిగారాలేదు! ...బూర్జువా మనస్తత్వంలో అనురాగాలూ, ఆప్యాయతలూ, మానవ సంబంధాలన్నీ డబ్బుకు లోబడి వుంటవి... బూర్జువా మనస్తత్వానికి డబ్బువాలదేమోనన్న భయంకూడా తోడైతే ఇహవాళ్ల సంగతి చెప్ప నక్కర్లేదు! ఆలోచనలన్నీ డబ్బుతోనే ముడిపడిపోతవి. జీవితాన్ని పూర్తిగా నిరాకరించే దర్రిద్రులైపోతారు! జీవితంలో ఎదురయ్యే మమకార బంధాల్నేకాదు, సుఖ సంతోషాలనుకూడా ప్రక్కకునెట్టివేసే మనస్తత్వం ఏర్పడుతుంది. తమజీవితాలను నిస్సారం చేసుకుంటారు. చుట్టూవుండే ప్రపంచాన్ని బీడుభూమి చేసేస్తారు!..."అతని స్వరంలో బాధ, ద్వేషం గూడుకట్టుకొని వున్నవి.

"ఈ ఆత్మీయతలూ, అనురాగాలూ, ఉత్తగాలిమాటలూ, గాలి మూటలూ! వాటివల్ల వ్యవస్థలు మారవు. బతుకులు మారవు. గుణాలు మారవు!... నాకు ఉద్యోగం లేదు. అది నా తప్పు కాదు...మా వాళ్లు పైకి ఏమీ అనరు గాని నాకు ఉద్యోగం లేదని లోపలబాధ...నేను డబ్బుల మూటలు ఇంటికి పట్టుకొస్తుంటే ఏ విధంగా చూసివుండేవాళ్లో నాకు తెలుసు!" కోపంగా అన్నాడు చిన్నూ.

శివరావు చిన్నూకి ఓదార్పు మాటలు చెప్పేస్థితిలో లేడు. అతని మనస్సు చికాకునుంచీ సర్దుకోలేదు.

రామిరెడ్డి ప్రవర్తనకీ, వెంకటస్వామి ప్రశ్నలకూ వెనుక నున్న అంతర్యం అతనికి అర్థమౌతూనే వున్నది.

కాని...

తన అధీనంలో లేని ఆవేశాలు ఒక్కోసారి తనకు భ్రమలు కల్పించినా, తన అంతరాంతరాల్ని అతలాకుతలం చేసినా తాను ఈ రెడ్డెమ్మను పెళ్లి చేసుకుని, కుటుంబ జీవితానికి కట్టుబడిపోవాలని అతను నిశ్చయించుకోలేదు! అతని మనస్సు యింకా విజ్ఞాన తృష్ణలో కూరుకుపోయే వున్నది! రాగబంధాలూ, అవి కల్పించే మాయాజాలమూ అతనిలోని విరక్తినీ, నిస్పృహనీ, కరిగించలేక పోతున్నవి!

"మావాళ్ల ధోరణి చూశారు గదా మీరు! కులం, మతం, ఆచారం అంటూ ఎంతమూర్ఖంగా వున్నారు! విజ్ఞానం ఎటువంటి పరుగులు తీసినా, కాలం ఎంతగా మారినా వీళ్లు మాత్రం తమ మూర్ఖతను గుర్తించే స్థితికి కూడా ఎదగలేదు! ఇహ మార్పు అనేది ఎప్పుడొస్తుంది?! ముందుగా దేవుడిపిచ్చి, మహాత్మ్యాలపిచ్చి ఒదిలిపోవాలి!...ఆ తర్వాతనే బుర్రలు శుభ్రపడి మార్పు వస్తుంది. ఆస్తికులంత మూర్ఖులింకెవరూ వుండరు!" చాల ఉత్సాహంగా చెప్తున్నాడు చిన్నూ.

"వాళ్ళు దేవుడంటున్నారు. మీరు దేవుడు లేడంటున్నారు. ఇంతకీ మీరందరూ కూడా ఉపయోగిస్తున్న ఆ 'దేవుడు' అన్న పదానికి అర్థం ఏమిటి? అది సర్వశక్తిమంతమైన ఒక గుణం. వాళ్ళు యీ గుణాన్ని ఒక అజ్ఞాత శక్తికి ఆపాదించి దాన్ని కీర్తిస్తున్నారు. మీరు భౌతిక శాస్త్రానికి ఆపాదించి దాన్ని కీర్తిస్తున్నారు. కాబట్టి ఒక రకంగా చెప్తే మీరందరూ కూడా ఆస్తికులనవచ్చు!" మామూలుగా తాను వివరించే, చర్చించే ధోరణిలో అన్నాడు శివరావు.

కాని ఆ మాటలకు చిన్నూకి చాల ఉడుకుమోత్తనం వచ్చేసింది.

"మీరు యిలాంటి ఊసుపోని, తలక్రిందుల మాటలు చెప్తే కుదరదు! దేవుణ్ణీ, భౌతికశాస్త్రాన్నీ ఒక్కగాటి కట్టేస్తున్నారా? ఆధునిక విజ్ఞానంలో వస్తున్న పరిణామాలకు విలువ లేదంటారా? మనిషి దేన్నీ నమ్మకూడదని మీ ఉద్దేశమా?...విజ్ఞాన శాస్త్రాలన్నీ పనికిమాలినవంటున్నారా? ... మీ మనస్తత్వశాస్త్రం, తత్వశాస్త్రం అంటే వాటి విషయం వేరు, వాటిని మీ యిష్టం వచ్చినట్లు తీసి పారెయ్యండి. కాని భౌతిక, రసాయనిక శాస్త్రాలు, సాంకేతిక పరిణామాలూ మానవజాతి ప్రగతికి ఎంతగా దోహదం చేశాయో, యీ

దేవుడు జాతిని మూర్ఖత్వంలో ముంచి ఎన్ని మోసాలకీ, దుర్మార్గాలకీ కారకుడుగా వున్నాడో మీకు తెలియదా ? ఈ విషయాన్ని కాదంటున్నారా ? ..."

చిన్నా చాల ఆవేశంతో మాట్లాడటం చూసి శివరావు సామరస్యంగా అన్నాడు : "నాది దేవుడి పార్టీ కాదని ముందే చెప్పాను. నాకుండే సంబంధం - నిజమైన శాస్త్రజ్ఞులందరి సంబంధమూ కూడా - సత్యాన్వేషణతోనే ! మానసిక చైతన్యం లోపించినప్పుడు శాస్త్ర విజ్ఞానం కూడా దేవుడిలాగా యింకో మూర్ఖత్వం అవుతుందంటున్నాను. దేవుడు అన్న పదాన్ని పట్టుకుని ప్రాకులాడాల్సిన పనిలేదు ... ఆ పాత దేవుణ్ణి పూర్తిగా ఒదిలేసి మన అభిప్రాయాలు చెప్పుకోవచ్చు! ... ఈ శతాబ్దంలోనే శామ్యూల్ అలెగ్జాండర్ అన్న బ్రిటిష్ తత్త్వవేత్త కొత్త దేవుణ్ణి నిర్వచించాడు. అతని దేవుడు నిరంతర పరిణామదశలో ఉంటాడు. పదార్థం పరిణామం చెంది దానిలో ప్రాణం పుట్టింది. ప్రాణుల క్రమ పరిణామంలో మేధ ఏర్పడి, మానసిక చైతన్యం వచ్చింది. ఈ క్రమంలో తరువాత ఏర్పడబోయేది అతీతమానసం. పదార్థదశకు ప్రాణం దేవుడు. ప్రాణికి మనస్సు దేవుడు. మనస్సుకు అతీత మానస చైతన్యం దేవుడు. అలాగ ఒకదశకు రాబోయేదశ దేవుడుగా ఉంటుంది. ప్రతి దశలోనూ తనకుఅందగల ఉన్నత దశకు చేరుకోవాలన్న ప్రేరణ నిబిడీకృతమై వుంటుంది. ఈ ప్రేరణే దేవుడని ఆయన నిర్వచించాడు. పదార్థమూ - ప్రాణీ - మానవుడూ - అతీత మానవుడూ అంటూ యిలా పరిణామ క్రమం సాగిపోతూనే వుంటుందన్నాడు. ఇలా చెప్పినప్పుడు దేవుడు అన్న పదానికి ఎవరూ అభ్యంతర పెట్టనక్కర్లేదు. మన జీవపరిణామ వాదంలో భాగమే ఇదీను ! భౌతిక వాదానికి అతీత మానస శక్తులు వ్యతిరేకం కానక్కర్లేదు !"

శివరావుకు చిన్నా సమాధానం చెప్పలేదు.

అలా గుర్రంకొండ వేపుకు నడిచివెళ్తున్న శివరావుకు రెడ్డెమ్మ కోవెల మనసులో మెదిలింది. ఆ రెడ్డెమ్మను అతీత మానసం పొందిన ప్రాణి అనుకోవచ్చునేమో ! అనిపించి తనలో నవ్వుకున్నాడు.

ఇద్దరూ కొంచెం దూరం మౌనంగా నడిచి వెనక్కు తిరిగారు.

"మీరింకా రెండు రోజులుంటారా, మావూళ్లో ?" అన్నాడు చిన్నా.

శివరావు పరధ్యానంగా 'ఊఁ' అన్నాడు.

(ఇంకా వుంది)

# ఎక్కుపెట్టిన కవిత - ఎత్తండి కాగడా

## శ్రీ బండి రాధాకృష్ణ

విశ్వమానవ కోటి గొంతుల
విప్లవ విపంచి మీటుగా,
నింగికెగసిన నిప్పుకణమై
పొంగి పొరలిన సాగరమ్మై,
గిట్టలెత్తి,
సంప్రదాయ మట్టినంతా
కుమ్మి వేసిన కోడెయై
బధిరాంధుల, బాధాతప్తుల
వ్యథా కీలల గుమ్మరించి,
ఎత్తిపట్టిన కాగడాతో
ఎక్కుపెట్టిన కవితయై,
'ఇలా తలం నిండిన
జ్వాలాతోరణపు' రూపమై
వెళ్ళిపోయావా నేస్తం
ఇదే కదా జీవిత నిష్ఠుర సత్యం.
ఎన్నెన్ని నీరవ నిశీధులు
ఎన్నెన్ని వ్యథా భరిత క్షణాలు
నీ అనంత జీవయాత్రలో
నీ మెరిసే కళ్ళలో దాగిఉన్నాయో
ఎవరికి తెలుసు ?
హరోం హర! అని,
మరో ప్రపంచపు వాకిళ్ళని
తెరవండని నాంది గీతం
పాడిన విప్లవజ్యోతీ
అందుకో నా 'లాల్ సలాం'.

## డాక్టర్ ఆర్. ఎల్. ఎన్. శాస్త్రి

# శాస్త్ర, సాంకేతిక రంగంలో నువాదకుల శిక్షణ

మానవసమాజం బహుభాషా స్వభావం కలదికావడంవల్ల అనువాదం చెయ్యడంఅనేది అతిపురాతన వృత్తులలో ఒకటి. అయితే అనువదించటమనేది ఇరవయ్యోశతాబ్దం వరకు రాజకీయపరంగా, భాషాశాస్త్ర పరంగా, సాంకేతికపరంగా శక్తిమంతం కాలేదు. అందువల్లనే ఇరవయ్యో శతాబ్దాన్ని అనువాద యుగమని కొందరు అన్నారు. భాషను ఉపయోగించి జరిపే అనేక కార్యకలాపాలలో అనువాదం ప్రాముఖ్యం వహిస్తోంది భాషాబోధన, నిఘంటునిర్మాణం, ప్రతికారచన, తులనాత్మక భాషాధ్యయనం- వీటన్నింటిలో అనువాదానికి పాత్రవుంది. అంతేకాకుండా వృత్తిరీత్యా అనువదించడం, ఒకభాషలోని సంభాషణను ఇంకోభాషలోకి అప్పటికప్పుడు అనువదించి చెప్పడం (దీనినే ఇంటర్‌ప్రిటింగ్ లేదా రిపోర్టింగ్ అంటారు), సంగ్రహపరచడం (అబ్‌స్ట్రాక్టింగ్) మొదలైన రంగాలలో అనువాద శిక్షణకు ప్రాముఖ్యం వుంది. అనువాదకులు పనిచేసే రంగాలలో వైవిధ్యం ఎక్కువగా వుండడంవల్ల ఏదో ఒక్క విధానాన్ని అనుసరించి అనువాదకులందరికీ ఒకేరకంగా శిక్షణఇవ్వటం సాధ్యంకాదు. వారువారు నిర్వహించే పాత్రలకు అనుగుణంగా వివిధ అనువాదకులకు వేరువేరు అనువాద శిక్షణ కార్యక్రమాలను రూపొందించవలసి వుంటుంది.

అనువాదప్రక్రియను బోధించడం అంత్యతక్లిష్టమైన,కష్టతరమైన, అంశం. అందువల్లనే దీనికి వుపయోగించవలసిన విధానాన్ని ఇంకా పూర్తిగా రూపొందించడం జరగలేదనే చెప్పాలి. కాని అనువాద సిద్ధాంతం, ఆచరణ- ఈ రెండింటితో సంబంధమున్నవారు ఈసమస్య చాలా జటిలమైనదని గుర్తించారు. అనువాదంచేయడం చాలామటుకు ప్రాయోగిక సమస్య. సాధారణంగా అనువాదం చేయడమేగాని దాన్ని గురించి పెద్దగా చర్చించడం జరగదు. దీనికికొంత సిద్ధాంతాత్మకమైన పరిధి కూడావుందని భాషాశాస్త్రజ్ఞులు ఇటీవలే గుర్తించారు. సిద్ధాంతం, ఆచరణ- ఈ రెండింటి సమన్వయంవల్ల మంచిఫలితాలు లభించగలవని భాషాశాస్త్రజ్ఞులు భావిస్తారు: అందువల్లనే అనువాదశాస్త్రం అనే భావన కూడా ఇటీవల కనిపిస్తోంది. పూర్వం అనువాదం కేవలం ఒకకళ అనీ దానిలో వ్యక్తిగత ప్రతిభకే ఎక్కువప్రాముఖ్యం వుంటుందనీ అనుకునేవారు. సాహిత్య సంబంధమైన అనువాదాల విషయంలో ఈ అభిప్రాయం ఇప్పటికీ సబబుగానే కనిపించవచ్చు. నిజానికికొన్ని సాహిత్య అనువాదాలు స్వతంత్ర రచనలవలెనే భాసిస్తున్నాయి. ఎందరో మహాకవులు అనేకభాషలలో రచించిన రామాయణ మహాభారతాలు అనువాదాలనడంకన్న స్వతంత్ర రచనలుగానే భావించడం జరుగుతోంది. కాని శాస్త్ర, సాంకేతిక అనువాదాల విషయంలో అట్లాగాదు. వీటిలో అనువాదకుడు మూలానికి ఎక్కువగా కట్టుబడివుండాల్సి వుంటుంది.

కొన్ని పదాల అర్థాలు, వ్యాకరణ సూత్రాలు నేర్చుకున్నంత మాత్రాన మంచి రచయిత కాలేడు. అదేవిధంగా కేవలం అనువాద సిద్ధాంతం, భాషాశాస్త్రం క్షుణ్ణంగా నేర్చుకున్నంత మాత్రాన మంచి అనువాదకుడు కాలేడు. శాస్త్ర, సాంకేతిక అనువాదాలలో కూడా సృజనాత్మకశక్తి వుండాలి.అందువల్ల అనువర్తనానికి సిద్ధాంతం జోడించినప్పుడు మంచి ఫలితాలు వస్తాయని నిపుణులు భావిస్తున్నారు. ఇంకో విధంగా చెప్పాలంటే అనువాదం సాంకేతిక విజ్ఞానం లేదా టెక్నాలజీ వంటిది. అంతేగాని కేవలం శాస్త్రవిజ్ఞానం లేదా ప్యూర్‌సైన్స్ కాదు.

అనువాదకుల శిక్షణ కార్యక్రమాన్ని రూపొందించడంలో ముఖ్యంగా పాటించవలసినది మూలభాష, లక్ష్యభాషల లక్షణాలలో వుండే పోలికలను, వ్యత్యాసాలను అవగాహన చేసుకోవడం. అనువాదానికి సంబంధించిన ఏ సిద్ధాంతమయినా సజీవభాష ఆధారంగా రూపొందవలసిందేగాని కేవలం భాషా శాస్త్రవేత్తలు సృష్టించినది గాదు. ఆచరణనుంచే సిద్ధాంతం మెరుగులు దిద్దుకుంటుంది. సిద్ధాంతంతో పరిచయముంటే ఆచరణలో నాణ్యత పెరుగుతుంది. మూలభాషలో వున్న భావాలను లక్ష్యభాషలోకి తర్జుమా చేయాలంటే మూలభాషలోని పాఠ్యాంశాన్ని ఇతివృత్తం దృష్ట్యానే కాకుండా శైలిదృష్ట్యా కూడా పూర్తిగా అవగాహన చేసుకోవాలి. ఇటువంటి అవగాహన లేకుండా

అనువాదం చేయడం సాధ్యం కాదు. ఇతివృత్తం అర్థంచేసుకోవాలంటే ఆ ప్రత్యేక శాస్త్ర, సాంకేతిక విభాగంలో పరిజ్ఞానం వుండాలి. అంటే దీన్నిబట్టి మంచి అనువాదకుడు భాషా శాస్త్రవేత్త, విజ్ఞానశాస్త్రవేత్త - ఈ రెండూ అయివుండాలి అనుకోవడం పొరపాటు. ఆచరణలో ఇది సాధ్యం అయ్యేపని కాదు. కాని అనువాదానికి సంబంధించినంతవరకు భాషాశాస్త్ర పరిచయం కొంచెం వుంటే సరిపోతుంది.

మామూలుగా ఏ అనువాదానికైనా మూలభాషలోని పదాలకు లక్ష్యభాషలోని సమానార్థకాలను చూసుకోవడం తప్పనిసరి. ఇక శాస్త్ర, సాంకేతిక అనువాదాల విషయంలో సాంకేతిక పదాల బెడద ఒకటి వుంది. మూలభాషలోని సాంకేతిక పదాలకు లక్ష్యభాషలో సమానార్థాన్నిచ్చే సాంకేతిక పదాలను వెతుక్కొని వాడవలసి వుంటుంది. కాబట్టి అనువాదకునికి సాంకేతిక పదాల స్వరూప, స్వభావాలు తెలిసి వుండడం చాల అవసరం.

పదాలకు సమానార్థకాలను చూసుకోవడం నిఘంటు స్థాయిలో జరుగుతుంది. ఇది కాకుండా వాక్యనిర్మాణం కూడా చూసుకోవాలి. మూలభాషలోని వాక్య నిర్మాణాన్ని లక్ష్యభాషలోని వాక్య నిర్మాణానికి అనువుగా మార్చుకోవాలి. ఇందులో వ్యాకరణ వ్యత్యాసాలే కాకుండా శైలికి సంబంధించిన ప్రత్యేకత లుంటాయి. శాస్త్ర సాంకేతిక అనువాదాలలో కూడా శైలిని విస్మరించడానికి వీల్లేదు. శైలి అనేది స్థిరమైనది కాదు. సజీవమైన ఏ భాషలోనైనా శైలి మారుతూ ఉంటుంది. మళ్లీ ఇందులో గ్రాంథికమని, వ్యావహారికమని వుంటాయి. ప్రాంతీయ వ్యత్యాసాలుంటాయి. అంతేకాకుండా పాఠ్యాంశాన్ని బట్టి కూడా అనువాదంలో తగిన శైలిని వాడవలసి వుంటుంది సాహిత్య సంబంధమైన పాఠ్యాంశాల శైలి ఒక విధంగా వుంటుంది. న్యాయ శాస్త్ర పాఠ్యాంశాల శైలి వేరు. సామాజిక - రాజకీయ పాఠ్యాంశాల శైలి, శాస్త్ర - సాంకేతిక విషయాల శైలి ప్రత్యేకంగా వుంటాయి. మళ్లీ వివిధ శాస్త్ర రంగాలకు శైలిలో తేడాలుంటాయి. కనుక అనువాదకుడు తాను చేసే అనువాదానికి ఏ రకం శైలి వాడాలనేది శాస్త్రీయంగా, సహేతుకంగా నిర్ధారించుకోవాలి. ఇందుకు లక్ష్యభాషలో అతనికి రచనానుభవం వుంటే మంచిది.

సిద్ధాంత దృష్ట్యా చూసినట్లయితే అనువాదంలో వున్న ముఖ్య సమస్య వివిధ భాషలమధ్య వ్యక్తం చేయడం విధానంలోనే కాకుండా భావంలో కూడా అనురూపతను సాధించడమే. అయితే ఇందులో ఒక చిక్కుంది. మక్కికి మక్కీ అనువాదం చేస్తే అసలు పాఠ్యాంశంలో వున్న స్ఫూర్తికి న్యాయం చేకూర్చలేకపోవచ్చు. అదేవిధంగా స్ఫూర్తి కోసం తంటాలుపడడంలో విషయానికి ఏవిధంగాను అన్యాయం జరగకుండా జాగ్రత్తపడాలి. ఈ సందర్భంలో ముఖ్యంగా గమనించవలసిన విషయం ఇంకోటివుంది. ఒకే వాక్యాన్ని అనేక విధాలుగా అనువదించడానికి వీలుంటుంది. అంటే అనేక ప్రత్యామ్నాయ రూపాలలోకి అనువదించవచ్చు. అటువంటప్పుడు ఈ వివిధ రూపాలను జాగ్రత్తగా పోల్చి చూసుకుని, ఆ సందర్భానికి వాటిలో ఏవి ఎక్కువ సమంజసంగా వుంటుందో నిర్ణయించుకోవలసి ఉంటుంది. ఈ నిర్ణయం తీసుకునేటప్పుడు తాను చేసే అనువాదం ఏ ప్రయోజనానికి ఉద్దేశించబడింది అనే విషయాన్ని దృష్టిలో ఉంచుకోవాలి. పాఠ్యాంశం ఉన్నత స్థాయి గ్రంథమా, జనరంజక గ్రంథమా, పత్రిక వ్యాసమా మొదలైన లక్షణాలను ఆధారంగా చేసుకొని తగిన రూపాన్ని ఎన్నుకోవాలి. అయితే ప్రతి వాక్యానికి ఈ విధంగా చేయవలసిన అవసరం వుండకపోవచ్చు.

## మంచి అనువాదం లక్షణాలు

ఇ. ఎ. నిడా అనే ప్రసిద్ధ భాషా శాస్త్రజ్ఞుడు, మంచి అనువాదానికి వుండవలసిన లక్షణాలను కింది విధంగా సంగ్రహపరిచాడు.

1. వ్యక్తీకరణ సహజంగా, సులువుగా వుండాలి.

2. అర్థం స్ఫురించాలి.

3. మూలం యొక్క శైలిని, దానిలోని ప్రత్యేకతను అనువాదంలోకి తీసుకురావాలి.

4. మూలం చదువుతున్నప్పుడు కలిగే భావాలే అనువాదం చదివేటప్పుడు కూడా రావాలి.

ఇంకో విధంగా చెప్పాలంటే మొదట్లో ఏ భాషలో రాసారో దాంట్లో అది ఏ ప్రయోజనాన్ని సాధిస్తుందో అదే ప్రయోజనాన్ని అనువాదం కూడా సాధించాలి. ఒక్క మాటలో చెప్పాలంటే అనువాదం చదవటానికి అనువాదమని అనిపించకూడదు. ఏ భాషలోకి అనువదించారో ఆ భాషలోనే మొదట్లో రాసినట్లు అనిపించాలి.

## మంచి అనువాదకుని లక్షణాలు

పైన పేర్కొన్న లక్షణాలున్న మంచి అనువాదాలు చేయాలంటే అనువాదకునికి కింది లక్షణాలుండాలి.

1. మూల భాషలోని పాఠ్యాంశాన్ని ఇతివృత్తం దృష్ట్యా, శైలిదృష్ట్యా అవగాహన చేసుకొనే శక్తి.

2. రెండు భాషానిర్మాణాల మధ్య వుండే వ్యత్యాసాల వల్ల ఉద్భవించే సమస్యలను అర్థంచేసుకునే శక్తి.

అంతే కాకుండా అనువాదకునికి తను చేసిన అనువాదాన్ని మూల్యాంకన చేసుకొనే శక్తికూడా వుండాలి. ఒక్కొక్క సమయంలో అనువాదకుడు చేసిన అనువాదం పూర్తిగా న్యాయం చేకూర్చక పోవచ్చు. అంటే మూలంలో వున్న విషయం అంతా అనువాదంలోకి రాకపోవచ్చు. దీన్నే అండర్ ట్రాన్స్‌లేషన్ అంటారు. మరికొన్ని సందర్భాలలో మూలంలోని విషయాలకన్న, భావాలకన్న అను వాదంలో ఎక్కువ వుండవచ్చు. దీన్నే 'ఓవర్ ట్రాన్స్‌లేషన్' అంటారు సాధారణంగా అనువాదం చేసేటప్పుడు అర్థంలో వచ్చే మార్పులను మూడు రకాలుగా వర్గీకరిస్తారు: 1) మూలంలో లేనిది చేర్చడం; 2) మూలంలో వున్నది లోపించడం; 3) అర్థం మారి పోవడం. వీటిని అనువాదకుడు ఎప్పుడూ మర్చిపోకూడదు. అనువాద కుడు గమనించవలసింది ఇంకోటి కూడా వుంది. అదే అనువదనీయత అనేది. అనువదనీయతకు కొన్ని పరిమితులుంటాయి. ఏ విషయా న్నైనా ఒక భాషలో నుంచి ఇంకో భాషలోకి నూటికి నూరుశాతం అనువదించడం సాధ్యం కాదని చాలామంది నిపుణుల అభిప్రాయం. కాబట్టి పాఠ్యాంశానికున్న అనువదనీయత పరిమితులలోనే ఉత్తమ అనువాదం తయారు చేయడం అనువాదకుని లక్ష్యంగా వుండాలి.

## అనువాదకుల శిక్షణకోర్సులు

అనువాదకుల శిక్షణలో ఇమిడివున్న కొన్ని సాధారణ సమ స్యలు, సాధించవలసిన లక్ష్యాలు కొంతవరకు చర్చించాము. ఇప్పుడు మనదేశంలో శాస్త్ర, సాంకేతిక రంగాలలో అనువాదకుల లోటుతీర్చ డానికి కావలసిన శిక్షణకోర్సులను గురించి ప్రత్యేకించి చర్చించడం భావ్యంగా వుంటుంది. మనదేశంలో ముఖ్యంగా రెండురకాల అను వాదాలకు ఆవశ్యకత వుంది.

1. ఇంగ్లీష్‌కాని విదేశీభాషలనుంచి ఇంగ్లీష్‌లోకి, భారతీయ భాషలలోకి ప్రామాణిక గ్రంథాలను, పరిశోధక వ్యాసాలను అనువదించటం.

2. ఇంగ్లీష్‌నుంచి భారతీయ భాషలలోకి, భారతీయ భాషలలో ఒకదానినుంచి ఇంకోదానిలోకి శాస్త్రరచనలను అనువదించడం.

## ఇంగ్లీష్‌కాని విదేశీభాషలనుంచి అనువదించడం

రష్యన్, జర్మన్, ఫ్రెంచ్ వంటి అంతర్జాతీయ భాషలనుంచి ఇంగ్లీష్ భాషలోకి అనువదించ గలిగినవారు మనదేశంలో కొంతమంది వున్నారు. అయితే చాలినంతమంది లేరు. మళ్లీవీరిలో అనువాదమే వృత్తిగా చేసేవారు కొందరు. ప్రధానంగా వేరేవృత్తులలో వుంటూ తీరికసమయంలో అనువాదాలు చేసేవారు కొందరు. రెండోరకంవారికి వారి ప్రత్యేక శాస్త్రరంగంలో మంచిప్రావీణ్యత వుంటుంది—వారు శాస్త్రజ్ఞులైతే. అయితే ఈరకం అనువాదకులలో శాస్త్రజ్ఞులు కానివారు కూడావుండవచ్చు. మూలభాషతో వీరిపరిచయం అందరివిషయంలో ఒకేరకంగా వుండదు. కొందరు విదేశాలలో విద్యాభ్యాసం చేసినవారు ఆయాదేశాలలో ఆ భాషలను బాగానేర్చుకొని వుండవచ్చు. కొందరికి విదేశీభాషలో పరిజ్ఞానం అంతంతమాత్రంగానే వుండవచ్చు. విదేశీ భాష నేర్చుకొనేటప్పుడు వచ్చేపరిమితమయిన శిక్షణతప్ప ఇటువంటి వారు ప్రత్యేకించి అనువాదంలో శిక్షణపొంది వుండకపోవచ్చు. కాబట్టి అనువాదంలో వీరికి కనీసం ఆరునెలలపాటు సిద్ధాంతపరంగాను, ఆచరణ పరంగాను శిక్షణ ఇవ్వటం వాంఛనీయం. ఈ కోర్సులు పార్ట్-టైమ్‌గా కూడా జరిపించవచ్చు. వీరిలో శాస్త్రజ్ఞులు కాని వారికి శాస్త్ర సంబంధ మైన విషయాలు, సాంకేతిక పదాల స్వరూప స్వభావాలు కూడా కొంతవరకు శిక్షణ కోర్సులో భాగంగా ప్రత్యేకించి వుండాలి.

ఇక అనువాదమే వృత్తిగా చేసేవారి సంగతి తీసుకుందాం. వీరిలో చాలామందికి విదేశీ భాషలో ప్రావీణ్యత బాగానే వుంటుంది. కాని శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానం అంతగా వుండకపోవచ్చు. అనువాద వృత్తి స్వీకరించగోరేవారికి ప్రత్యేకించి ప్రస్తుతం మన దేశంలో శిక్షణ కార్యక్రమాలేవి. విదేశాలలో వున్నాయి. విదేశీభాష అధ్యయనంలో భాగంగా అనువాదశిక్షణ కొంత వుంటుంది. కాని అది చాలదు. కాబట్టి ప్రత్యేకించి అనువాదకుల శిక్షణ కోర్సులు కొన్ని కేంద్రాలలో నెలకొల్పాలని భారతీయ వైజ్ఞానిక అనువాదకుల సంఘంవారు (ఇండి యన్ సైంటిఫిక్ ట్రాన్స్‌లేటర్స్ అసోసియేషన్) చాలాసార్లు సూచిం చారు. విదేశాలలో నడుపుతున్న కోర్సుల ఆధారంగా, ఈ కోర్సులు ఎలా వుండాలనే విషయం గురించి కొందరు ప్రముఖులు సూచన లిచ్చారు. దీనిని గురించి సవివరంగా చర్చించడం ప్రస్తుత వ్యాసంలో సాధ్యంకాదు. కాని వారి సూచనల సారాంశం పేర్కొనడం సమంజ సంగా వుంటుంది. పాఠశాల విద్యాభ్యాసం ముగించుకున్న విద్యార్థులను ఈ కోర్సులలో చేర్చుకోవాలి. వారికి ఇంగ్లీషులోను, మాతృభాషలోను పరిజ్ఞానం బాగా వుండాలి. అటువంటివారికి ఈ కోర్సు అయిదు సంవత్సరాలపాటు నడపవచ్చు. మొదటి సంవత్సరంలో ఇంగ్లీష్‌లో గాని, మాతృభాషలో గాని ఇంకా కొంత శిక్షణ ఇవ్వడమే కాకుండా ఒక విదేశీభాష, దాని సంస్కృతి, నాగరికతకు సంబంధించిన శిక్షణ కూడా ఇవ్వాలి. వీటితోబాటు భాషాశాస్త్ర పరిచయం కూడా మొదటి సంవత్సరంలో ప్రవేశపెట్టవచ్చు. రెండో సంవత్సరంలో రెండో విదేశీభాషను ప్రవేశపెట్టవచ్చు. మూడో సంవత్సరం నుంచి అను వాద శిక్షణకు ప్రాముఖ్యం పెరుగుతుంది. అభ్యాసానికి ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వాలి. ఇటువంటి కోర్సు సాధారణ అనువాదకులకు వర్తిస్తుంది. కాని ప్రత్యేకించి శాస్త్ర-సాంకేతిక అనువాదకులకు

ఈ కోర్సును కొద్దిగా మార్పుచేయవచ్చు. శాస్త్ర సాంకేతిక రంగాలలో పట్టభద్రులయిన వారిని తీసుకుని వారికి మూడు సంవత్సరాల పాటు ఒక విదేశీభాషలోను, భాషాశాస్త్ర సిద్ధాంతంలోను, అనువాద ప్రక్రియలోను శిక్షణ ఇవ్వవచ్చు. ముఖ్యంగా జపనీస్, చైనీస్ భాషలలో మన దేశంలో అనువాదకుల కొరత తీవ్రంగా వుంది. ఈ భాషల ప్రాముఖ్యం ఇటీవల అన్ని రంగాలలో పెరుగుతోంది. కాబట్టి వీటిలో అనువాదకులను తర్ఫీదు చెయ్యడానికి కోర్సులు నిర్వహించాలి. అయితే విదేశీభాషల నుంచి సరాసరి భారతీయ భాషలలోకి శాస్త్ర, సాంకేతిక అనువాదాలు చాలా స్వల్పంగా జరుగుతున్నాయి. ఎప్పుడో అడపా దడపా తప్ప అసలు ఇటువంటి అనువాదాలు లేవనే చెప్పాలి. కాని భారతీయ భాషలలో ఉన్నత విద్యావకాశాలు ఎక్కువవుతున్న దృష్ట్యా ముందు ముందు ఇటువంటి అనువాదాల సంఖ్య ఎక్కువ చేయవలసి వుంటుంది. అనువాదకులకు శిక్షణావకాశాలు కల్పిస్తే ఇందుకు దోహదం కలుగుతుంది. శాస్త్రజ్ఞులు, భాషా శాస్త్రవేత్తలు, విదేశీభాషా నిపుణులు కలిసి అన్నిరకాల కోర్సులకు పాఠ్య ప్రణాళికలను తయారుచేయాలి.

## ఇంగ్లీషునుంచి, భారతీయ భాషలనుంచి అనువాదాలు

ప్రస్తుతం మనదేశంలో ప్రతి సంవత్సరం సుమారు 70 శాస్త్ర గ్రంథాలు ఇంగ్లీషునుంచి వివిధభారతీయ భాషలలోకి అనువదించడం జరుగుతోంది. కాని ఒక భారతీయ భాషనుంచిఇంకో భారతీయ భాషలోకి శాస్త్రగ్రంథ అనువాదాలు సంవత్సరానికి పదికన్నా ఎక్కువ జరగటంలేదు. భారతీయ భాషలనుంచి ఇంగ్లీషులోకి అనువాదాలుకూడా తక్కువగానే వున్నాయి. వీటినికూడా ఎక్కువచేయవలసిన అవసరం వుంది. ఇంగ్లీషునుంచి భారతీయభాషలలోకి అనువదించడానికి అనువాదకులకు శిక్షణకోర్సులు చాలా తక్కువగా వున్నాయి. ఢిల్లీ విశ్వవిద్యాలయం వారు ఇంగ్లీషునుంచి హిందీలోకి అనువదించేవారికి ఒక సంవత్సరంపాటు జరిపే సర్టిఫికెట్ కోర్సు నిర్వహిస్తున్నారు. ఆగ్రా యూనివర్సిటీలో ఎమ్. ఎ. పట్టభద్రులకు అనువాదంలో డిప్లొమా కోర్సు నిర్వహిస్తున్నారు. ఇవి తప్ప ఇంగ్లీషునుంచి ఇతర భారతీయ భాషలలోకి అనువాద శిక్షణ కోర్సులు ఎక్కడా వున్నట్లు సమాచారం లేదు. కాకపోతే నేషనల్ బుక్ట్రస్ట్‌వారు కొన్ని వర్క్‌షాపులు జరిపారు కాని ఇవి కేవలం వారంరోజులపాటు మాత్రమే వుంటాయి. అంతే కాకుండా వీటిలో శాస్త్రగ్రంథ అనువాదానికి ప్రాధాన్యం తక్కువగా వుంటుంది. ఇటువంటి పరిస్థితిలో ఆయా శాస్త్రాలలో కాలేజీ అధ్యాపకులు, ఇతర నిపుణులు ఇంగ్లీషు నుంచి భారతీయ భాషలలోకి శాస్త్రగ్రంథ అనువాదాలు చేస్తున్నారు. సాధారణంగా వీరు తమ మాతృభాషలోకి అనువదిస్తారు. వీరికి ఇంగ్లీషులో పరిజ్ఞానం బాగానే వుంటుంది. కాని అనువాదప్రక్రియతో అనుభవం వున్నవారు చాలా తక్కువ. స్వతంత్ర రచనానుభవం వున్నవారు కూడా తక్కువగానే వుంటారు. శాస్త్రగ్రంథ అనువాదంలో ఎటువంటి శిక్షణగాని పొందినవారై వుండరు. అందువల్ల వీరు తయారు చేసిన అనువాదాలను క్షుణ్ణంగా పరిష్కరిస్తేనే గాని ముద్రణ యోగ్యంగా వుండవని మా అనుభవంలో సాధారణంగా రుజువయిన విషయం. ఈ పరిస్థితిని మెరుగు పరచాలంటే ఇటువంటి అనువాదకులకు అనువైన పార్ట్‌టైమ్ శిక్షణ కోర్సులను రూపొందించాలి. ఈ శిక్షణ కోర్సులలో ఉత్తీర్ణులైన వారికే శాస్త్రగ్రంథఅనువాదావకాశాలు ఇస్తే ఫలితాలు ఆశాజనకంగా వుంటాయి. అంతేకాకుండా ఇంకా ఎక్కువ గ్రంథాల అనువాదం చేపట్టడానికి ప్రోత్సాహకరంగా వుంటుంది.

లోగడ పేర్కొన్నట్లుగా ఒకభారతీయ భాషనుంచి ఇంకో భారతీయ భాషలోకి శాస్త్రగ్రంథం అనువాదాలు చాలాస్వల్పంగా వస్తున్నాయంటే అందుకు ఒక ముఖ్యకారణం ఇటువంటి అనువాదాలు చేయగల సామర్థ్యం వున్నవారికొరత కావచ్చు. ఇటువంటి అనువాదకులను తయారు చేయడానికి ప్రత్యేకించి కోర్సులు నిర్వహించవలసి వుంది. అయితే ఇదే వృత్తిగా చేపట్టదలచిన వారికి ఉద్యోగావకాశాలు ప్రస్తుతం లేవనే చెప్పాలి. కాబట్టి వీరికికూడా పార్ట్-టైమ్ కోర్సులు రూపొందిస్తే బాగుంటుంది. ఏరెండు భారతీయ భాషలలోనైనా పరిజ్ఞానంవుండి, శాస్త్ర, సాంకేతిక రంగాలలో పట్టభద్రులుగాని, ఇంకా ఉన్నతస్థాయిలో విద్యార్హతలున్న వారుగాని ఇటువంటి కోర్సులు తీసుకోవచ్చు.

ఉన్నతవిద్య మాధ్యమాలుగా భారతీయ భాషలప్రాముఖ్యం ఇతోధిక మవుతున్న దృష్ట్యా ఇంగ్లీషునుంచి, ఇతరవిదేశీ భాషలనుంచి భారతీయ భాషలలోకి, ఒకభారతీయ భాషనుంచి ఇంకోభారతీయ భాషలోకి శాస్త్రగ్రంథ అనువాదాలు చేయగల నిపుణులను తయారుచేయడానికి పథకాలను రూపొందించడంలో మనం ముందుచూపు ప్రదర్శించాలి. మనదేశీయ భాషలలో ఏవైనా ఉత్తమ ప్రామాణిక శాస్త్రసాంకేతిక గ్రంథాలు వస్తే వాటిని ఇంగ్లీషులోకి, ఇతర విదేశీ భాషల లోకి అనువదింపజేసి, ప్రచురిస్తే మనకి విదేశీమారకద్రవ్యమే కాకుండా పేరుప్రతిష్ఠలు కూడ వస్తాయి.

**ఆధార రచనలు** (కొన్నిమాత్రమే పేర్కొన్నాము)


1. నిడా, ఇ.ఎ. : టువర్డ్స్ ఎ సైన్స్ ఆఫ్ ట్రాన్స్‌లేషన్, 1974.
2. కాట్‌ఫర్డ్, జె. సి. : ఎ లిన్‌గ్విస్టిక్ థియరీ ఆఫ్ ట్రాన్స్‌లేషన్, 1975.
3. పాండె, ఎమ్. పి. : ట్రెయినింగ్ కోర్సెస్ ఫర్ ట్రాన్స్‌లేటర్స్, జి. స్టా. 10 : 18 – 27, 1981.
4. సురేష్‌కుమార్ : అన్ ఫండమెంటల్స్ ఆఫ్ ట్రెయినింగ్ కోర్సెస్ ఫర్ ట్రాన్స్‌లేటర్స్. జి. స్టా. 8 : 8 – 19, 1979.

# కాటికెళ్ళని శవం

వి. వి. బి. రామారావు



“దొంగ నా కొడుకులు ఆమ్యామ్యా లుచ్చేసుకుని ఫోన్ చేసేసి నారేటో- ఇంతమందొక్క సారి మూగేసినారేటి!”

“మూక మనలాంటి మడుసులే గురూ...ఆపు” క్లీనరు పోలిగాడు ధైర్యం చెప్పాడు.

డయివోరప్పారావ్ ఆపక తప్పలేదు లారీ. కిటికీలోనుంచి బుర్ర పైకిపెట్టి అడిగాడు ఓ ఆసామిని: “ఏఁటీగోల ?”

“దాణ్ణదు గురో...పెద్ద నారీ. ముందు కెళ్లేవంటే సిక్కులొడి పోతావ్... శానా బళ్లాగి పోనాయి.

"యాక్సిడెంటయ్యిందా ? పోలీసోళ్లు గాని ఉన్నారేటి ?"

"ఏటోతెల్దు... దోవలసెవం. రోడ్డుమద్దిగిలా పతున్నాది."

"నా బండి పక్కకి తీసెయ్రా !" డయివోరు దిగి ముందుకు నడిచాడు.

-"అరెరె ! ఆడమడిసి ! ఒంటిమీద గుడ్డ పీలికైనా్నేదు...గోరం ...గోరాతి గోరం !"

డయివోరు అప్పారావ్ తన గోష మరిచేపోయాడు. ఎవరి గొడవలో వాళ్లున్నారు.

'సందడి సందడి సందడియా !' గంటస్తంభం దగ్గర అరటి పళ్లమ్ముకొనే మనిషి, వాళ్ల భాషలో సందడి చేసేస్తోంది. అప్పటికే అరటిపళ్లూ, సపోటాపళ్లూ- జంగిళ్లు అక్కడా అక్కడా కనపడుతున్నాయి.

-"గురూ బొట్టి మొగ వేటలగుంది...బొట్టుచూశావా ఎలా సెదిరి పోనాదో !... కుంకంవద్ది నట్టుంది మొహం... ఎవురీవిడ?"

"ఎవురంటా ?"

"కాలేజీ పిల్ల కాదుకద !"

"ఒంటి మీద గుడ్డపీలిక నేకపోతే ఎవుదో ఎనాగ సెపుతాం!"

-ఒరదల్లో సిక్కుకున్న ముళ్లతుప్ప కంటిసీస్టూ గడ్డీ గాదరా..

"ఒయసు ఇరవై రెండుండచ్చు ..."

"ఒళ్లు చూస్తే ... ఇద్దరి పిల్లలకి పాలిచ్చిన మనిషిలా ఉంది..."

- "పోలీసులకి ఫోను చెయ్యండి ... "

కాలేజీ కుర్ర లెక్చరర్ కాబోలు - ఆ గొంతు వినపడదవేమిటీ ముకుందం ముందుకొచ్చాడు. భాషాతత్వవేత్త. పూర్వాశ్రమంలో సంస్కృత విద్వాంసుడు.

"చూడు భద్రం !"

"అయ్యా ! మీరా ? మనం చెయ్యాల్సిన పని వెంటనే చేద్దాం. పోలీసువాళ్లకి ... "

"ఇది నీ క్లాసురూం కాదు కాని ... "

"అదెలా ఉంటుందా మహానుభావా !? క్లాసుల్లో పిల్లలు కనపడి రెండు నెల్లయింది ... "

"ఆపు ! ఆపేయ్ !... నీ మాటల్లో నాదం కంటె వాదే ఎక్కువ వినబడుతోంది - అటుచూడు !"

- "కాశీపట్నం చూడర బాబూ !" అంటూ ఓ పరికరం మీద టమాకు వేస్తున్నాడో ఆసామీ. కోట గుమ్మం దగ్గర ఆడపిల్లల కోసం కాసుకునే కుర్రోళ్లు హైవేమీద కొచ్చేశారు. - బడిపిల్లలూ బడి మానేసి శవాన్ని చూడడానికి వచ్చేశారు.

"ఫోన్ ... " ఇంకా ఏదో చెప్పబోయాడు భద్రం.

"బొత్తిగా మేష్టరులా మాటాడావ్ ! నువ్ చెబితే ముందు నీ పేరూ, ఎడ్రసూ కనుక్కొని, ఆ చనిపోయిన మనిషి ఎవరో, ఎపుడు ఎవరిచేత ఎలా చంపబడిందీ చెప్పేవరకూ నిన్ను లాకప్‌లో పడే స్తారు ... అందునా అమ్మాయి శవం ... " అంటూ ముకుందం భద్రాన్ని పక్కకు తీసుకొచ్చేశాడు.

ముక్కుపొడుం ఘాటుగా పీల్చి "ఇందులో ఓ నాదం ఉంది ఇది పీల్చేటప్పుడు మనిషి చేసే శబ్దం నాదమని నా ఉద్దేశ్యం ... అతని ఆలోచనలను ఆ నాదం తెలియ చేస్తుంది..."

"ఉండండి బాబూ ! అవతల కొంపలంటుకు పోతుంటే..." భద్రం ముకుందం చెయ్యి విదిలించుకోడానికి ప్రయత్నం చేశాడు.

"ఎవడి కొంప ? చచ్చినది చచ్చే చచ్చింది...శవం శవమే !.... అందులో అందాన్ని చూసే రసికులూ ఉన్నారంటావ్ !...కుర్రాడివి చట్టం, ఆకలి, నిషా, కైపూ వీటన్నింటికి అతీతం ఆ శాల్తీ... శరీర నిర్మాణాన్ని బట్టీ- చర్మం మీద మెరుగును బట్టీ- కండరాల బిగువును బట్టీ శవం వయసూ, శవం గత జీవితంలో చేసే వృత్తినీ, చెందిన తరగతినీ గుర్తించడానికి ఎవరి పాట్లు వాళ్లు పడుతున్నారు. పోలీసులు వచ్చేస్తారు. ఇక చూడడానికేం ఉండదు పద !"

- పోలీసు వ్యాన్ వచ్చింది.

అంతా దోవ ఇచ్చేశారు.

జీపు ... టోపీలు - ఈలలు - మొహాలు - మూతులు - గుంపు చెల్లాచెదరయ్యారు .... అయినా ఎవరూ వెళ్లిపోలేదు. దూరంగా నుంచొని చూస్తున్నారు.

- "బోడిగాడి నూనెమిల్లులో మడిసి కదూ ?"

"మేష్టరమ్మ చెల్లెల్లా ఉంది !"

"రంగమ్మ కంపెనీలో మొన్న రేత్తిరి .... "

"టేసన్ నుంచి ఎవుడితోనో నా బండి ఎక్కింది ... ఇదే టిక్కడా ... ?"

కొన్ని ఎర్రటోపీ గొంతులు ... కొన్ని మందలోని గొంతులు. తాశీల్దారు జీపు వచ్చింది.

పోలీసులు ఎటెన్షన్ లోకి వచ్చేశారు.

"ముందు దీన్ని పక్కకి తీసి ట్రాఫిక్ క్లియర్ చెయ్యండి!"

యస్సై మూడంకెల నంబర్లు నాలుగింటిని పిలిచాడు.

ఖంయ్! ఖంయ్! చిగుళ్లు చిగిరాయి.

తాసీల్దారు జీపు వెళ్లిపోయింది. శవం కదల్లేదు.

అసలు కథ మొదలయింది.

"దీని సంగతి తెలుసుకోవాలని ఉందా? దీని చరిత్ర చూడాలని ఉందా?" ముకుందం ప్రశ్నించాడు.

"ఎలా?" భద్రం ఆత్రంగా అడిగాడు.

"కాశీపట్నం చూడర బాబూ! చూస్తావా?"

తెల్ల మొహం వేశాడు భద్రం.

"కోటదగ్గర అమ్మాయిల ముందు - అబ్బాయిల ముందు - నా క్లాసు ఎటెండెన్స్ రిజిష్టర్లలో ఉన్న పేర్లకు సంబంధించిన శాల్తీల ముందు కాశీపట్నం చూడడం నామోషీ అయితే నా కొంపకిరా .... నా దగ్గరా ఉంది ఆ పరికరం!"

"మరి కాలేజీ?"

"కాటికెళ్లని శవం రోడ్డుమీద కదలనని మొరాయిస్తూ ఉంటే కాలేజీయా వల్లకాడా! ముందు పద!"

"ఎబ్సర్డ్ ... అసందర్భం ... "

"చరిత్ర చూస్తే అంత అసందర్భంగా కనపడదు. అసందర్భంలో నుంచి సందర్భం ఆవిష్కృతమవుతుంది. ఫ్రమ్ కేయాస్ టు ఆర్డర్. ఫ్రమ్ ది ఎబ్సర్డ్ టు ది రియల్."

భద్రం ముకుందం పట్టువిడిపించుకోలేకపోయాడు.

"ఈ శవం కాటికి వెళ్ళదా?"

"తెలివితక్కువ ప్రశ్న. కాటికెళ్లలేదు. వెళ్లదు. అందుకే నీకు సాక్షాత్కరించింది. కాలానికి వెనక్కి వెళ్లే గుణం లేదని శాస్త్రం చెపుతోంది.

కాని మనోనేత్రం ముందు కాలానికి పురోగతీ, తిరోగతీ, రెండూ ఉన్నాయి. నువ్ చూశాననుకున్న శవం ఓ వ్యంజనం....ఓ గుఱుతు ఓ కూర ఓ మీసం - ఓ హల్లు - నువ్ చూసిన శవం ఇవాల్టిదికాదు. కనిష్కుడి కాలంలో అలెగ్జాండరుకాలంలో, గుప్తులకాలంలో-గోల్కొండ నవాబుల రాజ్యంలో - ఎక్కడిదయినా కావచ్చు ఈ శవం. నిజానికి ఈ శవం అన్నికాలాల్లోనూ ఉంది - హరప్పాలో కూడా ఉండే ఉంటుంది. మనం తవ్వలేకపోయాం అంతే! ....మార్గాయాసం లేకుండా నేనింతకు ముందు చేసిన ప్రవచనాన్ని అధ్యయనం చేసుకో....లోకంలో శబ్దమూ, నాదమూ రెండూ ఉన్నాయి. దీన్ని గురించి ఇదివరలో చెప్పాను. శబ్దం అంటే కేవలం శబ్దం - అర్థరహితం....కొంతవరకూ భావప్రసరణ చేసినా అది భాషకాదు. భావ ప్రసారం కోసం - మీ ఆంగ్లభాషలో అర్టిక్యులేట్ చేసిన ధ్వని నాదం. ఇది నిన్ననే చెప్పా. నాదంలో స్వరాలూ, వ్యంజనాలూ ఉన్నాయి. మగాళ్లు స్వరాలనీ, ఆడవాళ్లు వ్యంజనాలనీ అంటే స్త్రీ విముక్తి సాధకులకు కోపం వస్తుంది. అదీకాక అది నిజంకాదు. స్వరవ్యంజనాల తేడా అడామగా ఇద్దరిలోనూ ఉంది. వాళ్లలోనూ, వీళ్లలోనూ, స్వరాలూ ఉన్నాయి, వ్యంజనాలూ, ఉన్నాయి. స్వరానికి సుదూర వ్యాపకశక్తి ఉంటుంది. శ్రావ్యంగా ఉంటుంది. ఇక వ్యంజనం...ఇది లేనిమాట దుర్లభం.వాక్కూ, అర్థమూ విడదీయరాని పార్వతీపరమేశ్వరులయితే స్వరమూ,వ్యంజనమూ వెలుగూ నీడలా విడదీయరానివి-"

"మీ ఉపోద్ఘాతం దేనికి? ఈ శవం వ్యంజనమా? స్వరమా?"

"కథ చూడాలని నీ సొద! నీతో మాటాడి లాభం లేదు. కామాతురుడికి కట్టుబట్ట బరువు...పద..." అప్పటికే ముకుందం ఇంటి ముందు కొచ్చేశారు.

"పద నా గదిలోకి రా!"

గదిలోకి వెళ్లాక చుట్టూచూసి, "ఏదీ పరికరం?" అనడిగాడు భద్రం. "పరికరమా!? ఆఁ! పరికరం కదూ! అదిగో!" కిటికీ చూపించాడు.

"ఇదా పరికరం?"

"చూడబ్బాయ్! దేనికయినా శిక్షణ కావాలి, బొత్తిగా కాలేజీ అధ్యాపకులకీ, శోభనం గదిలో దంపతులకీ తప్ప. ఫెట్ మని లెంపకాయ కొట్టినట్టు ఇలా డిగ్రీ పుచ్చుకొని అలా ఉపన్యాస మందిరంలోకి దూసుకుపోయావ్!" అంటూ ముందుకొచ్చాడు ముకుందం.

"కిటికీలోంచి ఏం కనబడుతోంది?"

"చెత్తకుండీ!" భద్రం ఠక్కున చెప్పాడు.

ముకుందం అతని తల నిమిరాడు. మరేం మాటాడలేదు భద్రం.

నూనెమిల్లు ఆవరణలో తూకం ప్రకారం నింపిన డబ్బాలను ఒకటీ ఒకటీ తెచ్చి బయట పేరుస్తోంది ఓ ఆడబడుచు.

కవులు వర్ణించిన బాహుమూల రుచులు పాలిండ్లపై ప్రసరించడం చూస్తున్నాడు భద్రం.

కాల్చిన ఇనప కడ్డీతో ఒకతను డబ్బాలకు మూతలు తగరంతో అతుకుతున్నాడు.

ఒక చెయ్యి బ్యాలెన్స్ కోసం, మీదకెత్తి రెండోచేత్తో డబ్బా మోసుకొస్తోంది. ఎర్రటి వెలుగులో ఆడపిల్ల.

ఓ యువకుడు కిటికీలోనుంచి భద్రం చూసిన దృశ్యాన్నే చూస్తున్నాడు, ప్రబంధ కవుల సహాయంతో కాక సినిమానవలా ప్రభావంతో.

"ఏయ్ పిల్లా ! ఇలా రా !"

మిల్లుమోతలో పిల్లకి పిలుపు వినబడలేదు. గొంతు హెచ్చించాడు యువకుడు. అందులో ఆత్రం.

అమ్మాయి గదిలోకి వెళ్లింది.

దాని రవిక చిరిగిపోయింది. కాదు చింపబడింది. చీర విడిపోయింది. కాదు విప్పబడింది. ఆమె కేకలు మిల్లుమోతలో ఎవరికీ వినపడలేదేమో !

చీకటయిపోయింది. కుర్రాడి కైపు దిగిపోయింది. ఉల్కాపాతం. నింగిలో చుక్క నేల రాలింది.

చీర చుట్టుకున్న పడతి బయట పడింది.

"ఇంకా ఏం చూస్తున్నావ్ ? ఇది నా ఇంటి కిటికీ !" ముకుందం హెచ్చరించాడు... "పెంటకుండీ కనబడుతోందా ?"

"అంతా చీకటి !"

"సరే-ఈ కిటికీ చూడు ! కాశీపట్నం కనబడుతోందా ?"

"లేదు."

"మరి ?"

"మంత్రాల మర్రి...చిక్కటి చీకటి...."

"అలా దారికి రా !"

"ఏ దారికి?" పరాకుగా అడిగాడు భద్రం.

"చీకటి దారికి...పిల్ల కనబడుతోందా ?"

"తాగుబోతు మాటలు వినపడుతున్నాయి. చింతనిప్పుల్లాంటి కళ్లతో తూలుతూ వస్తున్న లారీ ఆగింది. డ్రైవరు దిగాడు. సరుకు సొంత దారుకీ, డ్రైవరుకీ గొడవ..."

"నాకు చెప్పకు... నువ్ చూసుకో !"

టోపీ వచ్చింది. వెనక మరో అధికారిటోపీ. బేరం కుదరడానికి వీలుగా ఆడపిల్లని రెక్క పుచ్చుకుని అధికారికి అప్పచెప్పేసి డ్రయివర్నీ, సరుకు సొంతదారునీ తప్పచాటుకి తీసుకుపోయారు మూడంకెల మనిషి.

పిల్ల ఉలకలేదు – పలకలేదు. బిక్కచచ్చిపోయింది. ఎపుడు తాగిన టీయో!....తల నొప్పిగుంది... వందడబ్బాలు మొయ్యాల! సీకటొడిపోతంది...బిడ్డ తనుపు కొస్తుంది. పెసల్ టియ్యి సింగల్ ! ఎప్పుడో ఎవరితోనో అన్న మాటలు బొట్టికి గుర్తొస్తున్నాయ్.

స్కూటరెక్కి వెళ్లిపోయాడు ఎస్సై. డయివోరు బేరంకుదిర్చేసేడు. లారీనుంచి ఎర్రటోపీ ఊరు మధ్య దిగి రైట్ వెలుతుర్లోకి వెళ్లిపోయాడు.

"పిల్లకనబడుతోందా ?"

"చీకటి!" భద్రం ఆమెను వెతుకుతున్నాడు.

"మా బావుంది. పిల్లకోసం నువ్వేకాదు – దాని అయ్యా వెదుక్కుంటున్నాడు."

దీని సిగదరగ ! ఇయ్యాలేటో సింగిలక్కినంజకాన ! ఇంకా ఒచ్చినాది కాదు! ఒరేయ్ నీ కూతురెటో ఎల్లిపోనాది. ఇంక రేత్తిరి మిల్లుకాడ పనేటి ? నాక్కాడెట్టెహె !"

రెండు గంటల నుంచి రోడ్డుమెగకాడకాసి గుడిసెలో కొచ్చిండు నారాయడు.

"పిల్లేదీ ?" భద్రం వగిర్చాడు.

"పిల్లగొడవెందుకూ ! ఎస్సై గొడవపడిపోతున్నాడు. అదేలా రోడ్డుమీద కొచ్చిందో చూస్తావా?"

"అదెందుకు నా కనవసరం ? ఎస్సై ఏడీ ?"

"ఏడీ అంటావా ? గవర్నమెంటు మనిషి. మక్కెలు విరిగిపోతాయి ఖబడ్దార్ !"

ఎస్సై రాత్రి నుంచీ ఇంటికి రాలేదు.

"ఇప్పుడెక్కడ ఉన్నాడు ?"

"సర్కిల్ ఇన్స్పెక్టరు గారి వీధి అరుగుమీద - చూస్తావా ?"

"పిల్ల ?"

"అక్కడే ఉంది రోడ్డుమీద".

"మరి శవాన్ని ఎవరూ తియ్యలా ?"

"తియ్యడానికే ప్రయత్నం."

కిటికీ దగ్గర నుంచి భద్రం కదలలేదు.

పోలీసు ఎస్పీ సర్కిల్ ఇన్స్పెక్టర్కి, సి.ఐ., ఎస్సైకీ ఫోన్ చేసారు.

– ఎస్సై అక్కడకు వెళ్లి ఎందుకో వెనక్కి తిరిగి వచ్చి మునిసిపల్ కమీషనరుకి ఫోన్ చేశాడు. కమీషనర్ జిల్లా ఆస్పత్రి-

సూపరెంటుకి ఫోన్ చేశాడు. పురపాలక సంఘం మనుషులకి శవం సాధ్యం కాలేదు. పోలీసువాళ్ల సహకారాన్ని అడిగారు. వాళ్లకే శవాన్ని కదపడం సాధ్యం కాలేదు.

— లారీ మనుషులొచ్చారు. వాళ్లతొందర వాళ్లది. సరుకు ముందు రవాణాకావాలి. వాళ్లచేతా కాలేదు.

ఏ డిపార్టుమెంటు అధికారులు ఆయా ఉన్నతాధికారులకి ఫోన్లు చేసేశారు.

"నాన్సెన్స్! ఇదేమిటి? శవం కదలకపోవడమేమిటి?" అంటూ బిగ్గరగా అరుస్తోంది హైదరాబాదు.

బిక్కు బిక్కుమంటూ శవం కథ వివరంగా చెబుతున్నారు అధికారులు.

పన్నెండయింది — ఒంటిగంటయింది.

అటూ ఇటూ వాహనాల రాకపోకలు నిలిచిపోయాయి.

ఆ దోవ బస్సులన్నింటినీ రద్దుచేశారు.

నిలబడిపోయిన బస్సుల్లోంచి మనుషులు దిగిపోయారు. వెనక్కి వెళ్లి మళ్లిన బస్సుల్లోకి వెళ్లారు. వాహనాలన్నింటినీ మళ్లించడానికి ఓ పూట పట్టింది.

శవం — మామూలే. కదలలేదు.

"మరెలా?"

భద్రానికి అలసటవచ్చి కుర్చీలో కూలబడ్డాడు. ముఖమంతా చెమట పట్టేసింది. కాళ్లు లాక్కొచ్చాయి.

ముకుందం అతని ముఖంమీద నీళ్లు చిలకరించి నెత్తిమీద నున్న పంకా స్విచ్ వేశాడు.

మగతలోకి జారుకున్న చాలాసేపు జాలిగాచూసి తట్టిలేపాడు ముకుందం. "నేనెక్కడ ఉన్నానూ...ఆఁ! శవం లేచిపోయిందా? అంటే తీసేశారా" అని నా ఉద్దేశ్యం.

"నీమొహం, దాన్ని కదిలించగలిగితే ఇంత కథేముంది?"

"నిజంగా! నేను శవాన్ని ఎప్పుడు చూశాను? ఇప్పటికీ అది అక్కడే ఉందా?"

"పందొమ్మిది వందల ఎనభై అయి ఉండవచ్చు, అరవై అయి ఉండవచ్చు - క్రీస్తుపూర్వం కావచ్చు, క్రీస్తు తరవాత కావచ్చు...."

– మళ్లీ కిటికీ దగ్గరకు వెళ్లాడు భద్రం. ముకుందం మీద అతనికి రవంత చిరాకు పుడుతోంది. అంతేకాదు ....

శవం కాటికెళ్లకుండా ఉండటానికి అతనే కారణం. అంత కోపం కూడా వచ్చేస్తోంది.

"నే చూసిన స్థలం కాదిది... నీ పరికరంలో కాశీపట్నం సరిగ కనపడడంలేదు. ఇందులో ఏదో మోసం ఉంది. నన్ను ఎందుకు మోసం చేస్తున్నావ్ నాదమునీ!" కోపంగా అడిగాడు.

"నాదముని నా పూర్వ నామం... ఆ తరువాత మూడు వందల నలభై ఎనిమిది జన్మలెత్తాను. ఆపేరు నీకు ఎలా తెలిసింది?"

"ఈ కుర్చీలో కూచుంటే...." అనలేదు భద్రం. అంటే ముకుందానికి అంతకోపం వస్తుంది. అతని ముఖంచూస్తే శవంలేచి నుంచున్నట్టుగా బెంబేలు పడి పోయాడు.

"కుర్చీలోంచి లే... కిటికీలోంచి చూడు!"

"ఇదేమిటిది? ఇక్కడ ఓగుడి ఉంది...గుడి రెండు రోడ్ల మధ్యఉంది. రెండూ సిమ్మెంట్ రోడ్లు. అటూ ఇటూ వాహనాలు రంయ్ మని వెళ్లిపోతున్నాయి. ఎంతో నిడివిగా నున్నగా ఉన్నాయి రోడ్లు

"వెర్రివాడా! ఈ సిమ్మెంటు రోడ్డు చరిత్ర చూపించనా! ఈ కిటికీ దగ్గరకురా!"

మంత్రముగ్ధుడల్లే ముందుకు నడిచాడు భద్రం. "–బాబ్బాబు.... బుద్ధి గడ్డితింది .... ఒళ్ళు మదమెక్కింది.... కొవ్వు బలిసిపోయింది.... కళ్ళు మూసుకు పోయాయి...."

"అన్నీ అయ్యాయికాని కావరం విజృంభించింది కదూ!"

"నా భార్యతోడు! బుద్ధి వచ్చింది...."

ఆపిల్లవెనక పోలీసు అధికారి... అతని వెనకాల మరో అధికారి.

"బాబూ, విరాళం! బాలపేరంటాలు గుడి కడుతున్నాం. మామహిమ గల తల్లి!" ... పట్టుపంచ ఆసామీ చెపుతున్నాడు.

యువకుడికి ఆ పిల్లే కనపడుతోంది.

"ఇవిగో పెన్ను ... ఇదిగో నీ చెక్కు బుక్కు ... నీకున్న బాలెన్స్‌కి చెక్కురాశా ... ఇవిగో నీభార్యనగలు....ఇదినువ్ దాచిన నల్లధనం... ఆ కనబడే ఆయన ఆదాయం పన్నుఅధికారి.... ఈ జోలిలోవేస్తే ఆ అధికారి నిన్నేం చెయ్యలేడు.... వెయ్! వెయ్యరా, వెయ్యి."

—చటుక్కున అవన్నీ తీసి ఆమె జోలిలో పడేశాడు నూనె మిల్లు యువకుడు.

ఆమె ఒంటిమీద బట్టలేదు. చేతిలో జోలె ఉంది. యువకుడు రాసి యిచ్చిన చెక్కు మరోసారి సంతకం సరిచూసుకుని మడచి జేబులో పెట్టుకున్నాడు విరాళాల కొచ్చిన మనిషి.

అతని వెనకాల నగ్నంగా ఉన్న ఆడమనిషి తనకి చెల్లెల్లో, భార్యో, తల్లో తెలియక, తిరుగుతున్న కళ్ల మూసుకుని నేలకూలబడి పోయాడు యువకుడు.

"సార్ ! పిల్లలవాణ్ణి సార్ ! అడిగో ఫోర్‌నాట్ వన్. వాడి వల్లే ఈ ఖర్మ."

టోపీ తీసేసిన మనిషి ఏదో చెబుతున్నాడు,

"డ్యూటీలో అలాంటి పనులు చెయ్యను సార్ ! అది నా ప్రిన్సిపుల్‌కి విరుద్ధం. నేను మందు కొట్టలేదు సార్ ! సి. ఐ. గారి నడగండి...నా పర్సనల్ ఫైల్..."

"ఒరేయ్ లఫంగాడా !...నీకు ఆడదెందుకురా...నీ విధి నిర్వాహణ ఆమోఘం. నిన్ను నువ్వే కాల్చి చంపుకోవడం వల్ల నీ భార్య సంతోషిస్తుంది."

ఎస్సయి సర్వీసు రివాల్వర్ తీసి ఆడపిల్ల వాడిని ఒక్కసారే

"అమ్మా ! నువ్ ముందు బట్టలు తొడుక్కో ! ఆయనెవరో నగ్నంగా ఉన్న ఆడపిల్లని చూడలేక అరిచాడు.

"అదెందుకులెండి ! నన్ను భూమితో సహా పెకిలించెయ్యమ ఆదేశాలిచ్చారుగా..."

అంతకంటె తేలికయిన పని ఉంది సార్ ! నా కిరుపక్కలా రోడ్డు వేయించేసి ఓ గుడి కట్టించేశారంటే మీ మీద ప్రజల భక్తి పెరిగిపోతుంది. కంట్రాక్టర్లకీ, గుమస్తాలకీ, మీకూ సర్వశ్రేయమూ లభిస్తుంది. రెండు రోడ్లు తరుణోపాయం బాబూ !

—"పిల్ల కనపడుతోందా ?" ముకుందం అడిగాడు.

"లేదు. మాయమయి పోయింది !"

"ఏం?"

"దేవతయిపోయిందిగా !"

"కుర్ర నాగన్నా... ఇప్పుడు చూడు !"

ఏవేళా పురుషులకు ప్రవేశం లేని బాల పేరంటాలు గుడిలో అర్చన జరుగుతోంది ! 'సర్వమంగళ మాంగల్యే శివే సర్వార్థసాధకే.'

—నగ్నంగాఉన్న కన్యలు గర్భగుడిలో పేరంటాలు విగ్రహం చుట్టూ తిరుగుతున్నారు. అలా తిరిగితే బాలమ్మ కొచ్చిన కష్టం ఏ కన్యకీ రాదని కొన్ని తరాల నమ్మిక.

"భద్రం !"

ముకుందం పిలుపు వినే స్థితిలో లేడు భద్రం. కాటికెళ్లదీ శవం ముసలాయన నిట్టూర్పు విడిచాడు.



డాక్టర్ ఘంటా జవహర్‌లాల్

# ప్రాచీన వస్తువులు, కట్టడములు, స్థలములు - పరిరక్షణ చట్టాలు

భారత దేశము ప్రాచీన కళా ఖండములకు భాండాగారము. పురావస్తువులు-విగ్రహములు, ఆభరణములు, వర్ణచిత్రములు, శిలా, తామ్ర శాసనముల రూపములలో దేశంనలుమూలలా మనకు గోచరించు చున్నవి. మన పూర్వ చరిత్ర పరిశోధనకు, పునర్నిర్మాణము చేయుట కవి అత్యంత ప్రమాణములు. కాని, ఇటీవల పురావస్తువులపహరింప బడినవని వార్తాపత్రికలలో తరచూ చూస్తున్నాం. కొంతమంది పాఠ కులు పురావస్తువులు నిత్యమూ అపహరింపబడుట జూచి ప్రభుత్వం వాటి పరిరక్షణకు ఏమిచేయుచున్నదని ప్రశ్నించుట నేను గమనించితిని. ఆ విమర్శను దృష్టిలో పెట్టుకొని పురావస్తువుల పరిరక్షణకు ప్రభుత్వము ప్రవేశ పెట్టిన చట్టముల వివరణ వివరంగా నిచ్చుట పొందుపరుస్తున్నాను. ఏ ప్రభుత్వం ప్రవేశపెట్టిన చట్టమూ ప్రజల సహకారం లేనిదే సరియైన ఫలితము నీయదని మనం ముందుగా గుర్తించాలి.

బ్రిటిషువారు పురావస్తు పరిశోధనకు నాందిపలికి మన చరిత్ర కారులకు మార్గదర్శకులైరి మన దేశమున గల ప్రాచీన వస్తువులను, కట్టడములను, స్థలములను జూచిన బ్రిటిషుపాలకులకు వాటిపై పరి శోధన జేయవలెనని కోరిక నుదయించకుండనోపు. 18వ శతాబ్దములో డా॥ శామ్యూల్ జాన్సన్ భారతదేశములో పురావస్తు పరిశోధన గావించ వలసిందిగా నాటి గవర్నర్ జనరల్ వారన్ హేస్టింగ్సును కోరియున్నాడు. దాని పర్యవసానమే విలియమ్స్ జోన్సు నేతృత్వంలో నేర్పడిన "ఏసియాటిక్ సొసైటీ". ఈసొసైటీ యూరోపియన్లకి భారత దేశ చరిత్ర పరిశోధనపై ఆసక్తి కల్గించింది. దాని ఫలితంగా విలియం జోన్స్ గ్రీకు చరిత్రకారుల 'శాన్ద్రోకొటస్'ని చంద్ర గుప్తమౌర్య గాను, 'పాలిబోత్రా'ను పాటలీపుత్రము (నేటి పాట్నా) గా గుర్తించ గలిగెను. తదుపరి జోన్స్ సహోద్యోగి చార్లెస్ విల్కిన్సన్ గుప్తుల శాసనలిపిని, 'కుతిల' లిపిని పరిశోధించెను. ఈ విధంగా బ్రిటిషువారు భారతదేశ ప్రాచీన శాసన లిపిని చదివి, ప్రాచీన లిపి పరిశోధనకు అంకురార్పణ చేశారు. జోన్స్ తదుపరి "కూల్‌బ్రోక్" మరియు విల్సన్ "ఏసియాటిక్ సొసైటీ" అధ్యక్షులుగా భారతదేశ చరిత్ర పరిశోధనకు మనదేశ విద్వాంసుడైన రాధాకాంతశర్మగారి సహకారంతో ఎనలేని సేవచేసిరి. దక్షిణ, పశ్చిమ భారతంలో గూడా ప్రాచీన చరిత్ర పరి శోధన గావింపబడెను. విలియం ఛాంబర్సు మొట్టమొదటి సారిగా 18వ శతాబ్దములోనే మహాబలిపురంలోని ప్రాచీన కట్టడములపై దృష్టి సారించి వ్యాసాలు వ్రాశారు. 'మెకంజో' మన దేశమునకు 'సర్వేయర్ జనరల్'గా వచ్చి ప్రాచీనలిపి పరిశోధన గావించి ప్రతి చారిత్రాత్మక ప్రదేశమును ప్రత్యక్షంగా సందర్శించి 8,076 శాసనములు, 6,218, నాణెములు, 106 విగ్రహములు జమ చేయగల్గెను. బ్రిటిషుపాలకులు మన దేశ సాంస్కృతిక సంపదను జూచి పరిశోధనకు నెట్లు నాంది పలికినారో తెలిసికొంటిమి. ఇక 19వ శతాబ్దములో బ్రిటిషువారు మన చారిత్రక సంపదనునెట్లు పరిరక్షింప నెంచిరో తెల్సుకొందము.

19వ శతాబ్దములో భారత పురావస్తు శాఖ స్థాపింపబడెను. దానికి డైరక్టర్ జనరల్‌గా 'అలెగ్జాండర్ కన్నింగ్ హామ్' ను లార్డ్ కానింగ్ నియమించెను. అలెగ్జాండర్ కన్నింగ్ హామే భారతదేశంలో ఎన్నో త్రవ్వకాలు జరిపి ప్రాక్ చరిత్ర పరిశోధనకు నాంది పలికారు. వారి సలహామేరకే 1863 లో ప్రవేశ పెట్టిన 'చట్టం-20' దీని మూలంగా ప్రాచీన కళాఖండముల పరిరక్షణ ప్రభుత్వముచే ప్రారం భింప బడెను. దానికి తదుపరి భారత ప్రభుత్వ 'భూ నిక్షిప్త నిధి చట్టం-1878'వ సంవత్సరములో నాటి బ్రిటిషు గవర్నర్ జనరల్ 'లార్డ్‌లిట్టన్'చే జారీ చేయబడింది.

## భారత ప్రభుత్వ భూనిక్షిప్త చట్టం

భారతదేశ ప్రాక్, ప్రాచీన దేశచరిత్ర పరిశోధనకు, పరిరక్షణకు బ్రిటిషు వారేనాంది పలికి నేటి మన చరిత్రకారులకు మార్గదర్శకులైరి. ఈ చట్టం ప్రవేశపెట్టిన నాటినుండి నేటివరకు ఏ మార్పులు చెంద

కుండ నిలిచివుంది. కాని ప్రస్తుతం యీ చట్టం రాష్ట్రప్రభుత్వముల పరిధిలోనికి తేబడింది. ఈ చట్టం మూలంగా ఏ నిక్షేపం (ట్రెజరీ) అయినా పదిరూపాయలపైన భూమిలో లభ్యమైతే దానిని వెంటనే కనుగొన్నవారు ఎప్పుడు, ఏ పరిస్థితులలో, ఎచ్చట ఎంతలోతులో లభ్యమైందో వివరిస్తూ, నిక్షేపం వివరం తెలుపుతూ కలెక్టరు గారికి తెలిపి దొరికిన నిక్షేపాన్ని ప్రభుత్వ ఖజానాలో భద్రపరచ వలెను. తదుపరి కలెక్టరుగారు పూర్తి సమాచారం సేకరించి ఆ నిక్షేపాన్ని 'ఓనర్‌లెస్'గా ప్రకటిస్తారు. నష్టపడిన కక్షిదారు కలెక్టరు గారి నిర్ణయంపై పైవారికి 'అపీలు' చేసుకోవచ్చును. ఇక కలెక్టరుగారు ఆ నిక్షేపాన్ని నిక్షేపం దొరికిన స్థల కామందుకు, కనుగొన్నవానికి 25,75 శాతంగా విభజించి పంచవచ్చును, లేనిచో బహిరంగ వేలం వేసి వచ్చిన సొమ్మును పై వారికి పై నిష్పత్తిలో పంచవచ్చును. ఇక చట్టంలోని 16 సెక్షన్ మూలంగా కలెక్టరుగారు ఆ నిక్షేపాన్ని పై వారికి పంచేబదులు ప్రభుత్వానికి ఇవ్వవచ్చును. అంటేబలవంతంగా గాదు. దొరికిన నిక్షేపం విలువకు 1/5 వంతు విలువ కలిపి మొత్తం సొమ్మును స్థల కామందుకు, కనుగొన్నవానికి పై విధంగా పంచుతారు. అనగా నిక్షేపం దొరికిన వెంటనే ప్రభుత్వానికి తెలిపితే లాభం కల్గుతుందిగాని నష్టం రాదు. ఇక నిక్షేపం దొరికిన వెంటనే ఎవరికీ తెలుపక వుండుట నేరం. ఈ చట్టం వివరణ తెలియక పోవుట వలన నిక్షేపాలు దొరికిన వెంటనే ప్రభుత్వానికి తెలిపితే ఆ నిధి యావత్తు 'ప్రభుత్వపరం' అవుతుందని ప్రజలు తలంచి ప్రభుత్వానికి తెలుపుటకు ముందుకురాక అన్యాయంగా యీ చట్టంచే శిక్షింపబడుచున్నారు. నిజంగా'నిక్షేపం' దొరికిన వెంటనే రెవెన్యూ అధికారులకు లేదా పురావస్తుశాఖవారికి తెలిపిన వచ్చేది లాభంగాని నష్టంగాదు. ఇది గమనించి ప్రజలు ప్రభుత్వానికి సహకరించవలయును. ఈ చట్టం మూలంగా భూనిక్షిప్త నిధులపై పూర్తి అధికారాలు 'కలెక్టరు' గారికీయ బడినవి.కాని పోలీసు శాఖవారు యీ నిబంధన నతిక్రమించి ప్రజలను భయభ్రాంతులను జేస్తున్నారు. ఇది చాలా విడ్డూరం. ఈ చట్టంలోని 20,21 సెక్షనులు చట్టం నతిక్రమించిన వారికి గల్గు శిక్షలు గూర్చి తెలుపుతున్నవి. ఎవరైనా నిక్షేపం దొరికిన వెంటనే ప్రభుత్వానికి తెలుపనిచో నాతడు శిక్షార్హుడు. తనకు రావలసిన నిక్షేపంలోని భాగం పోగా, ఒక సంవత్సరం కారాగారశిక్ష అనుభవించి అపరాధ సుంకం గూడా చెల్లించాలి.

ఈ చట్టంమూలంగా మన దేశంలోని మ్యూజియములు-ప్రాచీన కళా ఖండములను, శిల్పాలను, నాణెములను మొదలగు వాటిని సమకూర్చుకోగల్గుచున్నవి. ఈ చట్టం పని తీరు చూచే బాధ్యత రాష్ట్రప్రభుత్వాల కీయ బడింది. దీనిలోని లోపాలను గమనించుట గూడా జరిగింది. 'నిక్షేపం' విలువ తీసుకొనుటకు 'భౌతిక విలువ' ప్రధానంగా చట్టం సూచిస్తుంది. 'నిక్షేపం విలువ' తీసుకొనేటప్పుడు, 'భౌతిక విలువ' కంటే 'పురాతత్వ విలువ' కు ప్రాధాన్యతనియ్యాలి. అట్లే 'అరుదైనది, అపురూపమైనది' అయితే దాని విలువ మరింతగా పరిగణించాలి. ఈ విషయాలపై చట్టంలో వివరణ లేదు. ఇద్దరు పార్టీలనే ఈ చట్టం పేర్కొంది. ఒకరు భూకామందు, మరియొకరు నిక్షేపం కనుగొన్నవారు. కాని కొన్ని పరిస్థితులలో మూడవపార్టీ రావడం కద్దు. కొన్ని సమయాలలో 'నిక్షేపం' లభ్యమైనట్లు ప్రభుత్వానికి తెలిపేవారుండుట సంభవిస్తుంది. అటువంటి వారికి చట్టపరంగా 'కలెక్టరు' ఒసంగే పారితోషికం గురించి చట్టంలో వివరణ లేదు. ఒక్కొక్క సమయములో యాదృచ్ఛికంగా నిక్షేపాలు బయటపడుతుంటవి. వాటి విషయంలో చట్టం మౌనం వహిస్తుంది. కొన్ని దేశాలలో సాంస్కృతిక, చారిత్రక సంపత్తి బయట పడినచో అది ప్రభుత్వ ఆస్తిగా పరిగణించే చట్టాలున్నవి. కాని, దొరికిన 'నిక్షేపం' 'ఓనర్ లెస్' గా కలెక్టరు నిర్ణయిస్తే దానిని కనుగొన్న వానికి, స్థల యజమానికి పంచుట హాస్యాస్పదము. తగిన పారితోషికం యిచ్చి ప్రభుత్వాస్తిగా పరిగణించుట యుక్తము. ఈ చట్టములో లోపములున్ననూ, లభ్యమైన 'నిక్షేపాల' వునికి, వాటి సాంస్కృతిక ప్రాముఖ్యం ప్రభుత్వానికి తెలుస్తుంది. మ్యూజియములకు కావలసిన చారిత్రకాధారాలను, కళాఖండములను సేకరించుటకే చట్టం వుపయోగపడుతుంది.

## ప్రాచీన స్మారక చిహ్నములు, పురావస్తుస్థలాలు మరియు అవశేషాల పరిరక్షణ చట్టం

అసలు 1904 లో ప్రాచీన స్మారక చిహ్నముల పరిరక్షణ చట్టం ప్రవేశపెట్టబడింది. దీని పరిధి పెంచుటకు 1958 లో సమగ్రమైన మరోచట్టం ప్రవేశపెట్టబడింది. ఇది పైచట్టాన్ని అధిక్రాంతం చేసింది. ఈ సమగ్రచర్యే ప్రాచీన స్మారక చిహ్నములు, పురావస్తు స్థలాలు మరియు అవశేషాల చట్టం. 1904 వ సంవత్సరములో జారీ అయిన చట్టంలో కేవలం ప్రాచీన స్మారక చిహ్నముల పరిరక్షణ గురించి వుంటే, 1958 లో వచ్చిన చట్టంలో పురావస్తుస్థలాలు మరియు అవశేషాలను గూడా పరిరక్షణ జాబితాలో జేర్చారు.

1. జాతీయ ప్రాముఖ్యం గల ప్రాచీన మరియు చారిత్రాత్మక స్మారక చిహ్నములు, పురావస్తు స్థలాలు మరియు అవశేషాలన్నియు యీక్రొత్త చట్టం పరిధిలోనికి వస్తాయి. పై నుదహరించిన సాంస్కృతికసంపద నంతటిని ప్రకటనద్వారా ప్రభుత్వపరిరక్షణలోనికి తేబడినవి. అట్లాగే ప్రకటనద్వారా చట్టం పరిధి నుండి పైవాటిని తప్పించనూ వచ్చును.

2. ప్రాచీన స్థలాలు మరియు పురావస్తువుల యజమానులు ప్రభుత్వముతో ఒప్పందానికి రానిచో అటువంటి వారిపై చర్య గైకొనుటకు చట్టంమూలంగా ప్రభుత్వానికి అధికారాలు సంక్రమించినవి.

3. ఈ చట్టంమూలంగా భారతప్రభుత్వ పురావస్తు శాఖవారు మాత్రమే పురావస్తు స్థలాలలో త్రవ్వకాలు చేయవచ్చును. తదితరులు అనర్హులు.

4. ప్రభుత్వంచే రక్షణ పొందిన పురావస్తుస్థలాలలో, ఎటువంటి కట్టడాలు కట్టరాదు, గని త్రవ్వకాలు, రాళ్ళగనులు నచ్చట నెలకొల్పరాదు.

5. ప్రభుత్వంచే రక్షణలేని పురావస్తు స్థలాలలో గూడ భారత ప్రభుత్వం స్వయంగా త్రవ్వకాలు చేపట్టవచ్చును. లేదా ఆయా రాష్ట్ర ప్రభుత్వ పురావస్తు శాఖకు, ఆయా ప్రదేశాలలో త్రవ్వకాలు చేయుటకు అనుమతి భారత ప్రభుత్వం మంజూరు చేయవచ్చును.

6. అటువంటి త్రవ్వకాలు చేయబడిన స్థలాల యజమానికి ఏదైనా నష్టం వాటిల్లిన ప్రభుత్వం తగిన నష్టపరిహారం చెల్లిస్తుంది. పై లక్షణాలు పరిశీలిస్తే పురావస్తు స్థలాలను, వస్తువులను, స్మారక చిహ్నములను పరిరక్షించుటకు, పురావస్తు త్రవ్వకాలను క్రమబద్ధం చేయుటకు, శిలావస్తు సంపదను రక్షించుటే యీ చట్టం ముఖ్యోద్దేశ్యంగా కనిపిస్తుంది.

ఇక యీ చట్టములోని పదముల వివరణ పరిశీలిద్దాం. 'ప్రాచీన స్మారక చిహ్నము' అనగా ఏదైనా ప్రాచీన కట్టడము, గుహ, రాతిశిల్పం, శాసనం, చారిత్రాత్మకముగా గాని, పురావస్తు శాస్త్ర ప్రకారంగాగాని ప్రాముఖ్యం సంతరించుకొని నూరు సంవత్సరముల పైబడి పురాతత్వం గల్గినది. ఇక "పురావస్తు స్థలాలు-అవశేషాలు" పై నుదహరించిన కట్టడములు, శాసనములు, శిల్పాలు గల స్థలాలు మరియు చారిత్రాత్మకాధారాలు మరుగు పడినట్లు ఆధారాలు కల్గిన స్థలాలు. ముఖ్యంగా ఇవి పాటిమన్ను దిబ్బలు.

పై స్థలాలను ఏ విధంగా ప్రభుత్వం తమ స్వాధీనం చేసుకొంటుందో చూద్దాం. పై చట్టం 4 వ సెక్షన్ ప్రకారం ప్రభుత్వం ఏదైనా పై నుదహరించిన ప్రాచీన కట్టడాలను, ప్రదేశములను తన రక్షణలోనికి తీసుకోదలిస్తే ప్రభుత్వ ఉద్దేశ్యాన్ని 'అధికారికగెజిట్'లో ప్రకటిస్తుంది. ప్రకటిస్తూ 2 నెలలు కాలవ్యవధి అభ్యంతరాలు స్వీకరించుటకు ప్రభుత్వం మనకు ఇస్తుంది. ఈ రెండు నెలల్లో ఎటువంటి అభ్యంతరాలు ఎవరినుండీ రాని పక్షమున దానిని ప్రభుత్వం రక్షణ పొందే చారిత్రక చిహ్నంగా పరిగణిస్తారు. తదుపరి అటువంటి చారిత్రక కట్టడములలో సభలు, సమావేశాలు, విందులు, వినోదాలు, సినిమా షూటింగులు ప్రభుత్వానుమతి లేనిదే జరుగుట నిషేధిస్తారు. పై చారిత్రక స్థలాలను కట్టడముల రక్షణపై ప్రభుత్వం తగిన శ్రద్ధ చూపుతుంది. ఈ చట్టము గూడ చలనయోగ్యమైన పురావస్తువులకు పూర్తి రక్షణ కల్పించలేకపోయింది. కావున ప్రభుత్వం మరియొక చట్టాన్ని 1972 లో ప్రవేశపెట్టింది. అదే ప్రాచీన వస్తువులు మరియు కళాఖండముల చట్టం. ఇది మనదేశంలో 1974 నుండి ఆచరణలోనికి వచ్చింది.

## ప్రాచీన వస్తువులు మరియు కళాఖండముల చట్టం

ఈ చట్టం ముఖ్యంగా చలనయోగ్య (మువ్వబుల్) మైన పురావస్తువుల నిమిత్తం జారీ చేయబడింది. సాంస్కృతిక, స్మారక చిహ్నములు మన పూర్వ చరిత్ర పునర్నిర్మాణమున కెంత ప్రమాణములో, చలనయోగ్యమైన పురావస్తువులు, కళానిక్షేపాలు (కళాఖండములు) గూడా అంతముఖ్యమైనవే. మన దేశంలో, ముఖ్యంగా మన రాష్ట్రములో ప్రాచీన అవశేషాలు గానరాని గ్రామాలు లేవు. ఇక భూగర్భమున మరుగుపడినవి. ప్రజల యొద్ద గుప్తముగ నున్నవి మరెన్నో !! విదేశీయుల ప్రలోభములకు లోబడి, మనవారు కొందరు మన పురావస్తు కళాఖండములను విదేశములకు తరలించుచున్నారు. మరికొందరు లోహముల మీద కాంక్షతో ప్రాచీనాభరణములను, తామ్ర శాసనములను కరగబెట్టుచున్నారు. ఇట్లు విద్యావంతులు, విద్యాహీనులు గూడా మన ప్రాచీన సంపదను నాశనముచేయుచున్నారు. ఈ పాతుకచర్య నాపుటకే భారతప్రభుత్వం ఈ చట్టం ప్రవేశపెట్టింది. ఇందు పురావస్తువులు, మరియు కళాఖండాల పరిరక్షణే ముఖ్యంగా గోచరిస్తుంది. ఈ చట్టం భారతప్రభుత్వముచే నొసగబడినా, దానిని అమలు పరుచుట రాష్ట్రముల విధిగా నిర్ణయించింది. పర్యవసానంగా మన ప్రభుత్వంవారు ప్రతిరెండు జిల్లాలకు నొక "పురావస్తు రిజిస్ట్రింగ్ ఆఫీసరు కార్యాలయము" 1974 సంవత్సరములో ప్రారంభించిరి. ఈ చట్టాన్ని పర్యవేక్షించేందుకు, అమలుకు రిజిస్ట్రింగ్ ఆఫీసరుగారికి చట్టపరంగా అధికారాలీయబడినవి

సర్వసామాన్యంగా ప్రజలు తమ మోటారుకార్లు, తుపాకులు, రేడియోలు మొదలగు వానికి లైసెన్సు పొందుటకు తమ స్వంత

బాధ్యతగా ఎట్లు చేయుచున్నారో, అట్లే నూరు సంవత్సరముల ప్రాచీనత్వముగల పురావస్తువులు కల్గివున్నవారు తమ ప్రాంతమందున్న 'రిజిస్టరింగ్ ఆఫీసరు' కార్యాలయంలో వాటిని 'రిజిస్టర్' చేయవలసిన బాధ్యత వారి (ప్రజల) పైనున్నది. ఇక చట్టరీత్యా 'రిజిస్టర్' చేయించవలసిన పురావస్తువులు.

1. వి గ్ర హ ము లు

లోహము, శిల, కొయ్య, కొమ్ము, మట్టి, దంతము మొదలగు వాటితో చేయబడినవి.

2. వ ర్ణ చి త్ర ము లు

రేకులు, పలకలు, గుడ్డలు, అద్దములు, చెక్కపలకలు మొదలగు వాటిపై రంగులలో వేయబడిన చిత్రములు.

3. వ్రా త పు స్త క ము లు

వర్ణచిత్రాలు, కథానిక రూపచిత్రాలు గలవి మాత్రమే.

పూజలోనున్న దేవాలయ విగ్రహములు (మూలవిరాట్టులు) నాణెములు, ఆయుధములు, కవచములు, ఆభరణములు మొదలగునవి నూరు సంవత్సరముల వాటివైనా రిజిస్ట్రేషన్ నుండి మినహాయించబడినవి. దేవాదాయ, ధర్మాదాయ శాఖవారి దేవాలయములందున్నవి, తదితర ట్రస్టీల స్వాధీనములోనున్న దేవాలయాల ఉత్సవమూర్తులు తప్పనిసరిగా రిజిస్టర్ చేయించుకొనవలెను. రిజిస్ట్రేషన్ రుసుము ఏమాత్రము లేదు. ఇందుకావలసిన రిజిస్ట్రేషన్ ఫారములు, తక్కిన వివరములు ఆయా ప్రాంతముల రిజిస్ట్రేషన్ ఆఫీసర్, పురావస్తుశాఖ కార్యాలయముల నుండి పొందవచ్చును.

పురాతన వస్తువుల రిజిస్ట్రేషన్ వాటి యజమానుల బాధ్యత అయినను, 'రిజిస్ట్రేషన్ ఆఫీసరు' గుప్తముగానున్న ప్రాచీన వస్తువుల వునికిని పసిగట్టుటకై నిర్విరామంగా కృషి చేస్తున్నారు. రిజిస్టర్ చేయించనిదే ప్రాచీన వస్తువులు ప్రజల వద్ద వుంచుకొనుట చట్టరీత్యా నేరం. అట్టి వస్తువులను కనుగొనుటకని రిజిస్టరింగ్ ఆఫీసరుగారికి ఇండ్లను సోదాచేయుటకు చట్టరీత్యా అధికారము ఈయబడినవి.

పై చట్టములన్నియు ప్రాచీన కళాఖండములను, పురాతన స్థలాలను, స్మారక చిహ్నములను పరిరక్షించుటకుద్దేశించినవి. కాని ప్రజల పూర్తి సహకారం లేనిదే పై చట్టములను అమలు పరచుట దుర్లభం. ప్రజలు మన సాంస్కృతిక విలువలకు ప్రాధాన్యం చూపి, మన పురాతన శిలాసంపద పరిరక్షణకు ప్రభుత్వానికి చేయూత నివ్వాలి. నేడు ఏ వార్తా పత్రికలలో చూచినా 'మన ప్రాచీన శిలాసంపద' దయనీయ స్థితే కన్పడుచున్నది. వాటి పరిస్థితికి ప్రజలే కారణం. పురావస్తు శాఖవారు వాటి సంరక్షణార్థమై ఆయా పల్లెలకు వెళ్లిన ప్రజలు లేనిపోనివిచెప్పి అడ్డంకులు చెపుతారు. ప్రతి జిల్లాకు ప్రదర్శన శాలలు ఏర్పాటు చేయాలని ప్రభుత్వ సంకల్పం. దయనీయంగా పడివున్న శిలాశిల్పాలను, కట్టడాలను జిల్లా కేంద్రానికి తరలించాలని ప్రభుత్వం సంకల్పిస్తే ప్రజలు అడ్డుతగులుతున్నారు. పోనీ ఆ ప్రజలైనా వాటిని పరిరక్షిస్తారా అంటే అదీ శూన్యమే. కావున పురావస్తువులు, స్మారక చిహ్నముల నేటిస్థితికి పూర్తిగా ప్రభుత్వంది బాధ్యతగాదని, ప్రజలూ, దానికి బాధ్యులేనని గుర్తించాలి. ఏ జిల్లాలోనైనా పురాతన కట్టడాలు, తామ్రశాసనాలు, నాణెములు, ప్రాచీన స్థలాలు బయల్పడిన వెంటనే పురావస్తు శాఖవారికి లేదా రెవెన్యూ శాఖవారికి తెలుపవలయును. అట్లు తెలుపనిచో నేరం. ఇది గమనించి ప్రభుత్వానికి ప్రజలు చేయూతనిచ్చి పురావస్తు పరిరక్షణకు సహకరించవలయును.

# నన్ను నయించునా న్నా!

## డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

నినుగాంచి

చెమ్మగిల్లిన ఈ నయనమ్ముల నుంచి

రాలిపడిన ఈ ఆనందబాష్ప బిందువుల

మకరంద సింధువొనరించి

నీ దివ్య పాదమ్ముల ప్రక్షాళించి

గొంతుదాటి రాలేని ఈ మధురభావమ్మును

అంతరాత్మను చిలుకుతున్న రససాగర మథనమ్మును

మమతల మందార మాల చేసి

మనసారా నిను వరించి ఆవరించి

గుండెను కర్పూరం చేసి నీకు వెలిగించి

నా అణువణువునూ నైవేద్యం చేసి నీకు తినిపించి

నీ ముంగిట వాడిన మల్లియవోలె

నీ ఎదనంటిన పసుపుపచ్చని గంధమువోలె

నీ పదసమలోని అరుణకుంకుమ శోభవోలె

నీ కనుపాపల కనుల కందని మధుచంద్రకాంతి వోలె

ఈ జన్మ ధన్యము కాగా

ఈ బ్రతుకు సార్థకము కాగా

నీకు పూజ చేయాలని

## భా ర తి

నిన్ను సేవించుకోవాలని
వేవేగమే పరుగున రాగా
ఆశల కొండల నడచి రాగా
గొంతు పెగలదేమి స్వామీ!
నోటు మాట రాదేమి స్వామీ!
ఈ నిట్టూర్పుల బరువు
ఈ ఎగశ్వాసల దుడుకు
భరించ లేకున్నాను!
నీవే నన్ను పలుకరించి
తనివి తీరా కుశల మడిగి
అనునయించు నాన్నా!



# గాయాలు - గేయాలు

## శ్రీ లావర్

ఈ ఎదవెదురు ఒంటినిండా
ఎన్నెన్ని గాయాలు !

ఏ గాయాన్ని సుతారంగా తాకినా
ఎన్నెన్ని గేయాలు !

శతాబ్దాల శిఖరాల మీంచి దూకుతున్న
యీ జలపాతపు పాటల్లో
ఎన్ని నిమిషాలు, రోజులు కొట్టుకు పోతున్నాయి గులక రాళ్లలా !

నేత్రాకాశం కురిసే పన్నీటి జల్లుల్లో
ఎన్ని గుండెలు రేకులు విచ్చుకుంటున్నాయి గులాబి పువ్వుల్లా !

యీ మానవతా సంగీతం ముందు
ఎన్నెన్ని విషనాగుల పడగలు నర్తించాయి!

యీ పాటల కెరటాల హృదయం మీద
ఎన్నెన్ని సరస పుష్కలావర్తాలు సంవర్తించాయి !

ప్రతి గాయం మనిషి కోసం
ఎంత ఎరుపును సిలువపై ధారపోసింది !

ప్రతి గేయం మంచి కోసం
ఎంత మెరుపును నలుపుపై ఆరపోసింది !

శ్రుతిచేసిన గుండె లోతుల్లో
ఎంత సంగీతం అనురాగ గంగ పొంగింది !

ఎక్కుపెట్టిన గుండె దారుల్లో
ఎంత అమానుషం సిగ్గుతో కుంగింది !

చీకటి పాతరలు త్రవ్వితీసిన
వెలుతురు క్షణాలతో
ఉజ్వల ఉదయ సాగరానికి
వంతెనలు కడదాం రా !
విందాం రా !

గాయాలు వినిపిస్తున్నాయి క్రాంతి నాదాలుగా !
గేయాలు విరుతిస్తున్నాయి ఆశావాదాలుగా !



సీరియల్

# థాంక్యూ మిస్టర్ గ్లాడ్

మరాఠీమూలం: అనిల్ బర్వే ## తెలుగు అనువాదం: కె సుజనాదేవి

(గత సంచిక తరువాయి)

గ్లాడ్‌సాబ్ స్ట్రిక్ట్‌నెస్ అలవాటు పడ్డ సీనియర్ జైలర్ డ్యూటీ టైం కన్నా పదినిమిషాలు ముందుగానే ఆఫీసుకు చేరుకునేవాడు. అయినా ఆరోజు గ్లాడ్‌సాబ్ అంతకన్నా ముందుగానే ఆఫీసుకొచ్చాడు. అసహనంగా ఆఫీసురూంలో అతనికోసమే ఎదురు చూస్తున్నాడు. అతని అస్వస్థతకూ, అసహనానికీ కారణం రెండురోజులైనా నక్సలైట్ మర్సీపిటిషన్ తన టేబిల్ మీదకు రాలేదు. రేపే మర్సీపిటిషన్‌కు ఆఖరు తేదీ. "ఘరాడుతత్వాన్యానికి చస్తాడు" వాణ్ని ఎలాగైనా తప్పించాలి. ఇలా ఇదివరక్లో ఏఖైదీ గురించీ ఆలోచించలేదన్న మాట మాత్రం నూటికి నూరుపాళ్లూ నిజం.

సీనియర్ జైలర్ పదిగంటలకు గ్లాడ్‌సాబ్ ముందు హాజరయ్యాడు. "ఆ నక్సలైట్ మర్సీపిటిషన్ సంగతేమయింది?" జైలర్ సెల్యూటయినా చేయక ముందు అడిగాడు గ్లాడ్‌సాబ్. సీనియర్ కొంచెం సిగ్గుపడ్తూ, తత్తరపాటుతో నెమ్మదిగా చెప్పాడు. "సర్ ఐ ట్రైడ్ మై లెవల్ బెస్ట్. బట్ హీ ఈజ్ టూ మచ్ ఫ్యానటికల్. హీ రెఫ్యూజ్డ్ టు సైన్ మర్సీపిటిషన్".

గ్లాడ్‌సాబ్‌కు అరికాలు మంట నెత్తికెక్కింది. కోపంతో మండిపడ్తూ గర్జించాడు. "ఎందుకొచ్చిన నీ ఇరవై రెండేళ్ల సర్వీసు? వేస్ట్. ఆఫ్టరాల్ ఓ ఖైదీనుంచి సంతకం తీసుకోలేని నువ్వూ, నీ సర్వీసూ ఏట్లో దూకండి. ఇలా పడెయ్యి ఆ మర్సీపిటిషన్ నేనే తెస్తాను."

సీనియర్ చేతికాగితాలు లాక్కుంటూనే నడక ప్రారంభించాడు సాబ్. వెనకాల నలుగురు వార్డర్లు, నలుగురు బంట్రోతులు నడిచారు. ఖైదీని బుట్టలో వేసుకునేందుకు సాబ్ ఏం మంత్రం ఉపయోగిస్తాడో తెలుసుకుందుకు సీనియర్ జైలర్, ఫాసీగేట్ జైలర్లుకూడా గ్లాడ్‌సాబ్ ననుసరించారు. ఇలా "వనవెంటన్ సిరి" లాగా గ్లాడ్‌సాబ్ అండ్ కంపెనీ ఫాసీగేట్ చేరుకుంది

గ్లాడ్‌సాబ్‌ను చూస్తూనే ఫాసీ సెల్‌ను వణుకు పట్టింది. ఆక్కడ ఫ్యూరి, రావి చెట్లు తలలొంచుకుని అటెన్షన్ పోజులో ఉన్నాయి. సాబ్ సెల్‌ముందు ఒక్క క్షణం ఆగాడు. సర్వకాలం సర్వావస్థల్లోను గంభీరంగా ఉండే తన ముఖం మీదను కొంచెం నవ్వుతెప్పిస్తున్నాడు. కాని కొత్తనటి స్టేజిమీద కెలా తత్తరపడ్తూ వచ్చిందో, నవ్వూ సాబ్ ముఖం మీదకు అలాగే భయపడ్తూ వచ్చింది. సాబ్ గొంతు సవరించుకొని తెచ్చిపెట్టుకున్న మార్దవంతో "హలో యంగ్ బాయ్ హౌ ఆర్యూ?" అన్నాడు.

సాబ్ ఎంతో ఆలోచించి ఆడిన ఈ మొదటి మాట అర్థం నక్సలైట్‌కు తెలిసింది. వెంటనే సాబ్‌కేసి నిర్లక్ష్యంగాచూసి "అయాం ఖైదీ నంబర్ 842, ఎ ట్రేటర్, నక్సలైట్ అండ్ నాట్ యె యంగ్ బాయ్ మిస్టర్ గ్లాడ్" అంటూ చురిసాడు.

నక్సలైట్ మాటలు విన్న సీనియర్ జైలర్, ఫాసీగేట్ జైలర్లు వణికిపోయారు. గ్లాడ్‌సాబ్ చేతిలో నక్సలైట్ నూరేళ్లూ నిండాయను కున్నారు. గ్లాడ్‌సాబ్ పిచ్చికోపంతో నిలువెల్లా ఊగిపోతాడనుకున్నారు. కాని...కాని గ్లాడ్‌సాబ్ మండిపడలేదు. ఫ్యూరి జమేదార్‌ను తలుపు తీయమన్నాడు. ఫ్యూరి జమేదార్ భయపడుతూ నాలుగుసార్లు గుత్తిలోని తాళం చెవులు తత్తరపాటుతో మార్చి మార్చి ఎలాగోలా తలుపు తెరిచాడు. సాబ్ సెల్ ముందున్న జమేదార్ స్టూల్‌ను స్వయంగా లోనికి తీసుకెళ్లి నక్సలైట్ ముందు వేసుకుని దాని మీద కూర్చాయించాడు.

భయంకరమైన నిశ్శబ్దం. ఎవరికేం మాట్లాడాలో తోచడంలేదు. ఎప్పటిలాగే గ్లాడ్‌సాబే నిశ్శబ్దాన్ని భంగం చేశాడు. ఎడం కన్ను గీటుతూ, కుడి చేతిలోని స్టిక్‌తో ఎడమ అరచేతిపై తడ్తూ అన్నాడు "బచ్చా...నిజంగా ఉక్కు తుంటరివిరా నువ్వు" నక్సలైట్ జవాబు ఇచ్చేలోపలే అతని కళ్లల్లోకి చూస్తూ అడిగాడు. "క్యాంటివే ఖైదీ నంబర్ 842: నా వయసెంతో చెప్పు చూద్దాం".

నక్సలైటోసారి గ్లాడ్‌సాబ్‌ను ఆపాదమస్తకం పరికించి అలని తెల్లబడుతున్న మీసాలకేసి చూస్తూ చెప్పాడు "52, 53 ఏళ్లుంటా

యేమో". సాబ్ ఈ జవాబుతో మండిపడ్డాడు. "బేవకూఫ్. గాడిదవు నువ్వు. నాకు నీ తండ్రి వయసుంది తెలుసా?" అన్నాడు.

తన వయసు ఆసరా తీసుకుని పెత్తనం చెలాయిద్దామను కున్నాడేకాని నక్సలైట్ ముఖంలోమాత్రం మార్పేమీ కానరాలేదు. సాబే నెమ్మదిగా కొంచెం బ్రతిమాలుతున్న ధోరణిలో అన్నాడు "చూడు బాబూ నేను పెద్దవాడిని చెపుతున్నాను. నామాట విను. మర్సీ పిటిషన్పై సంతకం చేయి." సాబ్ కాగితాలూ, పెన్నూ నక్సలైట్ముందుంచాడు. కాని అతడు వాటికేసి చూడ్డంలేదు. అయినా విసుగుచెందని విక్రమార్కుడిలా గ్లాడ్సాబ్ తన పట్టు వదల్లేదు.

"యూ సీ బాయ్... నాకు తెలుసు, సంతకం చేయాలంటే నీవు ఇన్సల్టుగా ఫీలవుతావని. అలా అనిపించడం కూడా సహజమే. కాని అది మూర్ఖత్వం. తప్పు."

"ఓహో అలాగా? అదెలాగండీ? నాకు తెలీదే" వెటకారంగా అన్నాడు నక్సలైట్.

సాబ్ అతని ఎత్తిపొడుపును లక్ష్యపెట్టకుండా "యూ సీ. క్లాస్ వార్ మీద నీకు విశ్వాసం లేదా?" అన్నాడు.

"అఫ్కోర్స్... ఉంది." అన్నాడు నక్సలైట్.

"యుద్ధం అంటే గెలుపూ, ఓటమి ఎలాగూ ఉండేవే. నిజమైన యోధుడు కత్తిపోట్లు భరిస్తూనే, అంతిమ విజయంకోసం ఒక్కోసారి వెనుదిరుగుతాడుకూడా. యుద్ధమంటే కేవలం శారీరకం మాత్రమేకాదు; మానసికం కూడా. అందుకే...అందుకే నువ్వూ వెనక్కు తగ్గు. కేవలం కాసేపటికోసం; ప్రాణం రక్షించుకునేందుకు మాత్రమే వెనక్కు తగ్గు. నీ ప్రాణం చాలా విలువైనదన్న సంగతి మరచిపోకు నీలాంటివాళ్ళే క్రాంతి చేయగలరు......



మధ్యలోనే అతని మాటను తీవ్రంగా ఖండిస్తూ నక్సలైట్ "ఎవరు చెప్పారు మీకీమాట? క్రాంతి ప్రజలు చేస్తారు. ఒకరిద్దరు వ్యక్తులు కాదు. నాలాంటివాళ్లు చస్తే క్రాంతి ఆగిపోదు." అన్నా

"అవునను కో. కాని నీ చరితో క్రాంతి ఆగనట్టే పెరగను కూడా. అలాంటప్పుడు మొండిగా ప్రాణాలెందుకు తీసుకుంటావు. సంతకం పెడితే అవమానమని ఎందుకు భావిస్తావు?" అడిగాడు గ్లాడ్‌సాబ్.

"నా మానాపమానాలన్నీ పక్కకునెట్టే నేను ఇంటినుండి బయటపడ్డాను మిస్టర్ గ్లాడ్. మర్సీ పిటిషన్ నాకు అవమానమని నేను భావించడం లేదు. క్రాంతి ఉద్యమానికి అవమానకరమని తలుస్తాను. ఈ నిరంకుశ ప్రభుత్వంయెదుట ప్రాణభిక్షకై కొంగు చాచడమంటే క్రాంతి ఉద్యమం పట్ల అవిశ్వాసం చూపడం. ఒక క్రాంతి కారకుడిగా ఉద్యమాన్ని అవమానించడం." అన్నాడు.

గ్లాడ్‌సాబ్ నిరుత్తరుడయ్యాడు. రాజకీయాలేవీ తన కర్థం కావన్న సంగతి అతనికి మళ్ళీ అర్థమైంది. ఇక లాభం లేదనుకుని అటునుంచి నరుక్కురావాలనుకున్నాడు. "నీ క్రాంతిని కాసేపు పక్కకు పెట్టు. నాకదేమీ అర్థం కాదు. కాని నీ భార్యా బిడ్డలు నిరాధారులౌతారే; వారిమాటేంచేశావ్? నిన్ను కలుసుకోవాలని కుర్రాణ్ణి చంకనేసుకుని చెప్పులైనాలేని కాళ్ళతో, ఎండనకా, వాననకా వందమైళ్లు నడిచివచ్చిందే, ఆ అమ్మాయి మాటేంచేశావ్?" గ్లాడ్‌సాబ్ గెట్టించాడు.

"నాకు తెలుసు మిస్టర్ గ్లాడ్. నన్ను ఏరి కోరి పెళ్ళిచేసుకున్నప్పటినుంచీ ఆమె నిప్పులమీద నడుస్తోంది. ఈ వంద మైళ్ళ నడక ఆమెకో లెక్కలోనిది కాదు."

నక్సలైట్‌లోని ప్రేమ భావనలను నిద్రలేపే ప్రయత్నంలో గ్లాడ్‌సాబ్ అవే భావనలకు బలైపోతున్నాడు, తనకు తెలీకుండానే. నక్సలైట్‌తో అన్నాడు "శబ్దాలు అందంగా పేరుస్తే భావం స్పష్టమౌతుందేతప్ప వస్తుస్థితి మారదు. నీవు చస్తే నీ పెళ్లాం జీవితం ఎడారైపోతుంది. జీవితం ఎడారి అవడమంటే ఏమిటో అదెలా ఉంటుందో నీకు తెలుసా? ఎప్పుడన్నా ఆలోచించావా? నన్నడుగు, నాకు తెలుసు. జీవితం ఎడారిగా మారడమంటే ఏమిటో, పెనుతుఫాన్లో నాశనమవడమంటే ఏమిటో, ఎలా ఉంటుందో...మాట్లాడుతూ మాట్లాడుతూనే గ్లాడ్‌సాబ్ కదిలిపోయాడు. కంఠం బొంగురుపోయింది. అన్నిటికన్నా ముఖ్యంగా తన మాటల ప్రభావం నక్సలైట్‌పై పడనందున అతనికి విసుగుపుట్టింది. తనపై తనకసహ్యం వేసింది. రెండు చేతుల్తో నక్సలైట్‌ని ఊపుతూ "మనిషివా పశువ్వీరా? వెధవ, అబద్ధాలకోరు, లుచ్చా, మూర్ఖుడా" నోటికొచ్చిన ఎట్లన్నీ తిట్టసాగాడు గ్లాడ్‌సాబ్. "రోడ్డుమీద అడుక్కుంటున్న కుర్రాణ్ణిచూస్తే నీకుజాలేస్తుంది. కాని నీసొంత భార్యాబిడ్డలంటేమాత్రం కనికరం లేదు కదూ! నీ అహంకారానికి వాళ్లను బలిపెడతావా?"

"ఏం నా భార్యాబిడ్డల మీద మీ కెందుకక్కరకరం?" విసుగ్గా అడిగాడు నక్సలైట్.

"కేవలం మానవత్వం వల్ల." గ్లాడ్‌సాబ్ ఈ జవాబు వింటూనే రెచ్చిపోయాడు నక్సలైట్. "మానవత్వమా? మీకూ మానవత్వానికేం సంబంధం? మానవత్వపు విలువ తెలుసుకోవాలంటే మనిషిలో మనిషి గుండే ఉండాలి. అదేమీ లేని మీకు— మీలాంటి నరపశువుల మానవత్వంతో ఏం సంబంధం?"

ఒక ఖైదీ గ్లాడ్‌సాబ్ నిలా అవమానించడం చూసి జమేదారు కూడా సహించలేకపోయాడు. నక్సలైట్‌కేసి కర్రలేపుతూ ముందు కొచ్చాడు. కాని గ్లాడ్‌సాబ్ అతన్ని చేత్తో వెనక్కు తోశాడు. నక్సలైట్ మాత్రం ఇవేమీ పట్టించుకోకుండా అనేస్తున్నాడు. "ఐ నో, నాకు తెలుసు. మర్సీపిటిషన్‌పై నేను సంతకం చేయకపోవడం మీ గవర్నమెంటుకు అవమానకరంగా తోచింది. నేను గవర్నమెంటుకు కేర్ చేయక పోవడం వాళ్లు భరించలేక మీతో చెప్పారు, నాచే సంతకం చేయించమని. అందుకేగదూ మొన్నట్నించీ నన్ను బుట్టలో వేసుకుందామని నాకన్ని సౌకర్యాలూ కల్పించారు. నాతో తియ్యగా మాట్లాడుతున్నారు." నక్సలైట్ ఇలా ఆరోపించడంతో గ్లాడ్‌సాబ్ ఖిన్నుడయ్యాడు. మాట్లాడలేక పోయాడు. కాసేపలాగే స్తబ్ధంగా కూర్చుని లేచాడు. ద్వారంవద్ద క్షణంసేపాగి నక్సలైట్‌తో అన్నాడు "ఇంకా కుర్రాడివి. ఒట్టి తప్పటడుగులువేసే కుర్రాడివి. నీకు రాజకీయాలు తెలీవు. మానవత్వమంటేకూడా అర్థంకాదు. నేను నీగుమ్మంలో కెందుకొస్తున్నానో నీకు తెలీదు. కారణం నీజీవితమెప్పుడూ విధ్వంసం కాలేదు. కాకూడదు. మనిషిని మనిషి అర్థం చేసుకోవడం అంత తేలిక కాదు బాబూ. ఇక రాజకీయాలంటావా? అవి నీ కర్థమౌతే ప్రభుత్వం నీ మర్సీ పిటిషన్‌కై కాచుక్కూర్చుందని నీ వనుకోకనే పోదువు. ఓ. కే. నేను మళ్ళీ వస్తాను. ఆఖరు క్షణం వరకూ వస్తూనే ఉంటాను. నిన్నుత్తి పుణ్యానికి చావనివ్వను. బాయ్" అంటూ బయల్దేరాడు. ఆ బయల్దేరడం ఏకంగా తన బంగళాకే చేరాడు. సూర్యుడు అస్తమిస్తున్నాడు. నక్సలైట్‌ను కన్విన్స్ చేయడంలో మరోరోజు గడిచింది.

రాత్రయింది. రోజూలాగే తన విస్కీ బాటిల్, గ్లాసూ పెట్టుకుని కూర్చున్నాడు సాబ్. మామూలుగా నాలుగైదు పెగ్గులు

పడ్డాక ఎడారిలాంటి తన జీవితంలోకూడా పచ్చికబయళ్లు కనబడతాయి. క్రమంగా తన్నుతాను మరచి కలల్లోకి జారుకుంటాడు. కాని ఇవ్వాళ దేంపాపమో కాని పెగ్గుమీద పెగ్గు పొట్టలో కుమ్మరించినా అతనికి మైకం రావడంలేదు, నిద్ర పట్టడం లేదు. నక్సలైట్ మాటలు మరువలేక పోతున్నాడు. తడబడుతూ లేచాడు. చీకట్లో తూలుతూ తోటలో కొచ్చాడు. ఓ సారి గట్టిగా గాలిపీల్చి గుండెల నిండుగా నైట్ క్వీన్ పరిమళాన్ని నింపుకున్నాడు. దాంతో అతని శరీరం పులకించింది. 'తనకు మనిషి గుండె లేకపోవడమేమిటి?' ఉన్నదని రూఢిగా తోచాక గ్లాడ్‌సాబ్ నైట్‌క్వీన్‌ను గట్టిగా కౌగిలించుకున్నాడు.

నైట్‌క్వీన్ అంటే గ్లాడ్‌సాబ్‌కు చాలా ఇష్టం. మధ్యాహ్నపు వెలుగులో సొగసులూ వయ్యారాలూ పోయే పూల చెట్లంచే అతని కిష్టం ఉండదు. కేవలం సుఖంలో మాత్రమే వాటా కోరే క్షుద్ర మానవుల్లాంటి వామొక్కలు. కాని నైట్‌క్వీన్?...సూర్యుడ స్తమించాక నిశబ్ద నిశీధిలో అందర్నీ తన సుగంధంలో ముంచెత్తేందుకు, వారి వారి దుఃఖాలనుండి మరపించేందుకు నైట్‌క్వీన్ నిటారుగా నిలబడుతుంది.

కాలం, ఆ కాళరాత్రిని ఆబగా మింగేస్తుంది. జైల్లో పన్నెండు గంటలు కొట్టారు. ఒక్కసారి కళ్ళు బాగా తెరిచి చుట్టూ పరికించాడు గ్లాడ్‌సాబ్. చుట్టూ పెద్ద పెద్ద వృక్షాలూ, జైలు గోడలూ మధ్యలో దయ్యంలా తన బంగళా. ఎందుకో ఒక్కసారి భయంతో అతని వొళ్ళు జలదరించింది. నైట్‌క్వీన్‌ని ఇంకా గట్టిగా కౌగలించుకున్నాడు. నైట్‌క్వీన్‌మాత్రం గర్వంగా, రీవీగా, నిటారుగా నిలబడి ఆ భయంకర నిశ్శబ్ద నిశీథిలో ప్రసన్నంగా నవ్వుతూంది; గెస్టాపోల చేత చిక్కిన మారాలాగా. 'మారా' జ్ఞాపకంతో రెక్కలు తెగిన పక్షిలాగా కొట్టుకున్నాడు గ్లాడ్‌సాబ్. 'మారా, మారా' మనసుః మారా జపంచేస్తూ నైట్‌క్వీన్‌ను గట్టిగా గుండెకదుముకున్నాడు. నైట్‌క్వీన్ గ్లాడ్‌సాబ్ నూరడించింది. కాసేపటి కతడు కొంచెం స్థిమితపడ్డాడు. అతనికి మళ్ళీ నక్సలైట్ మాటలు గుర్తొచ్చాయి. కోపం, దుఃఖంపట్ట లేకపోయాడు. పళ్ళు కొరుకుతూ గొణిగాడు. "భాంచోత్, నాలుగు పుస్తకాలు చదివాడో లేదో తన్ని తాను గొప్ప విద్వాంసుడనుకుంటున్నాడు. నాకు గుండె లేదంటాడా ఛడవ! సాలా."

గ్లాడ్‌సాబ్ కోపంతో నైట్‌క్వీన్ దగ్గర్నించి లేచి హాల్లో కొచ్చాడు. నైట్ డ్రెస్ విసిరేసి యూనిఫారం వేసుకున్నాడు. నడుముకు లెదర్‌బెల్ట్ బిగించి, మర్సీ పిటిషన్ కాగితాలు జేబులో దోపాడు. జైల్‌కేసి నడవసాగాడు. నిర్మానుష్యమైన నల్లని తారు రోడ్డుమీద బూట్ల చప్పుడు వినిపించడంతో ఇరుపక్కలా వినిపిస్తున్న కీచురాళ్ళ అరుపు ఆగిపోయింది.

గార్డ్ డ్యూటీ హవల్దార్ సలాం కొట్టాడు. మేన్‌గేట్ కాపలా దారుడు తొట్రుపాటుతో మేన్‌గేట్ తెరిచాడు. గ్లాడ్‌సాబ్ జైల్లో అడుగు పెట్టగానే గాఢ నిద్రలో ఉన్న ఖైదీలు భయంగాలేచి తమ తమ పక్కలమీద కూర్చున్నారు. అర్ధరాత్రి చెప్పాపెట్టకుండా గ్లాడ్ సాబ్ జైలుకు రావడంతో నైట్ డ్యూటీ వాచ్‌మన్‌లు, వార్డర్లు, బంట్రోతులు, జైలర్లూ అంతా ఒకటే ఉరుకులూ, పరుగులూ.

ఫాసీగేట్‌లో ప్రవేశిస్తూనే గ్లాడ్‌సాబ్ గర్జించాడు. "ఒరే ఖైదీ నెంబర్ 842." సాబ్ గర్జనతో పాపం పిచ్చి ఖైదీ మేల్కొని లేచి కూర్చున్నాడు. బూట్లు టకటకలాడిస్తూ సాబ్ నక్సలైట్ సెల్ ముందాగాడు. అతన్ని చూస్తూనే ఇంకా నిద్రపోని నక్సలైట్ ఎప్పటిలాగా చిరునవ్వుతో "హల్లో మిస్టర్ గ్లాడ్ హౌ ఆర్యూ?" అన్నాడు.

కాని నక్సలైట్ చిరునవ్వు ప్రభావం గ్లాడ్‌సాబ్‌మీద ఏమాత్రం పడలేదు. వెర్రి జమేధారునుచూస్తూ "కళ్ళు పోయాయా? తలుపు తెరవ్వేం?" అ...

పాపం వెర్రి జమేదారు తడబడ్డాడు. అసలే నిద్రమత్తు. ఒక్క క్షణం అతనికేమీ తోచలేదు, ఎలాగోలా శ్వాస బిగబట్టి తాళం తెరచి గట్టిగా ఊపిరి పీల్చుకున్నాడు.

వెర్రిజమేదార్ తాళం తీయగానే తలుపును గట్టిగా తన్నాడు గ్లాడ్‌సాబ్. ఇనప తలుపులు 'ధబాల్మ'ని రాతి గోడలకు గుద్దుకున్నాయి. జైలంతా ఆ శబ్దం మార్మోగిలది.

గ్లాడ్‌సాబ్ సెల్‌లో ప్రవేశించి కాళ్ళతో అక్కడున్న పుస్తకాలన్నీ చిందర వందరగా తొక్కేశాడు. "కవితలు చదువుతావుకదూ! వెధవ కవితలు చదువుతావ్" అంటూ.

ఉన్నట్టుండి హఠాత్తుగా నక్సలైట్ మెడ పట్టుకుని ఊపేస్తూ "చెప్పు మర్సీపిటిషన్‌పై సైన్ చేస్తావా లేదా?" అన్నాడు.

లేదన్నట్టు నక్సలైట్ తల అడ్డంగా ఊపాడు. దాంతో రెచ్చిపోయిన గ్లాడ్‌సాబ్ అతని రెండు చేతులూ గట్టిగాపట్టి ఆగోడకూ ఈగోడకూ అతన్ని బలంగా విసిరికొట్టసాగాడు. గోడలకు గుద్దుకుంటున్న శబ్దంతో పక్క సెల్‌లలోని ఖైదీలు ప్రాణాలు బిగబట్టుకుని ఏం చేయాలో తోచక వణికిపోతున్నారు: ఇంకొన్నాళ్ళలో రపబోయే గాడ్‌సాబ్ ఆవేశం, పబలం చూచి భయంతో వణుకుతున్నాడు వెర్రి జమేదార్.

గోడకేసి కొట్టీ కొట్టీ అతని ఎముకలన్నీ సున్నిచేశాక అతన్ని నేలకేసివిసిరికొట్టాడు గ్లాడ్‌సాబ్. ఇన్ని తన్నులూ తినికూడా నేలమీద

సంచిలేచి నిటారుగా తలెత్తి ప్రశ్నిస్తున్నాడు నక్సలైట్. తన మొరటు చేతుల్తో గ్లాడ్‌సాబ్ మళ్ళీ నక్సలైట్ ముఖంమీద గట్టిగా తగిలించి "ప్రభుత్వాదేశంతో మర్సీ పిటిషన్‌కోసం నీచుట్టూ తిరుగుతానంటావా? నాకు గుండె లేదంటావా? నేను పక్కనసుకున్నావ్రటా? నీకులేదు గుండె. నీకులేదు మనసు. నీచుడా, లుచ్చా, వెధవా, సాలా ఇటు కవితలు చదువుతాడు, అటా పిచ్చిపిల్ల జీవితాన్ని వినాశనంచేసి, దాన్ని విధవను చేస్తాడు. ఆ అభం శుభం తెలీని వెలెడు కుర్రాణ్ణి అనాథనుచేస్తాడు. ఇంకా కవితలు కావాలేం నీకు...కవితలు...ఇదిగో కవితలు తీసుకో" అంటూ తన మొరటు పసబలంతో రెండు గుద్దులు బలంగా నక్సలైట్ గుండెలో గుద్దాడు. యువకుడూ, బలవంతుడూ అయిన నక్సలైట్ ఆ దెబ్బలతో గిర్రున తిరిగి కింద పడ్డాడు. సాబ్ అతని గుండెమీద రెండు మోకాళ్ళూ బలంగా అదిమిపెట్టి అతని జుట్టుపట్టి తల పైకెత్తాడు. "హరాంఖోర్, ఆ అమ్మాయి కాళ్ళకు చెప్పుల్లేక నీకోసం నడిస్తే కాళ్ళు పగిలాయి. ఇప్పుడు నువ్వు చచ్చి దాని గుండె బద్దలు కొడ్తావా? నాలాగా దాని జీవితం ఎడారి చేస్తావా?" అంటూ మళ్ళీ నిలబెట్టాడతన్ని. మిగులా, తగులా చెంపదెబ్బ లంటిస్తూ "నీచుడా, నువ్వు క్రాంతివీరుడివి కాదు. గెస్టాపోవి, హిట్లర్, నాజీ, ఫాసిస్ట్..."

దెబ్బలు భరించలేని నక్సలైట్ క్రింద పడిపోయాడు. గ్లాడ్‌సాబ్‌కూడా అలసిపోయాడు. చెమటతో అతని ఒళ్ళంతా తడిసిపోయింది. ఆ విస్కీ మైకం, కోపం, ఉద్రేకంలో కూడా అతనికి నక్సలైట్ భార్య కాలి పగుళ్ళు గుర్తొచ్చాయి. గ్యాస్ ఛేంబర్లో కాలుతున్న మారా గుర్తొచ్చింది. కళ్ళు గట్టిగా మూసుకుని మనసులోనే మారా...మారా అంటూ అరిగాడు గ్లాడ్‌సాబ్.

జైల్లో ఒంటిగంట కొట్టారు. గ్లాడ్‌సాబ్‌కు పరిసరాలు గుర్తొచ్చాయి. నక్సలైట్ క్రింద పడి ఉన్నాడు. అతని ముక్కులోంచీ, నోట్లోంచీ రక్తం కారుతోంది. ఇన్ని దెబ్బలు తింటున్నా ఒక్క మాటకూడా మాట్లాడలేదు; ఏమాత్రం ప్రతీకారం చేయలేదతడు. గ్లాడ్‌సాబ్ వంగాడు.

జేబులోంచి రుమాలుతీసి నక్సలైట్ ముఖం మర్సీ పిటిషన్ అతనిముందుంచాడు. నక్సలైట్ చేత్తో దాన్ని తోసేస్తూ "ఆర్ యూ సాటిస్‌ఫైడ్ మిస్టర్ గ్లాడ్? చాలా రోజుల్నుంచీ నన్ను కొట్టాలను కున్నారే. ఇవ్వాళ మీరు శాంతంగా నిద్ర పోండి" అంటూనే అతనికి స్పృహ తప్పింది. సాబ్ పాసిగేట్ జైలర్‌కు సంజ్ఞ చేయగానే జైల్ హాస్పిటల్ వార్డర్లు స్ట్రెచర్ తీసుకుని పరుగెత్తుకుంటూ వచ్చారు. సాబ్ సెల్‌లోంచి బయటకు రాగానే సెల్‌కు తాళం వేశాడు వెర్రి జమేదార్.

గ్లాడ్‌సాబ్ ఖాళీ సెల్‌కేసి చూశాడు. నక్సలైట్‌ను రిలీజ్ చేయించిందతనికి. ఆ ఊహతోనే అతని గుండెల్లో నొప్పి వచ్చింది. ఓ చేత్తో గుండెను గట్టిగా అదిమి పట్టుకుని కాళ్ళీడ్చుకుంటూ బంగళా కేసి నడవసాగాడు.

అర్ధరాత్రి నక్సలైట్‌ను చర్మం చిరిగేలా బూట్లకాళ్ళతో తన్నినా కూడా గ్లాడ్‌సాబ్‌కు నిద్ర పట్టలేదు.

ప్రక్క బెడ్ మీది రోగి దగ్గుతుంటే నక్సలైట్‌కు స్పృహ వచ్చింది. కాని గత రాత్రి తగిలిన దెబ్బలతో వచ్చిన జ్వరంవల్ల కళ్ళుతెరిచే శక్తి కూడా లేకపోయిందతనికి. కళ్ళు మూసుకునే ఒక్కసారి మూలిగాడు.

నైట్‌డ్యూటీ వాచ్‌మన్ నక్సలైట్‌కి స్పృహవచ్చింది గమనించి ఆర్. ఎమ్. ఓ. కు చెప్పడానికి పరుగెత్తాడు. గ్లాడ్‌సాబ్ ఆర్డర్ ప్రకారం కేవలం నక్సలైట్ కోసమే నియమించబడ్డ వార్డ్‌బాయ్ కోలన్ వాటర్‌పట్టీ మార్చాడు. జైలు హాస్పిటల్లో చావ సిద్ధంగా ఉన్న రోగులుకూడా నోచుకోని సేవా శుశ్రూషలను నక్సలైట్ నోచుకున్నాడు. గ్లాడ్‌సాబ్ ఆర్డర్ మరి, తిరుగులేదు.

దూరంనించి బూట్ల శబ్దం. హాస్పిటల్లో కలకలం ఒక్కసారిగా ఆగిపోయింది. రోగులచుట్టూ జుయ్యిమంటూ ముసిరే ఈగలు కూడా దాక్కున్నాయి. గ్లాడ్‌సాబ్ వార్డులో అడుగు పెట్టగానే ఆర్. ఎమ్. ఓ. అతడి కెదురెళ్ళి అతన్ని నక్సలైట్ మంచం దగ్గిరికి తీసుకొచ్చాడు.

"హల్లో యంగ్ బాయ్" గ్లాడ్‌సాబ్ పిలిచాడు. కాని జవాబిచ్చే శక్తి నక్సలైట్‌లో లేకపోయింది.

"కొంచెం టెంపరేచర్ ఉంది" డాక్టరు తెలియజేశాడు. అది విని గ్లాడ్‌సాబ్ తనచేయి నక్సలైట్ నుదుటిమీదుంచాడు. ఆ మొరటు చేతి స్పర్శలోని ప్రేమార్ద్రతలు నక్సలైట్‌కు అర్థమై అతడు నెమ్మదిగా కళ్ళు తెరిచాడు. గ్లాడ్‌సాబ్ వంగి "దెబ్బలు బాగా తగిలాయా బాబూ?" అన్నాడు మెల్లిగా నక్సలైట్ చెవిలో.

నక్సలైట్ లేదన్నట్టు తలాడించి క్షీణంగా అన్నాడు. ఐ వాజ్ లిటిల్ రాంగ్ మిస్టర్ గ్లాడ్. యూ ఆర్ నాట్ ఎ పెట్టీ బ్యూరాక్రాట్... ...

నక్సలైట్ మాటలకు గ్లాడ్‌సాబ్ సంతృప్తిగా నవ్వి గిర్రున అబౌట్ టర్న్ చేసి ఆఫీసుకేసి వెళ్ళాడు.

ఆఫీసుకొచ్చి తన కుర్చీలో కూర్చోగానే సీనియర్ జైలర్ గ్లాడ్‌సాబ్‌కో టెలిగ్రాం అందించాడు. కాని టెలిగ్రాం విప్పి చదవా

# బలహీన వర్గాలకు బంగారు బాట

శ్రీ ఎన్. టి. రామారావు నాయకత్వాన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం బలహీన వర్గాల ఆర్థిక, సాంఘిక సముద్ధరణకు కంకణం కట్టుకొని దీక్షతో కృషి చేస్తున్నది.

షెడ్యూలు కులాల సంక్షేమానికి, సాంఘిక భద్రతాచర్యలకు, బడ్జెట్ కేటాయింపు 1982-83 లో రూ. 78 57 కోట్లు కాగా 1983-84 లో రూ. 129 63 కోట్లు.

### * 2 రూ. లకు కిలో బియ్యం

108 లక్షల పేద కుటుంబాలకు ప్రయోజనం- రూ. 108 కోట్లు సబ్సిడీ

### * పేదలకు వసతి గృహాలు

శాశ్వతమైన పక్కాయిళ్ల నిర్మాణం గుడిసెల కార్యక్రమం రద్దు

సుమారు 70,000 పక్కా ఇళ్లు పూర్తి.

మొదటి దశలో రూ. 88 కోట్ల ఖర్చుతో 1.4 లక్షల ఇళ్ల నిర్మాణం

మొత్తం 2 2 లక్షల ఇళ్లు నిర్మించాలని సంకల్పం.

పేద కుటుంబాలకు 1 లక్ష ఇళ్ల స్థలాల పంపిణీ.

### * విద్య

37.45 లక్షల పేద విద్యార్థులకు మధ్యాహ్న భోజనం

13.52 లక్షల హరిజన గిరిజన వెనుకబడిన తరగతుల విద్యార్థులకు మెట్రిక్‌కు ముందు తర్వాత యిచ్చే ఉపకార వేతనాల కోసం రూ. 23.74 కోట్లు కేటాయింపు

### * ఆర్థిక సహాయం పథకాలు

3 లక్షల హరిజన గిరిజన కుటుంబాల సంక్షేమ పథకాల కోసం రూ. 225 కోట్లు కేటాయింపు

2. 88 లక్షల వెనుకబడిన తరగతుల కుటుంబాల కోసం మార్జిన్ మనీ క్రింద రూ. 14.81 కోట్లు.

వృద్ధాప్య ఫించనుల కోసం రూ. 7.99 కోట్లు.

### * మహిళా సంక్షేమం

ఆస్తులలో స్త్రీలకు సమాన భాగం కోసం శాసనపరమైన చర్య ప్రారంభం.

బడ్జెట్ కేటాయింపు 1982-83 లో రూ. 7.11 కోట్లు కాగా, 1983-84 లో రూ. 13 52 కోట్లకు హెచ్చింపు

### * వికలాంగులు

ప్రత్యేక డైరెక్టరేట్ ఏర్పాటు ; తిరుపతిలోనూ, విశాఖపట్టణంలోనూ, శిక్షణతోపాటు ఉత్పత్తికేంద్రాల స్థాపన.

## బలహీన వర్గాల సంక్షేమమే ప్రభుత్వ లక్ష్యం

సమాచార పౌరసంబంధ శాఖ : హైదరాబాదు

లన్న ఉత్సుకతకూడా లేదతనిలో. చాలా ఖుషీగా ఒళ్ళు విరుచు కుంటూ గొణుక్కున్నాడు.

"బచ్చా దేవకూఫ్‌హై. కాని ఆనెస్ట్. నౌ హీ రియలైస్డ్ దట్ అయాం నాటె పెట్టీ బ్యూరాక్రాట్." దాంతో అతనికి ధైర్యం వచ్చినట్టయింది. డ్రాయర్లోంచి మర్సీ పిటిషన్‌తీసి ఓ చిన్న స్లిప్ మీద వ్రాశాడు "బాబూ... జీవితం చాలా దుర్లభం. సంతకం చెయ్యి." కాలింగ్‌బెల్ నొక్కి వార్డర్ రాగానే అతని చేతికాస్లిప్పూ మర్సీ పిటిషన్ ఇచ్చి పంపించాడు. విస్కీ సీసా నోట్లో ఒంపుకుని వార్డర్‌కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు. వార్డర్ అనుకున్నదాని కంటే తొందరగానే తిరిగి వచ్చాడు. గ్లాడ్‌సాబ్ ఉత్కంఠతతో అతని చేతిలోని కాగితాలు లాక్కొని చూశాడు. సంతకం లేదుకాని తను వ్రాసిన స్లిప్‌మీదే ఇలా వ్రాసి ఉంది. "మిస్టర్ గ్లాడ్ జీవితం దుర్లభమే కాని హుతాత్ములవడం దైవదుర్లభం." గ్లాడ్‌సాబ్ ఖిన్నుడై నుదురు కొట్టుకున్నాడు. బయట ఎండ తగ్గిపోతోంది. మర్సీ పిటిషన్ ఆఖరు రోజు గడువు ముగిసిపోతుంటే నిస్సహాయంగాచూస్తూ ఉండిపోయాడు గ్లాడ్‌సాబ్.

రణ్, రణ్ సాయంకాలం ఆరు గంటలైంది. బందీటైం. మర్సీ పిటిషన్ గడువు ముగిసింది. రాతిబొమ్మలా కుర్చీ కంటుకు పోయిన గ్లాడ్‌సాబ్ బరువెక్కిన గుండెతో లేచాడు. ఒక్కొక్కర్నీ హాంగ్ చేయడమంటే సంబరపడే గ్లాడ్‌సాబ్ జీవితంలో మొదటిసారి— మొట్ట మొదటి సారి ఇంకొకరి జీవితం కాపాడే ప్రయత్నం చేశాడు. కాని అపజయం పొందాడు. ఆవేశంతో టేబుల్ మీద కొడ్తూ మనసులో అనుకున్నాడు. "ఉత్త కసాయిజన్మ నాది. ఎవరికీ పనికిరాని జన్మ, బుచర్."

'సర్"...సీనియర్ జైలర్. పిలుపుతో సాబ్‌కు పరిసరాలు గుర్తొచ్చాయి. "సర్ ప్రొద్దుటి టెలిగ్రాం అలాగేఉంది. మీరు చూడ్లేన్నా లేదు." అతడు గుర్తుచేయడంతో యాంత్రికంగా టెలిగ్రాం విప్పి చూశాడు సాబ్.

"అ యాం కమింగ్ పప్పా. ఫరెవర్ యువర్స్ జెనీ".

టెలిగ్రాం చదవడంతో తన్ను తానే మరిచిపోయాడు గ్లాడ్ సాబ్. "జెనీ ఓ మై లిటిల్ జీన్. స్వీట్ జీన్" పట్టరాని సంతోషంతో అరిచాడు.

సాబ్ సంతోషంగా అరచినా తుపాకి గుళ్ళచప్పుడలా తోచి పక్షులు మాత్రం చెట్టుకొటిగా ఎగురుతూ దాక్కున్నాయి.

సాబ్ గారాల కూతురు ఇండియాకు వస్తుంది. ఆమెను రిసీవ్ చేసుకుందుకు సాబ్ బొంబే వెళ్ళాలి. అందుకే గబగబా లీవ్ అప్లికేషన్ గీకేసి సీనియర్ చేతికిచ్చాడు.

గ్లాడ్‌సాబ్ నాలుగు రోజుల సెలవు మీద ఊరెళ్ళుతున్నాడని తెలిసి జైల్లోని రావి, మర్రి చెట్లక్కూడా 'హాయ'ని పించింది. సంతో షంగా తలలూచాయి.

సాబ్ ఖుషీగా తన బంగళా కేసి నడిచాడు.

## 8

పక్షుల కిలకిలారావం ఆగిపోయింది. రోడ్డు నిర్మానుష్యమైంది. నల్లని తార్రోడ్డు మీద బూట్లు చప్పుడు చేస్తున్నాయి. గార్డు డ్యూటీలో వున్న హవల్దార్ అటెంషన్‌లో నిలబడ్డాడు. ఇంతలో చల్లని పిల్ల వాయువుపై తేలుతూ ఓ ఈలపాట వినిపించింది.

గార్టీలోని జమేదార్, ఇతరు వాళ్లంతా కొంచెం చిరాగ్గా చుట్టూ పరికించారు. ఎదుట దృష్టి నిలవగానే ఆశ్చర్యంలో ఎవరికీ నోట మాట రాలేదు. కళ్లు విప్పారించి చూస్తూనే ఉండిపోయారు. ఎదురుగా గ్లాడ్‌సాబ్ చేతిలోని స్టిక్ విలాసంగా ఊపుతూ, లయ బద్ధంగా అడుగులు వేస్తూ వస్తున్నాడ ఇవాళ అతని చూపులో క్రోధం; కౌర్యం స్థానంలో ప్రసన్నత దోబూచులాడుతుంది. అదేదో పాట గొణుక్కుంటున్నాడు.

"ప్రియతమా! నీకోసం చావునైనా ఛాలెంజి చేస్తాను.

ప్రేయసీ నీకోసమే నే దేవతలనే మరిచిపోతాను.'

జమేదార్ కళ్లు నులుముకుని మళ్ళీ మళ్ళీ గ్లాడ్‌సాబ్ కేసి వెర్రిగా చూశాడు. గ్లాడ్‌సాబ్ నిజంగానే విలాసంగా చేతి కర్ర ఊపుతూ ప్రసన్న వదనంతో పాడుతూ లయబద్ధంగా అడుగులువేసూ వస్తున్నాడు. "ప్రియతమా! నీకోసం......"

గ్లాడ్‌సాబ్ దగ్గరి కొస్తుంటే స్పృహలో కొచ్చిన జమేదార్ సెల్యూట్ కొట్టాడు. మందహాసంతో అతని సలాం అందుకుని మేన్ గేట్లో నెమ్మదిగా, అతి నెమ్మదిగా రాళ్లు పరిచిన నేల కెక్కడ నొస్తుందో నన్నంత నెమ్మదిగా అడుగు పెట్టాడు. సాబ్ కోర్టుహూర్చో గానే దడదడ లాడే గుండెతో, వణుకుతున్న కాళ్ళతో వచ్చిన ఖైదీల కేసి చూస్తూ "మదమెక్కిందట్రా, ఇంకోసారి మీ మీదిలాంటి ఫిర్యా దొస్తే చూడండి" అంటూ గర్జించాడే తప్ప శిక్ష ఏమీ విధింపలేదు. అతని గర్జన ఎప్పటిలా ఆకలిగొన్న సింహ గర్జనలా లేదు. సారంగి

వాద్యంలా ఉంది. అందర్నీ ఊరికే బెదిరించి వదిలేసి సాబ్ రౌండ్‌కు బయల్దేరాడు.

తన సర్వీసు మొత్తంలోనూ సాబ్ ఇలా ఎన్నడన్నా ప్రవర్తించాడా అని ఆలోచించాడు సీనియర్. అతడికి గ్లాడ్‌సాబ్ ప్రవర్తన అంతు చిక్కకుండా ఉంది. జైల్లోని తోట్లోకెళ్ళి నాలుగు జాజిమొగ్గలు కోసి వాసన చూస్తూ, పాడుతూ నడుస్తున్నాడు గ్లాడ్‌సాబ్. అనుకోకుండా వంటశాల కేసి నడిచాడు. భట్టీ మీద జొన్న రొట్టెలు మాడుతున్నాయి. వాటిని చేతిలోకి తీసుకుని గదమాయిస్తూ "హౌ ఈజ్ దేర్? మంట తగ్గించండి. ఖైదీలకు మాడిన రొట్టెలు పెడతారా?" అంటూ రేషన్ సామానులిస్టు చూశాడు. రవ్వ, పంచధార మిగులు చూసి ఖైదీలకు 'సిరా' వండిపెట్టమని ఆదేశమివ్వడంతో వంటశాల జైలర్ సాబ్‌కు నిజంగానే పిచ్చెక్కిందనుకున్నాడు. లేకపోతే నాలుగైదొందల రూపాయల సామాను ఇంటికి తీసుకెళ్ళక ఖైదీలకు వండి వడ్డించడమా? అతడు ఆశ్చర్యంనుంచి తేరుకునేసరికి గ్లాడ్‌సాబ్ పడ్రింగి విభాగానికి చేరుకున్నాడు.

అనుకోకుండా సాబ్ రావడంతో అక్కడి ఖైదీలో తత్తరపాటు మొదలైంది. ఇద్దరు కుర్రాళ్లుమాత్రం ఇవేవీ పట్టనట్టు ఓ మూలన కూర్చుని చదువుకుంటున్నారు. గ్లాడ్‌సాబ్ వచ్చినట్టు గమనించనేలేదు. సాబ్ అకస్మాత్తుగావచ్చి వారి ముందు నుంచోగానే మాత్రం తడబడుతూ లేచారు. నోట మాట రాలేదు వారికి. గ్లాడ్‌సాబ్ దృష్టి వారి చేతిలోని పుస్తకాలమీద పడటంతో సీనియర్ జైలర్ ముందుకొచ్చి చెప్పాడు. "సర్ ఈ పిల్లలిద్దరూ మెట్రిక్యులేషన్ పరీక్షకు చదువుతున్నారు. రాత్రి సెల్‌లో చిన్న లైట్‌లో చదువలేమన్న నెపంతో ఇప్పుడు పనెగవేస్తుంటారు."

"ఆ మాట నిజమేకదా మరి? అసలు ఇంకో పదిహేను రోజుల్లో పరీక్షలుంపే వాళ్ళని పనికి నియమించిన గాడిదెవరు? వాళ్ళకు పని మాఫీ చేయండి. సెపరేట్ రూంలో ఉంచి ఆ రూంలో పెద్ద బల్బు ఉంచండి." ఇలా మాట్లాడ్డం గ్లాడ్‌సాబ్ ఇంటా వంటా లేదు. దాంతో సీనియర్ జైలర్‌స్థితి చాలా దయనీయమైంది. కాని సాబ్ జైలర్‌వేపే చూడకుండానే ఆ ఇద్దరు కుర్రాళ్ళతో అన్నాడు. "పరీక్ష ప్యాసై చూపించండి. ఇంకో పదిహేను రోజులు మాఫీ ఇస్తా"నంటూ ముందుకుసాగి ఫాసీగేట్ కొచ్చాడు.

గ్లాడ్‌సాబ్ రావడంచూచి "నేను హత్య చేయలేదు" అంటూ అహర్నిశలూ అరిచే పిచ్చిఖైదీ పాపం! పిల్లి పిల్లలా ముడుచుకుని ఓ మూల కూర్చున్నాడు. సాబ్ వాడి సెల్ ముందాగి వాడికేసి చూస్తూ దయార్ద్ర కంఠంతో అడిగాడు: "నువ్వు నిజంగా హత్య చేయలేదట్రా?"

పిచ్చి ఖైదీ లేదన్నట్టు తలాడించాడు.

"మరి అలా భయపడతా వెందుకు? రా. నా దగ్గరకు రా" అన్నాడు గ్లాడ్‌సాబ్. పిచ్చి ఖైదీ భయం భయంగా దగ్గరికొచ్చాడు. సాబ్ కటకటాల్లోకి చేతులు పోనిచ్చి వాడి తల నిమిరాడు. "ఓరి పిచ్చివాడా జీసస్ కూడా ఉత్త పుణ్యానికి శిలువ ఎక్కాల్సివచ్చింది. నువ్వెందుకీ ఉరితాటికి భయపడతావు? భయపడకు. దేవుడు నీకు న్యాయం చేకూరుస్తాడు" అన్నాడు. పిచ్చివాడి కళ్ళనిండా నీళ్ళు పేరుకున్నాయి. గ్లాడ్‌సాబ్ బొంగురు గొంతుతో మళ్ళీ పాట అందుకుని నక్సలైట్ సెల్‌కేసి నడవసాగాడు. నక్సలైట్ చిత్రంగా, ఆశ్చర్యంగా గ్లాడ్‌సాబ్ కొత్తరూపాన్ని చూస్తున్నాడు. ఇంతలో గ్లాడ్‌సాబ్ అన్నాడు. హల్లో యంగ్ బాయ్ నా పాటవల్ల కష్టం కలగలేదు కదా! నా కంఠం సైగల్ కంఠం అంత తియ్యనిది కాకపోవచ్చు కాని అంత గంభీరమైంది కాదా?

నక్సలైట్ నవ్వుతూలేచి కటకటాల దగ్గరికొస్తూ "కంఠం సంగతి వదిలెయ్యండి మిస్టర్‌గ్లాడ్. కాని ఆపాట సాహిత్యం చాల బాగుంది. ఎవరిదా కవిత?" అడిగాడు.

అజాగ్రత్తగా ఉన్న సాబ్ అనేశాడు నా పేర్యసిది."

"మీ పేర్యసి?" కుతూహలంగా అన్నాడు నక్సలైట్. తను గోలిలో ఇరుక్కున్నట్టు గమనించిన గ్లాడ్‌సాబ్ బొళ్ళున నవ్వే

"యూ నాటీ బాయ్. అరే బేటా ఈ ప్రపంచం చాలా క్రూరమైనది. ఇక్కడెవరూ ఎవర్నీ ప్రేమించకూడదు. నే నెప్పుడూ ఎవర్నీ ప్రేమించలేదు" అన్నాడు.

కాని ఎలా అర్థమైందో ఏమోకాని ఫాసీగేట్ వెర్రిజమేదారు క్కూడా గ్లాడ్‌సాబ్ అబద్ధమాడుతున్నట్లర్థమైంది.

'ఎక్కడుంటారావిడ? గ్లాడ్‌సాబ్ మాటలను పట్టించుకోకుండా అడిగాడు నక్సలైట్.

గ్లాడ్‌సాబ్ తడబడ్డాడు. తత్తరపాటుతో ఏం చెపుతున్నాడో తనకు తెలీకుండానే ఒక్క గుక్కలో "ఎక్కడుంటుంది? ఆమె జర్మన్ జ్యూ. హిట్లర్ అనుచరులు మారాను గ్యాస్ ఛేంబర్లో వేశారు. ఇప్పుడామె స్వర్గంలో...నేనిక్కడ" అన్నాడు కళ్లు గట్టిగా మూసుకుని. వెర్రి జమేదారు గ్లాడ్‌సాబ్ కళ్లలో నీళ్లు బయటికి కనిపించనీయలేదనీ, ఒక్క వెక్కుతో మింగేశాడనీ కనిపెట్టాడు.

గ్లాడ్‌సాబ్ ఈ సారి కొంచెం దుఃఖ మిశ్రితమైన స్వరంతో మళ్ళీ పాట అందుకున్నాడు. కాని క్షణంసేపు మాత్రమే. ఆ తరువాత తన ఆంగ్లోఇండియన్ బుగ్గంమీద గులాబీ రంగు పేరుకుంటుంటే, ఆరేళ్ళ పిల్లవాడిలా ఉత్సాహం ఉరకలు వేస్తుంటే నక్సలైట్‌తో ఏదో గుర్తొచ్చినట్టు మాట్లాడసాగాడు.

"నీవు మరియమ్ ఎలా ఉండేదో చూడాలనుకుంటున్నావా? నా కూతుర్ని చూడు. జెనీఫర్ అచ్చం మారాలాగా ఉంటుంది. చిన్నప్పటి నుంచి దాన్ని వాళ్ళమ్మ స్కూల్లో బెర్లిన్‌లోనే ఉంచాను. రెండేళ్ళ క్రితం నాకు చెప్పకుండానే అక్కడే పెళ్ళి చేసుకుంది. నా క్కోపం వచ్చింది. నేను సంబంధం తెంచుకోవాలను కున్నాను. ఉత్తరాలు వ్రాయడం మానేశాను. కాని నెలరోజుల క్రితం తను ప్రెగ్నెంట్ అంటూ ఉత్తరం వ్రాసింది. బస్, నాలోని ఇండియన్ తండ్రి మేల్కొన్నాడు. ఓ విధంగా చూస్తే నేను పక్కా ఇండియన్‌ని సుమా! కూతురి మొదటి డెలివరీ పుట్టింట్లోనే జరగాలి. అందుకే రమ్మని వ్రాశాను. పదేళ్ళ తరువాత నిన్న ఇండియా కొచ్చింది. రాత్రంతా మేం కబుర్లతోనే గడిపాం. నీ పేరునామా సంగతి చెప్తే తనంది. "డాడీ ఇటీస్ ఎ రివల్యూషనరీ పోయెం. నాకీ కవిని కలుసుకోవాలనుంది." నిన్ను కవి అంది చూశావా? నక్సలైట్ అన్లేదు కలుస్తావా ఆమెను? మాట్లాడతావా ఆమెతో? చిన్న కుర్రాడిలా అడగసాగాడు గ్లాడ్‌సాబ్.

"ఎందుకు మాట్లాడను? తన కవితలను మెచ్చుకునే పాఠకులంటే కవికెప్పుడూ అభిమానమే కదా" అన్నాడు నక్సలైట్.

"అరే ఆమెను కలుసుకున్నాక ఏం మాట్లాడాలోతోచదు నీకు. ఆమెకేసి చూస్తూనే ఉండిపోతావు. నా కూతు రెంత అందంగా ఉంటుందో నీ కేం తెలుసు? ఏదీ ఊహించుకో చూద్దాం. నువ్వెంత అంచనా వేయగలవో నా కూతురి అందాన్ని గ్లాడ్‌సాబ్" అన్నాడు.

"మహా అయితే......... ఆమె నా మృత్యువంత అందంగా ఉంటుంది" అన్నాడు నక్సలైట్.

ఆ మాట వింటూనే కటకటాల్లోకి చేయి దూర్చి నక్సలైట్ జుట్టు పట్టుకుని కటకటాలకు మెల్లిగా కొడ్తూ "యూ బ్రేవ్ యంగ్ మ్యాన్. రెండేళ్ళ క్రిందటే నాకు నువ్వు కలిస్తే నాకూతుర్ని నీకే ఇచ్చేవాణ్ణి. ఆల్‌రైట్ సాయంత్రం ఆమెను తీసుకొస్తాను. ఎదురు చూస్తూండు." అంటూ ప్రసన్నంగా పాడుతూ, విలాసంగా చేతికర్ర ఊపుతూ, లయబద్ధంగా అడుగులు వేస్తూ వెనుదిరిగాడు గ్లాడ్‌సాబ్. అతడు దూరంగా వెళ్ళినా, అతని పాట అందరి చెవుల్లోనూ మార్మోగుతూనే ఉంది. "ప్రియతమా నీ కోసం .." (సశేషం)

~~~~~~

**Statement about Ownership and other particulars about newspaper**

# BHARATI

Form IV (See Rule 8)

1. Place of Publication : Vijayawada
2. Periodicity of its Publication : Monthly
3. Printers Name : Sri S. Radhakrishna
   Whether citizen of India : Yes.
   Address : 14-14-21, Mallikarjura Rao St., Vijayawada 3
4. Publisher's Name : Sri S. Radhakrishna
   Whether citizen of India : Yes
5. Editor's Name · Sri S Radhakrishna
   Whether citizen of India : Yes
   Address : 14-14-21, Mallikarjuna Rao St., Vijayawada 3
6. Name - and address of individuals who own the newspaper and partners or share holders holding more than one percent of the total capital :
   1. Name : S. Kamakshamma
      Address : 1, Luz Avenue, Mylapore, Madras - 600 004.
   2. Name : S. Radhakrishna
      Address : 14-14-21, Mallikarjuna Rao Street, Vijayawada - 3.
   3. Name : S. Nageswara Rao,
      Address : 1, Luz Avenue, Mylapore, Madras - 600 004
   4. Name : S. Rajeswari,
      Address : 14-14-21, Mallikarjuna Rao Street, Vijayawada - 3.
   5. Name : S Seshamma,
      Address : 1, Luz Avenue, Mylapore, Madras - 600 004
   6. Name : S. Sreeramamurty, Trustee, Kasinadhuni Nageswarao, Sivalenka Sambhu Prasad, Dharma Nidhi
      Address · 14/45, Luz Church Road, Mylapore, Madras - 600 004.
   7. Name : S Ramayamma
      Address : 1, Luz Avenue, Mylapore, Madras – 600 004.
   8. Name : P. Satyanarayana
      Address : 183/184, Rashtrapathi Road, Secunderabad.
   9. Name : D Leela Bhramara
      Address : 1, Luz Avenue, Mylapore, Madras - 600 004.

I, S. Radhakrishna, hereby declare, that the particulars given above are true to the best of my knowledge and belief.

**S. Radhakrishna**

1-3-84 Signature of Publisher
~~~~~~

# ఉషస్సు

## శ్రీ ఎస్. ఎ. రవూఫ్

తూర్పులో జివ్వున ఎగిసిన
ఒక కాషాయపు నవ్వుతాలు రేఖ
నన్నింకా అలానే కలచి వేస్తూంది.

ఎప్పుడో ఏ మూలో మిగిలిన బాధాగ్ని స్పర్శ
నరాల్ని మీటుతోంది.

బ్రతుకు ఒక పెను కెరటం.
ఆకాశానికి విరుచుకుపడే అల
బ్రతుక్కి అర్థం చెప్తూంది.
నమ్మకాల్ని ఆశయాల్ని వెనక్కి లాక్కొనే
మనలానే వెనక్కి మళ్ళి పోతోంది.

కాలం కడలి నుండి కిరణాల్తో పడగలెత్తి
గగనానికి ఎగబ్రాకిన సూర్యబింబం
కెరటాల్లో అవ్యక్తపు టుంచుల్లో
జీవన ప్రతిబింబాన్ని పరచేస్తూ;
ఎక్కడో కూజితం వినిపిస్తూంది
నా కంపనలో అనునయంగా
ఊగేచెట్ల కొమ్మల్లో.

ఇంకా సుషుప్తిలో గాఢంగా
నిశ్వాసించే పూలకీ,
ఒక క్షణం ముగ్ధంగా
అమాయకంగా నవ్వి
అరమోడ్పుగా సాగే బ్రతుక్కి
తేడా తెలీని నేను
ప్రత్యూషపు లోగిలి లోంచి
అనంతంలోకి వీక్షిస్తున్నాను.
ముకుళించి గుప్పెడై
కనుచూపు మేరకే పరిమిత మయ్యే
చీకటి ప్రపంచం నించి
విస్తీర్ణ గగనాల్లోకి గమించే లే గువ్వల్లా
ఎన్నెన్ని నమ్మకాల కొమ్మల్నించో
విలువల గూళ్ళ నించో
రెక్క లల్లా రుస్తున్నాను
బాధాస్పద తిమిరాల్ని స్పృశిస్తూ,
భవిష్యాన్ని అనువదిస్తూ
ఉషస్సులా.

~~~~~~

# ఓరీ! పిచ్చివాడా!

## శ్రీ ఆదిరెడ్డి మావుళ్లు

తెల్లవారే పని గట్టుకుని
పరుగు పరుగున భానుడు
వచ్చేది అచ్చోసిన
ఆబోతువి నీకోసమా ?

అది చిచ్చుల బతుకుల
వెచ్చదనాల నింపుటకే! అని తెలుసునా ?

గలగల గాలులు మెల మెల్లన
వీచేది ఏసీల ఏడ్చే ఏబ్రాసీ
నీ కోసమా ?
ఏ సీమల చిరు చెమటల
పరిశ్రమించు శ్రామిక జీవుల
గుండె చల్లబరుచుటకే! అని తెలుసునా ?

ఆకాశమున ఆ జాబిల్లి
చల్లని తెలతెల్లని వెలుగులు
విరజిమ్ముట
మల్లె సొగసుల
మత్తు పానీయాలతో
మగువలతో కులికే
మందబుద్ధివి నీ కోసమా ?
కాదు. కానేకాదు.
అది చాలీ చాలని
గూళ్ళలో అల్లుకున్న
చిరు చీకటును
పార ద్రోలేందుకే రా
పిచ్చివాడా !!
~~~~~~

శ్రీ ఎ. విజయదత్తాత్రేయ శ

# కృష్ణా జిల్లా గ్రామనామములు - పరిశీలన

(గత సంచిక తరువాయి)

## మారిన పేర్లు - మారని ఊర్లు

బాలసారెనాడు పెట్టిన పేరుతోనే సరిపెట్టుకునేవారు ఎందరో కాగా, ఫ్యాషన్ ప్రలోభం వలననో, న్యూమరాలజీపై నమ్మకం వుండో పేరు మార్చుకునేవారు కొందరైనా ఉంటారు. దత్తుపెళ్ళే సందర్భాలలో పేరు మార్పు సంభవం. 'రికార్డ్'లలో పేరు మార్పు నమోదయినా జనవ్యవహారంలో పుట్టిననాడు పెట్టిన పేరే నిలిచిపోవడం వున్నది. వ్యక్తియొక్క గుణగణాలనుబట్టి లోకం కొందరికి వేరే పేరు పెడుతూ వుండటం వున్నది. రచయితల కలంపేర్లు ప్రత్యేకం. ఈ విధమైన బహు నామధేయాల వలననే 'ఉరఫ్'లూ, 'ఎలియాస్'లూ అవసరమవుతూ వుంటవి. గ్రామ నామముల విషయంలో కూడా ఈ విధమైన సందర్భాలు గమనించవచ్చును.

దాన సమయంలో గ్రామ నామమును మార్పుచేయడం ఒక సంప్రదాయంగా కానవస్తుంది. రాజరాజ నరేంద్రుని (క్రీ. శ. 1019-1060) కలిదిండి శాసన ప్రకారం ఆతడు యపకూరు, గలిదిండి, గ్నుండపట్లు అను మూడు గ్రామములను ఏకముచేసి యొక గ్రామముగామార్చి దానికి 'మధురాంతక వల్లూరు' అని క్రొత్తగా నామకరణం చేసినట్లు తెలుస్తోంది. "ఈ నూతన నామమర్థగర్భితమైనది. మధురాంతకుడను పేరు రాజేంద్రచోళ చక్రవర్తికి గలదని ప్రస్తుత శాసనమందే చెప్పియున్నది. రాజరాజ నరేంద్రుడు ఈ నూతన గ్రామమునకు రాజేంద్రచోళ మధురాంతక దేవునిపేరు పెట్టినాడనుట నిశ్చయము. సామాన్యముగా సామంతులు మున్నుగువారు గ్రామదానము సేయునప్పుడట్టి గ్రామమునకు దమ్మేలిన ప్రభువుపేరు పెట్టు సాంప్రదాయము కలదు."[70]

శ॥ సం॥ 1265 లో ప్రోలయవేముడు కృష్ణకు ఉత్తరమున గల అతుకూరు (వి) గ్రామమునకు వేమవరమని పేరుంచి దానం చేసాడు.[71] శ॥ సం॥ 1293లో గుడివాడ తాలూకాలోని జుజ్జవరము (దృజ్జవరము)ను అనవేముడు అనవేమపురమని పేరుంచి దానం చేసాడు.[72] శ॥ సం॥ 1280 లో అనపోతారెడ్డి (క్రీ. శ. 1353-1364) కోడూరు (గు) పురమునకు "అనపోతపురము" అని నూత్న నామకరణముంచి దానమిచ్చాడు.[73] ఈ కోడూరుపురమునకు అనపోతపురమని నామాంతరముండుటయు, ఇచ్చట అనపోతారెడ్డి దానశాసన మొకటి దొరకుటయు చూడగా, రెడ్డి ప్రభువగు అనపోతారెడ్డి రాజ్యవిస్తీర్ణము ఆతని ఆధిపత్య ప్రభావము మన మూహించుట కవకాశము గలదు.[74]

పైన చెప్పబడిన వాటిలో మధురాంతక వల్లూరు, అనవేమపురము, అనపోతపురము అను నూత్న నామములు వాడుకలో నిలువలేకపోయినవి. యపకూరు, కలిదిండి, జుజ్జవరము, కోడూరువంటి పాతపేర్లుపట్టి నిలిచినవి. కొన్ని రావులంటు క్రొత్తపేరు పాతపేరుని క్రోసిరాజయింది. రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు తన తండ్రి పేరు పెట్టినంతవరకు జగ్గయ్యపేట, బేతవోలు అని పిలువబడేది. రెవిన్యూ రికార్డులలో 1935 సం॥ వరకు జగ్గయ్యపేట (బేతవోలు) అనే వుండేది.[75]

గ్రామ నామములు సంస్కరించబడడముచేతనూ, అపభ్రంశ మొందుటచేతనూ మార్పు చెందుతూ వుంటవి. ముప్పవరము-ముప్పా-మొప్పా; అవనిజపురము-అవనిపురము-అవనిగడ్డ; ఆకిరిపల్లి-అగిరిపల్లి వంటివి ఇందులకు ఉదాహరణలుగా పేర్కొనవచ్చును. గర్వాణ ఘటితమైన యదుపురము నేడు గొల్లపల్లి (నూ) అని వ్యవహరించబడుతోంది.[76] హనుమంతపల్లి, అనుమంచిపల్లి (జ) అయినది.[77] బహుశా కరువు ప్రసిద్ధికెక్కిన ఒకప్పటి గడ్డిపాడు (వ) నేడు హనుమంతరాయపురముగా పేరు మార్చుకొన్నది.[78]

విజయవాడకు బెజవాడ అనియు, మచిలీపట్టణమునకు బందరు అనియు మారుపేర్లు ప్రసిద్ధములు. విజయవాడకు రాజేంద్రచోడపురమనియు, ఘంటశాలకు చోడపాండ్య పురమనియు ఒకప్పుడు వ్యవహారముండినట్లే గుడివాడకు కుందేశ్వరపురమని పేరుగలదనియు శాసనపరిశోధకుల అభిప్రాయమైయున్నది.[9]

రెండు పేర్లుకలిగిన ఊరు ఒక్కటి నేడు గ్రామనామ పట్టికలో కానవచ్చుచున్నది. మవాచింతల అను బొండపాడు (నం).

## గ్రామ నామములు - గృహ నామములు

అవినాభావ సంబంధముగల పై వాటిలో పరస్పర ప్రభావమును నిర్ణయించుట సులభముకాదు. గరికపర్తివారి (నూ), కుందావారి ఖండ్రిక (వి & గ), కురుగంటివారి ఖండ్రిక (నం), కౌరావారి అగ్రహారం (జ), చెన్నూరువారిపాలెం (గ) వంటి గ్రామములు ఆయా నామారంభమునందుగల ఇంటిపేళ్ళను బట్టియే నేర్పడినవని సులభముగనే గ్రహింపవచ్చును. గ్రామనామము గృహనామమైన వైనమును వివరించుటకు రెండు ఉదాహరణలీయబడు చున్నవి.

### కలిదిండి (కై)

పశ్చిమ గోదావరి మండలములోని పురాతన సంస్థానములలో నొకటియైన మొగల్తుర్రు ప్రభువుల గృహనామము. ఆ వంశీకుడగు రామరాజు 'పరసావిత్రి చరిత్రము'నే ప్రబంధాన్ని రచించాడు. "వారి పూర్వీకుడగు కుమార నరసింహరాజు ఆర్త ధర్మాభిమానియై కలిని దండించుటచే 'కలిదిండి' యను గృహనామ మేర్పడినదని వర సావిత్రి చరిత్రమునందలి కృత్యవతరణిక (పీఠిక 32) నిరూపించుట చమత్కారచారువైనను శాస్త్ర పరీక్షకు నిలువలేని వ్యుత్పత్తి. మొగల్తుర్రి కయిఫీయతు ప్రకారము వీరి ఇంటిపేరు 'జల్లిగడం' వారనియు, ఆ పిమ్మట 'కలిదిండి' వారుగా (కృష్ణా మండలము నందలి 'కలిదిండి' గ్రామ సంబంధమువలన) మారినట్లు స్పష్టపడుచున్నది."30

### వత్సవాయి (జ)

కృష్ణామండలమునందుకూడ విస్తరించుకొనియుండిన పెద్దాపుర సంస్థానాధీశుల గృహనామమైన 'వత్సవాయి'కూడ గ్రామనామమే. "పదమూడవ శతాబ్ది పూర్వార్ధములోని రామరాజు వత్సవాయి నగరమునందు నివసించుటవలన సాగి వంశమునకు వత్సవాయి నామ వ్యవహారము కలిగినదని రామవిలాసమునందు కలదు...రామరాజు వత్సవాయి నగరమునందు తన నివాసమును పాదుకొల్పుటవలన సాగి వంశమునకు వత్సవాయ వంశమను వ్యవహారము వచ్చినట్లు స్పష్టము."81

మల్లెల, మారేపల్లి, వావిలాల (తి); కురుమద్దాలి, కూరాడ, మోటూరు, నిభానుపూడి, విన్నకోట (గు), గురజాడ, లంకపల్లి, ముళ్ళపూడి, ఓగిరాల, పెనుమత్స, సూరంపల్లి (గ), మంగినపూడి, ముంజులూరు, ముచ్చెర్ల, నందమూరు (బం); అయ్యంకి, మల్లంపల్లి, నిమ్మగడ్డ, కాజ (ది); ముప్పాళ, పెండ్యాల, పొక్కునూరు (నం), చిలుకూరు, గొల్లపూడి, జూపూడి, కొటికలపూడి, పోరంకి (వి), మండవిల్లి (కై), దిగవల్లి (నూ) వంటి శతాధిక గ్రామనామములు గృహనామములుగా నున్నవి.

## వ్యక్తులపేర వెలసిన గ్రామ నామములు

సార్వభౌములూ, సామంత ప్రభువులూ కాని సామాన్య వ్యక్తుల నామములు గూడా గ్రామనామములైన సందర్భము లున్నవి. ఉదా॥ మచిలీపట్నమునకు బందరు అనే పేరు వచ్చుటకు గల కారణము ఇంతకు పూర్వమే పేర్కొన బడినది.

### అనమనపూడి (గు)

అనుమల సీతయ్యా అనే వ్యక్తి మొట్టమొదట అక్కడకు వచ్చి స్థిరపడటంతో ఈ వూరికి 'అనుమలపూడి' అనే పేరు వచ్చింది. అదే క్రమంగా 'అనమనపూడి'గా మారినది.82

### కొండపల్లి (వి)

"బహమనీ సుల్తానులలో నొకడగు రెండవ మహమ్మద్‌షా (1463-82) కాలమందు కొండపల్లి కోట యందు కొన్ని మార్పులు కలిగినవి. ఇతడు దుర్గము క్రింద నొక గ్రామమును గూడ నిర్మించెను. కాని నిర్మాణ మప్పుడు ప్రాకారములు నిలువకుండెనట! పునాదులు పదింబదిగ కూలిపోవు చుండెను. అప్పుడు 'కొండ'డను నొక గొల్లవానిని, 'పల్లె' యను అతని భార్యను బలియిచ్చి, పునాదులు వేసి గోడలు కట్టిరట! అప్పుడు గోడలు నిలబడినవట! నాటిలో క్రింద నున్న గ్రామమునకు 'కొండపల్లి' యను పేరు సార్థకమైనదట!83

## భౌగోళిక సంబంధములు

పై గాథ యందలి యథార్థ మెటులున్ననూ దాని యొక్క భౌగోళిక స్థితినిబట్టి ఆపేరు అన్వర్థమైన దనుట నిశ్చయము. భౌగోళిక లక్షణములను బట్టి గ్రామనామము లేర్పడుట యున్నది. శ. సం. 1280లో అన పోతారెడ్డి తన పేరుంచి దానము చేసిన కోడూరు(గు) అటువంటిదే. "కోడు అనగా కాలువ. దాని తీరమునందున్న ఊరు కోడూరు."84

### ది వి

"కృష్ణానది ఈ జిల్లాలో ప్రముఖమైన నది. ఈ నది కర్నూలు, గుంటూరు జిల్లాలగుండా వాయువ్య దిక్కుగా కృష్ణాజిల్లాను తాకి, జిల్లా పడమటి సరిహద్దునుచుట్టి సుమారు వంద మైళ్ళు ప్రయాణం చేసి హంసలదీవి వద్ద బంగళాఖాతంలో కలుస్తోంది. సముద్రంలో కలియుటకు ముందు అవనిగడ్డకు ఎగువభాగంలో కృష్ణానది రెండు

పాయలుగాచీలి ప్రవహించుటచే ఇట ఒక ద్వీపం ఏర్పడింది. అందుచే ఈ ప్రాంతానికి దివిసీమ అని పేరువచ్చింది.''85

లోయ(వి), కోన(బం), కొండూరు (కై & నం), చెరువుపల్లి (గు), పెనుగొలను(తి) ఇత్యాది గ్రామనామములు కూడ భౌగోళిక ప్రత్యేకతలను బట్టి ఏర్పడినవిగా ఎంచవచ్చును.

## చెట్లు – పంటలు మొ॥ సంబంధములు

### నూజివీడు

"శ్రీ రాజా విజయబహద్దరు అప్పారావు (1670 ప్రాంతం) గారు ఒకనాడు తన అనుచరులతో గుర్రపుస్వారీ చేయుచు ఒక నువ్వు చేను దగ్గరకు వచ్చిరి. అచ్చట ఒక మేక, తోడేలును ధైర్య సాహసములతో ఎదుర్కొనుచుండెను. ఆ దృశ్యము శుభసూచకము, జయావహము అని రాజా విజయ బహద్దరు అప్పారావు ఆ స్థలమున ఒక కోట నిర్మింపించిరి. నువ్వు చేనును బట్టియే ఆ కోట కట్టిన తావుకు నూజివీడు అని పేరు వచ్చెనని ఒక ఐతిహ్యము కలదు. ఇట్టి కథలు ఇతర నగరములను గూర్చియు కలవు. ఓరుగల్లును గూర్చి సువర్ణలింగ వృత్తాంతము, విద్యానగరమును గూర్చి కుందేళ్ళు వేట కుక్కలను తరుముట వంటి వృత్తాంతములు నూజివీడు కథకు మూలము కావచ్చును.''86

### ఆకులమన్నాడు (బం)

తమలపాకుల తోటలు విస్తారముగా యుండి యుండుటచే నీ గ్రామమునకు ఆకులమన్నాడు అను పేరు వచ్చెనట.87

### తోట్లవల్లూరు (వి)

మామిడి తోటలు విస్తారముగా నుండిన ఈ గ్రామమునకు తోట్లవల్లూరను పేరు వచ్చినదట.88

ఈ క్రింది గ్రామనామములను ఈ వర్గమునకు ఉదాహరణలుగా పేర్కొనవచ్చును. బూరుగుగూడెం, చింతలపాడు,మద్దులపర్వ, నారికంపాడు, తుమ్మగూడెం(తి), చిరిచింతల, దొండపాడు, గురివిందగుంట, మామిడికొల్లి, నిమ్మలూరు, పెసరమిల్లి, తుమ్మలపల్లి, వేముగుంట (గు); ఆముదాలపల్లి, గారపాడు, గురివిందపల్లి, కొయ్యగూరపాలెం, మామిళ్ళపల్లి, మర్రివాడ, వెదురుపావులూరు(గ); మర్రిబందం, పల్లెర్లమూడి, రావిచెర్ల, తాడిపల్లి, తోటపల్లి, పర్ణమాను(నూ); బొబ్బర్లంక, నిమ్మగడ్డ, ఉల్లిపాలెం, వేములపల్లి(వి); చింతపాలెం, కాకరవాడ, ప్రత్తిపాడు(కై); గరికపర్రు, కందులపాడు, మద్దూరు, మారేడుమాక, వెదురుబీడెం, వెంగలూరు (వి); పెద మొదుగుపల్లి, చినమొదుగు పల్లి, రావికంపాడు, గరికపాడు(జ); చింతలపాడు, గుమ్మడిదారు, జొన్నలగడ్డ, కాకరవాయి; తాడిగుమ్మి, తోటచర్ల, వేములపల్లి(నం); ఆకుమర్రు, ఆముదాలపల్లి, చెరుకుమిల్లి, గురువిందగుంట; కాకర్లమూడి, నారికేళపాలెం, తాడివెన్ను, వడ్లమన్నాడు(బం).

## జంతు మొ॥ సంబంధములు

### మచిలీపట్టణము

"సముద్ర తీరమునకు అరక్రోసెడు దూరమున బందరు అను అంధ వృద్ధుడొకడు జాలరి వృత్తిచే జీవించెడివాడు. ఈతనిచే అత్యంత కౌశల్యముతో పట్టుకొనబడిన ఒక గొప్ప మత్స్యమును వధింపగా బృహదాకృతిగల ఎముకలు అందు లభ్యమయ్యెను. ఈ ఎముకలతో నౌక ద్వారమును నిర్మించి, ఆ ఓడరేవున కర్రలతో నేర్పరచబడిన ఖిల్లాయందది అమర్చబడినందున దానికి మత్స్యాలి యను పేరు కలిగెను. 'మత్స్యాలి' అను శబ్దమే కొంత కాలము తరువాత 'మచిలీ'గా మారి యుండవచ్చును. అంతేకాక అంధుని జ్ఞాపకార్థమై ఆ ప్రదేశము 'బందరు' అని పిలిచినట్లు కూడ ఒక వాడుక కలదు.''89

పామర్రు (గు) పూర్వనామము పాములమర్రు.90 బల్లిపర్రు (గు& బం& గ), చిలకమూడి, పాములపాడు, వానపాముల (గు), గుర్రాలలంక, కాకులపాడు, కలవపాముల (గ); చిలకలపూడి (ది& బం), ఎలికలకుదురు, కొక్కిలిగడ్డ, పిట్టలంక (ది), చీమలపాడు(వి), బొర్రపోతులపాలెం, కర్నులదొడ్డి (బం) మొ॥ గ్రామనామములను ఈ వర్గములో మరి కొన్ని వుదాహరణలుగా పేర్కొనవచ్చును.

## జాతి, కుల, వృత్తి సంబంధములు

జగ్గయ్యపేట అను నూతన నామము తెచ్చుకొనక పూర్వము బేతవోలు దొంగల బేతవోలనియు, 1916 సం॥లో తాలూకాకేంద్రము కాకపూర్వము గన్నవరము దొంగల గన్నవరమనియు వ్యవహరింపబడెడివి.91 గొల్లపల్లి (నూ) యాదవులు (గొల్లలు) ఎక్కువగాగల గ్రామముకాబట్టి ఒకప్పుడు యదుపురమనియే వ్యవహరింపబడెడిది.92

జంగాలపల్లి, గొల్లపూడి (వి); కుమ్మరికుంట్ల, రెడ్డిగూడెం (తి), ఏదులగూడెం (నూ) చినగొల్లపాలెం, సుల్తానగరం గొల్లపాలెం, కుమ్మరిగుంట (బం), గొల్లపాలెం (ది); రాచపట్నం (కై) గొల్లమూడి(నం); సవరగూడెం (గ); గవెరవరం (జ); పెద ఎరుకపాలెం, రావులపాలెం (గు) ఇత్యాది గ్రామ నామములు ఈ వర్గమునకు చెందినవి.

## పెద్ద-చిన్న; పాత-క్రొత్త వగైరా

ఒకే పేరుగల గ్రామాలను వేరువేరుగా గుర్తించడానికి ఆయాపేర్లముందు పెద్ద-చిన్న అని విశేషణం చేర్చటం ఒక ఆనవాయితీ. ఇది ఆయా గ్రామాల విస్తీర్ణత, జనాభా, ప్రాచీనత వంటి వాటిని సూచిస్తుంది. ఉదా॥ పెదలింగాల-చినలింగాల, పెద మద్దాలి-కురుమద్దాలి, పెదపాలపర్లి-చినపాలపర్లి, పెదపారుపూడి-చినపారుపూడి పెద ఎరకపూడి-చిన ఎరకపూడి (అన్నీ (గు); పెద అవుటుపల్లి-చిన అవుటుపల్లి, పెదఓగిరాల-చినఓగిరాల (గ); పెద కళ్ళేపల్లి, చినకళ్ళేపల్లి-పెదముత్తేవి-చినముత్తేవి (ది); పెద కామనపూడి-చినకామనపూడి, పెదగొన్నూరు-చినగొన్నూరు (కై); పెదమొదుగుపల్లి-చినమొదుగుపల్లి (జ).

పాత, కొత్త అను విశేషణములు పేరు ముందుగల గ్రామముల ప్రాచీనత చెప్పకనే తెలుస్తుంది. ఉదా॥ పాతపాడు (వి), పాతతిరువూరు (తి) కొత్తూరు (వి), కొత్తగూడెం (తి) కొత్తపల్లి (వి& నూ & తి) గలవుగాని కొత్తపాడు, పాతూరు, పాతపల్లిపంటివి ఈ పరిశీలనకు ప్రమాణముగా స్వీకరించిన 'సెన్సెస్' జాబితాముందు కానరాలేదు.

దిక్కులనుబట్టి ఒకే పేరుగల గ్రామాలను వేర్పరచి పేర్కొనడమున్నది. ఉదా॥ గంపల గూడెం ఈస్ట్ & వెస్ట్ (తి) మాధవరం ఈస్ట్ & వెస్ట్ (తి) వల్లూరు నార్త్ & సౌత్ (వి), మొఖాసా,* ఖండ్రిక, జమీ, లంక, శేరి, హవేలి,**అగ్రహారంవంటి విశేషణములు మొదలునో, అంత్యమందునో నుండుటవలన ఒకే పేరుగల గ్రామాలను వేరుగా గుర్తించడానికి వీలుకలుగుచున్నది. ఉదా॥ లంక పల్లి-లంకపల్లి అగ్రహారం-లంకపల్లిలంక (గ) నందిగామ (బం), నందిగామలంక (కై), తరిగొప్పుల-తరిగొప్పుల ఖండ్రిక (గ); వీరవల్లి-వీరవల్లిమొఖాసా (గ); వేదిపాడు-వేదిపాడు ఖండ్రిక (గ); మోపిదేవి-మోపిదేవిలంక (ది); హవేలీ ముత్యాలంపాడు-మొఖాసా ముత్యాలంపాడు (వి); నావి పోతవరం గవర్నమెంట్&జమీన్ (వి); మొఖాసా నరసన్నపాలెం-నరసన్నపాలెంశేరి (నూ) గుడిమెట్ల-గుడిమెట్లపాలెం (నం), మాధవరం (కై)-చెరువుమీదవరం-గూడెం మాధవరం (వి); రుద్రవరం (బం)-నెల్లిమల్లి రుద్రవరం (ది) అయ్యవారి రుద్రవరం (కై), సానరుద్రవరం (కై).

వేరుగా గుర్తించడానికి తమ పేర్లలో సౌకర్యము కల్పించని గ్రామములున్నవి. ఉదా॥ ఆముదాలపల్లి (గ&బం), గురివిందగుంట (గు&బం), వేములపల్లి (ది&నం), బల్లిపర్రు (గు& గ & బం), చిలకలపూడి [ది & బం], కొండూరు [కై & నం], కొత్తపల్లి [వి & నూ & తి], సర్వేశపురం [వి & తి] వెంకటాపురం [కై & ది & వి & నం], వేమవరం [బం & వి & జ], అన్నవరం [ది & జ & నూ], బొమ్మలూరు [నూ & గు], మల్లేశ్వరం [నూ & బం], పోలవరం [తి & గు & బం], రామచంద్రపురం [గు & గ], చోడవరం [బం & ది & వి], రుద్రపాకం [బం & వి & నం], నందమూరు [బం & గ], వేల్పూరు [గ & వి], లక్ష్మీపురం [గం & వి & నం], మాచవరం [బం & ది], తాడేపల్లి [వి & ది], గన్నవరం [గ & కై], లింగాల [తి & కై], శోభనాద్రిపురం [కై & నూ], జగన్నాధపురం [నం & గ], తక్కెళ్ళపాడు [నం & జ & కై], సింగరాయపాలెం [కై & బం].

## ఊరిపేరుపై మమకారం

పైన సూచించిన విధముగా ఒకే పేరుగల గ్రామములు పలు తావులందు ఉండుటకు మానవసహజమే ఒక కారణమని చెప్పవచ్చును. "తూర్పు సముద్ర దీవులందు కాకులము, కాకొలను అను ఊళ్ళ పేర్లు వినవచ్చును. ఇవి కృష్ణా తీరమునందలి శ్రీకాకుళము పేర వెలసినవే. ఆంధ్ర యాత్రికులు విదేశములకు వెళ్ళి అక్కడ స్థిరనివాస మేర్పరుచుకొన్నప్పుడు తమకు పూర్వ పరిచితములైన నగర నామములను నూతన పరిసరము లందును పెట్టుకొనుట ప్రసిద్ధము."[93]

## ముగింపు

జీవనదీ పరీవాహక ప్రాంతమగుటచే సుసంపన్నమై, అదే కారణమున అనేక రాజ వంశముల వృద్ధిక్షయములను వీక్షించిన ఈ జిల్లా యందలి గ్రామ నామములు గతించిన చరిత్రకు కొంతవరకు సోదాహరణ పూర్వకముగా నున్నవి. కాని, గ్రామనామములకూ, రాజ వంశములు/జమిందారీలకూ మధ్య సంబంధమును ప్రతిపాదించుటకు కేవలము నామసారూప్య మొకటియే గాక సూక్ష్మపరిశోధనము వలన ఇతర సాక్ష్యాధారములను కూడ గ్రహించి అట్టి అనుబంధమును ఉద్ఘాటించ వలసి యున్నది. గ్రామ నామములకు సంబంధించిన పౌరాణిక గాథలను ప్రత్యక్షర ప్రమాణములుగా స్వీకరించుట సర్వే సర్వత్రా సంభావ్యము కాకపోయిననూ అట్టి సందర్భములు జనసామాన్య విశ్వాసమును తెలియజేయునవిగా నున్నవని గుర్తించవలసి ఉన్నది. శృతి పేయమూ, ఆడంబర పూరితమూ యైన గ్రామనామములతో పాటు అత్యంత సాధారణ, సామాన్య నామములుకూడా లెక్కకు మిక్కిలిగ నుండుట వెనుకటి తరముల వారి యధార్థ జీవన విధానము సూచించునదై యున్నది. శాసన, సాహిత్యతులనాత్మక పరిశీలనతోపాటు, క్షేత్రపరిశోధనము కూడా సాగించి ఈ జిల్లా గ్రామ నామముల విషయమై ఇంకనూ విస్తృత శాస్త్రీయ పరిశోధన జరుగవలసిన అవసరమును ఈ ప్రాథమిక పరిశీలన తేటపరుచుచున్నది.

## ధో జ్ఞా పి క లు

ఎమ్. వి. రాజగోపాల్ [సం.], అంధ్రప్రదేశ్ డిస్ట్రిక్ట్ గెజిటేర్స్: కృష్ణా, [ఆం. ప్ర. ప్రభుత్వము, హైదరాబాద్, 1977], పేజి 1.

ఇకపై, కృష్ణా గెజిటీర్ అని సూచింప బడుతుంది.

. వై. వి. కృష్ణారావు & ఏటుకూరి బలరామమూర్తి, ఆంధ్రప్రదేశ్ దర్శిని, [విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్, విజయవాడ, 1976, పు. 1033.

సౌలభ్యము కొరకు తాలూకాల పేర్లు కుండలీకరణములో సంక్షిప్తముగా పేర్కొన బడును. ఆ సంజ్ఞా వివరణ: కై = కైకలూరు; గ = గన్నవరం; గు = గుడివాడ; జ = జగ్గయ్యపేట; తి = తిరువూరు; ది = దివి; నం = నందిగామ; నూ = నూజివీడు; బం = బందరు; వి = విజయవాడ.

ఆంధ్రదేశ చరిత్ర—భూగోళసర్వస్వము, మూడవ సంపుటము [హైదరాబాద్, 1976] పు. 35, 36.
ఇకపై, భూగోళ సర్వస్వము అని ప్రస్తావించ బడుతుంది.

'చింబులూరు గ్రాంట్ ఆఫ్ గుణకనల్ల విజయాదిత్య III [9వ శతాబ్ది]' —ఎపిగ్రాఫియా ఆంధ్రికా, వాల్యుం III [హైదరాబాద్, 1974], పుట 12.

భూగోళ సర్వస్వము, రెండవ సంపుటి[హైదరాబాద్, 1974], పు. 483.

భూగోళ సర్వస్వము, మూడవ సంపుటము, పు. 17.

పైది, రెండవ సంపుటము, 484.

కుందూరి ఈశ్వరదత్తు, ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, [ఆం॥ ప్ర॥ సాహిత్య అకాడమి, హైదరాబాద్, ద్వితీయ ముద్రణ, 1979] పు. 131.

పైది, ద్వితీయ ప్రకరణము, పు. 38.

పైదే, పు. 186.

. భూగోళ సర్వస్వము, రెండవ సంపుటము, పు. 485.

. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు. 184.

పైది, పు. 303.

14. భూగోళ సర్వస్వము, మొదటి సంపుటము [హైదరాబాదు. 1971] పు. 505.

15. పైది, మూడవ సంపుటము, పు. 239.

16. పైది, పు. 240.

17. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు. 90, 91.

18. పైది, పు. 106-108.

19. పైదే, పుట 101-103

20. భూగోళ సర్వస్వము, రెండవ సంపుటము, పుట 485.

21. పైది, మూడవ సంపుటము, పుట 64.

22. భావరాజు వెంకట కృష్ణారావు, ఎర్లీడైనాస్టీస్ ఆఫ్ ఆంధ్రదేశ, పుట 319.

23. నేలటూరి వేంకటరమణయ్య, విష్ణుకుండినులు, (హైదరాబాదు, 1973], పుట 22

24. మారేమండ రామారావు [సం.], సాతవాహన సంచిక, [గుంటూరు, 1950], పుట 45.

25. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము, ఏడవ సంపుటము, [హైదరాబాదు, 1970], పుట 111.

26. కృష్ణాగెజిటీరు, పుట 239. కొలని భీముని చంపిన వెలనాటి రాజేంద్రచోడుని పండివారుసు కలదు [శ. 1093]

27. యస్. ఐ. ఐ. V, నెం. 115, శ. సం. 1066.
పైది, నెం. 140, శ. సం. 1079.

28. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పుట 150.

29. ఎపిగ్రాఫియా ఆంధ్రికా, వాల్యూం II [హైదరాబాద్, 1974] పుట 1.

30. పైది, వాల్యూం I, పుట 74

31. డా॥ పి. వి. పరబ్రహ్మశాస్త్రి, ది కాకతీయాస్, [హైదరాబాద్, 1978], పుట 199.

3 ప్రత్యక్ష ప్రబల సాక్ష్యములు లేని తావుల ఇట్టివి చారిత్రక ఊహాపోహలు మాత్రమే. ఉదా॥ బుద్ధవరం, బుద్ధదేవుని బట్టి ఏర్పడినది కావచ్చును.

భూగోళ సర్వస్వము, ప్రథమ సంపుటము, పుట 249.

ఎమ్. సోమశేఖర శర్మ, ఎ ఫర్‌గాటెన్ ఛాప్టర్ ఆఫ్ ఆంధ్రా హిస్టరి, [మద్రాస్, 1945], పుట 113-114.

కాకతీయ ప్రోలరాజులు గాని, రుద్రమ సేనాని ప్రోలినాయకుని వంటివారు గాని వారికి ప్రాంతముపై ప్రత్యక్షాధికారము చెల్లనందున బ్రదమ ప్రోలవర గ్రామనామ కారకులగుటకు అవకాశము తక్కువ.

ఎమ్. సోమశేఖర శర్మ, హిస్టరీ ఆఫ్ రెడ్డి కింగ్‌డమ్, పుట 39 ఫుట్‌నోట్.

రాళ్ళబండి సుబ్బారావు [సం.] కళింగదేశ చరిత్ర [రాజమహేంద్రవరము, 1930], అనుబంధము, పుట 100.

ఆరుద్ర, సమగ్ర ఆంధ్ర సాహిత్యం, తొమ్మిదవ సంపుటము, పుట 241. సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశము, మూడవ సంపుటము, [హైదరాబాదు, 1962], పుట 48.

కళింగదేశ చరిత్ర, అనుబంధము, 100-101.

సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశము, నాల్గవ సంపుటము [హైదరాబాదు, 1964] పుట 40. డా॥ తూమాటి దొణప్ప, ఆంధ్ర సంస్థానములు-సాహిత్యపోషణము, [వాల్తేరు, 1969] పుట 41.

కృష్ణా గెజిటీర్, పుట 237.

సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము, మూడవ సంపుటము, పుట 50.

పైది.

భూగోళ సర్వస్వము, మూడవ సంపుటము, పుట 452

కృష్ణా గెజిటీర్, పుట 238.

పైది, పుట 232.

ఈస్టిండియా కంపెనీ కాలములో బనగానపల్లి నవాబుల బంధువైన హుస్సేన్‌ఖాన్ అనేవాడు కొండపల్లి, ఏలూరు, రాజమహేంద్రవరములపై గవర్నర్‌గా నియమితుడైనాడు. ఆతడు బందరు నవాబని పిలువబడేవాడు. [సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము, ఏడవ సంపుటము, పు. 138]. బహుశా బందరు తాలూకాలోని ఈ హుస్సేన్ పాలెం, జగ్గయ్యపేట తాలూకాలోని హుస్సేన్‌బాదా ఆతని పేరున వెలసినవై యుండును.

48. సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము, ఏడవ సంపుటము, పుట 112, 113.

49. భూగోళ సర్వస్వము, మూడవ సంపుటము, పుట 89.

50. సం. ఆం. వి. కోశము, ఏడవ సంపుటము, పుట 112.

51. పైది, పుట 111.

52. భూగోళ సర్వస్వము, రెండవ సంపుటము, పుట 34.

53. భూగోళ సర్వస్వము, మూడవ సంపుటము, పుట 35.

54. సం. ఆం. వి. కోశము, ఏడవ సంపుటము, పుట 110, 111.

55. కృష్ణా గెజిటీర్, పుట 229.

56. పైది, పుట 234.

57. సం. ఆ. వి. కోశము, మూడవ సంపుటము, పు. 386. & పైది, పుట 232.

58. కృష్ణా గెజిటీర్, పుట 236.

59. పైది, పుట 234.

60. డా॥ చింతా నామునాథం: 'కూచిపూడి పరిసర కళాక్షేత్రాలు', సప్తగిరి, మే, 1983, పుట 14.

61. కృష్ణా గెజిటీర్, పుట 239.

62. సం. ఆం. వి. కోశము, ఎనిమిదవ సంపుటము, పుట 167.

63. పైది.

64. పైది.

65, పైది, పుట 350.

66. 53 లో వలె.

67. భూగోళ సర్వస్వము, రెండవ సంపుటము, పుట 587.

68. ఎపిగ్రాఫియా ఆంధ్రికా, వాల్యూం II, [హైదరాబాదు, 1974] పుట 112 & గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, ఘంటసాల చరిత్ర.

69. ఎపిగ్రాఫియా ఆంధ్రికా. వాల్యూం I, పుట 60, 61.

నేలటూరి వెంకటరమణయ్య, పల్లవులు-చాళుక్యులు, [మద్రాసు, 1969], పుట 398.

ఎ. ఇం. V, పుట 15 & రెడ్డి సంచిక, అనుబంధము, 13.

రెడ్డి సంచిక, అనుబంధము, 20.

పైది, పుట 45, 46.

సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము, మూడవ సంపుటము, పుట 105.

పైది, నాలుగవ సంపుటము, పుట 40.

కృష్ణా గెజిటీర్, పుట 237.

పైది, పుట 233.

60 పఠె, పుట 30.

ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పుట

* "పన్ను లేకుండ గుత్తకిచ్చిన భూఖండము"—కుందూరి ఈశ్వరదత్తు, శాసనశబ్దకోశము, [హైదరాబాద్, 1967] పుట 86.

డా॥ తూమాటి దోణప్ప, ఆంధ్ర సంస్థానములు—సాహిత్య పోషణము, [వాల్తేరు, 1969], పుట 586.

భారతి, సెప్టెంబర్, 1982, పుట 20.

భూగోళ సర్వస్వము, మొదటి సంపుటము, పుట 331, 332.

ఆంధ్రభూమి [వారపత్రిక, సికింద్రాబాదు, 15-9-1 పుట 44.

సం. ఆం. వి. కోశము, మూడవ సంపుటము, పుట 48.

పైది, పుట 105.

85. ఆంధ్రప్రదేశ్ దర్శిని, పుట 1035.

86. భూగోళ సర్వస్వము, మొదటి సంపుటము, పుట 338, 339.

87. కృష్ణా గెజిటీర్, పుట 227.

తూర్పు చాళుక్య ఇమ్మడి భీముడు [10వ శతాబ్ది పూర్వార్ధం] 'ఆకుల మన్నండు'లో నొక బ్రాహ్మణునకు మాదానంచేసాడు [ఎ. ఇం. V, సి. పి. గ్రాంట్, పుట 134, 139].

"ఆ కాలమున నుండిన ఆకుల మన్నండు, క్రంకటప్పు అను గ్రామములు నేటికిని మార్పులేక కృష్ణాజిల్లా బందరుతాలూకాలో నున్నవి. అనగా వేయి సంవత్సరములకు పైగా కాలము అతిక్రమించినను శాసనమున పేర్కొనిన గ్రామములు మార్పు చెందకుండుట గమనింపదగిన యంశము. నాడు ఆకులమన్నండును ఆకులమన్నాడు అనియు, క్రంకటప్పును కంకటాప అనియు వ్యవహరించుచున్నారు" [భూగోళ సర్వస్వము, మూడవ సంపుటము, పుట 14 - 16.

కృష్ణా గెజిటీర్, పుట 238 & డా. తూమాటి దొణప్ప, ఆంధ్ర సంస్థానములు - సాహిత్యపోషణము, పుట 385.

సం. ఆం. వి. కోశము, ఏడవ సంపుటము, పుట 111 & కృష్ణా గెజిటీర్, 228.

90. కృష్ణా గెజిటర్, పుట 233.

91. పైది, పుట 231.

76 పఠె.

* ముకాసా గ్రా. వి. పన్నులేకుండ నియ్యబడిన గ్రామము.

** హవేలి : హిందూస్థాని విశేషణము = రాజునకు చెందినది.

93. భూగోళ సర్వస్వము, మూడవ సంపుటము, పుట 547.

(అయిపోయింది)

# నిశ్శబ్ద సంగీ

శ్రీ కూచిభొట్ల విశ్వనాధశాస్త్రి

ఎక్కడి నుంచీ సంగీతం ?
ఎంత అద్భుతంగా వుంది
ఆ శృతి లయాల సంగమం !
జీవితం కన్న అనుభవైకంగా
అనుభవాని కందనంత మధురంగా—
మౌనంలో గానం !
శబ్దంలో నిశ్శబ్దం !!
వింటుంటే హాయిగా వుంది
ఎన్నడు చూడని ఆనంద తీరం చేరుకున్నట్లుగా
అవధులు లేని సుఖం స్వంతమైనట్లుగా—

ఈ తృప్తి,
ఈ ప్రశాంతి,
అనుక్షణం అవృతమైతే బాగుండదూ ?
అయినా ఎటు నుంచీ గీతం ??
—నిరంతర మౌన తపో సమాధిలో
జ్వలించి అణువణువు ఆవరిస్తూ
నాలోని అచంచల చైతన్యం
విశ్వ చైతన్యానికి పాడుతున్న మేలుకొలుపు
తమస్సు చీల్చే రేపటి ఉషస్సుకి ఇస్తున్న పిలుపు !

—✲—



# టూలేట్

సింహప్రసాద్

భద్రం చేతిలో టెలిగ్రామ్ పెట్టి సంతకం తీసుకుని వెళ్ళిపోయాడు పోస్టుమేన్ నిర్వికారంగా.

ఆత్రంగా టెలిగ్రామ్ విప్పి చూశాడు భద్రం.

"ఫాదర్ సీరియస్. స్టార్ట్ ఇమీడియట్లీ—సత్యం."

వణుకూ, దడా, దుఃఖం, నీరసం అన్నీ ఒక్కసారే వచ్చి అతడ్ని వాటేసుకున్నాయి.

మంచంమీద కూలబడి బావురుమన్నాడు.

ఇంటి నలుమూలల్లో దారిద్ర్యం తిష్టవేసుక్కూర్చున్నా తన నెంతో ప్రేమగాసాకి తల్లిలేనిలోటు కన్పించకుండా పెంచిన నాన్న... తమ చదువుకునెంతో వృద్ధిలోకి రావాలని రాత్రింబవళ్ళూ ఎండనక, వాననక పొలాల్లో పనిచేసి తననింతవాడ్ని చేసిన నాన్న...మూడేళ్ల నిరుద్యోగ రక్కసితో పోరాడి పోరాడి అలసి సొలసి ఎట్టకేలకో పెద్ద ఫ్యాక్టరీలో చిరుద్యోగం సంపాదించుకున్న తనని తలచి ఆనంద బాష్పాలు గాకపోయినా కన్నీళ్లు తుడుచుకొంటోన్న నాన్న...

ఇప్పుడు గాలిలోపెట్టిన దీపంలా వున్నాడు!

తమకోసం తమ వున్నతికోసం తన బ్రతుకుని హారతి కర్పూరం చేసుకున్న నాన్నకి తామేమీ చెయ్యకుండానే చిన్నపాటి ఆనందానుభూతిని పంచివ్వకుండానే బ్రతుకుబాట చివరికి చేరుకున్నాడు!

నిజంగా తామెంత దురదృష్టవంతులు!

ఎవరో వీపు చరిచినట్టు వులిక్కిపడి కూర్చున్నాడు.

తనిలా విలపిస్తూ కూర్చుంటే కడచూపుకూడా దక్కక పోవచ్చు. అప్పుడిహ తనకంటే దౌర్భాగ్యుడీ లోకంలోనే వుండడు!

కళ్ళు తుడుచుకోకుండానే లేచి గబగబా పర్సూ, ప్యాంటూ, పెట్టె అన్నీ వెతికాడు భద్రం. మొత్తం అంతా కలిసి నాలుగు రూపాయల ఇరవై రెండు పైసలుంది. ముచ్చెమటలకి బట్టలు తడిసి ముద్దవుతోంటే బ్యాంకు పాస్‌బుక్కుతీసి చూశాడు. అందులోవున్న బేలన్స్ ఏడు రూపాయల ముప్పైఏడు పైసలు మాత్రమే. అదంతా తీసేసుకుంటే మొత్తం పదకొండు రూపాయల యాభైతొమ్మిది పైసలవుతుంది!

తన వూరికి బస్సుచార్జి ఇరవై రెండు రూపాయలు. రైలుకైతే పదమూడు రూపాయల యాభై పైసలు.

అంటే రైలుకి వెళ్ళాలనుకున్నా సుమారు రెండ్రూపాయలు తక్కువవుతుంది. ఎలావోలా ఎవరికాళ్ళో చేతులో పట్టుకుని ఆ రెండ్రూపాయలూ సంపాదిస్తే, రాత్రి ట్రెయిన్‌కి వెళ్లొచ్చు. అంటే రేపు ఉదయానిగ్గాని ఇంటికెళ్ళలేడు.

అప్పటికి నాన్న పరిస్థితెలా వుంటుందో!

కడచూపుకైనా నోచుకుంటాడా?

డబ్బుంటే ఇప్పుడే బస్సులోవెళ్తే ఎలావోలా సాయంత్రానికెళ్ళిపోవచ్చు. కానిప్పుడెలా? ఎవరిస్తారు అప్పు?

తనకిక్కడూళ్లో బాగా తెలిసినవాళ్ళెవరూ లేరనే చెప్పాలి, ఆఫీసు వాళ్లతప్ప. వాళ్ళెవరి ఇళ్ళూ తనకి తెలీవు. ఎలావోలా తెలుసుకున్నా ప్రయోజనం వుండకపోవచ్చు. వాళ్ళూ తనలా పైసా పైసా లెక్కచూసుకునే జీతగాళ్ళే!

అవాళ శనివారమనీ బ్యాంక పన్నెండు వుంటుందనీ గుర్తొచ్చింది భద్రానికి. గబగబా ప్రక్క రూంలోకెళ్ళి టైమడిగాడు.

పదకొండూ పది.

అతి వేగంగా బట్టలు తొడుక్కుని పాస్ బుక్ తీసుకుని బ్యాంకుకి పరుగెత్తాడు.

ప్రతి శనివారంలానే అవాళా బ్యాంకు చాలా రష్‌గావుంది. ప్రతి కౌంటర్ దగ్గరా జనం గుంపులే. వుద్యోగులు చకచకా పని చేస్తున్నా జనం పలచబడటంలేదు. వెళ్ళేవాళ్లు వెళ్తోంటే వచ్చేవాళ్లు వస్తున్నారు.

తిన్నగా సేవింగ్స్ బ్యాంక్ కౌంటర్ దగ్గరికెళ్ళి కాస్తఖాళీ అవ్వగానే అక్కడున్న క్లర్క్‌ని విష్‌చేసి పాస్‌బుక్ అందిచ్చాడు.

"విత్‌డ్రా చేస్తారా?"

జీతం రాగ్గానే ఇంటి అద్దె వగైరాలుపోను మిగిలిన చిన్న మొత్తాన్ని బ్యాంకులో వేసుకుని అయిదూ పదీ చొప్పున తీసుకుంటూ ముప్పై రోజుల్నీ ఈడుస్తూంటాడు భద్రం. అందుకే అతడ్ని చూడగానే అలా అడిగేశాడతడు.

తలూపి కొంచెం ఇదిగా ఫీలవుతూ "ఇందులోవున్నదంతా కావాలండీ" అన్నా.

"అంతా కావాలంటే ఎకౌంట్ క్లోజ్ చెయ్యాలి."

"చేస్తానండి."

"ఏం? మీకేమైనా ట్రాన్స్‌ఫర్ వచ్చిందా?"

తలూపాడు.

అతడో తెల్లకాగితం ఇచ్చి "ఎకౌంట్ క్లోజ్ చేసెయ్యమని మేనేజర్‌కి ఎడ్రస్‌చేస్తూ లెటర్‌రాసి ఎకౌంటెంట్‌గారికి చూపించి రండి" అన్నాడు.

రెండు ముక్కలురాసి ఎకౌంటెంట్ దగ్గరికెళ్ళి తనకి ట్రాన్స్‌ఫర్ అయినట్టో అబద్ధం ఆడేసి లెటర్ చూపించాడు. అయన 'యస్' అని రాసి సంతకం పెట్టగా అది తెచ్చి క్లర్క్‌కిచ్చాడు.

పే ఆర్డర్ స్లిప్ ఇచ్చి పూర్తి చెయ్యమన్నాడతడు.

దాన్ని పూర్తిచేసి అంకె వేసేప్పుడుమాత్రం ఏడుకీ ముప్పై గీతగియ్యాల అన్పించి చిన్న చుక్క మాత్రంపెట్టి వదిలేశాడు. చూసినవాళ్ళు పైసలుకూడా తీసేసుకుంటున్నాడని అన్పించకుండా అలా చేశాడు భద్రం

టోకెన్ తీసుకువెళ్ళి సోఫాలో కూలబడ్డాడు - తండ్రి పరిస్థితి గురించీ తను వేగంగా ఇంటికెళ్ళే మార్గం గురించీ ఓ రెండ్రూపాయలు అర్జంటుగా చేబదులు సంపాదించడం గురించీ ఆలోచిస్తూ....

"టోకెన్ నెంబర్ 32"

క్యాషియర్ పిలుపుకి వులిక్కిపడిలేచి చేతిలోని టోకెన్ నెంబర్నోసారి చూసుకు వెళ్ళి టోకెన్ ఇచ్చాడు భద్రం.

"ఏం ఇమ్మంటారు?" క్యాషియర్ అడిగాడు హడావిడిగా.

"మీ ఇష్టం."

అతడు ఏడు వందకాగితాలూ, మూడు పదులూ, ఒక అయిదూ, రెండు ఒకట్లూ ఇచ్చాడు.

అతడన్ని నోట్లు ఇచ్చేస్తోంటే అదిరిపడి అందుకున్నాడు భద్రం వణుకుతోన్న చేతుల్తో.

క్యాషియర్ మరో నెంబరు పిలవడంతో నోట్లు లెక్కపెడుతూ రెండడుగు లేశాడు. క్యాషియర్ పొరబాటున ఏడురూపాయల ముప్పై ఏడుపైసలకి బదులు ఏడువందల ముప్పై ఏడురూపాయ లిచ్చాడనుకునే సరికి గాభరాగా అన్పించింది.

ఓ ప్రక్క ముచ్చెమటలు పోస్తోంటే మళ్ళీ మళ్ళీ లెక్కపెడుతూ పదడుగులేశాడు ద్వారం వైపు.

తనకిప్పుడు డబ్బు అత్యవసరం గనుక వెంటనే బస్సులో మీ వూరెళ్ళి నీకోసం కళ్ళల్లో ఒత్తులు వేసుకుని చూస్తోన్న నీ తండ్రి కడసారి కోరిక తీర్చమంటూ భగవంతుడీ రూపంలో డబ్బిచ్చాడేమో అన్పించసాగింది భద్రానికి. మరో ప్రక్కన ఇదన్యాయమంటూ మనస్సు గోలచెయ్యసాగింది.

ఏం చెయ్యాలి?

తిరిగివ్వటమా? మౌనంగా వెళ్ళిపోవటమా?

అవతల అవసరం!

ఇవతల నీతి!

రెండుక్షణాలు గుంజాటన పడ్డాడు.

ప్రాణాలమీదికొచ్చినాసరే అన్యాయపు సొమ్ము తనకి వద్దుగాక వద్దనుకుని వెనుదిరగాలనుకున్నాడో లేదో -

"ఏమండోయ్ భద్రంగారూ" అంటూ క్యాషియర్ గావుకేక పెట్టాడు. అంతటితో వూరుకోక "అదిగో ఆ తెల్లషర్టతన్ని పట్టుకోండి. బాపురే... ఎక్సెస్ పేమెంటిచ్చేశాను" అన్నాడుగట్టిగా కలవరపడుతూ.

ఆ మాటలు వింటూనే బొమ్మలా అయిపోయిన భద్రం ఎవరో తనచెయ్యి పట్టుకోవడంతో మెల్లగాక్యాష్‌కౌంటర్ దగ్గరకి నడిచాడు, తలొంచుకుని.

డబ్బంతా ఇచ్చేశాడు మౌనంగా.

"ఏడు రూపాయల ముప్పైఏడు పైసలివ్వాల్సి ఏడువందల ముప్పై ఏడు రూపాయలిచ్చేస్తే తిరిగివ్వటంపోయి జేబులో పెట్టుకు వెళ్ళిపోవడమే మీ సొమ్మే పోయినట్లు? నా కెంకేతో అనుమానం వచ్చి వెంటనే చూసుకోబట్టిగాని లేకపోతే 730 రూపాయలు నా జేబులోంచి పెట్టుకోవాల్సివచ్చేది. చదువుకున్న వాడివి... ఇలా మోసం చేస్తే ఎలాగా?... " క్యాషియర్ అరుస్తున్నాడు.

మిగతా జనంకూడా పైకి డాబుగా కన్పిస్తూ మోసాలు చేస్తున్నారంటూ వ్యాఖ్యానాలు విసురుతున్నారు భద్రాన్నే గుర్రుగా చూస్తూ.

భద్రం తల మరింత వంగిపోయింది.

తనొక్కక్షణం ప్రలోభపడ్డా ఆఖరికి తిరిగిచ్చెయ్యాలనే అనుకున్నానని చెప్పాలనుకున్నాడు గాని నోరు పెగల్లేదు. ఎలాగూ... చెప్పినా ఎవరూ నమ్మరనీ, పైపెచ్చు దొరికేసేడు గనుక ప్లేటు ఫిరాయిస్తున్నాడని నవ్వుతారనీ వూరుకుండి పోయాడు.

క్యాషియర్ తిట్లు జోడించి మరీ ఏదేదో అంటూ ఏడురూపాయల ముప్పై ఏడు పైసల్ని విసిరేశాడు. భద్రం మీదికి.

అవి తీసుకుని బ్యాంకులోని వారంతా తనవంక తినేసేలా చూస్తోంటే తల సిగ్గుతో, అవమానంతో, దుఃఖంతో కృంగి పోతోంటే అతి కష్టం మీద కదిలాడు.

తనో రెండుక్షణాలు... నిజంగా రెండు క్షణాలే... వెనకా ముందాడినా ఆఖరికి డబ్బు తిరిగిచ్చేయ్యాలనే అనుకున్నాడుగాని, అప్పటికే అరక్షణం... అవును అక్షరాలా అరక్షణమే ఆలస్యమయ్యింది. ఒక్క ఆరక్షణం ముందే తను వెనుదిరిగి నట్లైతే అందరి దృష్టిలో మంచివాడుగా ముద్రపడేవాడు. కాని ఆకాస్తలోనే సమయం మించిపోయేసరికి అందరిముందూ దొంగలా, ద్రోహిలా నిలబడాల్సొచ్చింది.

తనెంత దురదృష్టవంతుడు!

టెల్గ్రామ్ చూసినప్పటికన్నా ఎక్కువ దుఃఖం వెల్లుపలా రాగా తలవంచుకుని కళ్ళు తుడుచుకోకుండానే బయటికి నడిచాడు, తడబడ్తూ భద్రం.

# కలగూరగంప

## ప్రథమ తెలుగు కంద పద్యాలు

"గంగాధరం శాసనం" (క్రీ. శ. 10వ శతాబ్ది) లో మూడు ప్రథమ తెలుగు కంద పద్యాలు ఉన్నాయని చెప్పటానికి ఈ వ్యాస రచయిత మిక్కిలి సంతసిస్తున్నాడు. ఈ శాసనం కరీంనగరంజిల్లా ధర్మపురికి ఉత్తర భాగాన, గంగాధరం గ్రామానికి సమీపానగల వృషభాద్రి శిఖరంమీద 'సిద్ధశిల' అనే ఒక పెద్ద బండపై చెక్కబడింది. గంగాధరం ఒకప్పుడు బోధన చాళుక్యుల రాజధానిగా ఉండేది. వృషభాద్రిని ఇప్పుడు బొమ్మలగుట్ట అని పిలుస్తారు. కన్నడ ఆదికవి పంపసోదరుడైన జినవల్లభుడు తన అన్న అయిన పంపని స్మారక చిహ్నంగా ఈ శాసనం చెక్కించినట్లు, శాసన పాఠాన్ని స్వయంగా జినవల్లభుడే సిద్ధపఱచినట్లు తెలుస్తుంది.

వృషభాద్రి శిఖరంమీద, దాక్షిణ్యచిహ్న ఆది, అంత్య జైనతీర్థంకరుల ప్రతిమలు, చక్రేశ్వరి ప్రతిమ, ఇతర అనేక జినప్రతిమలు, త్రిభువన తిలకం అనే వసది, మదన విలాసం అనే వనం, కవితా గుణార్ణవం అనే తటాకం నిర్మించినట్లు ఈ శాసనంలో చెప్పబడింది. ఇప్పుడు వీటిలో వనం, వసది లేవు. తటాకాన్ని "పాతచెరువు" అని పిలుస్తారు. గుట్టకు దక్షిణాన ఉన్నట్లు చెప్పబడిన ధర్మపురి ఇప్పుడు నేలమట్టం అయింది.

ఈ శాసనం చెక్కించిన జినవల్లభుడు 'వాగ్వధూవల్లభు'డు అని ప్రసిద్ధిచెందినాడు. ఇతడు రచించిన కావ్యాలు అనుపలబ్ధం. ఈ శాసనం సంస్కృత, కన్నడ, తెలుగుభాషలలో లిఖింపబడింది. శాసనం చివరి భాగంలో తెలుగు కందపద్యాలు మూడు ఉన్నాయి. "కన్దం" అనటంతో ఆ పద్యాలు ప్రారంభం అవుతాయి!

"జినభవనంబు లెత్తించుట
జినపూజల్సేయుచున్ని జిన మునులకు న
త్తిన యన్నదానం బీవుటం
జినవల్లభు బోలంగలరె జిన ధమన్ పరుల్॥

దినకరు సరి వెల్గుదుమని
జినవల్లభునెట్టనెత్తు జితకవిన ననుం
మనుజుల్గలరే ధాత్రిం
వినితిచ్చిదుననియ వృత్త విబుధ కవీంద్రుల్॥

ఒక్కొక్కగుణం [బు] కల్గుదు
రొక్కొ [కొ] ల్గిగా కొక్కొలక్కలేవెవ్వరిం
లెక్కింప నొక్కొలక్కకు
మిక్కిలి గుణపక్షపాతి గుణమణిగణంబుల్॥"

తర్వాత "ఎన్దు" [= అని] కన్నడంలో మూడు పాదాలు లిఖింపబడినాయి. దీనితో శాసనం ముగిసింది. మొదటి రెండు పద్యాలలో యతి నియమం పాటింప బడింది.

"శాసనసంపద" అనే శీర్షిక క్రింద కన్నడ అధ్యయన సంస్థ (కర్ణాటక విశ్వవిద్యాలయం, ధారవాడ)వారు వెలువరించిన (ప్రథమ ముద్రణ 1968, ద్వితీయ ముద్రణ 1974) గ్రంథంనుండి ఈ వివరాలు సేకరింపబడినాయి. దీనికి సంపాదకులు డా॥ ఆర్. సి. హిరేమఠ, డా॥ ఎం. ఎం. కలబుర్గి.

గంగాధరం శాసనం సుమారు క్రీ. శ. 10వ శతాబ్దిలో వెలసినట్లు సంపాదకులు అభిప్రాయ పడినారు. పంపమహాకవి క్రీ. శ. 10 వ శతాబ్ది పూర్వార్ధంలో జన్మించినాడు. అతడు తెలుగు ఆదికవి నన్నయకంటె నూఱేండ్లు ముందు జీవించినాడు.

**శ్రీ బండ్లపల్లె ఓబుళరెడ్డి.**

## అనంతపురం జిల్లా గ్రామ, వ్యక్తి నామాలు : కన్నడ నిర్మాణ ప్రభావం

అనంతపుర మండలానికి పడమటి భాగాన కర్నాటక సరిహద్దు తగులుతుంది. అంచేత ప్రజల వ్యవహారంలోనే గాకుండా గ్రామ, వ్యక్తి నామాలమీద కూడా కన్నడ ప్రభావంవుంది. అనంతపుర మండలం పూర్వంనుంచీ చారిత్రకంగా, సాంస్కృతికంగా కర్నాటకతో సంబంధాలు పెట్టుకుంది. రాయల వంశీయులు మొ॥ వారు కర్నాటక ప్రాంతాన్నీ, తెలుగుప్రాంతమైన అనంతపురాన్నీ కలిపి పాలించారు. తత్కారణంగా కూడా కొన్ని గ్రామాలపేర్లు మీద కన్నడ నిర్మాణ ప్రభావం (స్ట్రక్చరల్ ప్రెజర్) కనిపిస్తుంది. డా॥ చిలుకూరి నారాయణరావుగారు విజయనగర చరిత్రయే అనంతపుర మండల చరిత్రమని కూడా చెప్పవచ్చన్నారు. రాజులపాలనలో తవ్వబడ్డ చెరువుల పేర్లన్నీ విజయనగర రాజుల, రాణుల పరదారుల

పేర్లనుబట్టి వచ్చినవే. చెరువులకేగాక మరికొన్ని గ్రామాలు రాజుల పేర్లతో వున్నాయి. కొన్ని గ్రామాలు కన్నడ పదజాలంతో యథా తథంగా వున్నాయి. మరికొన్ని గ్రామాల పేర్లు కొద్దిగా మార్పు చెందిన కన్నడ పదాలతో వున్నాయి. ఇంకా కొన్ని గ్రామాలు బసవ మత ప్రభావంతోవున్నాయి. అనంతపురం కర్నాటకకు సరిహద్దుగా వుండే కారణంగా ఆ మత ప్రభావం గ్రామ నామాలమీదే కాకుండా వ్యక్తినామాల మీద కూడా చూపింది అనడానికి ఆ పేర్లు ఇప్పటికీ నామకరణం చేయబడుతూ వుండడమే ఆధారం.

ఆయా గ్రామాల పేర్లు, ఆయా వ్యక్తుల పేర్లు ఏ విధంగా నిలిచి వున్నాయో, ఏయే విధంగా మార్పుచెంది వున్నాయో ఈ వ్యాసంలో కన్నడ నిర్మాణం ఆధారంగా సమీక్షించడం జరుగుతుంది. ఈ ప్రాంతం అనాది కాలం నుంచీ ఆంధ్రదేశమే అయినా మధ్య కొంతకాలం క్రీ. శ. 13-17 శతాబ్దాల మధ్య కర్నాటక ప్రభుత్వ పరిపాలనలో వుంది. అందువల్ల అప్పుడేర్పడ్డ గ్రామనామాలు కన్నడ వ్యాకరణ మర్యాదలకు లోబడి తయారై ఉండవచ్చు అని సంశయించడానికి ఎక్కువ ఆధారాలున్నవి.

## గ్రా మ నా మా లు

**అనంతపురం** : అమరాపురం, హిందూపురం, రామాపురం, బిజలాపురంలాగా కాకుండా అనంతపురం అన్న గ్రామనామంలో 'అనంత'లోని 'త' 'అనంతాపురం' అని దీర్ఘం కాలేదు. తిరువనంత పురం, పరిహారపుర మొ॥ తమిళ, కన్నడ రూపాల్ని పరిశీలిస్తే పూర్వ పదాంత స్వరాన్ని ఇలాంటి సమాసాల్లో దీర్ఘం చెయ్యడం తెలుగు మర్యాద మాత్రమే కావచ్చు. ఆనాడు 'అనంతపుర' అన్న నామం మాత్రమే వుండి తెలుగు వ్యాకరణం ప్రకారం ము (ం) చేరడం తర్వాత జరిగి వుండాలి.

**న** : కన్నడంలో రామన, చోమన మొ॥ రూపాలు వున్నాయి. ఈ 'న'తోవున్న గ్రామ నామాలు కన్నడ ప్రభావంతో వచ్చాయని చెప్పడానికి అవకాశముంది. ఉదా : సింగనమల, బసవనపల్లి, కెంచాన పల్లి, కొడిగెనహళ్ళి మొదలైనవి. వీటికి సమాంతరమైన ఉదాహరణ కర్నాటక రాష్ట్రంలో 'అర్పనహళ్ళి' అనే గ్రామముంది.

**సింగనమల** : 'మల అన్న గ్రామ నామానుబంధం చేరే వూర్ల పేర్లు రాయలసీమలోనే వున్నాయి. తమిళంలో 'మలై' అని, కన్నడంలో 'మలె' అని వుంది. కన్నడంలో 'మలె' అంటే కొండ, పర్వతం అనే అర్థముంది. సింగనమల అంటే కొండల నడుమ వుండే వూరు అని అర్థం.

**కొడిగెనహళ్ళి**: దీన్ని రూపవిశ్లేషణచేస్తే కొడిగె – ఎ గిఫ్ట్ గ్రాంట్—ఫ్రీ ఆఫ్ రెంట్ అని కిట్టెల్ కన్నడ—ఇంగ్లీషు నిఘంటువు చెప్తోంది. ఇక్కడ చేరిన 'న' కూడా సంబంధ బోధక ప్రత్యయమే అయి వుండాలి.

**ర** : కన్నడంలో ఈ 'ర' (<క. అపర) బహువచనరూపం. వీటికి ఉదాహరణలు బెస్తరపల్లి (<బెస్తరపల్లి<బెస్తవరహళ్ళి< క. బెస్త అవరహళ్ళి), కడదర బెంచి (<కడదవర బెంచి). అలాగే కదిరిదేవరపల్లి మొదలైనవి. వీటికి సమాంతరంగా కన్నడ ప్రభావం లేని ఊర్ల పేర్లు చిల్లవారిపల్లి, కోటగారిహళ్ళి మొ. వున్నాయి. 'కోటగారిహళ్ళి'లో కన్నడపదం 'అవర'కు బదులుగా 'గారి' వుంది. మళ్ళీ హళ్ళి దగ్గరకు వచ్చేటప్పటికి కన్నడ ప్రభావమే.

**బసవమత ప్రభావం** : ఈ మత ప్రభావంవల్ల ఏర్పడ్డ గ్రామాలపేర్లు కొన్ని వున్నాయి. బసినేపల్లి, బసాపురం, బసవన హళ్ళి, బసాపల్లి, బసంపురం మొ॥ ఉదాహరణలు చెప్పుకోవచ్చు.

బసాపురం<బసవపురం<క. బసవపుర

బసినేపల్లి<బసవనపల్లి<క. బసవనహళ్ళి (కన్నడలో హళ్ళి అంటే పల్లి అని అర్థం).

'బసవనహళ్ళి' అనే ఇంకో గ్రామంపేరు ఏ మార్పు చెంద కుండా వుండడాన్ని గమనిస్తే 'బసినేపల్లి' 'బసవనహళ్ళి' నుంచి వికారం పొందింది కావచ్చు. ఎంచేత అంటే అనంతపురం జిల్లాలో కొన్ని గ్రామాలపేర్లు రెండు మూడు ఊళ్ళకు ఒకే రకమైన పేరు వున్నాయి. ఉదా॥ తూర్పు నరసాపురం, పడమర నరసాపురం; అదే విధంగా రెండు 'గార్లదిన్నె'లు వున్నాయి.

**శైవమత ప్రభావం** : కొన్ని గ్రామాలపేర్లు శైవమత ప్రభా వాన్ని తలపింపజేస్తున్నాయి. ఉదా:- భైరాపురం, భైరవునితిప్ప, భైరసముద్రం, విరుపాపురం, శ్రీకంఠాపురం. గంగాదేవితోవచ్చిన పేరు గంగవరం.

భైరాపురం<భైరవపురం<భైరవపురము<క. భైరవపుర

**హళ్ళి**: (క. హళ్ళి=పల్లి) పల్లితో కూడిన పేర్లు రాష్ట్ర మంతటా కనిపిస్తున్నాయి. హళ్ళి- అన్నది కన్నడపదమే కాబట్టి ఈ జిల్లాలో హళ్ళితో వున్న పేర్లన్నీ నిస్సందేహంగా కన్నడ ప్రభావంతో వచ్చినవే. ఉదా:- బేడినహళ్ళి, బసవనహళ్ళి, బొమ్మకొండ

హళ్ళి, దేవరహళ్ళి, ఉప్పరహళ్ళి, కొడిగెనహళ్ళి. ఉప్పరహళ్ళికి సమాంతరమైనపేరు 'ఉప్పరపల్లి' అనే గ్రామం ఇంకోటి ఈ జిల్లాలోనే వుంది. బందార్లహళ్ళి, సుబ్బమ్మనహళ్ళి, క్రోటగారి హళ్ళి మొ॥ ఎన్నో హళ్ళితో కూడుకున్న పేర్లు వున్నాయి.

క. బంద అరప హళ్ళి>బందపర హళ్ళి>బందవారి హళ్ళి>బందవారం హళ్ళి>బందవార్ల>బంద + ఆర్లహళ్ళి>బందార్ల హళ్ళి. బందార్లహళ్ళి ప్రస్తుత గ్రామం పేరు.

**కెర :** (క. కెరె=చెరువు) కన్నడ పదమైన 'కెరె'తో కూడిన పేర్లు కొన్ని వున్నాయి. ఉదా॥ హుళికెర, మద్దకెర, కరికెర మొదలైనవి. కర్నాటకలో ఇలాంటి పేర్లకు సమాంతరమైన ఉదాహరణ 'చెళ్ళికెరె' అన్న గ్రామాన్ని చెప్పుకోవచ్చు.

**గుప్ప, తిప్ప:** కన్నడలో 'గుప్ప' అంటే టు బి పైల్డ్ అప్, టు ఫార్మ్ ఎ హీప్ అనే అర్థాల్నిచ్చింది కిట్టెల్ డిక్షనరి. 'తిప్పె' అంటే ఎ మ్యాన్ ఆఫ్ ది డంగ్ హిల్ అని అర్థం. గుప్ప, తిప్ప అనుబంధంగావున్న ఉదాహరణలుగా బెళుగుప్ప, భైరవుని తిప్ప మొ॥ వాటిని పేర్కొనవచ్చు.

**హాళ్/పాడు :** కన్నడలో 'హాళ్' వుంటే తెలుగులో దాని జ్ఞాతి పదమైన 'పాడు' వుంటుంది. ఈ జిల్లాలో హాళ్, పాడుంతో వున్న పేర్లు చాలా వున్నాయి. కన్నడలో హాళ్ తెలుగులో పాడు (హాళ్=పాళ్>పాడ్)గా నిలిచివుంది. కొన్ని గ్రామాలు 'హాళ్'గానే వున్నాయి. ఉదా॥ హిరేహాళ్, ఉద్దేహాళ్, బొమ్మనహాళ్, దండి హిరేహాళ్లు. మరికొన్ని గ్రామాలు 'పాడు'గా వున్నాయి. ఉదా॥ పందిపాడు, పెనకలపాడు, పెంచలపాడు.

1. పందిపాడు< క. హందిహాళ్ (ఈ జిల్లాలోని పందిపాడుకు సమాంతరంగా కర్నాటకలో హందిహాళ్ అనే గ్రామం వుంది.)

2. పెనకలపాడు< పెనకసపాడ్< క. హనకసహాళ్

3. పెంచలపాడు< పెంకలపాడు< పెనకలపాడ్ < పెనకన పాడ్< క. హనకన హాళ్

పై 2, 3 రూపాల్లో న>లగా మారింది. కన్నడ 'హ' వుంటే తెలుగులో 'ప' వుంది. మునగ; ములగ మాదిరిగా న/ల ల వినిమయం మొదటి నుంచీ తెలుగులో వుంది. 3వ రూపంలో క కారం తాలవ్యీకరణం జరిగి చకారంగా మారింది. అందువల్ల 'పెంకల పాడు' 'పెంచలపాడు' అయ్యింది. పెనకలపాడు అన్న మరో గ్రామం పేరు ఇంకా తాలవ్యీకరణం జరగక అలానే నిలిచివుంది.

'పాడు'లోని చివరి ఉకారం తెలుగులో సాధారణంగా ఉచ్చారణ సౌలభ్యం కోసం చేరుతుంటుందన్న సంగతి తెలిసిందే. హాళ్>పాళ్ >పాడ్>పాడు.

**హ :** హకారంతో వుండే రూపాలు కొన్ని కన్నడ ప్రభావంతో వచ్చాయని చెప్పవచ్చు. హకారంతో వున్న రూపాల్లో పదాది హకారంకాని పద మధ్య హకారంకాని కొన్నింటిలో లోపిస్తుంది. హకారంతోవున్న గ్రామాలు హొన్నూరు, హావళిగి, గడే హోతూరు మొదలైనవి. హకారం లోపించిన రూపాలకు ఉదాహరణగా ఉదిరిపి కొండ, అగలి మొదలగు వాటిని చెప్పవచ్చు.

ఉదిరిపికొండ< హుదిరిపికొండ

అగలి< క. హగలి

**కల్లు :** కొన్ని గ్రామాలకు చివర 'కల్లు' చేరడముంది. కన్నడలో కల్లు అంటే రాయి అని అర్థముంది. తెలుగులో కూడా ఇదే అర్థమేవుందికాని కల్లు అనేది తెలుగులో గ్రాంథికం మాత్రమే. వ్యవహారంలోలేదు. కన్నడలో వ్యవహారంలో కూడా 'కల్లు' అనే వుంది. కాబట్టి ఈ కల్లుతో కూడుకున్న పేర్లన్నీ కన్నడ ప్రభావమని చెప్పడానికి ఆస్కారం ఏర్పడింది. పైగా ఒక్క కర్నాటక సరిహద్దు ప్రాంతాల్లోమాత్రమే ఈ కల్లుతో కూడిన ఊర్లపేర్లున్నాయి. మిగిలిన రాష్ట్రమంతటాలేవు కనుక ఇది కన్నడ ప్రభావమని శంకించడానికి ఎక్కువ అవకాశమేర్పడింది. ఉదా॥ దొణకల్లు, గడేకల్లు, విడపనకల్లు, కణేకల్లు, గుంతకల్లు, తీడుల్లు, మోరుబగల్లు, దొరిగల్లు, నింబగల్లు. చివరి మూడింటిలో శ్వాసస్పర్శం నాదస్పర్శ (క> గ)గా మారింది.

**ఇకి/ఇగి :** కన్నడలో 'ఇకె' అంటే యాన్ అఫిక్స్ ఫర్ ది ఫార్మేషన్ ఆఫ్ న్యూటర్ నౌన్స్ అని కిట్టెల్ నిఘంటువు. ఇకి, ఇగితో వున్న రూపాలకు ఉదాహరణగా చీకలగుర్కి (<చీకల గుఱికె), హావళిగి (<హావళికె) మొ॥ చెప్పవచ్చు.

**రాజుల పేర్లు :** పూర్వం ఈ ప్రాంతాన్ని, కర్నాటక ప్రాంతాన్ని పాలించిన రాజుల పేర్లతో కొన్ని గ్రామాల పేర్లు వున్నాయి. బుక్కపట్నం, బుక్కరాయ సముద్రం అనే గ్రామాలు బుక్కరాయల పేరునుంచి వచ్చాయి. హారే సముద్రం, హరికోరు ఈ రెండూ హరిహర రాయల పేరునుంచీ వచ్చాయి. హారే సముద్రాన్ని వ్యవహారంలో ఆరే సంద్రమని అనడంవుంది. రాతలోమాత్రం హారే సముద్రం అనేవుంది.

ఆరేసంద్రం <హారేసముద్రం <హారేసముద్ర

**దుర్గ/దుర్గప** దుర్గం నామానుబంధంగా వున్నవి ఈ జిల్లాలోతప్ప యితర ఆంధ్రదేశంలో ఎక్కడా కనిపించవు.

రాయదుర్గం < క. రాయదుర్గ; కళ్యాణదుర్గం < క. కళ్యాణ దుర్గ/దుర్గం గ్రామ నామానుబంధ రూపంగావున్న గ్రామ నామాలు ఆంధ్రదేశంలో ఈ రెండే కనిపిస్తున్నాయి. వీటికి సమాంతరమైన ఉదాహరణ కర్నాటకలో రాయదుర్గ అనే ఊరువుంది.

**సేడు** : కన్నడలో 'సేడు' అంటే స్రింకింగ్, బెండింగ్, కాంట్రాక్షన్ అని కిట్టెల్ కన్నడ-ఇంగ్లీషు నిఘంటువు. కొన్ని గ్రామ నామ నామాల కనుబంధంగా సేడు అన్నది ఈ ప్రాంతంలో ప్రత్యేకంగావుంది. మిగతా ఆంధ్రదేశంలోలేదు. ఉదా॥ గరుడ సేడు, రంగసేడు.

**జంతువుల పేర్లు** : జంతువుల పేర్లతో వున్నవాటికి ఉదాహరణగా కరిడిపల్లి (< క. కరిడిహళ్ళి), కోడిపల్లి, ఎనుముందొడి పల్లి (< క. ఎమ్మెదొడ్డిహళ్ళి), పరిమేకలపల్లి మొ॥ చెప్పుకోవచ్చు.

కరిడిపల్లితప్ప తక్కినవి కన్నడ ప్రభావం కాకపోవచ్చు. కన్నడలో కరిడి అంటే ఎలుగుబంటి అనే అర్థంవుంది.

**ఘట్ట** : కన్నడలో ఘట్ట అంటే "ఎ రేంజ్ ఆఫ్ మౌంటెన్స్, స్టెప్స్ ఆర్ స్టెయిర్స్ ఆన్ ది సైడ్ ఆఫ్ ఎ రివర్" అని కిట్టెల్ డిక్షనరీ చెప్తోంది. ఘట్ట కొన్ని ఊళ్ళకు నామానుబంధంగా చేరింది. ఉదా॥ దొడఘట్ట, సోమఘట్ట మొ॥

దొడ్డఘట్ట < క. దొడ్డఘట్ట. కన్నడలో దొడ్డ అంటే పెద్ద అని అర్థం.

పై చెప్పిన గ్రామ నామాలే కాకుండా గొంచిరెడ్డిపల్లి అన్నది కూడా కన్నడ ప్రభావమే. కన్నడలో గొంచికాడు అంటే షావుకారి (ధనవంతుడు), యజమాని అని అర్థం.

## వ్య క్తి నా మా లు

గ్రామ నామాలమీదే కాకుండా ఈ జిల్లాలో వ్యక్తుల పేర్లమీద కూడా కన్నడ ప్రభావం కనిపిస్తోంది.

**అప్ప** : 'అప్ప' అన్నది కన్నడ పదం. దీన్ని తెలుగులో 'అయ్య'కు సమానంగా భావించవచ్చు. కొందరి వ్యక్తుల పేర్లకు అనుబంధంగా 'అప్ప' చేర్చి నామకరణం చేయడం ఈ జిల్లాలోనూ లేదా కర్నాటక సరిహద్దు ప్రాంతమైన ఇతర ప్రాంతాల్లోనూ తప్ప మిగతా ఆంధ్ర దేశంలో అంతగా కనిపించదు. (వ్యక్తుల పేర్లకు నామానుబంధంగా 'అయ్య' చేర్చడం దేశమంతా వుంది). 'అప్ప' చేర్చడం ఈ ప్రాంతానికి మాత్రం పరిమితం కావడం కన్నడ ప్రభావమే. ఉదా:- దొణప్ప, కొండప్ప, హనమంతప్ప, రామప్ప.

**అణ్ణ** : దేశమంతా పేర్లకు చివర 'అన్న' నామానుబంధం వుంటే ఇక్కడమాత్రం కొందరి పేర్లకు 'అణ్ణ' నామానుబంధం ఉండడం కన్నడ ప్రభావమే. 'అణ్ణ' కన్నడ పదం. 'అన్న' తెలుగు పదం ఉదా :- హంపణ్ణ, సంగణ్ణ, ఈరణ్ణ, అజ్జణ్ణ. కన్నడలో అజ్జ అంటే తాత అనే అర్థంవుంది. కాబట్టి అజ్జణ్ణ అన్నది పూర్తిగా కన్నడ ప్రభావమే. ఇదే తెలుగులో అయితే తాతయ్య అని వుండాలి. తాతయ్య అనే పేర్లు కూడా ఇక్కడ లేకపోలేదు

**తిప్ప** : కన్నడలో 'తిప్ప' అంటే "ఎ మ్యాస్ ఆఫ్ ది డంగ్ హిల్" అని కిట్టెల్ డిక్షనరీ. తిప్పతోవున్న పేర్లు తిప్పన్న, తిప్పమ్మ, తిప్పేస్వామి, తిప్పేరుద్ర, తిప్పయ్య నాయుడు మొ॥ వున్నాయి.

**బసవ మత ప్రభావం** : ఈ మత ప్రభావంతో కొన్ని పేర్లువున్నాయి. బసప్ప, బసవేశ్వరప్ప, బసవనగౌడు, కరిబసప్ప, బసవరాజు. ఇప్పటికాలంలో ఈ ప్రాంతంలో వున్న ఈ పేర్లు ఒకనాటి బసవ మత ప్రభావంవల్ల వచ్చినవే. ఆ కాలంలో జగజ్జ్యోతి బసవేశ్వరుని ప్రభావం ఈప్రాంతంపైన ఎక్కువగా వుండేది. తత్ప్రభావంతో పెద్దలు తమ బిడ్డలకు నామకరణంచేశారు. అనాది కాలంనుంచి తాత, ముత్తాతల పేర్లు మనవళ్ళకు నామకరణంచేసే ఆచారం ఉన్నందువల్ల నేడు కూడా ఆ మత ప్రభావంతో వున్న పేర్లు కనిపిస్తున్నాయి. అందువల్ల ఈ పేర్లన్నీ కన్నడ ప్రభావమని చెప్పడానికి ఆస్కారమయింది.

**శైవమత ప్రభావం** : ఆంధ్రదేశంలో శివునికి సంబంధించినపేర్లన్నీ కన్నడ ప్రభావమని చెప్పలేంకాని ఆ ప్రభావంతో నామకరణం చేసిన పేర్లు ఈ జిల్లాలోమాత్రం చాలా ఎక్కువగానే వున్నాయి. ఉదా:- నంజుండప్ప, మల్లీశ్వరి, రుద్రప్ప, మంప్ప, పరమేశ్వరయ్య, శివయ్య, విరుపాక్షయ్య, గౌరమ్మ, గంగమ్మ.

**దుర** : కొందరి వ్యక్తులకు దుర్గతోవున్న పేర్లు ఈ జిల్లాలోనూ, కర్నాటక సరిహద్దు ప్రాంతాల్లోనూ తప్ప ఆంధ్ర దేశంలో మరెక్కడా కన్పించవు. ఉదా :- దుర్గన్న/దురగన్న; దుర్గమ్మ/దురగమ్మ. ఉరవకొండ తాలూకా నింబగల్లు గ్రామంలో ఒక ఇంటి పేరు (సర్ నేమ్) 'దుర్గం' అని వుంది. ఇది కన్నడ ప్రభావమే కావచ్చు. ఉదా :- దుర్గం బసప్ప, దుర్గం ఈరణ్ణ.

వాళ్ళు : వ్యక్తుల పేర్ల చివర గౌరవ వాచకమైన 'గారు' చేరడం దేశమంతావుంటే ఇక్కడ 'వాళ్ళు' అనే పదాన్ని వేడస్తారు. ఇది కన్నడలో అవరు (క. అవరు = వారు) అనే దానికి సమానం.

ఉదా॥ బసిరెడ్డోళ్ళింటికి పోయిరా (<బసిరెడ్డి వాళ్ళ ఇంటికి పోయిరా)

క. బసిరెడ్డవర మనిగె హోగిబర్రి (<బసిరెడ్డి అవర మనిగె హోగిబర్రి)

వాళ్ళు అన్న పదానికి కన్నడజ్ఞాతి పదం 'అవర'. ఇలాంటివి వ్యవహారంలో వుండడానికి కారణం కన్నడ ప్రభావమే. ప్రత్యేకంగా బసిరెడ్డోళ్ళు (బసిరెడ్డివాళ్ళు) అని వ్యవహరించడం సాధారణంగా వుండదు. ఎక్కడైనా అరుదుగా వినిపిస్తే వినిపించవచ్చు. వాక్యరూపంలో అయితే ఎక్కువగా వ్యవహరిస్తారు.

ఇంకా లోతుగా పరిశీలిస్తే గ్రామాల పేర్లమీద, వ్యక్తుల పేర్ల మీద కన్నడ ప్రభావంతోవున్న విషయాలు చాలా తెలియడానికి అవకాశముందనిపిస్తోంది.

### రెఫరెన్సులు


కిట్టెల్, యఫ్. : ఎ కన్నడ-ఇంగ్లీష్ డిక్షనరీ, ఏసియన్ ఎడ్యుకేషనల్ సర్వీసెస్ ప్ర., న్యూఢిల్లీ (1982)

'ఎ గ్రామర్ ఆఫ్ ది కన్నడ లాంగ్వేజ్', ఏసియన్ ఎడ్యుకేషనల్ ప్ర., న్యూఢిల్లీ (1982)

నారాయణరావు, చిలుకూరి : 'గ్రామనామాలు', ఆంధ్ర భాషా చరిత్రము (ప్రథమ సం.) ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ప్రచురణ, వాల్తేరు (1937)

బ్రహ్మానంద, హెచ్. ఎస్. : 'తెలుగన్నడం', స్రవంతి, 23-12 (1977)

'రాయలసీమ తెలుగు', స్రవంతి, 30-3- (1[illegible]

'అనంతపుర మండలంలో భాషా వైవిధ్యం', అనంతపుర మండల చరిత్ర, సాంస్కృతిక ప్రత్యేక సంచిక (1976)

మోహన్, జి. యస్. 'స్థలనామ పరిశీలన (అనంతపుర మండలం)', (తెలుగు త్రైమాసిక వైజ్ఞానిక మాసపత్రిక), 12-1 (1983)

విశ్వనాథరెడ్డి, కేతు 'తెలుగు ఊర్లపేర్లయందలి అనుబంధ రూపములు : ఒక నమూనా పరి[illegible]', య. వి. యు. ఓరియంటల్ జర్నల్, తిరుపతి (1981)

శివశంకర నారాయణ ఆంధ్రప్రదేశ్ [illegible] అనంతపూర్, హైదరాబాదు (1970)


## శ్రీ అదవాని హనుమంతప్ప

# ఉదంకుని కథ

3 సెప్టెంబరు భారతిలో "ఉదంకుని కథ— నన్నయగారి బుష్యాత్మ" అనే వ్యాసం శ్రీ కాజ లక్ష్మీ నరసింహారావుగారు రాశారు. వారికి విశేషాలని తోచినవి చెప్పారు. బుష్యాత్మని గుర్తించే పద్ధతి కొంతవరకు నేర్పించారు వారు.

ఇక్కడ ఒక రహస్యం వుంది. భారతి పత్రిక మనలాంటి పామరులం చాలామంది చదువుతాం. (పండితులు తక్కువ మంది కదా! వారికి నమస్కారం) మనలాంటి పామరులకి తెలియటానికి పండితులైన వాళ్ళు కావ్యాలలోవున్న రహస్యాలూ, చమత్కారాలూ మర్మాలూ, మనకి తెలియచెబుతుంటారు. మనం చదువుకొని ఆశ్చర్యపోతూ వుంటాం. ఇట్లా సామాన్యులకి తెలియని చమత్కారాలూ గుట్టు విప్పే దుర్మార్గానికి యిటీవల యెక్కువగా పాల్పడ్డవారు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు. ఆ తరవాత యిది తెలుగులో ప్రబలిపోయింది. ఇక్కడ మరొక్క రహస్యం వుంది. ఒకణ్ణి పట్టుకొని నోటికివచ్చినట్టు యెంతెంతగా పొగడినా, యెవడూ నిలదీసి అడగడు. ఎవడైనా తిడితే, యెవడైనా నిలదీసి అడుగుతాడేమో!

ఎందుకొచ్చిన పేచీ? పొగడ్త అసహ్యంగా వున్నవాళ్లు కూడా 'మనకెందుకొచ్చిందిలే' అని పూరుకుంటారు. అందుకని యెవరినైనా తెగపొగడేస్తేనే క్షేమం. అందుకని అట్లా రాసేస్తున్నారు. ఇదీ రహస్యం.

నన్నయభట్టు పాపం మొట్టమొదట తెలుగులో కావ్యం రాశాడు. ఆ ఘనత ఆయనకి దక్కింది. అట్లాగని చెప్పి, ఆయన రాసిన ప్రతి పద్యంలోనూ, గద్యంలోనూ మాట మాటా పట్టుకు పీకితే, యేం ఒరుగుతుంది? ఇదేమన్నా రామరాజభూషణుడి పద్యమా?

ఇంక ఉదంకుడి కథ. 'పంకజభవ సన్నిభుఁడు' యిత్యాదు లన్నీ పద్యంలో బిందు పూర్వక 'క' కారంతో ప్రాసపడుతుంది గనక వచ్చినవి. బ్రహ్మతో సమానులైన మునులు నన్నయ భారతంలో చాలామంది వున్నారు. (పరమేష్ఠి కల్పుఁడగు నప్పరాశరు). 'అఘ పంక క్షాళన' 'అనాతంక మతి' యివన్నీ ప్రాసకోసం తయారైనవే. ఇంక 'ముని వరుఁడు'. ఈ - 'వరుఁడు' '-ప్రవరుఁడు' నన్నయ, ఆ మూడు పర్వాలలో విశృంఖలంగా ప్రయోగించాడు. అంతగా ముఖ్య మైన అర్థంయేమీ లేకుండానే '-వర', '-ప్రవర' శబ్దాలు నన్నయ వాడాడు. "గురు కులమునందు గురులకుఁ బరిచర్యలొనర్చి తా నపరిమిత నిష్ఠాపరుఁడై జ్ఞానము వడసెను." చెప్పవలిసింది అయి పోయింది. పద్యం పూర్తవలేదు. తనకి తెలిసినవేవో రెండు ముక్కలు చేర్చాడు నన్నయ. "గురు దయ సవిమాది కాష్ట గుణముల తోడన్". ఏమి చెప్పదుం గురునాథా !

"అయ్యుదంకుండు గురుహిత కార్య దురంధరుండై గురుపత్నీ నియోగంబున" అంటే గురుభక్తి వల్లనే, గురుపత్ని నియోగాన్ని తలదాల్చి వెళ్ళాడని అర్థం. "వనంబులో నొక్కరుండ చనువాఁడు" కావటానికీ "అనాతంకమతి"కీ సంబంధం యేమీలేదు. ఋషి కుమా రులకి అడవికి వెళ్ళటం అలవాటే. "వనంబులోన్" అంటే అడవి దారిలో అని అర్థం. "సాహసవంతుఁడగు నుదంకుఁడొంటరిగా పోవు చుండఁగా ఎదుట 'ఒక్క దివ్యపురుషుఁడు' వృషభ గోమయమును పన్నెను." వృషభ గోమయం యేమిటి? పన్నటం యేమిటి? నన్నయ "వాని పన్నిన వృషభగోమయ భక్షణంబు సేసి యమ్మాహాత్మ్యు నను గ్రహంబు వడసి" అన్నాడు. నన్నయకి 'గో' శబ్దం పుంలింగం అని తెలుసును. మరీ 'యెద్దావు పేడ' అని నన్నయ రాశాడనటం దారుణం. "వాని పన్నిన వృషభ గోమయం" అంటే ఆ దివ్య పురు షుడు యెక్కి వస్తున్న యెద్దుపేడ అని అర్థం. "వాని పన్నిన వృషభం" వాడు యెక్కటానికి తగిన యేర్పాట్లు చేసుకొని యెక్కి వస్తున్న వృషభం. (ఎద్దునెక్కటానికి, గుర్రపు జీనూలాగ యేవైనా యేర్పాట్లుండేవేమో !) దాని గోమయం భక్షించాడు ఉదంకుడు. ఈ సంగతి గురువుతో చెబుతూ ఉదంకుడు "ఒక్క దివ్య పురుషుంగని వాని పన్నిన వృషభ గోమయ భక్షణంబు సేసి" అన్నాడు. మధ్యలో పౌష్యుడు అశుచిత్వ ప్రస్తావన చేసినప్పుడు "ఉదంకుండప్పుడు దలంచి యా వృషభ గోమయ భక్షణంబున నైన యశుచి భావంబునఁ గాకేమి" అనుకున్నాడు. ఇక్కడ 'పన్నిన' లేదు. అయినా వృషభ గోమయం అన్నది నన్నయ ఋష్యాత్మ ! పైలుడు మాత్రం "అప్పురుషు డింద్రుఁడయ్యుక్ష మైరావతంబు గోమయ మమృతంబు" అన్నాడు. ఇక్కడ నన్నయ వృషభ గోమయం అనిపించలేదు. మధ్యలో 'ఆ వృషభ గోమయం' యెట్లావచ్చింది ? "వృషభ గోమయ మన నది యెక చమత్కారమగు సమాసము" అనుకొని యెవడో లేఖకుడు యిరికించి వుంటాడు. 'పన్ను' అనే క్రియకి 'సిద్ధపఱచు', 'ఏర్పరచు' అనే అర్థాలు శబ్ద రత్నాకరంలో వున్నాయి. "కడఁకం బన్నఁగ నానతిచ్చెఁ జమరంగంబుల్ రణక్రీడకునీ పెడలన్." ఉ-హరి. 4-ఆ. "ఘనురాచార్యుఁడు తగఁబన్నిన పద్మవ్యూహమొకఁడు నేరరు చొర" భార-ద్రో. 2ఆ. అని ప్రయోగాలు వున్నయి. ఇవిగాక మరో ప్రయోగం "పన్నినవాఁడ వింకఁ జెడి పాఱకుమీ యని మూదలించి" ఉ-హరి. 3ఆ. అని యిచ్చి దాని అర్థం 'యుద్ధమునకు సిద్ధపడు' అని రాశారు. ఇన్నిచోట్లా 'పన్ను' అంటే సన్నాహం చెయ్యటం అని అర్థం వుంది. రథం పన్నటం అనే ప్రయోగం భారతంలో చాలా చోట్ల వుంది. వలపన్నుట, మాయలు పన్నుట అన్నప్పుడు కూడా యేర్పాటు చెయ్యటం, సన్నాహం చెయ్యటం అని అర్థం. పాపం! ఆ దివ్య పురు షుడు గోమయం పన్నలేదు. "గోమయము తినుమని దివ్య పురుషుఁ డుదంకుని కోరలేదు. ఉదంకుఁడే సాహసము చేసెను. ఇది నన్నయ గారి కథనము." దార్లో పోతూ వుంటే, ఒకడెవడో యెద్దుమీదయెక్కి యెదురైతే, ఆ యెద్దు పేడ తినేశాడు ఉదంకుడు. ఎంత చక్కగా వుంది 'నన్నయ గారి కథనం' !

"ఇంతవరకు నడచిన విమర్శలో 'లోనారసి' చెప్పిన 'ప్రసన్న కథాకవితార్థయుక్తి'గాని ఋష్యాత్మ యొక్క యావిష్క రణముగాని యేమియు లేవు. ఇప్పుడుండి చూడవలయును." చూద్దాం.

"ఏను గుర్వర్థ మర్థినై మానవేశ!
కడగి వచ్చితి నీపుడు నీకడకు వేడ్క
దండి తారాలి! నీదేవి కుండలమ్ము
లిమ్ము నాకున్కి యిది సఫలమ్ము కాగ."

నన్నయ పద్యాలలో సందర్భంవున్నా లేకపోయినా సంబో ధనలు వుంటూ వుంటయి. పై పద్యంలో సంబోధనలు పౌష్యుడి వృద్దేశించి చేసినవి. ఇవి ఉదంకుడికి అన్వయించుకోటం యెందుకు? ఈ పద్యంలో 'కడగి', 'వేడ్క', 'యిది' అనే మూడు మాటలూ దండగమాటలు. (శ్రీ అక్కిరాజు ఉమాకాంతంగార్ని తలుచుకోవాల్సి యింకా మరిచిపోలేదు.)

"అయ్యా మదీయ ధర్మపత్ని యయ్కుండలంబులు దొడుగ నవసరంబై యున్నయది మద్వచనంబున వాని నిప్పించుకొమ్మనిన" పౌష్యుడెక్కడా తక్షకుడి సంగతి యెత్తలేదు. అట్లాంటప్పుడు "ఈ తక్షకుఁడా కుండలముల నపహరింపఁ దలఁచి నాఁడని రాజెఱుగును" అని యెట్లా అనుకుంటాం? 'తొడుగు' అంటే ధరించటం. అయితే, ధరించటం అనవలసినచోట ప్రతిచోటా తొడగటం అనటానికి వీలు

పడదు. శరీరానికీ, శరీర భాగాలకీ చుట్టుకొనివుండే వాటిని ధరించటాన్ని తొడగటం అంటారు. కవచం తొడుగుతారు. గాజులు తొడుగుతారు. చెప్పులు తొడుగుతారు. కుండలాలు తొడగటం వాడుకలో లేదు. కుండలాలు పెట్టుకుంటారు. నన్నయ తెలుగు యీ మాత్రం ఊజ్జాయింపుగానే వుంటుంది. 'అవసరం' అనే మాటకి నన్నయ వాడుకలో 'సమయం (వేళ)' అనే అర్థం. 'అత్యంత ముఖ్యం' అనే అర్థం లేదు. "గురుపత్నియు శుచిస్నాతయై నూతన పరిధాన శోభితయై యక్కుండలంబులు దొడువ నవసరంబై నను" అన్నప్పుడు కూడా సమయం అనే అర్థం "స్వస్తి యొనర్చు నవసర మాస్తీకున కయ్యె నిస్పృడంబుజనేత్రా" అన్నప్పుడూ సమయం అనే అర్థం. నన్నయ భారతంలో 'కుండలి' ఊసెత్తలేదు. కుండలాలకీ కుండలికీ సంబంధం ప్రస్తావనాలేదు.

"భూవినుత నిన్ను త్రిభువన పావనున్" అనే పద్యంలోనూ రెండు సంబోధనలు. "అశుచివని యెట్లు పలుక నగు" అన్నాడు పౌష్యుడు. అశుచిత్వం మహాపాపమేమీకాదు. త్రిభువన పావనుడైన వాడు కూడా రోజూ అశుచి అవుతూ వుంటాడు. శుద్ధి చేసుకుంటూ వుంటాడు. అయితే, ఉదంకుడు నిష్ఠాపరుడు కాబట్టి అశుచి అయిన వెంటనే శుద్ధి చేసుకుంటాడని రాజు నమ్మకం. అందుచేత 'నిన్ను యిప్పుడు అశుచివవటం యెట్లా, మేమైనా యేమరుపాటు పడ్డావా' అనే అర్థంలో అన్నాడు. వెంటనే ఉదంకుడు తెలుసుకొని "పూర్వాభిముఖుండయి శుద్ధోదకంబులం ప్రక్షాళిత పాణిపాద వదనుండయి యాచమించి" శుచి అయ్యాడు. అశుచిత్వం అఘమూకాదు దానికి శాశ నానికి మహా తపస్సలిలాలూ అక్కరలేదు. శుద్ధోదకంబులు చాలు.

"అదియును నమ్మహామునికి నమస్కరించి కుండలమ్ములిచ్చి" యిట్లనియె. నన్నయ రాణీనైనా, దాసీనైనా 'అది' అంటాడు. (నన్నయ తెలుగువాడు కాడేమో!) " 'అమ్మహామునికి' రాణి నమస్కరించెనని చెప్పుటచేత నాయన మాట్లాడలేదని తెలియుచున్నది" అంటారు శ్రీ రావుగారు. నన్నయ 'ముని' అనే మాట ప్రయోగించిన సందర్భాలుచూస్తే ఆయన మాట్లాడాడో లేదో తెలుస్తుంది.

"అని వినిశ్చితాత్మయై నిజపతిం బ్రబోధించె మునియు
నిద్ర దేఱి యలిగి యేల నిద్ర జెఱిచితిపుడు వావుడు
జరత్కారు విట్టులనియెం గరము వెఱచి" (ఆ-2-159)

"కృష్ణ ద్వైపాయనుండు వైశంపాయన మునింజూచి
శ్రీ మహాభారత కథాఖ్యానం బాద్యంతం బితనికి
సవిస్తరంబుగా జెప్పుమని పంచి పనిచిన" (ఆ-3-6)

"వైశంపాయన మునిం బూజించె వినతుండై విష్ణువేడ్కన్" (ఆ-3-7)

"ఆ వైశంపాయనుండును నఖిల భువన వంద్యుండయిన
కృష్ణ ద్వైపాయన మునీంద్రునకు నమస్కారంబు సేసి" (ఆ-3-8)

"ఇట్లు విగత లజ్జా పరవశుండయి మునివరుండు దన
యభిప్రాయం బక్కన్యక కెఱింగించిన నదియును" (ఆ-3-39)

"ప్రసాదబుద్ధి యొనర్చు నన్ముని గణోత్తమ నాకు దోష
విముక్తి యెట్లగు నట్లుగాన్" (ఆ-3-40)

"అనిన నమ్మునివరుండు గరంబు సంతోషించి నాకు
నిష్టంబు సేసిన దాన నీకన్యాత్వంబు దూషితంబు
గా దోడకు మని" (ఆ-3-41)

"ఎట్లు సంగమ మగునని యింతియన్న
నమ్మునీంద్రుడు గావించె నప్పు డఖిల..." (ఆ-3-42)

మునులందరూ మాట్లాడుతూనే వున్నారే! మాట్లాడకూడని మాటలుకూడా మాట్లాడు తున్నారు.

"నిండు మనంబు నవ్యనవనీత సమానము" అనే పద్యంలో "విప్రులయందు" అనీ "విప్రుడోపున్" అనీ రెండుసార్లు విప్రశబ్దం ప్రయోగించాడు నన్నయ. "ఋషి యయిన యుదంకుని మహిమ యిట్లు విప్రశబ్ద ప్రయోగముచేత నిరూపింపం బడినది" అంటే, యీ విప్రశబ్దం ప్రయోగించినది ఉదంకుణ్ణి ఉద్దేశించి కాదే, బ్రాహ్మణులందర్ని గురించే! నన్నయ యితర ప్రయోగాలు పరిశీలిస్తే 'నిండు మనంబు' పద్యంలో విప్రశబ్దానికి యేమని అర్థం చెప్పుకోవాలో తెలుసుంది.

"వసువులు రుద్రులు వసుహీన విప్రుల క్రియ దక్షిణాశ్రితు
లయిరి భీతి" (ఆ-2-100)

"ఈ తపంబేం దొడంగెద ననవుడును నయ్యధోముఖ విప్రుల్" (ఆ-2-142)

"తక్షకుండు వృద్ధ విప్రుండయి వనంబులోన్" (ఆ-2-188)

"మంచి తనేక యాగముల మానుగ దక్షిణలిచ్చి విప్రులన్" (ఆ-2-203)

అని యాస్తీకుండు వాసుకి ప్రముఖులనెల్ల నాశ్వాసించి
సకలవేద వేదాంగులయిన విప్రవరులతోడం జని (ఆ-2-223)

"ఇటి విశిష్ట విప్రముఖ్యునకు మహా తపోధనునకుం దగు
పాత్రున శ్రేద్ధి యిచ్చినన్ (ఆ-2-282)

సతులు సంతానకాంక్ష వెలయంగ ఋతు
కాలముల మహావిప్రుల దయఁజేసి ధర్మువు దప్పకుండ
బడసిరి పలువురఁ గొడుకులఁ గూఁతులన్" ఆ-3-51)

బ్రాహ్మణ శబ్దానికి పర్యాయపదంగానేవుంది విప్రశబ్దం కూడాను.

"ఉదంకుండును వాని పిఱుందన పాఱి పట్టి కొనుడు
విడిచి దిగంబరవేషము,
విడువక మణికుండలములు విషధర పతియే
ర్పడ నిజరూపముతోన,
ప్పడ యహి లోకమున కరిగె భూవివరమునన్."

ఈ పద్యంలో 'విడిచి' అనే క్రియని రెండు విధాలుగా అన్వయించటానికి కుదరదు. తక్షకుడు దిగంబరవేషం విడిచి పెట్టాడని ఒకటే అర్థం. ఉదంకుడు తక్షకుణ్ణి పట్టుకుంటే, తక్షకుడు విడిచిపెట్టటం యేమిటి? తక్షకుడు విడిపించుకుంటాడు. "ఇట్టిక్రియా న్వయ గత చమత్కారము వలన రచనకొక సొగసు వచ్చినది." క్రియకి అన్వయమే కుదరనప్పుడు చమత్కారం యెక్కణ్ణించి వస్తుంది?

"ఉదంకుండును వాని తోడన తగిలి యవ్వివరంబున
నురగ లోకంబున కరిగి"

"'తగిలి' అను క్రియ బహు విలక్షణమయిన అర్థమున వాడ బడినది" అనటానికి వీలు లేకుండావుంది. "వెంబడించి" అనే అర్థంలోనే వాడాడు నన్నయ. తక్షకుడు ఉదంకుడి పట్టుతప్పించుకొని యెప్పుడో పారిపోయాడు. ఉదంకుడి అణిమలూ, మహిమలూ మేమీ పనిచెయ్యలేదు. "అవ్వివరంబున నాగలోకంబునకరిగి" తక్షకుడు కనిపించకపోతే "నాగపతులనెల్ల నిట్లని స్తుతించె" అన్నాడు నన్నయ. ఉదంకుడు పట్టుకోవటం, తక్షకుడు విడిపించుకొని పారిపోవటం స్పష్టంగా చెప్పలేదు నన్నయ్య. అప్రసన్న కథా కలితార్థయుక్తి !

ఉదంకుడు తక్షకుణ్ణి ప్రార్థించిన పద్యంలో "ఈక్షణ శ్రోత్ర విభుండు" అంటే తిట్టుకాదు. ప్రాసస్థానంలో 'త్ర' వుంది గనక అట్లా సరిపెట్టాడు. ఉదంకుడు యెన్ని స్తోత్రాలు పఠించినా యెవడూ బయటికి రాలేదు. అప్పుడు ఉదంకుడు పాతాళలోకంలో "అతి ప్రమాణ తురంగంబు నెక్కిన వాని మహాతేజస్వి నొక్క దివ్య పురుషుంగని" వాణ్ణి స్తుతించాడు. అతి ప్రమాణ తురంగాన్ని యెక్కినవాఁడు యింద్రుడు కాడు. "పూర్వము తనచేత వృషభ గోమయమును భక్షింపఁజేసినవాఁడు" కాడు "యీ దివ్యపురుషుఁడు". ఉదంకు డడిగితే పైలుడు యెవరు యేమైనదీ చెప్పాడు. మొదట వనంలో కనిపించిన "అప్పురుషుఁడింద్రుఁడయ్యుక్ష మైరావతంబు" అనీ, తరువాత పాతాళ లోకంలో కనిపించిన "అత్తురంగ మగ్ని యప్పురుషుండు పర్జన్యుఁడింద్రసఖుఁడు" అనీ గుర్తుచెప్పాడు పైలుడు.

"అత్యాయత విమల తపోమహిమా యిన్ని దినంబులేల మసలితి చెపుమా" అన్నాడు పైలుడు. మసలటం అంటే ఆలస్యం చెయ్యటం అనే అర్థంలోనే వాడాడు నన్నయ. మసలటం అంటే 'సలసల కాగటం' అనే అర్థం నన్నయనాటికిలేదు. అర్జునుడి తీర్థయాత్ర సందర్భం

ఏలా వన రమ్యములగు
వేలా వనములను బహువిషధ ద్వీపీ
లాలిత సముద్ర విద్రుమ
మాలా పులిన స్థలముల మసలుచు లీలన్"

అని ప్రయోగించాడు నన్నయ. తక్కిన ప్రయోగాలు కూడా యీ అర్థంతోనే వున్నాయి.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు "ఋషివంటి నన్నయ్య" అన్నారు. (ఎందుకన్నారో ఆయనకే తెలియాలి !) అందుకని నన్నయ పద్యాల్నీ, గద్యాల్నీ పట్టుకు సాగదీసి, అందులోలేని అర్థాలు చెప్పి, అసలు విషయం వొదిలేసి సోది చెప్పటం మొదలుపెట్టి (సత్యనారాయణగారి అలవాటే) జనాన్ని యేడిపించుకు తింటు న్నారు. ఉన్నమాటలకి అర్థం చెప్పగలిగితే చెప్పొచ్చును. కావాల్సిన చోట వివరణం యివ్వవచ్చును. అంతేగాని ఇదంతా యేమిటి? ఇంతకీ, ఉదంకుడు భక్షించిన గోమయం అమృతమైతే, ఉదంకుడు 'అమృతాశి'. యెట్లా అవుతాడు? ఆ సంగతి యేమీ చెప్పలేదు శ్రీ లక్ష్మీ నరసింహారావుగారు.

నన్నయకి పద్యాలు బాగా రాయటం చేతకాకనే గద్యాలు యెక్కువగా రాశాడు. పద్యం ధారాళంగా రాకపోవటంవల్లనే దండగ మాటలూ, అప్రస్తుతమైన రెండు మూడు సంబోధనలూ నన్నయ పద్యంలో వుంటాయి. ఇంక, నన్నయ భారత భాగంలో ధారాళంగావున్న పద్యాలన్నీ నారాయణభట్టు రాసినవి కావచ్చును. శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు తమ నారాయణభట్టు నవలలో "నన్నయ యరణ్య పర్వములో శరదృతువు వర్ణన వ్రాయుచుండఁగా నారాయణభట్టు లోకాంతరగతుడయ్యెను" అన్నది యథార్థమే నని పిస్తుంది. "శారద రాత్రులు" అనే పద్యం నారాయణభట్టు చివరి పద్యం. నన్నయ భారతాన్ని గురించి యింతమంది యిన్ని రాస్తు న్నారుగాని, నారాయణభట్టు నన్నయకి యేవిధంగా తోడయి నిర్వ హించాడో వివరించటానికి యెవరూ పూనుకున్నట్లులేదు.

**శ్రీ శ్రీ న. చ. రామానుజాచార్యులు**

# లేఖ

## సుమతి - వేమన

1983 సం॥ము ఫిబ్రవరి భారతిలో డా॥ కొర్లపాటి శ్రీరామ మూర్తిగారు సుమతి శతకంపై వ్రాసిన వ్యాసము సవిస్తారముగా ఉన్నది. ప్రాథమిక విద్యార్థులు పఠించే పద్య శతకముపై పరిశోధన జరిపి 10 పేజీల వ్యాసము వ్రాసేరంటే అది మెచ్చుకోదగ్గ విషయము.

ఆంధ్రప్రాచీన శతకాలలో నేఁటికిని సజీవమైయున్న సుమతీ శతకము జైన రచననీ, 1980లో తెలుగు అకాడెమీ సంకలనము చేసిన శాస్త్ర నిఘంటువు -8- ప్రాచీన సాహిత్యములో బద్దెన 13వ శతాబ్దివాడనీ, అతని రచనలు : నీతిశాస్త్రము, సుమతి శతకము (కర్తృత్వము వివాదాస్పదము), బిరుదు కావ్య చతుర్ముఖుడు, భద్ర భూపాలుడు, బద్ది భూపతి, బద్దినృపాలుడు, బద్దినరేంద్రుడు మొ॥ గు 19 బిరుదు నామములతో తననుతాను చెప్పుకొన్నాడని యున్నది. మానవల్లి రామకృష్ణ కవిగారి నిర్ణయము 1050 అని పై వ్యాసములో ఉన్నది. నన్నయ భారతావరణ కాలముకూడా ఇదియే.

పై వ్యాసము ప్రకారము సుమతీ శతకకాలము 14వ శతాబ్ది ఉత్తరార్థము. ఈ దిగువ వ్రాయబడిన పద్యములు సుమతీ, వేమన శతకములలో కొన్ని యథాతథముగాను, కొన్ని కొలది మార్పులతోను, మఱికొన్ని ఎక్కువ మార్పులతోను ఉన్నవి :

### సుమతి

1. కమలములు నీట బాసిన
కమలాప్తుని రశ్మి సోకి కమలిన భంగిన్
తమతమ నెలవులు దప్పిన
తమ మిత్రులె శత్రులౌట తథ్యము సుమతీ — 28
(బాలసరస్వతీ బుక్ డిపో, కర్నూలు, 1954)

2. ఉడు ముండదె నూఱేండ్లును
బడి యుండదె పేర్మిఁబాము పది నూఱేండ్లున్
మడువునఁ గొక్కెఱ యుండదె;
కడునిలఁ బురుషార్థపరుడుఁ కావలె సుమతీ
—పెదే— 13

3. తన కోపమె తన శత్రువు;
తన శాంతమె తనకు రక్ష; దయ; చుట్టంబౌ
తన సంతోషమె స్వర్గము
తన దుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ
౹దే—

4. కనకపు సింహాసనమున
శునకముఁ గూర్చుండ బెట్టి శుభలగ్నమునం
దొనరఁగఁ బట్టముఁ గట్టిన
వెనుకటి గుణమేల మాను, వినురాసుమతీ
—పెదే— 26

5. ధన౯తి సుఖుడై యుండియు
నెనయంగా శివుడు భిక్ష-మెత్తగవలసెన్
తన వారి కెంత గలిగిన
తన భాగ్యమె తనకుఁ గాక తథ్యము సుమతీ —59

### వేమన

1. యథా తథముగా

— 534, ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ
ప్రచురణ - బ్రౌన్ - 1967

2. ఉడుముండును నూరేండ్లును
పడి యుండును పాము యొక్క పది నూరేండ్లున్
మడుగున గొక్కెర యుండును
పుడమిని పురుషార్థపరుడు పుణ్యుడు వేమా
—పెదే— 692

తన నీడ తనకు శత్రువు
తన నీడే తనకు సాక్షి తన దేహములో
తన వారే తన శత్రులు
తన మనసే తనకు తోడు తథ్యము వేమా -180

4. కుక్క నందలమున కూర్చుండ బెట్టిన
నొక్క మనసుతోటి నుండలేదు
ఆత్మ నిల్పలేదు అజ్ఞాన చిత్తుండు
-762

5. ధనపతి చెలికాడయ్యును
యెనయంగా శివుడు బిక్ష మెత్తగ వలసెన్
తన వారు ఎందరున్నను
తన భాగ్యమె కాని లేదు తథ్యము వేమా —921

**సు మ తి** | **వే మ న**

ఒల్లనిసతి, నొల్లని పతి
నొల్లని చెలికాని విడువ నొల్లని వాఁడే
గొల్లండు కాక ధరలో
గొల్లండుడు గొల్లఁడౌనె - గుణమున సుమతీ —28

6. 1) ఒల్లని సతి యొల్లనిపతి
యొల్లని చెలికాని విడువ నొల్లనివాడే
గొల్లడు గాడా ధరలో
గొల్లనికిం గలవె వేరె కొమ్ములు వేమా —1120

2) చెల్లని సతి నొల్లని పతి —557.

ఆఁకొన్న కూడె యమృతము
తా కొంచక నిచ్చువాఁడె దాత ధరిత్రిన్
సోకోర్చు వాడె మనుజుడు
తేఁకువ కలవాడె వంశ తిలకుడు సుమతీ.

7. ఆకొన్న యతిథి శివుడని
కాకించక లేక మదిని కరుణాన్వితుడై
పోకంత యన్న మిడినను
యూకొని యా యముని గొట్టయుపమరి వేమా —1174

కరణము సాధై యున్నను
కరి మదముడిగినను, బాముగఱవక యున్నన్
ధర తేలు మీటకున్నను
కర మరుదుగ లెక్కగొనరు గదరా సుమతీ —31

కరణ మధముడైన కాపు లందరు గూడి
వంగు మంత్రుడు మనసు వచ్చినపుడు
బిరుసు కరణమైన బిడ్డల మందురు . —1069

వినదగు నెవ్వరు సెప్పిన
విని నంతనె వేగపడక వివరింపఁదగున్
గని, -97

9. మని యుండెడి జన మెల్లను
చనిపోయిన వారి పుణ్య సత్కథ లెలమిన్
వినవలె, గనవలె, మనవలె,
ననిమిషులకు నైనఁ దెలియదంత్యము వేమా

వేమన శతకము 15వ శతాబ్దములో గాని తదుపరి గాని వ్రాయబడిన దగుటచే సుమతీ శతకము ననుసరించియే వ్రాయబడిన దన వచ్చును.

మన మాతృ భాష నుండి సుమతీ శతకము దేవ భాషకు, వేమన శతకము ఉర్దూ, హిందీ భాషలకు భాషాంతరీకరణ మొనర్ప బడెను.

కె. విశ్వేశ్వరరావు
హైదరాబాదు.



# గ్రంథ విమర్శలు

## శ్రీశైల మహాక్షేత్ర చరిత్ర జీర్ణోద్ధారకులు - మహాభక్తులు

[రచయిత : శ్రీ ఓరుగంటి వేంకట రమణయ్య (పత్రికా రచయిత) ట్రస్టీ, శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జున దేవస్థానము. డెమ్మీ. 96 + 72 పుటలు. వెల 5 రూ. లు. ప్రకాశకులు-శ్రీశైల దేవస్థానం, శ్రీశైలం, కర్నూలుజిల్లా.]

ఆంధ్రదేశంలోని ప్రసిద్ధ శైవక్షేత్రాలలో శ్రీశైలం ప్రధానమైనది. ఆ క్షేత్ర మాహాత్మ్యాన్నీ, అక్కడి ప్రకృతి దృశ్యాలనూ వివరిస్తూ యిదివరకే కొన్ని గ్రంథాలు ప్రకటించబడినవి. అట్టి గ్రంథాలలో ఇది ఒకటి.

దీనిని రచించిన ఓరుగంటి వేంకట రమణయ్యగారు శ్రీశైలం దగ్గరి మార్కాపుర నివాసులు, ఆ స్థల విశేషాలను బాగా ఎరిగిన వారు. శ్రీశైల దేవస్థానం కార్యనిర్వాహక సంఘంలో సభ్యులుగా కూడా ఉన్నారు. జర్నలిస్టుకావడంవల్ల విషయాలను సేకరించుటలో అనుభవం ఉన్నవారు. అందువల్ల శ్రీశైల మహాక్షేత్రాన్ని వృత్తాంతాన్ని సంగ్రహించి ఈ పుస్తకాన్ని రచించారు. ఈయన శిథిలావస్థలో ఉండిన క్షేత్రాన్ని [illegible] రణ చేసినవారికీ, దానిని కాపాడిన వారికీ, మహాభక్తులకూ కూడా ప్రాధాన్యం ఇచ్చి, [illegible] గురించిన విశేషాలను చేర్చడం యీ పుస్తకంలోని విశేషం. క్షేత్రానికి సంబంధించిన కథలనూ, క్షేత్రం యొక్క నాలుగు ద్వారాలనూ, స్థల విశేషాలను రచయిత సులభమైన భాషలో తెలియజేశారు. వివిధ దృశ్యాలను సంబంధించిన ఛాయాచిత్రాలు, జీర్ణోద్ధారకుల ఛాయాచిత్రాలు ఇందులో చేర్చబడినవి. దీనిని చదివితే — ఇతరులను అడిగి తెలుసుకోనక్కరలేకుండా శ్రీశైలాన్ని గురించిన విశేషాలను అన్నిటినీ తెలుసుకోవచ్చును. భక్తులకు ఉపయోగపడే ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రం, అష్టాదశ మహాశక్తి పీఠస్తోత్రం, లింగాష్టకం, బిల్వాష్టకం, భ్రమరాంబాష్టకం, అంబాష్టకం గ్రంథాదిని ఈయబడినవి.

కళాప్రపూర్ణ, కవిచకోర చంద్రోదయ పైడి లక్ష్మయ్యగారు, బి. ఏ., బి. యల్. (మాజీ దేవాదాయ కమీషనరు), డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారు, [illegible] ప్రభ" సంపాదకులు-పులిపాక చలపతిరావుగారు, మార్కాపురం కళాశాల ఆంధ్రోపన్యాసకులు వెలమకన్ని దాసరయ్యగారు, సాహిత్య విద్యాప్రవీణ: ఉభయభాషాప్రవీణ అచ్యుతన్న సుబ్బరామయ్యగారు, మార్కాపురం ఎడ్వకేట్ అన్నం రాజు వేంకటసుబ్బారావుగారు రచయిత కృషిని ప్రశంసించారు.

ముద్రణ చక్కగానే ఉన్నది. కాని అచ్చుతప్పులు ఉన్నాయి. స్తోత్రాలలో అయినా అవి లేకుండా ఉంటే బాగుండేది.

## భాగవత ప్రభ

[భాగవత పురాణ మాహాత్మ్యం. కృష్ణోపనిషత్తులతోసహా. రచయిత, ప్రకాశకులు : శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి. డెమ్మీ సైజు 32 పేజీలు. వెల : శ్రద్ధాభక్తి వైరాగ్యాలు. లభించుచోటు : శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి, జయశ్రీ టాకీస్‌రోడ్. రాజమండ్రి-4]

పెక్కు ఆధ్యాత్మిక గ్రంథాలను రచించి ప్రకటిస్తున్న రాధాకృష్ణమూర్తిగారు "పురాణతిలకమై, భక్తిజ్ఞాన వైరాగ్య ప్రబోధాలతో సనాతన హిందూధర్మ ప్రచారానికి సంపూర్ణంగా సహకరించే భాగవత మహాపురాణాన్ని" ఆరు సంపుటాలుగా పై పేరుతో ముద్రించి ప్రకటించడానికి పూనుకుని, దానికి అనుబంధంగా తొలుత దీనిని ప్రకటించి ఆంధ్రలోకానికి ఉచితంగా అందిస్తున్నారు. 'ఇందులో మొదటి 'భాగవతప్రభ' వైశిష్ట్యం ఆరు పేజీలలోను, భాగవత మాహాత్మ్యం రెండు పేజీలలోనూ ఇవ్వబడినవి. తర్వాత గోరఖ్‌పూర్ ప్రెస్‌వారు ప్రకటించిన శ్రీకృష్ణోపనిషత్తునకు రాధాకృష్ణమూర్తిగారి వచనానువాదం ఉన్నది.

వేద భాగాలుగా పరిగణింపబడే ఉపనిషత్తులే కాక, తర్వాత ఎన్నో ఉపనిషత్తులు వచ్చాయి. ఆత్మతత్త్వాన్నీ బోధించడంవల్ల వీటికి ఈ పేరు పెట్టబడి ఉంటుంది. అలాటి వాటిలో శ్రీకృష్ణోపనిషత్తు ఒకటి.

దీని తర్వాత ఆత్మవిశ్వాసాన్ని గురించిన చక్కని కథ ఉన్నది. దుష్ట స్వభావులకు కూడా అది భక్తిభావాన్ని కలిగించే విధంగా చక్కని శైలిలో ఉన్నది. చివర "కృష్ణం వందే జగద్గురుమ్" అనే మకుటంగల కృష్ణాష్టకమూ, అచ్యుతకథాశ్రవణ ఫలం, జగన్నాథాష్టకం చేర్చబడినవి.

ఉచితంగా లభించే యీ చిన్న పుస్తకాన్ని చదివేవారికి భాగవతాన్ని చదవడానికి ఆసక్తి కలుగుతుంది. అట్టి ఆసక్తి కలుగడానికే రచయిత దీన్ని ప్రకటించి, భక్తిజ్ఞాన వైరాగ్యాలను దీనికి మూల్యంగా నిర్ణయించి ఉంటారు.

"అంగీరస

## కల్కి

[ఆంగ్ల మూలము : గురుబ్రహ్మస్వామి జగదీశ్వరానంద. అనువాదము : హరి మృత్యుంజయ శర్మ. మూల్యము : రు. 5-00; ప్రతులు లభించు స్థలము : హరి మృత్యుంజయ శర్మ, కేరాఫ్ లలితా ప్రింటింగ్ అండ్ బైండింగ్‌వర్క్స్, 1-1-1167/6/1, తిలక్‌నగర్, హైదరాబాద్-500 044.]

హిందూమతం ప్రకారం దశావతారాలలో పరమేశ్వరుని చిట్టచివర అవతారము కల్కి అవతారం. కలియుగం, కలిపురుషుడను వూహలతో కల్కి అవతారమును ముడిపెట్టరాదు. విశ్వాసం లేకుండా జీవించడం దుర్లభం. "తర్కం ప్రకారం అవిశ్వాసం కూడా ఒక స్థాయిలో విశ్వాసమే." ఇంతకూ యీ పుస్తకం చదవబోయేముందు మనసులో ఒక అభిప్రాయం పెట్టుకొనడం వివేకమనిపించుకొనదని వివరించడానికే ఇంత చెప్పవలసి వచ్చింది. ఈ పుస్తకం (5 వ పుటలో)లో చెప్పినట్లు క్రీ. శ. 2002 నుండి 2022 వరకు సుఖశాంతులు విలసిల్లే కాలం. దీనికి సూచనలు చూడగలవారికి కనిపించుతున్నాయి. ఇంతకూ కల్కి ఎప్పుడు వస్తున్నాడు? ఇది ఊహకు సంబంధించిన అంశము. ఒక వూహ ప్రకారం క్రీ. శ. 1985 పూర్వార్థంలో ఉత్తరప్రదేశ్ నందలి మధురలో ఒక బ్రాహ్మణ కుటుంబమున జన్మించుతాడు. అయితే ఏమిటి? పాపం నశించుతుంది. ధర్మం జయిస్తుంది. భారతదేశం మళ్ళీ ఐక్యంచేసి, భారతదేశ ఔన్నత్యాన్ని మహోన్నతమొనర్చురాడు. మహాభారతము, దేవీ భాగవతము కల్కి పురాణంవంటి గ్రంథాలలో కల్కి తండ్రిపేరు విష్ణుయశుడని ఉన్నది. ఇలా కల్కిదేవుడు చేయబోయే పెక్కు పనులను ఈ 58 పుటల పుస్తకంలో యీ రచయిత సులభశైలిలో పొందుపరచారు. తొలుతనే విన్నవించినట్టు ఇదంతా విశ్వాసంగలవారి నుద్దేశించి వ్రాసినది. భువిని దివిగా తీర్చిదిద్దుటయే అనగా విశ్వవ్యాప్తంగా పవిత్రధర్మాన్ని మరియు వైదిక మతమును పునరుజ్జీవింపజేసి, సుస్థిరమొనర్చుటయే పరమలక్ష్యము మరియు ప్రధాన కర్తవ్యము. "ఉన్నది" "లేదు" అనే మిమాంసను కొంతవరకు విస్మరించి జిజ్ఞాసచేయగలవారందరూ చదువతగిన మంచిపుస్తకమిది.

శ్రీ వి. ఎమ్. ఎస్. అవధాని

## మాదన్న మహా మంత్రి

[రచన : శ్రీ కె. వి.

తిమ్మరుసు తరువాత తెలుగు మంత్రులలో పేర్కొనదగిన మహనీయుడు మాదన్న పంతులే. విజయనగర సామ్రాజ్య పతనానంతరం తెలుగుగడ్డలో విరిసిన మంత్రిపుష్పం మాదన్న. హిందూ ప్రభువుల ఏలుబడిలో తిమ్మరుసు నెరపిన యంత్రాంగమహిమకంటె, ముస్లిం ప్ర[illegible]యాములో మాదన్న వెలిగించిన దివానీగిరియే దివ్యమైనది. ఈ సందర్భంలో ఆ అమాత్య శేఖరుని బుద్ధిబలంతో పాటు గోల్కొండ సుల్తానుల పరమత సహనాన్ని వేనోళ్ళ కొనియాడక తీరదు.

దురదృష్టవశాత్తూ ఇంతటి మహామంత్రి జీవితగాథ ఇంత కాలమూ సరిగ్గా వెలుగులోనికి రాలేదు. శ్రీ వేదం వెంకటరాయశాస్త్రి గారు వెలయించిన 'అక్కన్న మాదన్నలు' అన్న గ్రంథం లేక పోలేదు. కాని అది సమగ్రం కాదు. ఇట్టి స్థితిలో శ్రీ కె. వి. భూపాలరావుగారు అనేక వ్యయ ప్రయాసలకోర్చి 'మాదన్న మహా మంత్రి' అన్న ఉద్గ్రంథాన్ని వెలువరించడం ఎంతైనా ముదావహం.

ఈ గ్రంథం మొదటి అధ్యాయంలో గోల్కొండ సుల్తానులైన ఖుతుబ్‌షాహీల చరిత్ర సంగ్రహంగా పేర్కొనడం జరిగింది. చివరి సుల్తాను అబుల్ హసన్ తానాషా తఖ్తు నెక్కడానికి దారి తీసిన పరిస్థితులు వివరంగా అభివర్ణించబడ్డాయి. రెండవ అధ్యాయం నుండి అక్కన్న మాదన్నల చరిత్ర సోపపత్తికంగా ఆసక్తిదాయకంగా సాగింది.

హనుమకొండ పరగణాలో ఆమిల్‌గా పనిచేసిన భానయ్య పంతులుగారి కుమారులు అక్కన్న మాదన్నలు. భానయ్య దౌహిత్రులు కంచర్ల గోపన్న; పొదిలి లింగన్న; పులగల్లి ఎంగన్న. వీరిలో కంచర్ల గోపన్నయే రామదాసుగా ఆంధ్రావనిలో అనశ్వర స్థానం ఆక్రమించాడు. లింగన్న, ఎంగన్నలు రాజకీయరంగంలోనే వెలుగొంది మేనమామలకు చేదోడు వాదోడుగా నిలిచారు.

బాల్యంలోనే సంస్కృతాంధ్ర, పార్సీ భాషలలో నిష్ణాతులైన అక్కన్న మాదన్నలు తమ బుద్ధి విశేషంచేతనూ, అదృష్టవశాత్తునూ గోల్కొండ సుల్తానుల కొలువులో ప్రవేశించి క్రమ వృద్ధిలోనికి వచ్చారు. తుదకు అక్కన్న పేష్కారుగా నియమితుడు కాగా, మాదన్న 'సూర్యప్రకాశరావు' అనే బిరుదం పొంది, 1674 లో అత్యున్నతమైన మీర్ జుమ్లా పదవినందాడు.

అప్పటినుండి 1686 వరకూ మాదన్న పంతులు గోల్కొండ రాజ్యభద్రతకూ, తద్వారా ఆంధ్రప్రజల సంక్షేమానికీ అహర్నిశమూ శ్రమించాడు. అసూయాపరులూ, విద్వేషపూరితులూ అయిన ముస్లిం సర్దారుల కుట్రలను సమర్థంగా ఎదుర్కొన్నాడు. ఉవ్వెత్తుగ విరుచుకు పడే మొగల్ కడలిని తన మంత్రాంగ మహిమ వలన నిరోధించాడు. బీటలువారే బీజపూర్ రాజ్యానికి చేయూత ఇచ్చాడు. ఛత్రపతి శివాజీని సముచితంగా గౌరవించి హైదరాబాద్‌లో రాజోచితమైన సత్కారాలు జరిపాడు. వర్తకానికి వచ్చిన పాశ్చాత్యులను హద్దుల్లో ఉంచాడు. గోల్కొండ సిరిసంపదల ఖ్యాతి విశ్వమంతటా మారుమ్రోగించాడు. ఆనాడు, సువిశాలమైన గోల్కొండరాజ్యం తెలుగు, కన్నడ, తమిళ ప్రాంతాలతో కూడి 58 సర్కార్లతోనూ, 564 పరగణాలతోనూ విలసిల్లింది. ఖుతుబ్‌షాహి ప్రభుత్వపు సాలీనా ఆదాయం అయిదున్నర కోట్లరూపాయలు. ఖర్చులన్నీపోగా ఏడాదికి కనీసం కోటి రూపాయలైనా మిగులుతూ ఉండేది.

మాదన్న మంత్రిత్వంలో దుర్భేద్యంగా రూపొందిన గోల్కొండ ఔరంగజేబు దృష్టికి కంటకంగా తోచింది. 'కాఫిర్ల' పాలనపై అతడు దుమ్మెత్తిపోశాడు. అతని ప్రచారం గోల్కొండ ముస్లిం సర్దార్లపై బాగా పనిచేసింది. ఫలితంగా అక్కన్న మాదన్నలు బంధుమిత్రులతోసహా గోల్కొండ వీధుల్లో హత్యచెయ్యబడినారు.

విషయాలన్నీ శాస్త్రీయంగా వివరించడంలో రచయిత కృతకృత్యులైనారు. అక్కను వెళ్ళగొట్టిన విదేశీయులను ఖండిస్తూ, చారిత్రకాధారాలను జాగరూకతతో పరిశీలించి నిగ్గుతేల్చడంలో వారు ప్రదర్శించిన ప్రతిభ స్తుతిపాత్రం. ముఖ్యంగా గ్రామోద్ధరణకు మాదన్న గైకొన్న చర్యలూ, ఆంగ్ల వర్తకులతో లింగన్న వ్యవహరించినతీరూ సోదాహరణంగా వివరించి రచనకు వన్నె తెచ్చారు. మాదన్న హత్య తరువాత గోల్కొండ పతనం వర్ణించడం సముచితంగా ఉంది. అక్కన్న మాదన్నలను ఏకనాథపంత్, మదనాపంత్ అనే పేర్లతో వ్యవహరిస్తూ వారిని మహారాష్ట్రులుగా నిరూపించే వాదాలను విస్కారి యుక్తియుక్తంగా ఖండించడంతో రచయిత మంచి నేర్పు ప్రదర్శించారు.

ఈ గ్రంథ రచన ఓ ఎత్తు; ముద్రణ మరో ఎత్తు. సుందరమైన ముఖచిత్రంతో అత్యంతాకర్షణీయంగా రూపొందిన ఈ గ్రంథం అంతా మంచిరాగితంపై ముద్రించబడింది. అక్కన్న మాదన్నలు వారి సమకాలీనులైన ఖుతుబ్‌షాహీ సుల్తానులు, అమీర్లు, ఈస్టిండియా కంపెనీ అధికారులు, శివాజీ ముస్నగువారి చిత్రపటాలు చక్కగా పొందుపరచబడ్డాయి. కాకపోతే ఈ పానకంలోని పుడకలు ఏరగా సవరణలు ఏడు పేజీలు తేలడం ఒక్కటే బాగులేదుమరి! 'ఇక్కేరి' కర్ణాటకంలోని ఓ చిన్నరాజ్యం. ఇక్కేరి నాయకులను 'అక్కేరీలు' అనడం పొరపాటు.

రచయితయే వ్రాసుకున్నట్లు మహామంత్రి మాదన్నను గురించి వారుచేసిన పరిశోధనకూడా సమగ్రం కాదనే చెప్పవలసి వుంది. వారు ఉటంకించిన ఆంగ్ల, ఆంధ్ర, ఫార్సీ గ్రంథాలను మరింత సూక్ష్మంగా పరిశోధించి ఇంకా అనేకాంశాలను వెలుగులోనికి తేవలసి వుంది. భావి పరిశోధకులకు ఈ గ్రంథం స్ఫూర్తిదాయకం కాగలదనడంలో విప్రతిపత్తి ఏమాత్రం లేదు.

**శ్రీ పులిచెర్ల సుబ్బారావు**

## విద్యుద్వీణలూ - వెన్నెల తీగలూ

[డా॥ మిరియాల రామకృష్ణ కవిత్వం. వెల: రు. 21-00లు. ప్రతులకు : నవోదయ పబ్లికేషన్స్, ఏలూర్ రోడ్, విజయవాడ; బుక్ సెంటర్, విశాఖపట్నం-1; విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ మరియు ఇతర శాఖలు.]

కవిత్వం అనుకొని రాసినవారు మిరియాల రామకృష్ణగారు. వారి కవిత్వం చాటున ఆధునిక కవితా చర్చ చేసినవారు సర్వశ్రీ ఆవంత్స సోమసుందర్, పరచూరి రాజారాం, చేకూరి రామారావు గారలు. ఆధునికత మీద చివరలో మి. రా. గారు వారికున్న అభిప్రాయాలను విస్తారంగానే ప్రస్తారం చేశారు. 'ఈనాడు తెలుగు దేశంలో విమర్శకులూ, వ్యాఖ్యాతలూ - పాఠకులకూ, కవులకూ మధ్య సరైన మధ్యవర్తులు కాలేకపోతున్నారు' అని మి. రా. గారు ప్రవేశపత్రంలో చెప్పడం సమంజసంగానే ఉంది, ప్రథమోదాహరణ ఆయనే గనుక. 'విమర్శకుడు పాఠకుణ్ణి తప్పుడు అవగాహనకు ఈడ్వకుండా కవేచూసుకోవాల్సి వస్తోంది' అన్నారు ఆయనే. అంతపనీ మి. రా. గారి చేతిలో శ్రీశ్రీకే జరిగింది. శ్రీశ్రీ ఏం చూసుకోకుండానే పోయాడు. 'గతి తార్కిక భౌతికవాద మూలసూత్రాలకు భిన్నంగా నా కవితలు లేవు' అంటున్నారీయన. నిజమైన కవిత్వం జీవితంలోంచి వస్తుంది. సూత్రాల్లోంచి వచ్చేది కవిత్వం మాత్రం కాదు; మరొకటి ఏదైనా కావచ్చు. 'నేనేం రాశానో నాకు తెలుసు ! నా కవితలను పరిశీలనతో చదివినవారికి తెలుస్తుంది ! మార్క్సిస్టు దృక్పథంతో చూడగలిగితే బాగా తెలుస్తుంది' అని సంకలనాన్ని ముగించారు. మీరు కవిత్వం రాయండి. దాంట్లో ఏముందో పాఠకులు తేల్చుకుంటారు. కవిత్వం కవిత్వమైతే ప్రశంసాపత్రాలూ, లక్షణ చర్చలూ అవసరంలేదు. ఈనాటి పాఠకుడు చాలా మంది కంటె తెలివైనవాడు. ఈ మాట గ్రహించవలసింది ముందుగా కవులూ, తదుపరి పీఠాధిపతులూనూ. మనం ఎంత అరచి గీపెట్టినా

కవిత్వం కాని దాన్ని పాఠకుడు కవిత్వంగా స్వీకరించడు. అందుచేత కవులైనా, మహాకవులైన, యుగకవులైనా మరెవరైనా ముందు కవిత్వం రాస్తే తరువాత కీర్తి వస్తుంది. కీర్తి - ప్రచారంవల్లా డబ్బువల్లా రాదు.

రెండు వందల పద్నాలుగు కవితలున్న ఈ సంకలనంలో మినీ కవితలు, మార్క్సీ కవితలు చాలా ఉన్నాయి. పాఠకుడు తీరిగ్గా చదవతగిన సంకలనం ఇది. 'గ్రామిక వర్గ ఆధునికత' లోంచి కవిత్వం రాశానని మి. రా. గారు చేప్పారు. ఔనని సోమసుందర్ గారు కితాబిచ్చారు. సత్యా సత్యాల నిరూపణకైనా పాఠకుడు ఈ సంకలనాన్ని చదువుతాడని ఆశిస్తాను.

## తెలంగాణా గ్రామిక గేయాలు

[గోపు లింగారెడ్డి. వెల :- రు. 25-00 లు. ప్రతులకు :- 1) డా॥ గోపు లింగారెడ్డి, అల్గునూర్, కరీంనగర్-505 533; 2) దేశీ బుక్ హౌస్, నారాయణగూడా, హైదరాబాద్-500 020.]

ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి పి. హెచ్. డి. పట్టం పొందిన సిద్ధాంత వ్యాస గ్రంథం ఈ తెలంగాణ గ్రామిక గేయాలు. డాక్టరేటు కోసం సిద్ధాంత వ్యాసాలు రాసేవారు వారు ఎంచుకొన్న అంశంమీద ఎంతో కొంత విషయ సేకరణ, దాంతోపాటు శారీరకమైన, మేధాగతమైన శ్రమ కొంత పడక తప్పదు. గ్రామిక గేయాలకు సంబంధించిన ఈ సిద్ధాంత వ్యాసంలో అట్లాంటి శ్రమ కనబడుతుంది. సిద్ధాంత వ్యాసరచనలో ఎకడమిక్‌గా కొన్ని అంశాలు అవసరమవుతాయి. గేయం ఎక్కణ్ణించి సేకరించింది, అది లిఖితమా? మౌఖికమా? మొదలైన అంశాలు యీ రచయిత వివరంగా యిచ్చారు. "జానపదుల దగ్గరకు వెళ్ళి వారి నుంచి పాటలు సేకరించి వారిని మరచిపోవడం భావ్యం కాదని ప్రతిపాట చివరనే వారి పేర్లతో సహా గ్రామం, జిల్లా, వయస్సు లిచ్చాను" అని రచయిత చెప్పుకొన్నారు.

సిద్ధాంత వ్యాసంలో చాలా గేయాలు సేకరించి యిచ్చి వాటి అర్థాలు, తాత్పర్యాలు వివరంగా రాశారు. ఈ గేయాల నన్నింటినీ వృత్తులవారీగా విభజించడమే కాక రసాన్నిబట్టి కూడా వేరుపరచటం జరిగింది. "యజమానులు, బానిసలు, స్త్రీలు, పురుషులు, పిన్నలు, పెద్దలు అనే భేదం లేకుండా పనిచేసే ప్రతివారూ ఈ పాటల్ని పాడుకుంటారు. మానవ నిర్మితాలైన యంత్రాలు ప్రకృతి సిద్ధమైన శ్రామికులకు ప్రత్యామ్నాయంగా వచ్చేవరకూ ఈ శ్రామిక గేయాలుంటాయి." ఇదీ శ్రామిక గేయాలను గురించి సిద్ధాంత వ్యాసకర్తకున్న అవగాహన.

తాను సేకరించిన గేయాలన్నింటినీ ఈ విధంగా ఒక చోటి చేర్చి వాటికి భాష్యం రాసిన రచయిత అభినందనీయుడు.

## మనము, వసు చరిత్రల తులనాత్మక పరిశీలనము

(ముదిగంటి సుజాతారెడ్డి. వెల : రు. 50-00 లు; ప్రతులకు 2-2-1105/21, రోహిణి, తిలక్‌నగర్, హైదరాబాద్-44)

ఉస్మానియా విశ్వవిద్యాలయం వారిచే డాక్టరేటు డిగ్రీ ఇచ్చుటకు అర్హమైనదిగా నిర్ణయింపబడిన పిమ్మట ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ప్రభుత్వం వారు ఐదు వేల రూపాయలిచ్చిగా అచ్చువేసిన సిద్ధాంత వ్యాసగ్రంథం ఈ 'మను, వసుచరిత్రల తులనాత్మక పరిశీలనము.'

మను, వసుచరిత్రలు వాటి విశిష్టత, గుణాలు, మొదలైన అంశాలపైన ఈ సరికే చాలినంత చర్చ జరిగింది. ముఖ్యంగా మనుచరిత్రలో ప్రబంధత్వం, పెద్దన కాలనిర్ణయం, నాయికా నాయకుల చర్చ ఇవన్నీ గత కాలపు సాహిత్య విమర్శకుల మెదళ్ళకు మేత పెట్టాయి. పెద్దన, రామరాజభూషణుల కవిత్వాలలో ఎవరి కవిత్వం గొప్పది? అనే ప్రశ్నపై ఇప్పటికీ కొట్టుకునే వారు చాలా మందున్నారు. మనుచరిత్రలో కథా ప్రారంభం నుంచి మొదటి ఆశ్వాసం అంతంతో చదవటం ఆపేసే చదువరులు ఎక్కువమంది.

ఈ రచయిత్రి ఈ ఇద్దరు కవులను ఒకచోట చేర్చి వారి ప్రబంధ నిర్మాణ శిల్పం, కథాగమన పద్ధతి, వర్ణనలు, అలంకారాలు, రసం మొదలైన అనేకాంశాలను అత్యంత సహనంతో చర్చించారు. "సంస్కృత సాహిత్యమున మాఘునకు భారవి యెడల ఎట్టి కవితా విజిగీష కలదో అట్టి కవితా విజిగీష తోడనే రామరాజభూషణుడు రచనా, స్పర్ధ వహించి పెద్దనను మించవలయునను ప్రయత్నములో వసుచరిత్రను రచించినాడు" అను అభిప్రాయంతో ఈ రచయిత్రి ఈ సిద్ధాంత వ్యాసరచనకు పూనుకొనినట్లులా చెబుతున్నారు. పోగా ఇంతవరకు వచ్చిన విమర్శలు (పై రెండు ప్రబంధములపైనా) పాక్షికములని ఈమెచెబుతున్నారు. తాను నిష్పాక్షికముగారాస్తున్నట్లు

కూడా చెప్పారు. "తెలుగున ప్రసన్న మాధుర్య గుణ భరితమైన మనుచరిత్రతోడ ప్రబంధారంభము జరిగి రామరాజ భూషణుని వసుచరిత్ర ప్రబంధ కావ్యకళ మేరు శిఖరాగ్రముల నందుకొనెనది." రామరాజ భూషణుడు కథా కల్పనా ప్రతిభను విశేషముగా ప్రదర్శించి, మూలకథను విశేషముగా అనుసరించుచూ మనుచరిత్రను మించిన కావ్యమును రచించినాడని చెప్పవలయును." పాక్షికతకు దూరంగా ఉన్న రచయిత్రి ఇట్లాంటి మాటలు అనకూడదు గదా!

ధ్వని, శ్లేషల విషయంలో, వాటి నిరూపణలో సుజాతారెడ్డి గారు నిజాయితీతో, చిత్తశుద్ధితో శ్రమపడినట్లు ఈ గ్రంథం ఋజువు చేస్తుంది. వీళ్ళిద్దరూ సమకాలీన కవులు కారు గనుక రచయిత్రికి ఎట్టి ప్రలోభాలూ ఉండవు. అయితే ఒకానొక కవిమీద అభిమానం ఎక్కువ ఉండవచ్చు. సుజాతారెడ్డి గారు వసుచరిత్ర వైపే మొగ్గు చూపారు, ఆమె అభిప్రాయం అడిగనక.

పెద్దనకూ, రామరాజ భూషణునకు, హృదయానికీ, మేధకూ ఎంత దూరం ఉంటుందో అంత దూరం వీళ్ళిద్దరకూ ఉంది. కవిత్వం హృదయానికి చెందుతుంది, శాస్త్రం మేధకు చెందుతుంది. ఈ దృష్ట్యా చూసినపుడు పెద్దన కవిత్వపరంగా హృదయ వాది అవుతాడు. రామరాజ భూషణుడు మేధోవాది అవుతాడు. ఇది ఈ సమీక్షకుని అభిప్రాయం.

సుజాతారెడ్డిగారు ఆమె చెప్పదలచుకున్న అంశాలను సోదాహరణంగా, తగిన ఉపపత్తులతో ఈ గ్రంథంలో చెప్పారు. కనుక అంగీకరించడానికి మరొకడు రానవసరం లేదు. ఎవడు ఏది అనుకున్నాడో అదే రాస్తాడు. రచయితకు సంస్కారం ఉండాలని ఆశించేవారందరూ పాఠకులకు కూడా సంస్కారం ఉండాలని కోరుకోవాలి.

కథా సంవిధానము, వర్ణనలు, సన్నివేశ సామ్యములు, పద్య శిల్పం, భావ సామ్యములు, శబ్ద సామ్యములు, అలంకారములు, రస పోషణము, పాత్ర చిత్రణము, నాటకీయతలు, పాండిత్యము, జీవితము, వ్యక్తిత్వము అను ప్రకరణాలుగా తన సిద్ధాంత వ్యాసమును విభజించు కొని ప్రతి ప్రకరణంలోనూ తనదైన భావనను స్పష్టంగా, నిర్ద్వంద్వంగా ఈ రచయిత్రి చెప్పారు. సాహిత్యంలో అభిప్రాయ [illegible] త్రి ద్వేషానికి అతీతంగా (ప్రాక్షికత ద్వేషం కాదు) సిద్ధాంత వ్యాస రచనకు నిజమైన కృషిచేశారు. వారు అభినందనీయులు.

# సారస్వత వ్యాససంపుటం

(నోరి నరసింహశాస్త్రి. వెల : రు. 22-00లు; ప్రతులకు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, సైఫాబాద్, హైదరాబాద్-4)

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రచురిస్తున్న సారస్వత వ్యాసాల్లో నోరి నరసింహశాస్త్రి గారి వ్యాస సంకలనాన్ని ఐదవ సంపుటంగా ప్రచురించటం సాహిత్యాభిమానులకు మోదమానమైన విషయం. బృహత్తరమైన వ్యాస సంకలనం ఇది. ఈ వ్యాసాల్లో నోరివారి బహుముఖీనమైన ప్రతిభాంశతో పాటు, వారికి సమకాలీన సాహిత్యంపట్ల గల రాగ ద్వేషాలు కూడా వ్యక్తమయ్యాయి.

ఈ వ్యాసాలను సంకలించడంలో అకాడమీ వారు వస్తుపద్ధతిని అవలంబించి విషయసూచిక నిచ్చారు. ఇందు ప్రథమ విభాగంలో సాహితీ విమర్శ, గీర్వాణ సాహితి, కవిత్రయ సాహితి, ప్రబంధ సాహితి, నవ్యసాహితి, నాటక సాహితి, హాస్య సాహితి, చరిత్ర-సంస్కృతి, సాహితీ మూర్తులు, పీఠికలు-సమీక్షలు, భక్తి సాహితి అనే ప్రకరణాలు, ద్వితీయ విభాగంలో సాహితీ విమర్శ, గీర్వాణ సాహితి, కవిత్రయ సాహితి, సాహిత్యోద్యమము, నవ్య, నాటక, నవలా, కథా, హాస్యసాహితులు, చరిత్ర-సంస్కృతి, సాహితీ మూర్తులు, పీఠికలు - సమీక్షలు, హిత సాహితి, భక్తి సాహితి ప్రకరణాలున్నాయి.

బహుభాషాకోవిదులైన నోరివారు అనేక తత్త్వాలమీద, కవిత్వాలమీద, కొంతమంది మహాపురుషులమీద వారికిగల అభిప్రాయాలను వెల్లడించారు. ఆముక్తమాల్యదను పెద్దనే రచించాడనే వాదంతో వీరు ఏకీభవించినట్లూ కాకుండా, ఏకీభవించనట్లూ కాకుండా తేల్చేశారు. ఆముక్తమాల్యద రాసినంత మాత్రంలో రాయల గొప్పతనము ఇనుమడించదనీ, రాయనంత మాత్రంలో ఆయనకు న్యూనతరాదని, మరికొన్ని సాక్ష్యాధారాలు దొరికేవరకూ కర్తృత్వము సందేహమేనని పేర్కొన్నారు. వెనకటికెవరో కన్యాశుల్కం గురజాడ అప్పారావుగారు రాయలేదన్నారట. కాని ఆవాదం పరాస్తమైంది.

నాగేశ్వరరావు పంతులుగారిమీద వీరు రాసిన వ్యాసం ప్రత్యేకంగా ఒక పుస్తకంగా వెయ్యవచ్చు. తిరుపతికవులు, శివరామశాస్త్రిగార్లపై వ్యాసాలు ఆనాడే సాహిత్యపోరాటాన్ని, ఔన్నత్యాన్ని అల్పత్వాన్ని కూడా చెబుతాయి. 'అరవై ఏళ్ళ ఆంధ్ర సాహిత్యంలో నిల్చేది [illegible]తో వారు నిలుస్తాయని చెప్పిన కావ్యాల్లో చాలాభాగం మరణించాయి. శ్రీశ్రీ కవిత్వాన్ని గురించి చెబుతూ మహాప్రస్థానగీతం ఏదో సినిమాలో హనుమంతుడిపైన రాసినపాటా నిలుస్తాయని రాశారు.

పైగా శ్రీశ్రీ కవిత్వం చిత్రకవిత్వ స్థాయిని దాటలేదని చెప్పారు. వచన కవిత్వంపైన నోరివారు విజృంభించి పరివిహారం చేశారు.

పుస్తకం ఇష్టా యిష్టాలతో కవిత్వం, కవితా ప్రక్రియలూ నిలవటం, నిలవక పోవటం జరగదు. కవిత్వమైనదేదీ మరణించదు. బలమైన రచనకు చావులేదు. నరసింహశాస్త్రిగారి సంప్రదాయం ఒక నెటివ్ ఇన్‌సిట్యూషన్. అలా అనుకోవడానికి వారి కాలం, వారి విశ్వాసాలు అటాంటివి.

ఈ పుస్తకాన్ని చదివితే 1913 నుంచీ తెలుగునేలమీద వచ్చిన సాహిత్య ఉద్యమాల చరిత్ర, వివిధ కవుల, రచయితల, సంస్కరణవాదుల, పత్రికాధిపతుల వ్యక్తిత్వం తెలుస్తాయి. వారికి నచ్చిన కావ్యం సాహిత్యగుణంవల్ల నిలుస్తుందని, నచ్చని కావ్యం సాహిత్యేతర కారణాలవల్ల నిలిస్తే నిలవచ్చని నోరివారు భావించి నటుగా తెలుస్తుంది.

రచన నిలవటం (అంటే బతకడం, బతక్కపోవటం) రచన మీదే ఆధారపడి ఉంటుంది. సారస్వత వ్యాసాలు బతుకుతాయా? పోతాయా? అందే ఎవడు చెప్పగలడు? వారి ఆక్షేపణలే చెబుతాయి.

పు ష్య విం

## శ్రీ అరవింద మకరంద తరంగి

[‘సావిత్రి’ సూక్తులకు ఆంధ్రానువాదము; అనువాదకర్త : శ్రీ అరిపిరాల వేంకట సోమాచార్యులు. ప్రతులకు : శ్రీ ఎ. వి. సోమాచారి, రిటైర్డ్ ఇంజనీరు, బాపూజీ నగర్, కొవ్వూరు. పుటలు : 379. వెల : రు. 24/–]

శ్రీ అరవిందయోగి ఇంగ్లీషున వ్రాసిన ‘సావిత్రి’, వారి యోగసాధన, అనుభూతీ, గమ్యమూ, కవితలో నిక్షిప్తం చేసిన విశిష్టరచన. ప్రసిద్ధమైన సావిత్రి సత్యవంతుల కథ ఒక చట్రము మాత్రమే. వస్తువు అరవిందుల వారి తత్త్వాన్వేషణ; వారి స్వీయాను భూతికి రూపకల్పన. అరవిందులవారి దర్శనంలో వైదిక సంప్రదాయము ఒక్కటే కాదు, గ్రీకు, క్రైస్తవ దార్శనిక ప్రభావాలు ఆయన భావధారతో సమ్మిశ్రితమై కనిపిస్తాయి. శ్రీ ఎ. వి. సోమాచార్యులు తమకు నచ్చిన సూక్తులను ‘సావిత్రి’ కావ్యంనుండి సంగ్రహించి, తెలుగు పద్యానువాదాన్ని, వచన వ్యాఖ్యానాన్నీ సమకూర్చుతూ యీ గ్రంథం తయారు చేశారు. ఈ సూక్తులనుంచీ ‘సావిత్రి’ కావ్యస్వరూపం తెలిసే అవకాశంలేదు! డాక్టర్ జాన్సన్ అనే ప్రసిద్ధ ఆంగ్ల విమర్శకుని ధోరణిలో చెప్పాలంటే, నాలుగు చలువరాతి ముక్కలు ఆగ్రానుంచి తీసుకువచ్చి ప్రదర్శించడంద్వారా తాజమహలు సౌందర్య స్వరూపాలేమిటో తెలియజేయ్యాలనుకోవడం ఎలాంటి ప్రయత్నమో, సాహిత్యపరంగా ‘సావిత్రి’ని ఈ సూక్తుల్లో దర్శించాలనుకోవడమూ అలాంటిదే అవుతుంది! పోతే, శ్రీ సోమాచార్యులవారు సాధన చేస్తున్నవారని తెలుస్తోంది. వారి దీక్షానామం శ్రీ పరానందనాథుడు. ఈ రచనా ప్రక్రియ వారి సాధనలో భాగంగా వారికి ప్రయోజనాన్ని చేకూర్చి ఉండవచ్చును. ఇతరుల కెంతవరకు ప్రయోజనకారి? అని ప్రశ్నిస్తే అది ఎవరికి వారు నిర్ణయించుకోవలసిన విషయమే! అయితే అనువాదం అన్నివిధాల మాతృకకాని భావం ఎంతవరకు తర్జుమాలో అందు తున్నదీ స్థూలంగా పరిశీలించడానికి అభ్యంతరం ఉండకూడదను కుంటాను.

> Each action left the foot prints of a God
> Each moment was a beat of puissant wings"
> (I-15)

అనువాదం : "ప్రతికృతి భగవంతు ....... ప్రతిగతి భగవంతు పటుతరస్పర్శ." "Moment" అంటే క్షణం; దాన్ని ‘గతి’ అని అనువదించడమేకాక, వ్యాఖ్యా సందర్భంలోనూ ‘గతి కదలికయు’ అన్నారు. ఎగిరే ప్రయత్నము, రెక్కల ..... ఈ కోవకు చెందినవే చాలానే ఉన్నాయి:- ‘Common Rule’ అంటే ‘శాసనార్థం’ (I. 14); "its divine founts" అంటే అమరనదీ సమానముగాగ’ (I-II) imperial act" ... ‘... నాటక ... గము’ (VIII-5; "life's closed room" అంటే "మూసిన జీవిత నగరు" (VI-26); ఇట్లా స్వేచ్ఛానువాదం చేస్తూ వెళ్ళారు. అన్నీ ... అసం పూర్ణంగా, అసంతృప్తికరంగా ఉన్నాయి అలాంటివి.

అనువాదం అలా ఉంచి, వ్యాఖ్యానం విషయమై కొన్ని ఉదాహరణలు చూద్దాం.

> "Only a little the God-light can stay;
> Spiritual beauty illumining human sight
> Lines with its passion and mystery
> Matter's mask
> And squanders eternity on a beat of Time"
> (I 2)

వివరణము : "ఒక్కొక్కప్పుడు మనుజుని తలంపులు భగవంతునిపైకి పోవుచుండును. అట్టి సమయములో నొక వెలుగు, ఇట్టిదని చెప్పరాని యొక యానందము కలుగును. ఈ యనుభూతి

ఎంతోకాలము నిలుపదు. ఆ యొక్క క్షణముండును. అంతలో మనస్సు సాంసారిక ప్రాపంచిక విషయాలపైకి పోయి వాటి సంబంధమైన కోరికలు, అనుబంధాలు, అనురాగాలచే గ్రస్తబడి పరమాత్మ సంబంధమైన సుఖానుభూతిని మరపించును. ఈ విధముగా గడియారం టిక్కు టక్కు శబ్దాలతో అనంతకాలం గడిచిపోతుంది." మూలంలో, మనుష్యుని దృష్టిని ఒక్క క్షణకాలం దైవం నుంచీ వచ్చే వెలుగు ఎలా సౌందర్యంతో ప్రకాశవంతం చేసి, పాంచ భౌతికమైన శరీరాన్ని దివ్యమైన ఆవేశంతో నిగూఢమైన భావనతో రంజితం చేస్తుందో చెబుతూ, క్షణం మీద అనంతాన్ని వెచ్చిస్తున్నాడు భగవంతుడు అని భగవంతుని కృపను గూర్చి, దివ్యానుభూతి స్పృశించిన క్షణాన్ని గూర్చి వర్ణించగా—అనువాదంలో మనుష్యుని తలంపులు భగవంతుని పైకి పోవుట, అప్పుడు కలిగే ఆనందం క్షణికమై, మనస్సు మళ్ళీ లౌకిక బంధాలలోకి దిగజారుట ప్రస్తావించబడింది. గడియారం టిక్కు టక్కులతో అనంతకాలం గడిచిపోతుందన్న నిస్పృహ వ్యక్తమైంది. ఈ రెండిటికి తేడా ఎలాంటిదంటే — ఆశావాది ఒక పాత్ర సగం నిండింది అనగా, నిరాశావాది సగం ఖాళీగా ఉన్నది అనేటువంటిది! ఈ గ్రంథంలోని వ్యాఖ్యానాలలో యిటువంటి తేడా సర్వత్ర కనిపిస్తున్నది. "Hid deep in man celestial powers can dwell" అన్న మూలానికి వివరణలో "మంచివాడుగా గనబడు వానిలో చెడ్డయు, చెడ్డవానిగా కనబడు వానిలో మంచియు దాగి యుండును" అన్న అధిక ప్రసంగాన్ని ఉటంకించారు. మంచి-చెడ్డలనే ద్వంద్వాలను అధిగమించినవాడే యోగి; అతనికి అల్పుడుగా కనిపించే మనిషిలో అనల్పమైన శక్తులు గోచరిస్తున్నవి; అల్పస్వం శరీరం యొక్క ఆవాస మాత్రమే అని చెబుతున్నారు అరవిందులు (I 17) దాన్ని అనువాదకులు వ్యాఖ్యానంలో లౌకిక విజ్ఞానంగా దిగజార్చారు!

"This world is a beginning and a base
Where life and Mind erect their structured dreams
An unborn power must build reality" (I-25)

వివరణము: "జీవనమును మనస్సు నిర్మించుకొనే స్వప్న సౌధములకు నీ భూమి తొలిఘట్టము పునాది. జనన మొందని యొక శాశ్వతమైన దానిని నిర్మించుము. Structural dreams ఆనందంలో ప్రారబ్ధం నిర్ణయించిన స్వప్నాల పంటివి మనిషి జీవితమూ మనస్సూ కల్పించే అనుభూతులు అంటూ జన్మనెరుగని అనగా ఆద్యంత రహితమైన పరాశక్తి ఒక్కటే సత్యాన్ని గోచరింప జెయ్య గలదన్న భావాన్ని, స్వప్నానికి - సత్యానికీ గల తేడాని గూర్చి మూలంలో చెప్పగా, 'శాశ్వతమైన దానిని' అని reality ని గూర్చి వ్యాఖ్యానించారు అనువాదకులు. చెప్పవచ్చిందేమిటంటే ఇలాంటి వ్యాఖ్యానాల్లో ఎవరి అవగాహన, అనుభూతి వారికి మార్గదర్శి. వెలుగును చూస్తూ కూడా అంధకారాన్ని భావించేవారికి పుస్తకాలూ, అధ్యయనమూ ఉపకరించవు.

—ఆర్. ఎస్.

## ఖుర్ఆన్ అవగాహనకు మూలసూత్రాలు

(రచయిత: మౌలానా సయ్యద్ అబుల్ ఆలా మౌదూదీ, తెలుగు అనువాదం: ఎస్. ఎమ్. మలిక్. క్రౌను సైజు, 44 పేజీలు, వెల: రు. 1-75, ప్రకాశకులు: తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, లక్కడ్ కోట్, ఛత్తా బజార్, హైదరాబాదు-500 002)

ఖుర్ఆన్ మొదటిసారిగ అధ్యయనం చేసే సమయంలో సరిగ అన్వయం లభించక పాఠకుడు కొంత కంగారు పడటానికి అవకాశ ముంది. గ్రంథ సదవగాహనకు కావలసిన అత్యవసర ప్రాథమిక విషయాలు పాఠకునికి సరిగ తెలియక పోవుటయే అందుకు కారణము.

ఈ చిన్న పుస్తకములో భగవద్విశ్వ వ్యాపకత్వము, దైవ దూతల ప్రాతినిధ్యం, శాంతిమార్గము, మానవుని కర్తవ్యము మున్నగు విషయాలు వివరింప బడ్డాయి. ఖుర్ఆన్ అవతరించిన సందర్భాలు, వివిధ దశలలో సాగిన ఇస్లామీయ ఉద్యమము చర్చించబడినయి. 'ఖుర్ఆన్' అన్న అరబీ పదానికి 'మాటిమాటికి అధికంగా పఠించ బడేది' అని అర్థం చెప్పబడింది.

ఖుర్ఆన్ ఉచ్చారణా క్రమం, అధ్యయన విధానం చర్చించ బడినవి.

ఖుర్ఆన్ అధ్యయనానికి ముందు ఈ చిరు గ్రంథం చదివితే, ఖుర్ఆన్ అన్వయం సరళంగ పడుతుంది. ప్రతి ముస్లిము సోదరుడు పఠించతగిన పుస్తకము. ప్రతి మసీదులో ఈ పుస్తకములు ఉంచటం ఎంతైనా అవసరం.

కెప్టెన్ షేక్ వహాబ్

## ఈ తరం కథలు

[రచన: రేగుంపాటి కిషన్‌రావు, ప్రచురణ: విజయలక్ష్మి పబ్లికేషన్స్, చింతల్‌రాణం - 505302, వెల: ఒక రూపాయి; పేజీలు: 16.]

ఇందులో వున్నవి రెండే రెండు కథలు. ఒకదానిపేరు ఈతరం కథ. రెండవది అతి తెలివి.

మొదటి కథ చదివిన తర్వాత రచయితమీద కలిగే మంచి అభిప్రాయం, చివరి కథదాకా వుంటుంది. పైగా రెండు కన్న కథలతో పుస్తకం తీసుకురావటం ఎంత విశేషమే.

## కలం విందులు (కథలు, గల్పికలు, వ్యాసాలు)

[రచయిత : అక్కిరాజు వెంకట జనార్దనరావు, ప్రచురణ : జనపద ప్రచురణలు, 1-1-386/20, వివేక్ నగర్, చిక్కడపల్లి, హైదరాబాద్-500 020; పేజీలు: 120, వెల : పది రూపాయలు.]

ఇందులో మూడు రకాల రచనలు వున్నాయి. అవి-కథలు, మినీ కథలు, కొన్ని విషయాలమీద తమాషా వ్యాసాలు. కథల్లో, 'కాశీపతి కథ రాశాడు, పల్లకోసం, అసగనగా ఒక ప్రశంసాపత్రం కథలు హాయిగా నవ్విస్తాయి.

మిగిలిన గల్పికలు, వ్యాసాలు ఈ కోవకు చెందినవే. పుస్తకం చదివాక చేయితిరిగిన రచయిత అనిపిస్తుంది.

## నీటి దీపాలు (కథల సంకలనం)

రచన : శ్రీ కె. సభా, ప్రచురణ : చిత్తూరుజిల్లా రచయితల సహకార ప్రచురణ సంఘం, చిత్తూరు; వెల : పది రూపాయలు; పేజీలు : 196.]

ఈ సంకలనంలో పదిహేను కథలున్నాయి. అన్నీ ఎక్కువగా రాయలసీమ గురించే. రచయిత అక్కడి వారవటంచేత కథా వస్తువులోని వాతావరణం అంతా అక్కడిదే. అందుకే కథల్లో కథలో కదలిక వుంది, పాఠకుల్ని కదలించే శక్తి వుందనిపిస్తుంది.

'అంతరంగం' ఆకలి గురించి, 'ఒకనాడు' చేదు నిజం గురించి రాసిన కథలు.

'మిథున లగ్నం' హాయనిపించే ప్రేమ కథ.

బావిలో నీరు పడటం చేదప్ప లక్ష్యం. అందుకు అన్నీ పోగొట్టుకున్నా విచారపడడు. కానీ చివరికి పాతాళగంగను సాధించిన సంతోషం అనుభవించలేక పోతాడు—ఇది 'పాతాళ గంగ' కథ.

'ప్రజా సేవకుడు కాశాస్త్రి', 'బూటగసండు', 'ఎండమావుల్లో తిమింగలాలవేట', 'జలప్రళయంలో వింత జంతువు', 'నీటి దీపాలు'—రాజకీయ నాయకుల గురించి వెటకారంగా రాసిన మంచి కథలు.

పెళ్ళి కాకుండా కని పారేసిన కొడుకు, పెద్దయ్యాక తల్లిని కలుసుకుంటాడు—'అపూర్వం' కథలో. నవలకు సరిపడిన కథా వస్తువును ఈ చిన్న కథలో చెప్పారు. కథాగమనం అపూర్వమనిపిస్తుంది. అదే కోవలో రాసిన కథలు 'పుట్టగొడుగు' 'నెత్తురు సంబంధం' కథలు.

సొంతన పంపకం పసపస్పనికాస్త అమ్మ కొన్నో పిల్లల కోసం ఒడి కట్టిస్తారు. ఆ పంపకం న్యాయం ఎవరు సమర్థిస్తారు అనిపిస్తుంది 'పెద్దరికం' కథ చదివాక.

కాలక్రమేణ కథనం బాగుంది. జీవితంలో జీవం వుంది సత్యాల గురించి చెప్పినప్పుడు—అందిన కథలు ఇన్నిటి దీపాలు.

కథం గురించి విషయ సూచిక, కథలు ఏమి ప్రతిక్షో పద్దాయో విపరించివుంటే బావుండేదనిపిస్తుంది. - బాబు

## గ్రంథ స్వీకారాలు

✻ **నక్షత్ర మాల:** శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవిపై వ్రాసిన స్తవము. రచయిత : పనోన్మణి విశ్వామిత్ర న దూర వెంకటస్వామిరాజు. ప్రతులకు : రచయిత పేర ఏజెన్సీ ఆంధ్రపత్రిక. తాడికొండ - 522 236 (పోస్టు), గుంటూరు జిల్లాకు వ్రాయవచ్చు.

✻ **ప్రభారిక :** సంపాదకులు : నమిలకొండ బాల కిషన్‌రావు. సాలు చందా పదిరూపాయలు. ప్రతులకు : ఎన్. బాలకృష్ణారావు. 6-7-42/A, రంగన్న వద్యాలు, హనుమకొండ-506 001.

✻ **జానపద సరస్వతి :** సంపాదకురాలు : డా॥ నాయని కృష్ణకుమారి. (ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్ త్రైమాసిక పత్రిక) ఇది జానపద విజ్ఞానంపై ఆంధ్రప్రదేశ్ నుండి వెలువడుతున్న ఏకైక పత్రిక. విడిప్రతి రు 2/ లు. సంవత్సర చందా రు. 8/ లు. జీవిత చందా రు. 250/- లు. ప్రతులు కావలసినవారు డా॥ గోపు లింగారెడ్డి, ఇం. నెం. 7-1-125, మంకమ్మతోట, కరీంనగర్-505 002 కు వ్రాయవచ్చు.

✻ **తెలుగు వన్నెలు:** రచన : డి. యస్. రామారావు. ఇది విజయ సాహితి, విజయపురి వారి సమర్పణ;. వెల : పదిరూపాయలు.

✻ **ప్రజారాజ్యం :** రచన : టి. వి. యస్. దాసు, ఎం. ఎల్., అడ్వకేటు. ప్రకాశకులు : వేద సామ్రాజ్య పరిషత్ (రిజిష్టరు) 1-8-725 సి, నల్లకుంట, హైదరాబాదు-500 044. మూల్యం 3 రూపాయలు.

✻ **దర్పన :** జమ్మికుంట గవర్నమెంటు డిగ్రీ కాలేజి వారి 1982-83 వ సంవత్సరపు వార్షిక సంచిక. ఛీఫ్ ఎడిటర్ : సి. వీరారెడ్డి. (ప్రిన్సిపాల్)

*Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 61247.*